శ్రీ ర స్తు

# అ ప్ప క వీ య ము

కాకునూరి అప్పకవి విరచితము

రా వు సా హే బు

శ్రీ గిడుగు రామమూర్తిపంతులు, బి. ఏ., గారిచేతను

శ్రీమాన్ ఉత్పల వేంకటనరసింహాచార్యులుగారిచేతను

ప రి ష్కృ త ము

క్రొ త్త కూ ర్పు.

విద్వాన్ శ్రీ రావూరి దొరసామిశర్మ, (ఎం. ఏ., బి. ఓ. ఎల్.) గారి

సమీక్షతో కూడినది.



చింతలపాటి వెంకటసుబ్బయ్య.
బహూకరించినది

1972

వావిళ్ల రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్

మదరాసు - 1.

వా రి చే ప్ర క టి త ము.

# ప్రకాశకవిజ్ఞప్తి

అప్పకవి రచించిన యీ గ్రంథముపేరు 'ఆంధ్రశబ్దచింతామణి' అని యవతారికనుబట్టియు, ఆశ్వాసాంతగద్యలనుబట్టియుఁ దెలియుచున్నది. కాని 'అప్పకవీయ' మను నామమే దీనికిఁ బ్రసిద్ధము. కృతికర్త, యిది వ్యాకరణగ్రంథమని చెప్పికొన్నను, ఇందు ఛందోవిషయములకే ఎక్కువ ప్రాధాన్య మీయఁబడినది. ఛందోగ్రంథముగానే దీనికి ప్రసిద్ధి కల్గినది. ఛందోవిషయపరిజ్ఞానమునకే దీనిని చదువుచుందురు. సాధారణముగా విశ్వవిద్యాలయములవా రుత్తమపరీక్షలకు ఛందస్సునకు సంబంధించిన యిందలి తృతీయ, చతుర్థాశ్వాసములనే పాఠ్యములుగా నిర్ణయించుచుందురు.

అప్పకవీయమును పలువురు ముద్రించిరి. మేమును గత శతాబ్దమునందే తొలిసారి ముద్రించితిమి. పిదప 1910 సం. నుండియును ముద్రించుచునే యున్నాము. ఈ గ్రంథపరిష్కరణమునకు సుప్రసిద్ధవిద్వాంసులు శ్రీ పురాణం సూర్యనారాయణతీర్థులుగారు, శ్రీ ఉత్పల- వేంకట నరసింహాచార్యులుగారు, శ్రీగిడుగు- వెంకట రామమూర్తిపంతులుగారు మున్నగువారు మిక్కిలి తోడ్పడిరి. శ్రీగిడుగువా రమూల్యమగు విమర్శనమును కూడ వ్రాసిరి. దానిని కూడ నీగ్రంథముతోఁ జేర్చి ముద్రించుచుంటిమి. 1951-వ సం. ముద్రణమును శ్రీతిమ్మావఝ్ఝల కోదండరామయ్యగారును, శ్రీ కం. అ. కృష్ణమాచార్యులుగారును సరిచూచిరి. దానికి శ్రీ నిడుదవోలు- వేంకటరావుగారు కూర్చిన 'అప్పకవీయ' విశేషప్రస్తావనము కలదు. అందు ఋ-రు ల యతి, ఉ-వు ల యతి మున్నగు విశేషములు, యవ్వనము; సింహ్వాము మున్నగు శబ్దముల చర్చ కలదు. 6 వ ముద్రణమును 1962 లో శ్రీరావూరి- దొరసామిశర్మగారు పరిష్కరించి విపులమగు సమీక్ష నొక దానిని వ్రాసిరి. శ్రీశర్మగారే 1966-వ సం. రపు ముద్రణములో కొన్ని క్రొత్త సవరణలను చేర్చియున్నారు.

అప్పకవీయము తత్కర్త రచించిన స్థితిలో నిప్పుడున్నట్లు కానరాదు. శ్రీరేకము- రామానుజసూరిగారు స్వతంత్రించి కొన్ని సవరణలు చేసినట్లు శ్రీగిడుగువారు తెలిపియున్నారు. ఇతర సంస్కర్తలును తమకుఁ దోఁచినట్లు సంస్కరించుచున్నట్లు తర్వాతి ముద్రణములనుబట్టి తెలియుచున్నది. లక్షణ విరుద్ధములగు విషయములు పెక్కులీ గ్రంథమునఁ గానవచ్చుట కిది కారణము కావచ్చును. అచ్చటచ్చట సవరణలు అధస్సూచికలో చూపఁబడినవి. ఇప్పటి ముద్రణమునందును అవశ్యకములగు కొన్ని సవరణలు చేయఁబడినవి.

ఈ గ్రంథమును పరిశీలించు విద్వాంసుల దృష్టి ఛందస్సువైపే మొగ్గియున్నట్లు ఇంతవఱకు వెలువడియున్న విమర్శనలనుబట్టియు, వ్యాసములనుబట్టియుఁ దోఁచుచున్నది వ్యాకరణాలంకారవిషయములను గూర్చియు విమర్శన మావశ్యకము. ఈగ్రంథమున 'తత్సమము' అనునది 'దానితో సమానము' అను నర్థమున ఉపయోగింపఁబడినది. (పుటలు 33, 37) పూర్ణార్ధబిందువులు దీర్ఘ హ్రస్వబిందువులని (పు. 49) చెప్పఁబడినది. పరా, ఆఙ్, అపి- అను ఉపసర్గలు మూఁడును ఆంధ్రమున చేరవని (పు.146)అప్పకవి భావన. 'అపి' తో పాటు 'పరా, ఆఙ్' లను చేర్చుట ఉచితము కాదు. 'సమాసము'నకు బదులు 'సమసనము' వాడఁబడినది. 'మిన్నుపదోసె,'ఇనుప పెనము,'పాఁప మేతరి'మున్నగువానిలోని'ప' కారము షష్ఠీవిభక్తికమనుట (పు. 321) వింతగా నున్నది. ఇట్టి వింకను గలవు. కావ్యస్వరూప వివరణమునఁ జెప్పిన విషయములు పెక్కు విరుద్ధముగాఁ గానవచ్చుచున్నవి. ఈ విషయమునను పరిశీలన మావశ్యకము.

ఈ అష్టమముద్రణమున, వెనుకటిముద్రణములందలి లోపములు సవరింపఁబడినవి. ఇయ్యది లక్షణవేత్తలయొక్కయు, జిజ్ఞాసువుల యొక్కయు ఆదరాభిమానములను పొందగలదని విశ్వసించుచున్నాము.

ప్రకాశకులు.

# ఉపోద్ఘాతము

శ్రీ వావిళ్ల వారు 1910 వ సం॥లో ప్రకటించిన అప్పకవీయము ప్రతి పది సంవత్సరముల క్రిందట మేము * చదువుచున్నప్పుడు అక్కడక్కడ కావ్యభాషలో కానరాని 'చాలా' 'అయ్యేటి' 'వాటి' మొదలయిన శబ్దములు కొన్ని మాకు కనబడినవి. అవి పరిష్కర్తల ప్రమాదము వల్ల గ్రంథములోనికి చొచ్చినవా? లేక, అప్పకవే వాడినాడా? అనే సందేహము పుట్టినది. తర్వాత, తాటాకు పుస్తకములలో ఉన్న రంగరాట్ఛందస్సు, బాలసరస్వతీయము చదివినప్పుడు వాటిలో వివరణమంతా వ్యావహారికభాషను కనబడఁగా, అప్పకవికూడా తన గ్రంథములో అట్టి వచనములు అట్టి భాషలో వ్రాసినాడేమో తెలుసుకోవలెనని అభిలాష మాకు పుట్టినది. విశాఖపట్టణమందున్న శ్రీ పరవస్తువారి పుస్తకాలయములో తాటాకు పుస్తకము లున్నవని విని, అక్కడికి వెళ్లి, మా మిత్రులయిన శ్రీ పరవస్తు లక్ష్మీనరసింహస్వామి అయ్యవార్లంగారిని అడిగి, వారివద్ద నున్న తాటాకుల పుస్తకము ఎరవు తెచ్చుకొన్నాము. అది ఇంకా మావద్దనే ఉన్నది. అందులో చూడగా అనేక వచనములు వ్యావహారికభాషలోనే కనిపించినవి. అచ్చులో మాత్రము అవి అన్నీ కావ్యభాషలో ఉన్నవి. ఈ వ్యత్యాసము మాకు వింతగా తోచినది. దీనికి కారణము తెలుసుకోవలెననే కోరిక దృఢపడి, పూర్వముద్రణముల ప్రతులు, వ్రాతపుస్తకములు పరిశీలించుటకు మొదలుపెట్టినాము.

అప్పుడు మాకు దొరికిన ప్రతులు పరిశీలించగా పూర్వ ముద్రణములందు గ్రంథచ్యుతులు, లేఖక ప్రమాదజనితములైన తప్పులు,

---

* వ్రాత ప్రతులు సంగ్రహించుటలోను పాఠములు సంప్రతించుటలోను విషయవిచారణలోను మా తండ్రిగారు మ. రా. రా శ్రీ రావుసాహేబు గిడుగు వేంకటరామమూర్తిపంతులుగారు నాకు సహాయులుగా ఉన్నందున ఈ పీఠిక నేనే వ్రాసినా "మేము" అని బహువచనము వాడి ఉన్నాను. (గి. వేం. సీ.)

పరిష్కర్తలు తమ ఇష్టానిష్టములబట్టి చేసిన దిద్దుపాట్లు మొదలయిన లోపములు అనేకముగా కనబడినవి. ఈ విషయములన్నీ మా మిత్రులయిన బ్రహ్మశ్రీ వావిళ్ల వేంకటేశ్వరశాస్త్రిగారికి తెలియజేసి ఈ గ్రంథము మరల సంప్రతించి ముద్రింపించవలసినదని వారిని కోరినాము. అందుకు వారు సమ్మతించి, తమ తండ్రిగారు సంగ్రహించిన అప్పకవీయము ప్రతి మాచేతి కిచ్చి గ్రంథము వ్రాతప్రతులనుబట్టి సవరించవలసినదని మమ్ము కోరినారు. వారు కోరినట్లు గ్రంథము సాధ్యమైనంతవరకు జాగ్రత్తగానే సవరించినాము. ఐనా, ఇందులో తప్పులు లేవని చెప్ప సాహసించలేము. మాకోరికప్రకారము వారు గ్రంథము మరల అచ్చు వేయించి మా శ్రమ సార్థకమయినదానిగా చేసి, దీనికి పీఠిక వ్రాయ వలసిన దని మమ్మే కోరి గౌరవించి మా కుపకారు లయినా రని కొనియాడుతున్నాము.

పర్లాకిమిడి,<br>1922 సం॥ జూలై తే 13 ది.

గిడుగు వేంకట సీతాపతి,<br>బి. ఏ., ఎల్. టి.

# పీఠిక

## కాకునూరి అప్పకవి

ఆంధ్రలక్షణ గ్రంథములలో సవిస్తరముగాను సుప్రసిద్ధముగాను ఉన్న "అప్పకవీయము"ను రచించిన కాకునూరి అప్పకవియొక్క చరిత్ర—విమర్శకులకు తెలిసినంత మట్టుకు—కీర్తిశేషులయిన రావు బహాదూరు కందుకూరి వీరేశలింగము పంతులుగారి ఆంధ్రకవుల చరిత్రలోను, ఆంధ్ర విజ్ఞానసర్వస్వములోను ఉన్నది. తన చరిత్రను గురించిన విషయములు కొన్ని కవి తన గ్రంథమందు చెప్పుకొని ఉండుటచేత జిజ్ఞాసువుల పరిశ్రమ తగ్గినది.

## కాలము

ఈ గ్రంథములోని పీఠిక 33-వ పద్యమునుబట్టి శాలి. శ. 1578 మన్మథ నామ సం. శ్రావణ బ. 8 నాడు - (అనగా క్రీ. శ. 1656 సం. ఆగస్టు తే 3 దిని) తనకు కల వచ్చినట్లు కవి చెప్పుకొనుటచేత, 17-వ శతాబ్దమధ్యమం దుండిన వాడని స్పష్టముగా కనబడుచున్నది. కలగన్న మరునాడే ఈ లక్షణ గ్రంథమును వ్రాయుటకు మొదలు పెట్టుటచేతను, తా నదివరకు సంస్కృతాంధ్రగ్రంథములు రచించినట్లును శ్రీగిరిలో భోగవిభూషణుని పట్టపుకవీంద్రుడుగా ఉన్నట్లును పీ. 84, 85 లో చెప్పుకొనుటచేతను, అప్పకవి 17-వ శతాబ్దారంభమున పుట్టి ఉండు నని ఊహించవచ్చును. అప్పకవీయము "క్రీస్తుశకము 1656-వ సంవత్సరమునం దారంభింపఁబడి 1660-వ సంవత్సర ప్రారంభమున కింతవరకుఁ జేయఁబడి; యుండును" అని వీరేశలింగము పంతులుగారు ఆంధ్రకవులచరిత్రలో వ్రాసినారు గాని క్రింది గీటు గల వాక్యములోని విషయమునకు ప్రమాణము ఎక్కడ నున్నదో మాకు తెలియదు.

## వంశావళి

కర్తృవంశావతార పద్యములబట్టి (పీఠిక 70-83) అప్పకవి భరద్వాజ గోత్రుడనిన్ని పండితవంశమునందు పుట్టినవాడనిన్ని స్పష్టమగుచున్నది. ఈ దిగువను కనబరచిన వంశవృక్షమునకు ఆ పద్యములే ఆధారము.




## ఇంటిపేరు.

'కాకునూరు' అని తన ఇంటిపేరు వచ్చుటకు కారణము పీ. 72 లో చెప్పుకొన్నాడు. అతనితాతకు తాతయైన సోమయ మధురాపురమునకు పోయి "వేదశాస్త్ర పురాణాదివాదములను కాకునూరింటఁ జేసిన కారణమున కాకునూరింటివాఁడన ఘనతఁ గాంచె" నని ఉన్నది. అయితే, దాని తర్వాతిపద్యమందే అతడు "చరికొండసీమలో కాకునూరు అనే సర్వాగ్రహారము సంపాదించినాడని చెప్పుటచేత, ఈ ఇంటిపేరు గ్రామనామమా లేక పౌరుషనామమా అన్నసందేహము పుట్టుచున్నది. ఆ సోమయ "కాకునూరి తిమ్మనసుతుండు" అని (పీఠిక. 73) చెప్పుటచేత, అతని తండ్రినాటికే ఈ ఇంటిపేరు ఉన్నట్లు ఊహించుటకు అవకాశ మున్నది. లేదా, కొడుకు సంపాదించిన పేరు తండ్రికి పెట్టినాడని చెప్పవలెను.

సోమయ "అభినవచూతపగ్రామము"లో ఉండినట్లు పీ. 73-వ పద్యముబట్టి తెలియుచున్నది. ఈ గ్రామము పేరు క్రొత్తమామిడిపల్లె అయి ఉండును. "మామిళ్ల

*(ఓ)లో 'లక్ష్మణాఖ్యు బాలబుచ్చి' (పీ. 83) అని ఉండుటచేత ఈ పేరును చేర్చినాము. ప. లోని 'బాలుఁగాంచె' అనేపాఠము మూలమం దుంచినాము.

పల్లె యొకటి బాపట్లతాలూకాలోనున్నది. మామిళ్లపల్లి (అగ్రహారము) యొకటినూజివీడు తాలూకాలో నున్నది" అని లక్ష్మణరావుగారు ఆంధ్రవిజ్ఞానసర్వస్వములో వ్రాసినారు.

అప్పకవితాత పెద్దసోమయ రొంపిచెర్లలో పెద్ద నూయి త్రవ్వించినా డనిన్ని గుడిపాటిలో వినుకొండమార్గమందు పెద్దతోట వేయించినా డనిన్ని పీ. 79-వ పద్యమందున్నది. "రొంపిచెర్ల నరసారావుపేటలో నున్నది........సత్తెనపల్లి తాలూకాలో గుడిపూడి యనుపల్లె యున్నది. అదియే యిది కాఁబోలు" అని లక్ష్మణరావుగారు వ్రాసినారు.

అప్పకవి తండ్రి వెంగన, పల్నాటిలో తనపాండిత్య విశేషముచేత, "మాఅట బ్రహ్మ" అనే పేరుపొందినాడని పీ. 82 లో ఉన్నది.

పెద్దసోమయభార్య కృష్ణమ్మ; ఈమె తండ్రి పట్టెము పోతన (పీ. 80). వెంగనభార్య సేసమ (శేషమ్మ); ఈమెతండ్రి కృష్ణమ్మ సోదరుడయిన పెద్దిభట్టు అవునో కాదో స్పష్టముగా తెలియదు గాని, అయి ఉండునని ఊహించుటకు అవకాశ మున్నది. అప్పకవి కామెపల్లిలో ఉండగా స్వప్నము వచ్చినట్లును, అది అక్కడి మాతృసంబంధులు విన్నట్లును కవి చెప్పుకొనియున్నాడు. (పీ. 66.) పట్టెమువారిది కామెపల్లి. గనుక, ఆ మాతృసంబంధులు పట్టెమువారే అయి ఉండవచ్చును.

లక్ష్మణరావుగారు ఊహించినట్లు "అప్పకవి మేనమామల యింటిలోనే పెరిగి విద్యావంతుఁడయ్యెనని కూడ లోకవార్త వచ్చుచున్నది; కావున, నీతని కుటుంబము మేనమామలఁబట్టియే కామెపల్లి వచ్చెనని మనము నిశ్చయింపవచ్చును."

ఈ కామెపల్లి కొండవీటికి పడమటను శ్రీశైలమునకు ఈశాన్యమందును గల తంగెడుసీమలో ఉండెను. "కామెపల్లి యిప్పుడు గుంటూరు జిల్లాయందలి పల్నాడు తాలూకాలో నున్నది. అప్పకవికాలమున నది తంగెడుసీమలోనిది. ఇప్పుడు తంగెడు అను గ్రామము కామెపల్లికిఁ బశ్చిమమున పల్నాడుతాలూకాలో నున్నది" అని లక్ష్మణరావుగారు వ్రాసినారు.

ఈ కామెపల్లి (IV. I) ఏలేశ్వరమునకు తూర్పున ఏడు యోజనములు దూరముగాను, కేతవరమునకు (V. I) నైరృతిదిక్కున మూడు యోజనములు దూరముగాను, "సహ్యజాదక్షిణైకయోజననివేశ" (V. 172) అనుటచేత కృష్ణకు దక్షిణమున ఒక యోజనము దూరముగాను ఉన్నట్లు తెలియుచున్నది.

అప్పకవికి నివసస్థానమయిన కామెపల్లి ఇప్పుడు లేదని అక్కిరాజు ఉమాకాంతంగారు చెప్పినారు.

## వంశోత్కర్ష.

అప్పకవి పండితవంశమునందు జన్మించినవాడు. అతని తాతకు తాతయైన సోమయ కాశిలో బ్రహ్మేంద్రులవద్ద శాస్త్రములు చదివి గొప్ప పండితుడయి ఉండెను. మధురాపురమందు పండితులతో శాస్త్రవాదములుచేసి గెలిచినవాడు (పీ. 72, 73). అప్పకవి తాతయైన పెదసోమయ క్రతువులు చేసినవాడు (పీ. 78.) ఈ పెదసోమయకు అగ్రజుడైన తిరుమలభట్టు కాలామృతము అనే జ్యోతిషగ్రంథమును రచించినవాడు (IV. 67). అప్పకవితండ్రి వెంకన తన పాండిత్యవిశేషము చేత, "మాఱట బ్రహ్మ" అని ప్రఖ్యాతిపొందినవాడు (పీ. 82) ఈ లక్షణ గ్రంథము రచించకమునుపే, అప్పకవి శ్రీశైలములో "భోగవిభూషణుని పట్టపు కవీంద్రు"డయి ఉండెను (పీ. 84). సంస్కృతాంధ్రగ్రంథములు కొన్ని రచించెను (పీ. 85). వీటిలో మనకు ఒక్కటైనా లభించకుండుట కడు శోచనీయము. "అంబికావాద" మను యక్షగానమును సయితము పేర్కొనుటచేతను, యక్షగానముల గురించి ఈ గ్రంథములో నాలుగవ ఆశ్వాసమందు వ్రాసి ఉండుటచేతను యక్షగాన ప్రబంధమునకు ఆ కాలమందు తగిన గౌరవము ఉండె నని ఊహించవచ్చును. కంకంటి పాపరాజు రచించిన "విష్ణుమాయావిలాసము" అను యక్షగానప్రబంధము తంజావూరు గ్రంథాలయమందు ఉన్నది.

చక్రబంధములో 'కాకునూర్యపయ' అనిన్ని 'సోమయాజికవి' అనిన్ని రెండు పేళ్లు కనబడుచున్నవి. మొదటిది గ్రంథకర్తపేరు. రెండవది ఎవరిపేరో తెలియదు. (చూ. పు. 2-9.)

ఈ లక్షణగ్రంథమందు అప్పకవి 43 పూర్వలక్షణగ్రంథములను పేర్కొని అనంతునిఛందమునుండి 7 పద్యములను, కావ్యాలంకారచూడామణినుండి 5 పద్యములను, కవిగజాంకుశము, కవిజనాశ్రయము, లక్షణసారసంగ్రహములనుండి రెండేసి పద్యములను, కవిలోకచింతామణి, కావ్యచింతామణి, శారదాదర్పణములనుండి ఒక్కొక్క పద్యమును లక్ష్యములుగా ఇచ్చినాడు. తాను పేర్కొన్న లక్షణగ్రంథములు అన్నీ అతడు చదివినాడో లేదో తెలుసుకొనుట కష్టమే కాని, "సకలగ్రంథములను జదుకవ, తెలియునె లక్షణప్రపంచంబెల్లన్" (1. 5) అనిన్ని "గ్రంథము లన్నియు వెదకి వెదకి సారమెల్ల వివరింపంగన్" (1. 7) అనిన్ని చెప్పుకొనుటచేత, అతడు చాలాగ్రంథములు చదివి ఉండవలెను. అంతేకాక, సుమారు 100 గ్రంథములనుండి మొత్తముమీద 300 పద్యములకు పైగా తన లక్షణగ్రంథములో ఉదా

హరించినాడు. (చూ. ఉదాహృత గ్రంథముల వివరణము.) అయితే, పూర్వలాక్షణి కులు తమ లక్షణగ్రంథములలో లక్ష్యములుగా ఎత్తి వ్రాసుకొన్న పద్యములే అనేక ముగా ఇతడు ఉదాహరించినట్లు కనబడుచున్నది. అందుకు దృష్టాంతముగా, కవిలోక సంజీవని చూచినయెడల, ముద్దరాజు రామన్న ఎత్తి వ్రాసుకొన్న పద్యములలో సుమారు 69 పద్యములు అప్పకవి తన లక్షణగ్రంథములో ఉదాహరించినట్లు కన బడును. అయినా, అప్పకవి సంస్కృతాంధ్ర వాఙ్మయముల పరిచయము విశేషముగా కలవాడనిన్ని, అనేక శాస్త్రములు పరిశీలించినవాడనిన్ని ఈ లక్షణగ్రంథమునుబట్టి ఊహించుటకు అవకాశము విశేషముగా కలదు.

## గ్రంథము పూర్తిగాకుండుటకు కారణమేమి ?

అప్పకవి 8 ఆశ్వాసముల గ్రంథమును వ్రాయబూనినట్లు పీ. 96 వ పద్యమును బట్టి స్పష్టము. అయితే, ఏప్రతిలో చూచినా 5 ఆశ్వాసములు మాత్రమే కనబడు చున్నవి.

చతుర్థాశ్వాసములో గర్భకవిత్వమును గూర్చి వ్రాస్తూ (IV. 388) "ఇది భాషాపరిచ్ఛేదములో తెలియవ్రాసినది"; (IV. 390;) "ఇది వర్ణపరిచ్ఛేదములో తెలియవ్రాసినాము"; (IV. 392;) "ఇది వళిప్రాస పరిచ్ఛేదములో తెలియవ్రాసి నాము"; (IV. 393;) "ఇది యీ పద్యపరిచ్ఛేదము తుదను తెలియవ్రాయు చున్నాము."; (IV. 94;) "ఇది సంధిపరిచ్ఛేదములో తెలియవ్రాయుచున్నాము." అని మాత్రమేచెప్పి తత్సమ, దేశ్య, క్రియా పరిచ్ఛేదముల తుదను తెలియజేయదల చిన పద్యములగురించి చెప్పక పోవుటచేత, చతుర్థాశ్వాసము వ్రాసేసరికి పంచమాశ్వా సము గురించి ఆలోచనమే కాని, తక్కిన మూడు ఆశ్వాసముల గురించి ఆలోచన మున్నట్లు సూచన లేదు.

## అప్పకవీయము వ్రాతప్రతులు.

I. మావద్ద నున్న ప్రతులు:—

1. ప. విశాఖపట్టణమందున్న శ్రీపరవస్తువారి ఆర్యపుస్తకాలయములోనిది, సంపూర్ణము. "రాక్షస సం॥ ఫాల్గుణ శు ౧౫ గురువారంవరకు ఉప్పు లూరి నృసింహులు, ఆత్మార్థం వ్రాసుకొనెను" అని ఉన్నది.

2. ఓ. అనంతపురంజిల్లా కల్యాణదుర్గముతాలూకాలోని గంగవరమునందు కాపురముండిన ఓరుగంటి రామకవి వ్రాసుకొన్నదని మా కీ పుస్తక మిచ్చిన బ్ర॥ పెండ్యాల వేంకట సుబ్రహ్మణ్యశాస్త్రులుగారు చెప్పి

గారు. రామకవి 90 సం॥ ల. క్రిందట కాలముచేసెనని ఆయన మనుమడు చెప్పెనట. గ్రంథము సంపూర్ణము; గాని, కడపటి పత్రము లేదు.

6. వా. కీర్తిశేషులయిన బ్రహ్మశ్రీ వావిళ్ల రామస్వామిశాస్త్రులుగారు సంగ్రహించి వారు బందరులో కాగితాలమీద వ్రాసినది. అసంపూర్ణము. ఇది బ్రహ్మశ్రీ వావిళ్ల వేంకటేశ్వరశాస్త్రులవారికి తిరిగీ ఇచ్చివేసినాము.

4. పె. (1) మొదటి ఆశ్వాసము మాత్రమే ఉన్నది. ఎవరు ఎప్పుడు వ్రాసినదో తెలియదు.

పె. (2) మొదటి ఆశ్వాసము మాత్రమే ఉన్నది. ఎవరు ఎప్పుడు వ్రాసినదో తెలియదు.

పె. (3) నాలుగవ ఆశ్వాసములో కొంతమాత్రము ఉన్నది. ఎవరు ఎప్పుడు వ్రాసినదో తెలియదు.

పె. (4) ఇందు నాలుగవ ఆశ్వాసము 'సుకేశర' వృత్తమువరకు మాత్రమున్నది. 136-వ అంకె గల తాటాకు మొదట నున్నందున దాని మీది 135 తాటాకులలో తక్కిన మూడు ఆశ్వాసములున్ను ఉండెను గావలెను. 183-వ తాటాకుమీద నాలుగవ ఆశ్వాసములోని శేషించిన గ్రంథము "రెండో పుస్తకములో వ్రాసివున్నది" అని లేఖకుడు, సుంకరణము తిరుపతి వ్రాసినాడు. తారీఖు లేదు.

ఈ నాలుగున్ను బ్రహ్మశ్రీ పెండ్యాల సుబ్రహ్మణ్యశాస్త్రులుగారే ఇచ్చినారు; మావద్ద నున్నవి.

## II. మేము చూచిన తక్కిన ప్రతులు:—

1. ఆంధ్రసాహిత్యపరిషత్పుస్తకాలయములోనివి మూడు 523, 2307, 2866 నెంబర్లు గల పుస్తకములు. ఇవి అన్నీ అసమగ్రముగానే ఉన్నవి. కడపటిదానిలో పది తాటాకులు మాత్రమే కలవు. అన్ని పుస్తకములలోని తాటాకులున్ను చూచినాము. మావద్దనున్న పుస్తకములలో ఉన్నట్టే వచనములు వ్యావహారికభాషలో ఉన్నవి. 515, 1609 నెంబర్లు గలవి అప్పకవీయ పుస్తకము లని పట్టీలో వ్రాసి ఉన్నది గాని, కావు. ఒకటి కవిజనాశ్రయము; రెండవది అనంతుని ఛందస్సు.

2. గవర్నమెంటువారి లిఖితపుస్తకభాండాగారములోనివి:—

   1. నెం. 13-2-7 అసమగ్రము. దానిలో పుటలు 164, 167, 178 చూచి తైపారు వేసినాము.

   2. నెం. 14-3-31 అసమగ్రము. 65, 72, 77 పుటలలోని గ్రంథము గ్రంథము తైపారు వేసినాము.

   3. నెం. 13-3-2 అసమగ్రము. 126, 129, 130, 131 పుటలలోని చూచినాము.

3. అడయారులోని థియొసాఫికల్ సొసయిటీవారి పుస్తకాలయములోనివి.

   1. నెం. XXXII G. 33-23-వ పుటలోని గ్రంథము చూచినాము.

   2. డిటో D. 4. అక్కడక్కడ చూచినాము.

4. పిఠాపురము పరిశోధకమండలివారి పుస్తకాలయములో కొన్ని ప్రతులున్నవనిన్ని, అందు వ్యావహారికభాషలోనే అనేక వచనము లున్నవనిన్ని వంగూరి సుబ్బారావుగారు చెప్పినారు. అక్కడి ప్రతులలో, అల్లమరాజు సుబ్బనార్యుడు ప్రమాదీచ సం. ఫాల్గున బ ౧౦ వ్రాసినది మేము చూచినాము. ద్వితీయాశ్వాసము మాత్ర మున్నది. దానిలోని వచనములు మావద్ద నున్న పుస్తకములలో నున్నట్లే ఉన్నవి.

5. బ్రహ్మశ్రీ మండపాక పార్వతీశ్వరశాస్త్రిగారు కొన్ని వ్రాతప్రతులు చూచినారట. వాటిలో వ్యావహారికభాషలో రచించిన వచనము లున్నవట.

## వ్యావహారిక భాషాప్రయోజనము

అప్పకవి ఈ గ్రంథమందు రెండు విధములయిన తెనుగుభాష బుద్ధిపూర్వకముగానే వాడినట్టు స్పష్టముగా కనబడుతున్నది. ఒకటి కావ్యభాష, రెండవది వ్యావహారికభాష అని ఆ రెంటికి గల భేదము తెలియజేయుటకు పేర్లు పెట్టవచ్చును. కావ్యభాష అనేది నన్నయ మొదలుకొని కవులందరున్ను కావ్యములలో గద్యపద్యములు రచించినప్పుడు వాడినది. వ్యావహారికభాష అనేది శిష్టజనులు వ్యవహారమందు సంభాషణలోనున్ను వ్రాతలలోనున్ను వాడుకొనే భాష. అప్పకవి రచించిన పద్యములన్నీ ఇంచుమించుగా కావ్యభాషలోనే ఉన్నవి. [1]వచనములు, కొన్ని కావ్యభాషలో నున్ను కొన్ని వ్యావహారిక భాషలోనున్ను రచితములయి ఉన్నవి.

---

1. నన్నయాది ప్రాచీనకవుల గ్రంథములలో కానరాక ఉత్తరాంధ్రకవుల భాషలో కనబడుతూ ఉన్న శబ్దములు కొన్ని అప్పకవి వాడి ఉన్నాడు. ఉదా. దాంచినావు (ii. 30) రాశినుంచి (ii. 318) వలమాటి (ii. 265). ఎక్కుక, వంచుక, వందొమ్మిదోఛందము (పు. 287), పీటికి (iv. 70, పీటిలో (iv. 266).

చంపువులలోని వచనములవంటివి పద్యములవలెనే తప్పకుండా కావ్యభాషలో ఉన్నవి. ఉదా. ఆశ్వాసాంతగద్యలు, కావ్యములలోని గద్యలకు లక్ష్యములు (చూ. iv 24. 25). ఇవిగాక "అని యివ్విధంబున" (1. 16.) "మదీయ స్వప్నవిధం బాతయుఁ దేటపడ నెఱుంగించిన" (1. 66.) మొదలయిన వచనములు కావ్యభాషలో రచించినవి, మొత్తముమీదను గ్రంథమంతటిలోను, నూరుపంక్తులయినా ఉండవు. తక్కిన వచనములన్నీ వ్యావహారికభాషలో రచించినవే. అవి డెబ్బదికంటె అధికముగా ఉన్నవి; 550 పంక్తులకన్న ఎక్కువే. మొదటి ఆశ్వాసమందు తద్భవస్వరూపములు వివరించిన పట్టున (చూ-పుటలు 30-37), ద్వితీయాశ్వాసమందు అక్షరరూపములు వివరించినచోట్ల (చూ-పు-48-55), చతుర్థాశ్వాసమందు ప్రస్తారవివరణములలోను (చూ-పు-148-216) ఇట్టి వచనములు మెండుగా నున్నవి. మూడవ ఆశ్వాసమందున్ను అవతారికలలో "అన్నఅనేటందుకు" "అయ్యఅనేటందుకు" చూ-పు. 1259) అని వ్యావహారికభాష కనబడుతున్నది. తెలివిడి, వివరణము, టీక, అవతారిక, వాక్యము అని ఇట్టి వచనమునకు పేళ్లు. ఇప్పుడు క్రొత్తగా ముద్రించిన ఈగ్రంథమందు ఈ వచనములు వ్యావహారిక భాషలో రచితమయినట్లు కనబడుతున్నవి; గాని, ఇంతకుపూర్వము, 1859 సంవత్సరము మొదలుకొని నేటివరకున్ను ముద్రించిన పుస్తకములలో, ఎక్కడనో తప్పిదారి పరిష్కర్తలు దిద్దమఱచిన శబ్దములు విడిచితే పద్యములవలెనే ఇవిన్నీ కావ్యభాషలో రచించినవైనట్లే తోచును. [1]ఇప్పటి ముద్రణములో తిరిగీ మార్పు జరుగుటకు కారణ మేమి? అందుకు మేమే ఉత్తరవాదులము; గనుక, కారణము విశదపర్చుచున్నాము.

1859-వ సం. నవంబరునెల తే25-దిని సూర్యాలోకమనే ముద్రాక్షరశాలయందు మొట్టమొదట అప్పకవీయము అచ్చుపడ్డది. అచ్చువేయుటకుగాను గ్రంథమును పరిష్కరించినవారు శ్రీ రేకము రామానుజసూరిగారు. "వారు గవర్నమెంటుః నార్మల్ కాలేజిలోఁ దెనుఁగుపండితులు." ముద్రాక్షరశాలాధికారులయిన ఎగ్గులూరు వేణుగోపాలనాయుఁడుగారు తెప్పించియిచ్చిన లిఖితపుస్తకములు వారికి ఆధారమయిన

1. చూ-1958-వ సం. ముద్రణలో (పుట 31-32-34-35) ఇందుకు (54) పదిహేనవయచ్చు (60) అందుకు (77) కాదంటేను (81) వచ్చితేని (82) పోవద్దురా, (90) రెండోసారి, బజాటివాండ్లు, (205-206-207-208) చాలా ఎనిమిదిసార్లు 213 వద్దినుంచి 214, అయ్యేటట్టుగాను, వాటిలోపల,—ఇవి తర్వాతి ముద్రణములో కూడా నిలిచి ఉన్నవి.

వట. అవి ఇపుడు ఎక్కడనున్నవో తెలియదు. అచ్చుపడ్డ ప్రతిగ్రంథమునకున్ను వ్రాతప్రతి మూలము. అప్పకవీయము అచ్చుపడకపూర్వము ఆ గ్రంథము వ్రాతప్రతులలోనే కదా లోకములో విదితమై ఉండేది. ఆ వ్రాతప్రతులకు మొదటి మాతృక అప్పకవి స్వయముగా వ్రాసినదే అయి ఉండవలయును. అయితే, అది యిప్పుడు ఎక్కడయినా ఉన్నదో లేదో ఎరుగము, గాని అచ్చుపడక పూర్వము కాగితాలమీదను తాటాకుల మీదను వ్రాసిన పుస్తకములు అనేకములు ఇప్పటికిన్ని దేశములో ఉన్నవి. మేము 14 వ్రాతప్రతులు చూచి ఉన్నాము. అన్నిటిలోనున్ను గ్రంథము ఇంచుమించుగా ఒక్కలాగునే ఉన్నది. లేఖకప్రమాదములుండుగాకేమి. ఇట్టి ప్రమాదములచేత కలిగిన మార్పులు ఎన్నిఉన్నా, పూర్వపు ముద్రణలోనున్నట్లు వ్రాతప్రతులలోకూడా గ్రంథముకనబడితేనే తప్ప, మేము చూచిన పుస్తకములలోని గ్రంథమే రామానుజసూరిగారు చూచిన పుస్తకములలోకూడా ఉండుట అసంభావ్యము కాదు. వారు అచ్చొత్తించుటకుగాను పరిష్కరించినప్పుడు గ్రంథము దిద్ది ఉందురు. వ్యావహారికభాష గ్రంథరచనకు ఉచితమయినది కాదని పరవస్తు చిన్నయ్యసూరిగారు మొదలయినవారు ఆ కాలమందు ఉపదేశించుటచేత కాబోలును, రామానుజసూరిగారు ఈ గ్రంథమందు అప్పకవి వ్యావహారికభాషలో రచించిన వచనములలో [1]తమకు తప్పులుగాతోచిన శబ్దములు తొలగించి, తమకు ఒప్పులుగా తోచినవి చేర్చి, భాష మార్చి వేసినారు. వారి దృష్టికి వారు చేసిన మార్పు నిర్దుష్టమయినదే కావచ్చును; గాని, అప్పకవి వ్రాసిన గ్రంథమును అట్లే ఉండనీయక తమ యిష్టానుసారము బుద్ధిపూర్వకముగా మార్చి, అప్పకవే అట్లు మార్చినాడని పాఠకులకు తోచేటట్లు చేయడము ఎంత మాత్రమున్ను పరిష్కర్తలకు ఉచితము కాదు. అప్పకవివంటి లాక్షణికుడు ఇట్టి లక్షణ గ్రంథములో ఇట్టి వచనములు కావ్యభాషలోనే రచించి ఉండును గాని, వ్యావహారిక భాషలో రచించి ఉండడు—అని, కావ్యభాషను రచించిన శిశుబోధలు బాలబోధలు చదువుకొన్న ఇప్పటి తెలుగువారు ఊహింతురేమో కాని, అట్టి ఊహ నిరాధారమయినది. అప్పకవి కావ్యభాషలోనే ఈ వచనములు రచించి ఉంటే, లేఖకులు ఉద్దేశపూర్వకముగా వ్యావహారికభాషలోనికి మార్చి, వాటిని వ్రాసినా రనుటకు ఆధార మేమయినా ఉన్నదా? అప్పకవి కావ్యభాషలో రచించిన వచనములు కొన్ని ఉన్నవే; అవి లేఖకులు మార్చకుండా ఉన్నది ఉన్నట్టే వ్రాసినారే. ఇప్పుడు కన

1. ఈ వచనములలో వ్యావహారిక భాషాశబ్దములు మార్చినట్లే కొన్ని పద్యములలో యతులు మొదలగునవికూడా తమకు తప్పుగా తోచినవి దిద్ది మార్చివేసినారు.

పడుతూ ఉన్న వ్రాతపతులన్నీ ఒక్క కాలములో, ఒక్క స్థలములో, ఒక్క లేఖకుడు వ్రాసినవి కావు. కొన్ని ప్రతులు పండితులు స్వయముగా వ్రాసుకొన్నవి. మాటకు, మావద్దనున్న అయిదు ప్రతులలో ఓ అనేది అనంతపురముజిల్లా కల్యాణదుర్గము తాలూకాలోని గంగవరమునందు 90-సం. క్రిందట కాలము చేసిన ఓరుగంటి రామ కవి వ్రాసుకొన్నదట. అతడు నాలుగు ప్రబంధములు రచించినవాడట! శకటరేఫము అరసున్నలు ఉంచి, తప్పులు జాగ్రత్తగా సవరించి, వ్రాసిన ప్రతులున్నవే. అట్టి వాటిలో ఈ వచనములు వ్యావహారిక భాషలో ఉన్నప్పుడు, మూలగ్రంథములోనే అట్లున్నవని నిశ్చయముగా చెప్పడము తప్పుకాదే. ఇందేకాదు, అప్పకవికి పూర్వమందున్ను పరమందున్ను తమ వ్యావహారికభాషయొక్క ప్రయోజనమును పండితులు అందరున్ను అంగీకరించి, అనేక విధములయిన గ్రంథములను ఆ భాషలో ప్రచురముగా రచించినారు గాని, గ్రామ్యమని గర్హించి, తమ భాషను త్యజించలేదు. ఇందుకు నిదర్శనముగా వందలకొలది గ్రంథములు వ్యావహారిక భాషలో వ్రాసినవి ఉన్నవి. సంస్కృతభాషలో నున్న వైద్యము, జ్యోతిషము, గణితము మొదలయిన విద్యలకు, కళలకు తెనుగు పండితులు వ్యావహారిక భాషలోనే టీకలు, వివరణములు వ్రాసినారు. అమరమునకు తెనుగుటీకలు, సంస్కృతకావ్యములకు తెనుగు టీకలు, వసుచరిత్ర రాఘవపాండవీయ హరిశ్చంద్రనలోపాఖ్యానము మొదలయిన తెనుగు ప్రబంధములకు తేటతెలుగుటీకలు వ్యావహారిక భాషలోనే ఉన్నవి. అవి వ్రాసినవారు గొప్ప తెలుగు పండితులు; అప్పకవికి పూర్వులు; ఇంతెందుకు? అప్పకవి తన గ్రంథమున కాధారముగా "సకలకవితాస్వతంత్రభట్టారకయెలకూచి బాలసరస్వతీ మహామహోపాధ్యాయ ప్రణీతంబయిన యాంధ్రశబ్దచింతామణీ టీకాగ్రంథ" మని పేర్కొని, "బాలసరస్వతులం బోలు ప్రాజ్ఞులు గలరే?" అని కొనియాడినాడు. అట్టి పండితుడు బాలసరస్వతీయ మనే లక్షణగ్రంథమందు * వివరణమంతా వ్యావహారిక భాషలోనే రచించినాడు. పుస్తకభాండాగారములలో చాలా ప్రతు లున్నవి. అప్పకవికి పిమ్మటను

---

* ఈ గ్రంథము ఇప్పటికిన్నీ సరిగా అచ్చు పడలేదు. "సటీకాంధ్రశబ్దచింతామణి" అని పేరుపెట్టి కొంత గ్రంథము బాలసరస్వతీయములోనిది దొంగలించి బాలసరస్వతి ప్రయోగించిన వ్యావహారిక భాషాశబ్దములు తొలగించి, కావ్యభాషాశబ్దములు దూర్చి, కొందరు పండితులు తాము రచించిన గ్రంథముగా ప్రకటించుకొన్నారు. ఇట్లే వసుచరిత్ర మనుచరిత్ర రాఘవపాండవీయాదికావ్యములకు పూర్వులు వ్రాసిన టీకలు మారు రూపు పొంది అచ్చులో నేడు కనపడుతున్నవి.

పుట్టిన లక్షణగ్రంథములలోకూడా వివరణము, తెలివిడి, టీక, అవతారిక అనే పేరుగల వాక్యములన్నీ వ్యావహారికభాషలోనే ఉన్నవి; రంగరాట్ఛందస్సు, లక్షణశిరోమణి, తిమ్మకవి సర్వలక్షణసారసంగ్రహము, కవిజిహ్వాంజనము మొదలయినవాటి వ్రాతప్రతు లన్నిటిలోను, మేము చూచినంతమట్టుకు ఇట్లే ఉన్నవి.

వ్యావహారికభాష కథలలోను, ధర్మశాస్త్రములలోను, శైవ వైష్ణవ మత విషయములను గురించి వ్రాసిన గ్రంథములలోను, వేదాంత గ్రంథములలోను అవశ్యముగా వాడినట్లు కావలసినన్ని నిదర్శనము లున్నవి. రాతిపలకలమీద చెక్కించిన శాసనములలో వ్యావహారిక భాష దేవాలయములలో నేటికిని కనబడుతూ ఉండనే ఉన్నది. పైన చెప్పినట్లే వ్యావహారికభాషయొక్క ప్రయోజనము అనేకవిధములయిన రచనలలో అప్పకవికాలమందే కాక, అతనికి పూర్వమున్నూ పిమ్మటనున్నూ పండితులు అంగీకరించినట్టు నిదర్శనముగా వేలకొలది గ్రంథములు పుస్తక భాండాగారములలో కనబడుతూ ఉన్నందున, అప్పకవికూడా అట్టిభాష ప్రాయకము సార్వత్రికమయిన సత్సంప్రదాయమనిన్ని, సదాచారమనిన్ని మే మూహించుటకు తగినంత కారణ మున్నది.

వ్రాతప్రతులలో వ్యావహారికభాష కొన్ని రచనలలో కనబడుతున్న దని అంగీకరించినా, అప్పకవే అట్లా వ్రాసినా డని ఎందుకు ఊహించవలెను ? అతని శిష్యులు అతడు నోటను చెప్పిన టీకలు మొదలయినవి వ్యావహారికభాషలో వ్రాసి ఉందు రని అనుకోకూడదా ?—అని కొందరు వాదించినారు. వారి వాదము చొప్పున శిష్యులు వ్రాసినవయినా, గురువుగారు అంగీకరించినవే కావలెనుగదా. ఎట్లయినా, అవి గ్రంథము లోనివే అనక తప్పదు. ఐతే, అప్పకవే వ్రాసినాడని ఊహించుటకు గ్రంథములోనే తగినంత ఆధారమున్నది చూడండి : వ్యావహారిక భాషలో రచితమయిన వచనములు ఒక్కొక్కటి చదివి పూర్వోత్తర సందర్భములు పరికించిచూస్తే, గ్రంథకర్త తప్ప మరి ఒకరు ఆ వచనములు వ్రాసి ఉండ రని తెలియక పోదు. ఉదా : (1) 30-వ పుటలో 'ప్రయోగమూలం వ్యాకరణం' అనే సూత్రమునకు వ్రాసిన తెలివిడిలో, 'వాటికన్నిటికిన్నీ తెలిసేటట్లు అందులోపల నొక చంద్రశబ్దమునకు చెప్పుచున్నాము' అని ఉన్నది. ఇట్లు గ్రంథకర్తకాక ఇతరులు వ్రాతురా? (2) దీనితర్వాత వ్రాసిన సూత్రము టీక కొనను, "అది యెట్లంటేను" అని చెప్పి, ప్రాకృత సూత్రమును ఉదాహరించినవాడు లాక్షణికుడుకాక మరి యెవడు ? (3) 32-వ పుటలో టీక కొనను, "ఇందుకు ప్రయోగము నరసింహపురాణమునందు" అని చెప్పినవాడు ఒకడున్నూ,

పద్య ముదాహరించినవాడు ఇంకొకడున్ను అనవచ్చునా? (4) నాలుగో ఆశ్వాసము 118-వ పద్యములో, "మగణమున కెల్ల వ్రాసితి మిగిలినట్టి గణములకు నిట్లు వ్రాసిన గ్రంథ మధిక విస్తరం బగు నని వ్రాయ వెఱచినాఁడఁ దెలిసికొనఁదగుఁ గవులు యాదులకు నిట్ల." అని చెప్పినవాడు లాక్షణికుడే కనుక మగణమునకు వ్రాసిన వచనములు ఎనిమిదిన్నీ అతడే వ్రాసిన వనకతీరదు. ఇది నిశ్చాయకమయిన నిదర్శనము. ఇంతకంటే అమోఘమయినది మరి ఒకటి చూస్తే, మామాట ఎవరికిన్నీ శంకించుటకు మరి అవకాశముండదు. (5) నాలుగో ఆశ్వాసము 133-వ పద్యము 'తే. ప్రత్యయము లాఱు నీ చెప్పుపద్యములను, తెలిసికొన నెంతవానికి నలవికామి, వరుస నన్నింటికిం డీక వ్రాయ వలసెఁ, దెనుఁగు మాటలఁ గడు తేటతెల్లఁ గాఁగ." అని చెప్పినవాడున్ను, చెప్పినట్టుగానే టీకలు వ్రాసినవాడున్ను ఒక్కడు కాడని వాదించేవారికి ప్రత్యుత్తర మేమి చెప్పవలయునో మాకు తెలియదు. ఈ వచనములు అన్నీ గ్రంథమునకు అంగములు. అవి లేకుంటే గ్రంథము అసంపూర్ణ మవుతుంది. ప్రతిపక్షులు చేసే ఆక్షేపము మరియొకటి ఉన్నది; దానికికూడా మేము సమాధానము చెప్పవలసి ఉన్నది. వ్రాతపుస్తకములలో నున్న వ్యావహారికభాష పరిష్కర్తలు ఎందుకు మార్చి వేసినారు? అంటే పైని ఒకచోట మేము సూచించినదే వివరించి చెప్పుతున్నాము. పరవస్తు చిన్నయసూరిగారు, శ్రీరేకము రామానుజసూరిగారు; కరాలపాటి రంగయ్యగారు; నిశ్చింత తేవప్పెరుమాళ్లయ్యగారు మొదలయిన దక్షిణదేశపు తెలుగు పండితులు కొందరు వ్యావహారికభాష ఎట్టి గ్రంథములలోనైనా వాడనేకూడ దని నియమము చేసుకొన్నట్టు వారు వ్రాసిన వ్రాతలను బట్టిన్నీ, వారు పరిష్కరించిన గ్రంథములను బట్టిన్నీ ఊహించవచ్చును. వారి మతమునకు విరుద్ధముగా తెనుగుదేశపు పండితులు, అప్పటివారు రావిపాటి గురుమూర్తిశాస్త్రిగారు, పుదూరి సీతారామశాస్త్రిగారు, పుసులూరి వైద్యనాథసిద్ధాంతిగారు, జూలూరి అప్పయ్యపండితులుగారు, వైయాకరణము రామానుజాచార్యులుగారు, పురాణం హయగ్రీవశాస్త్రులుగారు, వేదం వెంకటాచలశాస్త్రిగారు, వఠెం వాసుదేవపరబ్రహ్మశాస్త్రులుగారు, స్వామినీని ముత్తునరసింహనాయుడుగారు, వెంకటగిరి మహారాజులయిన శ్రీ వెలుగోటి సర్వజ్ఞకుమారయాచేంద్రులవారున్ను, ఇంకా అనేక పండితులున్ను ప్రాచీన సంప్రదాయము చొప్పున కావ్యములు కావ్యభాషలోను, వచనగ్రంథములు వ్యావహారిక భాషలోను వ్రాసేవారని వారి వ్రాతలలో కనబడుతూ ఉండడమేకాక, కడపట పేర్కొన్న ముగ్గురు పండితులున్ను వ్యావహారికభాషయొక్క ప్రయోజనము కంఠోక్తంగా విధించి చెప్పినారు.

*అయితే సూరిగారివంటి పండితులు ఉపాధ్యాయులుగాను, అచ్చుకూటములలో పరిష్కర్తలుగాను, కొంత అధికారము వహించి ఉండుటచేత వారి మతము వ్యాపించినది. వారు పరిష్కరించిన గ్రంథములు చదివేవారికి భాషాపాండిత్యము లేక పరిష్కర్తల భ్రమ ప్రమాదములవల్ల కలిగే దోషములు కనబడవు. భారతాది ప్రాచీనగ్రంథములన్నీ ఇట్టి పరిష్కరణమువల్ల పాడయి ఉన్నవి. నానావిధముల ప్రయోజనము గల వ్యావహారికభాష అచ్చులో కనబడక రూపు మాసిపోయినది. పూర్వముద్రణములో ప్రచురముగా ఉన్న వ్యావహారిక భాష నేటిముద్రణలో కానరాదు. రావిపాటి గురుమూర్తి శాస్త్రిగారు 1834 సం॥లో వ్యావహారిక భాషలో రచించి అచ్చు వేయించిన పంచతంత్రి 1870 సం॥ వరకున్నూ చాలామాట్లు ముద్రితమయి బడులలో పిల్లలు చదువుకొనుటకు ఉపయుక్తముగా ఉండేది. ఆ పుస్తకము ఏ పండితుడో గారడిమాయ పన్నినట్టు కావ్యభాషలోనికి మార్చి అచ్చు వేయించినాడు. 10 సం॥లు వాడుకలో ఉన్న గ్రంథము మారురూపు పొందినదని ఇప్పటివారికి తెలియదు. ఇట్లు పరిష్కర్తలవల్ల పాడుపడి ఎన్నో గ్రంథములు ఉన్నవి. సామాన్యమైనవాటి మాట కేమి ? చిన్నయ్యసూరిగారు రచించిన నీతిచంద్రిక సూరిగారు అచ్చువేయించినట్లు ఇప్పుడు లేదు. ఎన్నో మార్పులు కలిగినవి. ఎవరు చేసినారో తెలియదు. గ్రంథములు పరిష్కరించి అచ్చు వేయించేవారికి గ్రంథములోని విషయముగానీ భాషగానీ మార్చి సవరించుటకు అధికారము లేదు. గ్రంథములో దోషము లుంటే ఉండుగాక. అవి నిరూపించుటే విమర్శకులకు విహితధర్మము. విమర్శకునికి దోషముగా కనపడ్డది దోషము కాకపోవచ్చును. ఉద్దేశపూర్వకముగా స్వమతానుసారముగా ఇతరుల గ్రంథము మార్చుట కూటకరణము వంటిది. అది మహాపాతక మని వివేకులు అట్టి పని చేయరు.

అప్పకవీయమువంటి గ్రంథములో తెలివిడి మొదలయిన వచనములు గ్రంథకర్త..వ్యావహారిక భాషలో వ్రాసినా, అచ్చులో కావ్యభాష నుండుట మేలు కాదా ? ఆలా గున్నందువల్ల గ్రంథమునకు గౌరవము అధికము కాదా ? అని అంటారు కొందరు. వ్యావహారిక భాషలో పూర్వుల దృష్టికి లాఘవ మెంతమాత్రమున్ను లేదు. దానియందు అగౌరవము రామానుజసూరివంటివారు ఆపాదించి, దేశమునకు అపరిమితమయిన నష్టము కలుగజేసినవారయినారు.

---

*చూ. పరబ్రహ్మశాస్త్రులుగారు 1851-వ సం॥లో రచించిన హిందూ ధర్మశాస్త్రము, నాయుడుగారు 1863-వ సం॥లో రచించిన హితసూచని, మహారాజులు 1886-వ సం॥లో రచించిన మనస్స్వాతంత్ర్యము.

అపరిమిత ప్రయోజనమయిన వ్యావహారికభాష పండిత పామరసామాన్యమై వాస్తవమయిన దేశభాషగా ప్రపంచమంతటా గౌరవము కలిగియున్నది. పరిమిత ప్రయోజనమయిన కావ్యభాష పండితులు రచించే గ్రంథములలో ఉచితముగా నుండును. సంస్కృతభాషాపాండిత్యము లేనివారికి అది సుబోధము కాదు; సుకరమున్ను కాదు. అల్పజ్ఞానముగల పండితంమన్యులు వచ్చిరాని ప్రాచీన కావ్యభాషలో నిర్దుష్టముగా కావ్యభాష వ్రాయగలవారు మిక్కిలి అరుదు. వ్రాయజాలని చేతకాక, కృతకభాష సృజించి, ఆంధ్రభాషకున్ను వాఙ్మయమునకున్ను హాని కలుగచేస్తూ ఉన్నారు. ఇట్టి కావ్యభాష దేశభాషగా నెలకొల్పవలె నన్న ఉద్దేశముతో గాబోలు వ్యావహారికభాష రూపుమాపి నిర్మూలము చేయుటకు సమకట్టినారు. అట్టిపని వెఱ్ఱిపని; అసాధ్యము. నిరంతరకృషిచే పండితులు మాత్రమే దానిని సాధింపగలరు. వ్యావహారికభాషైతే అందరికీ సాధ్యము. ఈ విషయములో పూర్వుల సాంప్రదాయమే మేలయినది. ఆ సదాచారము ఉద్ధరించుటకు ప్రయత్నించుట పెద్దలకు విహితధర్మ మని మనవి చేయుచున్నాము. అది అట్లుండనీయండి;

## పూర్వముద్రణములు

పరిష్కర్తలు తమ ఇష్టానిష్టములంబట్టి గ్రంథము సవరించి లేని పాఠములు కొన్ని కల్పించుటచేతను, సరియైన పాఠము నిర్ణయించుటలో పరిశీలన చక్కగా చేయక పోవుటచేతను, వింతైన కొత్త తప్పులు కొన్ని పూర్వముద్రణములో కనబడుతున్నవి. మొట్టమొదట ఈ గ్రంథము 1859 సం. లో ముద్రించినప్పుడు, పరిష్కర్తలయిన శ్రీ రేకము రామానుజసూరిగారు సరియైన వ్రాతప్రతులు దొరకకపోవుటచేతను, కొంత మట్టుకు పరిశీలన లోపముచేతను, చాలా తప్పులతో గ్రంథము అచ్చువేయించినారు.* తర్వాతి ముద్రణములవారు పూర్వముద్రణములనుమాత్రమే ఎదుట నుంచుకొని, స్పష్టముగా కనబడిన తప్పులలో కొన్నిటినిమాత్రము దిద్దినారు; గాని, వ్రాతప్రతులను సంపాదించి, జాగ్రత్తగా పరిశీలించి, గ్రంథము తప్పులు లేకుండా అచ్చువేయించినారు కారు. ఇందుకు దృష్టాంతముగా చూడండి:—ఈ ముద్రణములో (పు. 277.) ఉన్న సర్వలఘుసీసము "చిఱుతయగు" అనేది మేము చూచిన వ్రాతప్రతులన్నిటను గలదు; గాని, తొలిసారి గ్రంథము ముద్రింపించినవారికి దొరికిన ప్రతులలో గ్రంథశైథిల్యము చేత కాబోలు, అది కనబడలేదు; గనుక శ్రీ రేకము రామానుజసూరిగారు "కరివరద"

* ఇట్లు గ్రంథమం దున్న తప్పులు చూపించుటచేత గ్రంథమును ప్రకటించినవారు చేసిన మేలు మరచినవార మైనా మని తలచగూడదు.

అనే పద్యము క్రొత్తగా రచించి గ్రంథములో చేర్చినారు. ఈలాగున చేయవలసి వచ్చిన దని వారు పీఠికలో వ్రాసి ప్రకటించక పోలేదు. * ఆ పద్యమే నేటికిని నిలిచి ఉన్నది. ఈ గ్రంథము అనేక పర్యాయములు ముద్రితమైనది గదా! వ్రాత ప్రతులు చూచి ఉన్నయెడల, పరిష్కర్తలలో ఎవ్వరికైనను అప్పకవి రచించిన పద్యము కనబడకుండునా ?

ఈ విధముగానే 1859 సం. లో ముద్రితమైన ప్రతియందు స్పష్టముగా కనబడే తప్పులు తర్వాతి ముద్రణము లన్నిటిలోనున్ను నిలిచి పోయినవి. వాటిలో కొన్ని మాత్రము తార్కాణముగా ఈ దిగువను ఉదాహరిస్తున్నాము:—

1. చాం । ధవ...గయివె ♦ ట్టెన్వెన్ల...III. 61.

అనుస్వార సంబంధయతులకు లక్ష్యముగా ఇచ్చిన ఈ పద్యములో "గయి వెంటన్" అని అప్పకవి మతమున ఉండవలెను; లేనియెడల ఈ లక్ష్యమునకు ప్రయోజనము లేదు.

2. వే । దండమండల చండతుండవి ♦ దారణాసి.........III. 127.

"వే । దండదండవిదారఘోరత♦రాసిభాసి భుజార్గళా" అనే అప్పకవి పాఠము మావద్దనున్న వ్రాతప్రతులన్నిటను గలదు. ఉభయవళులకు ఉదాహరణము లిచ్చునప్పుడు అప్పకవి సర్వసాధారణముగా మొదట స్వరమునకున్ను, తర్వాత వ్యంజనమునకున్ను లక్ష్యములు చూపిస్తున్నాడు. ఈ వేదండ శబ్దములోని దకారము రెంటికిని చెల్లును అని ఈపద్యము స్వరమునకున్ను, దీనితర్వాతనున్న భీష్మపర్వములోని పద్యము వ్యంజనమునకున్ను లక్ష్యములుగా ఇచ్చినాడు. గనుక,

"వే । దండమండల చండతుండ వి ♦ దారణాసి..." అనే పాఠము తప్పు. రెండు పద్యములున్ను వ్యంజనమునకే లక్ష్యములుగా ఇచ్చి, స్వరమునకు లక్ష్యము ఇయ్యకుండునా ?

3. "డిగ్గి తోలంగు సైనికులు ♦ నేలకు..." III. 152.

అనేక శబ్దమునకు లక్ష్యముగా ఇచ్చిన ఈపద్యములో ఆశబ్దమే కనబడనీయక పాఠము మార్చివేసి అచ్చు వేయించుటచేత కవి హృదయమునకు విరుద్ధమయిన పాఠము కనబడుచున్నది. ఈ లక్ష్యమునకు ప్రయోజనము చెడిపోయినది.

4. "ధృతి యందు గలియుగక్షితిపక్షబాహులు" IV. 136.

* 'సర్వలఘు సీసమును బ్రతులలో లేమింజేసి నూతనముగ నేర్పఱుపఁబడియెం.' పీఠిక. పుట ౨. 1859.

ధృతి యనే 18 వ ఛందమందు (బాహు=2, పక్ష=2, క్షితి=1, యుగ=4, గతి=4) 22144 వృత్తము లున్నవని అర్థమగును. ఆఛందమునందు 262144 వృత్తములు కలవు; గనుక, ఈ పాఠము తప్పు. "ధృతియందు గతియుగ క్షితి పక్షరస బాహు..." అని మావద్దనున్న వ్రాత ప్రతు లన్నిటను గలపాఠము సరియైనది.

5. (పుట 214) సప్తమచ్ఛందః ప్రస్తారములో 6-37 వృత్తముల గణము లన్నీ తారుమారయినవి. 1859 సం. ప్రతిలో ప్రమాదవశమున ఈ తప్పు వచ్చి యుండవచ్చును. ఈ అచ్చుతప్పు ఈ చోటనే తర్వాతి ముద్రణములలో కూడా ఎందుకు కనబడవలెను ?

6. (పుట 230) ఏకరూపగణములు.

UUU మ U I I భ I U I జ UU గగము

1859 సం. ప్రతిలోని అచ్చు తప్పు తర్వాతి ముద్రణము లన్నిటను నిలిచి పోయినది; చూచినారా ? ఈవిధముగానే ప్రమితాక్షర గణములు తప్పుగా ముద్రింపించినారు.

7. (IV 403) మనోహర వృత్తమును గూర్చిచెప్పిన వచనములో "ఇది కవితాంత వృత్తవృత్తచ్ఛాయను......" అని ఉన్నది. ఇందులో రెండు తప్పులు కలవు. 'కలితాంత' గాని 'కవితాంత' కాదు. సమవృత్తములలో దీనిపేరు సరిగానే పేర్కొన్నారు. వృత్త అనే పదము రెండుసార్లు ముద్రితమయినది. ఈ తప్పులు తర్వాతి ముద్రణములలో కూడా నిలిచినవి.

8. (IV. 409) ధృతమధ్యగూర్చి చెప్పిన వచనములో

"ఇది తోదకవృత్తిచ్ఛాయను బేసిచరణములను దోదకవృత్తచ్ఛాయను సరిచరణములను నడుచును" అని ఉన్నది. తోదక - దోదక నామములు తారుమారయినవి; గనుక లక్షణము చెడినది.

9. "...ఁబవడగీతియందుఁ । బ్రాసముల్ సమకూఱు
నవియె యాటవెలఁది । యందుఁ గలవు" (IV. 541)

1859 సం. ప్రతిలో శుద్ధ పత్రికయందు "ఁగలవు" అసాధువనిన్ని "లేవు" సాధువు అనిన్ని చెప్పి పరిష్కర్త తప్పు దిద్దుకొన్నా, తర్వాతి ముద్రణములవారు కేవలము మూలములో నున్నదే ఎదుట నుంచుకొని శుద్ధపత్రిక ఉపేక్షించి తప్పు పాఠమునే తీసుకొన్నారు. ఆటవెలఁదిలో ప్రాసము లుండునా అన్న విచారమయినను లేకపోయినది.

10. "అవధరింపుము...పరమమూర్తి
పూతనా..." IV. 548

పరమమూర్తికి బదులుగా 'పరమఘ్నాత' అని ఉండవలెను. లేకున్న పునరుక్తి నియమభంగమగును.

11. "...ఁజేడొకతె చక్రితోసెత్త, మాడె ననఁగ
సంధియగు......" V. 11.

అప్పకవి 'విసంధి, మహావిసంధి, కుసంధి, దుస్సంధి' అనే నాలుగు సంధిదోషములను పేర్కొని, ఈ పద్యము "కుసంధికి" లక్ష్యముగా చెప్పినాఁడు. కనుక, ఈ పాఠము అపార్థకముగా ఉన్నది.

12. "మాను పఱిచెను బులిబోను" V. 25.

'ను' అంతమందు గల పదములలో ద్రుతప్రకృతులు గానివి అప్పకవి ఉదాహరించినాడు. "మాను వరిచేను పులిబోను" అని మావద్దనున్న వ్రాతప్రతులన్నిటను కలదు.

అచ్చుకూర్చిన పనివాండ్లలోపము ప్రతిముద్రణమందున్న ఈ చోటనే రావలెనా ? ఇది కేవలము పరిశీలన లోపముచేతనే వచ్చినది.

13. "పడఁతియబ్రపుటూరు ల, బ్రంపుటూరు
లతివచోద్యపుటూరు చో, ద్యంపుటూరు." V. 128.

ఈ పద్యములో అప్పకవి 'ఊరులు, ఆరు, కౌను, మేను' ఈనాలుగున్ను పేర్కొని, మొదటి చరణమందు, 'అబ్రపుటూరులు' అనిన్ని, రెండవ చరణమందు 'చోద్యపుటూరు' అనిన్ని, మూఁడవ చరణమందు 'సూక్ష్మపుఁగౌను' అనిన్ని, నాల్గవ చరణమందు 'చొక్కపుమేను' అనిన్ని ప్రయోగించినాడు. మొదటి చరణమందు, 'అబ్రపుటూరులు' అని ఉండగా రెండవ చరణమందు, మరల 'చోద్యపుటూరు' అని ఊరు శబ్దమే ఏకవచనముగా ప్రయోగించి ఉండునా ?

14. "జగతిఁ జప్పనికూరకుఁ.........పచ్చని తోఁటకుఁ బచ్చ దోఁట..." (V. 166.)

ఇందులో ఉదాహృతశబ్దములు కకారాది వర్గములలోని ప్రథమాక్షరముల వరుసను పేర్కొన్నట్లు స్పష్టము.

"కూర, చాయ, టోపి, తావి" వీటిని పేర్కొన్నట్లు మావద్ద నున్న వ్రాతప్రతులలో కనబడుచున్నది.

1859 సం. లో ముద్రితమైన ప్రతియందు తమకు తప్పులుగా కనబడ్డ చోట్లనైనా వ్రాతప్రతులు చూడక తర్వాతి ముద్రణములవారు కేవలము తమకు

తోఁచినట్లు సవరించి వింతయిన తప్పులు ఉంచివేసినారు. ఇందుకు దృష్టాంతముగా ఒకటి ఈ దిగువను వివరిస్తున్నాము.

15. 176 "అనుచు నిట్లు భూతాదిక్రియాపదాంతముల విశేషణపదక్రియలను దక్క" అని 1859 సం. లో ముద్రితమయిన ప్రతిలోని పాఠము. ఇందు గణభంగమును మాత్రమే చూచి తర్వాతి ముద్రణములవారు "ములకును విశేషణ పద క్రియలను దక్క" అని వ్రాతప్రతులు చూడక దిద్ది అచ్చు వేయించినారు. ఇందు అన్వయక్రమము చెడిపోయినది. "భావిక్రియలను దక్క" అని ఉండవలెను.

వీటిని బట్టిచూడగా పరిష్కర్తలు వ్రాతపుస్తకములు పరిశీలించక కేవలము 1859 సం. లో ముద్రితమైన ప్రతినే ఆధారము చేసుకొన్నట్లు స్పష్టముగదా.

పూర్వముద్రణములలోని తప్పులు - పాఠకులు సులభముగా విమర్శించుకోదగినవి - ఈ క్రింద పేర్కొని చూపిస్తున్నాము.

పీఠిక. పద్యసంఖ్య.
10 దరహాసమానసము
64 విశ్వశ్రేయయనుచు
71 తమ్ములను పేరునసె
74 విద్యప్రస్తుతమగుచుండ
103 ఇందోపలనీలునకు
I. 4 పిన్నకోటపెద్దన
33 అశ్లిష్టాభిధానమునకు
40 కరపరిణాత
71 కాళహస్తిమహాత్వము
98 కుక్కగోళము బవి
99 (మీదను) త్రిలింగదేశ తద్భవము
II. 15 ఇమ్వక్ర
39 దానిమొదలైనతలకట్లు వాని సెల్ల
43 పద్యాదిప్రాణంబుల, నాద్యంతస్థములుగాను
132 భూమిని మింటను జంచతావ మర
135 వ్యర్థకృతులను
426 దుష్టచంద్రోపబలములు

పీఠిక. పద్యసంఖ్య.
III. 55-(బోలనార్యులను 60 మంత్రియయ్యెనినకొండర్క
IV. 75 (తర్వాత) అష్టగణలక్ష్యంబులు (అప్పకవి లక్షణము చెప్పబోవుచున్నాడు)
(పు. 213) (ఆఅవఛందమునకు ఇచ్చిన ప్రస్తారములో 31 వ వృత్త గణములు) I I I I I U (U I I I I U అని ఉండవలెను)
387 పదునొకంటః ద్రిష్టుప్ఛందస్సు (పదునొకండవ అని ఉండవలెను)
391 'ఇది పదుమూఁడవ జగతీ ఛందమునందు' (13 వ ఛందము అతి జగతి గాని జగతి కాదు)
526 పోరులో
V. 148 భర్మవస్త్రాభిదానుర

ఛందోభంగము లయినను కానిసారు కారు. చూడండి:—

I. 33. సీ. పా. వతులు జాతి స్వభావంబు ననఁగ.

ఇందు 'తి' గురువు కాదు.

38 (పంక్తి 8) సీ. పా. వరనవస్థాయి భావముల్లో నొగిఁ జెప్పినదల్లియె భావాదిరంజనముల

ఇందు యతిభంగము.

39 (పంక్తి 10) జనుకావ్యములగని నవబ్రహ్మ[illegible]

ఇందు యతిభంగము.

III. 172 సీ. పా. తరుణులుఁ బతులు వా తోయనమ్ములనల్లమల్లకలై పేఁ బోక హులయ పవను

ఇందులో గణభంగము.

305 "మూఁకలు విరియించి పీఁక" 'మూఁకలు' అనే పదములో అర్ధానుస్వారము ఉండవలెననియే మాకును తోచుచున్నది; గాని, అప్పకవి మతమున లేదనుట స్పష్టము. ఉన్న దని అతడు ఎరిగి ఉన్నయెడల ఖండాఖండప్రాసములకు ఇది ఉదాహరణముగా ఇచ్చి ఉండడు. గనుక, ఇక్కడ ఈ పదము అర్ధానుస్వారము లేకుండానే అచ్చు వేయించవలసి ఉండెను. 1910 సంIIలో వావిళ్లవారు ముద్రించిన ప్రతిలో ఈచోట (ఇది పొరపాటు) అని ఉన్నది. కాని, ఏది పొరపాటో తెలియజేయలేదు.

IV. 74 మృగములలోఁ గరి ద్వేషిభాతిని జూడ—

ఇందు యతిభంగము.

IV. పుట 243 (ఫ్యాహారములో) 'బుభుక్షుసూనుం' అని 1859 వ ప్రతిలోను, 'బుభుక్షుసూను' అని తర్వాతి ముద్రణములందును కలదు. అన్నిటను గణభంగము.

IV. పుట. 245 ఖచరప్లుతములో శాల్గవ చరణము "ర్యమవిరామము తోదనభామ్న స్వల్......"

ఇందు యతిభంగము.

IV. ప. 407 "ందులకా జరజ్రగంబులుకా గుదిరింపఁగా"

గణభంగము; యతిభంగము.

IV. 431 ప్రథమమునను వృత్తము—ఇందు ప్రాసభంగము.

506 బూఁకిగొడ్రాలికిఁ బుట్టుకానుపువలన—ఇందు గణభంగము.

515 "ధర్మముఁజెప్పి దుష్కృతుల డగ్గఱ" దడలకు మైత్రి అగ్రాహ్య మని చెప్పిన అప్పకవిమతమునకు విరుద్ధము గనుక యతిభంగము.

IV. 128. "నారశక్తిత్రయోపేతుఁడై మురారి" ఈ సీసపద్యమందు ప్రాసయతి నియమము కలదు గనుక, ఈ పాఠము లక్షణ విరుద్ధమయినది.

539. "ధరణిఁ బ్రాసంబు దనరు నెత్తుగీతియందు" రెండవ చరణము. గణభంగ మయినది.

V. 71. తే. గీ. కాంతులారమేము చూడఁ గలమనంగ—గణభంగము

అర్థవిచారము సరిగా లేకపోవుటచేతను కలిగిన ప్రమాదములు చూడండి:—

I. 39 (పంక్తి 14) "శ్లోకము" విషయము అష్టరసములగురించి గనుక, ఇది అసంగతము. "శోకము" అని ఉండవలెను.

II. 196-197 రేఫభేదముల గురించి చెప్పిన సీసమాలికలందున్న అర్థముల పట్టికలలోనున్న తప్పులు మెండుగా ఉన్నవి. కొన్నిచోట్ల మాలికలలోని మాటలు అర్థముల పట్టికలలో కనబడవు.

మాలికలో "—ఁగరిచెలిగరిగె" అనిన్ని, అర్థముల పట్టికలో 'గరిచెడిగరిగె" అనిన్ని ఉన్నది. రెండుచోట్లను "గరిచేడిగరిగె" అని ఉండవలెను.

"చేరుద్రావుట చూరి చిన్నకత్తి" ఇదియే సరియైన పాఠము. 'చేరు' అపశబ్ద మనుకొని కాబోలు 'చారు' అని దిద్దినారు. అందువల్ల యతిభంగమగునని "చారు ద్రావుట చిన్నచూరికత్తి" అని పాదమంతా అసంగతమయేటట్లు దిద్దినారు. 'చూరి' అంటే, 'చిన్నకత్తి' అని అప్పకవి ఉద్దేశము. అర్థముల పట్టికలో మాత్రము సరిగానే ముద్రించినారు.

"తరము బడిత" అంటే, అర్థముకాక కాబోలు "తరముబలత" అని దిద్దినారు. అర్థముల పట్టికలో మాత్రము సరియైన పాఠమే ఉంచినారు.

"మరులు మోహము; బుద్ధి మరుపుట" అని ఉండవలెను. అర్థము తిన్నగా చూచుకోక "మరులు మోహపుబుద్ధి—" అని అచ్చువేయించినారు.

అర్థముల పట్టికలో "మేఁకెరువు = మేఁకవెండ్రుకలు" అని అచ్చు వేయించినారు. 'మేఁకెరువు' అంటే 'మేఁక పెంట్రికలు' అని అప్పకవి ఉద్దేశము. 'పె' 'వె' వలె లేఖకులు వ్రాసి ఉందురు. అర్థము గ్రహించక, 'వెంట్రుకలు' అని చదువుకొని

శబ్దసౌష్ఠవమునకై 'వెండ్రుకలు' అని పరిష్కర్తలు దిద్దినారు. అందువల్ల 'ఎరువు' అంటే, 'వెండ్రుక'లయినది !!

II. 197 "ఉఱుపదంబెల్లెడనురుశ్లరార్థ" అని ఉంటే, అర్థము చక్కగా చేసుకోక, "ఉఱుపదంబెల్లెడ నుఱుతపిల్ల" అని అచ్చువేయించినారు. అర్థముల పట్టికలో మాత్రము సరియైన పాఠము కలదు.

'తిఱుగలి' అని 1859 మొదలుకొని పూర్వముద్రణము లన్నిటను కలదు; కాని, ఈ శబ్దములోని రేఫము శకటరేఫము కాదు.—ఆశబ్దమునకు బదులుగా అక్కడ 'తుఱుఁగలి' అని ఉండవలెను. అర్థముల పట్టికలో మాత్రము ఈమాట కన బరచినారు.

II. 372 తర్వాత నున్న శారదాదర్పణ శ్లోకములో మూడవ చరణమందు "యవౌ" అని ఉన్నది; దానిక్రింద నున్న టీకలో "యవర్ణలవర్ణములు" అని ఉన్నది. పాఠకులు ఏది ప్రమాణముగా తీసుకొని ఆచరించవలెనో స్పష్టముగా తెలుసు కోక పోయినయెడల, మాతృకార్చనము దుష్టమయి హాని సంభవించునేమో !

III. 121 ఉభయవళులలో అప్పకవి పేర్కొన్నది నామాఖండ యతిగాని నామకఖండయతి కాదు. తక్కినచోట్ల ఈ పేరు సరిగానే ముద్రింపించినారు.

IV. 104 "మహీనధినాయకురాశి
గ్రహమును గృతిముఖగణోడు • రాశిగ్రహముల్
మిహిరేందులు దమగతిలో
సుహృత్తులై యున్న సరియ • చుట్టము గాదే."

అని 1859 సం. మొదలుకొని పూర్వముద్రణములందు కలదు; గాని, అర్థము పొసగదు.

IV. 112. "శాంతంబునకుఁ జెల్లు నెనిమిదియును" ఇందు అర్థము చెడినది. తక్కిన రసములకు పగలుగానో వైరముగానో ఈసుగానో ఉన్నవి శాంతరసమునకు చెలులు, అని అప్పకవి ఉద్దేశము.

142. "పాదవులును నడ్డవరుసలు పొసఁగనిలుప" ఇందు అర్థము పొసగదు. టీకలో మాత్రము 'పాదవునకు' అని సరిగా ఉంచినారు.

IV. 116. "విషమంబులనుబోలి వెలయ మఱొక్కటిం గలిపి" అర్థము చెడినది. బేసి సంఖ్య అయితే అర్థించుటకు పాలుపోదు గనుక, మరి ఒకటి కలిపి అర్థించవలెను అని అప్పకవి ఉద్దేశము. టీకలో 'పాలు' అనే ఉంచినారు.

ఇవి కాక, నాల్గవ ఆశ్వాసములో ఏయేవృత్తములు ఏయే ఛందములలో ఎన్నవ వృత్తములయి ఉన్నవో తెలియజేసే సంఖ్యలు చాలాచోట్ల తప్పుగా ఉన్నవి. అవి అన్నీ ఈప్రతిలో సవరించడమైనది.

పూర్వముద్రణములలో అనవసరముగా చేసిన దిద్దుపాట్లు

| పద్యసంఖ్య. | పూర్వముద్రణములలోని పాఠము. | వ్రాతప్రతులనుబట్టి ఈ ముద్రణములో ఉంచిన పాఠము. |
|---|---|---|
| పీ. 20 | నినుంగరంప | నినుంగరంచ |
| 21 | పట్టియుం | పట్టుక |
| 47 | నుడువు తేనుఁగులు | నుడువు తెఱఁగులు |
| 76 | వారెవ్వరనిన | వారెవ్వరంటేని |
| 88, 89 మొ. | ఆంధ్రము | అంధ్రము |
| II. 8 | పిల్లగుడి | పిల్లగుడుసు |
| 149 | దాయఁబోయి | దాయదోయ |
| | డాయఁబోయి | డాయడోయ |
| 263 | అధోవర్ణములకు | అధోర్ణములకు |
| 265 | వలమైనకోకు | వలమాటికోకు |
| 271 | ప్రాణవర్ణములు | ప్రాణార్ణములు |
| 285 | ఉత్తరాషాఢనుండి | ఉత్తరాషాఢనుంచి |
| 319 | నక్షత్రరాశినుండి | నక్షత్రరాశినుంచి |
| 370 | త్రాడు | తాఁడి |
| 383 | తెలిసియు | తెలుసుక |
| V. పుట. 250, (బంధురవృత్తములో) | ప్రంతకు | వాగుకు |
| IV. 518 | చేర్తునింక | చేర్చితింక |
| 529 | ఏగుదెంచితా | ఏఁగుదెంచితా |
| V. 97 | ఆడాద | ఆడాడి. |

గ్రంథము సంస్కరించినవారికి కొన్ని శబ్దముల స్వరూపమున్ను అర్థమున్ను చక్కగా తెలియకపోవుటచేత అనవసరమైన దిద్దుపాట్లు కొన్నిచోట్ల చేయవలసివచ్చినదని తోచుచున్నది.

'అర్ణము' అనే శబ్దమును ఎరిగిఉన్నయెడల వ్రాతప్రతులన్నిటను అది కన బడుతూ ఉంటే 'వర్ణము' అని దిద్దవలసిన అగత్యమేమి? II. 263 లో "జడ్డలుగల మాతృక తొలి, నిడ్డనఘోర్ణముల కెల్ల నేటికి మీదక" అని వ్రాతప్రతులలో పాఠము ఉండగా, అర్ణశబ్దమునకు బదులుగా వర్ణశబ్దము దూర్చి, అట్లు చేయుటచేత కలిగే ఛందోభంగము తొలగించుటకై పాదము మార్చి ముద్రింపించవలసిన అగత్యమేమి? ఆమార్పువల్ల "ఎల్ల" శబ్దముయొక్క అర్థవిశేషము అడుగంటినది,

ఈలాగుననే II. 271 లో "ప్రాణార్ణములుఁ బది+యాఱును..." అని ఉండగా వర్ణశబ్దము దూర్చుటకై విశ్రమాక్షరము మార్చి "ప్రాణవర్ణములును+బది యాఱు" అని దిద్దివేయవలసిన అగత్యమేమి? ఈ దిద్దుపాటువల్ల సముచ్చయార్థక మైన ద్రుతము ఉచితమైనచోటలేక అర్థము చెడినది.

పిల్లగుడుసు (II. 8) అపశబ్దమనుకొని 'పిల్లగుడి' అని దిద్దడము శబ్దస్వరూపము తెలియకనే కదా. 'గుడుసు' అనేటందుకు శ్రీనాథుని ప్రయోగము చూడండి:— "గుడుసైన భూవింటఁ." (నైషధము.) 'గుడుసుకయిదువు' అంటే, విష్ణుచక్రము. (చూ. శ. ర.)

"నుడువు తెఱఁగు" లంటే అర్థము సరిగా గ్రహించక, కవి హృదయమునకు భిన్నముగా, "నుడువు తెనుగులు" అని దిద్దినారు.

వారెవ్వరంటేని, ఏగుదెంచితే—ఇటువంటి రూపములు గ్రామ్య ప్రయోగ ములుగా భావించినారు కాబోలు. భారతములో 'అది యెట్లంటేని' మొదలయిన ప్రయోగములు అనేకముగా ఉన్నవి. వీటిలోని క్రియారూపమును మధ్యమపురుషైక వచనముతో అన్వయించును.

పట్టుక (పీ. 21) వంటి క్త్వార్థకరూపములు జైమినిభారతము, భాస్కరరామా యణము, ఆముక్తమాల్యదవంటి ఉత్తమగ్రంథములలో కనబడుచున్నవి. అప్పకవి నాటికి ఇవి సాధురూపము లయిఉన్నవి; అప్పకవి చాలాచోట్ల ప్రయోగించినాడు. తక్కినచోట్ల దిద్దక విడిచి ఈ ఒక్కచోటను దిద్దుటవల్ల ప్రయోజన మేమి?

ఆడాడి (V. 97) లో క్త్వార్థకేకారసంధి ఏర్పడినదని దిద్ది 'ఆడాడ' అని ముద్రింపించినారు. ఆమ్రేడితసంధులకు ఉదాహరణముగా ఇచ్చిన ఈపద్యములో "నందుకట్టి" అచ్చటచ్చట "అడి+అడి" అని అర్థమిచ్చునట్లు సందర్భానుసారముగా అప్పకవి వ్రాసినాడు. అది చూడక క్త్వార్థకేకారసంధి తొలగించడమే ముఖ్యప్రయో జనముగా భావించి 'ఆడాడ' అని దిద్దుటవల్ల అర్థము చెడినది. క్త్వార్థకేకారసంధి అప్ప

కవికి సమ్మతము కాదు. (చూ. V. 82, 83) అయినా, ప్రమాదముచేత కాబోలు రెండుచోట్ల ఈసంధిచేసినాడు; "గుర్తెఱిఁగిష్టంబుగ. (IV. 506)" నెఱవెఱిఁగొదిగి. (IV. 531) వీటిలో IV. 506-వ పద్యమందు అప్పకవి మతమునకు విరుద్ధముగా ప్రాసములందు రేఫశకట రేఫల సాంకర్యముకూడా కనబడుచున్నది. వ్రాతప్రతులలో గాని పూర్వముద్రణములలో గాని పాఠాంతరము లేదు. ఇది కేవలము ప్రమాదజనితమై ఉండును.

1859 సం.లో ఈగ్రంథము తొలిసారి ముద్రితమైనప్పుడు పరిష్కర్తలు గ్రంథము తుదను శుద్ధపత్రిక చేర్చి అందులో "ఇవ్వరు" అసాధువుగాను "ఇయ్యరు" సాధువుగాను చూపించినారు. 'ఇవ్వరు' అనేరూపము పరిష్కర్తల బుద్ధికి అసాధు వని తోఁచినా, అప్పకవికి సాధురూపముగానే తోఁచినట్లు స్పష్టముగా కనబడుచున్నది. ఎందుచేతనంటే, రేఫాక్షరసీసమాలికలో రేఫములకు పూర్వమందున్న వర్ణములు అకారాదిగా వరుస ఏర్పడునట్లు అప్పకవి రేఫములుగల పదములను పేర్కొన్నాడు.

"దేవర వివరంబు తెరువరి తలవరి యెవ్వరు నివ్వరు నవ్వరనఁగ" ఈక్రమాన ఉన్న పదములలో అప్పకవి "ఇయ్యరు" అని ప్రయోగించి ఉండునో, "ఇవ్వరు" అని ప్రయోగించి ఉండునో చదువరులు సులభముగా ఊహించగలరు.

ఆ శుద్ధపత్రికలో కొన్ని సాధురూపములు అసాధువులుగాను, అసాధురూపములు సాధువులుగాను కనబరచినారు. "జనకునిఁ గొల్వ" ఇందులో అర్ధానుస్వారముండవలెనని పరిష్కర్తలు తలచినారు గాని అది తప్పు, అప్పకవి నిషేధించినాడు (చూ. V. 142)*

'అవియెయ్యవనిన' అసాధువుగాను 'అవి యెయ్యెవనిన' సాధువుగాను చూపించినారు; వారు అసాధు వని తలచినరూపమే సాధురూపము 'అవి+ఏ+అవి' అని అర్థము. ఇటువంటి తప్పులు ఆశుద్ధపత్రికలో ఇంకా అనేకముగా కలవు. 'సుఖకర అసాధువట! "సుకకరః సాధువట! 'దోదకము' అని వృత్తనామము 'దోధకము'† అని ఉండవలెనట!

## పూర్వముద్రణములలోని గ్రంథచ్యుతులు.

మాకు దొరికిన వ్రాతప్రతులున్ను పూర్వముద్రణములున్ను ఎదుటనుంచుకొని పరిశీలించగా, పూర్వముద్రణములందు చాలాచోట్ల గ్రంథము త్రుటితమయిపోయినట్లు

---

*ఈముద్రణములో V. 142 పంక్తి. 2.లో—'సంతకునిఁ జేర్చి' అని ఉన్నది. ఇందున్న అర్ధానుస్వారము అచ్చు తప్పు. (కి) †దోధక మనుపేరే సరియైనది. సంస్కృతవృత్తరత్నాకరాదులలో 'దోధకము' అను పేరే గలదు (రా).

స్పష్టమయినది. సాధ్యమయినంతమట్టుకు పోయిన గ్రంథము సంపాదించి ఈప్రతిలో చేర్చినాము. అప్పటికిన్ని, (ఓ) ప్రతి జాగ్రత్తగా పరిశీలించేసరికి ఈ గ్రంథము అచ్చు పడిపోయినందున ఈముద్రణములోకూడా కొన్నిచోట్ల ఇంకా లోపము లున్నవి; అయితే వాటిలోనివి కొన్ని "పాఠాంతరములు" అనే శీర్షిక క్రింద చూపిస్తున్నాము.

ఈదిగువను వివరించిన స్థలములలో పూర్వముద్రణములందు గ్రంథము పోయినది. అది పూర్వముద్రణములున్ను ఈముద్రణమున్ను ఎదుట నుంచుకొని చూచిన యెడల మేము చెప్పినది స్పష్టముగా తేటపడగలదు.

*I. 5, 83, 85, 96, 114, 134.

II. 172, 173, 196, 196, 197, 204, 219, 302, 305, 308, 325, 345, 358.

III. 103, 104, 107, 115, 121, 169, 186, 226, 231, 242, 257.

IV. 24, 45, 67, 375, 481, 498, 511 వీటిలో కొన్ని మాటలు, వాక్యములు పోయినవి.

ఈ దిగువ వివరించిన స్థలములందు పద్యములే పోయినవి.

I. 16-18 : 18-వ పద్యములోని నాల్గవచరణము 16-వ పద్యములో 5-వ చరణముగా పూర్వముద్రణము లన్నిటను ఉన్నది; 17-వ పద్యమున్ను 18-వ పద్యములో మొదటి మూడు చరణములున్ను కనబడవు. అందువల్ల అర్థము పొసగదు.

I. 102 తర్వాత తుల్యాతుసమా అనే సూత్రమున్ను 103-వ పద్యమున్ను పోయినవి.

II. 235 తర్వాత ఒక వచనమున్ను కవిజనాశ్రయమునందలి పద్యమున్ను.

II. 304 తర్వాత ఒక శ్లోకమున్ను, ఒక పద్యమున్ను (ఓ. ప్రతిలో 6 శ్లోకములు, ఒక చక్రము, ఒక పద్యము కలవు.)

IV. ప్రమాణి, స్రగ్ధర పద్యములు.

IV. 187 తర్వాత. "మఱియు వ్యత్యస్తోపజాతి" అనే శీర్షిక, దాని తర్వాతిపద్యము, దాని దిగువనున్న వచనము.

---

* అంకె క్రింద గీటు ఉన్నయెడల, 'ఆసంఖ్యగల పద్యమందుగాని వచనమందు గాని,' అనిన్ని లేనియెడల, దాని తర్వాత అనిన్ని అర్థము.

IV. 511, 498 లో 5 చరణములు, 554, 409 ఇవికాక, బంధ కవిత్వమునకు సంబంధించిన గ్రంథమంతా విడిచిపెట్టినారు.

కొన్నిచోట్ల గ్రంథచ్యుతివల్ల విషయసందర్భము చెడినది చూడండి:—

II. 114 తర్వాత "మార్కండేయ పురాణమునందు" అని లేకపోవుటచేత 115-వ పద్యము ఏగ్రంథములోనిదో తెలియదు.

II. 139 తర్వాత "విజయవిలాసమునందు" అని లేకపోవుటచేత 140-వ పద్యము ఏగ్రంథములోనిదో తెలియదు.

II. 163 తర్వాత "కర్ణపర్వమునందు" అని లేకపోవుటచేత "సార వంతమై..." అనే పద్యము ఏగ్రంథములోనిదో తెలియదు.

II. 202—'పరిగొనుటకు' అనే శీర్షికయున్ను, దాని తర్వాత ఉదాహరణ మునకుగాను విడిచిపెట్టవలసిన చోటున్ను కనబరచక "పరిగొనుట, పరిచను దెంచుటకు విరాటపర్వమునందు" అని అసంగతముగా ముద్రించినారు.

III. 197 తర్వాత, "లక్షణసారసంగ్రహమునందు" అనే శీర్షిక దిగువను— ఆ లక్షణగ్రంథములోని పద్యమున్ను, దాని తర్వాత "నిర్వచనోత్తర రామాయణము నందు" అనే శీర్షికయున్ను విడిచి, "ఎఱుఁగవు గాక" అనే పద్యము ముద్రించుట చేత, ఈపద్యము లక్షణసారసంగ్రహములోని దని భ్రమపడుటకు అవకాశము కలుగు చున్నది.

IV. 418 తర్వాత మధురవృత్తలక్ష్యలక్షణపద్యము విడిచి దానిగురించి చెప్పిన వచనము ముద్రించుటచేత, ఈ వచనము ఉద్ధతము గురించి చెప్పినదని భ్రమపడుటకు కారణమైనది.

## అర్ధానుస్వారము

'వాఁడు' వంటి కొన్నిమాటలలో అర్ధానుస్వారము ఉండవలెనని అందరున్ను అంగీకరించి ఉన్నారు. 'మూఁడు' వంటిమాటలలో కొందరు పండితులు మొన్న మొన్నటివరకున్ను లేదని వాదించినారు. శబ్దరత్నాకరములో "మూఁడు"ను గురించి, "ఇది సార్ధబిందుకమగుటకుఁ గవిత్రయము వారి ప్రయోగములయందుఁ దగిన యుదా హరణములు దొరకమిగాక యిది బహువచనమున మూళ్లని వ్రాఁబడుచున్నది" అని బ॥ సీతారామాచార్యులంతటి పండితులు తప్పువ్రాసినారు. నేడు, "మూఁడు"లో అరసున్న అందరున్ను అంగీకరించినారు; వ్రాతప్రతులు చూచినవారికి ప్రతిగ్రంథము లోను కనబడకపోదు. అరసున్న లేకుండా 'ఏఁగు' అనే మాట వ్రాతపుస్తకములో కన

బడదు. వైకృతి చంద్రికలో వాసుదేవపండితుఁడు, "ఏంగచనాప్రతిష్ఠతే" అని బిందువు విధించినాడు. అప్పకవికూడా II-116 లో "అఁగ లోఁగను వీఁగను, డాఁగ నేఁగ వాఁగ" లో చిన్న బొట్లున్నవని చెప్పినాడు. అయినా, కొందరు 'ఏఁగు' లోని బిందువు ఇంకను విడిచిపెట్టుతున్నారు. తూఁపు, పోఁతు; కలఁగుఁడు, అనవుఁడు, నావుఁడు, అనుఁడు మొదలయిన కొన్ని శబ్దములలో అరసున్న ఉండవలెనని అనేక పండితులకు ఇప్పటికిన్నీ తెలియదు. 'తూఁపు' లో అరసున్న ఉన్నదని, ఉదాహరణముగా ఇచ్చిన II-32-వ పద్యములో, అప్పకవి స్పష్టముగా చెప్పినా, 1859 లో ముద్రితమయిన ప్రతిలోను, దానిని చూచి ముద్రించిన తరువాతి ప్రతులలోను, 1910 లో ముద్రితమయిన ప్రతిలోకూడా, ఆపద్యములోనే ఆమాటో అరసున్న లేకుండా పరిష్కరించినారు! శ. ర. లో అది అరసున్న లేకుండానే ఉన్నది. భారతములోనయినా, పరిష్కర్తలు ఆమాటలో నేటికిన్నీ బిందువుంచలేదు. తాటాకుపుస్తకములలో స్పష్టముగా బిందువు కనబడుతూనే ఉన్నది. "పోఁతు" లో అప్పకవి అరసున్న ఉంచినాఁడు. (II-195) సీసమాలికలో "పోఁతు కటిమేఁక" అని ఉన్నది. తాటాకు పుస్తకములలో చాలాచోట్ల 'అఁబోఁతు' అని ఉండడము చూచినాము. (చూ. భీష్మ. I-133 స్త్రీపర్వ. II-117. మొదటిదానిలో 'బో' తర్వాత అరసున్న అచ్చుపుస్తకములో కూడా ఉన్నది.) అయినా, పండితులకు భ్రమ వదలదు. మ॥ కొమర్రాజు వేంకటలక్ష్మణరావుగారి వంటివారు మొన్న 'శివతత్త్వసారము' పరిష్కరించినప్పుడు వ్రాతప్రతిలో (చూ. 416-వ పద్యము)—'నాబోఁతులు' అని ఉన్నా శ. ర. ప్రమాణముగా గ్రహించి బిందువుపేక్షించినారు * కలఁగుడు, కలంగుఁడు, కలఁగుండు—ఈ రూపములు తాటాకు పుస్తకములలోను, తొలుతటి అచ్చుపుస్తకములలోను ఉన్నవి. అనుఁడు(III-159,373),అగుఁడు(III-166) బిందువుతో (ఈ గ్రంథములోనే) వ్రాతప్రతులందు ఉన్నవి. ఈ ముద్రణమందున్న పొరపాటున విడిచిపెట్టడమయినది. శుద్ధపత్రికలో చూపించినాము. 'అవుండోరసః' అని వైకృతి చంద్రికలో వాసుదేవపండితుడు చెప్పినాడు. పూర్వము ముద్రించిన భారతములోను వ్రాతప్రతులలో చాలాచోట్లను ఇట్టి శబ్దములందు బిందువు చూచి ఉన్నాము.

---

*ఆంధ్రపత్రిక—ఉగాది సంచిక: (దుందుభి)లో శ్రీ శతావధానులు శేషాద్రి రమణకవులు ప్రకటించిన "ఆనవేముని ఉప్పాగల్లుశాసనము" నందున్న 'వెలంగ' శబ్దమునుగురించి, "పృథగ్వాచకమైనప్పుడు సార్ధబిందుకము కాదు" అని వ్రాసినారు. శ. ర. లో సార్ధబిందుకమైనందుకు ప్రమాణమున్నది. అర్ధానుస్వారవివేక మిట్లున్నది.

అయితేనేమి ? మరికొంతకాలమువరకూ పండితులు ఈ మాటలలో బిందువు పెట్టరని తోచుచున్నది. మ॥ లక్ష్మణరావుగారుకూడా శివతత్త్వసారము వ్రాతప్రతిలో కనబడ్డ 'పసుచుఁడు' (479) అంగీకరించి, 'దొరకొనుఁడు' (406) నిరాకరించినారు. (160) లో 'ఆనవుఁడు' అని వ్రాతప్రతిలో ఉన్నదేమో ? పాతవ్రాతప్రతులలో ఉన్నట్టు భారతాదిగ్రంథములు అచ్చుపడితేనే కాని, అర్ధానుస్వారవివేకము నిశ్చయముగా ఏర్పడదు. ఇట్టిస్థితిలో మేము ఈ విషయము ఉపేక్షించుట నిందార్హము కా దని నమ్ముతున్నాము. దీర్ఘముమీదిదిగానీ, హ్రస్వముమీదిదిగానీ అరసున్న మొదట నిండుసున్నే. నిండుసున్న అరసున్న కావచ్చును. చేంతాడు, పూంచు, త్రేంచు, అంబోఁతు, దాంగుండు, తాంబేలు అని మనలో కొందరు ఇంకా వాడుతున్నారు. ఒకొక్క మండలములో ఒకొక్క కాలమందు కొన్ని శబ్దములలోని నెరసున్నలు అరసున్నలయినట్టు వ్రాతప్రతులలో కనబడుతున్నది.

## ఆదేశములు

ఇవికూడా ఇంకా నిశ్చయించ శక్యముకాక ఉపేక్షించడమైనది. మా విచారణలో ప్రాచీన గ్రంథములందు గసడదవాదేశము రావలసినచోట్ల నిత్యమైనట్టే కనబడినది. ప్రథమమీదను, సంఖ్యార్థక శబ్దములమీదను తప్పక రావలసినట్టే తోచినది. 'శ్రీవాలింప,' 'శ్రీసిగురొత్త,' 'ఒండుగడ,' 'ఎంతగుమతులయిన' మొ॥ వాటిలో వైపరీత్య మేమీ లేదు. * పూర్వకాలమున అట్టివాడుక సర్వసామాన్యము. ఉదా॥ పదిగోటులు, ఒండుసోట, ఇరుదెఱఁగులు, వేవణములు, అంతగాలము, పెద్దగాలము; ఎటవోయె, ఎందువోయె, వేసేతులు, ఇంతసలము, కొంతదడవు, ఇంతవట్టు. ఈ ఆదేశము రానిచోట్లు కొన్ని నియతమై ఉన్నవి. ఉదా॥ క్త్వార్థకముమీద రాదు. తిమ్మకవి ఇందుకు విరుద్ధముగా ఉదాహరించిన "క్రూరాత్ముం, డై సీర లాలిచి......"అనే ప్రయోగము స్త్రీ పర్వము II. 56 లోనిది. ఆనందముద్రణములోగాని, వావిళ్లవారి ముద్రణములోగాని, వ్రాతప్రతులలోగాని ఈ పాఠము లేదు. "క్రూరాత్ముం, డై సంకలేక" అని ఉన్నది. పెద్దనాద్యర్వాచీనుల వాడుకలో కొంతభేద ముండవచ్చును.

## శకటరేఫము.

లాక్షణికులు పెట్టిన చిక్కులు విడదీసి, ఏ కవి ఏ శబ్దములో ఏ రేఫము వాడినాడో తెలుసుకొని, రేఫభేదములు నిర్ణయించుట బ్రహ్మకైనా సాధ్యమగునో కాదో ? అది శబ్దముల వ్యుత్పత్తినిబట్టి పండితులు నిర్ణయించవలసి ఉంటుంది.

---

* చూ. శ్రీరాజరాజనరేంద్ర పట్టాభిషేకసంచిక పు. 126 కడపటి పంక్తులు

## శబ్దరూపములు.

ఒక శబ్దము సరళాది అనిగాని, పరుషాది అనిగాని, అకారమధ్యమనిగాని, ఇకార మధ్యమనిగాని, ఉకారమధ్యమనిగాని నిర్ణయించుటకు లెస్సగా విమర్శ చేయవలెను. అట్టి విమర్శ చేయుటకు సరియైన పాఠముండవలెను. భారతాది గ్రంథములు పూర్వ కాలపు వ్రాతప్రతులలో ఉన్నట్లు అచ్చుపడేదాకా ఈ పని నెరవేరదు. 'తలుఁగు' 'తలఁగు' లలో ఏది సాధువో చెప్పలేము. ఇట్లే 'నడచు' 'నడుచు'; 'కలయు' 'కలియు'; 'సొరది' 'సొరిది' మొదలయినవి అనేకము ఒక్కొకకాలమందు ఒక్కొక్క లాగున ఉన్నవి. భారతాదిగ్రంథములలో రాయడి, రాయడించు, వినుపించు, కను పించు, ఎఱుంగించి, అగుల్చి, నిగుడించి, మగుడి, వెలుంగించి మొదలయిన శబ్దములు తాటాకులమీదను, మొదటి కూర్పులలోను కనబడుతున్నవి, కాని ఇప్పటి అచ్చులో కానరావు. మొన్నమొన్న అచ్చుపడిన చంద్రభానుచరిత్రమందైనా మాతృకలో నున్నట్టు ఇట్టి శబ్దములు లేవు. ఇట్లు కొన్ని అపశబ్దములు అచ్చుపడ్డ గ్రంథములలోనికి చొచ్చినవి. అందుండి నిఘంటువులలోనికి ఎక్కినవి. 'రావడు', 'క్రొత్తడి' అనే శబ్దములు భాషలో లేవు. 'ప్రైవడు' 'కొత్తడి' అని ఉండును. ఇందుకు ప్రమాణములు ఇక్కడ చెప్పుటకు వల్లపడదు. వాడుకలో లేని ప్రాచీన కావ్యభాషాశబ్దముల సాధు త్వము, అసాధుత్వము నిశ్చయముగా విమర్శించుటకు తగిన ఆధారములు సమకూరేవర కున్ను ఆ భాషలో గ్రంథములు రచించేవారు అపశబ్దాలు వాడి గుజగుజలాడుతూ గజిబిజిపడక తప్పదు.

## అప్పకవి పొరబాట్లు.

"కాళిదాస మయూరాది కవులకైనఁ
గలవు తప్పు లనంగ నన్యులకు లేవె?
దిద్దఁదగు పట్ల దిద్దుఁడు దిద్దరాని
యెడల నానేరములు క్షమియించు టొప్పు." (పీ. 28)

అని అప్పకవి చెప్పినాడు; గనుక, అతఁడు వ్రాసిన విషయములందు కొన్ని అంశములు ప్రమాదజనితములేమో అని మాకు తోచినది. వాటిలో కొన్ని ఈ దిగువను వివరిస్తున్నాము.

### I. కేవల ప్రమాదజనితములు:—

పీ. 70 వరగుణాస్థాని శ్రీభరద్వాజమాని.

III. 322 "లకారశ్లిష్టమునకు" అని ఇచ్చిన రాఘవపాండవీయమందలి పద్యములో ఌకారశ్లిష్టమైన 'క్లృప్త' అనేపదము కలదు గాని, లకారశ్లిష్టమైన పదము లేదు.

IV. 106 విమదుగ్ధయుగ్మకుచయై.

II. వ్యాకరణవిషయములు:—

I. 118 మదిరాక్షీచెవులు.

ఈ పద్యములోని విషయములు "తెలుఁగు" అనే మాస పత్రికలో ఎక్కువగా చర్చింపఁబడమయినది. (చూ. సం. I. సంచికలు 7, 8, 9, 10—ఆంధ్రపండిత భిషక్కుల భాషాభేషజము I. 21-51) ఇందులో అప్పకవి 'అనరాదు.' అని నిషేధించిన 'చెవులు' మొదలయిన శబ్దములు నన్నయాది మహాకవులు ప్రయోగించి ఉన్నారు. అప్పకవి వచనము కేవలము సాహసమూలకము.

I. 130 "కనెనఁట యని గ్రామ్యపదముగాను వాగనుశాసనులు ప్రయోగించినారు." అని "వనకన్యకయఁట........" అనే పద్యము ఆదిపర్వమునందలి దని ఉదాహరించినాడు; గాని, ఈపద్యము పినవీరభద్రుని శృంగారశాకుంతలములోనిది. అప్పకవి పేరొక్కలేదు; గాని శ్రీ తం. వేవప్పెరుమాళ్లయ్యగారు పరిశోధించి ముద్రింపించిన భారత ప్రతిలో,

"తురగములు పఱవనేరక
వరూహావదనంబునందు పంధ్యములయ్యెన్
సురసారథి ననుఁ గానక
హరినందన యెందుఁ బోయి తనెఁ గడు భీతిన్, (అర. IV. 69) అని

ఉన్నది. అయితే, మావద్దనున్న రెండువ్రాతప్రతులలోను "యెందువోయితని కడుభీతిన్" అని ఉన్నది.

II. 132 'చంచు'

'చెంచు' శబ్దము తప్పు అని అప్పకవి అభిప్రాయము; గాని దీనికి మహాకవి ప్రయోగములు మెండుగా గలవు.

1. చెంచువేల్పులమూకల సేదదేర్చి—ఎఱ్ఱాప్రగడ నృసింహపురాణము 1.54
2. చెంచు......కెలిమిసేసి—శ్రీనాథునినైషధము V. 136
3. చెంచునింటికిఁ బోయి చెంచెతకుఁ బ్రియము—శ్రీనాథుని కాశీఖండము. V. 71

4. చెంచులు...అలసానిపెద్దన మనుచరిత్రము. IV. 103

5. చెంచితలక్ బింఛపత్రచేలాంచితలక్—బమ్మెర పోతరాజు భాగ. X.

6. సిద్ధమును లిందుఁ జరియించు చెంచులెల్ల-శ్రీనాథుని కాశీఖండము III. 9

II. 136 'పాండురాజ' అనే పదము శుద్ధ సంస్కృతపదము గనుక అందలి జకారము తాలవ్యమే కాని దంత్యము కానేర దనిన్ని, తాలవ్యము అర్థాంతరమునందు దంత్యముగా చెప్పరాదు అనిన్ని, పింగళి సూరన అట్లు చెప్ప డనిన్ని అప్పకవి అభిప్రాయము.

కాని "ఎందు పేటరారె" అనే పద్యముకాక మరి మూఁడు పద్యములలో ఇట్టి జకారము కనబడుచున్నది.

1. "పాండురాజీవరమాధుర్య" III. 5. ఇక్కడ భారతార్థమునందు "పాండురాజు+ఈ+వరమాధుర్య"అనిన్ని, రామాయణార్థమందు పాండు+రాజీవ+రమాధుర్య" అనిన్ని పదవిభాగము.

2. 'ధర్మరాజితజయమహోత్సాహుఁడగుచు' III. 108. ఇక్కడ భారతార్థమందు" "ధర్మరాజు+ఇత, జయ, మహోత్సాహుఁడు+అగుచు" అనిన్ని, రామాయణార్థమందు, "ధర్మ రాజిత..." అనిన్ని పదవిభాగము.

3. "ధర్మరాజితరక్షమాపాల" IV. 209. ఇక్కడ భారతార్థమందు "ధర్మరాజు+ఇతర..." అనిన్ని, రామాయణార్థమందు "ధర్మ+రాజిత..." అనిన్ని పదవిభాగము.

రాజు, పాండురాజు, ధర్మరాజు మొదలయిన శబ్దములలోని జకారము దంత్యమేకాని తాలవ్యము కానేరదు గదా. " ఇ ఈ ఎ ఏలను గూడిన చజలు తాలవ్యములు" అంటే సిద్ధమైన పదములలోని చజల పట్లచెల్లవలెను గాని, సంధి వశమున వచ్చినవాటికి చెల్లగూడదు. రా జిక్కడ లేదు (రాజు+ఇక్కడ); చుంచీగదిలో ఉన్నది. (చుంచు+ఈ.) ఇటువంటి చోట్లగల చజలకు దంతోచ్చారణమే కాని తాలవ్యోచ్చారణము లేదు గదా.

ఈప్రయోగములు చూడగా సూరపరాజుగారికి ఈవిషయమున అప్పకవికి గల పట్టుదల లేనట్లు స్పష్టమగుచున్నది.

II. 139 "కవర, కీవి, కేవ, కావు, ఢాక మొదలయినవి స్వదేశ్యములుగాని, వైకృతములు కావు." అని అప్పకవి వ్రాసినాఁడు. అతఁడే మరియొకచోట "స్పర్శాక్షరములందుఁ బంచవర్గములను సమములై యుండు నక్షరములు పది......శుద్ధాంధ్ర

దేశభాషాపదముల వెదకినను లేవు" (II. 59) అని వ్రాసియుండుటచేత, స్వమత విరోధము కనబడుచున్నది. ఈ పదములలో 'తావు' అనేది వైకృతవిశేష్యము, గ్రామ్యము అని శబ్దరత్నాకరములోనున్ను, హిందూస్థానీపదము అని గుప్తార్థ ప్రకాశికలోనున్ను ఉన్నది. నన్నయ, తిక్కన మొదలయిన మహాకవులందరున్ను ఈ శబ్దము వాడినారు. ఇది నిజముగా వైకృతము, సంస్కృతభాషలోని "స్థా" అనే ధాతువుతో సంబంధము కలది.

తక్కిన పదములు దేశ్యములని శబ్దరత్నాకరములో సయితముచెప్పి ఉన్నది. అయితే, శుద్ధాంధ్ర దేశభాషాపదములలో వర్గద్వితీయ చతుర్థవర్ణములు లేవని చెప్పరాదు.

II. 184-187 ఉయ్యెల, పయ్యెద, తాయెతులు-ఈశబ్దములందున్న యెకారము పదమధ్యమని ముద్దరాజు రామన్న అన్నాడని అప్పకవి ఆక్షేపించినాడు. 'ఊఁచు+(హేలా) ఏల=ఉయ్యెల' అని చెప్పుట తప్పుగా తోచుచున్నది. ద్రావిడ భాషలో ఊఞ్ ధాతువుయొక్క కృదంతము "ఊఞ్ సల్" దీనికి తెలుగు ఊయల, ఉయ్యల, ఊయెల, ఉయ్యెల మొ॥ రూపాంతరములు లోకుల వాడుకనుబట్టి వచ్చినవి. అప్పకవి చెప్పిన 'తాయెతులు' అపశబ్దము కాబోలును. చంద్రభానుచరిత్రము (పరిషత్తువారి వ్రాతప్రతి) లో I. 89—'తాయితులజుట్టి', III. 78—'తాయితచేరు', V. 153—'సంపెంగమొగ్గతాయిత' అని ఉన్నది. అచ్చులో పరిషత్తువారు శ. ర. ప్రమాణముగా చేసుకొని 'తాయెతు' లని పరిష్కరించినారు. ముద్దరాజురామనగ్రంథమందు 'తాయెర' లని ఉన్నది. కూచిమంచి తిమ్మకవి లక్షణమందు (అచ్చుప్రతిలో) 'తాయెద' లని ఉన్నది. అప్పకవి చెప్పిన 'తాయి+ఎత్తు—తాయెతు' సాధువో కాదో ఎట్లు నిశ్చయించడము? పయ్యెదకు రూపాంతరము పయ్యద. రామా. యుద్ధ. లో ప్రయోగమున్నది.

II. 198 అఱుఁగుట (=పోవుట) అనే శబ్దములోని రేఫము శకటరేఫముగా సయితము ఉండవచ్చు నని అప్పకవి మౌసలపర్వము, I. 16-వ పద్యమును ఉదాహరించినాడు. అయితే, భారతము ముద్రితప్రతులలో గాని, వ్రాతప్రతులలోగాని ఈ పద్యమందు ఈపదమే కనబడలేదు. "అఱిఁగె" ఉన్న దని అప్పకవి, చెప్పినచోట "ఎఱిఁగె" అనే శబ్దము కలదు. సందర్భమును బట్టి విచారించినయెడల, అచోట "ఎఱిఁగె" అనే ఉండవలె నని తోచును.

II. 221 "జాతివా గల వోఢృశబ్దమొక్కటి దక్క
సంస్కృతాంధ్రముల ముజ్జగములందు,
శబ్దంబు మొదల నిశ్చయముగాఁ గొమ్ములు
నొత్వంబులును గల్గ వొకటికైన."

అని అప్పకవి వ్రాసినాడు; గాని, సంస్కృతములో మరికొన్ని కలవు. అవి బ్రహ్మశ్రీ కల్లూరి వేంకటరామశాస్త్రులవారు తమ గుప్తార్థప్రకాశికలో ఉదాహరించినారు.

"వోళికా (ఒబ్బట్లు, పోళి), వోఢుః (పితృగృహవాసి యై పోషింపఁబడిన ప్రోషితభర్తృకాసుతుఁడు), వోఢజః (గర్భిణీస్త్రీని పెండ్లియాడిన పిదపఁ బుట్టినకొమరుఁడు), వోఢా (కుమ్మరవాఁడు, సారథి), వోటా (దాసి), వోఢః (పోఁకచెట్టు), వోఢ్రః (గొనస సర్పము, మత్స్యవిశేషము) వోరకః (లేఖకుఁడు), వోరటః (కుందపుష్పము), వోరపట్టీ (మందుర—అశ్వశాల), వోరనః (ధాన్యవిశేషము), వోరుఖానః (పాటలవర్ణాశ్వము) మున్నగు వోకారసహితశబ్దంబులు శబ్దార్థకల్పతరు, సర్వశబ్దసంబోధినీ ప్రభృతి గ్రంథంబులలోఁ గనఁబడుచున్నవి." పుట. 11.

V. '27 తన్ను, నిన్ను, నన్ను...ఇవి ద్రుతప్రకృతు లెపుడుగావు' అని అప్పకవి వ్రాయుట వింతగా ఉన్నది. 'వైకల్పికద్రుతప్రకృతు'లని కాబోలు అప్పకవి అభిప్రాయము?

## III ఛందోవిషయములు

II. 229-234 యతిప్రాసములకు రేఫఱకారముల సాంకర్యము చేయకూడదని పట్టుదలతో చెప్పిన అప్పకవియే వీటిని యతిప్రాసములందు కూర్చినాడని కొందరు ఈ గ్రంథమునుండి కొన్ని పద్యము లుదాహరించినారు.

1. ఱేనిసామమునకుఁ । గ్రించివంకను — II. 345

2. అరుదారను।ద్ధతమయ్యె
న్మఱిసజయులున్ ।నసగ్గలున్ — IV. 418

3. పురుఁటింటన్ ......ఱు
త్రెఱిఁగిష్టంబుగ...... — IV. 506

4. కేరుచు నొయ్యన దగ్గఱఁ
జేరుచు నురుముష్టిహతికిఁ జిక్కక వేగం
దాఱు చహంకృతిఁ గ్రమ్మఱ
దూఱు చఘోటకుఁడు మల్లుఁ ద్రుంచె ననంగన్. — V. 77

5. పరగఁగందము పఠ్యయు • మతి విపులయుం IV. 452

6. అఱఁటులఁ...... లెల్లక్, ధరనెఱసున్నలు...... V. 106

వీటిలో మొదటిదానికి "నృపునినామమునకు..." అని పూ. ము. లలో పాఠాంతరము కలదు; గాని, అది వ్రాతప్రతులందు కనబడదు. 1859 లో ముద్రిత మైన ప్రతియందు "తేనినామమునకు..." అనే ఉన్నది; గాని అందు శుద్ధపత్రికలో "నృపుని" అని సాధుపాఠముగా ఇచ్చినారు. తక్కిన ముద్రణములు సంపాదించిన వారికి మొదటి ముద్రణములోని శుద్ధపత్రికతే ఆధారముగా ఉన్నట్లు కనబడుచున్నది. మొదటి ముద్రణము పరిష్కరించిన వారికి ఆధారమేమో తెలియదు. రేఫ శకటరేఫల సాంకర్యము తప్పగదా అని వారు దిద్దిఉందురు. అయితే మరికొన్నిచోట్ల దిద్దక విడిచి పెట్టుటకు కారణము కనబడదు.

5-వ ఉదాహరణము అప్పకవి పాఠముకాదు.

6-వ ఉదాహరణముకూడా అప్పకవి పాఠముకాదు.

తక్కిన ఉదాహరణములకు మాత్రము పాఠాంతరములు కనబడలేదు. అచ్చులో శకటరేఫములకు బదులు రేఫములే ఉన్నవి గాని, అప్పకవి మతమున అవి శకటరేఫము లుగా ఉండవలెను; గనుక, వాటిని దిద్ది చూపించినాము. సరియైన పాఠాంతరము లున్నయెడల అప్పకవిని ఆక్షేపించవలసిన అవసర ముండదు.

II. 249-251.

లాంతి వా జాతి వాకు ప్రాసమందు నిలుచును; గాని, మొదట ఋకారమగుట చేతను, ఆ లాతివా జాతి వాకు యతిగా చెల్లదు అనిన్ని,

"లాఁతి జాతికి వడికి నిల్వఁ దగ దనుచు
సూత్రమునఁ జెప్పలేదని చూడ వలదు
నన్నయార్యుఁడు పంచమామ్నాయమునను
నిలుపు లక్ష్యంబులకు మాఱుపలుక వశమె."

అనిన్ని చెప్పి, అప్పకవి 'భూసుతకీర్తిబ్రాహ్మణుఁడు పుట్టఁగ' అనే పద్యము లక్ష్యముగా చూపించినాడు. ఆతడు తాను చెప్పిన లక్షణమునకు ఇది ఏలాగు లక్ష్యము కాగలదని అనుకొన్నాడో! తగదని చెప్పిన దానికి లక్ష్యమెట్లు చూపుటకు పూను కొన్నాడో!

వపలకు యతి చెల్లునని, అప్పకవి అభేదవర్గయతులక్రింద నన్నయ ప్రయోగము లిచ్చునాడు. అత డిచ్చిన లక్ష్యములలో చాలావాటికి పాఠభేదము లున్నవి గాని, సంశయించుటకు ఎడమియ్యని లక్ష్యములు కొయితము చూపిస్తున్నాము.

సీ. పా. వేణిసరస్వతి,*పెన్నయైరావతి. (సభా. I. 71.)

ఈలాగున వపలకు మైత్రి కుదిర్చిన నన్నయ లాంటి జాతి వాలమైత్రికి ఇష్టపడ డని ఎట్లు అనుకోగలము? ఉచ్చారణలో వపలకంటె లాంతి జాతి వాలకు మైత్రి ఎక్కువగానే ఉన్నది. అయితే, వీటికి మైత్రి గల పద్యము నన్నయభారతమందు మాకు కనబడలేదు; గాని, అంతమాత్రాన నన్నయకు ఇది సమ్మతము కాదని చెప్పలేము. ఇందును గూర్చి చిన్నయసూరి బాలవ్యాకరణములోని సూత్రము చూడండి;— "యవలలు లఘ్వలఘువులు మైత్రిం బొరయు; రేఫంబులు పొరయవు" (ప్రకీర్ణ. 24) ఇందుకు గుప్తార్థప్రకాశికాకారులు ఇచ్చిన ప్రయోగము:—

సీ. ఎలమావి కొన యెక్కి • తెలతెల వార్చికో
వెలపోటుం గూంకలు • వెట్టనేని (రాజశేఖరచరిత్ర.)

III. 125-126 "శకంధు కర్కంధులు ఆయాయిదేశమందలి నూతులకర్థము గాని, కర్కంధు రేగుచెట్టుకు అర్థము కాదు. కర్కస్య ంధూః అని అప్పకవి వ్యాఖ్య వ్రాసి రేగుచెట్టు అర్థం వ్రాసినారు. అంధు శబ్దము ఉకారాంతము గాని ఊకారమంత మందు లేదు. అయినా, కర్కమనగా ఏమిటో అర్థము వ్రాయరయిరి......కొన్ని సమాసములలో అచ్చులు కనిపించుటలేదు" అని కూచిమంచి వేంకటరాయడు "సుకవి మనోరంజనము" అనే లక్షణగ్రంథమందు వ్రాసినాడు. (ఇది అచ్చుపడలేదు.)

## అఖండవడి

III. 203 "తెలుగు" అనే మాసపత్రికలో (సంపుటము. 1. సంచిక 9-10 1920 సం॥ మే జూన్—పుటలు 9-27) అఖండవడి గురించి విపులముగా ఒక వ్యాసము వ్రాయడమయినది. అది అంతా ఇక్కడ ఎత్తివ్రాయుటకు వలనుపడదు; గనుక దాని సారాంశము మాత్రము సంగ్రహించి వ్రాస్తున్నాము—ఈవడి అప్రశస్త మని అప్పకవి అభిప్రాయము; గాని లాక్షణికులలో అప్పకవికి పూర్వులు—కవి జనాశ్రయకర్త, లింగమగుంట తిమ్మకవి, ముద్దరాజు రామన్న, చిత్రకవి పెద్దన్న అఖండవడి యతిభేదములలో పేర్కొని దానికి లక్షణము చూపించినారు. అప్పకవి

* ప్రథమావిభక్తిమీఁది పవర్ణమునకు వకారాదేశము రావలెనేమో?

తర్వాతి లాక్షణికులలో కూచిమంచి తిమ్మకవి తన సర్వలక్షణసారసంగ్రహములో దీనికి లక్షణము వ్రాసి కొన్ని మహాకవిప్రయోగములు చూపించినాడు. కూచిమంచి వేంకటరాయడు జగ్గకవి మనుమడు, గొప్ప పండితుడు, సుకవిమనోరంజనము అనే ఒక లక్షణ గ్రంథములో అఖండవడి సాధువని మహాకవి ప్రయోగములు ఇరువై అయిదు చూపించినాడు.

ఇంతేకాదు; వేలకొలది ప్రయోగాలు చూపించవచ్చును. అయితే పండితంమన్యు లయిన పరిష్కర్తలు కవిహృదయము తెలియనీయకుండా తమ ఇష్టానిష్టముల బట్టి పాఠములు తారుమారుచేసి గ్రంథములు అచ్చువేయించుచుండుటచేత వ్రాతప్రతులలో కనబడుచున్న అఖండవళ్లు ముద్రితగ్రంథములలో కనబడకున్నవి.

అయితే, పరిష్కర్తలకు అఖండవడి అగ్రాహ్యమని ఎందుకు తోచినదంటే.— లక్షణగ్రంథము లన్నిటిలోను అప్పకవీయము మాత్రమే ముందుగా అచ్చుపడి ప్రచారములోనికి వచ్చియుండుటచేత, చాలామందికి తక్కిన లాక్షణికుల అభిప్రాయము తెలియలేదు. స్వతంత్రించి లక్ష్యములు పరిశీలించి లక్షణము సరిచూచుకొనుట సుకరము కాదు; గనుక, అప్పటికి ముద్రితమై ప్రచారములో ఉన్న అప్పకవీయము మాత్రమే చదువుకొని అప్పకవి లక్షణములు వేదవాక్యములుగా పండితులు శిరసావహించినారు. గ్రంథములు అచ్చుపడుట ఎక్కువయినకొలదిని వ్రాతప్రతులు పరిశీలించుట తక్కువయినది. ఏ లక్ష్యములను చూచి సరియైన లక్షణము వ్రాయవలసి ఉండెనో, ఆ లక్ష్యములను ఒకానొకరు ప్రమాదవశమున చెప్పిన దుష్టలక్షణమును బట్టి దిద్దుటవల్ల సత్యము దూరమై పోవుచున్నది; అసత్యము బలపడి స్థిరమగుచున్నది.

అప్పకవి అఖండవడి అగ్రాహ్యమని తలచుటచేత స్పష్టముగా కనబడుచున్న అఖండవళులకు గతి కల్పించవలసివచ్చినది. అందుచేత అతడు 12 విధములయిన ఉభయవళులు పేర్కొన్నాడు. నాటినుండి నేటివరకు అప్పకవీయమందు ఆదరణ విశేషముగా గలవారికి అఖండవడి కనబడిన వెంటనే సాధ్యమయితే దిద్దివేయవలెననే కోరిక. దిద్దడానికి శక్యము కాక, అన్ని ప్రతులలోను ఆప్రయోగము ఒక్కలాగే ఉండి, అది మహాకవీశ్వరుని ప్రయోగమైనయెడల, ఉభయవళిభేదము మరియొకటి సృజించవలెనన్న కోరికే కాని, అఖండవడి ఒప్పుకోవలెనన్న బుద్ధి ఇంకా పుట్టకున్నది.

"చ. అని మది నిశ్చయించి......"

కొసరిన సైన్యముల్ పదునొకొంటికి. (III. 211)

ఈ పద్యములో "మూఁడవపాదంబునందుఁ బదునొకొంటికి నని యున్నచోట సంధి గూర్చి స్వరప్రధానవడిగాను సోమయాజులుగారు ప్రయోగించినారు." అని

అప్పకవి వ్రాస్తే, అందుకు తగినట్లుగా, కూచిమంచి వేంకటరాయడు తన సుకవిమనోరంజనములో అప్పకవి వాదము ఖండిస్తూ, "సముదాటోప (II. 96) అన్న పద్యములో 'ఒక్కొక్కమొగిన్' అనిన్ని, మనుచరిత్ర 'ఒక్కొట' (II. 97) అనిన్ని, రాఘవపాండవీయము 'లేడొక్కొఁడు' (II. 98) అనిన్ని ఒకో, ఒక వివిధముగా వుంటుందని వర్గయతి గలిగిన చోట్లనే చూపించినారు. ఇంకా అనేక లక్ష్యములున్నవి. ఈకారణములచేత 'పదునొకొంటికి' అనునప్పుడు, అఖండవడి సిద్ధము. ఒక+ఒఁటికి—ఒకొంటికి అని అప్పకవిగారి తాత్పర్యమని తోచుచున్నది. పదద్వయ విభాగమునకు ప్రసక్తి కనిపించదు. ఆయన ముఖ్యాభిప్రాయ మొకటి; పైకి వ్రాసిన దొకటి. అఖండవడి యుండ దని ముఖ్యాభిప్రాయము. అందుకు నఖండవళులున్న చోట 5 - 6 చోట్ల దిద్ది పాఠములు వేరే కల్పించినారు. ఇక్కడ దిద్దడమునకు శక్యము కాలేదు; గనుక, ముద్దరాజు రామన్నగారిని ఆక్షేపించుటకై పయ్యెద, ఉయ్యాల, తాయెతు—వీటిలో పదద్వయ విభాగము లేనివివ్రాసినటులనే అఖండవడిని ఖండించుటకై వ్రాసినారు. స్త్రీ పర్వంలో "క. పాండవులవలనఁ గీడొ,క్కొండును లేదధిప నీదు । కొడుకులు ధరణీ." అని ఉన్నది. దీని కేమంటారు? అఖండవడి అంగీకరించవద్దా ! గాని యిది నిజముగా వర్గయతి" అని వ్రాసినారు.

ముద్రితగ్రంథములలో నిలిచిన అఖండవడి ప్రయోగములు చూడండి.

1. సంభరణప్రౌఢనిజభు+జార్గళ...
2. ఆ, లోకనమాత్రమున ము క్త+ఉల్లసిలంగన్.
3. తంత్రము లాలకించి వసు+ధామరముఖ్యులు
4. కైలాటమునం ఘటిల్లె సక+లార్థము... కాశీఖండము.

శ్రీనాథుఁడు ఇంకా తక్కిన గ్రంథములలో సయితము అఖండవడి తరుచుగా వాడినాడు,

అచ్చుపడ్డ భాగవతములో సయితము చాలాచోట్ల అఖండవళులు కనిపించుచున్నవి.

1. వెట్టదునేత్రంబులు నెఱ్ఱగావు నిజబా+టార్థేందుఁడున్ (VIII.)
2. కాంతాకారంబు జగన్నిమజ్జనముగ+న్నన్ (VII.)
3. రక్షైకారంభకు భక్తపాలనకళా+సంరంభకున్ (I. 1)
4. లోకైక శరణ్యయోయభయ+కారణ (X).
5. కన్నులకఖిలార్థలాభంబు+గలుగుచుండు. (X.)

భారతములో అఖండవళ్లు లేవని కొందరికి భ్రమ; గాని, లేక పోలేదు. అచ్చు పడ్డ ప్రతులలో చూస్తే కనబడవు; గాని వ్రాతప్రతులలో అనేకముగా ఉన్నవి. అచ్చు పడ్డవాటిలో కూడా కొన్ని కనబడుచున్నవి. 'పదునొకంటికి' గలచోట "అని మది నిశ్చయించి" అనే పద్యములో అఖండవడి సిద్ధము గదా.

"వీరలు దైవశక్తిఁ బ్రభ+వించిన వారను టేమిసందియం

బీరమణీయకాంతి సుప+మింపఁగ......"

ఇందులో ఇంచుగాగమ సంబంధియైన ఇకారము విరగదంటే రెండవచరణ ములో అఖండవడి సిద్ధము; విరుగునంటే, మొదటి చరణములో అఖండవడి సిద్ధము.

ఇంచుగాగమ సంబంధియైన ఇకారము విరగ దని అప్పకవి అభిప్రాయము, గాని అతని అభిప్రాయమునకు విరుద్ధముగా మహాకవి ప్రయోగములు కలవు.

1. సీ. ఏను దియ్యమున న+టించిన (నృసింహపు. I.)

2. పాటించి ధరించి పొందు ఘటి+యించి (భాస్క. రా. యుద్ధ.)

3. ఇరువుగదా ధారగొని ఘుంజించుట యొప్పుగ (పద్మపు. II. 93)

4. ఎక్కఁ బఠించునంతకు వ+రించుట (పద్మపు. III. 170)

భారతము వ్రాతప్రతులలో కనబడుతూ ఉన్న అఖండవళ్లు చూడండి:—

1. సురరాజు నెడలో । నిడుకొని యేకాగ్రబుద్ధి+నిష్ఠాత్ముండై (ఆది. V. 120)

2. మేముగ । నీవిద్యలెల్లఁ జూపుదు

మీవీరులు సూచి మేలు+మేలని పొగడగ. (ఆది. VI. 33)

3. నూవె మనంబునఁ దలంచు+చుండుదు నేనుగ (ఆది. VI. 35)

4. విమలమతీ నీకొడుకునట్టు+లరయంగ జనుగ (ఉద్యో. II. 74)

5. ఘుస్మరుఁడగుచున్నవాని దివి+జారి (అర. VII. 357)

6. నామనమార దీని గని నవ్వడె.... (సౌప్తి. II. 96)

7. జనావళి పురజనులు హస్తి+నాపురమునకుగ (అశ్వ. IV. 93)

ఇంకా అనేకముగా ఉన్నవి; గాని, పరిష్కర్తలు అచ్చులో కనబడకుండా తమ ఇష్టము వచ్చినట్లు దిద్దివేసినారు. కొన్నిచోట్ల అర్థము పాడయినది:—

సీ. నీలశైలాతంబు లీల నాక్షేపించి నల్లనైతోఁ దెంచు+నట్టె తనువు(ఆది. VI.214)

అని ఉంటే, 'అట్టెతనువు'కు బదులుగా నల్లగృహము అని అచ్చు వేయించినారు. దీనికి అర్థమేమి?

III. 271 అభేదవిరతులలో వబలకు, వదలకు, లళలకు, ళడలకు, అభేదవర్గ విరతులలో వపఫబభలకు యతి చెల్లవచ్చుననిన్ని, రలలకు మాత్రము యతి చెల్లకూడదనిన్ని అప్పకవి అభిప్రాయము. "రలయోరభేదః" అని కూడా సూత్ర మున్నదే. లక్షణవిలాసమువారిని ఆక్షేపించి, వారిచ్చిన రెండు పద్యములలోను రేఖాశబ్దము లేఖాశబ్దముగా చదువవలెను. అని అప్పకవి విధించి చెప్పుటకు ఆధారము కనబడదు. రూపాంతరము లున్నందున ఏదో ఒక రూపమునే విధించుటకు ప్రయోజనము, తన మతము సాధించుకోవడమే కాని, మరియొకటి కానట్లు కనబడుచున్నది.

రూపాంతరములులేని లక్ష్యములుకూడా ఉన్నవి.

1. రాయంచ కాళ్లు దోలకయమున్న (వసుచరిత్ర)

2. లీలావాస్యకళా ప్రసంగములనుద్రేకించి...

(కాశీఖండము VI 20.)

III. 357 స్వవర్గజప్రాసమునకు అప్పకవి ఇచ్చిన లక్షణములో "ండ, ంట" లకు ప్రాసము చెల్లునని చెప్పియుండలేదు. అదిగాక, తిక్కన సోమయాజి "ఆకొండు" అనే ప్రయోగించి ఉండవచ్చును. "మార్కొండు" మొదలయిన శబ్దములున్నవి.

III. 366 లడలకున్ను ళడలకున్ను ప్రాసము చెల్లునని రూపాంతరములు గల మాటలున్న పద్యములనే అప్పకవి ఉదాహరించినాడు.

వెడలి—వెలలి; దడము—దళము; ప్రీడ—ప్రీళ.

రేఖా—లేఖాశబ్దముల గురించి అతడు చెప్పినట్లే చెప్పి, రలల యతి అతడు ఖండించినట్లే ఈ అభేదప్రాసము ఖండించవచ్చును; గాని, మాకు రెండున్ను సమ్మతమే.

రూపాంతరములులేని పదములుగల లక్ష్యము లున్నవి:—

చ. అలజడిఁ బొందఁగాఁ దగని యట్టిది ద్రోపది మేరుకల్పులం
గొడుకుల............ (శాంతి. I. 202)

చ. పడి తెలివొంది లేచి పరిబాష్పజలంబులు మేనుగప్పఁగాఁ
బడఁతుక............................కోర్చిన
న్నలజడి (మార్క.)

III. 378 "తివిరి ధూర్తులైన కవులు కల్పనఁ జేసి
యొప్పిదంబు లనుచుఁ జెప్పరాదు." అని వీథినాటు

కముసం దొక పద్యమున్ను, రామాయణమునం దొక పద్యమున్ను చూపించినాడు. వాటిలో తన మతము నిలబెట్టుకొనుటకు పాఠాంతరములనైనా చూపించలేదు. ఇంతకు ముందు "కర్ణాట" శబ్దమునకు శ్రీనాథుని వీథినాటకమందలి పద్యమున్ను, అనేక స్థలములందు రామాయణమందలి పద్యములున్ను ఉదాహరించి, ఈ గ్రంథములు రచించిన మహాకవులను "ధూర్తులయిన కవులు" అని వ్రాయుట అతిసాహసము. సభాపర్వములో నన్నయయే ఇట్టి ప్రాస ముంచినాడు.

ఉ. మండిత సూర్యరశ్మి......(గట, స్యందిసుగంధి..." సభా. II. III

ఈపాఠము అహోబలీయమం దున్నది; గాని, కొన్ని వ్రాతపుస్తకములలో లేదు; అచ్చుపడ్డ ప్రతులలోను "మందిత సూర్యరశ్మి!...". అని దిద్ది ఉన్నది.

IV. క్రౌంచపదము (పుట. 250)

క్రౌంచపదీవృత్తమ్మునఁ జెన్నారఁగఁ బలుకుదు రిలఁగవి.

ఇందులో విశ్రమాక్షరములు అప్పకవి తాను III. 110-111 లో విధించినట్లు నిలిపినాడు కాదు. చూడండి.

"ఆ. ఒక్కపదములోనఁ బెక్కు విశ్రమములు
జఱుగుచోట మొదల జడ్డలున్న
నడుగు వెడలు దనుక నందొక్కటియె కాని
యుండ దొకట నదియు నొకట నిదియు." III. 111

IV. 411-412 అప్పకవి చెప్పిన శరభక్రీడలో నాలుగు పాదములున్ను చంద్రశ్రీవృత్తచ్ఛాయనే నడుచుచున్నవి. విశాలవృత్తము సమవృత్తములలో పేర్కొ లేదు. అది ఎట్లు నడచునో చెప్పలేదు.

IV. కేతుమతి (404), వేగవతి (405), వియోగిని (406), పరావతి (407), పీనారసనము (417), ఉద్ధతము (418), మణిదీపిక (421) మొదలయినవాటికి వివరణవచనములు లేకపోవుటచేత అవి ఎట్లు నడుచునో సులభముగా తెలియదు.

IV. 419 మూడవచరణములో గణభంగము. తుదిగణము యగణమై ఉండవలెను. మావద్దనున్న వ్రాతప్రతులలోను పూర్వముద్రణములందును ఇట్లే ఉన్నది. ఇటువంటి ప్రమాదములు మరికొన్ని కలవు; ఉన్నచోట పుట ఉడుగున చూపించినాము.

## సీసములు



IV. 521 ఈ సీసభేదముల గురించి లాక్షణికులెవరును ఒక్క విధముగా చెప్పలేదు. అందరిలోను ఎక్కువ భేదములను పేర్కొన్నవాడు అనంతుడు; అతడు పది భేదములను చెప్పినాడు.

1. సమసీసము:—(సామాన్యసీసము; విశేషలక్షణమేమియు లేదు.)

2. సర్వతఃప్రాససీసము:—(అన్ని చరణములలోను ఒకే అక్షరము ప్రాస యతులు గలది అనగా 24 చోట్ల ఒకటే ప్రాసాక్షరము; అక్షరమైత్రి వడి పాటించ నక్కరలేదు.)

3. అక్కిలి ప్రాససీసము:—(పెద్దపాదములందు గల 8 ఖండములలోను గీతి నాలుగు పాదములలోను రెండవ అక్షరములు ఒకే ప్రాసాక్షరము కలిగి ఉండవలెను, ఇదిగాక సర్వత్ర అక్షరమైత్రి వడి నియమము పాటింపవలెను. అనగా, 12 చోట్ల ఒకటే ప్రాసాక్షరము గల అక్కిలివడి సీసము.)

4. (సమ) ప్రాససీసము:—(నాలుగు పెద్దపాదములందును ఎత్తుగీతిలో దేసి పాదముల రెంటను రెండవ అక్షరములు ఒకే ప్రాసాక్షరము కలిగి ఉండవలెను. ఇదిగాక, సర్వత్ర అక్షరమైత్రి వడి నియమము పాటించవలెను. అనగా 6 చోట్ల ఒకటే ప్రాసాక్షరము గల అక్కిలివడి సీసము.)

5. (వృత్తప్రాససీసము:—పెద్దపాదముల నాల్గింటమాత్రమే వృత్తముల కున్నట్లు ప్రాస ముండవలెను. లక్ష్యమునుబట్టి సర్వత్ర వడినియమము పాటించ నక్కరలేదు.)

6. అవకలిప్రాససీసము:—(అన్ని చోట్లను ప్రాసయతినియమముమాత్రమేకలది.)

7. అక్కిలివడిసీసము:—(అన్ని చోట్లను వడి నియమమే కలది.)

8. వడిసీసము :— (అన్ని చోట్లను వడినియమముండవలెను; అంతేకాక, పాదాదినున్న వర్ణముతో మైత్రి గల వర్ణములే పాదము పొడుగునను యతిస్థలములందు రావలెను.)

9. విషమసీసము:—(ఉత్సాహ, గీతపద్యమున్ను కలిసినది.)

10. సర్వలఘుసీసము:—(ఇందులో ఇంద్రగణములకు బదులుగా అయిదు లఘువుల గణము లుండును.)

వీటిలో 1, 2, 4, 6, 7, 9. 10—సీసభేదములు అప్పకవీయములో ఉన్నవి; అయితే, పేళ్లలో కొద్దిగా భేదమున్నది. అనంతుని (సమ) ప్రాససీసమునకు, అప్పకవి ఇచ్చిన వృత్తప్రాససీసము (ఘూ. ము. అక్కిలి ప్రాససీసము) సరిపోవును. అనంతుని అవకలిప్రాససీసమునకు అప్పకవి ఇచ్చిన అవకలివడిసీసము సరిపోవును. అప్పకవి, "ఆదినేవడినిల్పి రావడేపదమెల్లఁ జేయ నయ్యది వడిసీస మనఁగ" అని, అనంతుడు తన వడిసీసమునకు "మును సైకొన్న యతి పాదమందెల్ల నడరిన వడిసీస మనఁగఁ బరగు" అని చెప్పినట్లే చెప్పి, అందుకు లక్ష్యముగా ఇచ్చిన పద్యములో ఆ లక్షణము పాటించలేదు గనుక, అప్పకవి ఇచ్చిన వడిసీసము అనంతుని అక్కిలివడి సీసమునకు సరిపోవును; గాని, అనంతుని వడిసీసమునకు సరిపోదు.

ఇంతకున్ను ఈసీసభేదములు కవులు ఎంతమట్టుకు తమ కావ్యములలో చూపించినారో విచారణీయము. "సప్తవిధము లివియ శబ్దశాసనుండు, పంచమామ్నాయ ఫక్కిలోఁ బల్కెఁగాని, కడమ కవు లాయుసీసము ల్విడిచిపెట్టి, చెలఁగి సమసీసపద్యమే చెప్పినారు" అని అప్పకవి వ్రాసినాడు; గాని ఇది సత్యమునకు మిక్కిలి దూరము.

## నన్నయసీసభేదములు.

నన్నయ అనేక విధములయిన సీసములు వ్రాసినమాట వాస్తవమే కాని, అతడు పాటించిన సీసభేదములు అనంతుడు, అప్పకవి మొదలయిన లాక్షణికులు ఏర్పరచిన లక్షణములను అనుసరించి లేవు. అప్పకవి చెప్పిన ఏడువిధముల సీసములలోను సమసీసము, సర్వతఃప్రాససీసము, విషమసీసము, సర్వలఘుసీసము నన్నయ భారతములో కనబడలేదు. వడిసీసము (అనగా, సర్వత్ర అక్షరమైత్రివడి నియమమే కలది), అవకలివడిసీసము (అనగా, సర్వత్ర ప్రాసయతి నియమమే కలది) - ఈరెండు విధము లయిన సీసములు మాత్రము నన్నయ తరుచుగా వాడినాడు. రెండు సీసములలో (II. 21; III. 27 ఆనంద. ము) అనంతుడు చెప్పిన వృత్తప్రాస సీసలక్షణము కనబడుచున్నది. ఆ రెండింటిలో ఒకదానియందు (III. 27) ఒకే ప్రాసాక్షరము సీసపాదముల నాల్గింటను, ప్రతిపాదమందు నాలుగుచోట్లను (అనగా 16 చోట్ల) ఉన్నది; రెండవదానియందు (II. 21) ఒకే ప్రాసాక్షరము సీసపాదముల నాల్గింటను ప్రతిపాదమందు రెండుచోట్ల మాత్రమే (అనగా ఖండమున కొకటిచొప్పున 8 చోట్ల) ఉన్నది. ఎత్తుగీతులలో ప్రాసాక్షరములు భిన్నముగా నుండుటచేత అప్పకవి చెప్పిన వృత్తప్రాసమునకు భిన్నముగా ఉన్నవి. అనంతుని వృత్తప్రాసమునకు సరిపోవుచున్నవి; గాని, అతడు చెప్పని విశేష నియమములు కూడా కలిగి ఉన్నవి.

నన్నయ సీసములు ఎన్నివిధములుగా ఉండునో ఈ దిగువను ఒక పట్టికలో చూపిస్తున్నాము.

| 1 | 2 | 3 | 4 |
|---|---|---|---|
| సీ. యతి<br>గీ. యతి | సీ. యతి<br>గీ. ప్రాస | సీ. యతి<br>గీ. యతి । ప్రాస | సీ. యతి<br>గీ. ప్రాస । యతి |
| **5** | **6** | **7** | **8** |
| సీ. ప్రాస<br>గీ. యతి | సీ. ప్రాస<br>గీ. ప్రాస | సీ. ప్రాస<br>గీ. యతి । ప్రాస | సీ. ప్రాస<br>గీ. ప్రాస । యతి |
| **9** | **10** | **11** | **12** |
| సీ. యతి । ప్రాస<br>గీ. యతి | సీ. యతి । ప్రాస<br>గీ. ప్రాస | సీ. యతి । ప్రాస<br>గీ. యతి । ప్రాస | సీ. యతి । ప్రాస<br>గీ. ప్రాస । యతి |
| **13** | **14** | **15** | **16** |
| సీ. ప్రాస । యతి<br>గీ. యతి | సీ. ప్రాస । యతి<br>గీ. ప్రాస | సీ. ప్రాస । యతి<br>గీ. యతి । ప్రాస | సీ. ప్రాస । యతి<br>గీ. ప్రాస । యతి |

ఇందుకు తెలివిడి:—

1. సీ. యతి / గీ. యతి అంటే సర్వయతి సీసము; అన్నిచోట్లను వడి నియమమే కలది; అనంతుని అక్కలివడి సీసమునకుగాని, అప్పకవి లక్ష్యముగా ఇచ్చిన వడిసీసమునకు గాని సరిపోవును.

2. సీ. యతి।ప్రాస / గీ. యతి।ప్రాస అంటే, సీసపాదముల నాల్గింటను ప్రతిదానిలోను మొదటి దళమందు యతిన్ని, రెండవ దళమందు ప్రాసమున్ను, గీతపాదములు నాల్గున్ను రెండు వరుసల నుంచగా మొదటి దళమందు అనగా ప్రథమ తృతీయ చరణములందు యతిన్ని, రెండవ దళమందు అనగా ద్వితీయ చతుర్థ చరణములందు ప్రాసమున్ను ఉండును.

ఇట్లే తక్కిన సీసభేదములు తెలుసుకోవచ్చును.

ఈ 16 సీసభేదములలో 12, 14, 15 విధములయిన సీసములు మాత్రము నన్నయ భారతములో కనబడలేదు.

నన్నయ భారతములో ఉన్న సీసములన్నీ 251. వీటిలో ఎన్నెన్ని ఏయే సీస భేదముల ననుసరించి ఉన్నవో దిగువను వివరిస్తున్నాము.

(1) 158; (2) 3; (3) 2; (4) 2; (5) 3; (6) 33;
(7) 1; (8) 4; (9) 10; (10) 5; (11) 1; (13) 21; (16) 2.

ముద్రిత గ్రంథములలో చూచినయెడల కొన్ని పద్యములలో ఒకొక్కచోట క్రమము తప్పినట్లు కనబడును; గాని సరియైన పాఠములు చూచినయెడల అవి నియమమును అనుసరించి ఉన్నవని చెప్పవచ్చును. ఇందుకు దృష్టాంతముగా ఒక్కటి మాత్రము ఇక్కడ చూపిస్తున్నాము.

"సీ. ఇన్నలోపాఖ్యాన॰మెప్పుడు......(అర. II. 230)" అనే పద్యము సర్వయతి సీసము; మొదటి సీసభేదమునకు లక్ష్యము. అయితే, ముద్రితగ్రంథములో **మూడవ** చరణము "నుతచరిత్రుఁడైన ఋతుపర్ణుఁ గీర్తింప" అని ఉండుటచే క్రమము తప్పినది; గాని, ఈపాఠము నన్నయ పాఠము కాదు. తాళపత్ర ప్రతులలో "ఋజుచరిత్రుఁడైన॰ ఋతుపర్ణుఁ గీర్తింప" అనిన్ని "ఋషిచరిత్రుఁడైన॰ ఋతుపర్ణుఁ గీర్తింప" అనిన్ని ఉన్నది. ఈ పాఠములు వావిళ్లవారి ప్రతిలో (చూ. పుట 76 సం. 2.) కూడా సూచించినారు.

ఈ విధముగానే సరియైన పాఠములు చూచుకొని నన్నయ చెప్పిన సీసములన్నీ పైని చెప్పిన భేదములకు లక్ష్యములుగా ఉన్నవని గ్రహించవచ్చును.

అప్పకవి చతుర్థాశ్వాసమున కనబరచిన వృత్తముల పట్టికలోగాని, లక్ష్యలక్షణ పద్యములలోగాని తానే ఇతరస్థలములందు వాడిన వృత్తములలో కొన్ని పేర్కొనలేదు. వాటి నిక్కడ పేర్కొని వాటి లక్షణము చూపిస్తున్నాము:—

1. సరోజవృత్తము (8-వ ఛందము) U I U I I U I U
2. దరధ్వనితాళము (6-వ ,, ) U I U I I I (లఘ్వంతము)
3. రతీ (8-వ ,, ) U I I U I U I U

వృత్తముల వివరణములో దీనికి "నాగరనామవృత్తము" అని వేరే పేరు కలదు.

4. నీలోత్పల (9-వ ,, ) U U U U U I I U U
5. అంబా (11-వ ,, ) U I I U I I U I U I U
6. పద్మ (13-వ ,, ) I I U I I U I I U I U I U
7. (నరక)పుష్పిణీ(14-వ ,, ) I I I I I U I U U I U U I U
8. వాణీ (17-వ ,, ) U I U I I I U I I U I I U I U I U

## పాఠాంతరములు.

మొదట అడుగున చాలాచోట్ల పాఠాంతరములు చూపించినాము. అయితే, ఈ గ్రంథముద్రణము పూర్తికాక మునుపు ఓరుగంటి వారి ప్రతి జాగ్రత్తగా పరిశీలించుటకు అవకాశము చాలనందున ఆ ప్రతి దొరికినలాభము పూర్తిగా పొందలేక పోయినాము. కనుక, దానిలోని పాఠాంతరములు మొదలయినవి కొన్ని ఈ దిగువను చూపిస్తున్నాము.

| పద్యసంఖ్య | | ఈ గ్రంథములోని ముద్రిత పాఠము | ఓరుగంటివారి ప్రతిలోని పాఠము |
|---|---|---|---|
| పీ. | 13 | వన్నియను | వన్నెయును |
| | 46 | ద్రాక్ష | దాక్ష |
| | 50 | తెనుఁగుటీక | తెనుఁగుడీక |
| | 100 | శ్రుత | శ్రుతి |
| | 101 | గంగాసమసాగ | గంగానదిచెంత |
| I. | 3 | (తర్వాతి శ్లోకములో | |
| | | వాగర్థా | శబ్దార్థా |
| | 9 | దెనుఁగు(న) కావశ్యకంబిది | దెనుఁగునకవశ్యకంబిది |
| | 31 | (మూ. సూ. 2.) వాగర్థా | శబ్దార్థా * |
| II. | 425 | దోడ తెప్పలు | దొడ్డ తెప్పలు |
| III. | 188 | చెల్వకు | చెల్వల |
| | 210 | ను సముజ్వలను | ఁగుల భూమిధరో |
| | 215 | బాలింత | బాలెంత |
| | 231 | భక్షించుచున్నాఁడు | భక్షింపుచున్నాడు |
| | 297 | సుదంతిని | సుదంతను |
| | 304 | దగు | గను |
| | 315 | చేష్టలును కోట | చైఁదములునోటు |
| | 336 | (తర్వాత) మధుసేవనము | మధుసేనము |
| | 348 | చైత్య | శైత్య |
| | 350 | హారులు నాతని | హారిమములతని |

* ఈ పాఠమే సరియైనది. క్రింది పద్యములో "కృతికి చెప్ప శబ్దార్థముల్ రెండు వలయు" అని అప్పకవి వ్రాసినాడు.

| | | | |
|---|---|---|---|
| IV. | 1 | వాసైకేశ్వర | వాసైలేశ్వర * |
| | 77 | గారాపు | గారాబు |
| | 120 | శిపి | శివి. |
| | 121 | స్థిరాంబుదహాశ | ధరాంబుదవాన |
| | 140 | నలుబది | నలువది |
| పుట | 247 (కరిబృంహితములో) | | |
| | | చిననాడుశకటుని | చిననాఁడయసురుల |
| IV. | 431 | చారుహాసిక | చారువాసికి |
| | | చారుహాసికల్ | చారువాసిఖల్ |
| | 435 | నంబరము | సంబళము |

452 ఈ తేటగీతికి బదులుగా ఓరుగంటి వారి ప్రతిలో

"ఆ. పరగఁ గందము మఱి ◆ పథ్యయు విపులయుఁ
జపలయు ముఖచపల ◆ జఘన చపల
యనఁగ నాఱువిధము ◆ లై కందపద్యంబు
లఖిల సుకవికృతుల ◆ నలరుచుండు."

అని ఉన్నది. †

| | | | |
|---|---|---|---|
| IV. | 486 | నలివిరమణ్ణములు | నాటివిరామము |
| | | నుజగణము | జకారము |
| | | కలిరమణము | గోవిందా |

---

* అప్పకవి ఏలేశ్వరునే ఉద్దేశించి ఉండును. 'లే' 'వే' వలె కనబడుట చేతనే కాబోలు పూ. ము. (1859) లో 'వాసైవేశ్వర' అని ఉన్నది.

† "మఱి" లోని రేఫము అప్పకవి మతమున శకటరేఫమే కాని రేఫము కాదు గనుగ, పూర్వముద్రణములోని పాఠమందు 'రఱ' లకు చెప్పిన ప్రాసయతి స్వమతవిరోధమును సూచించుచున్నదని అముద్రితగ్రంథ చింతామణిలో (సం. 13. 1900. నం. 2) ఒకరు ఆక్షేపించినారు. సరియైన పాఠము దొరకనప్పుడు కవిని అన్యాయముగా దూషించవలసి వచ్చుననుటకు ఇది ఒక దృష్టాంతము. ఇట్లే. చూ. శుద్ధపత్రిక) IV. 245; V. 106 లో కూడాను.

522 ఇది (ఓ)లో చాలా భిన్నముగా ఉన్నది.

"సురపతులాఙ్గురిపై భా
స్కరులిద్దఱు సీసదీర్ఘ ॥ చరణమున కగుఁ
జరణాది పంచమాదియు
విరమములై రెంటిరెంటి ॥ వెలయఁగవలయున్."

528 సామంబుగా మించి—గావించి మైత్రికి ॥ సావరింప
మైత్రికి ॥ నామతింప

560 నారతమే తెంచు నారతమునువచ్చె

564 మొదట రెండు చరణములు (ఓ) లో భిన్నముగా ఉన్నవి.

"నానానననానున్నా
నూనను నిన్నన్న నేను ॥ నున్నని నిన్నైె"

| | | |
|---|---|---|
| V. 17 | లేకుండ నౌకట | లేకుండు నాను |
| 29 | జనియెనుమ్ము | జనియెఁజుమ్ము |
| 69 | షజ్జం | పంచం |
| | స్త్రీరలు | స్త్రీరును |
| 72 | కమికెడు | కైఁకెఁడు |
| 87 | గానవిది | గానయిది |
| 116 | భూమిసురులు | భూమిసురలు * |
| 130 | (తర్వాత) | |

పదమధ్యద్రుతలోప బింద్వాదేశముల్లు—ద్రుతాదేశ బిందువు.

| | | |
|---|---|---|
| 143 | వ్రేపల్లెను | రేపల్లెను |
| | నీరజగర్భుండు | నీరేజగర్భుండు |
| 149 | నరకపుష్పిణి | పుష్పిణీ |
| 158 | శ్రీవాసు | శ్రీదేవి |
| 162 | వెలింగెడి | వేలుంగెడి |

* కాశీఖండములో క్షితిసురలు.

II. 304 (తర్వాతను) ఓరుగంటివారిప్రతిలో

ఆరుశ్లోకములున్ను నరియొక చక్రమున్ను ఉన్నవి.

ఆద్యగ్ని రుద్రనవలోచన వేదసంఖ్యా
మార్తండ దిగృతు గణేషుచ షోడశేషు,
దైవస్వతేషు తురగేషుచ వాసవేషు
శేషం త్రయోదశపదం విదధాతి విద్వాన్. 1

నామాద్యక్షర మారభ్య మంత్రాద్యక్షర గణ్యతే,
సిద్ధసాధ్యసు సిద్ధారీన్ ప్రాదక్షిణ్యక్రమేణతు. 2

సిద్ధ సిద్ధో యథోక్తస్తు ద్విగుణాత్ సిద్ధసాధ్యవాన్,
సిద్ధస్తు సిద్ధోర్ధజపాత్ సిద్ధారిర్హంతి బాంధవాన్. 3

ద్విగుణాత్ సాధ్యసిద్ధస్తు సాధ్యసాధ్యో నిరర్థకః,
సాధ్య స్సుసిద్ధోర్ధ జపాత్ సాధ్యారిర్హంతి గోత్రజాన్. 4

సుసిద్ధ సిద్ధోర్ధ జపాత్ తత్సాధ్యస్యాధితో జపాత్,
గ్రహణాత్ తత్సుసిద్ధస్తు తదరిర్ జ్ఞాతిహా భవేత్. 5

అరి సిద్ధస్సుతంహాన్యా దరిసాధ్యస్తు కన్యకాం,
పత్నీ మరి సుసిద్ధస్తు శత్రుశత్రురధాత్మహా. 6

ఇతి మంత్రార్హాణాక్షర ఫలనిర్ణయః.

| | | | |
|---|---|---|---|
| ౧ అకఢహ | ౫ ఉజప | ౨ ఆఖదళ | ౬ ఊచప |
| ౧౩ ఓడవ | ౯ ఌఝమ | ౧౪ ఔధశ | ౧౦ ౡఞయ |
| ౪ ఈఘన | ౮ ౠఙభ | ౩ ఇగథష | ౭ ఋఛబ |
| ౧౬ అఃతస | ౧౨ ఐఠల | ౧౫ అంణవ | ౧౧ ఏటర |

III. 277 తర్వాతనున్న వచనము చివరను (ఓ) లో ఈ వాక్యము లున్నవి:—

"లంబాలక మవలంబే తం బాలం తను విలగ్న జంబాలమ్" అని లీలాశుకుల ప్రయోగమున్నది; గనుక లంబాలక శబ్దమే యిక్కడ సిద్ధము."

III. పుట 180 గర్భకందము తర్వాత (ఓ) లో గర్భగీతి మరల విడిగా వ్రాసి ఉన్నది.

IV. 513 "నాభీల కంస సంహారనందు" అని (ఓ) లో 6 వ చరణముగా ఉన్నది; దీనితో పద్యము పూర్తిగా ఉండును.[1]

[2]IV. పుట 293 మాలికా బంధము. 2. తర్వాత ఛురికాబంధమున్ను, షోడశదళచక్రమున్ను కలవు. అవి ఈ గ్రంథమందు పొరపాటున పొందుపరచలేదు.[3]

*



1. పూ. ము. లో నీపాదము లోపించియున్నది; సూర్యప్రతిలోను ఈపాదము కనఁబడదు (రా). 2. ఇది గిడుగువారి ప్రతివిషయము. ఈ ప్రతిలో నియ్యవి చేర్పఁబడియున్నవి. (రా) 3. ఈ ముద్రణములోఁ బై బంధములు పొందుపఱుపఁబడినవి (రా)
* ఈ విమర్శనము ముగింపువాక్యములు గానఁబడవు (రా).

శ్రీరస్తు

# అప్పకవీయ సమీక్ష

(క్రొత్తకూర్పు)

అప్పకవీయము ఆంధ్రభాషాలక్షణగ్రంథములలో సుప్రసిద్ధమయినది. ఇంతటి బహుళప్రచారము మఱే తెనుఁగు లక్షణగ్రంథమునకుఁ గానరాదనుట యతిశయోక్తి గానేరదు. ఈ గ్రంథకర్త కాకునూరి అప్పకవి. ఈగ్రంథము బాలసరస్వతీయాహోబలపండితీయాదులవలెఁ గవిపేరితోఁ బరఁగుచున్నది గాని, కవి దీనికి ఆంధ్రశబ్దచింతామణి యనియే నామకరణముచేసెను. (పీఠిక-104; ఆశ్వాసాంతగద్యలు) ఇది నన్నయభట్టారకునిచే సంస్కృతభాషలో రచింపఁబడిన ఆంధ్రశబ్దచింతామణి యను తెనుఁగు వ్యాకరణమునకు వ్యాఖ్యానరూపమైన తెనుఁగు పద్యానువాదము. నన్నయపెట్టిన పేరు ఆంధ్రశబ్దచింతామణి, తెనిఁగింపున కదే పేరున్నచో గ్రంథమేదియో తెలియదను తలంపునఁ గాఁబోలుఁ దరువాత మన యీ గ్రంథమును అప్పకవీయ మని కవి నామాంకితముగా వ్యవహరింపఁజొచ్చి రని యూహింప నగును.

## కవి వంశము

అప్పకవి వైదికబ్రాహ్మణుఁడు; భారద్వాజగోత్రుఁడు. ఇంటిపేరు కాకునూరివారు. ఇతని తాతకుఁ దాతయైన సోమయ మధురకు వెళ్లి యందలి బుధసమూహమును దోడరి వేదశాస్త్రపురాణాదివాదములను గాకునూరింటఁ జేసిన (గర్వమణఁగఁద్రొక్కిన) కారణమునఁ గాకునూరింటివాఁ డన ఘనతఁగాంచి చరిగొండసీమలోఁ గాకునూరను నగ్రహారము సంతరించెను. ఆ యగ్రహారమునకుఁ బౌరుషనామ ముంచెఁ గాఁబోలు. (పీ. 72-73) కవితండ్రి వెంగనార్యుఁడు వేదవేదాంగవేత్తయై మాఱుట బ్రహ్మ యని వాసికెక్కెను. తల్లి సేసమ. అప్పకవితాత పెదసోమయ సోమయాజియయ్యె. చతుర్థాశ్వాసములోని చక్రబంధమున 3, 6 వలయములలో 'కాకునూర్యపయ, సోమయాజి కవి' అను పేరువచ్చెడు. ఇందు మొదటిది కవిపేరు; రెండవది యెవరిపేరో యని సందేహించుట కెడమున్నది. అది రెండపేరు గాదు. తాత సోమయాజి గాన నప్పకవియుఁ దనపేరితో సోమయాజి శబ్దమును జేర్చుకొన్నాఁడు కావలె. ఇతనిది పండితవంశము. ఇతని పూర్వుఁడు తిరుమలభట్టు కాలామృత మను జ్యోతిష గ్రంథము

రచించె. అప్పకవి సంస్కృత ప్రాకృతాంధ్రభాషలయందుఁ జక్కని పాండిత్యము గలవాఁడు. అప్పకవీయమునకుఁ బూర్వము సంస్కృతాంధ్ర గ్రంథములఁ గొన్నింటిని రచించె. (పీ. 85). అనంతవ్రతకథ (కావ్యము), శ్రీనగాధీశ శతకము, కవికల్పకము (లక్షణగ్రంథము), సాధ్వీజనధర్మము (ద్విపద), అంబికావాదము (యక్షగానము) మున్నగునవి యీతని తెనుఁగు కృతులు. ఇం దొక్కటియు నేఁడు లభింపదు. అప్పకవి వంటివాఁడు యక్షగానము రచించుటచేఁ బూర్వకాలమునఁ దెనుఁగు వాఙ్మయమున యక్షగానముల కెంత ప్రాముఖ్యముండెనో విశదమయ్యెడు. అప్పకవి యసామాన్య పండితుఁడు. వేదశాస్త్రపారంగతుఁడు. తన గ్రంథమున నాయా విద్యాగురువులఁ బేర్కొని తన గురుభక్తిని బ్రకటించిన ధన్యుఁడు. అందుఁ దెనుఁగు లక్షణముఁ గఱపిన మంచికంటి యోబనకవీంద్రుఁడు గణనీయుఁడు. ఈకవీంద్రుఁగూర్చిన వివరములు మన కేమియుఁ దెలియరావు. అప్పకవి శ్రీశైలములో భోగివిభూషణుని పట్టపుఁ గవీంద్రుఁడుగా నుండెనఁట. (పీ. 84).

## కాలము

కవియే తన యీ గ్రంథరచనాకాలమును జెప్పుకొన్నాఁడు. కవి కిష్టదైవము కలలోఁ గనఁబడి యీగ్రంథము రచింపు మని చెప్పిన దినము శా. శ. 1578 మన్మథ శ్రావణ బహుళాష్టమి (క్రీ. శ. 3-8-1656); దశమినాఁడు గ్రంథము రచింప మొదలు పెట్టెను. (5-8-1656; చూ. పీ. 97). కవి క్రీ. శ. 17-వ శతాబ్దివాఁ డనుట విస్పష్టము.

## నివాసము

అప్పకవి నివాసస్థానము కామెపల్లి. ఇది శ్రీశైలమున కీశాన్యమునఁ దంగెడు సీమలోఁ గొండవీటికిఁ బడమటఁ గృష్ణకు దక్షిణమున నొకయోజన దూరమున నున్నట్లు అప్పకవీయము చెప్పుచున్నది. (పీ. 34, V. 172) గ్రంథము కామెపల్లి గోపాల స్వామి కంకితము. ఈ కామెపల్లి సాయప వేంకటపతిరాజుచే వట్టెము పెద్దనార్యున కగ్రహారముగా నొసఁగఁబడిన దఁట (99-100.) ఈ పెద్దన వట్టెము పోతనార్యసుతుఁడుగాఁ దోఁచెడు (80.) ఇతని సోదరి కృష్ణమ్మ యప్పకవికిఁ బితామహి. అప్పకవి తన మాతృ సంబంధులయింటఁ బెరిగి విద్యావంతుఁడై యా గ్రామమే నివాసముగా నేర్పఱచుకొనియెఁ గాఁబోలు. అప్పకవివంశ మూలపురుషులలో నొకఁడగు సోమయ నివాసము అభినవచూత గ్రామము (క్రొత్తమామిడిపల్లె). ఇతఁడు కావనూరగ్రహారము సంపాదించె. అప్పకవి తండ్రి వెంగన పలనాడులో గొప్ప పండితుఁ డని

వ్రాసి గాంచె (82.) కామెపల్లి ప్రస్తుతము గుంటూరుజిల్లా యందలి పల్నాడు తాలూకాలో నున్నది.

కవిచరిత్రకారులు వాఙ్మయచరిత్రకర్తలు అప్పకవి పల్నాటి సీమలోని వాఁడనియే యభిప్రాయపడిరి. ప్రబంధరాజవేంకటేశ్వరవిజయవిలాసము, సర్వలక్షణ శిరోమణి మున్నగు ననేకగ్రంథముల రచించినవాఁడును, అప్పకవి కించుమించు సమకాలికుఁడు ననఁదగు గణపవరపు వేంకటకవి పల్నాటిప్రాంతములోని కామెపల్లి సీమయందలి గణపవర గ్రామవాస్తవ్యుఁడు.

ఇటీవల శ్రీ ఖాద్గుల రామకృష్ణరావుగారు అప్పకవి హైదరాబాదురాష్ట్రము లోనివాఁడని తమ సారస్వత ముక్తావళిలో నిరూపింపఁ జొచ్చిరి. అప్పకవీయములోఁ బీఠికలోఁ బేర్కొనఁబడిన కాకునూరు గ్రామము, నిడుదవెల్లి, బొద్దినేపల్లి, వట్టెము, నవదళపురి (తొమ్మిదిరేకులను గ్రామము), లేమామిడిపల్లె (అభినవచూతగ్రామము) రాంపిచెర్ల ఇత్యాదిస్థలము లన్నియుఁ చరికొండసీమలో మహబూబ్‌నగర్ జిల్లాలో నున్నవని వ్రాసిరి. ఇది యింకను సవిమర్శముగఁ బరిశీలింపవలసియున్నది.

## అప్పకవీయ రచనావృత్తాంతము

భగవంతుఁడు కలలో ఆంధ్రశబ్దచింతామణి నాంధ్రీకరింపు మని కవి కానతిచ్చెను. నన్నయభట్టు చింతామణి వ్యాకరణము రచించెను. అయ్యది భీమకవిచే మఱుఁగుపడెను గాని, రాజనరేంద్రుని కుమారుఁడు సారంగధరుఁ డా సూత్రములఁ బాఠము చేసియుండెను. అతఁడు సిద్ధుఁడై చిరకాలము జీవించియుండి యా గ్రంథమును క్రీ. శ. 1608 కీలక సం॥ లో బాలసరస్వతి కిచ్చెను. అతఁడు దానికిఁ దెలుఁగు టీక వ్రాసెను. ఆ సటీకంబగు చింతామణి మతంగాచలప్రాంతీయుఁ డగు విప్రుఁ డొకఁ డప్పకవికిఁ దెచ్చియిచ్చు నని హరి కలలోఁ జెప్పెను. అట్లే తనకు లభించిన చింతామణిని బాలసరస్వతిటీక యాధారముగా నప్పకవి సవిస్తరముగాఁ దెనిఁగింపఁ బూనెను.

చింతామణి నన్నయ కర్తృకము గాదని కందుకూరి ప్రభృతులమతము. ఈ కర్తృతా విషయమున వాద ప్రతివాదము లెట్లున్నను అప్పకవి యిది నన్నయ భట్టీయమను దృఢాభిప్రాయముతో నాంధ్రీకరించె. నన్నయ కాకున్న మఱే ప్రాచీన శబ్దశాసనుఁడో చింతామణి సంతరించి యున్నాఁడనుట నిక్కము.

ఆంధ్రశబ్దచింతామణిలో సంజ్ఞ, సంధి, అజంతము, హలంతము, క్రియ అను పరిచ్ఛేదము లయిదు గలవు. ఇం దాంధ్రభాషావ్యాకరణ సూత్రములు 82 ఆర్యలచేఁ

జెప్పఁబడినవని యప్పకవి చెప్పెను. అప్పకవికి లభించిన ప్రతిలో 82 ఆర్యలే యున్నను దరువాతి యహోబలునకు దొరకిన ప్రతిలో 88 శ్లోకము లున్నవఁట. చింతామణిలోని శ్లోకములలో నాలుగుమాత్ర మార్య లని, తక్కినవెల్ల గీత్యుద్గీతు లని యిటులుండ వీనినన్నిఁటిని సామాన్యముగ ఆర్య లని వ్యవహరించుట యుక్తముగా దని వఝ్ఝలవారి సమీక్ష; కాని గీత్యాదులార్యాభేదములే యగు. అన్నింటికి ఆర్యయే మూలభూతము కాన నప్పకవివంటి ఛందఃకర్త యిట్లు చెప్పియుండు నని యూహ్యము.

అప్పకవి చింతామణి సూత్రములకు భాష్యమువంటి పద్యాత్మక వివరణము రచించెను. అప్పకవీయము సంపూర్ణముగా నేఁడు గానరాదు. కవి గ్రంథము పూర్తిగా రచించియుండ నందుఁ జివరిభాగము లోపించెనో, లేదా కవియే పూర్తిసేయక కాల ధర్మమందెనో యూహింప నలవి గాకున్నది.

చింతామణిలోని పరిచ్ఛేదపంచకమును ఎన్మిది యాశ్వాసములుగా రచియింపఁ బూనినట్లు కవియే చెప్పినాఁడు. "ముందు బృందారక భాష నశేషవిద్యాజలజాసనుం డగు శబ్దశాసనుండు సంక్షేపంబుగాఁ గూర్చిన యాంధ్రవ్యాకరణంబునందలి సంజ్ఞా, సంధి, తత్సమ, దేశ్య, క్రియాపరిచ్ఛేదంబు లయిదునుం దెనుఁగుఁబలుకుల కేను విస్తరించి భాషాపరిచ్ఛేదంబును, వర్ణపరిచ్ఛేదంబును, వళిప్రాసపరిచ్ఛేదంబును, పద్యపరిచ్ఛేదంబును, సంధిపరిచ్ఛేదంబును, తత్సమపరిచ్ఛేదంబును, దేశ్యపరిచ్ఛేదంబును, క్రియాపరిచ్ఛేదంబును నను నామంబుల నభిరామంబులగు నాశ్వాసంబు లెనిమిదిగా.........రచియింపం బూని" (గ్రంథపీఠిక. 96 వచనము.) చింతామణిలోని సంజ్ఞాపరిచ్ఛేదము అప్పకవీయమున భాషా, వర్ణ, వళిప్రాస, పద్యపరిచ్ఛేదములు నాలుగైనవి. చింతామణి ప్రతులందెల్ల సంజ్ఞా, సంధి, అజంత, హలంత, క్రియాపరిచ్ఛేదము లని ప్రకరణ విభాగములు పేర్కొనఁబడి యున్నవి. బాలసరస్వత్యహోబలపండితులు వ్యాఖ్యానించిన చింతామణిలో నిట్లే పరిచ్ఛేదనామములు వెలయుచున్నవి. చింతామణిలోని యజంత హలంత పరిచ్ఛేదముల పేళ్లకు మాఱు అప్పకవి యిందుఁ దత్సమ దేశ్యపరిచ్ఛేదములఁ బేర్కొన్నాఁడు. అజంత హలంతములకుఁ దత్సమ దేశ్యములు పర్యాయ పదములు గావు. ఇట్లు వ్యత్యస్తముగా అప్పకవి చెప్పుటకుఁ గారణ మేమో? ప్రకృత ముపలబ్ధ గ్రంథమున 5 ఆశ్వాసములే యున్నవి. కాకినాడ ఆంధ్రసాహిత్యపరిషత్పుస్తకాలయములోని 51 నెం. అప్పకవీయము వ్రాఁతప్రతిలో సంధి తత్సమపరిచ్ఛేదములకు సంబంధించిన లక్ష్యలక్షణములతో 24 పత్రములు గలవఁట. ఈ భాగము నేఁటి ముద్రితప్రతిలో లేదఁట; అప్పకవి రచియించిన మిగిలిన గ్రంథభాగము కావచ్చు

నేమో యని యా పుస్తకాలయ గ్రంథపట్టికలోఁ దెల్పఁబడినది. ఉన్న 5 ఆశ్వాసములలోఁ దెనిఁగింపఁబడిన చింతామణి సూత్రములు (శ్లోకములు) 50. అప్పకవీయములో నందులకుఁ బద్యసంఖ్య పీఠిక గాక సుమారు 1809. దీనింబట్టి యప్పకవీయాంధ్రీకరణపద్ధతి యెట్టిదో విజ్ఞు లరయుందురుగాక. మీఁదు మిక్కిలి వ్యాకరణశాస్త్రమైన చింతామణిలో ఛందోవిషయకములగు శ్లోకములు 7 మాత్రమే యున్నవి. ఇందు 'ఆద్యో వళిః' అను శ్లోకమునకు వ్యాఖ్యానము తృతీయాశ్వాసము; అట్టిదే చతుర్థాశ్వాసము గూడ. అప్పకవీయములో వ్యాకరణభాగ మగు సంజ్ఞాసంధిపరిచ్ఛేదములు రెండే యుండుటచేతను, ఛందోవిషయకమగు భాగము పర్యాప్తముగా విపులముగా నుండుటచేతను, అప్పకవీయము వ్యాకరణశాస్త్రముగాఁ గాక ఛందోగ్రంథముగానే ప్రసిద్ధి గాంచినది.

ప్రాచీనులగు తెనుఁగు కవుల మతమున ఛందోబద్ధ రచనకే కవిత యను వ్యవహారము గలుగుటచేతను, దెనుఁగు వ్యాకరణమునకు శబ్ద శుద్ధికి యతిప్రాసస్థలనిబద్ధప్రయోగములే పరమప్రమాణము లగుటచేతను, దెనుఁగు బాసలో ఛందోవ్యాకరణముల కవినాభావసంబంధము గల దనక తప్పదు. కాన ఛందస్సునందుఁ గొంత వ్యాకరణము, వ్యాకరణమునందుఁ గొంత ఛందస్సు చెప్పుట మన తెనుఁగు లక్షణగ్రంథములలో బహుళముగఁ గాంచవచ్చు. అందుచేతనే యాంధ్రశబ్దచింతామణిలో ఛందస్సంబంధి సూత్రములు కతిపయములు వెలసినవి యని యరయనగును.

అప్పకవి వ్యాకరణవిషయమున నెట్లున్నను, ఛందోవిషయమున మిక్కిలి పరిశ్రమచేసి పరిశోధించి విపులముగా నీ గ్రంథము రచించె ననక తప్పదు. తన యీ గ్రంథమును జదివినచో నితర గ్రంథములఁ జదువ నక్కఱ యుండదని కవియే యుగ్గడించినాఁడు.

"ఇది చదివిన విస్మట మఱి, యెది యేనియుఁ జదువుబుద్ధి యేలా వొడముఁగా
బడపడి గ్రంథములన్నియు, వెదకి వెదకి సారమెల్ల వివరింపంగన్." (I-7)

ఈ ప్రతిజ్ఞ పూర్తిగాఁ గాకున్నను నిందుఁ గొంతయేని నిజమున్న దనక తీఱదు. లక్షణగ్రంథము లెన్నో కలవు. అప్పకవీయము ప్రచారమునకు వచ్చిన తర్వాత మఱే యితర లక్షణగ్రంథమున కింత వ్యాప్తి రాలేదు. అప్పకవీయమును జదువని తెనుఁగు విద్వాంసుఁ డుండఁడు.

లక్షణగ్రంథములలోఁ గొన్నిటఁ గవికృత లక్షణ లక్ష్యములే యుండును. (కవిజనాశ్రయచ్ఛందోదర్పణాదులు) కొన్నిటఁ గవి లక్షణములు రచించి యితరమహా

కవిగ్రంథములనుండి లక్ష్యములఁ జూపును. అట్టి రెండవ కోవకుఁ జెందిన గ్రంథములే ప్రామాణికములై రాణించును. అప్పకవీయ మిట్టి యుత్తమశ్రేణికిఁ జెందినది. ఇందు లక్షణములను దరువాతఁ గవి స్వీయలక్ష్యములను రచించి తదుపరిఁ బూర్వకవుల గ్రంథములలోని లక్ష్యముల నుదాహరించెను. ఇం దుదాహృత లక్ష్యలక్షణగ్రంథ ములు, నందలి పద్యములు ప్రత్యేకముగ ననుబంధమునఁ జూపఁబడినవి. ఉదాహృత గ్రంథములు 73, పద్యములు సుమారు 340. అప్పకవి తనకు ముందు వెలసిన కవి జనాశ్రయము, కావ్యాలంకారచూడామణి, ఛందోదర్పణము. కవిగజాంకుశము, కావ్యచింతామణి, లక్షణసారసంగ్రహము, శారదాదర్పణము, లక్షణవిలాసము, కవి జనసంజీవని, సులక్షణసారము మున్నగు లక్షణగ్రంథముల నాధారముగాఁ గొని వానిలోని పద్యముల నుదాహరించెను.

అప్పకవి సమకాలికుఁ డనఁ దగు గణపవరపు వేంకటకవి (1676) సర్వలక్షణ శిరోమణి యను దశోల్లాసపరిమితలక్షణగ్రంథము రచించెను. ఇది యప్పకవీయము కన్నఁ బెద్దది. ఇందు అప్పకవిపే రెత్తలేదు వేంకటకవి. కూచిమంచితిమ్మన రేఫశకట రేఫ నిర్ణయ ప్రకరణములో నప్పకవిని బేర్కొనెను. (క్రీ. శ. 1740) ఈ తిమ్మన ముమ్మనుమఁడు కూచిమంచి వెంకట్రాయకవి (1850) అప్పకవీయమును విమర్శిం చుచు, సుకవిజనమనోరంజని యను లక్షణగ్రంథము రచించెను. (ఇది యముద్రితము.) కస్తూరిరంగకవి (1750) ఆనందరంగరాట్ఛందమునఁ గవి విని యెఱుఁగని యపూర్వ లక్ష్యలక్షణగ్రంథములఁ బేర్కొని పద్యముల నుదాహరించెనే కాని యప్పకవి నెందును దడవలేదు; కారణము దురూహము.

అప్పకవి వ్యాకరణ ప్రకరణములోఁ జింతామణినే యనుసరించి యా సూత్ర ముల ననువదించి సోదాహరణముగ విస్తరించెను. కాని ఛందోభాగమునఁ దనకు మున్ను వెలసిన కవిజనాశ్రయము, కావ్యాలంకారచూడామణి, అనంతుని ఛందము, కవిజనసంజీవని, లక్షణసారసంగ్రహము మున్నగు లక్షణ గ్రంథముల నాధారముగాఁ గొని నూతనాంశములఁ బెక్కింటిని గూర్చి సవిస్తరముగ లక్ష్యలక్షణములఁ బ్రదర్శించెను.

ఈ యప్పకవీయమును బెక్కు తర్వాతి లక్షణగ్రంథకర్తలు అనుసరించినట్లు నేఁటికి నముద్రితముగ నజ్ఞాతముగ నున్న లక్షణగ్రంథసంచయమును బరికించినఁ దెల్లము గాఁగలదు.

ఉప్పలూరి వేంకటరెడ్డి కృత సకలలక్షణసారసంగ్రహచింతామణిలో అప్పక వీయ విషయములే యించుక మార్చి కూర్పఁబడినవి.

మైసూరు సంస్థాన ప్రభువులవద్ద దళవాయిగా వెలసినవాఁడును (18 శతాబ్ది) ఆంధ్రవచనభారతకర్తయు నగు కళువె వీరరాజున కంకితముగా రచితమైన వీరభూపాలీయ మను లక్షణగ్రంథము (కర్తపేరు దెలియరాలేదు; గ్రంథ మసమగ్రముగా లభ్యము) ఆంధ్రశబ్దచింతామణి కప్పకవీయము వలె రచిత మయ్యెను. నేఁడు లభించు ప్రతిలో యతిప్రకరణములో అప్పకవీయలక్షణములే కవి స్వీయపద్యములతో రచించి, యందలి యితర కవుల లక్ష్యములఁ బెక్కింటి నుదాహరించెను.

చింతామణికి నన్నయ భారతము లక్ష్యగ్రంథమని, నన్నయ మూఁడు పర్వములు రచించె నని, భీమనకృత రాఘవపాండవీయమును నన్నయ యడంచె నని, యందులకుఁ బ్రతిగా నన్నయచింతామణిని భీమన రూపు మాపె నని తెల్పినాఁడప్పకవి. (పీ. 42-44).

## వ్యావహారిక భాషావచనములు

అప్పకవీయము పద్యగ్రంథమయ్యును వచనము లటనట వ్రాయఁబడినవి. ఇందొక్క విశేషమేమనఁగాఁ గవి రెండు తెఱఁగుల వచనములు రచించె. ఒకటి సలక్షణ భాషావచనము. మఱొకటి వ్యావహారిక వచనము. అవతారికలో మధ్యమధ్యనున్న వచనములు, ఆశ్వాసాంత గద్యలు గ్రాంథికభాషలో నున్నవి. తెలివిడి, టీక మున్నగు వానియందున్న వచనములు వ్యావహారికభాషలో నున్నవి. కవియే యొకచో "వరుస నన్నింటికిం డీక వ్రాయవలసెఁ దెనుఁగుమాటలఁ గడు తేటతెల్లగాఁగ (4-133)" అని చెప్పియున్నాఁడు. టీకలు వ్యాఖ్యానములు పూర్వకాలమునఁ దెనుఁగులో వ్యావహారికభాషలోనే రచితము లయి యున్నవనుట ప్రాచీన తాళపత్ర లిఖితగ్రంథ పరిశోధకులకు విదితమైన విషయము. ఇటీవలి పరిష్కర్తలు గొంద ఱీ సంప్రదాయము నెఱుఁగమింజేసి వ్యావహారిక వచనముల గ్రాంథికవచనములుగా మార్చి ముద్రింపఁ జేయుచున్నారు. ఈ యప్పకవీయము 1934 ముద్రితప్రతిలో వ్యావహారికభాషలో నున్న టీకాదులను 1951 సం. కూర్పులో నప్పటి పరిష్కర్తలు తమ యిచ్చవచ్చినట్లు గ్రాంథికభాషలోనికి మార్చివైచిరి. కవి వ్రాఁతతీరును మార్చు నధికారము పరిష్కర్తకు లేదు. కాని పరిష్కర్తలకుఁ గొన్ని పట్టులఁ బ్రమాదపతితముల సవరింపవలసిన యవసర మేర్పడవచ్చు. అట్టిచోటుల సవరణ చేసిన పూర్వరూపముల నధస్సూచిలోఁ దెలుపవలయును. ఈ కూర్పులో యతిభంగాదులను గొన్నిటిని సవరించిన పట్టుల నధస్సూచిలో నుటంకించి యున్నాను. 1951 ముద్రణములో నేను బ్రత్యేకముగ వ్రాసియిచ్చిన సవరణల నన్నియు శుద్ధపత్రమునఁ జేసు చెప్పక చూపియుఁ, గొన్నింటిని

దమవిగాఁ టీకలలో వెలువరించియుఁ గృతార్థులయిరి. యిప్పుడు వారిళ్ల సంస్థలోఁ బండి తులుగాఁ బనిచేయుచున్న యాచార్యు లొకరు. ఈ యపహరణ విషయమునుగూర్చి 1-6-1933 త్రిలింగ పత్రికలో 'సత్యసందేశము' అను వ్యాసములోఁ దెలిపి యున్నాను. 1934 సంవత్సరము ముద్రణములో నున్న ట్లీ కూర్పులో వ్యావహారిక భాషలోనే టీకలు మున్నగునవి ముద్రితము లయ్యె.

## గ్రంథ విషయ సమీక్ష

గ్రంథములోని ప్రతి విషయము సమీక్షింపఁగడఁగినచో, నది యీ గ్రంథమున కన్నఁ గొన్ని రెట్లు పెరుగును. అందుల కిది స్థలముగాదని కతిపయ ముఖ్యాంశములు మాత్రమే పరామర్శింపఁబడును.

## I. భాషాపరిచ్ఛేదము

### సత్కవి లక్షణము

అప్పకవి కావ్యముల గొప్పతనమును వివరించుచుఁ గావ్యమునఁ జెందరాని సద్గతులు గలవె యని ప్రశంసించె. యజుర్వేదము విప్రుండె కవి యని పలికె నని వ్రాసి శూద్రకవికావ్యమును నిరసించెను. (1-26) అప్పకవికి శూద్రకవులందు ద్వేషము. ఇతఁ డందుచేతనే కావలయు వసుచరిత్రనుండి స్వయముగ లక్ష్యము నుద్ధరింపలేదు. రలయతిమైత్రికి 'ఓలంబాలక' యను వసుచరిత్ర పద్యమును లక్షణ విలాసకర్త లక్ష్యముగాఁ జూపుటచే, నా పాఠము సరిగాదని యందు రలయతి మైత్రి లేదని పాఠాంతరము చెప్పి సరిపుచ్చిన సందర్భమున నాపద్యము నెత్తి వ్రాసెను. (3-277) అంతియ కాక విష్ణుచిత్తీయము పెద్దన కృతమను తలంపున నుదాహరించెను. 'బోద్ధారో మత్సరగ్రస్తాః' అన్నాఁడు భర్తృహరి. ఇట్టి జాతిద్వేషము నాఁడేకాక నేఁడును నెలకొని యున్నది. 'ఉపమ గలిగిన కయ్యల నొప్పియున్న' అన్న పద్యము (1-26) ఎత్తుగడ వసుచరిత్రను దోఁపించును. మీఁదు మిక్కిలి వసుచరిత్రకారునిపై వైమనస్య మీకవికిఁ గలదనుటకుఁ బ్రమాణ మీతని కవిస్తుతిలోని యీచరణము - 'రామరాజ విభూషణ రత్నఖచిత చారుమస్త కలాపాదివారివాక్యగౌరవము పెక్కుభంగుల గణనచేసి' (పీ. 27) అప్పకవి మతమ్మున సత్కవి ధరణీసురుఁడు కావలయును. (1-44) కవిత యొకరి సొమ్ము గాదు గదా? సర్వశాస్త్రవేత్తయై, ధారాశుద్ధి, ప్రతిభావ్యుత్పత్తులు గలవాఁ డెవ్వఁడైనను గవి శబ్దవాచ్యుఁడు గావచ్చు. ఇది విషయాంతరము.

ప్రాచీనులు 'నా నృషిః కురుతే కావ్య' మన్నారు. అప్పకవియుం నీ సూక్తి నుద్ధరించెను. (1-43) కుకవులను వ్రణమక్షికలతో, సుకవుల క్షీరగ్రాహి హంసలతోఁ

బోల్చెను. 'సుకవితా యద్యస్తి రాజ్యేన కిం' మిత్యాది సుభాషితముల నుద్ధరించి కవితా ప్రశంస గావించెను. విరచించుశక్తి పుట్టని పురుషుల చదువులు ప్రకాశము గావఁట. ఇది ప్రత్యక్షర సత్యము. కేవలపండితులకుఁ బ్రాదేశిక తాత్కాలిక గౌరవమే కాని కవులకు సార్వత్రిక సార్వకాలిక కీర్తి చేకూరును.

## ఆ శు క వి త

చతుర్విధ కవితలలో నాశువు మొదటిది. మన కవి కీ యాశుకవితయందు నిరసనభావము గలదు. 'నిలుకడ వలయుఁ గృతికి' అన్నాఁడు (1-59) కవు లంద ఱాశుకవిత చెప్పలేరు. సామాన్యుల యాశుకవితలో గణబద్ధ రచన యుండునే కాని కవిత యను విశిష్టపదార్థ ముండదు. అట్టి చక్కని కవిత నాశువుగాఁ జెప్పఁగలిగిన వారినే యాశుకవు లందురు. అల్లసాని పెద్దన యుత్పలమాలిక యాశుకవిత, రామరాజ భూషణుఁడు శతలేఖినీపద్యసంధానధౌరేయుఁడు, ఆశుప్రబంధబంధాభిజ్ఞుఁడు ప్రాచీనులలో నాశుకవిచక్రవర్తులు వెలసిరి.

ప్రాచీనులలో శ్రీనాథుఁడు, అల్లసానిపెద్దన, తెనాలి రామకృష్ణుఁడు, చరిగొండ ధర్మన్న, నెల్లూరి వీరరాఘవకవి, కూచిమంచికవులు, కాణాద పెద్దన, కుందుర్తి వేంకటాచలకవి మున్నగువా రాశుకవులు. 19-వ శతాబ్దిలో మండపాక పార్వతీశ్వర శాస్త్రి యాశుకవులలో మేటి. ఇఁక నర్వాచీనులలోఁ దిరుపతి వేంకటకవుల శతావధానాశుకవితా దిగ్విజయ యాత్రనుగూర్చి యెఱుఁగనివా రుండరు. అప్పకవి చెప్పినట్లు గాక తిరుపతికవుల యాశుకవిత హృద్యమై యనవద్యమై రసప్రతిపాద్యమై రాణించును. ఇఁకను గొంద ఱట్టివారు గలరు.

## తె నుఁ గు - వి కృ తి

తెలుఁగుభాషకు వికృతి యను నామకరణము చింతామణిలోఁ జేయఁబడినది. దాని ననుసరించి బాలసరస్వతీయాదులందు వికృతిపదము ప్రయుక్తమైనది. తెల్గు వికృతి యనఁగ వెలయు నని చింతామణి ననువదించినాఁ డప్పకవి. (1-84) మఱి యే ప్రాచీన పద్యాత్మ కాంధ్రవ్యాకరణమునఁ దెలుఁగునకు వికృతి యను పేరు చెప్పఁబడలేదు. తద్భవమునకు వికృతి పర్యాయపదము గావచ్చుఁ గాని యచ్చతెనుఁగునకు దేశ్యమునకుఁ జేర్చి వికృతిసంజ్ఞ సమంజసము గాదు. తత్సమ తద్భవములు సంస్కృత సంబంధులు; దేశ్యము సంస్కృత భిన్నము. అట్లుండఁగాఁ దద్భవదేశ్యాత్మకమైన యచ్చతెనుఁగునకు వికృతి యనుపే రెట్లు పొసఁగునని తలఁచిరో ?

## ప్రకృతి వికృతి నిరూపణము (1-85-97)

తెలుఁగు వికృతులు కొన్ని సంస్కృత భవములు; కొన్ని ప్రాకృత భవములు. చంద్రశబ్దమునకు 'చేందురుఁడు' అనునది శుద్ధ సంస్కృతమువలన నేర్పడిన తద్భవము. ప్రాకృతభవమైనచో 'చందుఁడు' అనవలె. చందుఁ డను రూపము అప్రయుక్తము గావున చందురుఁ డను సంస్కృత భవరూపమే గ్రాహ్యము. అట్లే లక్ష్మీ శబ్దమునకు సంస్కృతమువలన నయిన తద్భవము 'లకిమి.' ప్రాకృతభాషవలన నయిన తద్భవము 'లచ్చి'. ఈ రెండు తెలుఁగుల తద్భవములలోఁ బూర్వకవులు 'లచ్చి' యని మాత్రమే ప్రయోగించిరి; 'లకిమి' అప్రయుక్తము. కాన లక్ష్మికి లచ్చియను ప్రాకృతభవరూపమే కలదనవలెను. అప్పకవి మఱియుఁ గొన్ని తద్భవములకు మూలప్రకృతులయిన శౌర సేన్యాది భాషాపదములఁ బ్రాకృత వ్యాకరణ సూత్రముల నుదాహరించి చూపెను.

## ఆంధ్ర దేశ్య భేదములు

చింతామణిలో భాషాభేద చతుష్టయమున దేశ్య మొక్కటే పేర్కొనఁ బడినది. అప్పకవి అచ్చతెనుఁగు నాంధ్రభాషాభూషణాదుల ననుసరించి ప్రవేశ పెట్టెను. శుద్ధాంధ్రదేశ్యములు, అన్యదేశజాంధ్రములు, తెలుఁగు మఱుఁగులు, ప్రాఁదెనుఁగులు, తద్భవములు గలిసి యచ్చతెనుఁ గనఁబడు నని యప్పకవి వివరణము (1-111). అబ్ధిమేఖల యను సంస్కృతశబ్దమునకుఁ గడలి మొలనూలి చేడియ యను తెనిఁగింపు తెనుఁగు మఱుఁగు (1-112). ఇట్టివి యచ్చతెనుఁగు కావ్యములలో సర్వత్ర ధారాళముగా వెలయుచుండును.

## గ్రామ్యభాష

"చులకఁగా గ్రామ్యజనములు పలుకునట్టి తెనుఁగు మాటలు గ్రామ్యములు; ఇట్టివి కావ్యములఁ జొరవు." అని వ్రాసిన యప్పకవి తన గ్రంథమున టీకలు, తెలివి డులు వ్యావహారిక (గ్రామ్య) భాషలో వ్రాసియున్నాఁడు. కావ్యములలోని వచన ములలో నిట్టివి చొరవని యాతని యభిప్రాయమనుట స్పష్టమయ్యె. చెవులు, కనులు, ఋగ్గలు ఇత్యాదులగు గ్రామ్యములు వాడరాదని యప్పకవి చెప్పెను. (1-118) ఈ శబ్దములలో పండ్లు చండ్లు ఇత్యాదులు గొంతవఱ కసభ్యములు గావచ్చు; కాని చెవులు కనులు మున్నగువానికి గ్రామ్యత యె ట్లారోపించెనో వింతగా నున్నది. మది రాక్షి చెవులు, ముద్దియ కనులు అని యీరీతిగా స్త్రీవర్ణనలో శృంగారరసమున వాడ రాదని తలఁచెనేమో ? అప్పకవియే 'కవులకుఁ జెవుల పండువులు సేయు' (4-569) 'శిక్షనాస నిరుక్తంబు చెవులు' (4-9) అని ప్రయోగించె. అప్పకవి గ్రామ్య మని

నిరసించిన కనులు, చెవులు మున్నగువానికిఁ బూర్వప్రయోగము లున్నవి. ఇట్లే ఆడ - ఆకడ శబ్దములో నక్షరవిలోపము - ఇది గ్రామ్యము (1-124) ఆడకు భారత ప్రయోగము గానరాలేదు గాని, ఆడవంటిదే యగు ఏడ (ఎక్కడ) కు నన్నయ ప్రయోగము గలదు.

ఏనేడ నింద్రాదులేడ వారలకు నెప్పుడు మ్రొక్కుదు (అర 2-47)

'కనిరొ' అనుటకు 'కనె' అను రూపము గ్రామ్య మని యప్పకవి మతము. 'కనె, అనె, చనె' ఇత్యాదిరూపములకు నన్నయభారతమున నిర్ధారక ప్రయోగములు గానరావు. ఆదిపర్వములోనిదిగా నప్పకవి చూపిన పద్యము (1-130) శృంగార శాకుంతలములోనిది.

## 2. వర్ణ పరి చ్ఛే ద ము

ఇందు వర్ణసమామ్నాయము, వర్ణోత్పత్తిస్థానములు, లిపిలేఖనక్రమము, కావ్యాది గ్రామ్యవర్ణములు, వర్ణశుభాశుభఫలములు, మాతృకార్చనావిధానము మున్నగునవి విశదీకరింపఁబడెను.

### నకారము - ద్రుతము

ఆంధ్రశబ్దచింతామణిలోఁ బదాంత నకారమునకు ద్రుతసంజ్ఞ విధింపఁబడెను. (ద్రుతాఖ్యో నః) కాని యప్పకవి వర్ణసమామ్నాయములోని కేవల నకారమునకు ద్రుతసంజ్ఞ చెల్లునని యపోహపడినాఁడు. ఇది పొరపాటు. చూ. ద్రుతమనంగ నకార మతిశయిల్లు (2-18) విజ్ఞానమునకు భావింప విన్నాణంబు...తద్భవంబున ద్రుతత్వంబుగాంచి (3-56) అల ద్రుతంబునకును మధ్యమానునాసికమునకును జెల్లు నను నాసికయతు లనఁగ (3-52).

### ఆం ధ్ర లి పి లే ఖ న క్ర మ ము

అప్పకవి తెలుఁగక్కరములకుఁ జూపిన యాకారము లొక్కొక్క ప్రతిలో నొక్కొక్కరీతిగా నున్నవి. అప్పకవి స్వయముగా వ్రాసినప్రతి లభించినఁగాని యాతఁడు వానినెట్లు వ్రాసెనో చెప్పఁజాలము. ఆంధ్రలిపిలేఖనక్రమశ్లోకములు (బాలేందు పరిధిశృంగా-ఇత్యాది-పు-48-50) చింతామణిలోనివిగా నప్పకవి వివరించె. అప్పట్టున నది నన్నయనాఁటి లేఖనక్రమము కావలయు. నన్నయనాఁటి వ్రాఁత తీరునకు నందంపూఁడిశాసన లేఖన క్రమము సరిపోల్చిచూడవలయు. నన్నయ కాలమున నాంధ్రకర్ణాటభాషలకు లిపియొక్కటై యుండెనని 14-వ శతాబ్దినుండి యీ యుభయలిపులు విడివడి నేఁటి యాంధ్రకర్ణాటలిపు లయినవని పరిశోధకుల యభి

ప్రాయము. ఈ లిప్యుద్ధారకశ్లోకములు బాలసరస్వతీయమున లేవు. అప్పకవిపుస్తకము నుండి గ్రహించిన ట్లహోబలపండితుండును వ్రాసి కొనెను.

ఇచ్చోట మన కవి పామరుల వ్రాఁతలోని దోషములు కొన్ని తెలుపు చున్నాఁడు. 'స్వర్గమును' ప్రాచీనులు 'స్వగ౯ము' అని రేఫమీఁది హల్సంయోగమున వలపలగిలక వ్రాయుటవాడుక. ఇట్లు వలపలగిలక వ్రాయుట సరిగాదనుచున్నాఁ డప్పకవి (2-41). నిన్న మొన్నటివఱకు వ్రాఁతలో వలపలగిలక వ్రాయుట ధారాళముగాఁ గానవచ్చెడు. ఇది సంస్కృతలేఖనపద్ధతి ననుసరించి వచ్చియుండును. 'స్వగ౯' - సంస్కృతలిపిలో నిట్లుండును. 'स्वर्ग'

ఇట్లే పూర్ణబిందువుమీఁది హల్లును ద్విత్వముగా మూఢమతులు వ్రాయుదురఁట. ప్రాచీనశాసనములలోఁ దాళపత్రలేఖనములందును అప్పకవి చెప్పిన లేఖనక్రమము గాన నగును. యుద్ధమల్లుని బెజవాడ శాసనములో కాతి౯కేయు (కార్త్తికేయు-అనుటకు) ఎత్తించ్చె (ఎత్తించె ననుటకు) అను వ్రాఁతపద్ధతి చూపట్టెడు.

ఇరులు (యిరులు) ఈఁగ (యీఁగ) ఊరు (వూరు) ఒక్కఁడు (వొక్కఁడు)-అజాదులైన ఇరులు మున్నగువానియందు మొదట నంతస్థములు వ్రాయరాదని తెలిపె. (2-43)

## సంస్కృత భాషావర్ణములు

అనంతామాత్యుఁడు 50 అక్షరముల నిర్దేశించె. అందు ళలల కభేదమని ళకారము విడనాడి క్షకారము చేర్చుకొనెను ఏకనీళము దేవహేళనము అని వేదమందును. కాళనాళవ్యాళేత్యాది సంస్కృత శబ్దము లందును ళకారము గలదని దానిం జేర్చుకొని, క్షకారము సంయుక్తాక్షర మది చేర్పరాదని నిరూపించి, యనంతుని మతమును ఖండించె (52, 54, 55)

## అచ్చ తెనుఁగు అక్షరములు

'షట్త్రింశదత్ర తే' అని చింతామణి సూత్రము. తెనుఁగునకు వర్ణములు ముప్పదియాఱని నన్నయ యుపదేశించెను. అందు ఱకారము చేరదు. 'య ర ల వ' లను నాలుగంతస్థము లుచ్చారణనుబట్టి లఘువులు అలఘువు లని రెండు భేదములు గలవి. వర్ణసమామ్నాయమున వానికిఁ బృథగ్గణనము చేయఁబడలేదు. లఘ్వలఘు యవలకు భిన్నలిపి లేదు గాని, నేఁటి కాలమున లఘ్వలఘు రేఫలకారములకు (ర ఱ; ల-ళ) భిన్నలిపులు గలవు. నన్నయ కాలమున వీనికి సయితము ప్రత్యేకలిపి లేదు కావలె. అప్పుడు ర ల ల తలపై బొట్టుంచుట యలఘుతా సూచకము (గురురకాచ

బిందుయుతో - చిం). సహాళమ్మను దళములోని ళకారము అలఘుళకారము గాదు; ఇది వర్ణాంతరము. నన్నయ హృదయము గ్రహింపఁజాలక తన కాలమున ఱకారమునకు వ్రాఁత వేఱుండుటంబట్టియు, రేఫఱకారనిర్ణాయక గ్రంథము లుప్పతిల్లుటంబట్టియు అప్పకవి శకటరేఫను సయితము వర్ణములలో గణింపవలెనని తలంచి చింతామణి పాఠము 'సప్తత్రింశదిహాన్యే' (పుట 52) అని సవరించి 37 అక్కరముల నిర్దేశించెను. అహోబలపండితుఁడు దాని నామోదించెను. నన్నయకాలమున నలఘు రేఫము ప్రత్యేక వర్ణముగా గ్రహింపఁబడెనో లేదో గాని, తర్వాత నచిరకాలమునకే దీనికిఁ బ్రత్యేకరూపము సిద్ధించినదని యూహింపనగును. కవిజనాశ్రయ కావ్యాలంకారచూడామణులలో నెక్కటివడిలో ఱకారము పేర్కొనఁబడి యున్నది. అనంతుఁడు 'తెనుఁగున ఱ ళ లనఁగ రెం డధికమం డ్రు హరీ' యని వర్ణ నిర్దేశమున వ్రాసెను. తర్వాతి లాక్షణికులు ఱావడిని జెప్పిరి; ఱకారమును వేఱుగా గ్రహించిరి, రేఫశకటరేఫనిర్ణాయక గ్రంథముల సంతరించిరి.

## క్రారకొమ్ము - వట్రువలు

అచ్చ తెనుఁగునఁ గ్రారకొమ్ములుండునే కాని వట్రువ లుండవు. వట్రువలు (ఋత్వములు) సంస్కృతములోనివి. 'క్రుమ్మరు' అను దానిని 'కృమ్మరు' అని వ్రాయరాదు. సంస్కృతమున రెండును గలవు. క్రుధ, క్రూర ఇత్యాదులందుఁ గ్రారకొమ్ములు, కృష్ణ, వృత్త, పృథ్వి ఇత్యాదులందు వట్రువ లున్నవని యప్పకవి యిట్టి పదములు కొన్ని తెలిపెను. (66, 72) ఇట్లు తెలుపుటచే నేటి పరిశోధకులు కొందఱు నిరూపించు 'రు-ఋ' వడి యప్పకవి కెంత మాత్రము సమ్మతము గాదనుట స్పష్టము. క్రారకొమ్ములకు వట్రువలు, వట్రువలకుఁ గ్రారకొమ్ములు సామాన్యులే కాక పండితులును బ్రమాదవశమున నొకచో వ్రాసెదరు. 66-వ పద్యమున 'ధ్రువమును ద్రుతమును భువిఁ గ్రారకొమ్ములై తనరారుఁగాని ఋత్వములుగావు' అని వ్రాసిన యప్పకవియే యీ క్రిందిచోట్ల యతిస్థానమున 'ధృవ' అను ఋత్వయుక్తరూపమును బ్రమాదవశమున నిలిపినాఁడు.

దేవకీ ప్రియనందనా + దివిషద్వంద్యా + ధృవసన్నుతా (4-326)
ధృతచక్రధర నరసింహ + ధృవ శోభి (4-572)
తేజః శ్రీ పెరుగఁగ మది + ధృవముగ (4-364)

ఈమూఁడవచోట మాత్రము 'దృఢము' అను పాఠాంతరము చూపఁబడినది. రెండవదానిలో 'ధృత'కు మాఱు 'ద్రుత' అను మార్పు సముచితముగా నుండు నని నా తలంపు.

## ఆదివ్యంజనలోపము (75)

పూను, పెగయు, పొదవు, పొనరు, పొందు అను శబ్దముల మొదటిహల్లునకు లోపమురావచ్చును. అనఁగా ఊను, ఎగయు, ఒదవు, ఒనరు, ఒందు అని చెప్పవచ్చు. రెంటి కర్థభేదము లేదు. కాని చిన్నయసూరి యీ యప్పకవీయలక్షణమును మనమున నిడుకొని 'పూను పొదవుల కాదిలోపం బొకండు వచియించె నది యవిచారమూలకంబు' అని వ్రాసెను. (బాల - ప్రకీర్ణ - 10) ఇందలి యొకండు అప్పకవిని సూచించును. అప్పకవి నిందేకాక మఱొక్కయెడ నిట్లే సర్వనామముచే సూచించి యాతని మతమును ఖండించెను. 'అనుకృతిని నిడుదకుం గుఱుచయగునని యొకండు వలికె నది నిరాకరంబు (బాల - సంధి - 54) 'అనుకరించెడుచోట నవ్యయాదుల కొనఁగల బొట్టుగవకు దీర్ఘంబులకును వచ్చు లోపము కేశవాయతుభ్యంనమ యనఁగ రామోఘ సంహర్త్రయనఁగ (5 - 98) అనుచోట అనుకృతిని దీర్ఘమునకు హ్రస్వ ముపదేశించినాఁడప్పకవి. ఇది యమూలకము. ఇందులకుఁ బూర్వకవి ప్రయోగము మృగ్యము. కాననే సూరి యాక్షేపించె. ఇఁకఁ బూను పొదవుల విషయము నరయుదము. పూను పొదవులకున్న యర్థము లన్నియు 'ఊను ఒదవు' లకు లేదను తలఁపున సూరి యిట్లాక్షేపించెనేమో ? సూర్యరాయనిఘంటువులో 'ఊను = పూను' సకర్మక క్రియయందు రూపాంతరములుగాఁ జూపఁబడినవి గాని, యకర్మక క్రియయందుఁ జూపఁబడలేదు. శబ్దరత్నాకరము పొదవుశబ్దము గ్రహించనేలేదు. ఒదవు పొదవులు రూపాంతరములు సమానార్థకములు. ఒకచో నెల్లయర్థములు ద్వైరూప్యములందు సరి పడకున్నను నే కొన్ని యర్థములోఁ గలసివచ్చునపుడు వాని కా యర్థములం దభేద స్థితి గ్రహించుటలో దోషము లేదు. సూరి యుదాహరించిన 'పొందు ఒందులు' క్రియావాచి యగునపుడు సమానార్థకము లగుఁగాని విశేష్యమగుచో పొందుయొక్క యర్థము (సంధి, స్నేహము) ఒందునకుఁ గుదరదు గదా! సూరి కప్పకవిపై నిరసన భావ మున్నట్లు స్ఫురించెడు. ఇందులకుఁ గారణము లేకపోలేదు. ఇది విషయాంతరము.

## యౌవనము - యవ్వనము

యౌవన యౌవతాదిశబ్దముల మొదల యకారముపై ద్వితీయ వక్రతమము (ౌ) లున్నవని యప్పకవి చెప్పెను. (106) అనఁగా యవ్వన మనురీతి నుచ్చారణ నుబట్టి వ్రాయరాదని దాని యర్థము. కాని ప్రాచీనమహాకవులు కొందఱు తెలిసియో తెలియకయో 'యవ్వన శబ్దమును' బ్రాసస్థానమున నిలిపి రచించియున్నారు.

క్రొవ్విరి తమ్మితావిఁ గొని......మహేశుఁడ యవ్వను
యవ్వన వారి పూర్ణ సురతాబ్ధి (నన్నిచోడ కుమారసంభవము. 8-157

నవ్వుచుఁ జెక్కుమీటి......సీ
యవ్వన లక్ష్మికిక్ భటుఁడ నైతి (భోజరాజీయము. 7-108)
అవ్వనములు దమ మయమై యవ్వనమున నొకటి కొకటి యఱుముచు
(మడికి సింగన - పద్మపురాణము. 1-91)

'జవ్వనము' అను తద్భవరూపములోని ద్విత్వము కలిమింజేసి యౌవన శబ్దము లోను ద్విత్వము భ్రమ ప్రమాదజనితమై యుండనోపును.

## గకారమునకు వకారము

"ఆఁగె లోఁగెను వీఁగెను డాఁగెనేఁగె, వాఁగె నను నివి మొదలగు వాక్యములను బొదలు నక్షరములు చిన్నబొట్లపై గ, కారములుగాని యనునాసికములు గావు"
(2-116)

'క్వచిద్గకారో వః' అను చింతామణి సూత్రమునకిది వివరణము. పరుగు- పరువు, పగడము - పవడము, నగుఁబాటు - నవుఁబాటు ఇత్యాది శబ్దములందు గకారమునకు వకారము వికల్పముగా వచ్చును. కాని యరసున్న మీఁది గకారము వకారము గాదు.

'ఆఁగె - ఆవె' అని కాఁజాలదు. ఇట్టి గకారము వకారము గాదని తెలుపుటకై పై పద్యము రచింపఁబడినది కాని గకారముపై ననునాసిక మని యుంట పొరపాటు. కాన 'గకారములుకాని యంతస్థకములు గావు' అని సవరింపనగును.

ఈ నా సవరణను బూర్వముద్రణలోఁ దత్పీఠికాకారులు తమదిగా వెలయించికొనిరి. ఈ లక్షణము కొంత పరిశీలింపవలసియున్నది. తీఁగియకు తీవియ రూపాంతరము. తీఁగ సార్థబిందుకముగా నప్పకవి తలంచినట్లున్నది. (చూ. III - 307 - ఖండాఖండ ప్రాస) తీగియలో లేని యరసున్న తీఁగెలో నెట్లుండును ? తీఁగ సార్థబిందుకము గాదనవలె. 'లోఁగె' సార్థబిందుకముగానిచ్చి 'లోవె' కాదన్నాఁ డప్పకవి. కాని 'లోఁగు - లోవు' రూపద్వయము శ. ర. లోఁ గలదు. మఱియు 'ఒనఁగు - ఒనవు' అను రూపద్వయము గానవచ్చెడు. ఇట్టివి పై లక్షణమున కపవాదములు గానోపు.

## పాండురాజు - దంత్యతాలవ్య జకారము

"అకట పాండురాజయశమెన్న వైతతి
కూరదశరథేశ కులము రోయ."
(2-136-137)

అను రాఘవపాండవీయ పద్యములో రామాయణార్థమందు 'పాండుర+అజయశ' మని సమాసము చేసి పలుక జకారము తాలవ్యమగు. భారతార్థమున 'పాండురాజ' అని సంబుద్ధిగాఁ బలుక ఆ వర్ణమే మఱల దంత్యమగు. తత్సమమైనను రాజు శబ్దములోని జకారము దంతోచ్చారణ కల దని కొందఱ మతము. రాజు శబ్దం బొక్కటి దంత్య

యుక్తంబు కానంబడియెడి నని సూరియుం సూత్రించె. (సంజ్ఞ. 10) అప్పట్టున నిందలి జకార మొక యర్థమునఁ దాలవ్యమును మఱియొక యర్థమున దంత్యమును గావలసి వచ్చు. ఈ యప్పకవి ప్రసంగముఁ జూచియుం, సూరి సూత్రమును ననుసరించియుఁ బ్రౌఢ వ్యాకరణకారుఁడు 'ఓకారౌకచో జకారం బుభయంబునగు' (సంజ్ఞ. 5) నని సూత్రింపవలసి వచ్చె. ఇట్లు చెప్పుటకంటె నప్పకవి సమర్థనము సమంజస మని తోఁచెడు. శుద్ధ సంస్కృతమైన పాండురాజ శబ్దమందుఁగల జకారము తాలవ్యమే కాని దంత్యము కానేరదు. ఇఁక రామాయణార్థమునఁ దాలవ్య మని చెప్పవలసిన యవసరము లేదు; కాన నుభయార్థములఁ దాలవ్యమే యగునని యప్పకవి యభిప్రాయము. సూరి దంత్య మని భావించిన రాజు తద్భవము. తత్సమతద్భవములందు రాజు శబ్దము గలదు. యయాతి చరిత్రాది శుద్ధాంధ్రకావ్యములలో రాజు ప్రయుక్తము. అప్పకవి సులభముగా నీ విషయము సమర్థించియుండఁగా, బాల ప్రౌఢవ్యాకర్తలు వక్రమార్గములఁ ద్రొక్కిరి.

## ద డ ల యభేదత - డంభశబ్దము

'దిండీర - డిండీర, దిగ్గియ - డిగ్గియ' అని సంస్కృతాంధ్రములలో దకారమునకు డకారమును వచ్చును. ఇందు 'దంభ - డంభ' శబ్దములఁ జూపె నప్పకవి. సంస్కృతమున దంభధాతువున్నది గాని డంభధాతువు లేదు. సంస్కృతనిఘంటువులలో డంభశబ్దము గానరాదు. కాని తెనుఁగు కవులు ప్రయోగించియున్నారు.

డంభాచారము లుజ్జగించి రిపు గాఢక్రీడ నిర్జించి లో
శుంభద్విద్యలఁ జేర్చి... (కావ్యాలంకారచూడామణి 2-132)
డంభమయాన్యదర్శన విడంబనుఁ దష్టమదాపహారియూ
శుంభదుదారకీర్తి (వృషాధిపశతకము - 84)

## ప దా ది యె కా ర ము

చింతామణిలో 'అద్యః క్రియాసు భూతార్థ ద్యోతిన మాద్యగం వినా సర్వః' అను సూత్రము గలదు. ఇది పదాది యకారము తెనుఁగులో ఎత్వ యుక్తమని చెప్పుచున్నది. 'యెవఁడు, యెక్కడ' అనురీతి నుండునని దాని యర్థము. పామరు లిట్లే వ్రాయుదురు. సంధిలో యకారహల్లు లోపించి స్వరము శేషించునని (అతఁడు + యెక్కడ - అతఁడు + ఎక్కడ - అతఁడెక్కడ) 'సర్వత్రాజ్వత్కార్యం జ్ఞేయం యస్య' అను మఱొక సూత్రముపదేశించెడు. ఎవ్వఁడు, ఎక్కడ మున్నగు మాటలలో నాదిలో నిది స్వరమే కాన ఎత్వవిశిష్ట యకారమని చెప్పుట సరిగాదని తలఁచి యప్ప

కవి పాఠము మార్చివైచెను. (అద్యః క్రియాసు భూతార్థసముద్యోతితం వినా సర్వః - పుట 72) దీనినిమాత్రము మార్చనే కాని, సర్వత్రాజ్వత్వార్య మిత్యాది సూత్రము దొలఁగించియుండవలసినదై యుండఁగా నటుసేయక దానిని సంధిపరిచ్ఛేదమున వివరించి యున్నాడు. (5 - 40)

## రే ఫ ఱ కా ర ము లు

అప్పకవి మతమున లఘురేఫ శకటరేఫములకు యతిప్రాసమైత్రి నిషిద్ధము. అప్పకవికేకాక మఱికొందఱు పూర్వలాక్షణికుల మతమునను వీనిమైత్రి యంగీకృతము గాకున్నది. దానంజేసి యేయేశబ్దములందు లఘురేఫములు శకటరేఫములున్నవో పరిశీలించి లాక్షణికులు తాళ్లపాక తిరుమలయ్య, చిత్రకవి పెద్దన మున్నగు వారప్పకవికిఁ బూర్వమునను, కూచిమంచి తిమ్మన, అడిదము సూరన, గణపవరపు వేంకటకవి, ఓగిరాల రంగనాథకవి, భారతము లక్ష్మీపతి ప్రభృతులు తరువాతను రేఫఱకార నిర్ణయగ్రంథములు సంతరించిరి. అప్పకవియు రేఫఱకార సీసమాలికలు రచించెను. రేఫఱకార నిర్ణయము గావించినవారు పూర్వులగు ప్రామాణిక కవుల గ్రంథములలో యతిప్రాసస్థల నిబద్ధరేఫముల నాధారముగాఁగొని యుభయరేఫల పట్టికలఁగూర్చిరి. ఆ యా గ్రంథములలోఁ బద్యములలో సంస్కృతశబ్దగతరేఫలతో యతిప్రాసమైత్రిఁ జెందిన తెలుఁగుశబ్దములందలి రేఫలు లఘురేఫ లని, సంస్కృతశబ్దగతరేఫలతోఁ గాక శకటరేఫోచ్చారణ గల ప్రసిద్ధశబ్దములలోని ఱకారములతో యతి ప్రాసమైత్రి గల యితర శబ్దముల రేఫలు శకటరేఫములని నిర్ణయించెడివారు. ఇందులకు మఱికొన్ని నియమములఁగూడ నేర్పఱచుకొనిరి. అప్పకవి కవిత్రయ సోమభాస్కరుల గ్రంథములనే యీ నిర్ణయముపట్లఁ బ్రమాణముగా గ్రహించె. (195). ఒకచో రేఫతోను, మఱొకచో శకటరేఫతోను మైత్రిఁజెందిన యొకే శబ్దములోని రేఫకు ద్వైరూప్య మంగీకరింపఁబడెను. నన్నయ యెందును రఱయతిప్రాసమైత్రీ సాంకర్యముచేయ లేదని పరిశోధకుల యభిప్రాయము.

అప్పకవిచేసిన రేఫఱకారనిర్ణయములోఁ గొన్ని మతభేదములు, ప్రమాదములు గలవు. కొన్ని యా యా పుటలక్రింద నధస్సూచికలోఁ జూపఁబడెను. కారులు, ఊరుము, చెరుచు అను శబ్దములు లఘురేఫఘటితములుగాను, ఇరులు, గోరవంక, తిరుగలి, ఎదురు (కట్టెదురు), పరుసదనము, పడమర, చేరెఁడు, రెమ్మ, రోయు, పూజరి, పాంతకారి అనుశబ్దములు శకటరేఫాన్వితములుగాను జూపినాఁడప్పకవి. కారులు ఇత్యాదులలో శకటరేఫములు, ఇరులు ఇత్యాదులలో సాధురేఫములుమాత్రమే కలవని ప్రామాణిక ప్రయోగములు దెలుపుచున్నవి. పూజరి (పూజ+అరి), పాంతకారి అను శబ్దములలోని 'అరి, కారి' తద్ధితప్రత్యయములు సాధురేఫఘటితములనుటకు

సందియము లేదు. అప్పకవి ప్రయోగపరిశీలన చేసినవాఁ డనుటలో సందియము లేదు గాని, రేఫఱకారనిర్ణయమునఁ దాళ్ళపాక తిరుమలయ్య యిచ్చిన పట్టిక ననుసరించెనని తోఁచుచున్నది. ఇట్లే కూచిమంచి తిమ్మన యప్పకవి ననుసరించె. 'తద్భవములయందును ఱకారములు లేవు' (196) అని వ్రాసె నప్పకవి. దీనినే ప్రమాణముగాఁగొని సూరి 'శకటరేఫము తత్సమతద్భవములందు లేదు' అని సూత్రించెను. (సంజ్ఞ - 18) ప్రౌఢ వ్యాకరణకారుఁడు 'తద్భవములందు సలఘురేఫము గలదు. (సంజ్ఞ. 9) అని సూరి సూత్రమును సవరించెను. అహోబలపండితుఁడును దద్భవములందు ఱకారము గల దనియె. ఉదా॥ తత్సమ తద్భవములు - కారిక - కాఱియ, పర - పెఱ, భీరు - పిఱికి, మూర్ఖ - మొఱకు - మొ.

దీర్ఘములపై బండిఱాలు గలుగవన్న వెల్లంకి తాతంభట్ట మతము నప్పకవి ఖండించి యుదాహరించె. (ఆఱు, ఆఱడి, ఏఱు, కాఱియ, కోఱలు, జాఱుట, నూఱు, పాఱు, వేమాఱు, వీఱిడి, మొ - ఱకార సీసమాలిక. చూ. II-197) రేఫ ఱకార నిర్ణయము దెలియని శబ్దములను బుధులు యతిప్రాసస్థానముల నుపయోగింపరఁట. (218) రఱలకు దేవదానవులకున్న వైరము గల దని నొక్కి వక్కాణించె. రఱప్రాస సాంకర్యము చేయుటచేతనే పోతన భాగవతము సలక్షణము కా దని లాక్షణికులచే నుదాహృతము గాదయ్యెనని చెప్పినాఁ డప్పకవి. అప్పకవి పోతన నిట్లు విమర్శించెనే కాని ప్రాచీనకవులు కొందఱు రఱయతి ప్రాససాంకర్యము చేసియున్నారని యాతఁ డెఱుఁగఁడు కాఁబోలు. కూచిమంచి తిమ్మన యీ విషయమున నప్పకవి మతమును విమర్శించె.

"అలసానిపెద్ద కవి పింగళి సూరన రామభద్రకవివర్యుఁడు పి
ల్లలమఱ్ఱి వీరభద్రుఁడు, గలిపిరి గద కృతుల ఱాలుఁ గడు రేఫములున్."

పెద్దనాదుల రేఫ ఱకార యతిప్రాససాంకర్యము గల ప్రయోగములఁ గొన్నింటిని జూపి, కూచిమంచి తిమ్మకవి,

"కాకునూరి యప్పకవి యహోబలపతి, ముద్దరాజు రామ ముఖ్యులెల్ల
పోతరాజు కబ్బమున ఱాలు రేఫలు, గదిసెనంచుఁ బలికి రది షాంశిక్యా."

యని విమర్శించి, పోతన భాగవతములో శిథిలభాగ పూరణము గావించిన వెలిగందల నారయాదుల రచనలలో రేఫ ఱకార సాంకర్య మున్నది గాని, పోతకవీంద్రుని కవిత యందు నట్టివి లేవని సిద్ధాంతీకరించెను. (చూ. సర్వలక్షణసారసంగ్రహము - పుటలు. 243-244).

## వోఢృశబ్దము

వు వూ వో లు సాధారణముగ సంస్కృతాంధ్రశబ్దముల మొదట నుండవు. వోఢృశబ్ద మొక్కటిమాత్రమే సంస్కృతమునఁ గలదనె నప్పకవి. (2-221)సూరి వోఢృ వోఢవ్య శబ్దద్వయ ముదాహరించె. ఈరెం డేకధాతుజన్యములే. అప్పకవికిఁ బూర్వము చిత్రకవి పెద్దన వు వూ వోలు మొదటఁగల పదములు లేవన్నాఁడు. (లక్షణ - సా. సం. పుట 82) తర్వాత లింగమగుంట తిమ్మన పెద్దన నాక్షేపించి వోఢృశబ్దము గల దనెను. అప్పకవి లిం. తిమ్మన ననుసరించెను. బాలవ్యాకరణ గుప్తార్థప్రకాశికాకర్త వోళికాది శబ్దములఁ గొన్నింటిని సంస్కృత నిఘంటువులనుండి యెత్తి చూపెను. వోకారాది శబ్దములేకాక వుక, వువూర్షు, వూర్ణప్రభృతి కతిపయ శబ్దములును, వుగి, వుట, వుథి, వూషధాతువులును వు వూ లాదియందుఁ గలవి సంస్కృతమునఁ గాన వచ్చెడు. ఇవి యన్నియు నప్రసిద్ధములు.

## జాతివా లాఁతివా

జాతివా - సిద్ధ (సహజ) వకారము, లాఁతివా-ఆదేశవకారము (2-249-252)

'అవని...పట్టువడి' అనురీతి జాతివా లాఁతివా ప్రాసలోఁ జెల్లునని యతిలోఁ జెల్లవని యప్పకవి వ్రాసె. ప్రాసలోఁ జెల్లు హల్లులు యతిలోఁ జెల్లవనుట వింత; ఇది సరిగాదు. అప్పకవి యుదాహరణలో

"అవనితనయఁనిచేతఁ బ+ట్టువడియున్న
పడుచుకొమ్మల హరిచెట్ట+పట్టియేలె."

అనుపద్యమునఁ బ్రథమపాదమున జాతివాలాఁతివాలప్రాసమైత్రి, రెండవపాద మున పకారమునకు లాఁతివాతో యతిమైత్రి గూర్పఁబడెను. పవల కభేదయతి చెల్లు చుండఁగా, పకారమున కాదేశమయిన వకారమునకు సిద్ధవకార మేల చెల్లరాదో?

వారిరుహానేత్రతో వాఁడు+వలికె నిట్లు (ఇందలి యతి పొసఁగదు.)
వారిరుహానేత్రతో వాఁడు+పలికె (ఇందు యతి చెల్లును.)

పైరీతి నన్న యప్పకవి లక్షణ మర్థము లేనిది. అప్పకవి పద్యములోనిపాఠము లేఖక ప్రమాదజనిత మని యూహింపనగును.

అప్పకవి పాఠము—యతికిఁ బంచమవర్గాద్య మగుటఁజేసి
చెల్లదు వకారమునకు (2-249) 'చెల్లును' అని సవరించవలెను.
లాఁతిజాతికి వడికి నిల్పఁ దగదనుచు (2-251)
'నిల్పఁదగుననుచు' అని సవరించుట యుక్తము.

## ఏవఁడు

1. ఎవఁడేవాఁడెవ్వఁడేవఁ డీతఁడనంగా (2-253).

'ఏవఁడు' అను రూపమెందును బ్రయుక్తము గాదు. కోశములలోను గ్రహింపఁబడలేదు.

## అట్టు

అట్టు చేసెననఁగ - ఆ ముకుంద (2-231). అట్టులో అకార మున్నదని యిందుఁ జెప్పుటేకాక అకార సీసమాలికలో నీ పదము చూపఁబడినది. కాని యప్పకవియే లఘురేఫాన్వితముగా దీని నీ క్రింది పద్యమున వాడెను.

రట్టడిఁ గాకునూరి పెద+రంగయసోముఁడు (పీ. 80).

## శ - స ప్రాస మైత్రి

శకలములో 'శ', సకృత్తులలో 'స' ఉన్నవి. వీనిఁ దెలియక రచించుకృతులు ధాత్రీతలమునఁ బ్రాసభంగంబులై నగుఁబాటుఁ జెందు (2-259). ఇట్లు వ్రాయుటచే శ - స ప్రాసమైత్రి యప్పకవికి సమ్మతము గాదనుట స్పష్టము. అప్పకవి యుభయ ప్రాసలో 'సషలకుఁ' జెప్పెనేకాని 'శసలకుఁ' జెప్పలేదు. (చూ. 3-329) లక్షణ దీపికా లక్షణశిరోమణ్యాది కతిపయలక్షణ గ్రంథములం దీ మైత్రి చెప్పఁబడియున్నది. ఇందులకుఁ బూర్వప్రయోగములును గలవు.

కంసునిబాధలంబడు...త, ద్వంశము వేగ (ఎఱ్ఱన-హరి-పూ-9-87)
ఏసియుఁ వైచియు...కేశా, కేశి (నన్ని-కుమార-12-169)
సంసారభ్రమ...వంశం బీపరిపాటి (హరవిలాస-2-111)
వ్రేసియుఁ జీరియుఁ...కీశులు (భా-రా-యుద్ధ)
భసితంబుఁ జల్లి షోడశుసత్తివైచి (పండితా-497 పుట)
నాసానసాంగద్ర+గ్రూ)శిరోజ (భాగవత-2-158)

## హకార వివేకము

విహ్వల, జిహ్వ, గహ్వరాదులలో హకారము వకారసహితము గాని 'వింహ్వల, జింహ్వ, గంహ్వర' అను రీతి బిందుపూర్వకములు గావు. అట్లే సంహతి సంహారాదులందు బిందుపూర్వక హకారములు గలవు; అవి వకారసహితములు గావు. (సంహ్వత-అని వ్రాయరాదు). వీనిభేదమెఱింగి ప్రాసమైత్రి గూర్పవలయు (2-261). ఇట్లు వీనిభేద మెఱుఁగక కొందఱు కవులు ప్రాసలో నిల్పియున్నారు.

గహ్వర గహనముల్ గగ్గోలుపడఁగ

సింహనాదము చేసి (సౌగంధిక ప్రసవాపహరణము-2-335 పంక్తి)
జిహ్వానష్టము—యుద్ధక్రియా, రంహుండై—సింహధ్వానము.
రా, ద్రాహ్వాస్త్రంబు (శతకంఠరామాయణము)
గహ్వరాంతరములు - సింహమధ్య (శంకరకవి-హరిశ్చంద్ర-4-62)
ఇట్టి భ్రమ ప్రమాదములఁ బరిశీలించియే యప్పకవి యీలక్షణము రచించె.

## కావ్యాదిగ్రాహ్యవర్ణములు.

కావ్యాదిని బ్రయోగింపఁ దగిన యక్షరములఁ గూర్చి సవిస్తరముగ జ్యోతిష శాస్త్రపద్ధతిలోఁ బెక్కు విషయములు ప్రదర్శింపఁబడెను. అప్పకవియు నాతని పూర్వికులును జ్యోతిషశాస్త్రకర్తలు అప్పకవి పెదతాత తిరుమలభట్టు కాలామృత మను ప్రసిద్ధ జ్యోతిషగ్రంథము నిబంధించినవాఁడు. అప్పకవి కాలబాలార్కవాఖ్య జ్యోతిషగ్రంథసంహితాసుశ్లోకసంగ్రహకృతికర్త. కృత్యాద్యక్షరమునకుఁ గృతిపతి నామాద్యక్షరమునకు వివాహమునందువలెఁ బొంతనములు చూడవలెనఁట. మఱియు నది వర్ణశోధన చేయవలె. ఎఱ్ఱన యారణ్యపర్వశేషమును రచింప మొదలిడినప్పుడు అందలి ప్రథమ పద్యాద్యక్షరమునకుఁ దన పేరికిఁ బొసఁగునట్లది వర్ణచక్రశోధన గావించినాఁడట. (2-304) శ్రీకారము కృత్యాదిలోఁ గూర్చుట శుభప్రదము. కవివరులు శ్రీకారములోఁ దప్ప నితర వర్ణములోఁ గృతి ప్రథమ పద్యమును మొదలు పెట్టరు. ఈ సంప్రదాయము తెలుఁగు కవులది. 19 శతాబ్దివఱకుఁ దెలుఁగు కవు లీ నియమమును బాటించిరి. ఇప్పు డీ యాచారము త్రోసిరాజయ్యెను. అసలు దైవ ప్రార్థనకే స్థానము లేకపోయెను. సప్తసంతానములలోఁ బ్రశస్తిఁ గాంచి ఖిలముగా కుండునది ధాత్రిఁ గృతియకాన నట్టి కృత్యారంభము శ్రీకారముతో దేవతా ప్రార్థనతో సంతరించుట శ్రేయస్కరము.

## సారస్వతౌషధంబులు

ఇందు మూఁడు విధముల యౌషధములు చెప్పఁబడెను. ఇవి వైద్యశాస్త్రమునఁ జెప్పఁబడియున్నవని తెలియవచ్చెడు. వీనిని సేవించుటచే వరుసగా సూక్తులు ఘటించు, గడియ కొక పద్యశతకంబు నుడువవచ్చు, నాలుకను గాపురంబుండు నలువచెలువ. ఈ యౌషధములు మెదడునకుఁ జల్లఁదనముఁగూర్చి బుద్ధివికాసమును జేయు నని వైద్యశాస్త్రవిదులు చెప్పెదరు. (2-430-432)

## 3. వళిప్రాసపరిచ్ఛేదము

ఇందు 41 వళిభేదములు, 17 ప్రాసభేదములు మహాకవుల గ్రంథములలోని లక్ష్యములతో సవిమర్శముగఁ దెల్పఁబడెను. మఱియుఁ నగ్రాహ్యవళులు నప్రశస్త ప్రాసములుఁ గడపటఁ జేర్పఁబడెను.

## వళి - యతి

అప్పకవి వళి నిట్లు నిర్వచించెను.

చరణ చరణమున కాద్యక్షరములు వళు లయ్యె నవియె క్రమ్మఱఁ దత్త
చ్చరణములలోనఁ జెప్పిన, యిరవులఁ బొందింపవలయు నెల్ల కృతులలోన్. (5)

పాద ప్రథమాక్షరము వళి; దానిని జెప్పిన యిరవులఁ బొందింపవలయుననఁగా, యతి స్థానమునఁ గ్రమ్మఱఁ బొందింపవలయు. సంస్కృతములో యతి గలదు. అందలి యతి పాదవిచ్ఛేదమునకు సంజ్ఞ (యతిర్విచ్ఛేద సంజ్ఞకః) సంస్కృతపద్యములలో యతి స్థానమునఁ బాదవిచ్ఛేదము కావలయును. తెనుఁగునఁ బాదవిచ్ఛేద మక్కఱలేదు గాని, పాదాద్యక్షరమునో (వడి) తత్సజాతీయాక్షరమునో యా యతిస్థానముపైఁ గూర్పవలయు. అప్పకవి చెప్పలేదు గాని యీ సంస్కృతాంధ్ర యతి లక్షణభేదము ననంతుఁడు వివరించెను.

ఎన్నిట యతి రావలె నని, రన్నిట సంస్కృతమునందు నగు విచ్ఛేదం
బెన్నిట యతి రావలె నని, రన్నిటఁ దెలుఁగునకు మొదటి యక్షర మమరున్.
(ఛందో-1-129)

వడి వేఱు; యతి వేఱు. ఇది ప్రాచీన లాక్షణిక మతము.
ఆద్యోవళిః - చింతామణి.
చరణాద్యక్షరమే వడి - కవిజనాశ్రయము.
పాద ప్రథమాక్షర ముత్పాదిత మగు వళి యనంగ - కావ్య - చూడామణి.
వాసనగల మొదలివ్రాయి వడియనఁ బరఁగున్ - ఛందోదర్పణము.
వడి యగుఁ బాదాదులయం దిడు నక్షరము - లక్షణసారసంగ్రహము.

సూక్ష్మముగాఁ బరిశీలించిన 'వడి - యతి' సమానార్థకములు; పర్యాయపదములు గావు. కాని యనంతుఁడు నతని ననుసరించి యప్పకవి యతికి వళి పర్యాయపదముగాఁ దెల్పియున్నారు. (6) అప్పటినుండి వడి యతి సమానార్థకములుగా వాడఁబడు చున్నవి.

స్వరయతులు వ్యంజనాక్షర విరతు లుభయవళులు. (అప్ప-3-9)
వళి పదుమూఁడవ యక్కరంబుగ. (అప్ప-4-338)
భాను యతిభద్రకంబు దనరున్. (అప్ప-4-347)

యతి సంస్కృతశబ్దము; వళి తెలుఁగుపదముగాఁ దోఁచెడు. 'వళి-వడి' రూపాంతరములు. సంజ్ఞ యగుటచే వళిప్రాసము లను సమాసము సమ్మతమయ్యె. వళిశబ్దవ్యుత్పత్తి యిద్దమిత్థమని నిర్ణయింప వలనుపడదు. దేశ్యశబ్దము లవ్యుత్పన్నములని కొందఱ తలంపు. ఈవడి శబ్దమునకుఁ దమిళములోని వడు (మార్గము) మూలమై యుండు నని

గిడుగువారొకచో వ్రాసిరి. కాని యిది కేవలము కృతకము. తెనుఁగులోని యక్షర రూపయతి మైత్రి తెలుఁగునకు ముందే తమిళమున మాత్రమే కలదు. తమిళమునఁ దెలుఁగునందువలె వళి ప్రాసలు గలవు. వళిప్రాసల కా భాషయందు 'మోనై - ఎదుగై' యందురు. మోనై యనఁగా నందు మొదటి యక్షర మని యర్థము; అదే యర్థమున నున్నది మన వడి. కాని యీ తమిళాంధ్రశబ్దములు రూపమున భిన్నములు - తమిళ మున అను ప్రాసమునకు 'వతి యెదుగై' యని పేరు. ఈ వతి సంజ్ఞనే తెనుఁగువారు 'వళి' యని గ్రహించియుందురేమో ?

## యతిమైత్రి

కొన్ని కొన్ని యక్షరములకుఁ బరస్పరము యతిమైత్రి యుండును. వర్ణము లకు సారూప్యసామీప్య ప్రత్యాహారైకస్థాన తద్భవసంబంధ బాంధవంబులు విచా రించి ప్రాచీనులు యతిమైత్రి నేర్పఱచిరి. క ఖ గ ఘ లేకస్థానసంభవములు. జ్ఞకారము తద్భవమున 'న-ణ' లగును. (ఆజ్ఞ-ఆన) ఇట్లే న ణ లు, శ ష స లు తత్సమ తద్భవముల మార్పుచెందును. (గుణ - గొన, దిశ-దెస, రోషము - రోసము). పు ఫు బు భుము లు- ముపర్ణకమునకు పువర్ణ బువర్ణాదేశములు గలుగును. (సరసము + పలుకు -సరసపుఁబలుకు- 'ము' కు 'పు' ఆదేశము. వనము - వనంబు - రూపాంతరమున బువర్ణాదేశము) ప ఫ బ భ వ లు (అతఁడు+పలికె - అతఁడువలికె-సంధిలో నాదేశము). అ - య-హ లు (మేన+అత్త - మేనయత్త - సంధిలో యకారాగమము. హరుసము - అరుసము - ద్వైరూప్యము.) ఇట్టి సంబంధముఁ బురస్కరించుకొని వర్ణమైత్రి యేర్పడెను.

ఆదిలో నీ యక్షరమైత్రిలోఁ గొన్ని భేదములే యుండి కాలక్రమమున వాఙ్మయ విస్మృతిచేఁ గవుల నిరంకుశతచే బహుభేదములు బహుమతము లేర్పడినవి. ఈ యతిభేదములేకాక ప్రాసభేదములును నానాఁటికి నధిక సంఖ్యాకము లగుచువచ్చె. ప్రాచీన కవియైన భీమన 10 యతులు చెప్పెను; తర్వాత అనంతుఁడు 24 యతులు, ఆ వెనుకఁ గొందఱు 27 చెప్పిరి; ఆవల అప్పకవి యందఱికన్న నధికముగా 41 యతులు చెప్పెను. (7-8) ఇరువదేడు యతులు చెప్పినవాఁడు చిత్రకవిపెద్దన. ఈతని గ్రంథమగు లక్షణసారసంగ్రహము నప్పకవి యుదాహరించెను. గరళపురిఛందమునను సర్వలక్షణశిరోమణియందును 50 యతిభేదము లున్నట్లు దెలియవచ్చెను. ఇవి యప్ప కవీయము తరువాతివై యుండును. అప్పకవి యతిసంఖ్య పెంచినమాట నిజము. పూర్వ లాక్షణికులు చెప్పని కొన్ని యతులు ప్రయోగపరిశీలనచేఁ గ్రొత్తగా నాతఁడు తెల్ప వలసివచ్చె. మఱికొన్నింటిని స్పష్టార్థము విభజించి రెండు మూఁడు భేదములుగాఁ జెప్పెను. కొన్ని భేదము లనవసరములుగూడ. అప్పకవి చెప్పిన యతులను భీమనాదుల యతులతోఁ బోల్చి యొక పట్టికలోఁ గ్రిందఁ జూపెద.

# యతులపట్టిక

| భీమన<br>కవిజనాశ్రయము<br>(11) | ఆనంతుని<br>ఛందోదర్పణము<br>(24) | చిత్రకవి పెద్దన<br>లక్షణసారసంగ్రహము<br>(27) | అప్పకవీయము<br>(41) |
|---|---|---|---|
| 1 స్వరయతి | 1 స్వరయతి | 1 స్వరయతి | 1 స్వరమైత్రివడి |
| | | | 2 స్వరప్రధానవడి |
| | 2 గూఢస్వరయతి | | 3 లుప్తవిసర్గకస్వరవడి |
| | 3 రివిరమము | 2 రివడి | 4 ఋవళి |
| | 4 ఋకారస్వరూపయతి | 3 ఋవడి | 5 ఋత్వసంబంధవళి |
| | | | 6 ఋత్వసామ్యవళి |
| | 5 ఌకారయతి | | |
| | | 4 వృద్ధియతి | 7 వృద్ధివళి |
| | | | 8 ప్రాణివిరామము |
| 2 వర్గయతి | 6 వర్గయతి | 5 వర్గవడి | 9 వర్గయతి |

| భీమన కవిజనాశ్రయము (11) | అనంతుని ఛందోదర్పణము (24) | చిత్రకవి పెద్దన లక్షణసారసంగ్రహము (27) | అప్పకవీయము (41) |
|---|---|---|---|
| 3 బిందుయతి | 7 అనుస్వారయతి | 6 అనుస్వారయతి | 10 బిందుయతి |
| | 8 తద్భవవ్యాజయతి | 7 జ్ఞావడి | 11 తద్భవవ్యాజయతి |
| | | | 12 విశేషవళి |
| | | | 13 అనుస్వారసంబంధయతి |
| | | | 14 అనునాసికాక్షరయతి |
| 4 పోలికవడి | 9 పోలికవడి | 8 పోలికయతి | 15 ము విభక్తియతి |
| | | 9 చక్కటియతి | 16 ముకారయతి |
| | 10 మకారయతి | 10 మావడి | 17 మవర్ణవిరామము |
| | | | 18 ఋజుయతి |
| | | | 19 ప్రత్యేకయతి |
| | 11 భిన్నయతి | 11 భిన్నయతి | 20 భిన్నయతి |
| 5 ఎక్కటివడి | 12 ఎక్కటివడి | 12 ఎక్కటియతి | 21 ఏకతరయతి |
| | 13 అభేదవిరతి | 13 అభేదయతి | 22 అభేదవిరతి |
| | | | 23 అభేదవర్గయతి |
| | | | 24 ఊష్మవిశ్రాంతి |
| 6 సరసవడి | 14 సరసయతి | 14 సరసయతి | 25 సరసవడి |
| 7 సంయుక్తయతి | 15 సంయుక్తయతి | 15 సంయుక్తయతి | 26 సంయుక్తయతి |

| | | | |
|---|---|---|---|
| | 16 వికల్పయతి | 16 వికల్పయతి | 27 అంత్యోష్మసంధివడి |
| | 17 యుక్తవికల్పయతి | | 28 వికల్పవిరమణము |
| | 18 రేఫయుతయతి | | |
| | | 17 ఉభయయతి | 29 యుష్మదస్మచ్ఛబ్దయతి |
| | | 18 శకంధ్వాదియతి | 30 పరరూపయతి |
| 8 ప్రాదియతి | 19 ప్రాదియతి | 19 ప్రాదియతి | 31 ప్రాదియతి |
| | 20 నిత్యసమాసయతి | 20 నిత్యసమాసయతి | 32 నిత్యసమాసయతి |
| | | 21 ఆదేశయతి | |
| | | 22 దేశీయయతి | 33 దేశ్యనిత్యసమాసయతి |
| | 21 నిత్యయతి | | 34 నిత్యయతి |
| | | | 35 రాగమసంధివడి |
| | 22 విభాగయతి | 23 విభాగయతి | 36 విభాగవళి |
| | 23 ప్రభునామాంతయతి | 24 ప్రభుయతి | 37 నామాఖండవిశ్రమము |
| | | | 38 పంచమీవిభక్తియతి |
| 9 ప్లుతయతి | 24 కాకుస్వరయతి | 25 కాకుస్వరయతి | 39 కాకుస్వరవడి |
| | | 26 ప్లుతయతి | |
| | | | 40 ప్లుతయుగ విశ్రామము |
| 10 అఖండవడి | | 27 అఖండయతి | |
| | | | 41 ప్రాసయతి |

## అప్పకవి చెప్పిన 41 యతిభేదముల సంగ్రహవివరణము

### 1. స్వర యతులు

1. స్వరమైత్రివళి-

అ-ఆ-ఐ-ఔ; ఇ-ఈ-ఋ-ౠ-ఎ-ఏ; ఉ-ఊ-ఒ-ఓ.

2. స్వరప్రధానవడి-

అచ్సంధిగల శబ్దములో సంధిస్థానమునఁ బరపదాదిస్వరమునకు యతిమైత్రి.

అతులగుణధామ భానువం+శాబ్ధిసోమ (వంశ+అబ్ధి)

3. లుప్తవిసర్గకస్వరవళి-

దాసః+అహమ్-దాసోహమ్-విసర్గములోపించి ఓత్వమువచ్చెను.

ఇందు అకారముతో యతి.

4. ఋవళి-

ఋ-ౡ=రి-రీ-రె-రే.

5. ఋత్వసంబంధవళి-

ౠ (వట్రసుడి)-ఇ ఈ ఋ ౠ ఎ ఏ.

6. ఋత్వసామ్యవళి-

ౠ—ౠ (గౄ—శౄ)

7. వృద్ధివళి-

లోక+ఏక-లోకైక—ఏ, ఐ } ఉభయస్వరములకు
భక్త+ఓఘ-భక్తౌఘ—ఓ, ఔ } యతిచెల్లును.

### 2. వ్యంజనాక్షరయతులు

8. ప్రాణివిరామము-

హల్లునకు యతిగూర్చునపుడు హల్లునకేకాక దానిమీఁది యచ్చునకును మైత్రి యుండవలయు. క-కా-కై-కౌ; కి-కీ-కృ-కౄ-కె-కే; కు-కూ-కొ-కో.

9. వర్గజయతులు-

కఖగఘ, చఛజఝ, టఠడఢ, తథదధ, పఫబభ.

10. బిందుయతులు-

౦క-ఙ, ౦చ-ఞ, ౦ట-ణ, ౦త-న, ౦ప-మ.

౦క=౦క, ౦ఖ, ౦గ, ౦ఘ అని యీ విధముగా వర్గాక్షరచతుష్కము గ్రహింపవలెను.

11. తద్భవవ్యాజవిశ్రమములు-

జ్ఞ-న, ణ.

12. విశేషవళి— జ్ఞ-క ఖ గ ఘ.

13. అనుస్వారసంబంధయతి—
ంటవర్గు—ంతవర్గు.

14. అనునాసికాక్షరయతి -
ంటవర్గు—న, ంతవర్గు-ణ.

15. మువిభక్తియతి— (విభక్తి) ము-పు ఫు బు భు.

16. ముకారయతి— ము (వర్ణము) పు ఫు బు భు.

17. మవర్ణవిరామము—
మ— ంయ-ంర-ంల-ంవ-ంశ-ంష-ంస-ంహ.

18. ఋఋయతి— య-హ.

19. ప్రత్యేకయతి— చేతి+అది-చేతి యది-స్వరమైత్రి.
చేతిది-వ్యంజనమైత్రి.

20. భిన్నయతి— ధరియించు (స్వరమైత్రి)
ధరించు (వ్యంజనమైత్రి)

21. ఏకతరయతి— ర-ర; ఱ-ఱ.

22. అభేదవిరతి— వ-బ; ల-డ; ల-ళ.

23. అభేదవర్గయతి— ప ఫ బ భ వ.

24. ఊష్మవిశ్రాంతి— శ ష స.

25. సరసవళి—అయహ, చఛజఝశషస; నణ.

26. సంయుక్తయతి—సంయుక్తాక్షరములలో నేదో యొకహల్లునకు మైత్రి.
క్ష్మ-క, ష, మ.

27. అంత్యోష్మసంధివడి -
వాక్ +హరి=వాగ్ఘరి—క, హ.

28. వికల్పవిరమణము -
సత్ +మతి=సన్మతి—త, న.

3. ఉభయయతులు

అచ్సంధిగల కొన్ని శబ్దములలో సంధ్యక్షరములోఁ గేవలస్వరమునకుఁగాని వ్యంజనమునకుఁగాని యతిమైత్రి గూర్పనగు.

29. యుష్మదస్మచ్ఛబ్దయతి -
యుష్మదాగమనము-ద, ఆ.

30. పరరూపయతి -
శకంధ్వాదుల కుభయయతి-శక+అంధు-శకంధు-క, అ.

31. ప్రాది యతి -
ప్ర+ఆరంభము—ప్రారంభము—ప, ర, ఆ.

32. నిత్యసమాసయతి -
జనార్దన నారాయణ కర్ణాటాది నిత్యసమాసములం దుభయయతి.
జనార్దన—(జన+అర్దన)—న, అ.

33. దేశ్య నిత్యసమాసవిశ్రాంతి -
రూపఱు (రూపు+అఱు) క్రచ్చఱ-ఇత్యాదులం దుభయయతి.

34. నిత్యయతి -
ప్రూర కర్మ౯డేని=డే, ఏ. (ఏనిశబ్దసంధి)

35. రాగమసంధివళి - జవరాలు (జవ+ఆలు) - ర, ఆ.

36. విభాగవళి - (ఏసిశబ్దసంధి)
నాలుగు+ఏసి - నాలుగేసి - గే, ఏ.

37. నామాఖండవిశ్రమములు -
(అన్నాదులతో సంధి) రామ+అన్న-రామన్న-మ, అ.

38. పంచమీవిభక్తి విరామము.
రామునికన్న, రామునికంటె—క, అ.

39. కాకుస్వరవళి - దూరాహ్వానాదులందలి దీర్ఘాక్షరమున కుభయయతి -
రామా—మ, అ.

40. ప్లుతయుగవిశ్రామములు—పాదాది యతిస్థానములలోఁ బ్లుతస్వరమైత్రి -
రా, వే......రఘుప+తీ.

## 4. ప్రాసయతులు

41. ప్రాసయతి -
గీత సీసములందు యతికిమాఱు ప్రాసమైత్రి చేయుట.

### యతిభేదపరిశీలనము

### లుప్తవిసర్గక స్వరవడి

అదంత సాంతములమీఁద అత్వము పరంబగునపుడు గలుగు ఓత్వమునకు అయహలు చెల్లు నని లక్షణము రచించె నప్పకవి. లక్షణమున విసర్గలోపముగూర్చి చెప్పఁబడలేదు. కాని పదాంతసకారము విసర్గము నొక్కటే యనుభావముతో నీయతి కిట్టి నామకరణము చేయఁబడెనని యూహింపవచ్చు. అనంతుఁడు దీనిని గూఢస్వర యతియని పేర్కొనెను. కాని లక్షణమున

'స్వరము తుదనుండి లుప్తవిసర్గకోత్వమైన స్వరవిరామంబు దాసోహ మనఁగ'

అని వ్రాయుటచే నందలి లుప్తవిసర్గకస్వరశబ్దముల గ్రహించి యప్పకవి యీ పేరుపెట్టినాఁడు కావలయు. గూఢస్వర యతి యనుపేరు దీనికిఁ దగియున్నది. అప్పకవి యిచ్చిన అన్యోన్య (అన్య+అన్య) శబ్దములో విసర్గలేదు. ఇందు గూఢస్వరమునకే యతి యని చెప్పకతప్పదు.

తద్భవవ్యాజవిశేషవళులు

తత్సమములోని జ్ఞకారము తద్భవమున నకారమగుచున్న కారణమున (ఆజ్ఞ-ఆన) జ్ఞకార నకారములు (న-ణలు) యతిలోఁ జెల్లును. ఇది తద్భవవ్యాజయతి. కాని తిక్కనప్రయోగము కలిమిచేత జ్ఞకారమునకు క ఖ గ ఘ లు చెల్లును. ఇది విశేషమైన వళి యని యప్పకవి యొక్కఁడే చెప్పెను. ఈవిశేషవళి యితర లాక్షణికులు చెప్పలేదు.

తిక్కన ప్రయోగము-

అ, జ్ఞానికి నుపదేశవిధిఁ బ్ర+కాశము సేయక. (శాంతి-4-255)

భారతమున నన్నయ యీయతి వాడలేదు. ఎఱ్ఱనయు నుపయోగింపలేదు. తిక్కనయు నీయొక్కచోటనే కూర్చెను. తిక్కన యిట్లు ప్రయోగించియుండఁడని 'అ, జ్ఞానికి నుపదేశవిధిఁ బ్ర+జనితము సేయక' అను పాఠాంతరము కొందఱు పఠింతురు. ఇది కల్పితపాఠము. తిక్కనకుఁ బూర్వమందును బరమందును నిట్టి యతి వాడియున్నారు.

కర్మ మధర్మ మ+జ్ఞానమాగడము (పండితారాధ్యచరిత్ర-పురాతన-పు. 284)
జ్ఞానేంద్రియజ్ఞాన+కళలారుసొరుగా (కాశీ-1-139)
అ, జ్ఞానంబునఁ గడప మిగులఁ+గల్మష మొందుక (రుక్మాంగద-268)
కార్యఖడ్గముల ప్ర+జ్ఞావిశేషముల (పల్నాటి-పు-33-బంతి 115)
క్రూరకర్ముఁడకృత+జ్ఞుఁడసత్యపరుఁడు (కట్టావరదరాజరామాయణము-కిష్కింధ-పు. 439)

భిన్నయతి

ధరియించు, వచియించు, జనియించు అనురీతి ఇంచుగవ్యవధాన మున్నచోట స్వరమైత్రి గూర్చుట భిన్నయతి యనియు ధరించు, వచించు ఇత్యాదులలో నించుక్కచేరియున్నప్పుడు వ్యంజనమైత్రి గూర్చుట వెఱయతి యనియు వ్రాసినాఁ డప్పకవి. ఇది యొక యతిభేదముగాఁ జెప్పనక్కఱ లేదు. ఇందు భిన్నయతిలోనే వెఱయతి యొక యంతర్భేదముగా నున్నది. ధరించు, వచించు అను ధాతువులలో స్వరసంధి

యున్నదిగాన నుభయయతి పాటింపవచ్చు. అప్పకవి చెప్పలేదుగాని యిందులకుఁ బ్రయోగములు గలవు. సులక్షణసారమున స్వరవ్యంజనోభయయతి చూపఁబడెను.

భారతమున నే వ్యంజనమైత్రి గల ప్రయోగము లొండు రెండు గానవచ్చెడు.

ఈరమణీయకాంతి నుప+మింపఁగ (ఆది-5-151)

శయ, నించు యుధామన్యుఁ+డెత్తిఁగి కడఁగి (సౌప్తిక-1-169)

ఏమఁట పాదుకలమఁట గ+ణింపఁగ (భాగ-10-ఉ-585)

ఇష్టఫలసిద్ధి దొరవా+ త్తించునింతి (పాండురంగ-2-78)

ఈ క్రియ సత్పుత్రకులుచ +రింతురు (ప్రబంధరాజ-688)

ఇరువు గదాధారగొని భు+జించుటయొప్పఁగ (పద్మపురాణ-2-93)

ఎలమిఁబికాలితోడ నెలి+గించుచు (నన్నిచోడ-కుమార-9-110)

## ఏ క త ర య తి

ఏయక్షరమున కాయక్షరమే యతిమైత్రి గలది; అనఁగా నితరాక్షరమైత్రి లేనివి. దీనికి ఎక్కటివడి యని నామాంతరము. ఈవడిలో భీమన 'మ య ర ల వ' లను, విన్నకోట పెద్దన 'మ ర ఱ ఆ వ' లను, అనంతుఁడు మ ర ఱ ళ వ'లను, చిత్రకవి పెద్దన'మ ర వ ఱ ల'లను జెప్పిరి. బిందుపూర్వక ప ఫ బ భాదులతో మకారము యతిచెల్లును. అట్లే ప ఫ బ భ వ లు, అ య హ లు, లళలు పరస్పరము యతిమైత్రి గలవి. రఱలు రెండుమాత్రమే తమలోఁ దాముగాని యితరాక్షరములతోఁగాని యతిమైత్రి లేనివి. కాన భీమనాదుల యెక్కటివళ్లు సరిగావు. అప్పకవి చక్కఁగా బరిశీలించియే 'ర ఱ'లను మాత్రమే యిందుఁ జెప్పెను. అప్పకవి యీ యుభయరేఫ యతిప్రాసమైత్రి యొప్పుకొనలేదు గాని ప్రాచీనకవుల ప్రయోగములందు వీని సాంకర్యము గానవచ్చెడు. కొందఱు లాక్షణికులు ర ఱ యతిని సమ్మతించిరి. సులక్షణసారమున ఈవడి యొక యతిభేదముగాఁ జెప్పఁబడినది. అల్లసాని పెద్దనాదులుభయరేఫసాంకర్యము చేసి రని ప్రయోగ ప్రదర్శనపూర్వకముగాఁ గూచిమంచి తిమ్మకవి వ్రాసి యున్నాఁడు. (చూ. సర్వ - ల - సా. సం. పుటలు 240-243)

## సంయుక్తయతి

'ఒక్కపదములోనఁ బెక్కువిశ్రమములు, జరుగుచోట మొదల జడ్డలున్న
నడుగు వెడలుదనుక నందొక్కటియె కాని, యుండదొకటనదియు నొకటనిదియు
(అప్ప-3-111)

ఇట్టి బహుయతి నియతికి భంగముగా నప్పకవియే ప్రమాదవశమునఁ గాఁబోలు నీక్రింది పాదములలో సంయుక్తయతి గూర్చినాఁడు.

క్రౌంచపదీ వృత్తమ్మునఁ జెప్పె + రఁగఁ బలుకుదురిలఁ + గవివరులెల్లన్
(4-357)

ఇందు 'క్ర-ర-క' లకు యతిమైత్రి గలదు. 'క్ర'లోని రేఫమునకు 11-వ చోట, కకారమునకు 19-వ చోట వేర్వేఱుగా యతులు పాటింపఁబడినవి. ఇట్లే మఱియొకచో-

తరువోజ: కృతులందుఁ దరువోజ + నీయోజనెసఁగఁ + గృతకృత్యుఁడై చెప్ప +
క్షితినెల్ల సభల (4-461)

ఇట్టి వ్యతిక్రమము మఱికొన్ని గ్రంథములలోఁ గానవచ్చెడు.

స్ర|| బాలవృద్ధా, ర్తస్త్రీ క్షేమంబుగా నం + దఱుఁ బొలిసినవె + న్కన్ జయంబేల
నాకున్ (భాస్కర-యుద్ధ-880)

ప్రాకారద్వార కేళీ + భవన విమలహ + ర్మ్యస్ఫురద్గోపురాళీ
(మత్స్య-2-82)

క్షితిఁగూలన్ గోటిసంఖ్యల్ + గెడయఁగరివరా + శితిసాహస్రసంఖ్యల్
(ఉ-హరి-6-135)

స, న్మానాధీశుండుగా వై + ష్ణవ సుఖదుఁడుగా + మత్కృపాపాత్ర
(పాండురంగ-2-185)

క్షామాత్మ స్వామిధామ + క్రమఱ కృశపిపా + ర్ష ప్రవిశ్రాణి (కళా-7-177)

వృత్తములతోడఁదరు + ణీమణులుగానరుచు + లింపుగను మంగళమహాశ్రీ
(అనంతునిఛందము-2-115)

## అంత్యోష్మసంధివడి-వికల్పవడి

వర్గహల్లులకుఁ బరమైన హకారమునకు నాయావర్గ చతుర్థాక్షరము వికల్పముగా వచ్చును. వాక్ + హంస-వాగ్ఘంస, వాగ్హంస. ఇట్టి సంధిలో లోపించిన వ్యంజనమునకును యతిమైత్రి గూర్పవచ్చు. ఇట్లే వికల్పవడిలో అనునాసికములు వర్గహల్లుల కాదేశము లగు. సత్ + మార్గ-సన్మార్గ, సద్మార్గ. ఇందును 'సన్మార్గ' అను సంధిలో లోపించిన తకారమునకు యతి పాటింపవచ్చు. సంధిలో రెండు రూపములున్నప్పుడీయతిభేద మవసరము లేదు. 'సన్ముని-సద్ముని' అను రెండు రూపములుంటచే తకారమునకు యతి గూర్చునపుడు 'సద్ముని' అనియే వ్రాసికోవచ్చు. 'సద్ముని' అను వికల్పరూపము లేనప్పుడే యీయతిభేదము చెప్పుటలోఁ బ్రయోజనమున్నది. 'సన్ముని' అని యున్నప్పుడు సయితము 'సద్ముని' యనురూపాంతర ముంటచేఁ దకారమునకు యతి పాటింపవచ్చు నని తెలుపుటకై యీ యతిభేదముఁ జేర్చినారేమో? అనంతుఁడుగూడ నీయతి ద్వయమును జెప్పినాఁడు. పేళ్లలో భేద మున్నది.

అప్పకవి-అంత్యోష్మసంధివడి—అనంతుఁడు-వికల్పయతి.

అప్పకవి-వికల్పవడి—అనంతుఁడు-యుక్తవికల్పయతి.

సులక్షణసారకర్త యీ రెండవవడికి అనునాసిక వికల్పయతి యని పేరుపెట్టెను. ఇది యెంతయు సార్థకము. ఈరెండును వికల్పసంధియతులే కాని చిత్రకవిపెద్దన వికల్పయతి యొక్కటే చెప్పెను.

## యుష్మదస్మచ్ఛబ్దయతి

యుష్మద్+ఆజ్ఞ - యుష్మదాజ్ఞ, అస్మద్+అన్వయము - అస్మదన్వయము. ఈరెండు శబ్దములమీఁది స్వరసంధియందే యుభయయతి చెప్పఁబడినది. ఇట్టివే యగు తద్, ఏతద్, మత్, భవత్ మున్నగుశబ్దముల సంధియందును నేల యీయతి చెప్పఁబడలేదో? ఇందుఁ గొన్నింటికిఁ బ్రయోగములు గలవు.

తావక సేవకుండ భవ+దంఘ్రులనేనిటఁ గొల్చివచ్చెదన్
(భాస్కర-అయోధ్య-145)

మా, తంగము నెక్కి యింద్రుఁడు త+దాశ్రమవీథి (అహల్యాసం-2-119)

## ప్రాదియతి

ప్రాదులిర్వదింటిలో పరాజపులు (పరా, అజ్, అపి) మూఁడు తత్సమాంధ్ర భాషలో రావనె నప్పకవి (ఆంధ్రమునకుఁ జేరని పరాజపులు మూఁడుగాక-3-132) 'పరాజపులు చొరవు తెలుఁగుబాసను సెందుక్' అన్న యనంతు ననుసరించి యప్పకవి యిట్లు వ్రాసెఁ గాఁబోలు. అప్యాజ్ నిరూపణ మప్రసిద్ధ మని కావ్యాలంకారచూడా మణి కర్త రెండింటిని మాత్రము నిషేధించె. కవిజనాశ్రయకారుఁడు దేనిని నిషేధింప లేదు. 'రిపుల వినసించుచోటఁ బరేతనాథుఁ, డని లక్ష్యములో 'పరా' చూడామణి కర్త చూపియుండఁగా అప్పకవి దానిని జూడలేదేమో? 'అపి'తో నచ్చు చేరుట సాధారణముగఁ గనఁబడదు, కాని అప్యయ మను (అపి+అయ) శబ్దము నిఘంటువులో సంగ్రహింపఁబడియున్నది. కస్తూరిరంగకవి 'అప్యయ' శబ్దము నీ ఘట్టమున నుదాహ రించినాఁడు.

శయధృతి ఫణివలయభవా

ప్యయ విహిత విశుద్ధ సంవి+దాత్మక (స్వరమైత్రి)

జనా, ప్యయదూరానందరూప+భాసుర (వ్యంజనమైత్రి)

ఇఁక 'ఆజ్' ఒక్కదానికే యిట్టి యతి సాధ్యము గాదు. ఉత్తరపదము పరం బగుచో 'ఆజ్' లోని ఆకారము లోపించును. (ఆజ్+యతి - ఆయతి, ఆజ్+ ఉదక - ఓదక.) ఒక్క 'ఆజ్'ను మాత్ర మీ యతిలో రాదని చెప్పుట యుక్తము.

## ఉపసర్గ సంధి వడి

అప్పకవి దీనిని ప్రత్యేకముగాఁ జెప్పలేదు గాని నిత్యసమాస విశ్రాంతుల క్రిందఁ జూపెను. ప్రాదులపై నచ్చు చేరినపుడు ప్రాది యతి యనఁబడును. అధి+ఈశ- అధీశ - ఇందు 'ధీ' కిఁ గాని 'ఈ' కిఁ గాని యతి చెల్లును. అటుగాక ప్రాదు లుత్తర పదములుగా నుండి సంధించినచోట నుభయయతి నిత్యసమాస విశ్రాంతిలో నుపసర్గ సంధి వడి యని యప్పకవి యభిప్రాయము. వృషభ+అధిప - వృషభాధిప - ఇందలి సంధ్యక్షరమున కుభయయతి చెల్లును. ఇందుల కప్పకవి చూపిన లక్ష్యము.

"భాను సహస్రభాసి వృష+భాధిపుఁ డన్నపు డర్థయుక్తమై
పూనినచో నఖండవడి పొల్పగు నాది కవి ప్రణీతమై."

ఇది కవిజనాశ్రయములోని పద్యము. అందిది యఖండవడికి లక్ష్యముతోడి లక్షణము. తత్కర్త భీమన యిది యఖండవడి యని వక్కాణించుచుండఁగా, అఖండవడి సమ్మతిం పని యప్పకవి దీనిని నిత్యసమాస యతులలోఁ జేర్చి మార్గాంతరముచే సమర్థించుట స్వరసముగాలేదు. కవిచింతామణిలోఁ దాతంభట్టు ఇట్టి యుపసర్గసంధివడిని సైతము ప్రాది యతిలోనే చూపెను. దాని నప్పకవి చూడలేదు కాఁబోలు!

"ధాత్రిఁ బ్రాదియోగ మాత్రంబు గలిగిన, నుభయమును రచింప నొనరు యతికి
సాతిరిక్త భక్తి+శక్రసేవిత కమ,లాలయా యనంగ+లక్ష్యమిదియ."

(కవిచింతామణి.)

'స+అతిరిక్త - సాతిరిక్త' ఇది యప్పకవి మతమున నుపసర్గసంధి కుభయయతి.

యతిభేదముల సూక్ష్మతర పరిశీలన చేసిన యప్పకవి నిత్యసమాస యతులలోఁ జెప్పిన నఞ్సమాస (అనంత, అనేక) ప్రత్యేక యతిభేదముగాఁ జెప్పియుండదగు. ఇట్లు దీనిని ప్రత్యేకముగా సర్వలక్షణ సారసంగ్రహకర్త కూచిమంచి తిమ్మన చెప్పెను. ఇట్లే 'సాంబ, సాదర' ఇత్యాది శబ్దములం దుభయ యతి సహార్థయతి యని పేర్కొన వచ్చు.

## దేశ్యనిత్యసమాసవడి - పదునొకొండు శబ్దము

"అని మది నిశ్చయించి..................మా
కొనరిన సైన్యముల్ పదునొ+కొంటికిఁ బ్రాభవ మాచరింప."

అను తిక్కన పద్యము (ఉద్యోగ - 4 - 140) నుదాహరించి, 'పదునొకొంటికి అని యున్నచోట సంధి గూర్చి స్వర ప్రధానపడిగాను సోమయాజులు ప్రయోగించి నారు; ఇది తెలియక కొందఱు మూఢులు దేశ్యనిత్యసమాసవడి యని యనుకొందురు' అని విమర్శించె. (అప్పకవీయము 3- 212.)

'ఒకొండు' లో 'ఒక+ఒండు' అని స్వరసంధి గల దని యప్పకవి యభిప్రాయము. 'ఒకొండు' లో సంధి లేదన్నచోఁ బై పద్యపాదమున అఖండవడి యున్నదని యొప్పుకొనక తప్పదు. అఖండవడి సమ్మతింపని యప్పకవి యీ లెక్కన ప్రయోగమునకు గతి కల్పించెను. ఇందుఁ బదద్వయ విభాగమునకుఁ బ్రసక్తి కనిపించదని గిడుగువా రప్పకవీయ విమర్శనములో వ్రాసిరి. (పుట-42). ఒకొండులోఁ బదద్వయ సంధి యున్నదని సూర్యరాయాంధ్ర నిఘంటువు తెల్పుచున్నది. ఈ క్రింది పాండు రంగమాహాత్మ్య ప్రయోగము 'ఒకొండు' లో స్వరసంధి యున్నదని నిర్ధరించుచున్నది, చూడుఁడు.

వాసుదేవాది నవశక్తివైభవంబు............
ఇదియె వహియించు నన నల్వయిడిన పదునొ
కొంటిలెక్కనఁ గనుబొమ్మ+లువిద కమరు. (3-198)
భారతములోనే, (స్త్రీ)-1-83)
'పాండవులవలనఁ గీడొ, క్కొండును లేదధిప నీదు+కొడుకులు'

అనుచోట వ్యంజన మైత్రి చేయఁబడియున్నది. ఈ ప్రయోగములఁ బట్టి 'ఒకొండు' శబ్దము దేశ్యనిత్యసమాసముల పట్టికలోఁ జేర్పఁదగిన దనియు, దీని కుభయయతి చెల్లు ననియుఁ దెలియవలెను.

## అ ఖ ం డ వ డి

అఖండవడి యొక యతి భేదముగా అప్పకవి చెప్పలేదు. అచ్సంధి గల శబ్దము లందు స్వరప్రధానవడియే పాటింపవలసియుండఁగా, ఆశబ్ద ద్వయమేళనము నఖండ శబ్దము (ఏకశబ్దము) గా భావించి సంధి స్థలమున నిలిచియున్న వ్యంజనాక్షరమునకే యతి గూర్చుట యఖండయతి యనఁబడును. ఆఖండయతి యన్నచో స్వరసంధిలో వ్యంజనాక్షరమైత్రి యగును. ఉభయయతి యన్నచో స్వరవ్యంజనములకు రెంటికియతి యని యర్థము. కాని అఖండవడి నిల్పు శబ్దమందును స్వరయతి నిల్పుట కేయభ్యంతరమును లేదు. కాన అఖండవడియు నుభయయతియే యగు. అట్లుండ నఖండవడి నప్పక వ్యాదులు గొందఱు నిరసించుటకుఁ గారణమిట్లు దోఁచెడు. అఖండవడి సమ్మతింతు మేని స్వరసంధిగల సంస్కృతాంధ్రశబ్దములం దెల్ల స్వరమునకే కాక వ్యంజన మునకును యతి సమ్మతమగును. నీ విచ్చితి (నీవు+ఇచ్చితి), సర్వేశ (సర్వ+ఈశ) ఇత్యాది తెలుఁగు సంస్కృత సంధులం దెల్ల వ్యంజన మైత్రి యనంగీరింపవలసివచ్చు. ఇదియంత రమ్యముగాఁ దోఁపదు ఇట్టి యతి వ్యాప్తి నరికట్టి కతిపయ ప్రసిద్ధసాహచర్యముగల శబ్దములందే దీనిఁ బరిమితము చేయఁదలఁచి యుభయ యతి భేదములఁ

గొన్నిటిని ప్రాచీన లాక్షణికులు కల్పించిరి. అప్పకవికి ముందే యీ యుభయ యతి భేదము లనంతాదులచేఁ జెప్పఁబడెను. అఖండవడిని దొలుతఁ జెప్పినవాఁడు భీమన. మఱి యీ భీమనయే యుభయయతి భేదములగు ప్రాదిప్లుతయతులఁ జెప్పెను. విన్నకోట పెద్దన, అనంతుఁడు, చిత్రకవి పెద్దన, ముద్దరాజు రామన మున్నగువా రప్పకవికిఁ బూర్వ ముభయవళి భేదము లనేకము చెప్పిరి. అఖండవడి యొక్కటి చెప్పినచో నుభయవళు లన్నియు నందే గతార్థమగును. కాని కొందఱు ఛందఃకర్త లుభయవళి భేదములగు ప్రాది నిత్యసమాసాది యతులఁ జెప్పుచు వానితో నఖండవడియు నుడివిరి. అఖండవడిని జెప్పినవారు - భీమన, చిత్రకవి పెద్దన, తాతంభట్టు, ముద్దరాజు రామన, లింగమగుంట తిమ్మన, కూచిమంచి తిమ్మన, రంగకవి మున్నగు వారు పెక్కురు గలరు.

అఖండవడి యప్పకవికి సమ్మతము గాదు గానఁ దనకుఁ బూర్వులగు లింగమగుంట తిమ్మనాదు లఖండవడికి లక్ష్యములుగా నిచ్చిన భారతాద్యగ్రంథములలోని పద్య పాఠములు ప్రక్షిప్తము లని యాక్షేపించి యఖండవడి లేని పాఠాంతరములఁ జూపెను. అప్పకవి సవరించి చూపిన పద్యములు గల పుటలలో నధస్సూచికలలో నఖండవడి గల పాఠములు చూపి యున్నాను. (చూ. పుటలు. 156, 157.) ఇందు మచ్చున కొకటి.

అప్పకవిపాఠము - చూపె మనంబునఁ దలంతు+సుందరి. (ఆది-5-135)

అఖండవడిపాఠము - చూపె మనంబునఁ దలంచు+చందురు.

అఖండవడిని బ్రయోగించినకవు లనేకులు గలరు. అందుఁ గొన్నింటిని జూపెద. తక్కినవానికి నా 'ఛందోరీతు'లఁ జూచునది.

నామనసార దీనిఁ గని+నప్పుడు (సౌప్తిక-2-96)
కన్నుల, కథలార్థలాభంబు+గలుగు చుండు. (భాగవ-10-1702)
వే, దోక్తముగ నెఱుంగవలయుఁ+దుదిని మహేశా. (శివతత్త్వ-100)
కాశి యణిమాది సిద్ధుల+కాటపట్టు. (కాశీ-2-50)
తలఁచు మనంబులోన వసు+ధామర యాజక. (పాండు-4-182)
లోకములకు గులాచలము+లున్నతరూప (కవికర్ణ-4-88)
లెక్కయిడరాని రొక్కంబు+లీడులేని (రసికజన-1-42)
తెలియ కీమాట మీరాన+తిచ్చితిరఁట (హరిశ్చంద్ర-2-178)

## అప్పకవి యనవసరముగాఁ జెప్పిన యతులు

అప్పకవి యనవసరముగా ననంతాదులు చెప్పిన కొన్ని యతులతో సూక్ష్మతమ భేదముల గ్రహించి యొక్కదానినే రెండు మూఁడుగాఁ జేసి యతిసంఖ్య 41 వఱకుఁ

బెంచె నని నేఁటి కొందఱు పండితుల తలంపు. అందులో యథార్థము లేకపోలేదు; గాని యప్పకవి కొన్నింటిని స్వప్రతిపత్తిఁగొఱను, గొన్నింటిని బూర్వుల ననుసరించియు మఱికొన్ని కారణములచేతను నటు సేయవలసివచ్చె. కొన్ని క్రొత్తవియుఁ గలవు.

అప్పకవి యతులలో నాలుగు ప్రధాన భేదములు కల్పించెను.

1. స్వర యతులు 2. వ్యంజన యతులు 3. ఉభయ యతులు 4. ప్రాసయతి.

స్వరయతులలో 7, వ్యంజనయతులలో 21, ఉభయయతులలో 12, ప్రాస యతి 1 అను రీతి నంతర్భేదములు సృష్టించి మొత్తము 41 యతిభేదములఁ జేర్కొన్నాఁ డప్పకవి.

ఇఁక నా భేదములఁ గూర్చి యించుక పరిశీలన:—

ఋవళిలో 3 తెఱఁగు లప్పకవి చెప్పినాఁడు. అంతకుముం దనంతుఁడు 2 భేదములే చెప్పెను. ఋత్వసామ్యవళి యప్పకవి క్రొత్తగాఁ జెప్పినది. వట్రువసుడికి వట్రువసుడికి యతి ఋత్వసామ్యవళి. ఇయ్యది ఋత్వసంబంధవళిచేతనే సిద్ధించును గాని; సూక్ష్మపరిశీలనచేతఁ గాని యీ యతి మైత్రి సామాన్యముగఁ దోఁపదు గానఁ బ్రత్యేక యతిభేదముగాఁ జెప్పుట యావశ్యకమయ్యెను. ఇందు వ్యంజనమైత్రి యక్కఱలేక రెంటియందుఁగల ఋత్వమాత్రమైత్రి విలక్షణము గాక తప్పదుగదా ?

స్వరప్రధానవళి (సంధిలోఁ బరపదాది స్వరమైత్రి) చేతనే లుప్త విసర్గకస్వర, వృద్ధివళులు సిద్ధించు నని మఱి వానిని బ్రత్యేకముగఁ జెప్ప నక్కఱలేదని కొందఱందురు. వంశాబ్ధి, లంకేశ - ఇత్యాది సంధులలో సవర్ణ సజాతిస్వరము లాదేశము లగును. లుప్తవిసర్గ స్వరవళిలో విలక్షణముగ ఓకారము వచ్చును.

(దాసః+అహమ్ - దాసోహమ్) ఇట్టివానికి అకారస్వరమైత్రి చెప్పుట స్పష్టార్థము. ఇఁక వృద్ధివళిలో స్వరప్రధానవళియందు బలెఁ బరస్వరమునకే కాక యాదేశ స్వరమునకును యతి చెల్లుబడి యగుట క్రొత్త యంశము.

(లోక+ఏక - లోకైక - ఇందు ఏకార ఐకారముల కుభయమునకు యతి చెల్లును.)

దీనింబట్టి యప్పకవి చెప్పిన స్వరవళిభేదము లన్నియు నవసరములే యని తోఁచును.

వ్యంజనయతులలోఁ బ్రాణి యతి యొక ప్రత్యేక భేదముగాఁ బూర్వులు చెప్పలేదు. వ్యంజన యతులకెల్ల స్వరమైత్రియుఁ బాటింపవలసియుంట విధి గాన

నయ్యాది వ్యంజన యతిమైత్రి సామాన్య లక్షణ మగును. కాఁబట్టి ప్రత్యేక యతిభేద ముగాఁ జెప్పనక్కఱ లేదని యితర లాక్షణికులు పేర్కొనరైరి. కాని వ్యంజన యతులకెల్ల ముఖ్యలక్షణమగుట నాదిలో స్పష్టపఱుపఁదలఁచి యప్పకవి ప్రాణి యతియంఁ బేర్కొన్నాఁడు.

బిందు యతులలో 3 విధములు చెప్పఁబడెను. బిందు, అనుస్వారసంబంధ, అను నాసికాక్షరయతులు మూఁడొకదాని ననుసరించి యొకటి యేర్పడుచున్నవి. న ణ లు సరసవడిచే మిత్రములు. నకారమునకు బిందుపూర్వక తవర్గము, ణకారము నకు బిందుపూర్వక టవర్గము బిందుయతిచేఁ జెల్లును. సరసవళి వలన నకారమునకు ట ఠ డ ఢ లు, ణకారమునకు త థ ద ధ లు మిత్రములై, న ణ ల పరస్పరమైత్రి ననుసరించి బిందుపూర్వకములగు ట ఠ డ ఢ లు త థ ద ధ లు తమలోఁ దాము యతికిఁ జెల్లుబడి యగును. సరసవళి బిందువళి యను రెంటిచేతనే తక్కిన రెండు గతార్థము లగునుగాని, వానిని స్పష్టప్రతిపత్తికై యప్పకవిచెప్పె నన నొప్పును. ఇట మఱియు సరసవళి, బిందుయతి, అనునాసికాక్షరయతి, అనుస్వారసంబంధయతి యను క్రమమునఁ జెప్పుట సముచితము.

ఋవిభక్తి ఋకార యతులు, అభేద అభేదవర్గయతులు, తద్భవవ్యాజవిశేష యతులు అని రెండేసి యతిభేదములు చెప్పుట యనవసరము. పుఫుబుభులు విభక్తి ఋకారముతోఁ జెల్లుట ఋవిభక్తియతి; సహజ ఋకారముతోఁ జెల్లుట ఋకారయతి. ఇట్లు రెండు భేదములుగాఁ జెప్పుటకన్న ఒక్క ఋకారయతిలోనే పుఫుబుభులకు ఋవర్ణము చెల్లు నన్నఁ జాలును. ఇట్లే వబల కభేదయతి, పఫబభవల కభేదవర్గయతి యని రెండుగాఁ జెప్పుటకన్న పఫబభవల కభేదయతి చెల్లు నన్నఁ జాలును.

సరసవళి చేతనే (అయహలు, చఛజఝశషసలు, నణలు) గతార్థములగు; ఋజుయతి (య-హ), ఊష్మయతి (శషస) ప్రత్యేకముగఁ జెప్పుట చర్వితచర్వణము.

తద్భవవ్యాజ విశ్రామములు విశేషవళి యను రెంటిని జ్ఞావడి యను పేర నొక్క భేదమునందే చెప్పనగునని కొందఱ మతము. తత్సమ తద్భవ పరిణామసంబంధ కారణముగ జ్ఞకారమునకు నణలు చెల్లుటయు, తిక్కన ప్రయోగ మాధారముగ జ్ఞకారమునకు కవర్గము చెల్లుటయు నను నీరెండు, భిన్నవర్గ విషయములు గాన వేర్వేఱఁ జెప్పినాఁ డప్పకవి. విశేషవళి యప్పకవి క్రొత్తగాఁ జెప్పినది. ఇతర చ్ఛందములలో లేదు; కాని పూర్వప్రయోగము లెన్నో యున్నవి.

చేఱిది, ధరించు-అను శబ్దములం బోలినవానిలో మధ్య హల్లునకును, చేఱియది, ధరియించు-అను రూపములలో స్వరము విరళముగ నున్నప్పు డచ్చునకును యతి చెల్లు

నని వరుసగఁ బ్రత్యేక భిన్నయతులు రెండు ప్రత్యేక యతిభేదములుగాఁ జెప్పఁబడి నవి. స్పష్ట ప్రతిపత్తి కారణము దప్ప మఱి వీని ప్రత్యేకతానిరూపణమునకు నావశ్య కత గానరాదు.

రఱల యతిమైత్రి నిషేధించు నిమిత్తము వికల్పయతిని బృథగ్భేదముగా సంగ్ర హించుట యనవసరము.

అంతోష్మ సంధి పదులు వికల్ప విరమణములు వేర్వేఱుగఁ జెప్పుటన్న రెంటి యందును వికల్పసంధి నిమిత్తమగుటచే నొక వికల్పసంధియతిలోనే రెంటిని సంగ్ర హింపవచ్చును.

ఇఁక నుభయయతి విషయము.——

అచ్సంధి గలిగి ప్రసిద్ధ సాహచర్యము గల శబ్దములందు స్వరమునకుఁ గాని వ్యంజనమునకుఁ గాని కూర్చు యతి యుభయయతి యనఁబడును. ఇదియే కొందఱ మతమున అఖండయతి యనఁబరఁగును. అఖండయతిని సమ్మతించిన నుభయయతిభేద ములఁ జెప్పనక్కఱ యుండదు. అఖండయతిని సమ్మతింపమిచేతను, బూర్వలాక్షణికులు పేర్కొని యుండుటచేతను అప్పకవి మఱికొన్నిటిని జేర్చి యుభయయతిభేదములు 12 తెల్పెను.

ప్రాసయతి యొక యతిభేద మనరాదు. గీత సీసాదులలో యతికి మాఱు ప్రాస మైత్రి గావించుట ప్రాసయతి యగును. అప్పకవికి ముందున్న చిత్రకవి పెద్దన ప్రాస యతిని బేర్కొనెను.

అప్పకవి చెప్పిన యతిభేదములలో అవసరము లేవి, యనవసరము లేవి యని నిర్ణయించుటలో మతభేదము లున్నను, ప్రత్యేకయతి, ఋజుయతి, ఊష్మయతి మున్నగు కొన్ని యనవసరములు పునరుక్తులు ననక తప్పదు.

## అప్పకవి చెప్పని యతి విశేషములు

### ఌ కా ర య తి

ఈ యతిభేద మనంతుఁడు మాత్రము చెప్పెను.

క్ల ప్తిలేదు శౌరిగుణావ+ళికి ననంగ. (ఛందోదర్పణము-1-90)

ఌకారమునకు 'ళి' తో మైత్రి యనంతునిచేఁ జూపఁబడినది. అనఁగా ఇ ఈ ఎ ఏ లం గూడిన ల ళ లు ఌకారమునకుఁ జెల్లు నని యొఱుఁగ నగును. దీని నప్పకవి గ్రహింపలేదు. ఈ 'ఌ - ళి' యతికిఁ బ్రయోగాంతరము మృగ్యము. దానం జేసియే యప్పకవి యుపేక్షించెనేమో ? అనంతుఁడు చెప్పినట్లు గాకున్నను ఌకారయతి గూర్చిన యీ క్రింది ప్రయోగములు కొన్ని భారతాదులలోఁ గానవచ్చెడు.

సీ. వినవయ్య కృతవీర్యుఁడను జనపతి.........
అతని వంశమున వారలి ధనలుబ్ధులై
కృతవీర్య ధనమెల్లఁ+గ్లప్తిసేసి. (భార-ఆది-7-133)
ఘృతపయోరాశి సం+క్లప్తావధికమైన
చంచత్కుశద్వీప జగతిఁజేరి. (కాశీఖండము-5-281)
క్లప్త పట్టాభిషేక మం+గీకరించి. (చంపూరామాయణము-8-165)

ఈ ప్రయోగములంబట్టి ఇకారస్వర వర్గముతోఁ గూడిన క ఖ గ ఘ లు 'క్ల' వర్ణముతో యతిమైత్రి నందు నని యేర్పడుచున్నది. అప్పకవి కీ ప్రయోగములు గోచరింపలేదు కాఁబోలు.

ఏవార్థకవడి

సకల హితంబై.....బండ్రెండవపర్వం,
బ కడున్ మేలనఁగ శాంతి+పర్వము వెలయున్. (భార-ఆది-158)
పర్వంబు+అ - పర్వంబ - ఇందు వ్యంజనమైత్రి గూర్పఁబడినది.
మహనీయ సంయమం+బ మహాధనంబుగా. (శృం-శాకుంతల-4-112)
ఇది యప్పకవి గ్రహింపలేదు.

సంయుక్తయతి - స్నానశబ్దము

'స్నా' అను సంయుక్తాక్షరమునకు 'స-న' లు యతి చెల్లుట సహజము. కాని యీ క్రింది పద్యములలో 'స్నా' కు నందులేని 'తకారముతో' యతి మైత్రి చేయఁబడియున్నది.

స్నాన మొనర్చి ధౌతపరి+ధానముఁగట్టి. (హరవిలాస-2-37)
స్నానమొనర్చి ధౌతపరి+ధానములన్ ధరియించి. (రుక్మాంగద-1-95)
స్నానమహిమంబు భక్తి తా+త్పర్యగరిమ. (కాశీఖండము)
స్నానంబుదీర్చి ధౌ+తములైన వస్త్రముల్. (మత్స్యపురాణము)

ర - ల యతి

'ర ల యోరభేదః' అను ప్రమాణము ననుసరించి, వబలకు ల ళ లకు లడలకువలె 'ర ల' లకు నభేదయతి యొప్పుకొనక తప్పదు. 'రేఫమునకు లకారమునకు గ్రాహ్యంబుగా' దని యప్పకవి యగ్రాహ్య విరామముల క్రింద వ్రాసెను (3-271). నైషధము లోని 'లీలామకరాంక చంద్ర+రేఖాంకుర' అను ప్రయోగమునందలి 'చంద్ర రేఖ' అను పాఠమును ర ల యతి యున్నదను కారణమున 'చంద్రలేఖ' అని పఠించి ర ల యతి నివారించె. అట్లే వసుచరిత్రలోని 'రోలంబాలక యోర్తుగ్రుంకి బిసవ+ల్లుల్

దున్ని' అను పాదములో ర ల యతి సరిగాదని 'లోలంబాలక' యను పాఠము గల్పించెను. కస్తూరిరంగకవి యభేదయతి క్రింద ర-లను ద-డలు చేర్చి చెప్పి కొన్ని లక్ష్యములు చూపెను.

రాజకుమారుఁడే+లంగఁ గలఁడు. (శ్రీనాథుని సునందనచరిత్ర)
లోకుల్ మెచ్చ వ్రతంబు నాతలఁపు తీ+రున్. (కాళహస్తీశ్వరశతకము)
లీలాహాస్యకళా ప్రసంగముల న+ద్రేకించి. (కాశీ-6-20)

## కై యతి

పంచమీవిభక్తి కన్న కంటెలకువలెఁ జతుర్థీ విభక్తి కై కయి ప్రత్యయములకు (కు+ఐ, కు+అయి) నుభయయతి చెల్లఁదగును. దీనిని జతుర్థీ విభక్తి యతి యని పేర్కొనవచ్చు.

అనఘ మా మాను శకుని నా+కై కడంగి (భార-సభా-2-174)
హావణుగఁ గల్పవృక్ష సుర+కై (శశాంక-1-84)
కమలాపతిఁ గొల్తు ము_క్తి+కై విభు వనఁగన్ (నరస-4-21)

## ప్రయోగ దృష్ట యతి విశేషములు

కవిప్రయోగములలో విలక్షణములైన యప్రశస్తము లనఁబడు యతిమైత్రీ విశేషములు కొన్ని కానవచ్చెడు. అట్టివానిలోఁ గొన్ని క్రిందఁ జూపఁబడును.

**ఋ - రు వడి:**

ఋ వర్ణమునకు రి వర్ణమునకు యతి చెల్లునని ఋవళి యుపదేశించుచున్నది. లాక్షణికు లెల్లరు ఋవళినే చెప్పిరి. కాని 'ఋ-రు' లకు యతి గూర్చిన ప్రయోగములు గొన్ని కానఁగును.

క్రూరార్ధచంద్రాస్త్ర+కృత్తోరు బాహులై (భాస్కరరామా-యుద్ధ-1448)
పుండరీకనేత్రుని నిజధామవైభవ స+మృద్ధికి(భాగవత-10-స్కం-ఉ-5317)
మృదువైనచేతులు+ముండ్లపాదలు (కాళిందీ)
గృహధర్మనిరతులు+కొనివచ్చి (భోజరా-3-27)
రురువర్ణదేహంబు+ఋగ్వేదమునకు (పండితారాధ్య-వాదప్ర-523 పుట)

అప్పకవియుఁ బ్రమాదవశమున 'ధృవ - ధృత'; 'ధృవ - దేవకి' అని ధ్రువశబ్దరేఫమును ఋత్వముగా భ్రమించి యతి గూర్చినాఁడు. (చూ. ఈ సమీక్ష - పుట 67-68)

**ఊ - వు యతి:**

ఉండు, ఊరు ఇత్యాది శబ్దముల యాది స్వరమును వాడుకలో 'వుండు, వూరు' అనురీతి వకారాదిగా నుచ్చారణనుబట్టి వ్రాయుదురు. అట్టి యుచ్చారణ భ్రమకు లోనయి కాఁబోలు నీక్రింది ప్రయోగములు చేయఁబడినవి.

గో॥వుల గణియింప ధాతయును+నోపఁడు (భాగవత-ఉ-462)
కా॥వునఁ జండాలుఁడు కాఁడు సందియము లే+దూహింప
(ధర్మఖండ పుట. 227)
దే॥వునకు ననుంగువాఁడ నని+యుత్సుకతకు (వృషాధిపశతకము-98)
ఒక్కనిడించి పో+వుటయ భీతిల్లి (నవనాథ-92-పుట)

ఇట్లే యప్పకవిమతమున నప్రశస్తము లనఁబడు ద డ ల, ర ఱ ల ప్రాస సాంకర్య ప్రయోగములు గలవు.

## ప్రాసయతి

గీత సీసములందు మాత్రమే దీనికిఁ బ్రయోజనము. యతిమైత్రికి మాఱు ప్రాస మైత్రిని గూర్చుట ప్రాసయతి. ఇది యొక యతిభేదముగాఁ జెప్పుట యనవసరము. చిత్రకవిపెద్దన, లింగమగుంట తిమ్మన మున్నగువారు ప్రాసయతిని గూడఁ జెప్పిరి.

## ప్రాసభేదములు

కవిజనాశ్రయ కావ్యాలంకారచూడామణులందుఁ బ్రాసభేదములు చెప్పఁబడవు. అనంతుఁడే మనకుఁ దెలియవచ్చినంతలోఁ దొలుత 12 ప్రాసభేదములఁ జెప్పెను. చిత్రకవి పెద్దన యనంతుఁడు చెప్పినవానినే యథాతథముగా గ్రహించెను. బహుగ్రంథ పరిశోధకుఁ డయిన యప్పకవి 17 ప్రాసభేదములఁ జూపెను.

## ప్రాసభేదముల పట్టిక

| అప్పకవి | అనంతుఁడు - చిత్రకవి పెద్దన |
|---|---|
| 1. అర్ధబిందు సమప్రాస } | 1 సమప్రాస |
| 2. పూర్ణబిందు సమప్రాస } | |
| 3. ఖండాఖండప్రాస | 9 అర్ధబిందుప్రాస |
| 4. సంయుతాక్షరప్రాస | 1 సమప్రాస |
| 5. సంయుతాసంయుతప్రాస | 10 ఉభయప్రాస, 4 త్రిప్రాస |
| 6. రేఫయుతప్రాస | ................ |
| 7. లఘుద్విత్వప్రాస | 6 సమలఘుప్రాస |
| 8. వికల్పప్రాస | 7 వికల్పప్రాస |
| 9. ఉభయప్రాస | 5 ప్రాదిప్రాస |
| 10. అనునాసికప్రాస | ............ |
| 11. ప్రాసమైత్రిప్రాస | 2 ప్రాసమైత్రిప్రాస |
| 12. ప్రాసవైరము | ............ |
| 13. స్వవర్గజప్రాస | ............ |

| అప్పకవి | అనంతుఁడు - చిత్రకవి పెద్దన |
| --- | --- |
| 14. ఋ ప్రాస | 3 ఋ ప్రాస |
| 15. లఘుయకారప్రాస | ............ |
| 16. అభేదప్రాస | 2 ప్రాసమైత్రిప్రాస |
| 17. సంధిగతప్రాస | 12 సంధిగతప్రాస |
| ............ | 8 బిందుప్రాస |
| ............ | 11 సంయుతప్రాస |

## ప్రాసభేదముల సంగ్రహ వివరణము

1. అర్ధ బిందు సమప్రాసము.—
వీఁక-తాఁకి-ఇట్లు అరసున్న యన్ని పాదముల ప్రాసలోఁ గూర్చుట.

2. పూర్ణ బిందు సమప్రాసము.—
పొందు-బృంద - ఇందీవర-నందన ఇట్లన్నిట నిండు సున్న ప్రాసలోఁ గూర్చుట.

3. ఖండాఖండప్రాసము.—
ఒకచో నరసున్నయుండి ప్రాసలో నొకచో లేకుండుట. లోకము - చీఁకటి.

4. సంయుతాక్షరప్రాసము.—
అన్ని ప్రాసస్థానముల సంయుక్తాక్షరము సమముగాఁ గూర్చుట. గర్గ - భర్గ, చంద్ర - ఇంద్ర.

5. సంయుతాసంయుత ప్రాస.—
ప్రాసలో క్రార సంయుక్త మొకచో నుండి యొకచో లేకుండుట. శ్రీకర - లోకులు - ఈక్రియ.

6. రేఫయుత ప్రాస.—
ప్రాసలో నన్నిట క్రారవడి గూర్చుట.

7. లఘు ద్విత్వ ప్రాస.—
విద్రుచు-అద్రుచు-ఇందు సంయుక్తపూర్వాక్షరములు రెంటను లఘువులు.

8. వికల్ప ప్రాస.—
వికల్పసంధినిబట్టి యేర్పడు ప్రాస.—
దిక్ + మహిత - దిఙ్మహిత, దిగ్మహిత. దిఙ్మహిత - యుగ్మ.

9. ఉభయ ప్రాస.—
స - ష లకు, న - ణ లకుఁ బ్రాస.

---

........ఈ ప్రాసభేదము చెప్పబడలేదనుటకు గుర్తు; కాని అనంతుని ప్రాసభేదము లన్నిటిని అప్పకవి సంగ్రహించెను.

10. అనునాసిక ప్రాస.—

భక్తిన్ + మురసంహారు - భక్తిమ్మురసంహారు.

ఇట్టి సంధిగత నకారమునకు మకారాధ్యాదేశమగునపుడు ద్విత్వ మకారముతోఁ ప్రాస. భక్తిమ్ముర - తమ్ములు.

11. ప్రాసమైత్రిప్రాస.—

'మ్మ - ంబ' లకుఁ బ్రాస; కమ్మ - అంబు.

12. ప్రాస వైరము.—

ర - ఱ లకుఁ బ్రాస చెల్లదు.

13. స్వవర్గజప్రాస.—

ద ధ లకు, థ ధ లకు ప్రాస.

14. ఋ ప్రాస.—

రేఫ ఋకారములకుఁ బ్రాస. ఆ ఋషి - చీరలు.

15. లఘు యకార ప్రాస.—

లఘ్వలఘు యకారములకుఁ బ్రాస. ఆ యజ్ఞ - శాయి.

16. అభేద ప్రాస.—

ల ళ లకు, ల డ లకుఁ బ్రాస.

17. సంధిగత ప్రాస.—

దివిజ - కౌరివడవైచె (కౌరి + పడ) - సంధియందు ఆగమాదేశములుగా వచ్చిన యక్షరములకుఁ బ్రాస.

అప్పకవి చెప్పక విడిచినవి కొన్ని కలవు. మఱి యాతఁడు చెప్పిన వానిలోఁ గొన్ని యవసరము గానివియుఁ గలవు. అర్ధబిందు సమప్రాసము, పూర్ణబిందు సమప్రాసము, సంయుతాక్షరప్రాసము అని మూఁడు భేదములుగాఁ జెప్పుటకంటె మూఁటిని జేర్చి సమప్రాస మను పేరితో నొక ప్రాసగానే చెప్పుట సముచితము. అదియుం గాక ఖండాఖండప్రాస కర్ధబిందుప్రాస యని యనంతునివలె నామకరణము చేసి యుండవలసు.

ఖండాఖండప్రాస

అరసున్న పూర్వమందుఁగల హల్లునకును, అరసున్న పూర్వమందు లేని హల్లునకును గూర్చు ప్రాస. అప్పకవి లక్షణ మిట్లున్నది.

"నిడుపులు నరసున్నలు దమ, కెడమనుగల కచటతపల కిలఁ బ్రాసములై
తొడరును నిర్బిందువు లొక్కెడ ఖండాఖండసంజ్ఞ నినకులతిలకా." (3-302)

దీర్ఘముమీఁది క చ ట త ప ల కే యీ ఖండాఖండ బిందు ప్రాస యప్పకవి యుపదేశించెను. కాని లక్ష్యములలో (తీఁగ - డాఁగు - నాగ - భోగ) గకారమునకు నిట్టి ప్రాస చూపఁబడియున్నది. (3-307) దీనిచే బరుషములకే కాక సరళముల కును నీ ప్రాసమైత్రి చెల్లుబడి యగునని తలంపవలెను. అప్పకవి చెప్పలేదు గాని హ్రస్వ ములమీఁది అర్ధబిందుపూర్వక పరుష సరళములకు నీ ప్రాస చెల్లు నని కూచిమంచి తిమ్మన సర్వలక్షణసారసంగ్రహమున సవిమర్శముగ వ్రాసియున్నాఁడు.

''అర్ధబిందువు నిర్బిందువగు పదముల, ప్రాసములు దీర్ఘములమీఁదఁ బలుకఁ జెల్లు
ననుచుఁ దగ ముద్దరాజు రామన వచించె, హ్రస్వములమీఁద నిటువలె నలరు రుద్ర
(పుట. 19)

సంయుతాసంయుతప్రాస

క్రింద రేఫముతోఁ గాని లకారముతోఁ గాని కూడియున్న హల్లునకు రేఫ లకార సంయుక్తము లేక ప్రాస గూర్పవచ్చును. అప్పకవి యిందులకుఁ జూపిన స్వీయో దాహృతి.

పాఁడి ద్రచ్చఁగనిమ్ము నా+తండ్రి కృష్ణ
వేఁడుకొనియెద నందాఁకఁ+బండ్లు తినుము
దుండగపుఁజేష్టలును నోటి+గాండ్రతనము
మెండుగాఁజొచ్చె నీకు నై+దేండ్ల కనఁగ. (3-315)

క్రారవడితోఁగూడిన హల్లులకు మాత్రమే క్రారలేని వానితోఁ బ్రాసమైత్రి వాలాయముగాఁ బ్రయోగములందుఁ గానవచ్చెడు. 'మెండు - ఏండ్లు' వంటి లకార సంయుతాసంయుతప్రాస ప్రామాణిక గ్రంథములం దున్నట్లు లేదు; అప్పకవియుఁ నందు లకు నితర కవుల లక్ష్యములు చూపలేదు. మఱి మొదటి రెండుపాదములలోఁ బూర్ణార్ధ బిందు ప్రాస ఘటింపఁబడియున్నది. ఇట్టి ప్రాస యప్పకవి చెప్పలేదు. కాని పూర్ణార్ధ బిందుప్రాస నన్నిచోడాది శివకవుల గ్రంథములలోఁ బ్రయుక్తమైయున్నది.

పోఁడిగ—మూఁడు—బ్రహ్మాండము—భాండము.
(కుమారసంభవము-6-157)

పాండురాంగంబైన—పోఁడిగా వెలుఁగుచు. (బసవపురాణము)

అప్పకవి చెప్పిన సంయుతాసంయుతప్రాసలో రేఫ సంయుక్తములోఁ గ్రిందిది. శివకవుల ప్రయోగములలో మీఁద రేఫ గల సంయుక్తమునకు (భర్గ) అట్టి రేఫతోఁ గూడని హల్లుతోఁ బ్రాసమైత్రి చూపట్టుచున్నది.

భర్గుండు—తర్గంగా—నుగ్గాడక—మ్రగ్గింతు. (కుమార-11-34)

ఇవ్వసుమతి—పువ్వు—సర్వజ్ఞ—ఎవ్వఁడు. (శివతత్త్వ-196)

కర్జంబు—బిజ్జల—ఖుజ్జగించు—నిర్జివి. (బసవ)

అప్పకవి యిట్టివానిని సంగ్రహింపలేదు. శివకవుల గ్రంథముల నాతఁడు చూడ లేదో, లేక చూచియుఁ దత్ప్రయోగము లప్రశస్తములని మానెనో ?

ఉభయ ప్రాస న-ణ; స-ష.

వ్యాకరణసూత్రములచే నాదేశమైన ణకారమునకును కేవల నకారమునకును ప్రాసమైత్రి చెల్లును; అట్లే యాదేశ షకారమునకుఁ గేవల సకారమునకుఁ జెల్లును.

'ప్రాణవల్లభుఁగాని చన్న+దాస్తవేంద్రు.'

ప్ర+అన - ప్రాణ; ఇందు నకారమునకు ణకార మాదేశమయ్యె.

"వసుధా—విషమ". వి+సమ - విషమ.

ఇట్లనుటచే శబ్దసిద్ధములైన న-ణ లకు (మనము - గుణము) స-ష లకు (అసమ - ఝుష) నీ ప్రాస చెల్ల దని భావము.

ఛందశ్శాస్త్ర లందఱు ఇట్లే యీ ప్రాసభేదమును నిర్వచించిరి. కాని ప్రయోగము నందు సిద్ధ నకార ణకారములకును ప్రాసమైత్రి గలదు.

పెనఁగు తీఁగలు దొడ్డ+ఫణులుగాఁగ (కుమార-4-101)

గుణవత్పాత్రులఁ బూజించిన (శివతత్త్వ-137)

దనుజుల...నిర్గుణత (భాగవత-6-276)

మనకుఁ గలయట్టి బాంధవ+గణము (మొల్లరామా-యుద్ధ-1-88)

4. పద్యపరిచ్ఛేదము

ఇందు గణములు, షట్ప్రత్యయములు; వృత్తములు, జాత్యుపజాతులు, చిత్ర బంధ గర్భకవిత్వములు అను నంశములఁగూర్చి విపులముగాఁ జెప్పఁబడినది.

పద్యలక్షణములు ఛందశ్శాస్త్రలు కొంద ఱేకపాదముతోను, గొందఱు రెండు పాదములతోను, మఱికొందఱు నాల్గు పాదములతోను జెప్పిరి. ఒక పాదముతోఁ జిత్రకవి పెద్దన, సగము పద్యముతో భీమన, విన్నకోట పెద్దన, నాల్గు పాదములతో అనంతుఁడు, అప్పకవి పద్యలక్షణముల రచించిరి. సమవృత్తములు కోట్లకొలఁది కలవు. సర్వసమవృత్త సంఖ్య 134217726. కోట్లకొలది వృత్తము లున్నను, సుమారు రెండు వందల వృత్తములకంటె నెక్కువ యెవ్వరు చెప్ప లేదు. అప్పకవి 186 సమ వృత్తములనే వ్రాసెను. ఇవికాక యర్ధసమ విషమాది గౌణవృత్తములఁ బ్రపంచించెను.

అప్పకవి ప్రతిపద్యలక్షణమును సమగ్రముగాఁ జెప్పెను. భీమనాదులు గొన్ని పద్య లక్షణములలో యతిని నిర్దేశింపరైరి. అప్పకవి యతిస్థానమును జెప్పని పద్యలక్షణము గానరాదు. ఒక వృత్తమునే భిన్ననామములంటచే వేఱుగా భ్రమించి, వేర్వేఱు వృత్తములుగా అప్పకవి కొన్నింటిని వ్రాసెను. శశివదన - సురలత; రుగ్మవతి - చంపకమాలి; కాంతి - కలితాంత; భద్రకము - చంద్రిక ఇందు రుగ్మవతి (6-యతి) - చంపకమాలి (7); భద్రకము (7) - చంద్రిక (9) గణభేదము లేకున్నను యతి భేదము గలిగియున్నవి.

## పద్యలక్షణములలోఁ గొన్ని విశేషములు

పద్మకము : అప్పకవి 11 యతి చెప్పెను.

నభజజాగగణ యుక్తిఁబి+నాకి విరామక.

నన్నయ 8 యతి పాటించెను.

కొడుకుపలుకు విని+కూడదునాక దురాత్ముఁడై (ఆది. 6-230)

## పృథ్వి

సంస్కృతచ్ఛందమునందు దీనికి 8 పై యతి చెప్పఁబడినది. తెనుఁగు సంప్రదాయము మేరకు 9-వ యక్షరము యతి గావలెను. తెనుఁగు ఛందఃకర్తలు యతిస్థానము 12-వ యక్షర మని చెప్పి యున్నారు. 'జసల్ జసయవంబు లున్నకర+సంఖ్య విశ్రాంతులన్' అని యప్పకవి. నన్నయ 12 యతిని బాటించెను. అల్లసాని పెద్దన, శ్రీనాథుఁడు, తెనాలిరామకృష్ణుఁడు మున్నగువారు 9 యతిని గూర్చిరి.

## మానినీ కవిరాజవిరాజితములు

ఈ రెండు నొకే నడక గల వృత్తములు. మానిని ప్రథమగురువును రెండు లఘువులుగా మార్చినఁ గవిరాజవిరాజిత మగును. ఈ రెండు వృత్తములకుఁ గొందఱు మూఁడు యతులు, కొందఱొకే యతి పాటించిరి. మానినికి విన్నకోట పెద్దన, అనంతుఁడు 3 యతులు నిర్దేశించిరి. అప్పకవి 13-వ చోట నొక యతినే చెప్పెను. కవిరాజవిరాజితమునకు విన్నకోట పెద్దన, అనంతుఁడు, చిత్రకవి పెద్దన, అప్పకవి 3 యతులు నియమించిరి. నన్నయ యొక యతినే కూర్చెను. తిక్కన యుభయరీతుల రచించెను.

## క్రౌంచపదము

సంస్కృతమున నీ క్రౌంచపదము 25-వ ఛందములోనిదిగా నున్నది. కాని, తెనుఁగున 24-వ ఛందములోనికి మాఱినది. తెనుఁగులో 25-వ ఛందములోని

క్రౌంచపద మెందును గానరాదు. క్రౌంచపదము తిక్కన నన్నిచోడాది ప్రాచీన కవులును, భీమనాది ప్రాచీనచ్ఛందః కర్తలును వ్రాసియున్నారు.

సంస్కృత క్రౌంచపదము

క్రౌంచపదాభ్మౌస్భౌననన్నాన్గౌ విషుశర వసుముని విరతిరిహభవేత్.

(వృత్తరత్నాకరము)

తెనుఁగు క్రౌంచపదము

పంచశరాభా - సంచితపుణ్యా - భ మ స భ న న న య - పరిమితమైనన్.
క్రౌంచపదాఖ్యం - బంచితమయ్యెన్ - క్రమయతి దశవసు-కలితముగాఁగన్.

(కవిజనాశ్రయము)

సంస్కృతములో - భ మ స భ న న న న గ (గణములు)
తెనుఁగులో - భ మ స భ న న న య (గణములు)

సంస్కృత క్రౌంచపదము కడపట 'నగము' తెనుఁగులో 'యగణము'గా మాఱినది. రెంటికి 5 మాత్రలే. కాన నడకలో భేదము తెలియరాదు. తెనుఁగు ఛందోగ్రంథములలో దీనికి 10, 18 పై యతులు నియమింపఁబడెను. కాని 5 పైఁ బ్రాసయతియు లక్ష్యములం దెల్ల యెడలఁ గూర్పఁబడి యున్నది. తిక్కనాదులు నీ ప్రాసయతిని గూర్చియున్నారు. చూడుఁడు.

కౌరవసేనా-వీరులు లావుం-గడిమియుఁ జలమును-గడఁక యెలర్పన్
ధీరతసొంపుం-గ్రూరతపెంపుం-దెగువయు నెఱపఁగఁ-దెరలకపోఁకన్.

(స్త్రీ-1-166)

అప్పకవి క్రౌంచపదములో నీ ప్రాసయతి పాటింపఁబడలేదు.

పంచమకేశుం డిచ్చిన భాస్వ - ద్వరమున మనమున - బవరముగోరన్
వంచనతో బాణాసురహస్త - వ్రజములు దఱిగెను - వడిహరియంచున్.

(4-357)

ఎఱ్ఱన హరివంశములోఁ గ్రౌంచపదమునకు 5 పై యతి యుంచినాఁడు; ప్రాసయతి పాటింపలేదు. (ఉత్తరభాగము-9-259)

'సారవివేకా - సౌఖ్యవిలోకా - సకలరిపుభయద - సమదసమీకా.'

ఇఁక నన్నిచోడ కుమారసంభవములోని క్రౌంచపదయతి నిలక్షణముగా నున్నది.

'చంచల నాస్వా-దించుచు లేఁ దూం,డ్లకరవు ప్రియులకు - నలఁదుచుమైరో
మాంచములోలిం - గంచు కితంతై, పాదమఁగ నలరుచుఁ - ఖులినములంగ్రీ.
(10-20)

ఇందు 5 పైఁ బ్రాసయతి యున్నది. బహుయతులుగల వృత్తములందు వలెఁ బాద ప్రథమాక్షరమునకు 11, 19 స్థానముల యతి మైత్రి చేయఁబడక, 11-వ యక్షరమునకు 19-వ యక్షరము ప్రత్యేకపాదమందువలె యతి కూర్పఁబడినది. నన్నిచోడుని యీ యతినియతి 'మురారేః తృతీయః పంథాః' అన్నట్లున్నది.

## సరసిజము

క్రౌంచ పదమువలె నిదియు 24-వ ఛందములోనిది. ఈ రెండు వృత్తములకు మాత్రాసంఖ్య యొక్కటే; నడక సమానము. దీనికిఁ బ్రథమ దళమునఁ బ్రాసయతి కవిజనాశ్రయాదులందును దిక్కన భారతమునను బాటింపఁబడియున్నది.

మాత్రాకారా-చారుచరిత్రా-మతయన న న న స - మహియతి రచనన్
సార్థంబైనన్ - సూరికవీంద్రుల్ - సరసిజమని వినఁ - జదివిరిసభలన్.
(కవిజనాశ్రయము.)

అప్పకవి సరసిజమునకును బ్రథమదళప్రాసయతి పాటింపలేదు.

## మధ్యాక్కర

ఛందఃకర్తలందఱివలె నప్పకవియు 3-వ గణము తరువాతి యక్షరము యతి స్థానముగాఁ జెప్పినాఁడు.

"మునుపుగాఁ బ్రాసంబుగూర్చి+మూఁటిపై విరమంబునిల్పి." (4-464)

కాని నన్నయ భారతములో మధ్యాక్కరలలో 4-వ గణము తరువాతి యక్షరము యతి గూర్పఁబడియున్నది. అరణ్యపర్వ శేషమున ఎఱ్ఱన మధ్యాక్కరలో 3-వ గణముమీఁద యతి పాటించెను. నన్నయ చింతామణి ననువదించుచు నన్నయ గ్రంథమును బరిశీలించిన యప్పకవి యీ మధ్యాక్కర యతిస్థాన విషయమున నన్నయ మతము నేల చెప్పలేదో ? మధ్యాక్కరలను గ్రంథములందు నన్నయ యెఱ్ఱన లిద్దఱే వాడిరి.

ధరణిఁ జ,రాచర, భూత, సంఘుంబుఁ+దమవిమ,వహ్ని - (ఆదిపర్వ-2-185)
అసదృశ, తేజుఁడు, బ్రహ్మ+ద్యానీక, సహితుఁడై, కడఁగి."
(ఎఱ్ఱన-అరణ్య-4-310)

## తరువోజ

"శతమఖత్రితయంబు - జలజాప్తుఁ డొకఁడు
శతమఖత్రయిమీఁదఁ - జను విశ్రమంబు,
ప్రతిభ నీ యడుగులో - ప్పఁగ రెండుగూర్పఁ
బ్రతిమీఱ నొక్కొక్క - పాదమై తనరు
చతురంఘ్రులీరీతి - జతకూర్చి సుకవి
చతురవాచారూఢి - జలజాక్షు నుతులఁ
గృతులందుఁ దరువోజ - నీయోజ జెసఁగఁ
గృతి కృత్యుఁడై చెప్పు - క్షితినెల్లసభల. (4-461)

శతమఖత్రయి మీఁద విశ్రమం బని లక్షణములోఁ గలదు. ఈ పాఠము పొరపాటు. తొలుత రెం డింద్రగణములమీఁద యతి యున్నది గాన 'శతమఖద్వయి మీఁద' అని యుండునేమో యనుకొనవచ్చుఁ గాని యదియుఁ సరిపడదు. తరువోజకు రెండేసి గణములపై మూఁడుచోట్ల యతులుండును. 'శతమఖద్వయి' అను పాఠమున నట్టి యర్థము కుదురదు. మఱి యప్పకవి తరువోజలో ద్విపదవలెఁ బూర్వార్ధోత్తరార్ధములందుఁ బ్రాస కూర్పఁబడియున్నది. ఇది యక్కఱలేదు. చూ. నన్నయ భారతము.

"ఈ విల్లు మోపెట్టి-యేనుబాణముల - నీయంత్రమత్స్యంబు - నేసినవాఁడ
భావజప్రతిముఁడీ-బ్బాలకుఁదగిన-పతి యిది మునిశక్తిఁ-బడసినవిద్య."
(ఆది-7-170)

ఇంకను అప్పకవి చెప్పిన ఛందోవిషయములందు విమర్శింపవలసిన సంగతు లనేకములు గలవు. ఆ ఛందోలక్షణవిశేషములు నా 'తెలుఁగుభాషలోనిఛందోరీతు' లను గ్రంథములో సర్వంకషముగఁ జర్చింపఁబడినవి జిజ్ఞాసువులం దరయుందురుగాక.

## 5. సంధిపరిచ్ఛేదము

యొక్క : షష్ఠీవిభక్తి ప్రత్యయమైన యొక్కకు లోపము నిత్యముగాఁ బ్రాచీన గ్రంథములందు సర్వత్ర గానవచ్చుచున్నది.

"పద బాంధవసుతయొక్క భద్రయొక్క జాంబవతియొక్క యనుశేషషష్ఠులందు."
(5-28)

ఈ విధముగా యొక్కను చేర్చి వ్రాయుట ప్రాచీన సంప్రదాయము గాదు.

విభక్తులలో ద్రుతప్రకృతికములు (5-59). ఇందు 'అందుఁ, నఁ' అను ప్రత్యయములు చెప్పఁబడలేదు. లోపల-లోపలి.

చేత-తోడ-వలన లకు మూఁటికే యలుక్సమాసమున నిత్యము చెప్పఁబడును. ఇందు 'లోపల' ప్రత్యయముగూడఁ జేర్పఁబడినది.

'భాగవతుల లోపలి గణనయు.' (5-85)

పూనుచు - పూంచు 'పూంచు' అని సబిందుకముగాఁ జెప్పరాదన్నాఁడప్పకవి. 'పూంచు' అని యీ క్రింది తిక్కన పద్యములోఁగలదు.

'కాంచన జాలాలంకృత చంచత్తను లీల మెఱయు జవసాశ్వములన్
బూంచి రథంబున. (విరాట. 4-45)

## ప్రథమపురుషేకారసంధి

'నిత్యమనుత్తమపురుష క్రియాస్వితః' అని చింతామణి. దీని ననుసరించి ప్రథమ మధ్యమపురుషముల ఇకారమునకు సంధి నిత్యముగావలయు. నన్నయచింతామణి ప్రథమ పురుషమునందలి యిత్తునకు నిత్యసంధి విధించుటచే 'కూర్చుండిరి యొండొరుం గదిసి' అను శ్రీనాథుని ప్రయోగము సరిగాదని యాక్షేపించినాఁడప్పకవి. (5-64-65) అప్పకవి కథర్వణ కృత వికృతివివేకము లభింపలేదు కాఁబోలు ! అందు 'ప్రథమే చోత్తమే చైవ క్రియేతో వా భవేచ్ఛ్యుతిః' అని చింతామణి సూత్రము సవరింపఁబడినది. ప్రథమోత్తమపురుషముల క్రియల యిత్తునకు సంధి వైకల్పిక మని తరువాత వ్యాకర్తలు సూత్రించిరి. శ్రీనాథు నాక్షేపించిన యప్పకవి కీక్రింది తిక్కన ప్రయోగములు గోచరములుగాలేదు కాఁబోలు.

గురుభీష్మాదులు సూచుచుండ సభ మీకుం గీడునాఁడట్లు ము
ష్కరులై చేసిరి యంత చేసియును. (ఉద్యోగ. 3-36)
అరుగుదెంచిరి యద్దేవు నర్థిఁగొలువ. (మాసల. 77)

నన్నయభట్టారకుఁడే భారతమున నీసంధి వైకల్పికముగాఁ బ్రయోగించిన స్థలముఁ జూపట్టి వీరేశలింగముపంతులు భారతప్రయోగమునకు విరుద్ధముగా సూత్రింపఁబడిన చింతామణి నన్నయ కర్తృకముగాదని కవులచరిత్రలో వ్రాసిరి. ఆప్రయోగము.

అంతఁ గొంద ఱధిక హాస్యంబు సేసిరి
యడవి నేమి రోసెదనిరి కొంద ఱు. (అరణ్య. 2-403)

ఇందులకు శ్రీవఝ్ఝల చినసీతారామస్వామిశాస్త్రిగారు చింతామణీ విషయపరిశోధనాదిగ్రంథములందు సమాధానము వ్రాసిరి. 'హాస్యంబుసేసిరి' అనుచోటఁ బాదాంతము వాక్యాంతము నగుటచే సంధిచేయ నక్కఱలేదని 'హాస్యంబుసేసిరి, అడవినేమి' అనురీతి యుండుననిి తత్కారణమునఁ జింతామణి సూత్రమునకు బాధకము కాదని శాస్త్రులవా రభిప్రాయపడిరి. ఇట్టి ప్రథమపురుషైకారసంధ్యభావము పాదమధ్యమునఁ జూపినంగాని యాంధ్రకవులచరిత్రకారులు కృతార్థులు కానోపరని యట్టి ప్రయోగములు నన్నయ భారతమున శశవిషాణప్రాయములని శాస్త్రులవారు వ్రాసిరి. శాస్త్రులవారి విమర్శ యుక్తి సహము గాని

'అవనిసురులకు నిచ్చిరియందుఁ గొందఱు. (ఆది. 7-133)

అను ప్రయోగ మీసంధిసందర్భమునసే కవిసంశయవిచ్ఛేదములో అడిదము సూరకవి యుదాహరించెను. ఇది పాదమధ్యములో నున్నది. దీనిని శాస్త్రులవారు చూడలేదు కావలె. వారికీ ప్రయోగమును 1942 లోనేఁ దెల్పితి. సమాధానము లేదు, సరిగదా ! ఇటీవలి వ్యాకరణసంహితలోనైన దానిని సంగ్రహింపలేదు.

అప్పకవి యుత్తమపురుష బహువచన క్రియేకారసంధి నిత్యమని చింతామణిలో లేని క్రొత్త మత మొకటి సృష్టించెను (5-62, 63). ఇది ప్రమాదము. నన్నయ యుత్తమపురుష బహువచనైకారమునకు సంధి వికల్పముగాఁ బ్రయోగించెను. చూ.

జంటపన్నిదంబు సఱచితి మిట్లుగా. (ఆది. 2-34)

త్రిలోకముల కధికుఁజూచితిమి యొక యెఱుకున్. (ఆది. 5-239)

ఇందు సుఖముండితిమి యెరు లెఱుఁగకుండ. (ఆది. 6-242)

అనుకరణ సంధులు

సూ. అహమాదీనాం ద్విత్వం లోపో నమ ఆదిశే విసర్గస్య.

ఈ సూత్రము ననువదించుపట్టున అప్పకవి యీక్రింది విధముగా రచించె.

'అనుకరించెడుచోట నవ్యయాదుల కొనఁ
గల బొట్టుగవకు దీర్ఘంబులకును
వచ్చు లోపము కేశవాయ తుభ్యం నమ
యనఁగ రామోఽఘ సంహర్త యనఁగ.' (5-98)

చింతామణిలో నమశ్శబ్దాదుల తుదివిసర్గకు ననుకరణమున లోపము చెప్పఁబడినదేకాని దీర్ఘాంతశబ్దముల విషయము స్పృశింపఁబడలేదు. తుది దీర్ఘమునకు హ్రస్వము

గలుగునని యప్పకవి చెప్పుట యమూలకము నిర్మూలమునగును. 'రామోఘసంహర్తా' యను ననురీతి దీర్ఘాంతముగా నుండునేకాని 'సంహర్త' యనురీతి హ్రస్వముగాదు. ఇంతే కాక, యిఁక రెండుచోట్ల అప్పకవి హ్రస్వముచేసి ప్రయోగించి యున్నాఁడు.—న హారేస్తు పరస్త్రాత యనుట (పీ. 27), కవిత్రైవవిద్యయనుచు (I-53). అప్పకవి వ్రాసిన లక్ష్యలక్షణములఁ జూచియే సూరి బాలవ్యాకరణములో 'అనుకృతిని నిడుదకుం గుఱుచ యగునని యొకండు వలికె నది నిరాకరంబు. దుర్బలస్య బలంరాజా యన వినవే' (సంధి-54) అని వృత్తి రచించె నన నొప్పును.

## అప్పకవి కవిత

అప్పకవీయము లక్షణగ్రంథమయ్యును నిందలి కవిత మృదుమధురము. సాధారణముగా లక్షణగ్రంథములలోని పద్యములు ఛందోబద్ధములు మాత్రమే. అందు యతి ప్రాస పూజాకుసుమములు, జల్లిపల్కులు మెండుగా నుండునని పండితుల తలంపు. ఇతర గ్రంథములపట్ల నట్టి యభిప్రాయము నిజమే కావచ్చుఁగాని యందుల కప్పకవీయ కవిత యపవాదము. ఆమూలాగ్రము పద్యములు చక్కని తుంటువడని నడకగలవై యున్నవి. అప్పకవి పోతన భాగవతము రేఫఱకారసాంకర్యముచే నాది లాక్షణికు లుదాహరింప మానిరని చెప్పినను 'సలక్షణంబుగా కిమ్మహి నేమిటం గొదవ' యను నుదాత్తభావము గలవాఁడై పోతన కవితారీతిని నంత్యానుప్రాసాది శబ్దాలంకార భూయిష్ఠముగాఁ దన లక్షణగ్రంథములోని పద్యముల వ్రాసెను. లక్ష్యములందు దశమస్కంధములోని కృష్ణ చరిత్ర ఘట్టములు మెండుగఁ గలవు. కవిస్తుతిలో సహజపాండిత్యుని సంస్మరించెను. లక్షణభాగమున నిక్కమైన రసాలంకారాత్మకకవిత లేకున్నను గ్రంథావతారికా భాగమున నట్టి కవిత రాణించుచున్నది.

పట్టుక (పీ. 21), వంచుక, ఎక్కుక (1-107), చేర్చుక (2-121) తెలుసుక (2-383), 'కొని' కి మాఱుగా 'క' ప్రత్యయము, వీటిలోపల (వీని లోపల-4-453), జాల్వారేపల్లెను (4-509), చనుదెంచానందము (చనుదెంచు నానందము - పీ-5) వాఁగుకు (వాఁగునకు - 4-360) తన రారజా (తనరారు నజా- 4-419) పందొమ్మిదో ఛందము (4-585) కొంచెపడుగులు (4-453) జాత వేదోత్థ (4-524) గ్రంథవిస్తారశంక (విస్తర-1-40) మున్నగు విలక్షణప్రయోగములు కొన్ని కానవచ్చెడు.

అప్పకవీయములో నేవో కొన్ని దోషములు లేకపోలేదు. కవియే యిట్లు చెప్పినాఁడు.

'కాళిదాసమయూరాదికవులకైనఁ, గలవు తప్పులనంగ నన్యులకు లేవె
దిద్దఁదగుదాని దిద్దుఁడు దిద్దరాని, యెడల నా నేరములు క్షమియించుటొప్పు.'

ఈ గ్రంథమున నాకుఁ గానవచ్చిన కొన్ని దోషములను ఛందోభంగములను లక్షణవిపర్యాసములను అప్పకవి సూచించినట్లు వీలయినంత సవరించితి.

ఆసవరణలేవో గ్రంథమున నాయూపుటల యధస్సూచిలోఁ దెలుపఁబడి యున్నవి. నాసవరణలకు (రా) అను గుర్తుంచఁబడినది. సవరణలలోఁబూర్వపాఠములను సయితము చూపితిని. గ్రంథము పఠించునపు డాసవరణల నధస్సూచిలోఁ బరికింపఁగోరెద.

'అప్పకవీయము సవరణలు' అను పేర నందలి కవిలేఖకాది భ్రమప్రమాదజనిత పాఠములను సవిమర్శముగ నుల్లేఖించి వావిళ్లసంస్థవారికి అప్పకవీయగ్రంథమునకుఁ బ్రత్యేకానుబంధముగ ముద్రింపనిచ్చితి. నా వ్యాసమును బ్రకటింపక, యందలి సవరణలను వావిళ్లవారి యప్పకవీయ పంచమముద్రణములో గ్రంథాంతమున నా పేరు చెప్పక శుద్ధపత్రములోఁ జూపిరి. అందులకు బాధ్యులా నాఁడు వావిళ్లముద్రాలయమునఁ బండితులుగాఁ బనిచేయుచుండిన కృష్ణమాచార్యులను వ్యాకరణవిద్యా ప్రవీణులొకరు. వా రంతటితోఁ దృప్తినందక గ్రంథముఖమునఁ బీఠిక వ్రాయుచు నా సవరణములలోని రెండు మూఁడు ప్రసంగముల సంగ్రహించి స్వోపజ్ఞముగ వెలయించుకొని కృతార్థులు కాఁజొచ్చిరి. ఆచార్యుల యపహరణ మహాకార్యమునుగూర్చి 'సత్యసందేశ' మనుశీర్షికతో నా వ్రాసిన వ్యాసము 1-6-1953 త్రిలింగపత్రికలో కీ. శే. సహృదయులు కళాప్రపూర్ణులు శ్రీ వావిళ్ల వేంకటేశ్వరశాస్త్రులుగారి సమ్మతిచేఁ బ్రకటింపఁబడెను. ఇప్పు డీ గ్రంథముద్రణమున ఆ సవరణలన్నియు సంగ్రహింపఁబడెను. మఱియుఁ బ్రస్తుతంబగు సప్తమముద్రణములో ముం దాఱవముద్రణలో లేని కొన్ని సవరణలు కూర్పులుచేర్పులు గలవు. ఇందు మిత్రులు శ్రీ మల్లాది రామకృష్ణశాస్త్రిగారు దయతోనిచ్చిన సూర్యాలోక మను ముద్రాక్షరశాలయందు ముద్రితమైన అప్పకవీయము ప్రతిలోని పాఠములు సంప్రతింపఁబడెను. ఆ ప్రతి రేకము రామానుజసూరిగారిచేఁ బరిష్కరింపఁబడి 1859-వ సం॥లో ముద్రితము. మఱి యిటీవల నా పరిష్కరించిన యాఱవముద్రణప్రతిని జూచిన సహృదయులు శ్రీ హస్నాబాద నాగలింగశివయోగిగారు (మహబూబ్‌నగర్) తమవద్దనున్న యప్పకవీయ తాళపత్రలిఖితప్రతిని నాకు దయతోఁ బంపిరి. అందు 3 ఆశ్వాసములు కించిన్న్యూనముగఁ గలవు. అందు అరసున్న (◡) ఈరీతిగా లిఖింపఁబడియున్నది. శకటరేఫము సయితము వ్రాఁతలోఁ గలదు. అం దున్నంతభాగముఁ బరికించి పాఠభేదము లున్నచోట

నథస్సూచిలో సూచించితి. ఈ యవ్యాజ సాహిత్యసాహాయ్యము సలిపినందులకు శ్రీ నాగలింగశివయోగిగారికిఁ గృతజ్ఞుఁడను.

ఈ గ్రంథము నామూలాగ్రము పరిష్కరించి సముచితమగు సమీక్షను వ్రాసి యీయఁగోరి నాకీ యవకాశము గలిగించినందులకు వావిళ్ల వేంకటేశ్వరశాస్త్రుల ట్రస్టువారికి మామక కృతజ్ఞతాపూర్వక వందనము లర్పించుచున్నాఁడను.

పూర్వముద్రణములోని గిడుగువారి పీఠికయు నిందుఁ బొందు పఱుపఁబడినది. అందు లేని కొన్నివిశేషములనే ప్రధానముగ నా సమీక్షలో నుల్లేఖించితిని. కొన్నిపట్లఁ బ్రకారాంతరమునఁ బునరుక్తు లుండనగును. అప్పకవీయ లక్షణములఁగూర్చి పరామర్శింపవలసిన విషయము లెన్నో కలవు. అటుచేసిన గ్రంథవిస్తరమగును. అప్పకవీయ చ్ఛందోభాగములోని (పద్య యతిప్రాసలక్షణములు) విశేషములఁ బర్యాప్తముగ నెఱుఁగఁగోరువారు నా రచించిన 'తెలుఁగుభాషలోని ఛందోరీతులు' అను బృహద్విమర్శనాత్మక గ్రంథమును దప్పక పఠింపఁదగును. అం దప్పకవీయములోని 3-4 ఆశ్వాసములలోని ప్రతివిషయము కూలంకషముగఁ బరామర్శింపఁబడెను.

అప్పకవీయము నా పరిష్కరణసమీక్షలతో 1962 లోఁ దొలుత వావిళ్లవారు ప్రకటించిరి. మఱల నిప్పుడు మఱికొన్ని సవరణలతో విపులసమీక్షతో వావిళ్ల సంస్థవారి కోరికమేరకు నేడవ ముద్రణమునకు గ్రంథము సిద్ధముచేసి యిచ్చుచున్నాను. క్రమ్మఱ నిట్టిభాగ్యమును గలిగించినందులకు శ్రీవారికి నాదు ధన్యవాదములు.

| | |
|---|---|
| మదరాసు.<br>23-10-66.<br>(విజయదశమి.) | విద్వాన్ రావూరి దొరసామిశర్మ, ఎం. ఏ.,<br>ఆంధ్రోపన్యాసకుఁడు,<br>వైష్ణవకళాశాల. |

---

# విషయసూచిక




| విషయసంఖ్య. | | పుటసంఖ్య. |
|---|---|---|
| | **ప్రథమాశ్వాసము** | |
| 1 | పీఠిక | 1 |
| 2 | బ్రహ్మాది స్తవము | 3 |
| 3 | కవిస్తుతి | 4 |
| 4 | గురుస్తుతి | ,, |
| 5 | స్వప్నప్రకారము | 5 |
| 6 | భగవద్వాక్యము | 6 |
| 7 | గ్రంథప్రభావము | ,, |
| 8 | కర్తృవంశావతారము | 8 |
| 9 | కవివిచారము | 11 |
| 10 | షష్ఠ్యంతములు | 12 |
| 11 | భాషాపరిచ్ఛేదమూలసూత్రంబులు | 13 |
| 12 | పూర్వగ్రంథనామసంగ్రహము | 14 |
| 13 | ప్రబంధమహిమ | ,, |
| 14 | కావ్యభేదంబులు | 16 |
| 15 | శబ్దార్థలక్షణాలంకారసీసమాలిక | 17 |
| 16 | శబ్దార్థదోషసీసమాలిక | 19 |
| 17 | వాక్యలక్షణము | 20 |
| 18 | రసవివేకము | ,, |
| 19 | పంచవిధభావసీసమాలిక | ,, |
| 20 | శృంగారరససీసమాలిక | 21 |
| 21 | అష్టరససీసమాలిక | 22 |
| 22 | నాయకనిర్ణయసీసమాలిక | 24 |
| 23 | సుకవిమాహాత్మ్యము | 25 |
| 24 | సత్కవిలక్షణము | ,, |
| 25 | సప్తవిధకవులు | ,, |
| 26 | కుకవినిరసనము | 26 |
| 27 | కవితాప్రశంస | ,, |
| 28 | దేశభాషావిశేషంబులు | 27 |
| 29 | భాషాష్టకోత్పత్తివివరణము | 28 |
| 30 | ప్రకృతివికృతిభేదంబులు | 30 |
| 31 | తద్భవస్వరూపము | ,, |
| 32 | ప్రాకృతవ్యాకరణసూత్రంబులు | 31 |
| 33 | త్రిలింగశబ్దతద్భవము | 38 |
| 34 | ఆంధ్రభాషాభేదచతుష్టయము | ,, |
| 35 | తజ్జలక్షణము | ,, |
| 36 | తత్సమలక్షణము | ,, |
| 37 | దేశ్యలక్షణములు | 39 |
| 38 | ఆంధ్రదేశ్యభేదంబులు | ,, |
| 39 | పూర్వకవిసమయసిద్ధపదంబులు | 40 |
| 40 | గ్రామ్యపదలక్షణము | 41 |
| 41 | అగ్రామ్యపదలక్షణము | ,, |
| | **ద్వితీయాశ్వాసము** | |
| 42 | వర్ణపరిచ్ఛేదమూలసూత్రంబులు | 44 |
| 43 | వర్ణసంజ్ఞలు | 46 |
| 44 | వర్ణోత్పత్తిస్థానంబులు | 47 |
| 45 | శుద్ధాంధ్రలిపిలేఖనక్రమము | 48 |
| 46 | అనుస్వారనిర్ణయము | ,, |
| 47 | స్వరగుణితము | 51 |
| 48 | పంచాశద్వర్ణనిర్ణయము | 52 |
| 49 | ప్రాకృతోనాక్షరపరిగణనము | 55 |
| 50 | ఆంధ్రభాషావర్ణసంఖ్య | ,, |
| 51 | క్రారకొమ్ములు | 56 |
| 52 | ఋత్వాక్షరంబులు | 57 |
| 53 | వక్రభేదంబులు | ,, |

| విషయసంఖ్య. | | పుటసంఖ్య. |
|---|---|---|
| 54 | వ్యంజనలోపము | 58 |
| 55 | ఒదాదేశహ్రస్వంబులు | 60 |
| 56 | వక్రతమభేదంబులు | 62 |
| 57 | కవర్గాక్షరభేదంబులు | ,, |
| 58 | చవర్గాక్షరభేదంబులు | 63 |
| 59 | టవర్గాక్షరభేదంబులు | 66 |
| 60 | తవర్గాక్షరభేదంబులు | 70 |
| 61 | రేఫభేదంబులు | 75 |
| 62 | రేఫాక్షరసీసమాలిక | ,, |
| 63 | హ్రస్వాక్షరములమీఁది రేఫములకు రూపములు | 79 |
| 64 | దీర్ఘాక్షరములమీఁది రేఫములకు రూపములు | 81 |
| 65 | ఱకారసీసమాలిక | 83 |
| 66 | కుఱుచలమీఁది ఱకారములకు రూపములు | 86 |
| 67 | నిడుదలమీఁది ఱకారములకు రూపములు | 90 |
| 68 | లకారభేదంబులు | 95 |
| 69 | వకారభేదంబులు | ,, |
| 70 | లఘ్వలఘుభేదంబులు | ,, |
| 71 | రేఫలోపము | 98 |
| 72 | క్రారవములకు లకారవకారములకుఁ గలభేదము | ,, |
| 73 | నూపుర్లోనగువాని భేదంబులు | 99 |
| 74 | సకారభేదంబులు | ,, |
| 75 | హకారవివేకము | 100 |
| 76 | కావ్యాదిగ్రాహ్యవర్ణంబులు | ,, |
| 77 | వర్ణాధిదైవతంబులు | ,, |
| 78 | వర్ణలింగంబులు | 101 |
| 79 | వర్ణములకు నల్పప్రాణమహాప్రాణంబులు | ,, |
| 80 | వర్ణములకు దేవమనుష్యతిర్యగ్గౌరవగతులు | 101 |
| 81 | వర్ణములకుఁ బ్రత్యేకఫలములు | ,, |
| 82 | వర్ణంబులకు బీజచక్రము | 102 |
| 83 | బీజాక్షరచక్రోద్ధారణము | ,, |
| 84 | వర్ణనక్షత్రాదులు | 103 |
| 85 | నక్షత్రాధిపతులు | 104 |
| 86 | కాయకాక్షరకూటంబులు | 106 |
| 87 | అక్షరకాంతికూటములు | ,, |
| 88 | అక్షరకులకూటము | 107 |
| 89 | స్నిగ్ధరూక్షాక్షరంబులు | ,, |
| 90 | అక్షరచక్రకూటము | ,, |
| 91 | స్నిగ్ధాదిచక్రకూటము | ,, |
| 92 | అరివర్ణచక్రోద్ధారణము | 108 |
| 93 | అక్షరదేవాదిగణకూటము | ,, |
| 94 | గణనిర్ణయము | 109 |
| 95 | యోనినిర్ణయము | ,, |
| 96 | లింగనిర్ణయము | 110 |
| 97 | అక్షరనక్షత్రద్వారము | ,, |
| 98 | అక్షరరాశికూటము | ,, |
| 99 | రాశినిర్ణయము | ,, |
| 100 | అక్షరగ్రహకూటము | 111 |
| 101 | రాశ్యధిపతులు | ,, |
| 102 | గ్రహమైత్రీనిర్ణయము | ,, |
| 103 | కృత్యాదివర్ణద్వయయోగలక్షణములు | 112 |
| 104 | గ్రహకాంతికూటము | ,, |
| 105 | గ్రహవర్ణంబులు | ,, |
| 106 | బీజాక్షరకూటము | 113 |
| 107 | బీజమైత్రీనిర్ణయము | ,, |
| 108 | అరివర్ణశోధనచక్రకూటము | ,, |
| 109 | ప్రశస్తకూటంబులు | ,, |

| విషయసంఖ్య. | | పుటసంఖ్య. |
|---|---|---|
| 110 | సంయుతాక్షరవిశేషము | 113 |
| 111 | శ్రీకారప్రభావము | 114 |
| 112 | కృతిముఖప్రశస్తంబులు | ,, |
| 113 | తత్తత్స్థానప్రయోగనిషిద్ధాక్షరంబులు | 115 |
| 114 | దోషప్రభావము | 118 |
| 115 | గుణావగుణబాహుళ్యవిశేషంబులు | ,, |
| 116 | మాతృకార్చనావిధానము | 119 |
| 117 | మాతృకానిర్ణయము | 120 |
| 118 | న్యాసప్రకారము | ,, |
| 119 | విప్రమాతృకాపూజామంత్రః | 121 |
| 120 | రాజమాతృకార్చనమంత్రః | ,, |
| 121 | వైశ్యజాతిమాతృకారాధనమంత్రః | 122 |
| 122 | శూద్రమాతృకారాధనమంత్రః | ,, |
| 123 | వాగ్దేవతాధ్యానముక్తం | 123 |
| 124 | ప్రబంధోపక్రమశుభకాలంబులు | ,, |
| 125 | సారస్వతౌషధంబులు | 125 |
| | తృతీయాశ్వాసము | |
| 126 | యతిభేదములు | 128 |
| 127 | స్వరవళులు | 129 |
| 128 | స్వరమైత్రివళులు | ,, |
| 129 | స్వరప్రధానవళులు | ,, |
| 130 | లుప్తవిసర్గస్వరవళులు | ,, |
| 131 | ఋవళి | 130 |
| 132 | ఋత్వసంబంధవళులు | 131 |
| 133 | ఋత్వసామ్యవళులు | 132 |
| 134 | వృద్ధివళులు | ,, |
| 135 | వ్యంజనాక్షరవిరతులు | 133 |
| 136 | ప్రాణివిరామములు | ,, |
| 137 | వర్గయతులు | 134 |
| 138 | బిందుయతులు | ,, |
| 139 | తద్భవవ్యాజవిశ్రమములు | ,, |
| 140 | విశేషవళులు | 135 |
| 141 | అనుస్వారసంబంధయతులు | ,, |
| 142 | అనునాసికాక్షరయతులు | 136 |
| 143 | మువిభక్తియతులు | ,, |
| 144 | ముకారయతులు | 137 |
| 145 | మవర్ణవిరామములు | ,, |
| 146 | ఋజుప్రత్యేకభిన్నయతులు | 138 |
| 147 | పెఱయతి | ,, |
| 148 | ఏకతరయత్యభేదవిరతులు | 139 |
| 149 | అభేదవర్గయతులు | 141 |
| 150 | ఊష్మవిశ్రాంతులు | ,, |
| 151 | సరసపదులు | ,, |
| 152 | సంయుక్తవిశ్రామములు | 142 |
| 153 | యతినియతి | ,, |
| 154 | అంత్యోష్మసంధిపదులు | ,, |
| 155 | వికల్పవిరమణములు | 143 |
| 156 | ఉభయవళులు | 144 |
| 157 | పరరూపవిరతులు | ,, |
| 158 | ప్రాదియతులు : ఉపసర్గలు | 146 |
| 159 | నిత్యసమాసవిశ్రాంతులు | 147 |
| 160 | క్యజ్ ప్రత్యయాంతములు | 153 |
| 161 | దేశ్యనిత్యసమాసవిశ్రాంతులు | 154 |
| 162 | నిత్యయతులు | 157 |
| 163 | రాగమవిభాగనామాఖండవిశ్రమములు | 158 |
| 164 | పంచమీవిభక్తివిరామము | 161 |
| 165 | కాకుస్వరవళులు | ,, |
| 166 | ప్లుతయుగవిశ్రామములు | 163 |
| 167 | ప్రాసయతులు | ,, |

| విషయసంఖ్య. | | పుటసంఖ్య. |
|---|---|---|
| 168 | అగ్రాహ్యావిరామములు | ,, |
| 169 | అగ్రాహ్యావర్గవళులు | 164 |
| 170 | అగ్రాహ్యాసంబంధవళులు | ,, |
| 171 | అగ్రాహ్యావర్ణచతుష్టయవళులు | ,, |
| 172 | అగ్రాహ్యాభేదవర్గయతులు | ,, |
| 173 | ప్రాసస్వభావము | 166 |
| 174 | ప్రాసపూర్వాక్షరనిర్ణయము | 166 |
| 175 | ప్రాసాక్షరస్వరమైత్రి | ,, |
| 176 | ప్రాసభేదంబులు | 167 |
| 177 | సమప్రాసములం దర్ధబిందు ప్రాసము | 168 |
| 178 | పూర్ణబిందుప్రాసము | ,, |
| 179 | ఖండాఖండప్రాసము | ,, |
| 180 | సంయుతాక్షరప్రాసము | 169 |
| 181 | సంయుతాసంయుతప్రాసము | ,, |
| 182 | రేఫయుతప్రాసము | 170 |
| 183 | లఘుద్విత్వప్రాసము | 171 |
| 184 | వికల్పప్రాసము | ,, |
| 185 | ఉభయప్రాసము | ,, |
| 186 | అనునాసికప్రాసము | 173 |
| 187 | ప్రాసమైత్రిప్రాసము | ,, |
| 188 | ప్రాసవైరము | ,, |
| 189 | స్వవర్గజప్రాసము | ,, |
| 190 | ఋప్రాసము | 175 |
| 191 | లఘుయకారప్రాసము | ,, |
| 192 | అభేదప్రాసము | 176 |
| 193 | సంధిగతప్రాసము | 177 |
| 194 | అప్రశస్తప్రాసము | ,, |
| 195 | శబ్దాలంకారప్రాసములు | 178 |
| | చతుర్థాశ్వాసము | |
| 196 | ఛందఃప్రభావము | 182 |
| 197 | ఛందోవ్యాపకసంప్రదాయము | ,, |

| విషయసంఖ్య. | | పుటసంఖ్య. |
|---|---|---|
| 198 | ఇతిహాసాదిస్వరూపము | 183 |
| 199 | ప్రథమప్రత్యయోద్ధారణము | 185 |
| 200 | నైసర్గికగణములు | 186 |
| 201 | ఉపగణోత్పత్తిప్రకారము | ,, |
| 202 | స్వభావగణప్రస్తారము | 187 |
| 203 | సూర్యేంద్రచంద్రగణప్రస్తారము | 188 |
| 204 | గురులఘువర్ణనిర్ణయము | ,, |
| 205 | సర్వగణలక్ష్యంబులు | 189 |
| 206 | గణాధిదేవతాఫలంబులు | ,, |
| 207 | అష్టగణలక్షణంబులు | 192 |
| 208 | దేవతాంకితనియమంబులు | 195 |
| 209 | నరాంకితనియమంబులు | ,, |
| 210 | గణయోగఫలములు | ,, |
| 211 | దోషాదోషబాహుళ్యఫలంబు | 197 |
| 212 | షట్ప్రత్యయములు | 203 |
| 213 | వృత్తసంఖ్యాప్రత్యయము | ,, |
| 214 | తత్తచ్ఛందోవృత్తసంఖ్యాసీసమాలిక | ,, |
| 215 | ఉక్తాదిజవృత్తసంఖ్య | 204 |
| 216 | ప్రస్తారాదిప్రత్యయములు | 205 |
| 217 | నష్టలబ్ధిప్రత్యయము | 206 |
| 218 | వృత్తోద్దిష్టప్రత్యయము | ,, |
| 219 | లఘుక్రియాప్రత్యయము | 207 |
| 220 | లగనిర్ణయశకటచక్రము | 208 |
| 221 | అధ్వభాగప్రత్యయము | 209 |
| 222 | సమవృత్తసంఖ్యాజ్ఞానము | ,, |
| 223 | ప్రతిచ్ఛందోవృత్తములు | 210 |
| 224 | ఉక్తాప్రభృతిచ్ఛందోజాతవృత్తసంఖ్యావివేకము | 211 |
| 225 | సర్వవృత్తసంఖ్య | ,, |
| 226 | వృత్తప్రస్తారవిధము | ,, |

| విషయసంఖ్య. | | పుటసంఖ్య. |
| --- | --- | --- |
| 227 | ద్విగుణప్రస్తారలేఖనక్రమము | 212 |
| 228 | నష్టవృత్తప్రస్తారము | ,, |
| 229 | ఆఱవఛందమునకుఁ బ్రస్తారము | 213 |
| 230 | ఉద్దిష్టవృత్తనిర్ణయము | 214 |
| 231 | సప్తమచ్ఛందఃప్రస్తారము | ,, |
| 232 | మేరుచక్రోద్ధారము | 215 |
| 233 | శకటచక్రోద్ధారము | ,, |
| 234 | పద్యలక్ష్యోపయోగిసంజ్ఞలు | 216 |
| 235 | పద్యవిధములు | 220 |
| 236 | ప్రథమద్వితీయతృతీయచతుర్థచ్ఛందోజాత వృత్తలక్షణములు | ,, |
| 237 | పంచమషష్ఠచ్ఛందోజాతవృత్తలక్షణములు | 221 |
| 238 | సప్తమచ్ఛందోజాతవృత్తలక్షణములు | 222 |
| 239 | అష్టమచ్ఛందోజాతవృత్తలక్షణములు | 223 |
| 240 | నవమచ్ఛందోజాతవృత్తలక్షణములు | 225 |
| 241 | దశమచ్ఛందోజాతవృత్తలక్షణములు | 226 |
| 242 | ఏకాదశచ్ఛందోజాతవృత్తలక్షణములు | 228 |
| 243 | ద్వాదశచ్ఛందోజాతవృత్తలక్షణములు | 231 |
| 244 | త్రయోదశచ్ఛందోజాతవృత్తలక్షణములు | 233 |
| 245 | చతుర్దశచ్ఛందోజాతవృత్తలక్షణములు | 235 |
| 246 | పంచదశచ్ఛందోజాతవృత్తలక్షణములు | 236 |
| 247 | షోడశచ్ఛందోజాతవృత్తలక్షణములు | 238 |
| 248 | సప్తదశచ్ఛందోజాతవృత్తలక్షణములు | 240 |
| 249 | అష్టాదశచ్ఛందోజాతవృత్తలక్షణములు | 242 |
| 250 | ఏకోనవింశతిచ్ఛందోజాతవృత్తలక్షణములు | 243 |
| 251 | వింశతిచ్ఛందోజాతవృత్తలక్షణములు | 244 |
| 252 | ఏకవింశతిచ్ఛందోజాతవృత్తలక్షణములు | 246 |
| 253 | ద్వావింశతిచ్ఛందోజాతవృత్తలక్షణములు | 247 |
| 254 | త్రయోవింశతిచ్ఛందోజాతవృత్తలక్షణములు | 249 |
| 255 | చతుర్వింశతిచ్ఛందోజాతవృత్తలక్షణములు | 250 |
| 256 | పంచవింశతిచ్ఛందోజాతవృత్తలక్షణములు | ,, |
| 257 | షడ్వింశతిచ్ఛందోజాతవృత్తలక్షణములు | 251 |
| 258 | ముఖ్యగౌణవృత్తాది లక్షణము | 252 |
| 259 | స్వస్థానవిషమవృత్తవివేకము | 254 |
| 260 | పరస్థానార్ధసమవృత్తవివేకము | 255 |
| 261 | పరస్థానవిషమవృత్తవివేకము | 257 |
| 262 | సర్వపరస్థానవిషమవృత్తవివేకము | ,, |
| 263 | మాలికావృత్తవివేకము | 260 |

| విషయసంఖ్య. | | పుటసంఖ్య. |
|---|---|---|
| 264 | దండకాదులు | 261 |
| 265 | జాత్యుపజాతినిరూపణము | 262 |
| 266 | కందషట్కాభిధానంబులు | 263 |
| 267 | పంచవిధాక్కరంబులు | 264 |
| 268 | మంజరీప్రభృతులు | 265 |
| 269 | నవవిధరగడలు | 267 |
| 270 | యక్షగానలక్షణము | 268 |
| 271 | ఉదాహరణలక్షణము | ,, |
| 272 | సీసలక్షణము | 275 |
| 273 | గీతులు | 277 |
| 274 | బిరుదులు | 278 |
| 275 | చిత్రకవిత్వము | 279 |
| 276 | బంధకవిత్వము | 282 |
| 277 | గర్భకవిత్వము | 295 |
| 278 | కల్పితకల్పవల్లీప్రహరణకలిత | 296 |
| 279 | కందగర్భమణిగణనికరాదులు | 299 |
| | పంచమాశ్వాసము | |
| 280 | సంధిపరిచ్ఛేదమూలసూత్రము | 304 |

| విషయసంఖ్య. | | పుటసంఖ్య. |
|---|---|---|
| 281 | ద్రుతప్రకృతికసంజ్ఞ | 307 |
| 282 | కళాప్రదేశములు | 308 |
| 283 | సంధివివేకము | 309 |
| 284 | స్వరసంధిలక్షణము | ,, |
| 285 | ద్రుతప్రకృతికస్వరసంధిలక్షణము | 310 |
| 286 | వ్యంజనసంధి | ,, |
| 287 | అకారాదిసంధులు | 311 |
| 288 | భూతార్థక్రియాదిసంధులు | 312 |
| 289 | తద్ధర్మార్థక్రియాదిసంధులు | 314 |
| 290 | ఔపవిభక్తికములు | 320 |
| 291 | అనౌపవిభక్తికములు | 321 |
| 292 | మువిభక్తిలోపాదులు | ,, |
| 293 | కల్పితకల్పవల్లీసమాసలక్షణసీసమాలిక | 329 |
| 294 | కరధృతకరుహేత్యాదిపద్యవ్యాఖ్యానము | 330 |
| 295 | గర్భవృత్తాదులు | 332 |

శ్రీ ర స్తు

# అప్పకవీయము



## పీఠిక

యను స్వామియు నాఁగఁ బ్రాచిని బ్రతీచిన్ రుక్మిణీదేవి స
త్యాయోషామణియు న్స్మహోత్సుకత సేయ న్స్మంగల న్స్మోద్భుఁగే[1]
ల్దోయిం దార్ఢ్యమరుత్సుతు ల్గొలువ శ్రీదుం డేలు నా ప్రోలిమో
మై యాకాశమెపలి న్వసించు హరి నిత్యంబు న్సముం బ్రోవుతన్. 1

తే. కమల యొందును దనరూపు గాంచి యలిగి
యాత్మ తరళాంతరమున నిజాధినాథు
తను వతఁడు చూపఁ గని చిత్తమునఁ జెలఁగు
నట్టి కౌస్తుభమణి హృదయమునఁ దలఁతు. 2

క. వననిధినందను కుర్యోల, యనువునఁ దనరారి వారిజాక్షునివక్షం
బున నొప్పువై జయంతీ, వనమాలిక నా కొసంగు [2]వాగ్వైభవమున్. 3

తే. కౌస్తుభంబును వనమాలికయును దనకు, దిగువగా [3]లచ్చి నొసలిపై దిద్దినట్టి
తిలకమునకు సమంబుగా వెలయునట్టి, చక్రి శ్రీవత్సచిహ్నంబు సంస్మరింతు. 4

మ. ధరఁ గాళిందితటంబునం గలుగు బృందాకాననాంతంబునం
బరితోషాతిశయాళు మోహమున గోపస్త్రీమణుల్ గుంపులై
హరిఁ జేరం జనుదెంతు రెందుఁ [4]జనుదెం చానాద మాలించి స
త్వరయానంబులతోడ నట్టి మురళిన్ వర్ణింతు నిష్టాప్తికిన్. 5

సీ. పాంచజన్యం బనఁబరఁగి దైత్యారాతి[5]యెడమను బై కేల నెసఁగు నెద్ది
యొగి సుదర్శననామమునను [6]మాధవుదక్షిణాగ్రహస్తంబున నమరు నెద్ది

---

1. కే. 2. వాంఛితఫలమున్ (వా). వాగ్వైభవంబున్ (గి) 3. నొప్ప (పూ. ము.) 4. జనునంచా(సూ). 5. యడమనుబుయికేల నమరునెద్ది(వా). 6. కృష్ణుని (వా).

N. B. (వా) వావిళ్లవారిప్రతి. (ప) పరవస్తువారిప్రతి. (పె) పెండ్యాలవారి ప్రతి. (గి) గిడుగు రామమూర్తిగారు పరిష్కరించిన వావిళ్లముద్రణ ప్రతి.(పూ. ము.) వావిళ్లవారి 5-వ కూర్పు అని గ్రహించునది. (రా) రావూరివారి సవరణ. (సూ.) సూర్యాలోక ముద్రిత ప్రతి. (సూర్య) పీఠిక అని లేదు. ఇక్కడనుండియే ప్రథమాశ్వాసము ప్రారంభమగును. 1-17 పద్యములకు 'ఆయుధపరిజనసహిత విష్ణుస్తుతి' యని శీర్షిక.

కౌమోదకీసంజ్ఞఁ గని కృష్ణుదాపలిరెండవకరమున నుండు నెద్ది
నందకం బనుపేర నారాయణునికుడికేలఁ గ్రిందటిచే వెలుఁగొందు నెద్ది

తే. శార్ఙ్గ మనఁ దనరారి కేశవునివామ, బాహుయుగమూలమునఁ గనుపట్టు నెద్ది
యట్టి హరిమైదుకైదువు లబ్జచక్ర, ఘనగదాఖడ్గచాపముల్ మనుచు మమ్ము. 6

తే. కాలమేఘమునందుఁ బ్రకాశ మొందు, [1]కారుమెఱుఁగు తెఱంగునఁ గైటభారి
యంసములపై వెలుంగుపీతాంబరంబు, బంగరుచెఱంగు మాకు శుభంబు లొసఁగు. 7

క. బాలతమాలాగ్రమునం, గ్రాలు శచీనాథుకార్ముకంబో యనఁగా
నీలఘనదేహుఁ డగు గో, పాలుతలన్ మెఱయు బర్హిబర్హము నెంతున్. 8

క. భువనగకచ్ఛప[2]కిరిమా, నవసింహాదిత్యభృగుజనరాఘవయా
దవబుద్ధకల్కు లనుకే, శవు పదిరూపములు మది సహస్రముఁ దలఁతున్. 9

శా. శ్రీమన్నందకటాక్షవీక్షణము పైఁ జిల్కం బయోజేక్షణుం
డామోదంబున నర్మగర్భసరసేష్టాలాపముల్ పల్కఁగా
వేమాఱుం దరహాసమాననమునం [3]బెంపొందఁగాఁ గొల్చు శ్రీ
భూమల్ నిచ్చలు మా కొసంగుదురు సంపూర్ణంబుగా [4]నిచ్చలన్. 10

క. దాంతు హరిచరణ[5]భక్తి, స్వాంతు రసాతలనిశాంతు నత్యంతదయా
వంతు సమతీతవిధిక, ల్పాంతుఁ బరమశాంతు నయ్యనంతుఁ దలంతున్. 11

తే. నామదిఁ దలంచెద సువర్ణనామధేయు, మురహరవిధేయు నమరసమూహగేయుఁ
గనకనిభకాయుభక్షితకాద్రవేయు, వక్త్రకాంతిజితాత్రేయు వైనతేయు. 12

క. తిన్ననివేత్రము కలుముల, కన్నియ [6]వన్నియను హస్తకమలతలమునం
జెన్నొందు జగము మనిపెడు, వెన్నునిదళవాయిఁ దలఁతు విష్వక్సేనున్. 13

ఉ. పాయక కొల్తు రామజనపాలుఁడు జానకిఁ జూడ నంపుచోఁ
దోయధి గోష్పదంబు క్రియఁ దోఁపఁ జివాలున దాఁటి లంక క
త్యాయతలీలఁ బోయి దివిజారుల దోమలఁబోలెఁ బట్టి బా
హాయతశక్తిఁ గొట్టి సతి నారసి తద్విభుఁ గన్న మారుతిన్. 14

క. శుక భీష్మ విభీషణ శౌ, నక రుక్మాంగద వసిష్ఠ నారద [7]బక దా
ల్భ్య కిరీటి పుండరీకులఁ, బ్రకటిత హరిపాదపద్మభక్తులఁ దలఁతున్. 15

వ. అని యివ్విధంబున. 16

క. సాతతహేతి పరిజన, వ్రాతంబుగ శేషశయను వనరుహనయనున్
ఖ్యాతిగ "న హరేస్తు పర, స్త్రాత" యనుట దెలిసి కృతిమొదలఁ దలఁచి వెసన్.

---

1. కాఱు మెఱుంగు (పూ. ము; సూ.) అప్పకవియె రేఫాక్షర సీసమాలికలో దీనిని 'కారు' అని లఘురేఫముగా నిచ్చియున్నాఁడు. 2. కిటి (సూ). 3. విపొంద. 4. నిష్టముల్ (గి). (సూ). 5. వర్తి. 6. వన్నెయును. 7. బలి (సూ).

## బ్రహ్మాది స్తవము

చ. తనజనికారణం బయిన తామరసున్ హితుఁ డ్రోటచే విక
ర్తనునకు వేయిఘృష్టు లిడి దానికి శత్రుఁడు గాన నెంచి
హస్తునకుఁ బదేనుఁజేసి యవియున్ శిఖిభానుముఖామరాళిచే
దిన మొక టప్పగైకొనను దిద్దనుఁ జేయు విధాతఁ గొల్చెదన్. 18

క. శారద విద్యాజాలవి, శారద ననుఁ బ్రోచుఁగాతు సారె భజింతున్
శారదనీరదనారద, పారద[1]హారదరహీరపాండుశరీరన్. 19

చ. కడు కఠినంబు లద్రులు జగంబుల నందున సంభవించి పెం
పడరు నినుం గరంప వశమా యని న న్నిపు డంటివే కదా
వడిఁ గనకాద్రి చాపముగ వంచిన నీకు హిమాద్రిజాతయా
పడఁతిఁ గరంచు టెంత యను పార్వతి మెచ్చు శివుం దలంచెదన్. 20

చ. పరిణయవేళయందుఁ దనపాదముఁ [2]బట్టుక సన్నెకంటిపైఁ
దిరముగ మోపి కంతునకుఁ దీరెఁ గదా పగ యంచు నీలకం
ధరుఁడు దరస్మితుం డగుటఁ దద్వలయాహిఫణాగ్రరత్నసుం
దరముకురంబునం గని యెద న్ముద మందు భవానిఁ గొల్చెదన్. 21

చ. తనుఁ గని యెక్కయెత్తుననె దక్షజయు న్నిటలాక్షుఁడు న్ముదం
బున నిరుచెక్కులుం గదిసి ముద్దుగొనంగ నొకింత నెమ్మొగం
బనువుగ వెన్కకుం దిగిచి యత్నవిహీనపరస్పరాస్యచుం
బనములు తల్లిదండ్రులకుఁ బన్నగఁ గూర్చు[3]గజాస్యు నెన్నెదన్. 22

చ. జనకునిఁ గొల్వ వచ్చు నలచామరకర్ణుని తేజి నందివా
హనమకుటాహిఁ గాంచి భయమంది పిఱిందికిఁ బోవఁజూచినం
దన శిఖిమావు దీకొలిపి దానిభయంబు హరించి పూర్వజా
తునకు ముదం బొనర్చు గుహు దుర్ధరశక్తివహు న్భజించెదన్. 23

క. హరిశిఖియమదైత్యాంబుప, మరుద్ధనపశివు లిభాజమహిషనరాంభ
శ్చరహరిణపుష్పకవృష, ప్రరుచిరవాహనులు మమ్ము రక్షింతు రొగిన్. 24

క. రవిశశికుజబుధసురగురు, కవిభానుజరాహుకేతుగణములు నాకుం
దవిలి ఘటంబున [4]నుండుచు, [5]సవ నిత్తురు గాత సకల సంపద లెపుడున్. 25

---

1. హారతార; హారదరద; దరహార. 2. బట్టియు. 3. గణేశు(వా). 4. నుండెడు (వా). 5. సవన్=క్రీడచే, 'సవో యజ్ఞే సవా క్రీడా' అభియుక్తవచనము. (గి) 'చవి నిత్తురు' అను పాఠమున్న సరసముగ నుండునని తోఁచెడి. చవిన్=ప్రీతితో. (రా).

## కవిస్తుతి

సీ. వల్మీకభవుపాదవనరుహంబులు గొల్చి సాత్యవతేయుఁ బూజనము సల్పి
భట్టబాణునివచఃప్రాభవంబు గణించి కాళిదాసుని కిరుగేలు మోడ్చి
పండితాగ్రేసరు దండి వక్కాణించి భవభూతివాక్యజృంభణము మెచ్చి
జయదేవునకు నమస్కారంబు గావించి మల్హణు హృదయపద్మమున నుంచి
తే. చోరుఁ గడుఁ బ్రస్తుతించి మయూరు నెంచి, మాఘు భూషించి భారవి మదిఁదలంచి
హీరునకు మ్రొక్కి కవితావిహారమతుల, నితరవిద్వత్ప్రకాండుల నతులుచేసి. 26

సీ. శబ్దశాసనుపాదజలజంబులు భజించి యుభయసత్కవిమిత్త్రు [1]నభినుతించి
శంభుదాసునకు నంజలి వేడ్క నొనరించి సహజపాండిత్యుని సంస్మరించి
సకలవిద్యాసనాథకవీంద్రుఁ గొనియాడి సౌజన్యజేయువాక్సరణిఁ బొగడి
తగ నంధ్రకవితాపితామహు వర్ణించి సుజనవిధేయు హెచ్చుగ నుతించి
తే. రామరాజవిభూషణరత్నఖచిత, చారుమస్తకలాపాదివిహారివాక్య
గౌరవము పెక్కుభంగుల గణన చేసి, పిదప నితరాంధ్రకవులకుఁ బ్రియమువలికి.

తే. కాళిదాసమయూరాదికవుల కైనఁ, గలవు తప్పు లనంగ నన్యులకు లేవె
దిద్దఁ దగుపట్ల దిద్దుఁడు దిద్ద రాని, యెడల నానేరములు క్షమియించు టొప్పు. 28

వ. అని వర్తమానకవులం బ్రార్థించి. 29

క. వినఁదగు వెండియుఁ బొత్తముఁ, గనఁ దగు బుధజనుల నడుగఁగాఁ దగుఁగా కెం
దును దెలియని పట్టునఁ దప్పున వల దని [2]భావిజనుల కంజలి మోడ్తున్. 30

## గురుస్తుతి

సీ. ఆదిని రెండవవేదంబు చెప్పిన మూర్తిసర్వన్నఁ గ్రమస్వరాదిఁ
దరువాత శబ్దశాస్త్రముఁ జదివించిన కాండూరి గిరిదేశికప్రకాండు
నామీఁద సకలసిద్ధాంతము ల్దెలిపిన ధీరవర్యుఁ బ్రధాని సూరభట్టు
వెస నన్ను లక్షణవేత్తఁ గావించిన ఘను మంచికంటిసోబనకవీంద్రు
తే. స్మార్తకర్మంబు లెఱిఁగించి సభలఁ బూజ్యుఁ, జేయు నల[3]కొలిచలిమల్లసింగనార్యు
నాగమము లుపదేశించినట్టి రాజ, యోగివర్యునిఁ దలఁతు విద్యాగురులను. 31

క. అని యిష్టదేవతాస్తుతియును సకల కవీంద్రులనుతియును గురునుతియుఁ
వినయమున సలిపి తెలుఁగున, ఘనకావ్యం బొకటి సేయఁగాఁ దలఁచుతఱిన్. 32

---

1. నుచ్చరించి (వా). నుపచరించి (ఓ). 2. భావికవుల (రా). 3. కొలిచల
మల (ఓ). కొలచలమల (సూ).

## స్వప్నప్రకారము

సీ. ధాతకెండవపరార్ధమున నాదిదినంబునగటి వరాహకల్పంబునందు
మహితవైవస్వతమనువేళ దేశంబు లర్థింప నైన మహాయుగమునఁ
గలిసమయంబునఁ దొలిచరణంబున మానితం బగు చాంద్రమానమునను
శాలివాహననామశకమున గజశైలశరసుధాకిరణులసంఖ్య (1578) నడచు[1]
తే. నంగజాబ్దంబునను దక్షిణాయనమున, జలధరర్తువు [2]మొదలిమాసంబునందు
బహుళమున దేవకీకిఁ జక్రపాణి పుట్టి, నట్టి యష్టమి సనుదేర నధికభక్తి. 33

సీ. చక్రవాళాంతరక్ష్మామధ్యసంస్థితదైవతగోత్రంబు దక్షిణమున
లవణాబ్ధివేష్టితలక్షయోజనసువిస్తారజంబూద్వీపతలమునందు
భరతవర్షంబున భరతఖండంబున మంగళోర్వని గర్మమహితభూమి
మలయవింధ్యాచల[3]మధ్యమంబునఁ గృష్ణయామ్యతీరమున బ్రహ్మాశ్రమమున
తే. దండకాటవి [4]సంధ్రాభిధానపుణ్య, దేశమున శ్రీగిరీశాన్యదిశను గొండ
వీటిపడమటఁ [5]దంగెడవిషయమునను, గామెపల్లిని గోపాలధామమునను. 34

క. కల్పోక్తమార్గమున సంకల్పము గావించి గోపికావిభుపూజల్
సల్పి మది నతనిపదములు, నిల్పి పురాణార్థగోష్ఠి నిశ గడపునెడన్. 35

సీ. మిగులఁ జేతులరెంట మేటిశంఖంబును జుట్టుఁగైదువయును బట్టువాఁడు
ముద్దులగుమ్మలౌ ముద్దియ లిద్దఱు కైదండ లిడ సీటు గలుగువాఁడు
బంగారుచెఱఁగుల పచ్చనిహొంబట్టుదుప్పటి [6]యొల్లెవా టొప్పువాఁడు
హారకేయూరమంజీరకోటీరాది[7]భూషణంబులు చాలఁ[8]బూనువాఁడు
తే. నుదుటఁ గస్తూరితిలకంబు వొదలువాఁడు
తలఁచి చూచిన నాకులదైవ మగుచుఁ
[9]బొలుచు నాకులదైవంబుఁ బోలువాఁడు
నిలిచె నొకరుఁడు నాదుముంగలను [10]గలను. 36

వ. ఇట్లు నిలిచిన. 37

క. కరములురెంటను దాల్చిన, పరికరములు చూచి యతనిఁ బరమేశునిఁగాఁ
బరికించి లేచి వలగొని, మురియుచు సాష్టాంగదండము లొనర్చి వెసన్. 38

---

1. క్రీ. శ. 1656. 2. మొదటి (సూ). 3. మధ్యంబునను (సూ).
4. సాంధ్రా (గి) ప్రాంతప్రతులలో నన్నిచోటుల 'ఆంధ్ర' శబ్దమే కనఁబడుచున్నది.
5. తంగేడ (సూ). 6. వల్లెవాటొప్ప (సూ). 7. భూషణంబులఁ [illegible] (ప).
8. బొఁల వా(ధు (వా). 9. బోల్చుఁ (వా). 10. వెసను.

## భగవద్వాక్యము

ఆ. [1]మోదుపుఁగేలు ఫాలమునఁ జేర్చుకొనియున్నఁ, గరుణ నతఁడు నన్నుఁ గాంచి పలికె
నన్నెఱింగి వందనం బొనర్చితి వాత్మ, మెచ్చు పుట్టె నీదు మేలుకువకును. 39

ఉ. ఈ యువతుల్ రమాధరణు లేను బయోరుహపత్రనేత్రుఁడన్
నీయెడఁ గూర్మి గల్గి ధరణీదివిజోత్తమ వచ్చినాఁడ [2]శ్వ
శ్శ్రేయస మబ్బు నీకు నిఁక సిద్ధము నన్నయభక్తి [3]యంధ్రముం
జేయుము మాయనుగ్రహముచేఁ గవు లచ్చెరు వంది మెచ్చఁగన్. 40

క. వినియును గనియును నెఱుఁగని, ఘనభక్తిం దెనుఁగుఁ జేయఁగా నెట్లగు నా
కనవలదు దానిలక్షణ,మును నీ కది గలుగుచందమును విను మింకన్. 41

## గ్రంథప్రభావము

తే. ఆంధ్రశబ్దచింతామణివ్యాకరణము,ముందు రచియించి తత్సూత్రములఁ దెనుంగు
బాసచేఁ జెప్పె నన్నయభట్టు దొల్లి, పర్వములు మూఁడు శ్రీమహాభారతమున. 42

వ. ఆ సమయంబున. 43

తే. భారతముఁ [4]దెనుఁగించుచుఁ దా రచించినట్టి రాఘవపాండవీయము నడంచె
ఛందము నడంచ నీ ఫక్కి సంగ్రహించె, ననుచు భీమన [5]ముచ్చిలి యడఁచె దాని.

వ. తదనంతరంబ. 45

ఉ. ఆదిని శబ్దశాసనమహాకవి చెప్పిన భారతంబులో
నేది వచింపఁగాఁ బడియె నెందును దానిని గాని సూత్రసం
పాదన లేమిచేఁ దెనుఁగుపల్కు మఱొక్కటిఁ గూర్చి చెప్పఁగా
రా దని [6]దక్షవాటి కవిరాత్సుఁ డీ నియమంబుఁ జేసినన్. 46

క. ఆ మూఁడుపర్వములలో, నా మాన్యుఁడు నుడువు తెలుఁగు లరసికొని కృతుల్
దాము రచించిరి తిక్కనసు, ధీమణి మొదలైన తొంటి[7]తెనుఁగుకవీంద్రుల్. 47

తే. రాజరాజనరేంద్రతనూజుఁ డార్య, సఖుఁడు సారంగధరుఁడు శైశవమునందు
నన్నయ రచించుచోటఁ బఠనం బొనర్చె, నన్ను లెవ్వ రెఱుంగ రీ యంధ్రఫక్కి.

క. అతఁడు దన[8]కాళ్లుఁ జేతులు, మతి చెడి జనకుండు [9]దఱుగ మత్స్యేంద్రునిసం
గతి నవి గ్రమ్మఱ మొలచిన, క్షితి సిద్ధులఁ గలసి యొక్కసిద్ధుం డయ్యెన్. 49

---

1. మోదుపుకేలు (గి). 2. సూ. శ్వసోవసీయ శ్శ్రేయసః. 5-4-80 పాణిని అష్టాధ్యాయి. శ్వశ్శ్రేయసం శివం భద్రం కల్యాణం మంగళం శుభమ్. అని అమరము. 3. యాంధ్రము (గి). 4. దెనుఁగింపుచు (గి. అధస్సూచి) తెనిఁగింపుచు - ఇప్పటి రూపము (రా). 5. యెంతయు నడఁచె (సూ). 6. ద్రాక్షవాటి (సూ). 7. తెనుఁగు (సూ). 8. కాళ్లు చేతులు మతిచెడి (సూ). 9. దఱుగ (పూ. ము.)

క. ఆ లోకనుతుఁడు మున్నటి, [1]కీలకసమమున మతంగగిరికడ నొసఁగెన్
బాలసరస్వతులకు నతఁ, డోలిఁ దెనుఁగు టీక దాని కొప్పుగఁ జేసెన్. 50

క. ఆదిని భీమకవీంద్రుఁడు, గోదావరిలోనఁ గలిపెఁ గుత్సితమున నా
మీఁదట రాజనరేంద్ర; క్ష్మాదయితునిపట్టి దాని మహి వెలయించెన్. 51

క. ఇల నెనుబదిరెం డార్యలు, గలిగి పరిచ్ఛేదపంచకంబునఁ దగు నీ
విలసితఫక్కి మతంగా,చలవిప్రునివలన నీదుసదనముఁ జేరున్. 52

క. మును నారాయణధీరుఁడు, తనకు సహాయుఁడుగ సంస్కృతము వాగనుశా
సనుఁడు రచియించె దానిం, దెనుఁగింపఁగ నీకుఁ దోడు నే నిపు డగుదున్. 53

క. సురభాషయందు నల్పా,క్షరముల బహుసూచితార్థసారము లిముడిం
తురు సూత్రంబుల నవి వి,స్తరముగఁ దెనుఁగింపకున్నఁ దరమే తెలియన్. 54

తే. నారికేళపాకంబుగా నన్నయకవి, ప్రక్రియాకౌముదిని [2]ముట్టఁ బలికెఁ గానఁ
గేవలాంధ్రులు గాన రాత్రోవ నీవు, గోస్తనీపాక మై యుండఁ గూర్పవలయు.

ఆ. శబ్దశాసనుండు సంస్కృతగ్రంథంబు, గానఁ దెలుఁగుమాట గలయ రామి
లక్షణంబె కాని లక్ష్య మొక్కటియును, బలుకకునికిఁ దెలియఁబడవు కొన్ని. 56

తే. ఒక్కసూత్రంబువలన సముద్భవించు, శబ్దములు లెక్కవెట్టంగ శక్య మగున
నలువ కైనను [3]బల్కులచెలువ కైన, నైన [4]నెఱిఁగింపు మొకకొన్ని యైన నీవు. 57

చ. రమణను సత్కవీంద్రులు పురాణచయం బితిహాసపంక్తికా
వ్యములును దొల్లి యైన నిపు డైనను ముంగల నైన దీని సూ
త్రములను దక్క వేఱొకవిధంబున నాంధ్రముఁ జేయఁజాలమిన్
క్షమఁ దెనుఁగింప దీన నవి సర్వముఁ జేయు ఫలంబు నీ కగున్. 58

క. [5]తాతనయు [6]నూత్నదండియు, నీతెనుఁగులక్షణం బొకించుక [7]తెలియన్
జేతఃప్రౌఢిమఁ జెప్పిరి; క్ష్మాతలమున దీని తెఱఁగుగా నవి యెల్లన్. 59

తే. ఆంధ్రభాషామహాకాననాంతరమున, సంతతంబును శబ్దాపశబ్దసరణు
లెఱుఁగ నేరక మది సంశయించు తెలుఁగు, కవులు సుపథంబు లిందును గాంతు రిలను.

తే. కవుల కుపకార మగుటచేఁ గలుగు సుకృత, లాభ [8]మందున నగు సద్యశోభివృద్ధి
దాన సమహాయ వాక్పదంబు దీనిఁ, దెనుఁగుఁ గావించుకంటె శోభనము గలదె. 61

ఆ. ధరణి నీకు నిష్టదైవ మెప్పుడుఁ గామె, పల్లె నున్నచక్రపాణి యగుట
నంకితంబు దీని నతనికిఁ జేయుము, విప్రవర్య మాకు వేఱు గలదె. 62

1. కీలకసమనామతంగ (సూ). 2. ముట్టు. 3. బలుకులచెలికి నైన. 4. నెఱుఁగింపు (గి). 5. తాతన-తాతంభట్టు. 6. నూత్నదండి-కేతన. అభినవదండి బిరుదాంకితుఁడు (రా). 7. యైనన్ (సూ). 8. మందును (సూ).

చ. అని యతఁ డానతిచ్చి [1]చన నంతట మేల్కని నాల్గుదిక్కులుం
గనుఁగొని యద్భుతంబుఁ గుతుకంబును డెందమునం బెనంగ వేఁ
గినఁ గల [2]కేదిబద్ధ మని కేరుచు నుండెడు వేళ నా మతం
గనగనివాసి పుస్తకనికాయధరుం డొకరుండు వచ్చినన్. 63

క. ఆ విప్రు నతిథిఁగా సం, భావించి భుజింపఁ బెట్టి భాషించునెడన్
దా 'విశ్వశ్రేయం' బను, నీవచనము సదువ నెచటి దిది యన నతఁడున్. 64

క. 'నన్నయభట్టీయములో, నెన్నఁగఁ బ్రథమార్య గాదె యీపొత్తములో
నున్నయవి యొనుబదియు రెం,' డన్న మహాద్భుతముఁ బొంది యపు డెల్లరకున్. 65

వ. మదీయస్వప్నవిధం బంతయుఁ దేటపడ నెఱింగించిన నాకర్ణించి సకలజనంబులు నానందంబుఁ బొంది రందుఁ గొందఱు మాతృసంబంధు లగు మదీయబంధువులు గూడఁ గులసింధుసౌగంధికబంధులును గృతప్రబంధులును నీతియుగంధరులును గావున నా కిట్లనిరి. 66

క. 'హరిఁ గాంచుటచే మోక్షము, సిరిచే నర్థంబు ధాత్రిచే భూమియు శం
ఖరథాంగమ్ముల విజయము, విరచించు మటన్న కృతిని విద్యయుఁ గలుగున్. 67

ఆ. శ్రేయ మబ్బు ననుచుఁ జెప్పె విష్ణుఁ డనఁగ, మంచి కల యటంచు నెంచ నేల
అతఁడు సెప్ప మన్న దితనిచే నిప్పుడు, గలిగె నిదియె సాక్షి గాదె మనకు. 68

వ. అదియునుంగాక. 69

## కర్తృవంశావతారము

సీ. శ్రీవిష్ణునాభిరాజీవసంభూతుఁ డే, వసుమతీసురునకు వంశకర్త
రామాయణామరభూమిరుహాబ్ధి యే, వితతాగమాంతసంవేద్యగురుఁడు
కశ్యపాత్రివసిష్ఠగౌతమభృగువు లే, సూనృతభాషణుఁ జోడువారు
పృథులశస్త్రకళాధురీణుండు ద్రోణుఁ డే, గురుతపోరాశికిఁ గూర్మిపట్టి
తే. యతఁడు తనరారు సర్వలోకైకయోగ్య, తారకాపథవర్తి విస్తారకీర్తి
దురితకర్మపరిత్యాగి పరమయోగి, [3]వరగుణాస్థాని శ్రీభరద్వాజమౌని. 70

తే. అమ్మహామునిగోత్రాబ్ధి నవతరించి, తమ్ములును దాను నన్యోన్యతను దనర్చి
[4]తమ్ములను బోరునని సోముఁ ద్రస్తరించు, సార సోమాహ్వయుఁడు కాకునూరిఘనుఁడు.

తే. అతఁడు మధురను బుధసమూహములఁ దొడరి, వేదశాస్త్రపురాణాదివాదములను
గాకునూరింటఁ జేసినకారణమునఁ, గాకునూరింటివాఁ డన ఘనతఁ గాంచె. 72

1. చను (ప). 2. కేదబద్ధమని (వా). 3. వరగుణస్థాని (మూ). 4. తమ్ములనె పేరునను సోము (మూ).

సీ. బాలుఁడై కాశికాపట్టణంబున కేఁగి బ్రహ్మేంద్రునొద్ద శాస్త్రములు చదివె
[1]బ్రహ్మరాక్షసిచేతఁ గ్రమము చెప్పంబడి కట్టిన గండభాగంబు నొందె
చరికొండసీమలో సంతరించెను గాకునూ రన సర్వాగ్రహార మొకటి
నిడుదవెల్లిని బొద్దినేపల్లి [2]నవదళపురిని మాన్యక్షేత్రములు గడించె
తే. నవని సర్వజ్ఞుఁ డగుట గంగాంబికాభి, [3]రాముఁ డగుటను నిక్కంబు సోముఁ డనఁగ
మనియె నిలఁ గాకునూరి[4]తిమ్మనసుతుండు, సోముఁ డభినవచూతసద్గ్రామమునను. 73

చ. [5]అతఁడు భవత్పితామహున కయ్యెఁ బితామహుఁ డా ఘనుండు భా
రతిని దపంబునం గని వరం బడిగెం దనయింట విద్య ప్ర
స్తుత [6]యగుచుండ[7]నందులకుఁ [8]జొమ్ము జగంబునఁ గాకునూరిసం
తతి యగు[9]వారు శోభనదినంబుల మున్నుగ వాణిఁ గొల్చుటల్. 74

తే. గంగయందుఁ గుమారుని గాంచె నొకని, సోముఁ డని చెప్పటెల్లను జోద్యమగునె
కాంచెఁ బెక్కుకుమారుల గంగయందు, సోముఁ డల కాకునూరివంశోత్తముండు.

వ. [10]వా రెవ్వ రనిన. 76

సీ. అమరేశ్వరుండు భోగాతిశయంబున నమరేశ్వరుం డన నతిశయిల్లుఁ
గొండలయ్య [11]నదల్పగురుధైర్యమహిమచేఁ గొండలయ్య యనంగఁ గొమరు మీఱు
రంగప్పఁ డాశ్రితరక్షణప్రౌఢిమ రంగప్పఁ డన ధాత్రి రంగు గాంచు
లక్ష్మణుం డగ్రజాలాపానువర్తి యై లక్ష్మణుం డన భూతలమున వెలయు
తే. నందులోఁ గాకునూరిరంగాహ్వయుండు, కనియె [12]నలువురుతనయులఁ గన్నమాంబ
యందుఁ దిరుమలభట్టు గంగార్యవర్య, నెలమిఁ బెదసోముఁ [13]జినసోము నిందులోన.

సీ. ఒకనివాకిలిఁ గాచి యుండఁ డెన్నటి కైన నుగ్రుఁడు గాఁడు దా నొక్కనాఁడు
కంట మంటలు రాలఁ గనుఁగొనఁ డెవ్వరి సేరఁ డెన్నటికిని నీరు మోవఁ
గుత్తుకందు విషంబు గూరిచి వర్తింపఁ డసితంబు పరులను నడిగికొనఁడు
సంతతంబును బౌరుషము తృప్తి గాంచఁడు క్రతువులు దాఁ జేయుఁ గాని చెఱుపఁ
తే. డిన్ని సద్గుణములు గల్గెనేని పూని, జోడు సేయంగ వచ్చు నాసోముఁ గాకు
నూరికులవారిజాతచకోరమదవి, ధామునకు రంగఘను పెదసోమునకును. 78

---

1. బ్రహ్మరాక్షసుతోడఁ గ్రమము చెప్పుచు బండిగట్టిన గండభాగంబు ప్రొదె (వా). 2. నిడదళ. 3. రాముఁడనఁగను (సూ). 4. తమ్మన(సూ). 5. అతఁడ (సూ). 6. మగు (సూ). 7. నందునకు (వా). 8. సుమ్ము (శ్రీ;పూ.ము.) జొమ్ము(రా). 9. వారి (సూ). 10. వా రెవ్వరంటేని (పూ.ము.) 11. దల్పప (పూ.ము.). 12. తనయుల గన్నమాంబ. (సూ). ఇందు 'గన్న' యని సర్వత్రా మున్నది. 13. చిన (సూ).

సీ. కొట్టించె నెవ్వఁడు గురువాపి వప్రదక్షిణభాగమున రొంపిచెర్లలోనఁ
గట్టించె నెవ్వఁడు ఘనశిలాసాలంబు రంగుగా శంకరలింగమునకుఁ
బెట్టించె నెవ్వఁడు పృథుతరారామంబు గుడిపాటికడ వినుకొండత్రోవఁ
బుట్టించె నెవ్వఁ డప్పురియామ్యదిశ గుంటఁ ద్రవ్వించి పశువులు ద్రావ జలము
తే. క్షితిఁ దలంపఁగ సర్వజ్ఞశేఖరుండు, సత్పథవిహారి ద్విజరాజచారులక్ష
ణాన్వితుం డెవ్వఁ డతఁడు సోమాభిధుండు, కాకునూరికులాఖ్యసాగరభవుండు. 79

ఉ. పట్టెము[1]పోతనార్యసుతవర్యుఁ డనం దగు పెద్ది[2]భట్టుతోఁ
బుట్టిన కృష్ణఁ గైకొని సుపుత్రుల వెంగనఁ గన్నభట్టు బ
ల్దిట్టను గంగయ న్సుతలఁ దిమ్మమ రంగమ లింగఁ గోనమ
రట్టడిఁ గాకునూరి పెదరంగయసోముఁడు గాంచె వేడుకన్. 80

క. వినుతమతిఁ గాకునూరిజ,ననమణి యగు సోమునగ్రనందనుఁ డగు వెం
గన బుధుఁ డన నెగడె జగం,బున సోమునినందనుండు బుధుఁ డగు టరుదే. 81

తే. పల్లెనాటను నూటతొంబదియు నాల్గు
గ్రామముల నీడు గానక కాకునూరి
వెంగనార్యుఁడు వేదవేదాంగములను
బ్రస్తుతికి నెక్కె మాఱటబ్రహ్మ యనఁగ. 82

ఆ. కాకునూరి వెంగఘనుఁడు నేసమయందుఁ, గాంచె మొదల నప్పకవిని నిన్న
వెనుక సోమనార్యు వేంకటపతిఁ గృష్ణు, భట్టు లక్ష్మణాఖ్యబాలుఁ గాంచె. 83

క. శ్రీగిరిని నిలిచి నీవును, భోగివిభూషణునిపట్టుపుకవీంద్రుఁడవై
వాగీశవినుతకామెప, లీగరుడాసనకృపాకలితవాక్ప్రౌఢిన్. 84

సీ. జగతి నాపస్తంబశాఖోక్తమట్కర్మపద్ధతిఖండనిబంధనంబు
కాలబాలార్కవాఖ్య[3]జ్యోతిషగ్రంథసంహితాసుశ్లోకసంగ్రహంబు
శ్రీమదనంతప్రసిద్ధమహావ్రతకల్పకథాంధ్రోక్తికావ్యరచన
శ్రీనగాధీశసుశ్లేషనిందాస్తుతిభావగర్భితసీసపద్యశతము
తే. లలితకవికల్పకాఖ్యానలక్షణంబు, మహితసాధ్వీజనాఘధర్మద్విపదము
నంబికావాదనామకయక్షగాన, కృతియుఁ జేసితి కాకునూరికులయప్ప. 85

క. ఇట్టి మహాగోత్రంబునఁ, బుట్టిననీ కిట్టిశుభముఁ బొందుట యరుదే
గట్టిగ నాదేవుఁడు సమ,కట్టినయది తెనుఁగుఁ జేయఁగాఁ [4]దగు' ననినన్. 86

1. పోచ. (ఓ). 2. రాజు. (ఓ). 3. జ్యోతిష (కూ). 4. గదియు మనక్.

క. పరమోత్సుకతను నన్నయ, విరచించిన ఫక్కి వ్రాసి విప్రుని గాశీ
పురి కనిచి వృద్ధబాంధవ, గురువిబుధులచే ననుజ్ఞ గొని చిత్తమునన్. 87

కవివిచారము

క. లోకంబునఁ గల విబుధానీకములో నెవరిఁ బోల నేరుతు నైనన్
నా కిచ్చె నంధ్రశబ్ద, వ్యాకరణముఁ దెనుఁగుఁ జేయు మని హరి కరుణన్. 88
తే. మహిని వాగనుశాసనమయుఁ డొనర్చు, నిమ్మహాగ్రంథ మను నావ యెక్కి యాంధ్ర
శబ్దజలరాశి తరియించుజనుల కేను, గర్ణధారుఁడ హరియనుగ్రహము [1]దీవి. 89
ఉ. ఎన్నఁగ నన్నయాఖ్యకవి యీ కలికాదిని జెప్ప దాని భీ
మన్న హరించెఁ గ్రమ్మఱ మహాత్ముఁడు రాజనరేంద్రుపట్టి దా
మెన్న నొసంగె విప్రునకు మూల మతం డొనరించెఁ [2]డీక నా
కన్నది మున్ను విన్నదియుఁ గాదు మహాద్భుత మబ్బె నా కిటన్. 90
క. మూలము చెప్పిన నన్నయ, భూలోకబ్రహ్మ యతనిబుద్ధి దెలిసి వ్యా
ఖ్యాలక్ష్యంబు లొనర్చిన, బాలసరస్వతులఁ బోలు ప్రాజ్ఞులు గలరే. 91
క. ఎక్కడి మతంగపర్వత, మెక్కడి కామెపలి సుకవు లీలో లేరే
గ్రక్కున నిది దెనుఁగింపక, దక్కటి నను ధన్యుఁ జేయు తలఁపున నేమో. 92
క. ఆతిక్కనముఖ్యకవి, వ్రాతముచే నీ తెలుంగువ్యాకరణము ధా
త్రీతలమునఁ గడు నంతర్భూతంబై తెనుఁగు గాకపోవుట లెల్లన్. 93
వ. మత్పురాతనజననఘనతరతపోవిశేషంబువలననగు గదా యని చింతించి నితాంతసంతు
ష్టాంతరంగుండనై. 94
తే. తన యనుగ్రహమునఁ జెప్పు మనుచు నిన్నఁ, గలను వచ్చినహరి తానె కలఁడు గాకఁ
దెలియని పదంబు లెల్లను దెలుప నింక, శంక సేయంగ వలదని సమ్మతించి. 95
వ. ముందు బృందారకభావ నశేషవిద్యాజలధాసముండగు శబ్దానుశాసనుండు సంక్షే
పంబుగాఁ గూర్చిన యాంధ్రవ్యాకరణంబునందలి సంజ్ఞా, సంధి, తత్సమ, దేశ్య,
క్రియాపరిచ్ఛేదంబు లయిదునుం దెనుఁగుఁబలుకుల నేను విస్తరించి భాషాపరిచ్ఛే
దంబును, వర్ణపరిచ్ఛేదంబును, వళిప్రాసపరిచ్ఛేదంబును, [3]పద్యపరిచ్ఛేదంబును, సంధి
పరిచ్ఛేదంబును, [4]తత్సమపరిచ్ఛేదంబును, దేశ్యపరిచ్ఛేదంబును, [5]క్రియాపరిచ్ఛేదం

---

1. పేర్మి (సూ). 2. నింకఁ దాఁ గన్నది. 3. బద్య. (రా). 4. దత్సమ. 5. గ్రియా (ఇవి ద్రుతముమీఁది పరుషము లగుట సరళములగును. కాని పూ. ము. లోఁ బరుషాదిగా నున్నవి (రా).

బును నను నామంబుల నభిరామంబు లగు నాశ్వాసంబు లెనిమిదిగా నెలకూచి
బాలసరస్వతి సకలభాషాకవి మహోపాధ్యాయ ప్రణీతాంధ్రవ్యాఖ్యానగ్రంథం
బాధారంబుగా రచియింపం బూని. 96

క. దశమీసురగురువాసర, శశితారావజ్రయోగషష్ఠకరణయు
క్తశరాసనలగ్నంబున, శిశిరకరాంశమున మొదలు సేసితిఁ గృతికిన్. 97

వ. ఇట్లు కృతప్రారంభుండనై మదీయేష్టదేవతం గాంచి నమస్కరించి వినుతించి
యతనింగుఱించి షష్ఠ్యంతములు విన్నవించెద. 98

## షష్ఠ్యంతములు

క. సాయపవేంకటపతిభూ, నాయకదత్తాగ్రహారనగరప్రాగ్దే
శాయతదేవాలయమునఁ, బాయక వసియించు గోపభామాపతికిన్. 99

క. శ్రుతిశాస్త్రాగమశితగీ, స్మృతి వట్టెము పెద్దనార్యసంపాదితపు
ణ్యతరాగ్రహారపూర్వ, క్షితిజశమీయామ్యమున వసించిన హరికిన్. 100

క. తంగెడసీమను నిర్జర, గంగాసమ నాగనిమ్నగాపూర్వమునం
బింగళిపురదక్షిణమున, రంగుగ నెలకొన్న గోపరత్నంబునకున్. 101

క. కేతవరనామపట్టణ, దైతేయాశాసమన్వితనికేతునకున్
వాతాత్మజతార్క్ష్యసమన్వితునకు సమస్తలోకవిఖ్యాతునకున్. 102

క. అలఘుకరశీలునకు మం, గళగుణజాలునకు దనుజకాలున కిందో
పలనీలునకును గామే, పలిగోపాలునకు ఘోషపతిబాలునకున్. 103

తే. అంకితము గాఁగ నేఁ జేయునట్టియాంధ్ర, శబ్దచింతామణిగ్రంథసారపాద
పంబునకు నాలవాలంబుపగిది నొప్పు, నట్టిభాషాపరిచ్ఛేద మెట్టి దనిన. 104

# భాషాపరిచ్ఛేదము

## ప్రథమాశ్వాసము



భోజతనూజాస
త్యాభామాసహిత తార్క్ష్యవాహనుమద్యుత భ
ద్రేభాధిపపోషణ తుల
సీభూషణ కామెపల్లి శ్రీగోపాలా. 1

క. అవధారు శబ్దశాసనుఁ, డవనిఁ గలియుగమున కాది నా రాజమహేం
ద్రవరంబునఁ జెప్పిన యం,ధ్రవచోవ్యాకరణసూత్రతతిఁ దెనిఁగింతున్. 2

క. భాషానిరూపణం బా,ర్యాషట్కమునందుఁ దొలుత నంధ్రకవిశిరో
భూషణమగు నన్నయ సవి,శేషంబుగఁ జెప్పె సంకుచితవాక్యములన్. 3

### భాషాపరిచ్ఛేదమూలసూత్రంబులు

### ఆర్యావృత్తశ్లోకంబులు

విశ్వశ్రేయః కావ్యం త దదోషౌ పరిష్కృతౌ చ[1]వాగర్థౌ
సా వాగ్యా రసవృత్తి స్సాఙ్గో హి రసో యథాతథం కవిభిః. 1

స్వస్థానవేషభాషాభిమతా స్సన్తో రసప్రలుబ్ధధియః
లోకే బహుమన్యన్తే వైకృతకావ్యాని చాన్య దపహాయ. 2

ఆద్యప్రకృతిః ప్రకృతి శ్చాద్యే ఏషా తయో ర్భవేద్వికృతిః
కేవలతయానుసర్ప త్యుభే చ యేయం యథాతథా భాషా. 3

తజ్జా సమా చ దేశ్యా గ్రామ్యా చేయం చతుర్విధా భవతి
ప్రకృతిద్వయజా తజ్జా తుల్యా తు సమా ప్రవాహినీ దేశ్యా. 4

సిద్ధి ర్లోకా ద్దృశ్యా లోకోఽనన్యాదృశ శ్చ నిత్యశ్చ
సంస్కారార్థో నియమోఽనియమా ద్గ్రామ్యం హి య త్త్వపభ్రంశః. 5

---

1. శబ్దార్థౌ.

విరళాః పేచోషాదికశబ్దాః ప్రవ్యాహారంతు శబ్దజ్ఞాః
ఇహ తు ప్రవ్యాహార్యం సజ్జేతితసుప్రసిద్ధమేవ పదమ్. 6

ఇతి శ్రీసకలభాషావాగనుశాసన నన్నయభట్టవిరచితాంధ్రశబ్ద
చిన్తామణౌ భాషాపరిచ్ఛేదః ప్రథమః.

వ. ఈ శ్లోకంబు లాఱునుం బద్దెండు సూత్రంబు లయ్యె నవి యెల్ల నిందు వివరించెద.

## పూర్వగ్రంథనామసంగ్రహము

తే. సంస్కృతమునకు నాంధ్రభాషకును దొల్లి, లక్షణములు శాకల్లమల్లనసుధీంద్ర
విన్నకోటపెద్దనసుకవిప్రముఖులు, క్షితి నొనర్చిరి లోకోప[1]కృతికిఁ బెక్కు. 4

వ. అవి యెయ్యవి యనినం బ్రతాపరుద్రీయంబును, కువలయానందంబును, [2]చంద్రాలోకంబును, రసమంజరియును, సాహిత్యచంద్రోదయంబును, సాహిత్యరత్నాకరంబును, వృత్తరత్నాకరంబును, జమత్కారచంద్రికయు, షడ్భాషాచంద్రికయును, షడ్భాషావివరణంబును, త్రివిక్రమవృత్తియు, హేమచంద్రఫక్కికయును, కవిభల్లటఫక్కికయును, నఘోక్షజఫక్కికయును, శబ్దానుశాసనీయంబును, కవిరాక్షసీయంబును, కవికంఠపాశంబును, కవిమూషికమార్జాలంబును, కవి గజాంకుశంబును, కవిసర్పగారుడంబును, కవిజనాశ్రయంబును, కవిలోకసంజీవనియును, కవికంఠాభరణంబును, కావ్యాలంకారచూడామణియును, కావ్యచింతామణియు, నథర్వణచ్ఛందంబును, గోకర్ణచ్ఛందంబును, శ్రీధరచ్ఛందంబును, ననంతామాత్యచ్ఛందంబును, *ఛందోదర్పణంబును, నలంకారసంగ్రహంబును, నలంకారరత్నావళియు, నాంధ్రభాషాభూషణంబును, రేఫఱకారనిర్ణయంబును, లక్షణ విలాసంబును, సులక్షణసారంబును, సర్వలక్షణసారసంగ్రహంబును, లక్షణదీపికయును, శారదాదీపికయును, శారదాముకుటంబును, శారదాతిలకంబును, [3]వాగీంద్రచూడామణియును, నరసభూపాలీయంబును మొదలుగా నీక్షింప లక్షణగ్రంథంబులు లక్షోపలక్షలు గల వందు. 5

క. ఒకదానికంటె మఱి వే, ఱొకటి విశేషంబుఁ జెప్పుచుండుకతమునన్
సకలగ్రంథములును జదు,వక తెలియఁగ లక్షణప్రపంచం బెల్లన్. 6

## ప్రబంధమహిమ

క. ఇది చదివినవిస్మృట మఱి, యెదియేనియుఁ జదువుబుద్ధి యేలా వొడముల్
బదపడి గ్రంథము లన్నియు, వెదకి వెదకి సార మెల్ల వివరింపంగన్. 7

---

1. కృతికి (సూ). 2. ఇది (సూ)లో లేదు. *అనంతునిఛందమునకే ఛందోదర్పణ మని పేరు. ఈఛందోదర్పణము అనంతునికృతి కాదు; తాతంభట్టప్రణీత మని శ్రీ నిడుదవోలు వేంకటరావుగారు అనంతునిఛందము పీఠికలోఁ దెల్పియున్నారు. 3. వాదీంద్ర, వాదాంగ - అని యితర లక్షణగ్రంథములు (రా).

తే. పర్వతము లెల్ల నొక్కదర్పణమునందుఁ, జూపడు తెలుఁగునను గవితోపయోగ
లక్షణములన్నియును సరళంబుగాఁగ, నెఱుఁగఁబడు నిందుఁ దెలియ నూహించిరేని.

తే. సారభాషకు శబ్దశాస్త్రంబుపగిదిఁ [1]దెనుఁగు (న) కావశ్యకం బిది దీనిఁ జదివి
చెప్పినప్రబంధము జగత్ప్రసిద్ధినొందు, నుఱక రచియించినది యప్రయోజకమగు. 9

క. రత్నములకు నిల సత్కృతి, రత్నములకు మఱి తురంగరత్నములకు స్త్రీ
రత్నములకు లక్షణములె, యత్నంబునఁ జూడవలయు నంద్రు మనీషుల్. 10

క. ఈక్షితిని రాజరాజును, భిక్షునిగాఁ దిట్టఁ గూటిపేదను యక్షా
ధ్యక్షునిగా దీవింపను, లాక్షణికుఁడె యెన్నిభంగుల సమర్థుఁ డగున్. 11

తే. ఉత్తముఁడు లక్ష్యలక్షణవృత్తవేది పరఁగు మధ్యముఁ డన లక్ష్యపద్యవేది
సారిది నధముఁడు లక్షణశ్లోకవేది, లక్షణజ్ఞుల కివియ పో లక్షణములు. 12

క. తొలుతను లక్షణసూత్రంబు లెఱింగి పిఱుంద లక్ష్యములు దెలియంగా
వలయును గావున లక్షణములు లక్ష్యంబులును బొరముగఁ జేయుఁ దగున్. 13

శబ్దానుశాసనమూలసూత్రము:—

విశ్వశ్రేయః కావ్యమ్. 1.

క. ధర్మములలోన నుత్తమ, ధర్మము కావ్యము నిజంబు ధర నెవ్వని కా
ధర్మము చేకుఱు నతఁడు సుధర్మను వసియించుఁ [illegible]తరయుగముల్. 14

క. తనయుఁడు చెఱువును గావ్యంబు నిధానము [illegible]ంబు భూదేవస్థా
పనమును నను నియ్యేడును, జను శాస్త్రములం [illegible]సంతతు లనఁగన్. 15

తే. దుష్కృతము లెన్ని చేసినఁ దుదిని సప్త
సంతతులలోన నొక్కటి సలుపునతఁడు
కుతుకమునఁ దననూటొక్కకులమువారి
నరకములఁ బాపి ముక్తికి నడపు నిజము. 16

క. ఇల సప్తసంతతులలోఁ, బలఁ గావ్యము దక్క దేవభవనవనాదుల్
ఖిలము లగుఁ గొన్నివర్షంబుల కని చంపువు రచించె భోజుం డెఱుకన్. 17

తే. నిలిపి రెక్కడ నచటనె నిలిచియుండు, సగ్రహారాదిసంతతు లరసి చూడ
నవియుఁ గృతిముఖరచనచే నఖిలదిశల, నెగడుఁ గావునఁ గావ్య మన్నిటికిఁ దొడవు.

క. పురిపఱుపనీరు గోదాపరిఁ[2] గలసిన యోగ్య మైనపడువునఁ గడు దు
శ్చరితుం డైనను గావ్యాంతరమునఁ జెప్పఁబడి పావనచరిత్రుఁ డగున్. 19

1. ఇందు నగాగమము లేమి లక్షణవిరుద్ధము - 'తెనుఁగున కవశ్యమియ్యది దీనిఁ జదివి.' అని సవరింపనగు (రా). 2. పరిని గలసి. (సూ).

క. క్షితి నెవ్వనినామము సత్కృతి నెన్నిదినంబు లుండు దివి నా పుణ్య
వ్రతుఁ డంతకాల ముండును, ధృతి నింద్రద్యుమ్నునికి దృష్టాంతముగాన్. 20
క. తనకు హితార్థము లెఱిఁగించు నఘంబు లడంచు ధనము శోభనము యశం
బును గూర్చు నఖిల[1]సురలక్ష్, గనఁబడఁగాఁ జేయు నెపుడుఁ గావ్యము కవికిన్.
తే. మేటిబ్రహ్మర్షి యయ్యె వల్మీకభవుఁడు, గాంచె రవిని మయూరుండు గడియలోన
[2]హారిణరోగము వాసె శ్రీ[3]హర్షునకుఁ, గావ్యమునఁ జెందరానిసద్గతులు గలవె.
చ. అలరఁ బురాణకావ్యముల [4]నార్యులు చెప్పినవారు దక్కఁగాఁ
దెలియఁ జతుర్యుగంబులను దీవుల నేడిట నెంద ఱెందఱో
యిల జననంబు నొంది [5]మని యేఁగిరి పుణ్యచరిత్రు లందులో
పల నిపు డొక్కఁడేనియును బ్రస్తుతి కెక్కు టెఱుంగ మెక్కడన్. 23
తే. రామకథలోనఁ గపులు వారాశిఁ గట్టి, రనుచు వాల్మీకి చెప్పంగ నఖిలజనులు
సేతు వనుచు నెఱింగిరి చెప్ప కున్న, నదియు నొకసోగ దీవి యటండ్రు గాదె.
క. [6]వివరించె యజుర్వేదము, కవి యగువిప్రుండు శుచి జగంబుల నేత
త్ప్రవిమలకావ్యము మిక్కిలి, పవిత్ర మగుఁ గపిలగోవుపాల తెఱఁగునన్. 25
తే. ఉపమ గలిగిన శయ్యల నొప్పియున్న, నంఘ్రిభవునికావ్యంబు గ్రాహ్యంబు గాదు
పాయసం బైన సంస్కారపక్వ మైనఁ, గాక[7]జుష్టంబు హవ్యంబు గానియట్లు. 26

## కావ్యభేదంబులు

సీ. ఉచ్చారణక్రియ నొప్పారు వర్ణంబు వర్ణసంచయమున వఱలుఁ బదము
పదవితానముచేత భాసిల్లు వాక్యంబు వాక్యభేదమున నివ్వటిలు నర్థ
మర్థవశంబున నమరును భావంబు భావసంగతిఁ గనుపట్టు రసము
[8]రసప్రశస్తిచేఁ బొసఁగును బద్యంబు పద్యరాశిని గూర్పఁబడును గావ్య
తే. మట్టికావ్యంబు ద్వివిధ మై యతిశయిల్లుఁ, బరువడిఁ బ్రబంధచాటుప్రబంధము లన
సర్గములసంస్కృతమున నాశ్వాసములను, దెనుఁగునఁ బ్రబంధ మనునది తనరుఁగృష్ణ.
సీ. పురమును ఋతుషట్కమును బ్రయాణంబును శైలంబు వేఁటయుం సాగరంబు
మౌనీంద్రపుణ్యాశ్రమంబును మంత్రంబు ద్యూతంబు పిదప నద్భుతరణంబు
విజయంబు మద్యపానజవికారంబును వనవిహారంబును వారికేళి
కన్యాంగసౌందర్యకథనంబు హిమకరాభ్యుదయంబు విప్రలంభోదితంబు
తే. పద్మమిత్రోదయంబును బరిణయంబు, సురతమును దౌహృదంబును సుతజననము
ననఁగ నిరువదిరెండు వర్ణనలు గూర్చి, చెప్పవలయుఁ బ్రబంధంబు శ్రీనివాస. 28

౧. సురలక్ష్ (గి.) 2. హారిణ = శ్వేత. హారిణరోగము = శ్వేతరోగము.
3. హర్షుండు (సూ). 4. నాద్యులు (సూ). 5. మఱి (సూ). 6. వివరింప(సూ).
7. మృష్టంబు (ఓ). 8. రసనం (సూ).

క. కనుఁగొన సంఖ్యాబద్ధం,బు నసంఖ్యాకంబు నాఁగ భువి నిరుదెఱఁగై
తనరారుఁ బూర్వకవిమత,మున నా చాటుప్రబంధములు జలజాక్షా. 29

తే. నాల్గుదెగల యుదాహరణములు ముక్త, కాదిపంచదశమును సంఖ్యాన్వితములు
గద్యరగడద్విపదదండకములు మంజ,రులును సంఖ్యారహితచాటువులు నృసింహ. 30

ముక్తకాది [1]పంచదశం బెద్ది యనిన

సీ. ఒనరు ముక్తక మన నొక్కపద్యము ద్వికం బగు రెండు త్రికము మూఁడైనఁ బంచ
రత్నంబు లైదు వారణమాల యెనిమిది నవరత్నములు పద్యనవక మైన
భాస్కరమాలిక పండ్రెండు శశికళ పదియాఱు నక్షత్రపంక్తి యిరువ
దియు నేడు త్రింశదాహ్వయము ముప్పది రాగసంఖ్య వెండియును రెండు సాగనేని
తే. వరుసఁ [2]బంచాశదాఖ్య మవ్వల శతకము, నష్టసమధికశతకంబు ననఁగ వెలయు
నేఁబదియు నూఱు నూటిపై నెనిమిదియును, సప్తశతి సప్తశతమైన శార్ఙ్గపాణి. 31

శబ్దానుశాసనమూలసూత్రము:—

తదదోషౌ పరిష్కృతౌ చ వాగర్థౌ. 2.

తే. కృతికి [3]నెప్డు శబ్దార్థముల్ రెండు వలయు, నవి యలంకారయుతములు నఖిలదోష
రహితములు గాఁగఁ జూచి కూర్పంగ వలయుఁ, గామెపలిబాలగోపాల గానలోల.

శబ్దార్థలక్షణాలంకారసీసమాలిక

సీ. సర్వలక్షణ[4]సారశబ్దార్థయుగళంబు మహితశుద్ధసువర్ణమణులభంగిఁ
బదపద్యభూషణప్రచయరూపంబులై లలిఁ గావ్యలక్ష్మి నలంకరించు
కారణంబున నలంకారాఖ్యలను జెంది బహుభేదములను జూపట్టుఁ గృతుల
నఖిలకావ్యములకు నాత్మలు రీతులు ప్రాణముల్ వానికిఁ బ్రాణదశక
మోలి వైదర్భికాగౌళికాపాంచాలికాలాటికాఖ్యానకలిత లైన
[5]నాల్గునురీతు లెన్నంగ నర్థవ్యక్తి సౌకుమార్యౌజః ప్రసాద[6]కాంతి
*మధురతౌదార్యసమాధిసామ్యశ్లేషములు పదియును బ్రాణములు దలంప
శయ్యాచమత్కారశబ్దస్ఫురణపదావృత్తిరీతి ప్రాణవితతు లెల్ల
శబ్దలక్షణము లై జగతిపైఁ బొగడొందు నుభయవిస్ఫురణంబు నొప్పునట్లు

1. పంచాశత్తెట్టి దనిన (గి). పంచాదశం (సూ). 2. పంచాదశాఖ్య (సూ). 3. నెందు (వా. పె.); మొదల (ప). 4. యుక్తసర్వార్థ (పె). యుక్తశబ్దార్థ (ఓ). 5. నాలుగురీతు (సూ). 6. ఫణితి.

*ఈశబ్దము కావ్యగుణవాచకమైనయప్పుడు "మాధుర్య" అని యుండదగు. అట్లున్నచో ఛందోభంగము. "ధర్మధర్మిణోరభేదః" అను న్యాయము రసవాచకమైన యప్పుడే చెల్లును. ఇచ్చట చెల్లదు. (గి). మధురసౌకర్య (సూ).

వదలక మును గొన్నవర్ణంబు కృతులను బలుమాఱు నుడివినఁ బ్రాస మయ్యె
నది సుఖకర దుష్కరావసాన ద్వి త్రి చతు రను సంజ్ఞల సప్తవిధము
లయ్యె ననుప్రాస మందులోపల ఛేకవృత్తిలాటము లన ముత్తెఱంగు
లేకార్థశబ్దంబు లేకపద్యంబులోఁ బునరుక్తిదోషంబు పొందకుండ
నుడుగక పేమాఱు [1]నుడువఁగ లాటాఖ్యఁ జను ననుప్రాస మై జరగుచుండు
లాటంబులో శృంఖల న్యాయబంధంబు ప్రతిషేధశృంఖలబంధనంబు
మాలికాదీపసమాఖ్యయుఁ సారంబు నేకావళియుఁ నన నెసఁగు నైదు
పలుమాఱు నొకభంగిపలుకులు పలుకుచో నర్థంబు వేఱైన యమక మదియు
నాదిగతంబు మధ్యగతంబు నంతగతాఖ్యంబు నాదిమధ్యమగతంబు
నాద్యంతగతము మధ్యాంతగతంబును జరణత్రయగతంబు సర్వగతము
నుపమానపదగోపనోక్తియుఁ నన నవవిధములై యమకముల్ విస్తరిల్లు
సరిగమపధను లోష్ఠ్యనిరోష్ఠ్యములు తలకట్లును గుడులు శృంగములు నేక
[2]వర్ణంబులు నభీష్టవచనసంఘట్టనంబులు నాదిగా నిట్లు వొదలు టెల్లఁ
జిత్రకవిత్వప్రసిద్ధనామంబులై పెంపొంది వీనుల కింపొనర్చు
సరవి గూఢచతుర్థచరణవర్ణముఁ జతుర్విధకందమును బంచవిధసువృత్త
పద్యంబు సీసరూపద్విపదాఖ్యయుఁ గందగర్భితమణిగణనికరము
మొదలుగా నొకపద్యమునఁ బెక్కుపద్యంబు లిమిడి ఛందోఽర్థదోషములు లేక
కనుపట్టునవి యెల్ల గర్భకవిత్వవిఖ్యాతిచే శ్రవణసుఖం బొనర్చు
గోమూత్రికాఛత్రగుచ్ఛకుండలినాగకంకణమర్దలఖడ్గచక్ర
పంకజసర్వతోభద్రమాలా[3]క్షురప్రభృతిబంధంబు లేర్పడఁగఁ జెప్పు
వృత్తము ల్బంధకవిత్వవిశ్రుతములై కవులకుఁ జెవులపండువులు సేయుఁ
బ్రాసాదిగాఁ జెప్పఁబడిన వన్నియు శబ్దవితతి కలంకారవితతు లయ్యె
ధర నలంకారప్రధానతానురసప్రధానతావస్తుప్రధానతలును
భాసిల్లు నారభటీసాత్వతీ భారతీకైశికీనామధేయవృత్తు
లర్థస్ఫురణసమాఖ్యయు లాంగలీఫలపాకమృద్వీఫలపాకములును
గడు ముఖ్యగౌణలక్ష్యధ్వనివ్యంగ్యముల్ గణుతింప నర్థలక్షణము లయ్యెఁ
జర్చింపఁ గృతులకు జాతిగుణంబులు ద్రవ్యక్రియలు జీవితంబు లగుట
నవి యేతెఱంగున నమరు నట్లన చెప్ప వఱలు జాతియుఁ స్వభావంబు ననఁగ
నది మొదల్కొని మూఁడుపదులపై నెనిమిది యెసఁగుతద్భేదంబు లెఱుఁగవలయు

1. నుడుగంగ. 2. వర్ణంబు లభీకష్ట (సూ). 3. క్షురి (సూ).

జాతియు నుపమయు సద్రూపకంబును భ్రాంతిమంతంబు నపహ్నుతియును
దీపకత్రయము నాక్షేపంబు [1]శ్లేషంబు నుత్ప్రేక్షయును దుల్యయోగితయును
వ్యతిరేకమును నుదారతయుఁ బ్రేయస్కంబు నెసఁగ విరోధ మావృత్తివిధము
భావికాఖ్యానంబుఁ బరివృత్తియును సమాహితము నప్రస్తుత స్తుతిపరంబు
వ్యాజస్తుతియును బర్యాయోక్తియును విశేషోక్తి వక్రోక్తి సహోక్తిసంజ్ఞ
లూర్జస్వియును సమాసోక్తిసమాఖ్యయు జగతి విభావనాసంకరములు
రసవంతమును నిదర్శనమును సూక్ష్మంబు లవనామకంబు హేతువుఁ గ్రమంబు
నాశీర్వచనము నర్థాంతరన్యాసంబు నతిశయోక్తియు నుదాత్తాభిధంబు
నన నొప్పు నిన్నియు నర్థంబులకు నలంకారభేదంబులై కానఁబడును
దొలుకటి రూపకాదులు తమలోఁ దాము కలసి సంసృష్టిసంకరము లనఁగ
ద్వివిధంబు లగు నందుఁ దిలతండులన్యాయసంసృష్టిఁ గృతులఁ బ్రశస్త మయ్యె
సంకరంబులు రెండు జరగు దుగ్ధోదకన్యాయనృకేసరిన్యాయములను

తే. క్షితిని శబ్దార్థసంసృష్టిఁ జెందునట్టి, సంకరంబులు మఱియును జాలఁ గలవు
వరుస నవి యెల్లఁ దెలియంగవలయుఁ బూర్వ,శాస్త్రలక్షణలక్ష్యోక్తసరణివలన.

శబ్దార్థదోషసీసమాలిక

సీ. కనుఁగొన దుష్ప్రయోగము వైరివర్గంబు ధరఁ దత్సమాపశబ్దక్రమంబు
నపసంస్కృతాఖ్యంబు నప్రయుక్తంబు విసంధి దుస్సంధి కుసంధిపదము
లవల నకారశూన్యంబు హీనోక్తియుఁ గొఱలుదీర్ఘ పుకారుఁ గుఱుచ ఱుకు
సమసనభంగంబు ఛందోయతిప్రాసభంగంబులు ననంగఁ బఱియు నాఱు
శబ్దగతప్రదోషంబులై యొప్పారుఁ గృతులు సాగవు వీని నెఱుఁగకున్న
న్యూనపదోపమయును నధికపదోపమయు నప్రసిద్ధోపమావిధంబు
నసదృశోపమయు మహాధికోపమయును నీచోపమయు వ్యర్థవాచకంబు
దేశసమయలోకదిక్కాలమైత్రీవిరోధాగమకళావిరోధములును
వ్యాకీర్ణకము నసమర్థ మపార్థంబు విరసంబు నతిమాత్రవిశ్రుతంబు
నశుభలజ్జాజుగుప్సాశ్లీలములు సంశయంబు సందిగ్ధనేయార్థములును
ప్రక్రమభంగం బపక్రమంబును గ్రమభంగంబు శ్రుతికటుపరుషములును
క్లిష్టగూఢార్థం బపుష్టార్థకము నసంగతదోషము [2]పతత్ప్రకర్షణ మధి
కపదంబు మఱి సమాప్తపునరాత్తంబును హీనపదంబు నిర్హేతుకంబు
నవిమృష్టకవిధేయకాంశ మన్యార్థంబు నప్రతీతికము ననర్థకంబు
భిన్నసంబంధంబు భిన్నలింగము భిన్నవచన మలంకారవర్జితంబు

---

1. శ్లిష్టంబు (సూ). 2. పతత్ప్రకర్షణంబు, నధికపదంబు,సమాప్తపునరాత్తంబు (౫) ఇందు గణభంగము; కాన సవరింపఁబడినది (రా).

క్షితి న[1]ప్రయోజనశ్లిష్టంబు నేకార్థకంబును బునరుక్తకంబు ననఁగఁ
దొడరు నేఁబది యర్థదోషంబు లివి ముందు దెలియక కృతి [2]సేయ నలవి గాదు
పదపడి మును పల్కుప్రాసాదులను గూర్చి చెవులకు [3]నింపుగాఁ జెప్పి రేని
ధీరులు సద్గుణాధికతచే నవియ చేపట్టుదు రొక్కొక్కపట్టునందు
శ్రుతిసంస్కృతియు మధురతయు నస్పష్టార్థమునకు నర్థవ్యక్తియును బతత్ప్ర
కర్షంబునకు ధాత్రి హర్షవాక్యము సూక్తితంత్ర [4]మశ్లీలాభిధానమునకు
గ్రామ్యంబునకు నెల్లఁ గాంతియు ననుచితార్థంబుల కెల్ల నుదాత్తతయును
సంధిదోషముల కూర్జస్వియు శ్రుతిపరుషంబుల కెల్లను సౌకుమార్య
మప్రతీతికమున కా ప్రసాదంబుఁ బ్రేయస్కంబుఁ బరుషసమాఖ్యమునకుఁ
గ్రమభంగమునకు సంక్రమతయు న్యూనాధికపదంబులకు సామ్యకల్పనంబు
వెండియు నిబ్భంగి వెదకి గుణాధిక్యములు గూర్చి దోషముల్ దొలఁగఁ జేసి

తే. రచన గావించు కృతి బుధరచనలందుఁ, దనరు నాచంద్రభాస్కరతార మగుచుఁ
గావున నలంక్రియాశాస్త్రకథితఫణితి, నరయఁ దగు వీని నెల్ల భూసురపురీశ. 34

## వాక్యలక్షణము

మూ, సూ:—సా వాగ్యా రసవృత్తిః. 3.

క. రసమునకు [5]నాశ్రయంబై, యసదృశ మగు నెద్ది యది గదా శబ్దము రా
క్షసదమన రసికు లనఁగా, వసుమతిఁ దద్విధ మెఱుంగువారలు సుమ్మీ. 35

## రసవివేకము

మూ. సూ:—సాధ్యో హి రసో యథాతథం కవిభిః. 4.

తే. తగ రసాశ్రయవాక్యసంతతులు గూర్చి, కావ్యము లొనర్చువార లొ కవు లనంగ
నట్లు గావున నేభాష నైనఁ గవిత, పలుకువారికి సాధింపవలయు రసము. 36

## పంచవిధభావసీసమాలిక.

సీ. రమణ మనోవికారము బహిర్వ్యక్త మై భాసిల్లు నది సుమీ భావ మనఁగ
నదియ విజ్ఞానసమాఖ్యచేఁ జెన్నొంది యాత్మకు మనసుచే నబ్బుచుండు
నామనంబున కింద్రియములచే నగు వాని కై దింటికిని విషయములవలనఁ
[6]గలుగు నాదిజ్ఞానకలితమా భావంబు తరుణులయందును బురుషులందు
నాత్మసముద్భూత మై నవరసముల [7]నమరఁ జేయుచు విభావానుభావ
సాత్త్విక[8]వ్యభిచారిసంజ్ఞలచే నాల్గుచందంబు లగు నందుఁ జను విభావ

1. ప్రయోజక (సూ). 2. ఁజెప్ప (పె). 3. విందు (పె). 4. మశ్లిష్టా (సూ).
5. నాస్పదంబై (పె). 6. గలుగు నాజ్ఞాన(సూ). 7. నదర (వా. పె.) 8. వ్యభిచార (సూ).

మాలంబనోద్దీపనాహ్వయంబుల రెండు తెఱఁగుల ధాత్రి నుద్దీపనాఖ్య
మాలంబనోక్తగుణాలంబనవిచేష్టితాలంక్రియాత్మవిహారలీల
లనఁ జతుర్విధములఁ దనరారు ననుభావ మంగచేష్టోద్భూత మగుచు వెలయు
ధర మనోవృత్తి సత్త్వం బనఁబడు నందు సంభవించినయది సాత్త్వికంబు
గణుతింప నా సాత్త్వికము కంప ఘర్మసంస్తంభ వైవర్ణ్య[1]వైస్వర్యబాష్ప
విలయరోమాంచసంజ్ఞల నష్టవిధముల జరగు నవ్వల వ్యభిచారికంబు
స్థాయిభావమున నిత్యత్వంబు నొందక వ్యభిచరించుచు సాగరాంతరమునఁ
బొదలు భంగముభంగిఁ బొడముచు నడఁగుచు సంచారిభావసంజ్ఞయును దాల్చి
వ్యాధ్యసూయావేగహర్షలజ్జామర్షదైన్యావహిత్థనిద్రావిషాద
శంకామదగ్లానిచపలతాపస్మారసుప్తిచింతాశ్రమౌత్సుక్యమరణ
గర్వమోహాలస్యనిర్వేదసంత్రాసధృతిజడతోగ్రతాస్మృతివితర్క
మతిసుసంబోధనోన్మాదనామంబులఁ జేర్చు ముప్పదిమూఁడు భేదములను
బ్రకటంబులై స్థాయి భావంబు లన రోషశమజుగుప్సాభయోత్సాహశోక
హాసవిస్మయరతు లనఁగఁ దొమ్మిది యొప్పు నవరసోదయకారణంబు లగుచుఁ
బంచవిధంబులై పరఁగు భావంబులు స్థాయిభావసమన్వితమ్ము లగుచు

తే. వీని నన్నింటి నెఱిఁగిన[2]వెనుకఁగాని, నవరసంబులు పుట్టుచందములు వాని
భేదములు లక్షణంబులు నాది గాఁగఁ, దెలియఁ బోలదు తంగెడదేశవాస. 37

శృంగారరససీసమాలిక

సీ. వెన్నముద్దకుఁ బాకవిధిచే ఘృతత్వంబు దనరుభంగిని నవస్థాయిభావ
ములకు విభావప్రముఖ్యభావంబులవలన రసత్వంబు గలుగుచుండుఁ
దద్రసం బంతయుఁ దనరుఁ గావ్యములందు నాట్యంబులందు ననారతంబు
విను నాట్యులకుఁ గావ్యవృత్తంబులను గనుఁగొనురసజ్ఞులను నర్తనములందుఁ
గలుగుఁ గాని రసంబు గలుగ దారోప్యంబు కావున నటియించు కాంతలందు
గరిమ నా రసము శృంగారంబు హాస్యంబు రౌద్రంబు కరుణ వీరంబు నద్భు
తంబు బీభత్సంబు దారుణంబును శాంతమును నాఁగ నవవిధంబుల మెలంగు
వరనవస్థాయిభావములలోఁ జెప్పిన రతియె విభావాదిరంజనముల
నయ్యెను శృంగార మది నీలవర్ణంబు వెన్నునిమొన సామవేదవంశ
వర్యంబు గడు సౌకుమార్యంబు కైశికీవృత్తిని మధురతావిధమునందు
సుప్రసాదాభిధానప్రాణ[3]ఫణితిని విరచింప నొప్పుఁ గవిత్వమునను

1. వైస్వర్ణ్య (సూ). 2. వెనక (ప.వా.పె.) ఇట్లే ఈమాట వ్రాఁతపుస్తకము లలో నున్నది. 3. భణితి.

బెనుదాయ బీభత్సముగ కది సంభోగభవమును విప్రలంభజము ననఁగ
ద్వివిధ మయ్యెను బంచవిధభావకథితప్రపంచకపోష్య మై పరఁగునట్టి
సందర్శనాలాపసంస్పర్శనాశ్లేషనఖరదక్షతచుంబనక్రియాద్య
మవనిపై సంభోగభవము తద్విప్రలంభజ మనునది మూఁడుభంగు లయ్యె
నంగప్రభూతం బయత్నసంభవమును నైసర్గికంబు ననఁగ నందు
[1]వింశతీంగితములై వెలఁదుల కొప్పారు యౌవనగుణచేష్ట లందులోనఁ
దనరారు నంగజాతము మూఁడుభేదంబులై హావభావహేలాహ్వయములు
నప్రయత్నజ మయినది సుశోభాకాంతిదీప్తిప్రగల్భతాధీరతలును
మధురతోదారతాభిధములు నన నేడు చందంబు లయ్యె నైసర్గికమ్ము
కిలికించితవిలాసలలితలీలాఖ్యలు విచ్ఛిత్తిబిబ్బోకవిభ్రమములు
కుట్టమితంబును మోట్టాయితంబును విహృతంబు నన దశవిధము లయ్యె
భావంబు మొదలుగా భావోదయక్రియావింశతి యన నవి వినుతి కెక్కు
కుంభినిపై విప్రలంభశృంగారోపకరణంబులై రసాకరము లగుచు
శ్రవణసందర్శనప్రణయవిరోధప్రవాసాదికలనలవలనఁ బొడమి
వెలఁదులకును బురుషులకును వరుసతో నొదవు నవస్థలు పదియు రెండు
నయనసంప్రీతిమనస్సంగసతతసంకల్పప్రతాపజాగరకృశత్వ
విషయానుభవపరిద్వేషలజ్జాత్యాగసంజ్వరోన్మాదమూర్ఛామృతాహ్వ
యంబుల రతిరహస్యకళాప్రవీణులు జగతిఁ బ్రతాపంబు సంజ్వరంబు
నను రెండుదశలును గొనక యవస్థలు పదియ కా నెంతు రేపట్టునందుఁ
[2]బ్రకృతకథాసమాప్తికరంబు నహితంబు నశుభప్రసంగంబు నగుటఁ జేసి
[3]ద్వాదశదశ పురాతనకథాక్రమమునఁ గాని వర్ణింపరు కావ్యములను
తే. గవులు దీని నెఱింగి శృంగారరసము, గులుకునట్లుగఁ గావ్యముల్ గూర్పకున్న
ఖ్యాతి కెక్కునె రసికసభాంతరముల, సర్వతటినీపురందరరాజానివేశ. 38

అష్టరససీసమాలిక

సీ. రసపోషణము లన నెసఁగు విభావముఖ్యంబులవలన సువ్యక్తభంగిఁ
బడయు నవ స్థాయిభావముల్ నిజగుణసత్త్వంబు లగుచు రసత్వ మొందు
నందు శృంగారరసాంతరభేదసంతతు లెల్ల మున్ను భాషితము లయ్యె
నింక హాస్యాదుల నెనిమిదింటను గల్గుభేదముల్ చెప్పెద వేఱువేఱఁ
బూర్వోక్తహాసంబు భువిని హాస్యం బయ్యె నది యల్పమృదువు సామాన్యవాయ

1. వింశతిగీతముల్ (అచ్చుప్రతి). 2. ప్రకృతి. 3. ద్వాదశీదశ (మూ).

మర్దనచ్ఛవి కుంజరాననుచేరువఁ గరుణాభియాతి శృంగారభవము
సొంపొందు మధురతాసుప్రసాదములను భారతీవృత్తిని బద్యములను
మూఁడుభేదంబులు మొలచె నుత్తమమధ్యమాధమంబు లనంగ నందులోన
హసితస్మితము లుత్తమాఖ్యలు విహసితప్రహసితంబులు మధ్యభావితములు
క్షితి నపహాసితంబు నతిహాసితంబును జనుఁ గావ్యములఁ గనినచుఁ బ్రశస్తిఁ
బంచమభావసంభవమహాక్రోధంబు రౌద్రరూపము దాల్చె రక్తనిభము
హరుని[1]యూఁడిగ మథర్వాన్వయప్రభవంబు భ్రుకుటిప్రయుక్త మద్భుతవిపంథి
యుద్ధృతార్థము ప్రసాదౌజంబులనుగూర్చి యారభటీవృత్తి నమరఁ జెప్ప
[2]వెనుకఁ జెప్పిన[3]శ్లోకమున కయ్యెఁ గరుణ దా మహి నథర్వామ్నాయవిహిత[4]కులజ
సమవర్తిదాసి కాపాయసన్నిభకాంతి హాస్యాదికార్ద్రరసాత్మజాత
సౌకుమార్యమునఁ బ్రసాదమాధుర్యంబులను గైశికీవృత్తిఁ జను రచింప
స్థాయిభావోదితోత్సాహంబు దా వీరరస మయ్యె [5]నెఱుపు సాధ్వసవిరోధి
కించిత్ప్రగల్భితోదంచిత మోజఃప్రసాదసాత్త్వతులను జరగుఁ గవిత
ప్రథమవేది సుపర్వభర్తరాణువ మూఁడువిధములై యది ధాత్రి వెలయు నమర
వీరంబు వితరణవీరంబు గారుణ్యవీర్యంబు నన భావవేద్య మగుచు
విస్మయాహ్వయమున వెలయుభావము విభావాదులచే నద్భుతాభిధాన
మున నొప్పు నాశ్వలాయనసూత్రజము కమలాసను[6]దళవాయి యరుణకాంతి
రౌద్రరసాదివీరరసప్రసూతంబు స్వల్పమృదుత్వ మోజఃప్రసాద
విధముల భారతీవృత్తిఁ గావ్యంబులయందుఁ జెప్పఁగ నొప్పుఁ బొందుగాను
నవభావభేదమధ్యవిభాషితజుగుప్సబీభత్స మనఁగ నొప్పిదముఁ గాంచు
నారభటీప్రసాదౌజసవిధములు నొప్పుపద్యముల నత్యుద్ధృతంబు
సన్నుతాపస్తంబసంతతి శృంగారశత్రువు నందికేశ్వరునిబంటు
కాలవర్ణము ద్విప్రకారమై యది చెప్పఁబడు జుగుప్సాఖ్యబీభత్సరసము
పెనుపొంద వైరాగ్యబీభత్సరసమును ననఁగ నీభేదంబు లరయవలయు
మునుపు తొమ్మిదిభేదములలోన నెన్నిన భయము భయానకాహ్వయముచేతఁ
బరఁగు యాజుషము బీభత్సంబుపట్టి ధూమ్రాభంబు వీరరసాహితంబు
ధర మహాకాళునిదళవాయి సాత్త్వతి నోజఃప్రసాదసంయుక్తి నమరుఁ
గవితల నీషత్ప్రగల్భంబు సర్వాంగకంపనవైస్వర్యకారణంబు
శమము శాంతం బయ్యెఁ జంద్రసన్నిభము నిర్వైర మొందును బరబ్రహ్మలెంక

1. యూఁడిగె (వా. పె). 2. వెనక (ప. వా. పె). 3. శ్లోకమున నయ్యె (సూ). 4. జలజ (సూ). 5. నెపుడు (సూ). 6. బడవాలు (పె); కడిహారి (వ) దళవాయి (ప), బడివారి (ఓ).

క్రమమున ధర్మార్థకామమోక్షములను [1]పూరుషార్థములను బొందఁజేయు
నల్పమార్దవము కావ్యములఁ బ్రసాదమాధుర్యభాషాఖ్యవృత్తులఁ బొసంగు
తే. నీ రసాంతరభేదంబు లెల్ల వరుస, నెఱిఁగి సమయోచితములుగా హృదయములకు
నింపు పుట్టంగఁ గృతుల వర్ణింపవలయు, శ్రీగిరీశాన్యభాగధాత్రీనివేశ. 39

## నాయకనిర్ణయసీసమాలిక

సీ. నవరసంబులకు జన్మస్థానములు నలుగురు ముఖ్యులగు నాయకులు దనర్తు
రొగి ధీరలలితధీరోద్ధతధీరప్రశాంతధీరోదాత్తసంజ్ఞకు లనఁ
గలరు వెండియు నొకనలుగురు శృంగారరససంభవాస్పదప్రథితగుణులు
ధారుణి ననుకూలదక్షిణశఠధృష్టు లనఁగ వీరలకు సహాయపరులు
మహి నలువురు పీఠమర్దవిదూషకవిటచేటకు లనంగ వెలయువారు
మదనకళాశాస్త్రవిదులచేఁ బూరుషజాతులు నాలు గెంచంగఁ బడియెఁ
బాంచాలదత్తకభద్రకకూచిమారాభిధానంబుల నవియుఁ గాక
నుపజాతు లన వెండియును మూఁడు శశవృషహయనామకములఁ జెన్నారుచుండు
వసుధ నాయకుఁ డెంత రసికుఁ డైనను గాంత వెలి గాఁగ రసము సంధిలదు గాన
నాయికాభేద మంతయు విస్తరంబుగాఁ దెలిపెద నవరసాధీన లైన
యంగనలకు స్వకీయయుఁ బరకీయయు సాధారణయు ననఁ జనుఁ ద్రివిధము
లందులోన స్వకీయ యను భామినికి గుణభేదములను మూఁడు భేదము లగు
నుర్వి ముగ్ధయు మధ్యయును బ్రగల్భయు నన నొక్కచందంబున నుండు ముగ్ధ
మధ్యాఖ్యఁ జను తనుమధ్య ధీరయును ధీరాధీరయును నధీరాభిధయును
నను మూఁడు తెఱఁగుల వినుతి గాంచుఁ బ్రగల్భ యనునదియును నట్ల నళికయిల్లు
ధృతివిశేషములచే ధీరాదికామినీమణులు జ్యేష్ఠామధ్యమాకనిష్ఠ
లగుదురు వసుసతో నవని నా పరకీయ [2]ద్విప్రకారంబుచేఁ దేజరిల్లుఁ
గరపరిణీతయుఁ గన్యకయును ననఁ బరిణీత వర్ణింపఁబడదు కృతులఁ
గన్యక పురుషాభికాంక్షిత గాన నంగరసంబులను బరికల్పిత యగు
శృంగారరసనిధానాంగన లెనమండ్రు చర్చింప వాసకసజ్జికయును
నభిసారికయు ఖండితాఖ్యయు స్వాధీనపతికయుఁ బ్రోషితభర్తృకయును
విగ్రహాంతరితయు విగ్రహోత్కలితయు విప్రలబ్ధయు నన వీరలకును
దూతిక [3]లార్గురు ప్రాతివేశినియు శిల్పినియుఁ గారువును లింగినియు సఖియు
ధాత్రీతనుప్రజాతయు వీరు లేకున్న తఱి నేర్పుమైఁ బ్రియతంత్రములకుఁ
దమకుఁ దా మైనను దగ దూతిభావంబు గైకొని నడపుట కార్యసరణిఁ

---

1. పురుషార్థములను బా. 2. ద్విప్రకారంబులై తేజరిల్లు (పూ. ము.). 3. లార్గురు (పూ. ము; గి).

గాశాస్త్రమునందుఁ గామినీమణులకు వెలయు జాతులు నాల్గువిధము లగుచుఁ
జింతింపఁ బద్మినీ శంఖినీ చిత్తినీ హస్తిను లన వీరి కందఱకును
నలువొంద మత్తేభంగుల నుపజాతులు హరిణియుఁ దురగియుఁ గరిణియు నన
లలి భావరసనాయకులయందుఁ గలిగిన భేదంబు లెల్లఁ దెల్పితి వరుసను
[1]గ్రంథవిస్తారశంకను వాసిలక్షణంబులు లక్ష్యములు నిందుఁ బలుకనైతి

తే. నట్లనుట భావరసనాయకాదిభేద, సంచయమున కలంకారశాస్త్రవితతి
వలన లక్షణలక్ష్యముల్ దెలిసి పిదప, రసము పర్ణింపఁదగుఁ గవిరాజులకును. 40

సుకవిమాహాత్మ్యము

తే. మణివలనఁ గంకణమును గంకణమువలన, మణియును బ్రకాశ మగునట్లు మదిఁదలంప
సుకవివలన నాయకుఁడు నాయకునివలన, సుకవియుఁ బ్రసిద్ధిఁ గాంతురు సకలదిశల.

తే. నాకుజాతునిచే రఘునాయకుండు, వ్యాసుచేఁ బాండవులు కాళిదాసుచేత
భోజుఁడు ప్రసిద్ధినొందిరి భువిని దమదు, నడక లెల్లను గథలుగా [2]నుడువుకతన.

క. ఇమ్మహిని మునులచే వెల, సెమ్మను గావ్యములు "నానృషిః కురుతే కా
వ్య"మ్మను వచనార్థంబే, సమ్మతిఁ గలివేళ సుకవిజనులే మానుల్. 43

సత్కవి లక్షణము

క. ధరణీసురుఁడు ప్రశాంతుఁడు, గురుభక్తుఁడు శుచియుఁ గల్పకుఁడు పూర్వకవీ
శ్వరవాక్ప్రయోగదక్షుఁడు, కరుణామతి యెవ్వఁ [3]డతఁడు కవి యనఁ బరఁగున్.

క. శ్రుతిశాస్త్రాంగపురాణ, ప్రతతియు నితిహాసకావ్యభరతాగమముల్
స్మృతిసంగీతరతికళా, గతులు నలంకృతులు నెఱుఁగఁగాఁ దగుఁ గవికిన్. 45

సప్తవిధకవులు

ఆ. వినుతిఁ గాంతు రిల వివేకివాచకరాచి, కార్థశిల్పభూషణార్థు లనఁగ
మార్దవానుగత[4]సమాహ్వయుఁడు ననంగఁ, గవులు సప్తనామకములతోడ. 46

సీ. గణవర్ణశబ్దార్థగుణదోషనికరంబుఁ బరికించి కూర్చుఁ గబ్బము వివేకి
బహుతరానుప్రాసపదబంధనియమంబు వదలక కృతిసేయు వాచకుండు
మృదుమధురోక్తులు వెదకి కావ్యం బెల్ల రచియించుఁ బదపడి రాచికుండు
మితశబ్దములలోన నతివిపులార్థంబు నిమిడించు నర్థాఖ్య నెసఁగునతఁడు

---

1. శబ్దగ్రంథాదిసంబంధ మున్నపుడు విస్తర మనవలె; విస్తార మనరాదు. కాన గ్రంథవిస్తరశంక యని యుండ నగు; అట్లున్న గణభంగ మగును. శబ్ద సంబంధము లేని విస్తార మను శబ్దమును సయితము కవులు ప్రయోగించియున్నారు (రా). 2. నుడుగు (మూ). 3. తనిఁ గవి. 4. సమాహ్వయుఁడును గాఁగ (మూ).

తే. సెప్ప యమకంబు లెప్పట్ల శిల్పకుండు, పొందుపఱుచు నలంకృతుల్ భూషణార్థ
సరళపదవిరళార్థవిస్ఫురణముగను, జూపు రస మెందు మార్దవస్ఫుటకరుండు. 47

## కుకవినిరసనము

తే. జల్లిపదములు నాలుగు సంతరించి, గురువు లిడుచోట లఘువులు కొన్ని గూర్చి
విరతి గూడక మీఁదులు [1]వెదకికొనుచు, నచ్చు [2]పొల్లులపై నుంచునతఁడు కవియె.

తే. వ్రణము గని నిర్మలాంగంబు వదలునీఁగ
యనఁ గుకవి తప్పుఁ గని యొప్ప నడఁచిపుచ్చు
జల ముడిగి పాలు ద్రావు హంసంబుకరణిఁ
దప్ప విడనాడి యొప్ప సత్కవి గ్రహించు. 49

తే. తనకుఁ దెలియని వన్నియుఁ దప్పు లనుచుఁ
గుకవి హాస్యంబు గావించు, సుకవివరుఁడు
దడవు యోజించి తెలియు సంశటను దెలియ
కున్నఁ దద్దయుఁ బెద్దలయొద్దఁ దెలియు. 50

క. ధరఁ దమరు సత్కవుల మని, పరులు కుకవు లనుచుఁ గృతులఁ బరిహాస మొన
ర్తురు [3]గర్వమతు "లయోగ్యాః, పురుషో నాస్తి" యనుమాట బుద్ధిఁ దెలిసియున్.

క. భ్రష్టులు తామే సర్వే, తత్కృష్టకవుల మనుచు సభఁ జరింతురు [4]"బాణో
చ్ఛిష్టం జగత్త్రయ"మ్మను, నష్టాక్షరమునను గాదె యడఁకువ మదికిన్. 52

## కవితాప్రశంస

తే. విబుధలోకంబు "కవితైవ విద్య"యనుచుఁ,జదువు వచనార్థమునను సంశయముగలదె
విద్యలకు నెల్ల నుత్తమవిద్య కవిత, దానిఁ దెలియుట విశ్వ మంతయును గనుట.

క. ధారుణి నాకుజమారుతి, పారాశర్యులు చరించు భావకశిష్టా
చార [5]మవశ్యక మని కవి, తారతమతు లైరి కాళిదాసప్రముఖుల్. 54

మ. జననాథాగ్రణి యాత్మరాజ్యమున నిచ్చల్ పూజ్యుఁ డా సీమఁ బా
సినఁ దా గవ్వయుఁ జేయఁ డన్నికడలన్ శ్రేష్ఠుండు విద్వాంసుఁ డా
యనకన్నం గవి మేటి యా "సుకవితా యద్యస్తి రాజ్యేన కి"
మ్మను వాక్యంబు నిజంబు దీనిఁ గని కావ్యంబుల్ రచింపందగున్. 55

క. వనితయుఁ గవితయుఁ దా నై, చను దెంచుట గలుగు నేని సరసం బగు ధా
త్రిని బల్మికోలు గావిం,చిన విరసం బగు నటంచుఁ జెప్పిరి విబుధుల్. 56

---

1. వెతకి (సూ). 2. పొల్లల (సూ). 3. గర్వమతులు యోగ్యాః పురుషోనాస్తి (సూ). 4. వ్యాసో-ప్రాచీనముద్రణము. 5. అవశ్యకము – అనురూపము అసాధువు. చారమవశ్యంబని-అని సవరింపఁజను (రా). అవశ్యమ్మని (సూ).

క. ఛందోలంకారాదుల, యందలిపాటిల్లఁ దుదిని వ్యర్థము గావే
సుందరమగు వాక్యంబుల, పొందెఱిఁగి రచించు బుద్ధి పుట్టక యున్నన్. 57

క. విరచించు శక్తి పుట్టని, పురుషునిచదువులు ప్రకాశములు గావు వసుం
ధర దీపరహితసదనాం,తరమున రేయిఁ బడియున్న ద్రవ్యములక్రియన్. 58

తే. ఆశుధారాకవిత్వంబులందు శయ్య, లుపమ లుత్ప్రేక్షలును లేక యుండుఁ గాన
నెంత యోజించినను బద్య మంత సార,వంత మగుఁ గాన నిలుకడ వలయుఁ గృతికి.

## దేశభాషావిశేషంబులు

మూ. సూ:—స్వస్థానవేషభాషాభిమతా స్సంతో రసప్రలుబ్ధధియః,
లోకే బహుమన్యంతే వైకృతకావ్యాని చాన్యదేశీయాః.

మ. నిజదేశంబులవేషభాషలపయి న్నిత్యాభిమానస్థులై
ప్రజ మెచ్చ న్రసలుబ్ధబుద్ధు లగుచుం బ్రాజ్ఞుల్ స్వదేశ్యంబులే
నిజ మంచుం గొని యన్యదేశములవాని న్మెచ్చ రేపట్టునన్
గజరాజావన ప్రస్ఫుటార్థరసముల్ గా వంచు నెల్లప్పుడున్. 60

క. తమతమబాసల కవితలు, తమతమదేశముల కొప్పిదము లగుఁ బరదే
శములకుఁ గూడ నొకింతయు, నమరోక్తులు సకలభూములందును వెలయున్. 61

క. తలఁపఁగ సంస్కృతకావ్యం,బులు తమ యర్థములు సకలభూజనములకున్
దెలిసినను దెలియకున్నను, బొలుపొందఁగ నిచ్చు నాల్గు[1]పురుషార్థంబుల్. 62

క. హరికథ యైనను దమ కర్థరసానుభవంబు లేని రసవద్దేశాం
తరభాషాకావ్యంబులు, దొరఁకొని పఠియింప ముక్తి దొరకునె దానన్. 63

క. ఆ యా దేశమువారికి, నా యా దేశంబుభాష నమరిన కావ్యం
బాయతపురుషార్థంబులఁ, బాయక సమకూర్చు దేవభాషయపోలెన్. 64

క. సురభాషార్థము దెలియని, తరుణులకును శూద్రులకును దమతమ సీమం
బరఁగిన మాటలఁ జెప్పిన, వరకావ్యము పఠనమున [2]కవశ్యక మయ్యెన్. 65

క. క్షితి మ్లేచ్ఛభాష శ్రుతిగర్హిత మగు నట్లైన నా ధరిత్రిని దానిన్
మతి రోసి విడువఁగూడదు, సతతము వ్యవహారహాని సంధిలుకతనన్. 66

క. నీతం బని దేశీయము, జాతీయంబును వచించు సమయమున నిజ
క్ష్మాతలభాషాకృతులను, ఖ్యాతిగ మ్లేచ్ఛోక్తు లాదిగాఁ గూర్తు రజా. 67

1. పురుషార్థములన్ (సూ). 2. కవశ్యంబయ్యెన్-అని సవరింపఁజనును (రా).

ఆంధ్రకవిపితామహుని చాటుధార:—

మ. సమరక్షోణిని గృష్ణరాయల భుజాశాతాసిచేఁ బడ్డ దు
ర్దనుదోర్దండ[1]బెడందకోట యవనవ్రాతంబు సప్తాశ్వమా
ర్గమునం గాంచి "శబా సహో హరి హరంగా [2]ఖూబు ఖోడాకితే
తుముకీ[3]భాయిల భాయిదేములికి" యందు ర్మింటికిం బోవుచున్. 68

నంది తిమ్మన చాటుధార:—

శా. రాయగ్రామణి కృష్ణరాయ భవదుగ్రక్రూరఖడ్గాహిచేఁ
గాయం బూడ్చి కళింగదేశనృపతుల్ [4]"కానిఝ్జరీఘోషణీ
మాయాభీకుముటూకులోటుకుహుటామాయా[5]సడాజాహరే
మాయాగ్గేయమడే" యటంద్రు దివి రంభాజారునిన్ యత్నునిన్. 69

కాళహస్తిమాహాత్మ్యమునందు:—

సీ. బిజ మాడుదేవర నిజకృపామహిమఁ జెన్నారునాయిల్లు బిడారు నీకు
నాకు నీపాదార్చనము సేయ నడలింగమూర్తి సేకుఙె వచ్చి మూర్తమాడి
యొడయచిత్తేశ నాయునికి నీమజ్జన మాడు శివార్చన మాడుజేకు
విచ్చేయుఁ డిది బూడి వీడియం బందుకో జంగమస్వామి నా సదనమునకు
తే. నోగిరంబులు మంచి మే [6]లోగిరములు, నావటించెదఁ బదుఁడు మీ [7]రారగింపఁ
బ్రతిదినంబును జంగమార్చనము లేక, తనువు వడ నొల్ల రూపకందర్ప యనఁగ. 70

భాషాష్టకోత్పత్తివివరణము

తే. భాష రెండు దెఱంగులఁ బరఁగుచుండు
సంస్కృతము ప్రాకృతము నన సంస్కృతంబు
ప్రకృతి యన నొప్పు దానికిఁ బ్రాకృతంబు
వికృతి యగుఁ దంగెడాహ్వయవిషయవాస. 71

తే. భారతీదేవిశైశవభాషితంబు, ప్రాకృతము పంచవిధ మయ్యెఁ బ్రాకృతంబు

---

1. పుళిందకోటి (సూ). ఖూజు ఖోదా తెతే(ప); ఖూబు ఖోడాకెతే (వా); ఖూబుఖోడాకెతే (పె). 3. బాయబాయిదేమలికి (సూ). 4. కానీర్ఘురీపోషణీ, మాయాభీకుముటూకులోటుకుహుటూమాయాసటాజాహరే, మాయాగ్గేయమటా(వా): కానీర్ఘురీపోషణా; మాయాభీకుముమీకులోమికుహుమీ మాయానటాజాహరే,మాయా గ్గేయమడే (ప); కానీర్ఘురీఘోఘణీ, మాయాభీకుముటూకుటోటికుహుటీ మాయాసటా జోహారే, మాయాగ్గేయమటా (పె). 5. సటా (సూ). 6. లోగిరమున (సూ). 7. రారగించ (పె).

శౌరసేనియు మాగధీసంజ్ఞికయును, గ్రమతఁ బైశాచికయు నపభ్రంశ మనఁగ. 72

క. నామ మపభ్రంశం బని, సామాన్యముగాఁ దలంపఁ జన దది భాషా
భామాశిశుత్వభాషిత, మై మెలఁగుటచే సుశబ్ద మగు నెల్లెడలన్. 73

ఆ. పద్మపత్రనేత్ర పైశాచికాభాష, యందు భేద మించుకంత గలిగి
సొంపు మీఱుచుండుఁ జూళిక పైశాచి, లెక్కలోనఁ దాను నొక్క టగుచు. 74

తే. ప్రాకృతాదులు చెడి తజ్జపదము లగుచుఁ
బలు తెఱంగులఁ దనలోనఁ గలసియుండు
కతన నీ యంధ్రభాషయుఁ గవిమతంబు
నందుఁ బ్రాకృతభేదంబె యనఁగ నొప్పు. 75

క. క్షితి భాష సంస్కృతప్రా, కృతసంజ్ఞల ద్వివిధ మయ్యె నెంచఁగఁ దత్ప్రా
కృతము వెస నేడు తెఱఁగుల, వితత మగుట నెల్ల సప్తవిధభాష లగున్. 76

తే. సంస్కృతము ప్రాకృతంబును శౌరసేని
జగతిపై మాగధియును బైశాచికయును
జూళికయు నపభ్రంశంబు సొరిది నాంధ్ర
భాషయును నివి చను సప్తభాష లనఁగ. 77

ఆ. వరరుచిప్రణీతవాక్యంబులను బతం, జలికృతోరుభాష్యమునను వెలయు
పాణినీయసూత్రపక్కిని జనియించు, శబ్దజాల మెల్ల సంస్కృతంబు. 78

తే. ఇలఁ ద్రివిక్రమరచితవృత్తులను [1]హేమ, చంద్రసూరిప్రణీతభాష్యంబుచేతఁ
దనరు వాల్మీకి మూలసూత్రములవలనఁ, బ్రాకృతాదిషడ్భాష లుద్భవముఁ జెందె.

క. తెలుఁగునకుఁ బొడము లక్షణములు బాలసరస్వతి ప్రముఖబుధకృతటీ
కలవలనను వెల్లంబై, చెలు వగు నీ యాంధ్రశబ్దచింతామణిచేన్. 80

సీ. స్వర్గలోక ప్రశస్తము సంస్కృతము మహారాష్ట్రదేశీయంబు ప్రాకృతంబు
శూరసేనాఖ్యఁ బ్రస్తుతి కెక్కు నాటను జను లాడునదియెపో శౌరసేని
మగధదేశోక్తులు మాగధీభాష పిశాచసంజ్ఞికములై జగతిఁ బొదలుఁ
[2]పాండ్యకేకయసాల్వబాహ్లికానూపగాంధారనేపాళకుంతలసుదేష్ణ

తే. భోజకన్నోజకంబులఁ బొసఁగుమాట, లరయఁ బైశాచికాచూళికాహ్వయములు
వెస నపభ్రంశ మాభీరవిషయజాత, మాంధ్రభూమిభవం బాంధ్ర మయ్యె శౌరి. 81

తే. దేవభూసురమునిధరిత్రీతలేంద్ర, సచివకంచుకివిటవిదూషకవిరక్త
వారయోషిన్నృపామాత్యవనితలకును, జెప్పఁదగు సంస్కృతముసుధాసింధుశయన.

1. సోమ (మూ). 2. పాండ్యకేకయ హైహవబాహ్లికసుహ్మగాంధార.

సీ. [1]క్షపణకజైనాదికర్మహీనులకును భామాజనులకును బ్రాకృతంబు
క్షితి వైశ్యశూద్రప్రభృతిమధ్యమాధమజాతుల కెల్లను శౌరసేని
ధీవరలుబ్ధకాదివినీచజాతులమానవులకు నెల్ల మగధభాష
మొగిఁ బిశాచాసురముఖ్యుల కెల్లఁ బైశాచికానామభాషాద్వయంబు
తే. పతితచండాలయవనాదిపరమనీచ, జాతినరుల కపభ్రంశ మీతెలుంగు
సీమవారికి నాంధ్రంబుఁ జెప్పవలయుఁ, గావ్యనాటకముల గోపికాభుజంగ. 83

ప్రకృతివికృతిభేదంబులు

మూ. సూ:—ఆద్యప్రకృతిః ప్రకృతిశ్చాద్యే[2]త్వేషాత యోర్భవేద్వికృతిః.

తే. క్రమమునను సంస్కృతప్రాకృతములు రెండుఁ
బరఁగు నాద్యప్రకృతియు బ్రకృతి యనఁగ
వెలయు నీరెంటికిని [3]దెల్గు వికృతి యనఁగ
నందగోపాంగనాపుత్ర నలిననేత్ర. 84

తద్భవస్వరూపము

మూ. సూ:—కేవలతయానుసర్పత్యుభే చ యేయం యథాతథా భాషా.

తే. ప్రకృతులను రెంట రెండు రూపముల నమరు
తద్భవములు ప్రత్యేక మాంధ్రంబు లగుచుఁ
జంద్రునకుఁ జందురుం డని సంస్కృతమునఁ
జందుఁ డని ప్రాకృతమున నీ చందమునను. 85

[4]ఇందుకు తెలివిడి శబ్దసూత్రము:—ప్రయోగమూలం వ్యాకరణమ్.[5]

దీని అర్థము:—శబ్దశాస్త్రము లోకమునందు ప్రవర్తించు ప్రయోగములే మూలముగా కలది. ఇటన్నందుచేతను వ్యాకరణశాస్త్రము లోకవ్యవహారము ననుసరించే చెప్పుచున్నది అనుట. అటుగాన లోకవ్యవహారసిద్ధములైనను తద్భవములకు లక్షణము తెలియవలెను. అది యెట్లంటేను: తెలుఁగునకు ప్రాకృతభాష ప్రకృతి అనిపించుకొనును. ఆ ప్రాకృతమునకు సంస్కృతభాష ప్రకృతి అనిపించుకొనును. అటుగనక ప్రకృతు లంటేను సంస్కృతప్రాకృతములరెంటికిన్ని పేరు. ఆరెంటియందున్న కొన్ని తద్భవములు, ప్రత్యేకమున్ను ఒక్కొక్కచానను ఒక్కొక్కవిధమున పుట్టి రెండు రూపములనున్ను తెనుఁగులలోనూ గలసి యున్నవి. కనుక నాటి కన్నింటికిన్ని దెలిసేటట్టుగాను అందులోపల నొక చంద్రశబ్దమునకు చెప్పుచున్నాము. సంస్కృతము

1. క్షపణజైనాదిక (సూ). 2. 13-వ పేజిలో ఈ శ్లోకక్రమము మారి యున్నది. ప్రకృతిశ్చాద్యే ఏషా తయోర్వికృతిః (సూ). 3. దెస్గు. 4. దీనికి శబ్దసూత్రము (సూ). 5. వృత్తి (సూ).

నందు గల ద్విత్వాక్షరమునందు క్రిందను జడ్డయై యుండేటి రేఫము ప్రాకృతభాషగాను పలికేటప్పుడు లోపముగాను అవును గనక ఆరేఫము లోపము గాక ప్రత్యేకముస్ను [1]ముందర ఒక యక్షరమై నిలుచుటచేతనున్ను దకారమునను బ్రాకృతమందు రాని కొమ్ము వచ్చుటచేతనున్ను జందురుశబ్దము శుద్ధసంస్కృతశబ్దముననే అయిన తద్భవము గాని సంస్కృతము చెడి అయిన ప్రాకృతమువలనను అయినది గాదు.

చజౌ తజ్జే ప్రాకృతే చ దంత్యావేవ న సంశయః.

టీ. తజ్జే = తద్భవమునందున్ను, ప్రాకృతే చ = ప్రాకృతమునందున్ను, చజౌ= చకారజకారములు రెండున్ను, దంత్యావేవ = దంత్యవర్ణములే అవును. తాలవ్యములుగా వనుట. సంశయః=సందేహము, న=లేదు. ఇటనే అథోక్షజఫక్కికావచనముచేతను ఇదిన్ని సంస్కృతజాతమైన తద్భవము గనక మొదల నున్న చకారము దంత్యమయి తెలుఁగు తత్సమముచేస్తేను చందురుండు అని అయినది. ప్రాకృతమునే అయినట్లాయెనా చకారముక్రిందటిరేఫము లోప మౌను గాని, ప్రత్యేకాక్షర మై యుండదు. దకారమునకుఁ [2]బొల్లున్ను రాదు. అది యె ట్లంటేను.

ప్రాకృతవ్యాకరణసూత్రంబులు

కగచజటడతదపబమగకగపశో రుపర్యద్రే.

వృ. ఉపరి స్థితానాం స్పర్శవర్గాద్యతృతీయానాం మవర్ణజిహ్వామూలీయోపధ్మానీయానాం శషసానా మేతేషాం సంయుక్తోపరివర్ణే లోపః స్యాత్ న తు ద్రశబ్దే.

టీ. ఉపరిస్థితానాం=[3]ద్విత్వాక్షరములందు మీఁదనున్నటువంటి, స్పర్శవర్గాద్యతృతీయానాం=క చ ట త ప గ జ డ ద బ లకు, మవర్ణజిహ్వామూలీయోపధ్మానీయానాం (ఌక-ఌప-అని-కపలకు ముం దర్ధవిసర్గసదృశము లయిన వర్ణములు జిహ్వామూలీయోపధ్మానీయంబు లనంబడు). మకారఌకఌపవర్ణములకు, శషసానాం చ = శషసలకును, లోపః= అదర్శనము, స్యాత్ = అగును. ఇందుచేతను చంద్రశబ్దమునందు రేఫమునకు మీఁదను ఉండేడి దవర్ణమునకు లోపము వస్తేను 'నతు ద్రశబ్దే' ద్రకారము గల శబ్దమునం దైతేను లోపము లేదు. ఇటన్నందువలన దవర్ణము లోపము కాదాయెను.

సూ:—రవలా మధ శ్చ.

వృ. అధస్థితానాం రవలానాం లోప స్స్యాత్.

టీ. అధస్థితానాం = జడ్డలు గల యక్షరములయందుఁ గ్రింద నున్నటువంటి, రవలానాం = రేఫవకారలకారములకు మూఁటికిన్ని, లోపః స్యాత్ =లోపమౌను. ఈ సూత్రముచేతను దకారము క్రిందనున్న రేఫము లోపమైతేను చంద అని యుండెను.

---

1. ముంగల (వా). 2. బొల్లును(గి). 3. మీఁదనున్న ద్విత్వాక్షరములందు(గి).

సూ. శేషాదేశస్యాహరోఽచోఖోః.

వ. హకారరేఫవర్జిత స్యానాదేః శేషస్యాదేశస్య చాచఃపరస్య ద్విత్వం స్యాత్.

టీ. హకారరేఫవర్జితస్య = హకారమున్ను రేఫమున్ను గాక తక్కినటువంటి, అనాదేః=మొదలిది గానటువంటి, శేషస్య = లోపముకాఁగా చిక్కినదానికిన్ని, ఆదేశస్య చ=ఆదేశమైనదానికిన్ని, అచః పరస్య=అచ్చుకంటె పరమైనదానికిన్ని, ద్విత్వం = జడ్డ, స్యాత్ = అవును. ఇందువలనను హవర్ణము రవర్ణము గాదు గనకనున్ను శబ్దాద్యక్షర దకారమున్ను రేఫమున్ను సంయుక్తమైనటువంటి ద్రవర్ణమునం దధస్థితమైన రేఫము లోపము కాఁగాను చిక్కినవి గనకనున్ను జకారముమీఁద నున్న అకారమచ్చు గనక దానిమీఁద నున్నది గనకనున్ను దకారమునకు జడ్డ వచ్చెనుగనక చంద్ద ఆయెను. ఇది ప్రాకృతభాష గనక మునుపు చెప్పిన యఘోషజవచనమునను ఆది నున్న చకారము దంత్యవర్ణమాయెను. అది తత్సమము చేస్తేను చందు డని నిలిచెను. కాఁబట్టి యీ మాట సంస్కృతమునఁ బుట్టిన ప్రాకృతముననే అయిన తద్భవముగాని శుద్ధసంస్కృతమున నైనది గాదు. ఈ రెండుశబ్దములున్ను ఆదిమకవిప్రయోగప్రసిద్ధములే గనక ఇటువంటివన్నిన్నీ ప్రకృతులను రెంటనున్ను రెండు విధములనూ పుట్టినవని తెలుసుకొనేది. ఇందుకు ప్రయోగము.

నరసింహపురాణమునందు:—

చ. సురుచిరపానపాత్రమున సుందరి యొక్కతె కేల నిండుచం
దురుఁడు ప్రకంపితాంగములతోఁ దిలకించెఁ దదాననాంబుజ
స్ఫురితవికాసవైభవము సొంపు లడంకువ మ్రుచ్చిలింపఁ జే
చ్చెరఁ జనుదెంచి కట్టువడి చేడ్పడి భీతి వడంకు[1]చాడ్పునన్. (ఆ. 3 ప. 97) 86

నైషధమునందు:—

చ. కెరలి మహాసివేమసహకృత్వరి తద్భటకోటిచాతురీ
తురి సమరాంగణంబులఁ జతుర్వారిదావరణంబులన్ యశోఽం
బరముల [2]నేయుచుండు బహుధంగులఁ బున్నమనాఁటినిండుచం
దురునుసోగవెన్నెలలతోఁ దులఁదూఁగెడు తద్గుణంబులన్. (ఆ. 1 ప. 50) 87

ఆ. తెలుఁగు లొక్కకొన్ని దేవతాభాషనె, తద్భవంబు లగుచుఁ దనరుచుండు
ధరణిఁ గొన్ని ప్రాకృతముననె యగుచుండుఁ, దెలియవలయు[3]వాని తెఱఁగులెల్ల.

తే. ప్రాకృతము నంటక నిలింపభాషనయ్యె,దజ్జము సముద్రమునకు సంద్రం బటంచు
నాకిసద్భాష నంటక ప్రాకృతమున, నైనచో దానిని సముద్ద మనఁగ వలదె. 89

1. కైవడిఁ (పె). 2. నేచు (ప. పె). 3. దాని (వా. పె.)

ఇందునకు తెలివిడి. కొన్ని తద్భవములు లోకమునం దాద్యప్రకృతివలననే యయినవి గాని ద్వితీయప్రకృతి నయినవి గావు. అవి యెటువంటి వంటేను : అందు లోపల సముద్రశబ్దమున కొక్కటికిఁ జెప్పుచున్నాము. మొదలిప్రకృతియందు లోప మయ్యెటిదకారము క్రిందటిరేఫము లోపము గాక నిలిచినందుచేతనున్ను, సంద్రశబ్దము ప్రథమప్రకృతి నైన తద్భవముగాని ద్వితీయప్రకృతి నైనది గాదు. అది తత్సమము చేస్తేను సంద్ర మయినది. రెండవప్రకృతినే అయితే "కగచజటడతదపబమశకశపశో రుపర్యద్రే" అన్నందునఁ జంద్రశబ్దమునకువలెనే సముద్రశబ్దమునందలి దకారమునకు లోపముగా వస్తేను "నతు ద్రశబ్దే" అనుటవలన లోపము రా దాయెను. "రవలానా మధశ్చ" అని మునుపు చెప్పినసూత్రముచేత దకారముక్రిందిరేఫము లోపమైతేను సముద అని నిలిస్తేను "శేషాదేశస్యా హోరీచోద్భోః" అనుదానివలనను మునుపటివలెనే దకారమునకు జడ్డ వచ్చె గనక సముద్దమాయెను. అది తత్సమము చేస్తేను సముద్దము అని యుండవలెను. ఈమాట ఆదిమకవులు ప్రబంధములను వాడినవారు కారు; సంద్రమనే చెప్పుకొన్నారు. అటుగనక నిటువంటి వెల్లా శుద్ధసంస్కృతమున నైన తద్భవము లని తెలుసుకోనేది.

లక్ష్మీశబ్దమునకు:—

క. నాకులభాషను ముట్టక; ప్రాకృతమున లచ్చి దాఁ బరఁగు లచ్చి యనన్
నాకోక్తి యైన లక్ష్మికిఁ, బ్రాకటముగ లక్కిమి యని పలుకఁగ వలదే. 90

దీనికిని దెలివిడి. లోకమునందు తద్భవములు కొన్ని ప్రాకృతభాషవలన నైనవే కాని దేవతాభాష నైనవి గావు. అవి యె ట్లంటేను : లక్ష్మీశబ్దమునకుం జెప్పుచున్నాము.

సూ. మనయానామ్.

వృ. అధస్థితానాం మనయానాం లోప స్స్యాత్.

టీ. అధస్థితానాం=ద్విత్వాక్షరములయందుఁ గ్రింద నున్న, మనయానాం = మకార నకార యకారములకు, లోపః = లోపము, స్యాత్ = అగును. ఇందువలన షకారముక్రింద నున్నమకారమునకు లోపమయితేను లక్షీ యని యుండెను.

సూ. క్షః.

వృ. క్షస్య ఛస్స్యాత్.

టీ. క్షస్య=క్షకారమునకు, ఛః=ఛకారము, స్యాత్=అగును. దీనిచేత క్షకారమునకు ఛకారము వస్తే లఛి యనరూపము సిద్ధించెను. తెలుఁగునందు స్పర్శ వర్గద్వితీయ వర్ణములు లేవు గనక లచ్చి యని నిలిచెను. ఇది ప్రాకృతమున నైన తద్భవము గాని,

దేవభాషనైన తద్భవము గాదు. సంస్కృతమున అయితేను క్రిందనున్నమకారము ప్రత్యేకము స్పర్శవర్గద్వితీయము ముంగల నొక యక్షరమై నిలిస్తేను లక్షిమి యవును. ఆంధ్రమునందు షకారము లేదు గనుక అది లోపమై కకారమునకు ద్విత్వమువస్తేను లక్కిమి, వికల్పమున జడ్డ లోపమైతేను లకిమి యాయెను. ఈరెండువిధముల తద్భవములలోనున్న బూర్వకవులు ప్రబంధములయందు లచ్చి యని ప్రయోగించినారు గాని లకిమి యని ప్రయోగించినవారుకారు గనక నిట్టి శబ్దములెల్లాను ద్వితీయప్రకృతి నైనవని తెలిసేది. దీనికి బ్రయోగము:—

విరాటపర్వమునందు:—

ఉ. వచ్చినవాఁడు ఫల్గునుఁ డవశ్యము గెల్తు మనంగ రాదు రా
లచ్చికినై పెనంగిన బలంబులు రెండును గెల్వనేర్చునే
హెచ్చుగుఁ గుందగుల్ దొడరు టెల్లవిధంబుల కోర్చునట్లు గా
కిచ్చఁ దలంచి యొక్కమెయి నిత్తఱిఁబొందగు[1]సేఁతయుం దగున్. 91
(ఆ. 4. ప. 234.)

రామాభ్యుదయమునందు:—

[2](తే. రాచపాఱునిజన్నంబుఁ గాచినాఁడు, లచ్చిపుట్టిల్లు కోలుఁ దెచ్చినాఁడు
చాలుపేరింటిలొయ్యాలి నేలినాఁడు, పుడమి[3]నునుమించు ప్రొద్దువంగడమునందు.)
తే. శౌరసేన్యాదిపంచభాషలును బ్రాకృతంబులో భేదములు గానఁ దద్భవములు
వానియందును బుట్టును వర్ణభేదములును బంచవిధంబులై తెలుఁగునందు. 93
తే. శౌరసేని జూదంబు పైశాచియందు, సాన చూళిక యనియెడుదాన రాచ
కొల మపభ్రంశభాషోక్తివలన [4]మూఁగ, దనరు మాగధి జక్కులు తద్భవములు.
ఇందునకుఁ దెలివిడి. ద్యూతశబ్దమునకు:—

సూ. ద్యర్యో ర్జః.

వృ. ద్యకారస్య ర్యకారస్య చానయో ర్జకారాదేశ స్స్యాత్.

టీ. ద్యకారస్య=ద్య అనే అక్షరమునకు, ర్యకారస్య చ=ర్య అనే అక్షరమునకున్ను, అనయోః = ఈరెంటికిన్ని, జకారాదేశ స్స్యాత్ = జవర్ణ మాదేశ మవును. ఇందున ద్యకారమునకు జకారము వస్తేను జూత మని యుండెను.

---

1. నింతయుం (సూ). 2. ఈపద్యము పూర్వముద్రణలలో నెల్లఁ గుండలీకృతమై యున్నది. ఇది రామాభ్యుదయమునఁ గానరాదు (రా). 3. న్నన. 4. మూఁగ (సూ. ప్రతిలో అరసున్న లేదు); ఇటీవల నాచూచిన యొక తాళపత్రప్రతి (శివ)లో 'మూ౦గ' అనురీతి వ్రాయబడియున్నది (రా). ఈప్రతిలో అరసున్న '౦' ఈరీతిగా వ్రాయఁబడియున్నది.

సూ. ద స్తస్య శౌరసేన్యా మఖావచో స్తాః.

వృ. అనాదే రచః పర స్యాసంయు క్తతకారస్య దః స్యా చ్ఛౌరసేన్యామ్.

టీ. అనాదేః=మొందటిదియక్షరము కానటువంటి, అచః పరస్య = అచ్చుకంటెం బరమైయున్న, అసంయు క్త = సంయు క్తము కానటువంటి, తకారస్య = తవర్ణమునకు, ద స్స్యాత్=దవర్ణ మాను, శౌరసేన్యాం = శౌరసేనియందు. దీనిచేత తకారమునకు దవర్ణము వ స్తేను జూద మాయెను. ఇది శౌరసేనిభాష నైన తద్భవము.

ఇందునకుం బ్రయోగము సభాపర్వమునందు:—

క. జూద మిది యేల యుండుగుము, భేదము దమలోనం బుట్టుం దెలుచన యుష్మ
ద్భేదమునం జేసి యెగ్గు, లొప్పదిల్లు ధరిత్రిం బ్రజకు [1]భయజననంబై. (అ.2.135.)

నైషధమునందు:—

క. కాదంబరిం ద్రావింతురు, జూదం బాడింతుం గతలం జొక్కులం బెట్టక్
బైదలుల నియోగింతురు, వైదర్భతనూజమీందఁ వలపుడిగింతుక్. (అ.7.120.) 96

శాణశబ్దమునకు:—

సూ. శషసాః శుః.

వృ. శషసాః శుసంజ్ఞా స్యుః.

తే. శషసాః = శకారషకారసకారములు, శుసంజ్ఞాః = శు అనుసంజ్ఞ గలవి, స్యుః=అగును.

సూ. శో స్సత్.

వృ. శషసానాం సకార స్స్యా న్నిత్యమ్.

టీ. శషసానాం=శకారషకారసకారములకు, సకార స్స్యాత్ = సవర్ణ మవును, నిత్యం=నిత్యముగాను. ఈ సూత్రమువలన శకారమునకు సకారము వ స్తేను సాణ అని యుండెను.

సూ. నో ణనోః పైశాచ్యామ్.

వ. ణకారనకారయోః నకార స్స్యాత్ పైశాచ్యామ్.

టీ. ణకారనకారయోః = ణవర్ణ నవర్ణములకు రెంటికిన్ని, నకార స్స్యాత్ = నవర్ణ మవును, పైశాచ్యామ్=పైశాచియందు. ఇప్పుడు చెప్పినదానను ణకారమునకు నవర్ణము వ స్తేను సాన ఆయెను. ఇది పైశాచికభాష నైన తద్భవము.

---

1. భయజనకం బై (పెం).

రాజకులశబ్దమునకు:—

సూ. గజడదబఘఝఢధభాం కచటతపాః ఖఛఠథఫాః.

వృ. స్పర్శవర్గతృతీయచతుర్థానాం తత్తత్ప్రథమద్వితీయాః క్రమేణ స్యుః.

టీ. స్పర్శవర్గతృతీయచతుర్థానాం = స్పర్శవర్గములయందు మూఁడవ యక్షరములకున్ను నాలవవానికిన్ని, తత్తత్ప్రథమ ద్వితీయాః=ఆయావర్గములయొక్క మొదలి వర్ణములున్ను రెండవవర్ణములున్ను, క్రమేణ=వెంబడిగాను, స్యుః=అవును. ఈ సూత్రమున జకారమునకు చకారము వస్తేను రాచ యాయెను. కులమునకు కోలము ఆయెను. అది సమము చేస్తేను రాచకోలము. ఇది చూళికాపైశాచికాభాష నైన తద్భవము.

మూకశబ్దమునకు:—

సూ. అచోఽస్తావఖౌ కఖతథపఫాం గఘదధబభాః.

వృ. అచః పరేషా మసంయుక్తానా మనాదీనాం - కతపవర్గ ప్రథమద్వితీయానాం తృతీయచతుర్థాః క్రమేణ స్యుః.

టీ. అచః పరేషాం = అచ్చుకంటె పరము లైనటువంటివి, అసంయుక్తానాం = సంయుక్తాక్షరములుగానటువంటివి, అనాదీనాం=మొదలివిగానటువంటివి, కతపవర్గ ప్రథమ ద్వితీయానాం = కతపవర్గములయొక్క మొదలియక్షరములకున్ను, రెండవవానికిన్ని, తృతీయచతుర్థాః=తమవర్గములయందలి మూఁడవనాలవయవి, క్రమేణ = వెంబడిగాను, స్యుః = అవును. ఇది అపభ్రంశభాష నైన తద్భవము. ఇందువలనను కకారమునకు గకారము వస్తేను మూఁగ ఆయెను.

ఇందునకుఁ బ్రయోగము—

సారంగధరచరిత్రమునందు:—

చ. తలవరు లేఁగ లేఁగఁబులితండము నెత్తుటిజొత్తుకై హలా
హలిమెయి రాఁగ తాఁగలయినట్టి వృకంబులు క్రొంబొదల్ రొదల్
చిలుకుచు నీఁగ నీఁగలును జీమలు దొంతరలై పయిం బయిం
బిలబిల [1]మూఁగ మూఁగవలె బెగ్గిలి పల్కఁగ లేక వేదనన్. (ఆ. 3. 117.) 97

యక్షశబ్దమునకు:—

సూ. ఆదే ర్యో జః.

వృ. ఆదే ర్యస్య జ స్స్యాత్.

టీ. ఆదేః = శబ్దాది నుండేటటువంటి, యః = యకారమునకు, జః=జకారము, స్యాత్=అవును. దీనను మొదలి యకారమునకు జకారమువస్తేను జక్షః అనియుండెను.

---

1. మూఁగ మూఁగవలె (సూ). రెంటియందును అర్ధబిందు చిహ్నము శివ ప్రతిలోఁ గలదు (రా).

సూ. ఙః.

వృ. ఙ ఇత్యస్య జిహ్వామూలీయః స్యాత్.

టీ. ఙ ఇత్యస్య=ఙ అనేటటువంటి అక్షరమునకు, జిహ్వామూలీయః = జిహ్వామూలీయము, స్యాత్ =అగును. పాణినీయవ్యాకరణమునందు 'ౘక ఇతి జిహ్వామూలీయః' అన్నందుచేతను, జిహ్వామూలీయ మనఁగాను దాపలివిసర్గము గల[1] కకారమునకుఁ పేరు గాన ౘక అనునదిరాఁగా జఙక యని నిలిచెను. మునుపు చెప్పిన అఘోఙజఫక్కికా వచనమువలన జాక్షరము దంత్యాక్షర మాయెను. ఆంధ్రమునందు విసర్జనీయము లేదు గనక అది లోపమైతేను జక్క అని యుండె; అది తత్సమము చేస్తేను జక్కులు ఆయెను. ఇది మాగధీభాషనైన తద్భవము.

సీ. కుక్క [2]గోలెం బోలి కూళ గుండము కంతి గుజ్జు కరాటంబు గజ్జి కట్టె
సిక చేత చిక్కంబు చిన్నె సింగము సెజ్జ లక్క లచ్చన సుద్ది లయ్య లాగు
ప్రోడ పొత్తము పోఁక పుడమి బన్నము బూది బీరంబు బికిరంబు పిట్టు పుటము
పదినె వెన్నుఁడు వంక పడుగు పీడెము వన్నె రక్కసి రవణంబు రిక్క పగ్గ

తే. పీఁట దయ్యము తోరంబు పెట్టె మట్టి
బత్తి జతనంబు జాతర ముత్తియంబు
గాది కుప్పస మిటికె నిద్దంబు పెరిమె
యువము దెస డిగ్గి యనఁగఁ దద్భవము లయ్యె. 98

దీనికివివరము:—కుక్కురశబ్దమునకు కుక్క, గోళశబ్దమునకు గోలెము, [3]ఆలిశబ్దమునకు ఓలి, క్రూరశబ్దమునకు కూళ, కుండశబ్దమునకు గుండము. గ్రంథిశబ్దమునకు కంతి, కుబ్జశబ్దమునకు గుజ్జు, కరండశబ్దమునకు కరాటము, ఖర్జూశబ్దమునకు గజ్జి, కాష్ఠశబ్దమునకు కట్టె, శిఖాశబ్దమునకు సిక, చేష్టాశబ్దమునకు చేత, శిక్యశబ్దమునకు చిక్కము, చిహ్నశబ్దమునకు చిన్నె, సింహాశబ్దమునకు సింగము, శయ్యకు సెజ్జ, లాక్షకు లక్క, లాంఛనకు లచ్చన, సూక్తికి సుద్ది, లంజకు లయ్య, లంఘకు లాగు, ప్రౌఢకు ప్రోడ, పుస్తకమునకు పొత్తము, పూగకు పోఁక, పృథివికి పుడమి, భగ్నమునకు బన్నము, భూతికి బూది, వీరశబ్దమునకు బీరము, భిక్షకు బికిరము, పిష్టమునకు పిట్టు, స్ఫుటకు పుటము, వధూనికి వదినె, విష్ణునకు వెన్నుఁడు, వక్రమునకు వంక, పటునకు పడుగు, పీఠికి పిడ్డెము - పీడెము, వర్ణమునకు వన్నె, రక్షశ్శబ్దమునకు రక్కసి, రమ్యకు రవణము, ఋక్షమునకు రిక్క, ప్రగ్రహకు పగ్గె, విష్టరమునకు పీఁట, దైవమునకు దయ్యము, స్థూలమునకు తోరము - దూలము, పేటికి పెట్టె, మృత్తికకు మట్టి, భక్తికి బత్తి, యత్నశబ్దమునకు జతనము, యాత్రకు జాతర, మౌక్తికమునకు ముత్తి

1. కకారమునకు దాపలనున్న యర్ధవిసర్గమునకు జిహ్వామూలీయ మని సంజ్ఞ కాని అట్టి కకారమునకుఁగాదు. (వూ. ము.) 2. గోలెము బవి. (సూ). 3. అవిశబ్దమునకు బవి. (సూ). బవిశబ్దము నిఘంటులలోఁ గానరాదు. (రా).

యము, ధాత్రికి దాది, కూర్పాసమునకు కుప్పసము, ఇష్టికకు ఇటిక, స్నిగ్ధకు నిద్దము, ప్రేమకు పెరిమె, హిమమునకు ఇగము.

సూ. వాస్యాత్క్వచి ద్వకారో నాదిగత స్యాద్యవర్గసరళస్య.

అనియెడు నీ యాంధ్రశబ్దచింతామణి సూత్రమువలనఁ గకారమునకు వకారము వచ్చును ఇవ మని యనవచ్చు. దిశకు దెస, దీర్ఘికకు డిగ్గి. ఇట్టివి లోకంబున ననేకములు గలిగి యుండు నవి యెల్లఁ బ్రాకృతవ్యాకరణమువలనను సంస్కృతాది భాషా సప్తకంబున నుద్భవించి తద్భవముల వెలయు తెలుఁగుపలుకు లని తెలియవలయు.

## త్రిలింగశబ్దతద్భవము

క. శ్రీక్షితిధరకాళేశ, ద్రాక్షారామంబు లనఁగఁ దనరారెడు నీ
త్రిక్షేత్రంబులలింగము, లీ[1]క్షింపఁ ద్రిలింగసంజ్ఞ నెన్నిక కెక్కన్. 99

తే. తత్త్రిలింగనివాసమై తనరుకతన
నాంధ్రదేశంబు దాఁద్రిలింగాఖ్య మయ్యెఁ
దెలుఁగగుచుఁ దద్భవము దానివలనఁ బొడమె
[2]వెనుకఁ గొందఱు దానినే తెనుఁగు నంద్రు. 100

## ఆంధ్రభాషాభేదచతుష్టయము

మూ. సూ. తజ్జా సమా చదేశ్యా గ్రామ్యా చేయం చతుర్విధా భవతి.

తే. దైత్యదమన తత్సమమనఁ దద్భవమన
దేశ్యమన గ్రామ్యభాష నాఁ దెనుఁగు నాల్గు
[3]విధము లందుఁ దత్సమమును విడిచి మూఁడు
నాంధ్రములె యొందు నందు గ్రామ్యంబు [4]దిగుఁగు. 101

## తజ్జలక్షణము

మూ. సూ.—ప్రకృతిద్వయజా తజ్జా. 9.

తే. [5]వఱలు సిద్ధాక్షరములలో వర్ణసమితి, దూలఁ బోఁ బల్క నర్థంబు [6]దొడరుకొనుచు
సంస్కృతప్రాకృతాఖ్యభాషాద్వయమున, నుద్భవించిన తెలుఁగులు తద్భవములు.

## తత్సమలక్షణము

మూ. సూ.—తుల్యా తు సమా. 10.

క. తెనుఁగువిభక్తుల కడపలఁ, దనరారఁగ నిలుప సంస్కృతప్రాకృతముల్
గనుపట్టుఁ దత్సమములన, వనజాక్షుఁడు జముఁడు దనుజవరులకు ననఁగన్. 103

1. క్షితిని (ష); క్షమను (పెం. వా). 2. వెనక (పెం. వా). 3. విధములగు వందుఁ దత్సమవిడిచి (సూ). 4. దిగును (ష); దిగుడు (పెం. వా). 5. వరస. 6. దోఁపు (ష. పెం).

## దేశ్యలక్షణములు

మూ. సూ.—ప్రవాహినీ దేశ్యా. 11.

క. ఏదేశముమానవులకు, నా దేశముభాష దేశ్య మయ్యె గరుత్మ
త్సాది జనవ్యవహారము,చే దాని నెఱింగి కృతులఁ జెప్పఁగ నొప్పున్. 104

### ఆంధ్ర దేశ్య భేదంబులు

క. జలశయన యాంధ్రదేశ్యం,బులు రెండు దెఱఁగు లయ్యె భువి శుద్ధాంధ్రం
బులు నన్యదేశజాంధ్రం,బులు నాఁ గామెపలినామపురవరధామా. 105

తే. ఆంధ్రదేశపురస్థాయు లైనసకల, జనములకును మఱుంగుదేశంబు లేక
లేటతెల్లమిగాఁ బల్కుమాట లెల్ల, నవని శుద్ధాంధ్రదేశ్యంబు లనఁగఁబడును. 106

క. పాలును బెరుఁగును నెయ్యిని, వాలాయం బుట్టిఁ బట్టి వంచుక త్రాగెన్
లో లెక్కక నీబిడ్డఁడు, [1]జోలి యిఁకేమున్నదన్న శుద్ధాంధ్రంబుల్. 107

క. కేశవ యాంధ్రులు నానా, దేశంబులయందు నిలిచి తెలుఁగులె తత్త
ద్దేశోక్తు లంటఁ బలికిన, నా శబ్దము లన్యదేశజాంధ్రము లయ్యెన్. 108

సీ. అలంబు చివ్వ కయ్యము పోరు బవరంబు దుర మరి యొంటరి దొమ్మి కలను
వెలఁది యింతి పడంతి యెలనాగ చెలి బోటి పొలఁతి తొయ్యలి నాతి మెలఁత నెలఁత
మేను వేసవి మోవి గోను డెందం బక్కు వీను లుల్లము కేలు వెన్ను నొసలు
వావిరి యేడ్తెఱ పఱలుట కొఱలుట నలి నొగి మొగిఁ బర్వ నలువు పొలుపు

తే. నెల తునుక వాఁక వలపంత నెమ్మి నెఱక, లారజము సోయగము గోనయంబు చిలువ
[2]పొల్ల చెచ్చెర ఘుక్కవ తెల్లమి యనఁ, దనరు నిటు లన్యదేశజాంధ్రములు పెక్కు.

క. నెలకొనుసంస్కృతతత్సమ,ములు దొరలక తజ్జదేశ్యముల మాటను సం
ధిని కేవలాంధ్రములు నా, నలరుఁ గృతుల నచ్చ తెనుఁగు లందురు తెలుఁగునన్.

క. తెలుఁగుమఱుంగులు ప్రాఁదెనుఁ,గులు తద్భవదేశ్యములును గూర్చి మృదుపదం
బులు గాఁగ నచ్చతెనుఁగులు, మెలఁకువతోఁ జెప్పఁ దగు శమీప్రాంతగృహా. 111

తే. అబ్ధిమేఖల కుదయించినట్టి సీతఁ
జేకొనియె రాఘవుం డని చెప్పుచోటఁ
గడలిమొలనూలిచేడియ గనిన పడుచుఁ
దెచ్చుకొనె రాముఁ డనఁగను దెనుఁగు[3]మఱుఁగు. 112

---

1. జోలెడేదేమన్నయనఁగ (సూ). 2. యెల్లి (ప). యెల్ల (వా). 3. లమరు (పె).

క. తొల్లింటిజనులవాక్యము, లెల్లను బ్రాఁదెనుఁగు లయ్యె నిప్పటివారల్
చెల్లుబడి నాడునవియే, [1]దెల్లమిగా నింకఁ బ్రాఁతతెలుఁగులు నృహరీ. 113

క. పుడమియు సిరియును బడఁతులు, వెడవిలుతుఁడు పసిఁడికడుపువేల్పును గోడుకుల్
గడలి విడిమట్టు పాపల, నడుచు [2]గుఱ్ఱముసామి కనఁగ నచ్చతెనుంగుల్. 114

## పూర్వకవిసమయసిద్ధపదంబులు

మూ. సూ.—సిద్ధిర్లోకాద్ద్రష్టవ్యా లోకోఽనాద్యదృశశ్చ నిత్యశ్చ. 12.

క. కవులకు దేశ్యము లోక, వ్యవహారమువలనఁ దెలియనగు నా లోక
వ్యవహారము నిత్యంబును, భువి నిజదేశమున యోగ్యమును నగుఁ గృష్ణా. 115

తే. అవనియందు లోకవ్యవహార మనఁగ, నాత్మదేశంబులను బెద్ద లైనవార
లాడు భాషావిశేషవాక్యములలోన, [3]వాడుకకు వచ్చునవి దుగ్ధవార్ధిశయన. 116

వ. అవి యెయ్యవి యనిన. 117

సీ. మదిరాక్షి చెవులు తోమ్మిది లెక్క లనరాదు మద్దియకసులు తప్పు లనరాదు
శుకవాణిబుగ్గలు ముకురంబు లనరాదు చెలిపండ్లు మల్లెమొగ్గ లనరాదు
గజయానచండ్లు బంగరుకుండ లనరాదు సతిబొడ్డు సుడిని మెచ్చ దనరాదు
సరసిజాననముడ్డి సైకతం బనరాదు హరిమధ్యకాళ్లు గుళ్లనఁగరాదు

తే. క్రమత వీనికి వీనులు కన్నదోయి
చెక్కులును బలువరుసలు నిక్కఁజన్నుఁ
గవయుఁ బొక్కిలి పిఱుఁదు చొక్కంపుటడుగు
లనుచు మును వాడి రవియ చేకొనఁగవలయు. 118

తే. రణము [4]వర్ణించుచో వీరరసమునందు
యుద్ధపంచకమునఁ దెక్కడెొజ్జ సారెఁ
గాళ్లటంచు రచించుట గాంచి కవులు
చెప్పకొనిరి మీఁగాళ్లని చెలఁగి కృతుల. 119

సారంగధరచరిత్రమునందు సీసపాదము:—

సీ. ఉన్మత్తపువ్వు నా[5]సారపైనచ్చిట్లు[6]చెలఁగి మీఁగాళ్లపైఁ జిందులాడ (1-120)

---

1. దెల్లమిగా నింతఁ బ్రాఁతతెనుఁగులు నృహరీ (వా); దెల్లమిగా వింకఁ బ్రాఁతతెనుఁగులకు హరీ (ప). 2. గుఱుఁడు (పెం). 3. వాడికకు (వ. వా. పెం). 4. వర్ణింపుచో (వా). 5. నొకపై (ప); నొరపైన (పెం). 6. చెలిక (వ. వా. పెం).

## గ్రామ్యపదలక్షణము

**మూ. సూ.**—సంస్కారార్థో నియమోఽనియమాద్గ్రామ్యం హేయత్త్వపభ్రంశః.

తే. ఉక్తలక్షణవంతమై యుండునట్టి, కావ్యముల[1] నెర్గవలయు సంస్కార మనుచు
హీనలక్షణకావ్యంబు నెఱుఁగవలయు, గ్రామ్య మనుచు నపభ్రంశకంబు ననుచు.

క. లక్షణవిరహితకావ్యము, పక్షిగమన గ్రామ్య మనఁగఁబడు నది పెద్దల్
వీక్షింపరు లక్షణయుత, మీ క్షితి నగ్రామ్య మని గ్రహింతురు ప్రీతిన్. 121

తే. క్షితి నపభ్రంశపదములు కృతులయందుఁ, గమలలోచన చెప్ప నర్హములు గావు
గాన నాంధ్రకవీంద్రులు వానిఁ దెలియ, వలయు నీ శాస్త్రమునఁ దమ తలఁపు నిలిపి.

తే. చులుకఁగా గ్రామ్యజనములు వలుకునట్టి, తెనుఁగుమాటలు గ్రామ్యంబు లనఁగఁబడియె
వర్ణలోపంబు నొంది కావ్యములఁ జొరవు, పరులఁ దెగడెడుచో నొప్పుఁ బాలదొంగ.

తే. అక్షరవిలోపమై యుండునట్టి పలుఁకు, గ్రామ్య మననొప్పు నది యపభ్రంశకంబు
ననఁగఁబడు ధాత్రి నాకడ కాడ యనుచు, నడుమ నున్నకకారంబు నుడువకున్న.

క. వస్తాఁడా హరి సొమ్ములు, దెస్తాఁడా గొల్ల [2]దడంట దిట్టక కరుణన్
జూస్తాఁడా కౌఁగిలి నేఁ, డిస్తాఁడా చెప్పు మన్న నివి గ్రామ్యోక్తుల్. 125

## అగ్రామ్యపదలక్షణము

**మూ. సూ.** విరళాః పేచోషాదికశబ్దాః [3]ప్రవ్యాహరస్తు శబ్దజ్ఞాః,
ఇహ తు ప్రవ్యాహార్యం సజ్జ్యోతితసుప్రసిద్ధమేవ పదమ్.

సీ. ధరణిపైఁ బుట్టి మధ్యమపురుషంబున బహువచనంబునఁ బరఁగుచుండు
నట్టి పేచోషశబ్దాదులు కడు నప్రసిద్ధంబు లగు నైన శేషశయన
వేదంబునందు వావిరిఁ బ్రయోగంబులు [4]గలవు నవార్త్తికంబులను "నోఽథ
వాస్త్యప్రయుక్త" యటంచు మహాభాష్యమునఁ బతంజలి యుక్తములె యటంచుఁ

---

1. 'నెఱుఁగవలయు' పూ.ము. వ్రాఁతఅచ్చుప్రతుల నటులున్నను పైరీతి స్వల్పమైన సవరణతో గణభంగదోషమును సవరింపనగును. 'చూచి కాకెల్లవచ్చునె సుద్ద తాత' నన్ని-కుమా. ప్ర. యుక్తలక్షణ... కావ్యము నెఱుఁగవలయు (శివ). 2. దండు (ప); దంట (వా. పెం.) 3. ప్రత్యాహరస్తు—ప్రత్యాహార్యం (ప). 4. గలవు గావున వార్త్తికంబునొద్ద "నాస్త్యప్రయుక్త" (ప); గలవు నవార్త్తికంబులును "నోఽథ, నస్త్యప్రయుక్త" (వా).

తే. బలుకుటను సంస్కృతమున శబ్దజ్ఞు లప్రసిద్ధశబ్దంబులను గూర్చి చెప్పుచుండు
రాంధ్రమున సుప్రసిద్ధంబులైన పూర్వ, కవిసమయసిద్ధపదములుగాని చొరవు. 126

వ. పేచ యన్నందుకు ధాతువు 'డుపచష్పాకే' యనునది. 'ఊష' యన్నందుకు ధాతువు 'వస నివాసే' యనునది. 127

తే. గ్రామ్యమైన నాంధ్రకవులు సంకేతిత, సుప్రసిద్ధ మనుచు సూత్రమునను
గలిమిఁ బూర్వసుకవికావ్యోక్తములు ప్రసిద్ధంబు లైనఁ గూర్పఁదలఁతు [1]రెపుడు.

వ. అది యెట్లనినఁ గనియె ననవలసిన భూతార్థక్రియాపదైకవచనంబునందు వర్ణలోపము చేసి కనెనఁట యని గ్రామ్యపదముగా వాగనుశాసనులు ప్రయోగించినారు గనుక నది సాధనము చేసికొని యాంధ్రకవితాపితామహుఁడు కొనియె ననుటకుఁ గొనె నని చెప్పె నవి యెవ్వి యనిన. 129

ఆదిపర్వమునందు:—

క. [2]వనకన్యకయఁట చేనఁట, వనమున గాంధర్వమున వివాహంబఁట నం
దనుఁ గనెనఁట మఱచితినఁట, వినఁగూడునె యిట్టిభంగి విపరీతోక్తుల్. 130

విష్ణుచిత్తీయమునందు:—

[3]ఉ. పూని ముకుందునాజ్ఞఁ గనుబొమ్మనె [4]కాంచి యజాండభాండముల్
వానను మీఁదఁ బోవ [5]నడువంగొనెఁ ద న్నన నగ్రనిశ్చల
త్వానఁ దలత్వనిష్ఠలె సమస్తజగంబులజాడ్యచేతనల్
గా నుతికెక్కు సైన్యపతికాంచనవేత్రము నాశ్రయించెదన్. 131

కందగీతిగర్భచంపకమాల

చ. వరహరి కేశవా వనజనాభ రమాధవ వంశహస్త బం
ధురసుగుణాకరా దురితదూర జనార్దన దోర్బలాఢ్య గీ
ర్వర గిరిశస్తుతా మురహరా సురపూజితముఖ్యపాద సుం
దర పురుషాగ్రణీ భుజగతల్ప శచీపతిపుత్రరక్షణా. 132

గర్భకందము

క. హరి కేశవా వనజనాభ రమాధవ వంశహస్త బంధురసుగుణా
గిరిశస్తుతా మురహరా, సురపూజితముఖ్యపాద సుందరపురుషా. 133

1. రెదను (వా); రెలమి (పెం). 2. ఈ పద్యము పినవీరభద్రుని శృంగారశాకుంతలమునందుఁ గనఁబడును గాని ఆదిపర్వమునందుఁ గనఁబడదు. చూ. శృం. శా. 3 ఆ. 114 ప. 3. ఇది ఆముక్తమాల్యదకు నామాంతరము (రా). 4. దాల్చి (పెం). 5. వడవం (పు. వా. పెం).

### గర్భగీతము

తే. వనజనాభ రమాధన వంశహస్త, దురితదూర జనార్దన దోర్బలాఢ్య
మురహరా సురపూజితముఖ్యపాద, భుజగతల్ప శచీపతిపుత్రరక్ష. 134

### ఆశ్వాసాంత గద్యము

ఇది శ్రీమదాపస్తంబసూత్ర, భారద్వాజసగోత్ర, కామెపల్లీపురమందిర, నందనందన చరణారవిందవందనాభిలాషమనీషాప్రాభవ, వెంకనార్యతనూభవ, విద్యావిశేషసురాచార్య, కాకునూర్యప్పకవివర్యవిరచితంబైన యాంధ్రశబ్దచింతామణి యను నాంధ్రవ్యాకరణశాస్త్రంబునందు గోవింద, కౌస్తుభ, వైజయంతీ, శ్రీవత్స, మురళీ, పంచాయుధ, పీతాంబర, బర్హిబర్హ, లక్ష్మీ, క్షమా, నంత, గరుడ, విష్వక్సేన, మారుతి, పరమభాగవత, విధాతృ, శారదా, శివ, భవానీ, గణేశ, గుహ, లోకపాల, గ్రహ, పురాతన వర్తమాన భావికవిగురునమస్కారంబును, స్వప్నప్రకారంబును, భగవద్వాక్యంబును, గ్రంథప్రభావంబును, కర్తృవంశావతారంబును, కవివిచారంబును, షష్ఠ్యంతములును, మూలసూత్రంబులును, బూర్వగ్రంథ నామ సంగ్రహంబును, ప్రబంధమహిమయుఁ, గావ్యభేదంబులును, శబ్దార్థలక్షణాలంకారదోషంబులును, వాక్యలక్షణంబును, రసవివేకంబును, పంచవిధభావంబులును, శృంగారరసస్వరూపంబును, అష్టరసప్రపంచంబును, నాయకనిర్ణయంబును, సుకవిమాహాత్మ్యంబును, దల్లక్షణంబును, సప్తవిధకవులును, గుకవినిరసనంబును, కవితాప్రశంసయు, దేశభాషావిశేషంబులును, భాషాష్టకోత్పత్తివివరణంబులును, ప్రకృతివికృతిభేదంబులును, దద్భవంబులును, ఆంధ్రభాషాభేదచతుష్టయంబును, బూర్వకవిసమయసిద్ధపదంబులును, గ్రామ్యాగ్రామ్యంబులును గల భాషాపరిచ్ఛేదం బను ప్రథమాశ్వాసము.

# వర్ణపరిచ్ఛేదము

## ద్వితీయాశ్వాసము




మహితకొండవీటి
నామకరమ్యగిరిదుర్గనగరాభిమత
శ్రీమకరవాహనహరి
ద్స్వామిస్థితకామెపల్లిపురవరశరణా. 1

క. అవధారు శబ్దశాసను, డపనిఁ గలియుగమున కాది నా రాజమహేం
ద్రవరంబునఁ జెప్పిన యాంధ్రవచోవ్యాకరణసూత్రతతిఁ దెనుఁగింతున్. 2

క. శిష్టార్యావింశతి విస్పష్టముగా నక్షరప్రపంచము లోకో
త్కృష్టుఁడు నన్నయ సుకవుల, కిష్టాపత్తిగ వచించె నెంతయుఁ బ్రీతిన్. 3

వర్ణపరిచ్ఛేదమూలసూత్రంబులు; ఆర్యావృత్తశ్లోకంబులు:—

ప్రాణా స్సమాసతోఽచో బిందు రనుస్వార ఏ జథో వక్రః,
వక్రతమ ఋజ్ఝల స్స్యు స్సమాసతః ప్రాణినో ద్రుతాఖ్యో నః. 1
కచటతపాః పరుషాఖ్యా గజడదబా స్తు సరళాః స్థిరా ఇతరే,
ఏతా స్సంజ్ఞా స్సర్వా జ్ఞాత్వా పశ్చా త్ప్రవర్తయే దత్ర. 2
బాలేందుపరిధిశృంగావర్తకుశగ్రంథిదాత్రపరశుసమాః,
ఆద్యా ఇభకరతుల్యా స్తద్దీర్ఘా శ్శూలసన్నిభా వన్యే. 3
సిద్ధ స్సాధ్య శ్చానుస్వారః పూర్ణార్ధభేదతో ద్వివిధః,
హ్రస్వా త్పూర్ణోఽపి భవే ద్దీర్ఘా చ్చ ఖ్ఖండ ఏవ స జ్ఞేయః. 4
దరశార్ఙ్గపిప్పలఫలాంకుశపన్నగసన్నిభాః క్రమా త్పరుషాః,
స్తంభవిరేఖాధిక్యై స్త ఏవ వర్గద్వితీయవర్ణాద్యాః. 5

[1]కీరతరిహాస్తిమస్తకశుక్తితులాసనవితర్దిసీరసమాః,
అంతస్థా శ్చోష్మాణో దంత్య చజౌ గురురలౌ చ బిందుయుతౌ. 6
ఆద్యాయాః పఞ్చాశ ద్వర్ణాః ప్రకృతేస్తు తే దశోనా స్స్యుః,
సప్తత్రింశ దిహాన్యే చానుప్రవిశంతి శబ్దయోగవశాత్. 7
ద్వివిధా దిదుదేదో తోచో వక్రతమా వనుస్వారౌ,
కగచజయుగటడణతదన పబమయరయుగలయుగవసహాశ్చ హలః. 8
వికృతిపదాదౌ ప్రథమా న్తస్థ తృతీయానునాసికా న స్తః,
అయిగవుగాదేశౌ స్తః క్రమేణ సర్వత్ర వక్రతమయో ర్వా. 9
వా స్యా త్క్వచి ద్వకారో నాదిగత స్యాద్యవర్గసరళస్య,
అ ద్దన్త్యస్తాలవ్య శ్చ ర్వక్రః స్యా న్మిథ స్సవర్ణశ్చ. 10
లఘవోఽలఘవ శ్చేతి ద్వేధా న్తస్థా న్విద న్తి శాస్తారః,
అన్యోఽన్య వ్యాకరణస్పృష్టా ర స్త్వత్ర గృహ్యతే ద్వివిధః. 11
ఆద్యః క్రియాసు [2]భూతాద్యర్థసముద్యోతితం వినా సర్వః,
యశ్రుతి మార్యా లఘుయం ప్రవద న్తి ప్రాణతః పరం ప్రాణమ్. 12
క్వచిదపి న స్త ఉదోతౌ దంతోష్ఠభవస్య వికృతి శబ్దాదౌ,
నాన్యేషాం వైధర్మ్యం లఘ్వలఘూనాం రయోస్తు నిత్యం స్యాత్. 13
శుభవర్ణా శ్శుభశబ్దా యే చ శుభగణా స్త ఏవ కావ్యాదౌ,
గ్రాహ్యాః పురాస్త్రరసగిరిరుద్రేష్వ[3]కచటహమాత్రకా నింద్యాః. 14
[4]ఆద్యో వళి ర్ద్వితీయో వర్ణః ప్రాసోఽత్ర పాదపాదేషు,
స్వస్వచరణేషు పూర్వః ప్రాస స్సర్వేషు చైక ఏవ స్యాత్. 15
వృత్తం జాతి శ్చేతి ద్వివిధం పద్యం గణై ర్నిసర్గాఖ్యైః,
సంబద్ధం వృత్తం స్యా దుపగణమాత్రాభి రన్వితా జాతిః. 16
శాస్తార ఏకమాత్రాం లఘో ర్ద్విమాత్రే గురో రితి వద న్తి,
గౌ లౌ గగలలసంజ్ఞౌ గ్లో హగణో లఘుగురూ లగో వగణః. 17
గత్రితయం లత్రితయం మనసంజ్ఞౌ వాద్యమధ్యమాంత్యార్ణాః,
గురవ శ్చే ద్భజసగణా లఘవో యది యరతసంజ్ఞకాః క్రమతః. 18

1. కీరనాహస్తి (ప. వా.) 2. భూతార్థద్యోతిన మాద్యగం వినా. 3. కచటత పానింద్యాః (నూ). 4. 15-20 శ్లోకముల వివరణము తృతీయాశ్వాసములో ఉన్నది.

మిత్రౌ నగలా వింద్రా నలనగసలభరతా శ్చంద్రా మలఘుః,
రలరగతలతగనవనహా భలభగసలలనలలనగగసవసహాః. 19

దీర్ఘ స్సంయుక్తాద్యః పూర్ణానుస్వారపూర్వవర్ణశ్చ,
ఏతే గురవ శ్శేషా స్సర్వే లఘ్వక్షరా ఇతి జ్ఞేయాః. 20

ఇతి శ్రీసకలభాషావాగనుశాసన నన్నయభట్టవిరచితాన్ధ్రశబ్ద
చిన్తామణౌ వర్ణపరిచ్ఛేదో ద్వితీయః.

వ. ఈ శ్లోకంబు లిరువదియును నలువదిరెండు సూత్రంబు లయ్యె నవి యెల్ల నిందు వివరించెద. 4

తే. కాంచనాంబర కవితాప్రపంచ మెల్ల, వర్ణరూపంబు గాన నా వర్ణములకుఁ
గలుగుభేదంబు లెఱుఁగక కవిత పలుక, వలను గామి వచించెద వాని నెల్ల. 5

## వర్ణసంజ్ఞలు

క. మాతృకలు వర్ణములు మఱి, భూతలమున వర్ణములు [1]లిపులు వ్రాలు ననఁగ
ద్వైతేయవిభంజన వి,ఖ్యాతము లగు నక్షరాహ్వయము లివి యైదున్. 6

సీ. ఆదులు పదియాఱు నచ్చులు స్వరములు ముప్పదిమూఁడు కా మొదలు గాఁగ
నవనిపై హల్లులు వ్యంజనమ్ములు నయ్యె నీ వ్యంజనములలో నిరువదేను
స్పర్శము ల్మొదలి యక్షరములు పయి నాల్గు నంతస్థములు యకారాదికములు
పిదప శవర్ణంబు మొదలుగా నూష్మంబు లయ్యె నా స్పర్శంబు లైదునైదు

తే. వర్ణములు గూడ నొక్కొక్క వర్గ మగును, వర్గవర్గంబుతుద లేను వర్ణములను
ధరణి ననునాసికము లనఁ బరఁగుచుండు, జమ్మికడఁ గామెపలినున్న చక్రపాణి. 7

సీ. అత్వంబ కారంబు ననఁ దలకట్టు నిక్కము దానిదీర్ఘ మాకార మయ్యె
నిత్వంబి కారంబు నిది [2]పిల్లగుడుసుపే రీ కార మన గుడి నెసఁగు దీర్ఘ
మమరు నుత్వము నుకారము ననఁ గుఱుచకొ మ్మూకార మన దీర్ఘ యుక్తశృంగ
మొనరు వట్రువ ఋత్వమును ఋకారము నన దీనిఁ జాఁపిన ఋత్వదీర్ఘ[3] మనఁగ

తే. నేత్వ మేకార మైకార మైత్వ మయ్యె, నోత్వ మోకార మౌకార మౌత్వ మయ్యె
వసుధఁ బ్రత్యేకలిపులైన వ్యంజనముల, [4]పైనిఁ గూడిన నిమ్మాడ్కిఁ బలుకఁబడును.

తే. అత్తు నాత్తును మఱి యిత్తు నీత్తు నుత్తు, నూత్తు నేత్తును వెస నైత్తు నోత్తు నౌత్తు
వరుసతో నివి పదియును స్వరములయ్యె, ముంగలఁ బ్రయోగములఁ దెలియంగవలయు.

---

1. లిఫులు - అని ప్రాచీనముద్రణము. 2. పిల్లగుడికిఁ బేరు (సూ). 3. మయ్యె (సూ). 4. పైన (సూ).

క. నిడుదలు నెఱియక్కరములు, పొడవులు చాఁపులును దీర్ఘములు నన నొక్కకై
వడి వ్రాలు కుఱుచ లలరును, గిడుసులు గుజ్జులు ననంగ క్షితి హ్రస్వలిపుల్. 10

క. సున్న యన బొట్టనంగా, నెన్న ననుస్వారసంజ్ఞ [1]లిల వలపల రెం
డున్నవి విసర్గ మనఁజనుఁ, బన్నగపతిశయన ధవళపంకజనయనా. 11

ఆ. గజడదబలు మొదలుగా వర్గవర్గంబు, నందు మూఁడు మూఁడు హా యొకండు
యాదిలిపులు నాల్గు నన్యవర్ణయుతంబు, లైన శసలు ఘోష లనఁగఁ దనరు. 12

తే. ఒత్తు జడ్డయు ద్విత్వసంయుక్తములును, మహిని సంయోగవర్ణనామంబు లయ్యెఁ
బై స్వరము లేక కడుఁ దేలఁబలుకఁబడిన, వ్యంజనంబులు పొల్లు లనం జెలంగు. 13

మూ. సూ.—ప్రాణా స్సమాసతోఽచో బిన్దు రనుస్వార ఏ జథో వక్రః,
వక్రతమ ఐజ్ఝల స్స్యు స్సమాసతః ప్రాణినో ద్రుతాఖ్యో నః,
కచటతపాః పరుషాఖ్యా గజడదబా స్తు సరళా స్థిరా ఇతరే,
ఏతా స్సంజ్ఞా స్సర్వా జ్ఞాత్వా పశ్చా త్ప్రవర్తయే దత్ర. 1

సీ. అచ్చులు ప్రాణంబు లని చెప్పఁబడు ననుస్వారంబు బిందుప్రశస్తిఁ గాంచు
నేత్వంబు నోత్వంబు నెసఁగు వక్రము లన వానిమీఁదివి రెండు వక్రతమము
లిలఁ బ్రాణు లనుపేర నేపారు హల్లులు ద్రుత మనంగ నకార మతిశయిల్లు
వర్గాదులను గల వర్ణంబు లైదును బరుషనామంబులై ప్రణుతి కెక్కుఁ

తే. బంచవర్గ తృతీయముల్ పరమపురుష, సరళముల్ శేషహల్లులు స్థిరము లయ్యె
శబ్దశాస్త్రంబు గాన నీసంజ్ఞ లెల్లఁ, దెలిసి యీ గ్రంథమునఁ బ్రవర్తించు టొప్పు.

వర్ణోత్పత్తిస్థానంబులు

క. ఇమ్మహి ద్విస్థానోద్భ్వ,తమ్ములు వక్రయమవక్రతమయుగ్మవకా
రమ్ములు మఱి యేకస్థల, జన్ము లితరవర్ణములు భుజంగశయనా. 15

సీ. ఉదయించు నత్వంబు మొదలుగా రెండు రెండచ్చులు పరుసతో నఱుతఁ దాలు
వుల నోష్ఠముల నవుదల దంతములఁ గంఠతాలువుల గళోష్ఠతలములందు
బొట్టు నాసను గళంబున విసర్గంబును గాదివర్ణము లైదు నైదు గూడి
తగఁ గంఠతాలుమస్తకరదోష్ఠముల నంతస్థము ల్తాలుమస్తకరదముల

తే. నూర్ధ్వదంతాధరంబుల నూష్మలిపులు, క్రమతఁ దాలుశిరోదంతకంఠములను
బలువువ్రాయి శిరంబున బండిరాను, స్థానభేదంబు లేదు దంతములఁ జజలు. 16

వ. బలువువ్రాయి యనఁగా దొడ్డళకార మనుట. 17

1. లీవలపల (సూ).

తే. [1]అలఘుఅళదంత్యచజలకు హ్రస్వవక్రములకు నిందుఁ బ్రత్యేకించి పలుకనియెడఁ
గ్రమతఁ దత్తత్ప్రధానవర్ణముల కెవ్వి, యవియె వానికి నని తెలియంగ వలయు.

తే. అచ్చు లొక వర్గ మయ్యె స్పర్శాక్షరంబు,లయిదు వర్గంబు లయ్యె యాద్యష్టకంబు
దలఁప నొకవర్గ మింకఁ గొందఱమతంబు, నూష్మములు నొకవర్గమై యొప్పుచుండు.

శుద్ధాంధ్రలిపి లేఖనక్రమము

క. మొదల నకారాద్యచ్చులు, పదియాఱును వానిపిఱుఁద బాణాసురదు
ర్మదహర కాదిలిపులు ము,ప్పదిమూఁడును బుట్టి వాక్ప్రపంచం బయ్యెన్. 20

మూ. సూ.—బాలేందుపరిధిశృంగావర్తకుశగ్రంథిదాత్రపరశుసమాః,
ఆద్యా ఇభకరతుల్యా స్తద్దీర్ఘా శూలసన్నిభా వన్యే. 2

సీ. విదియచంద్రునిమాడ్కి వెలయు నత్వము దానికుడివంక శృంగంబుకొన గుణింపఁ
బ్రభవించు దక్కినప్రాణంబు లెల్లను నడిమికి గుడిఁ జుట్టి విడువ నిత్తు
కుడి నావుకొమ్ముకైవడి వ్రాయ నుత్వంబు క్రిందను సుడి నిల్ప ఋత్వ మయ్యె
వలపల మీఁదికి మెలి గొన్న హ్రస్వర మెడమ నెత్వం బొప్పుఁ గొడవలిక్రియ

తే. యామ్యమున గండ్రగొడ్డలియట్లొనర్పఁ,గ్రాలు నోత్వ మిన్నింటిదీర్ఘములు కుడిని
గరికరాకృతిఁ [2]దనరుడాకడవలపల, నమరు నైత్వౌత్వములు త్రిశూలములకరణి.

*వీనికి రూపములు

-ఇది అకారము, -ఇది ఆకారము, -ఇది ఇకారము, -ఇది ఈకారము, -ఇది ఉకారము, -ఇది ఊకారము, -ఇది ఋకారము, -ఇది ౠకారము, -ఇది ఌకారము, -ఇది ౡకారము, -ఇది ఎకారము, -ఇది ఏకారము, -ఇది ఐకారము, -ఇది ఒకారము, -ఇది ఓకారము, -ఇది ఔకారము, "అనుక్తమన్యతః" అను న్యాయముచేత నీశబ్దానుశాసనసూత్రమునందుఁ జెప్పిన యనుస్వారమును, విసర్జనీయమును, సకలదేశప్రశస్తమైన నాగరలిపియందు నెటువలెనో యటులఁ దెలిసికొనునది. తత్స్వరూపంబులు-ం-అం ఇది పూర్ణానుస్వారము, ః-అః-ఇది విసర్జనీయము, ఇవి యచ్చు లనంబడు.

అనుస్వారనిర్ణయము

మూ. సూ.—సిద్ధస్సాధ్య శ్చానుస్వారః పూర్ణార్ధభేదతో ద్వివిధః,
హ్రస్వా త్పూర్ణోఽపి భవే ద్దీర్ఘాచ్చే త్ఖండ ఏవ స జ్ఞేయః. 3

1. అలఘురల (మూ). 2. నిలుపంగవరుసఁదనరు (మూ). * ఈ రూపములు సరియయినవి కావు. పూర్వకాలపు వ్రాఁత ఎట్లుండెనో తెలియగోరువారు బర్నెలు వ్రాసిన 'సౌతిండియన్ పేలియోగ్రఫీ' అనేపుస్తకముగాని, ఆంధ్రవిజ్ఞానసర్వస్వముగాని చూడవలెను. (గి). వీని రూపములు-శివ-ప్రతిలో భిన్నములుగా నున్నవి (రా).

సీ. పొసఁగ దీర్ఘాఖండపూర్ణంబు లను పదంబులు సంజ్ఞలౌ గట్టిబొట్టులకును
హ్రస్వఖండార్ధంబు లను శబ్దములు మూఁడు నరసున్నలకుఁ బేరు లగుచు నుండు
శబ్దంబుతోడనె జనియించు బిందువు సిద్ధంబు నాఁగఁ బ్రసిద్ధ మగును
బుడమి నకారంబు చెడి యైన యా యనుస్వారంబు సాధ్యసంజ్ఞ[1]మున వెలయు
తే. నిక్క మీ సిద్ధసాధ్యంబు లొక్కటొకటి, ఖండపూర్ణంబు లన ద్విప్రకార మయ్యె
నవియె క్రమ్మఱ హ్రస్వదీర్ఘాక్షరముల, మీఁద రెండు తెఱంగులై మెఱయుఁ గృష్ణ.
ఆ. వెలఁది చెలఁగి నిన్ను దలఁచిన నన సిద్ధ, ఖండబిందు వయ్యెఁ గమలనాభ
పొంకమైన యింతిపొందు సొం పగు నన, సిద్ధపూర్ణబిందు విద్ధచరిత. 23
క. భువిఁ గొలిచెదఁ గాళిందీ, ధవు ననుచును వికృతులను ద్రుతంబులు చెడి బిం
దువు లైన వెల్ల సాన్వో, ద్భవఖండము లయ్యెఁ గామపల్లినివేశా. 24
క. కెందమ్ములు చెంగలువలు, ముందర చెంగావిచీర ముంగొం గన నీ
చందము లెల్లను నందిత, బృందారక సాధ్యపూర్ణబిందువు లయ్యెన్. 25
మూ. సూ:— హ్రస్వాత్పూర్ణోఽపి భవేద్దీర్ఘాచ్ఛే ఖండ ఏవ వి(స)జ్ఞేయః.
తే. జగతిపై సిద్ధసాధ్యసంజ్ఞలఁ బొసంగు
ఖండములు హ్రస్వలిపులపై నుండెనేని
వానిఁ బూర్ణంబులను జేయవచ్చుఁ గృతులఁ
బూర్ణములు ఖండములు సేయఁ బొసఁగ వెందు. 26
క. కొలఁకులకుఁ గొలంకులు నాఁ, దలఁపులకుఁ దలంపు లిట్లు తగ సిద్ధములై
చెలు వందుఁ జిఱుతసున్నలు, వెలయును బూర్ణంబు లగుచు విషధరతల్పా. 27
క. జలజాక్షుఁ గొలుతు ననుచో, జలజాక్షుం గొలుతు ననుచు సాధ్యార్థము భూ
తలమున నెరసున్నయు నై, చెలు వగుఁ గామపలివాన సిద్ధోల్లాసా. 28
తే. నిడుదలగు నక్కరములపై నిలిచినట్టి, యర్ధబిందువు[2]లన్నియు నరసి చూడ
ధరణి సిద్ధంబు లైన సాధ్యంబు లైన, ఖండములె కాని పూర్ణముల్ గావు సుమ్ము.
ఆ. లోఁగ వించుకైన ఱాఁగతనంబున, దోఁచి వలువ లెల్ల దాఁచినావు
గేఁఱు[3]బూర కొమ్ము నేఁ జన వలె నన్న, నిడుదమీఁద సున్న నిలుచు సగము. 30
తే. హల్లులను బంచవర్గంబులందు మొదలి, వర్ణములకును మూఁడవ వర్ణములకుఁ
దక్క నితరాక్షరములకు దాపలికడ, నాంధ్రపదమధ్యమునఁ బుట్టదయ్యె బొట్టు.
సీ. కొంకక పీఁకమై కొమ్మతోఁ జనుదెంచి ముంగల నాఁగిన మురు వధించె
మించి చె య్యాఁచక మేదినీసుతుఁ ద్రుంచి నెంజిలి రోఁజు కన్నియలఁ గొనియె

1. క. 2. లెల్లను. 3. పోరకొమ్ము (ఓ), (నూ).

మింటితోఁటను గల మేటివృక్షముఁదెచ్చి మెండుగా వేఁడిన మెలఁత కిచ్చె
వింతనేఁతల గోపకాంతల వలపించి [1]పొం దూఁది బహువిధంబుల రమించె

తే. కంపుతూఁపులు గల వన్నెకానిఁ గాంచెఁ, గంబమునఁ బుట్టెఁ దాఁబేటికరణి నొప్పె
నౌర హరి యనఁ బూర్ణంబు లర్ధములును, బరుషసరళాదులను గనుపట్టు నిట్లు. 32

తే. సగముజాబిల్లివలె వ్రాయ సగమసున్న, నిండుజాబిల్లివలె వ్రాయ నిండుసున్న
యయ్యె నీ భేదము లెఱింగి యాంధ్రకృతుల, వ్రాయఁదగుబిందువులుపొందవేయపథ.

వ. ౕ-ఇది యర్ధబిందువు. ం-ఇది పూర్ణబిందువు. (ఇంకను అచ్చులన్ని వరుసకు వ్రాయుచున్నాము. (?) ) 34

మూ. సూ:-దరశార్ఙ్గపిప్పలదళాంకుశపన్నగసన్నిభాః క్రమా త్పరుషాః,
స్తంభ విరేఖాధిక్యై స్త ఏవ వర్గద్వితీయవర్ణాద్యాః. 5

సీ. శంఖశార్ఙ్గద్విపాశనదళాంకుశపన్నగాకృతులను మీఁద నడ్డరేఖ
వలపల నొక్కటి నిలుపంగఁ బరుషంబు లైదును వరుసఁ జెన్నారుచుండుఁ
గ్రిందఁ గంబముపోల్కి గీఁటొక్కటిడిన నాద్యములు రెండవలిపు లై పొసంగుఁ
బైనున్నగీఁటు లిబ్బడి సేయఁ బ్రథమాక్షరంబులు సరళవర్ణంబు లగును

తే. గంబమొక్కటి రేఖాయుగంబు క్రింద, వ్రాసినఁ దృతీయమును జతుర్థంబు నగును
నిలువుగీఁటులు రెండునుం గలసి తమ్ముఁ, గదియఁ దొల్లింటి వనునాసికంబు లగును.

## [2]హల్లులకు రూపంబులు

క - ఇది క్ కారము, క - ఇది ఖ్ కారము, క్-ఇది గ్ కారము, క్౨-ఇది ఘ్ కారము, క్ర-ఇది ఙ్ కారము, చా-ఇది చ్ కారము, చో-ఇది ఛ్ కారము, ఛా - ఇది ఛ్ కారము, చ్ - ఇది జ్ కారము, చ్ - ఇది జ్ కారము, చా౨ - ఇది ఝ కారము, చ్రా-ఇది ఞ్ కారము, టా - ఇది ట్ కారము, టా-ఇది ఠ్ కారము, ట్-ఇది ఢ్ కారము, టా-ఇది ఢ్ కారము, ట్రా - ఇది ణ్ కారము, త్ర-ఇది త్ కారము, త్ర-ఇది థ్ కారము, త్ర-ఇది ద్ కారము, త్ర౨-ఇది ధ్ కారము, త్ర-ఇది న్ కారము, బా - ఇది ప్ కారము, భా-ఇది ఫ్ కారము, బ్ ఇది బ్ కారము, భా ఇది భ్ కారము, బ్రా-ఇది మ్ కారము. ఇవి స్పర్శము లనంబడును.

---

1. పొం దూఁచి (ప). 2. చూ. పు. 48 అధస్సూచిక. (?) శివ. ప్రతిలో అర్ధబిందువునకు '◡' ఇట్టి రూపము వ్రాయఁబడినది. అచ్చుల కీగ్రంథమున రూపములు ముద్రితములు గావు. శివ. ప్రతిలో ఇంచుమించు నేటికాలపు అకారాదిరూపము వ్రాయఁబడి యున్నది (రా).

మూ. సూ:—కీర[1]తరిహస్తిమస్తకశుక్తితులాసనవితర్ది సీరసమాః,
అంతస్థాశ్చోష్మాణో దంత్యచజౌ గురురలౌ చ బిందుయుతౌ. 6
'తరి' అంటేను నావకు పేరు.

తే. శుకతరిమతంగభవకుంభశుక్తిసన్ని,భంబు లంతస్థములు తులాభద్రపీఠ
వేదికాహాలనిభములు శాదిలిపులు, దంత్యచజగురురలలకుఁ దనరు బొట్లు. 35

య - ఇది య్‌కారము, ర - ఇది ర్‌కారము, ఱ - ఇది ఱ్‌కారము, ల - ఇది ల్‌కారము, వ-ఇది వ్‌కారము. ఇవి యంతస్థము లనంబడు.

శ్రీ - ఇది శ్‌వర్ణము, షో - ఇది ష్‌కారము, సా - ఇది స్‌కారము, హ - ఇది హ్‌కారము, ళ - ఇది దొడ్డ ళ్ కారము. ఇవి యూష్మము లనంబడు.

క. పొల్లు లయి తాము పుట్టియు, హల్లులు ప్రాణములతోడ నంబుధితనయా
వల్లభ కూడి కదా తల, మున్ను గుడులు శృంగములును మొదలుగఁ దాల్చున్. 36

వ. అది యెట్లనిన. 37

క్‌కారముతోడ నచ్చులుకూర్చి గుణించెడి విధము.

క - ఇది క్. క్‌కారమునకు తలకట్టు ఇచ్చితే క. తలకట్టున దీర్ఘమిచ్చితే కా. క్‌కారమునకు గుడియిచ్చితే కి. గుడిలో దీర్ఘమిచ్చితే కీ. క్‌కారమునకు కొమ్ము ఇచ్చితే కు. కొమ్మున దీర్ఘమిచ్చితే కూ. క్‌కారమునకు వట్రువసుడి యిచ్చితే కృ. వట్రువసుడిని దీర్ఘమిచ్చితే కౄ. క్‌కారమునకు ఌత్వమిచ్చితే కౢ. ఌత్వమునకు దీర్ఘమిచ్చితే కౣ. క్‌కారమునకు ఎత్వమిచ్చితే కె. ఎత్వమునకు దీర్ఘమిచ్చితే కే. క్‌కారమునకు ఒత్వమిచ్చితే కొ. ఒత్వమునకు దీర్ఘమిచ్చితే కో. క్‌కారమునకు ఐత్వమిచ్చితే కై. క్‌కారమునకు ఔత్వమిచ్చితే కౌ. క్‌కారమునకు అరసున్న పెట్టితే కఁ. నెరసున్న పెట్టితే కం. క్‌కారమునకు విసర్గములు పెట్టితే కః. ఇటువలెనే హల్లుల కెల్లా వ్రాయవలెనని తెలుసుకొనేది.

ఇది స్వరగుణితము

తే. ఎన్నిహల్లులు జడలై యున్న నేమి, [2]పొల్లలకు మీఁద నుండెడుహల్లు లెల్లఁ
గడపటను వ్రాయు ద్విత్వ మొక్కటియె తాల్చు,దానితలకట్లు మొదలైన వానినెల్ల.

వ. ప్రద్యుమ్నుఁడు—బ్రాహ్మ్యబ్రాహ్మ్యం టాయు ఇటువలెఁ గ్రిందను వ్రాసిన యొత్తులకే తలకట్లు మొదలైనవి వ్రాసేది. ఈ లిపియందు రేఫమునకు నొత్తులు వ్రాసేదిగాని వలపలగిలక లేదు. అది యెట్లంటేను. 40

1. నా (శివ). 2. పొల్లు. (పూ. ము.)

తే. మొదల రేఫాక్షరంబు నా పిదప దాని
జడ్డయును గూర్చి యొకటిగాఁ జదువుకొనుచు
ముందు జడ్డయు వెస రేఫమునకు బదులు
గిలుక [1]లిఖియించియు వచింతు రిలఁ గుమతులు. 41

వ. స్వర్గమనుటకు—సా క ర క్ ం బ్రా ౡ-యిటులాగే వ్రాసేది. 42

క. పద్యాదిప్రాణంబుల, నాద్యంతాంతస్థములుగ నజ్ఝులు కృతులం
జైద్యహర వ్రాయుదురు తమ, విద్యాధికు లెల్లఁ జూచి వికవిక నవ్వన్. 43

క. [2]ఇరు లీఁగ లుఱుత లూష్లై,వ్వరు నేమిటి కొక్కఁ డోపు వానికి నను నీ
కరణిపదంబుల మొదలివి, స్వరము లనుచుఁ దెలిసి వ్రాయఁజనుఁ బద్యాదిన్. 44

క. బలుబొట్టులపై వర్ణం,బుల క్రిందట నవియె మరల మూఢమతులు జ
డ్డలు చేసి వ్రాయుచుందురు, విలిఖింపరు వాని నెందు ద్విత్వము లార్యుల్.[3] 45

ఆ. [4]హల్లుమీఁద నున్నహల్లు దానికి ద్విత్వ,మొందుఁ గాని వేఱె యొకటి గాదు
సంధివేళ నది విచారించి వ్రాయఁచోఁ, బాప రెండు దాని బ్రాజ్ఞు లెల్ల. 46

పంచాశద్వర్ణనిర్ణయము

మూ. సూ:-ఆద్యాయాః పంచాశద్వర్ణాః ప్రకృతేస్తు తే దశోనాస్స్యుః,
సప్తత్రింశదిహాన్యే చానుప్రవిశంతి శబ్దయోగవశాత్. 7

తే. అయిదుపదు లగు సురభాష కక్షరమ్ము
లందుఁ బది ప్రాకృతమునకు నడఁగిపోవు
[5]దొలఁగి చనుఁ బదియును మూఁడు దెలుఁగుబాస
కెనఁగుఁ దత్సమపదముల నేఁబదియును. 47

వరరుచివచనము:—

శ్లో. ద్విధాక ఏచోఽనుస్వారో విసర్గ షోడశ స్వరాః,
స్పర్శా అంతస్థళోష్మాణ శ్చతుస్త్రింశ ద్ధలః స్మృతాః.

---

1. విభజించియు లిఖింతు రిలఁ గుమతులు. 2. ఈప్రాఁతలిపులు ప్రతిపుస్తకమున వేఱువేఱుగా నుండుటంజేసి వీని కుదిరిక చక్కఁగాఁ దెలియఁబడదయ్యె (సూ.) శివ. ప్రతిలో దీని లిపిరూపము వేఱుగా నున్నది; పోల్చుకొనుటకు వీలుపడకున్నది (రా.) 3. పూర్వులు నిట్లు జడ్డలు వ్రాసినట్లే కనఁబడుచున్నవి. అప్పకవి నాఁటికి మార్పు కలిగినది కాఁబోలును (గి). 4. పొల్ల. 'హల్లు' అనుట తప్పు (గి). 5. దొలఁగిచనునవి పదమూఁడు.

టీ. ద్విధా=రెండువిధములైనటువంటి, అకః = అక్ప్రత్యాహారమున్ను, అక్కులనంగాను - అ ఇ ఉ ఋ ఌ అనేటి ఈ యయిదక్షరములకుఁ బేరు. అది యెట్లంటేను.
పాణినీయసూత్రములు:—

హలన్త్యమ్.

వృ. ఉపదేశేఽన్త్యం హలి త్స్యాత్.

టీ. ఉపదేశే = [1]సూత్రమునందు, అంత్యం = తుదిది అయినటువంటి, హల్= వ్యంజనాక్షరము (తుదపొల్లు), ఇత్ = ఇత్తనే సంజ్ఞ గలది, స్యాత్=అగును. ఇందు చేత ఇత్తు అంటేను సూత్రముకొన నున్న పొల్లు అనుట.

ఆదిరంత్యేన సహేతా.

వృ. అంత్యేన ఇతా సహితః ఆదిః మధ్యగానాం స్వస్య చ సంజ్ఞా స్యాత్.

టీ. అంత్యేన=కడపటనున్న, ఇతా=ఇత్తుతోడ, సహితః=కూడుకొన్నటువంటి, ఆదిః=మొదటి అక్షరము, మధ్యగానాం=నడుమనుండేటి అక్షరములకున్ను, స్వస్య చ = తనకున్ను, సంజ్ఞా స్యాత్=పేరగును. కడపట నున్న యిత్తుతో కూడుకొన్నటువంటి మొదటి అక్షరము నడుమ నుండే అక్షరములకున్ను దనకున్ను పేరగును. ఇటన్నందు చేత తుద నున్న కకారమునకు పొల్లు పనిలే దాయెను గనుక.
సూ:—తస్య లోపః.

వృ. తస్య ఇతో లోప స్స్యాత్.

టీ. దానికొన నున్న యిత్తునకు లోప మవును. ఇందున్న కవర్ణము పొల్లు లోపము కాగాను జిక్కిన యయిదక్షరములున్ను హ్రస్వములుగానున్ను దీర్ఘములుగానున్ను నుచ్చరించితేను అ, ఆ, ఇ, ఈ, ఉ, ఊ, ఋ, ౠ, ఌ, ౡ యని పది యాయెను. ఏచః=ఏ, ఓ, ఐ, ఔ, చ్ అనేటి ఏచ్ ప్రత్యాహారమునందు మునుపటివలెనే కొన నున్న చకారము పొల్లు గనక మిగిలినవి నాలు గాయెను.
సూ:—"ఏజ్ హ్రస్వో నాస్తి"

అనే సూత్రముచేతను ఈ యేచ్చునను హ్రస్వము లేదు గనుక ఏ, ఓకారములు గీర్వాణభాషయందు కుఱుచలు లేవు. అనుస్వారః=పూర్ణబిందు వొకటి (సంస్కృతము నందు పూర్ణమేకాని ఖండము లేదు.) విసర్గః=విసర్జనీయ మొకటి. ఇవన్నిన్నీ కూడం గాను, స్వరాః=అచ్చులు, షోడశ=పదహాఱు, స్పర్శాః = స్పర్శములు ఇరువైయయిదు, అంతస్థోష్మాణః = అంతస్థములు నాలుగున్ను దొడ్డళకారమున్ను, ఊష్మములు నాలు

1. సూత్రమునందు (పూ. ము.). సూత్రములేకాక ధాత్వాదులుగూడ ఉపదేశము అనఁబడును. ఉపదేశమాద్యోచ్చారణము.

గున్ను, హలః=వ్యంజనములు, చతుస్త్రింశత్ = ముప్పదినాలుగు, అచ్చులు పదహాఱు, హల్లులు ముప్పదినాలుగున్ను-ఉభయములున్ను గూడంగా నేఁబది వర్ణము లాయెను.

తే. అచ్చు లొకపదియాఱును వ్యంజనములు
పాండుపుత్రసహాయ ముప్పదియు మూఁడు
దొడ్డళా యందులోపల దొరల నయ్యె
నమరభాషకు నేఁబది యక్షరములు. 49

సీ. ఏకనీళము దేవహేళనంబు నటంచు యాజుషామ్నాయంబునందు లేదొ
కాళనాళవ్యాళగోళహింతాళంబు లనుచు సంస్కృతభాషయందు లేదొ
గయ్యాళి త్రుళ్లు [1]నంగళ్లు వజ్రపుతళ్కు తాళి యటంచు నాంధ్రమున లేదొ
పాళం బెఱుంగని కూళ విరాళి పిసాళించు ననుచు దేశ్యమున లేదొ

తే. యాగమజ్ఞులు దొడ్డబీజాక్షరంబు, లందు లేకున్కి నన్నంబు నదియుఁ గూడ
నొకటిగాఁ జేసి బీజోపయోగి గాన, ళాను జేకొని రది శబ్దసరణి గాదు. 50

వ. ఆగమజ్ఞులు పంచాశద్వర్ణంబులలో నున్న ళకారమును గూడుకొన్నందునకు మహా
విద్యలోని శ్లోకంబులు— 51

శ్లో. మూలాధారం గుదస్థానం స్వాధిష్ఠానం తు మేహనమ్
నాభిస్తు మణిపూరాఖ్యం హృదయాబ్జ మనాహతమ్,
తాలుమూలం విశుద్ధాఖ్య మాజ్ఞాఖ్యం నిటలాంబుజమ్
సహస్రారం బ్రహ్మరంధ్ర మిత్యాగమవిదో విదుః.

శా. ఆధార స్తు చతుర్దళోఽరుణరుచి ర్వాసాంతవర్ణాశ్రయః
స్వాధిష్ఠాన మనేకవైద్యుతనిభం బాలాంతషట్పత్రకమ్,
రత్నాభం మణిపూరకం దశదళం డాద్యం ఫకారాంతకం
పత్రై ర్ద్వాదశభి స్త్వనాహతపురీ హైమీ కఠాంతాన్వితా.

శా. ద్వ్యష్టారం స్వరషోడశైశ్చ సహితం జ్యోతిర్విశుద్ధాంబుజం
హం క్షేత్యక్షరపద్మపత్రయుగళం రత్నోపమాజ్ఞాపురీ,
తస్మా దూర్ధ్వ మధోముఖం వికసితం పద్మం సహస్రచ్ఛదం
నిత్యానందమయీ సదాశివపురీ శక్త్యై నమ శ్శాశ్వతమ్.

తే. కాకు మా జడ్డ యైన ళకార మగుట, దలఁప కేఁబదిలిపులలో దానిఁగూర్చి
తొలుత భిన్నాక్షరంబైన దొడ్డళాను, విడిచిపెట్టె ననంతుండు వెట్టి గాఁడె. 52

వ. ఛందమునందు ననంతుఁడు చెప్పిన విధము. 53

1. నగళ్లు (మా).

క. యరలవ లంతస్థలు నాఁ, బరఁగును శషసహలు దేటపడు నూష్మ లనన్
సొరిది క్షకారము గూడుక, సరి నేఁబది యయ్యె వర్ణసంఖ్య ధరిత్రిన్. 54

క. ళశలకు భేదము లే దను, పలుకున ళా దొలఁగి యైదుపదు లగు వర్ణం
బులు సంస్కృతభాషకు మఱి, తెలుఁగున ఱళ లనఁగ రెం డధికమగుఁ గృష్ణా.

ప్రాకృతోనాక్షరపరిగణన హేమచంద్రాచార్యవచనము:—

శ్లో. ఋౡవర్ణౌ హ్రస్వదీర్ఘా వైజాద్యా వనునాసికౌ,
శషౌచ దశ తే న్యూనాః ప్రాకృతోక్తిషు సర్వతః.

టీ. హ్రస్వదీర్ఘా = హ్రస్వమున్నూ దీర్ఘమున్నూ ఐనటువంటి, ఋౡవర్ణౌ = ఋకార ఌకారములున్నూ, అనఁగా ఋ,ౠ,ఌ,ౡ అనేవి ఈ రెండున్నూ, ఐచ్ = ఐఔలును, ఆద్యౌ = మొదటి వైనటువంటి రెండున్నూ, అనునాసికౌ=అనునాసికములున్నూ, అనఁగా మొదటి రెండనునాసికములైన ఙకార ఞకారములనేవి, శషౌచ = శవర్ణషకారములున్నూ, తే దశ=ఆ పదివర్ణములున్నూ, ప్రాకృతోక్తిషు=ప్రాకృతవచనములయందు, న్యూనాః = తక్కువ. అనగా సంస్కృతభాషకు చెప్పిన యేఁబదింటిలో ఋ, ౠ, ఌ, ౡ, ఐ, ఔ, ఙ, ఞ, శ, ష అను నీ పదివర్ణములు ప్రాకృతభాషకుఁ దక్కువ యగుచున్న వనుట.

తే. సప్తమస్వరముఖచతుష్టయము ద్వాద, శస్వరంబును లోకసంఖ్యాస్వరంబు
నుర్వి నాద్యనునాసికయుగము శషలు, ప్రాకృతంబున నిక్కమీ పదియు లేవు. 56

వ. లోకసంఖ్యాస్వర మనఁగా గణితశాస్త్రోక్తసంఖ్యను జతుర్దశలోకములు గనుక పదునాలవ స్వర మనుట. ఔకారమునకు పేరు. 57

ఆంధ్రభాషావర్ణసంఖ్య

మూ. సూ:—ద్వివిధాదిదుదేదోతోచో వక్రతమా వనుస్వారౌ,
కగచజయుగ టడణతదనపబమయరయుగలయుగవసహాశ్చహాలః.

సీ. అచ్చులలో సప్తమాక్షరం బాదిగా వరుస నాల్గును దుదివర్ణ మొకఁడు
స్పర్శాక్షరములందుఁ బంచవర్గములను సమములై యుండు నక్షరములు పది
మొదలివ్యంజనవర్గములను రెంటను దుది గనుపట్టునను నాసికద్వయంబు
నూష్మవర్ణము లన నొప్పు నాల్గిటిలోనఁ బ్రథమద్వితీయాక్షరములు రెండు

తే. నెన్న నీయొండు కడమగా నిరువదియును, జగతి శుద్ధాంధ్రదేశ్యభాషాపదముల
వెదకినను లేవు తత్సమపదములందుఁ, దనరు నిన్నియు నది సంస్కృతంబు గాన.

క. తుదలను వికృతివిభక్తులు, గదియుటచేఁ దెలుఁగులందుఁ గలసెను గాకో
యదువర తత్సమపదముల, మొద లాద్యప్రకృతిశబ్దములు దెలుఁగగుటే, 59

సీ. దేవతాభాషను దీర్ఘంబులే కాని కల వైనఁ గుఱుచలు గాక యుండు
హరవిశ్వదివససంఖ్యాచ్చులు దెలుఁగులఁ గడు హ్రస్వములును దీర్ఘములు నగును
సంస్కృతంబునఁ దాలుజననమాత్రమె కాని జగతి నన్యస్థానసంభవంబు
చర్చింప నెఱుఁగనిచజ లాంధ్రమునఁ దాలుజాతంబులును దంతజములు నగును
తే. దలఁప నేకప్రకారమై దైవతోక్తు, లందు భేదంబు లేని రేఫాక్షరంబు
రేఫము ఱకారమును నన రెండుదెఱఁగు, లగుచు వికృతులఁ దనరు దుగ్ధాబ్ధిశయన.

వ. హరవిశ్వదివససంఖ్యాచ్చు లనఁగాను గణితశాస్త్రోక్త సంజ్ఞను, హర అంటేను బద నొకొండవ యచ్చు ఎకారము, విశ్వ మనఁగా బదుమూఁడవయచ్చు ఒకారము, దివస మనఁగాఁ బదిహేనవ యచ్చు అఁ అనునది. యీ మూఁడచ్చులకున్ను దెలుఁగున హ్రస్వమున్ను దీర్ఘమున్ను గల వనుట. అం అనుదానికి దీర్ఘము వచ్చితేను ఆం అయెను. ఇంతమాత్రమున కచ్చులమొదలను అకారంబును ఆకారంబును రెండును ఉన్నవి. దానికిం జెప్పరాదా దీనికి జెప్పవలెనా అంటేను, ఇవి యాకారమునకు చెప్పుట గాదు. అనుస్వారము ప్రత్యేక ముచ్చరింప శక్యము కాదు గనక పాణిన్యాచార్యుల వ్యాకరణమున్నందు అం ఇత్యనుస్వారః అని అకారముతోఁ గూర్చి చెప్పినాఁడు గనుక అం అనఁగా బిందువునకు సంజ్ఞ. ఆ బిందువునకు హ్రస్వ దీర్ఘము లెటువలె కలుగు ననఁగా ముంగలిపద్యముచేతను దెలిసికొనునది. 61

ఆ. బిందువునకు రెండు భేదంబు లగు హ్రస్వ, దీర్ఘరూపములను దెలుఁగులందు
హ్రస్వ మనఁగ నొప్పు నర్ధబిందువు దీర్ఘ, మనఁగఁ బూర్ణబిందు వయ్యెఁ గృష్ణ. 62

క. తక్కువపదియును దొమ్మిది, యెక్కువలిపు లాఱు నయ్యె నేఁబదిలో నీ
లెక్కను ముప్పదియును నే, డక్కరములు నిలిచె శుద్ధ మగు నాంధ్రమునన్. 63

వ. తత్తద్వర్ణభేదాభేదంబు లెఱింగించెద. 64

మూ. సూ:—వికృతిపదాదౌ ప్రథమాంతస్థతృతీయానునాసికౌ న స్తః.

క. తెలుఁగున యణకారంబులు, గలుగవు శబ్దాదులను యకారముపగిదిన్
బలుకఁబడునవి స్వరము లగు, ఖలపూర్వామరవినాశ కామెపలీశా. 65

## క్రారకొమ్ములు

సీ. క్రుజ్ క్రుధ క్రూర శిగ్రు శ్రుతి [1]విశ్రుత శుశ్రూష నిఃస్రుతి స్రు స్రువములు
భ్రూణ భ్రుకుంశ బభ్రు బ్రువాణంబులు భ్రుకుటిత భ్రూలతా ప్రకటితములు
కద్రువ ద్రు పదద్రుమ ద్రుహిణ ద్రుహి సౌరద్రు విద్రుమ శత్రువులును
ధ్రువమును ద్రుతమును భువిఁ గ్రారకొమ్ములై తనరారుఁ గాని ఋత్వములు గావు

1. 'విశ్రుతి' పాఠాంతరము.

తే. వట్రువలు లేవు తెనుఁగున వానిపగిదిఁ, బలుకు లిపు లెల్లఁ గ్రారకోష్ఠములు నిజంబు
దునుము నిందాఁకఁజైద్యుఁడు ద్రుష్టైనఁగ, రోహిణీభర్తచరమాద్రిఁ గ్రుంకె ననఁగ.

నృసింహపురాణమునందు:—

సీ. పా. క్రూరకిల్బిషశైలకులిశనిపాతంబు ఘనకలుషోరగగరుడమూర్తి. (ఆ. 2. 35.)

వ. మఱియు. 67

చ. శ్రుతిమతధర్మయోగములు చోద్యపుమూల్యము లప్పురంబునన్
జతురతఁ బుణ్యవస్తువులు సారనిముక్తిపదంబు లమ్మువా
రతులితవిష్ణుశాసనసమాహితులైన మహాత్ము లంచితో
ద్ధతిఁ గొనువారు [1]భూరివిహితవ్రతపారగులైన బోధనుల్. (ఆ. . 46.) 68

కావ్యాలంకారచూడామణియందు:—

క. భావమె యించుక వదనా, వ్యావళితనికాసమైన హావము శృంగా
రావిర్భావనిదానము, [2]భ్రూవల్లీమందచలనమున నెఱుఁగఁబడున్. (ఆ. 2. 22.)

ప్రభావతీప్రద్యుమ్నమునందు:—

సీ. పా. సురటి చేకొని భద్ర శుశ్రూష గావింప. (ఆ. 3. 15.) 70

ఆ. అద్రువ విద్రువ నను క్రియానపదంబులయందుఁ, [3]దగిలి వట్రసుడులపగిది నుండు
వ్రాలు తేలఁ బల్కుఁ గ్రారకోష్ఠములు గాని, వట్రసుడులు గావు వనజనాభ. 71

ఋత్వాక్షరంబులు

సీ. ఋష్యమూకాద్రియు ఋష్యశృంగుండును ఋక్షమృగేంద్రుండు ఋక్షపదము
ఋతము ఋత్విక్కు నైరృతి ఋతుషట్కము ఋతుపర్ణభూపతి ఋతుమతియును
ఋషభవాహనుఁడును ఋషియు ఋగ్వేదంబు ఋభురాజు ఋణమును ఋద్ధి ఋజువు
నను నీపదంబుల కాదివర్ణంబులు సప్తమస్వరములై [4]జగతి వెలయుఁ

తే. కృష్ణ వృత్రాంతకా హృషీకేశ మదన, జనక పృథ్వీకుమారభంజన యటంచు
హల్లులందును వట్రువ లమరి యుండు, సంస్కృతంబున యదువంశసార్వభౌమ.

వక్రభేదంబులు

ఆ. ఏక మొక మిట్టు లేత్వంబు నోత్వంబు, నమరభాష నిడుద లగును గాని
హ్రస్వలిపులు గావు హల్లుపై నట్లన, యగును గేకి కోకిలాలి యనఁగ. 73

ఆ. పెక్కు రేల కృష్ణుఁ డొక్కఁ డోపఁడె పసి, నెలవు నేల యరసి పొలము వోవ
ననఁగ నిట్టు తెనుఁగులందు వక్రయుగంబు, హ్రస్వములును నిడుదవ్రాలు నగును.

1. మీనువిహిత (సూ). 2. భ్రూవల్లిమదచలనంబుకమును (సూ). 3. గలిగి... గలినినుండు (సూ). 4. జగతిఁ బరగు (సూ).

## వ్యంజనలోపము

ఆ. పూనె నెగసెఁ బొదవెఁ బొనరెఁ బొందె నటన్న, పలుకులందు మొదలఁ గలుగునట్టి
వ్యంజనంబు లడఁగి వానిపై స్వరములు, నిలుచు వలసినపుడు నీరజాక్ష. 75

పూని యనేటందుకు విష్ణుచిత్తీయమునందు:—

ఉ. పూని ముకుందునాజ్ఞఁ గనుబొమ్మనె [1]కాంచి యజాండభాండముల్
వానను మీఁదఁ బ్రోవ నడపం గొనెఁ ద న్నన నగ్రనిశ్చల
త్వానచలత్వనిష్ఠలె సమస్తజగంబుల జాడ్యచేతనల్
గా నుతి కెక్కుసైన్యపతికాంచనవేత్రము నాశ్రయించెదన్. (ఆ. 1. 4.) 76

హల్లు లోపమై ఊనె అనేటందుకుఁ బారిజాతాపహరణమునందు:—

క. మానవతి యిట్లు మానని, మానక్రోధము[2]లచేత మరలిచి చింతా
ధీనగతి నుండ మదిలో, నూనిన ప్రేమమున నంబుజోదరుఁ డనియెన్. (ఆ. 1. 114)

నెగసె అనేటందుకు నాదిపర్వమునందు:—

ఆ. కర్మబంధములను గ్రక్కునఁ బాయుడుఁ, బుణ్యగతికి నెగయు పురుషునట్ల
బంధనంబు లెల్లఁ బాయుడు భీముఁడు, నీరిలోననుండి నెగయుదెంచె (ఆ. 5. 177)

విరాటపర్వమునందు:—

సీ. పా. నెగసినకోనలతోనింగి యంతంతకు నవలఁబోవఁగఁ దనరారుదాని. (ఆ. 1. 162)

ఉద్యోగపర్వమునందు:—

క. ఎఱకలు విచ్చుచుఁ దుండముఁ, దెఱచుచు [3]వ్రేఁ గడరి సొగసి త్రెళ్లి వివశుఁడై
యఱచిన నోడకు మని హరి, కఱి చక్కఁగఁ ద్రోచి యెత్తె నెగయఁగఁ గృపతోన్.
(ఆ. 3. 301.)

వ్యంజనలోప మైనందుకు శృంగారనైషధమునందు:—

సీ. పా. ఒంటికాలను నిల్చి యూర్మిమారుతములఁ జిగురుటెక్కల రేకు లెగయుచుండ.
(ఆ. 1. 100.)

పొదవె నన్నందుకు నృసింహపురాణమున:—

తే. అదరిపాటున [4]వెస విచ్చి పొదవికొనినఁ, [5]దూలఁగి పోవఁగఁ గూడక మలయపవనుఁ
డిందుఁ దలఁదూర్చుకొనియె[6]నోయిప్పుడనఁగ, నమరుఁదాళవృంతములమందానిలంబు.
(ఆ. 3. 69.)

---

1. దాల్చి. 2. లఁజేత మాఱిచి (అచ్చుప్రతి). 3. వ్రేఁగడఁచి (సూ).
4. వేసవి. 5. గలఁగి తలఁగి పోనేరక. 6. నా నింపొనర్చ (అచ్చుప్రతి).

అందే:—

తే. పొదవి యొండొండ దివియును భువియు దెసలుఁ
బొదవికొని యుండు చీఁకటి ప్రోవువలన
మిక్కుటంబుగఁ గాటుక గ్రుక్కినట్లు
కరవటం బన జగదండ ఖండ మమరె. (ఆ. 3. 80.) 83

అందే:—

క. అది యట్ల కాదె నిప్పుడు, జెద లంటునె దేవదేవు శ్రీరమణీశున్
మది నుంచుకొన్న వానిని,బొదవునె యాపదలు రవినిబొందు నెతమముల్.(ఆ.4.32)

[1]అచ్చునకుఁ జిత్రభారతమునందు:—

క. తదనంతరంబ గ్రమ్మఱ, యదువిభుఁడు కృపావిధేయుఁడై వాణీశ
త్రిదశేశుల కాశ్చర్యం, బొదవ మనిచె నుభయసైన్యయోధుల నెల్లన్. (1.16).

ఉద్యోగపర్వమునందు:—

క. పదపడి దుస్తర మగు నీ, పదుమూఁడగు నేడు గడవఁబడుట యరిది ద
మ్మైదు రెఱుఁగకుండ నాపద, లొదవఁగ సైరించి రిట్టి యునికియుఁ గలదే. (ఆ.1.9.)

పొనరె నన్నందుకు నుద్యోగపర్వమునందు:—

క. ధనమును విద్యయు వంశం,బును దుర్మదులకు మదంబుఁ బొనరించుచు స
జ్జను లైనవారి కడఁకువ,యును వినయము నివియ తెచ్చు నుర్వీనాథా. (ఆ.2.35.)

అందే:—

మ. అని నిర్మెచ్చి వృకోదరుం డతఁడు కార్యం బింత తెల్లంబుగాఁ
బొనరం బల్కెనె యంచుఁ బేరెలుఁగు సొంపుం జెంద వక్త్రంబుపొ
ల్పున దర్పం బొలయంగ నంగములకుం బొంగారు తద్బృంహిత
ధ్వనియై మించు మహోగ్రసింధురముచందం బొంది పొల్చెం దగన్.(ఆ.3.143.)

పకారములోని స్వరమే నిల్చినందుకుఁ బ్రబంధపరమేశ్వరుఁడు చెప్పిన [2]అహోబలమాహాత్మ్యమునందు:—

క. నిను నాశ్రయించియును నే, ననఘా కడ లేని వనట యను వననిధిలోఁ
మునుఁగుదునె ప్రతీకారం, బొనరింపఁగదయ్య దీని నూహించి కృపన్. 89

హరిశ్చంద్రోపాఖ్యానమునందు:—

చ. ధనదునిపుష్పకంబునకుఁ దా నెన వచ్చు నటంచు లోకముల్
వినుతి [3]యొనర్ప బొల్పెసఁగి విద్రుమమౌక్తిక నీలవజ్ర కాం

---

1. హల్లోపమునకు (సూ). 2. నృసింహపురాణమున కిది నామాంతరము(రా).
3. యొసంగెఁ (వ).

చనయుతము న్నవేగహయసంఘటితంబును నైన తేరు సొం
పొనరఁగ నెక్కి మిక్కిలి సముత్సుకతం బురబాహ్యవీథులన్. 90

పొందె ననేటందుకు శంభుదాసుని లక్ష్మీనృసింహావతారకథయందు:—

ఉ. పొందవు దుఃఖము ల్భయము పొందదు పొందదు దైన్య మెమ్మెయిం
బొందవు తీవ్రదుర్దశలు పొందుఁ బ్రియంబులు పొందు సంపదల్
పొందు సమగ్రసౌఖ్యములుఁ బొందు సమున్నతకీర్తు లెందు గో
విందపదారవిందపదవీపరిణద్ధగరిష్ఠచిత్తులన్. (ఆ. 2. 31.) 91

### [1]ఒదాదేశహ్రస్వంబులు

తే. కాంచు హ్రస్వద్వితీయవక్రంబు నంద, ఒక్కఁ డను వీనిరెండవయక్కరంబు
హ్రస్వ మగుఁ జోటనుపదంబునందు మొదలి,వర్ణమును గబ్బములను గావలసినపుడు.

'అందొఱు' అనుట కాదిపర్వమున:—

క. [2]గిఱపునెడ నేయునెడ వడిఁ, [3]బఱపునెడం బెడఁగునెడ నపారబలంబుల్
మెఱయునెడ భీమునకు నం,దొఱుగీడ్పడఁదొడఁగిరుద్ధతులు రాజసుతుల్.
(ఆ. 5. 168.)

ఆరణ్యపర్వమునందు:—

సీ. పా. శూరులు ధృతరాష్ట్రసుతులు దుర్యోధనాదులు దురాధర్షు లందొఱును మనకు.
(ఆ. 1. 269.)

ఒత్వము రానందుకు విరాటపర్వమునందు:—

క. ఎఱుక గలవారికైనను, గఱపక దక్క రుచితప్రకారము శుభముల్
గొఱలు హితు లట్లగుట నం,దఱకును జెప్పంగవలయుఁ దగియెడుబుద్ధుల్.
(ఆ. 1. 116.)

ఒక్కొ అనేటందుకుఁ గర్ణపర్వమునందు:—

మ. సమదాటోపత వాయునందనుఁడు ధృష్టద్యుమ్నశైనేయు లే
కమనోవృత్తిఁ గడంగి తో నడువ దోర్గర్వంబు శోభిల్ల శౌ
ర్యము సొంపార నిలింపకోటి పొగడన్ రారాజుసైన్యంబు లో
క్కొ మొగిం బెల్లగిలంగ బెట్టదిమె సక్రోధాంతరంగంబునన్. (ఆ. 2. 352.)

మనుచరిత్రమునందు:—

క. ఇట నవ్వరూథినియు న్నొక్కొటఁ గతిపయసఖులు దన్నుఁ గొలిచి నడువఁగాఁ
గటకఝుళంఝుళరవపద, కటకసమాకృష్టకేళికలహంసిక యై. (ఆ. 3. 72.) 97

---

1. ఓదా (పాఠాంతరము.) 2. కఱచు. 3. బఱచు.

రాఘవపాండవీయము:—

స్రగ్ధర. ఆ రాజన్యోత్తముం డి ట్లనుదితరభసుండై భవత్సత్వరవ్యా
హారంబి ట్లొర్చి యుం టన్యముగఁ గొనక మాత్మాంగనాశుల్కతాదృ
క్సారోగ్రేష్వాస మ ట్లశ్రమజిత మగు టెంచంగ నాచేతికాటం
గ్రూరేష్వాసంబు లే దొక్కఁడు గలుగునె మద్ఘోరయుద్ధంబు నైపన్. (ఆ.2.108)

ఒకారము రానందులకుఁ గాశీఖండమున:—

ఉ. కంటికి నిద్రవచ్చునె, సుఖం బగునే రతికేళి, జిహ్వకుక్
వంటక [1]మించునే, యితరవైభవముల్ పదివేలు మానసం
బంటునె మానుషంబు గలయట్టి మనుష్యున కెంతవానికిక్
గంటకుఁడైన శాత్రవుఁ డొకండు తనంతటివాఁడు గల్గినన్. (ఆ. 1.108) 99

విరాటపర్వమునందు:—

సీ. పా. శక్రాదిసురలతో సంగ్రామమొనరించి ఖాండవం బేర్చె నొక్కరుఁడు గాఁడె.
(ఆ. 4. 210)

చోటు అనేటందుకు ద్రోణపర్వమునందు:—

క. కటకట పేరినపెన్నె,త్తుట జొత్తిలి యున్న మోముతోడను గొడు కె
చ్చటఁ బడి యున్నాఁడో య,చ్చోటుఁ [illegible] పెడువారు లేరె చూచెద వానిన్.
(ఆ. 2. 251)

విష్ణుచిత్తీయమునందు:—

మ. స్ఫుటభూయోహ్యాతిశంక వార్ధి రవిరశ్ము ల్మిన్నుఁ జేర్పం దటి
చ్ఛట[2]లార్వంబుగఁ గాయుకొంచు ఘనమై ఝంఝాదీర వర్షింప న
చ్చోటునుం ద్రోచి గ్రసింపఁబోలుఁ గలశీసూనుండు గాకున్న నొ
క్కొటఁ దారాగ్రహభాస్కరేందుమణిశుక్తుల్ వ్యక్తమై తోఁచునే. 102
(ఆ. 4. 145)

హ్రస్వము గానందుకు మనుచరిత్రము:—

ఉ. పాటున కింతు లోర్తురె కృపారహితాత్మక నీవు ద్రోయ ని
చ్చోట భవన్నఖాంకురము సోఁకెఁ గనుంగొను మంచుఁ జూపి య
వ్వాటలగంధి వేదన [3]నెపం బిడి యేడ్చెఁ [4]గలస్వనంబునక్
మీటిన విచ్చు గబ్బిచనుమిట్టల నశ్రులు చిందు వందఁగాన్. (ఆ. 2.70) 103

1. మిందునే (పాఠాంతరము). 2. గార్యంబుగ (పూ.ము.) 3. నెపంబున నే.
4. గలస్వనంబుతో.

వక్రతమభేదంబులు, పాణినీయసూత్రము

సూ:—తద్ధితే ష్వచా మాదేః.

వృ. ఞ్ణితి ణితి చ తద్ధితే పరే అచా మాదే రచో వృద్ధి స్స్యాత్.

క. హైయంగవీనమునకున్, నైయంకవశబ్దమునకు నైయగ్రోధ
[1]నైత్రియజితాదుల కాదిని, వ్రాయంగా వలయుఁ బ్రథమవక్రతమంబుల్. 104

క. వైయర్థ్యత్రైయంబక, వైయాకరణాగ్రగణ్యవైయాఘ్రపదీ
వైయాత్యంబుల మొదలను, వ్రాయం దగు బుధులు ప్రథమవక్రతమంబుల్. 105

క. యౌవనయౌవతకౌస్తుభ, సౌవర్ణకయౌవరాజ్యసౌవీరమహీ
దౌవారికశబ్దంబులఁ, దావుకొను ద్వితీయవక్రతమములు మొదలన్. 106

క. సౌవగ్రామికశౌవన, [2]సౌవర్చససౌవిదల్లసౌవస్వలస
త్సౌవరశబ్దములమొదల, వావిరి నిలుచున్ ద్వితీయవక్రతమంబుల్. 107

కౌస్తుభము అనుటకు నృసింహపురాణమునందు:—

ఉ. శ్రీస్తనకుంకుమద్రవనిషిక్తభుజాంతరభాగవిస్ఫుర
త్కౌస్తుభనూతనార్కరుచిగర్వితనాభిసరోజసౌరభ
ప్రస్తుతమత్తభృంగరవరాగరసోల్బణభోగిభోగత
ల్పాస్తరణుం దలంచు సుకృతాత్ము లపాస్తసమస్తకల్మషుల్. (అ. 2. 37) 108

క. మెచ్చులగు కబ్బములలో, నచ్చతెనుఁగుపలుకులందు నైత్వౌత్వంబుల్
వచ్చిన నొం డగు రెం డగు, విచ్చలవిడి వలసెనేని విబుధస్తుత్యా. 109

మూ. సూ:—అయిగవుగాదేశౌ స్తఃక్రమేణ సర్వత్ర వక్రతమయోర్వా.

క. క్రమమున వక్రతమములకు, నమరు నయిక్కును నవుక్కు ననియెడు నాదే
శములు వికల్పంబున దైత్యమదాపహ యాంధ్రభాషయం దెల్లెడలన్. 110

ఆ. లోకహితముకొఱకుఁ బైకొని దుష్టుల, లయ మొనర్చి శిష్టు లయిన నృపుల
నేల యేల నిలిపెఁ గాలిచ్చి నలు దెసఁ, దవిలి కృష్ణరాయఁ డవుర యనఁగ. 111

కవర్గాక్షరభేదంబులు

మూ. సూ:—వా స్యా త్క్వచిద్వకారో నాదిగతస్యాద్యవర్గసరళస్య.

సీ. పరుగులు పరువులు పగడంబు పవడంబు పగలుంట పవలుంట పగలు పవలు
నగుఁబాటు నవుఁబాటు నలుగురు నలువురు తగులాట తవులాట తొగలు తొవలు

1. నైవ్యయకృతంబుల (సూ). 2. సౌవర్చన సౌవిదల్ల సౌదశ్వ (సూ).

త్రాగుట త్రావుట ప్రేగులు ప్రేవులు ప్రోగులు ప్రోవులు సోఁగ సోవ
యిగ మివ మగు నవు నిగురాకు లివురాకు లీగు లీవులు మ్రానిచేగ చేవ

తే. తీగియలు తీవియలు పయిఁ దిగిచెఁ దివిచె
ననుచు నిబ్భంగి నొకవేళ నాదివర్ణ
ములకుఁ దక్కంగఁ గొన్నిమాటలను గృతులఁ
బ్రథమసరళంబులకు వకారములు వచ్చు. 112

నైషధమునందు:—

మ. పవిసంగంబునఁ దాప మొందిన శచీప్రాణేశు కెంగేలికిం
జివురుం గ్రొదువజోదు వైద్య ముపదేశించెన్ రహస్యంబుగా
నవనీహారపయోమిళన్మలయజస్నానార్ద్రపర్యంతమై
యివతాళించు విదర్భరాజతనయాహృద్యస్తనద్వంద్వమున్. (ఆ. 3. 34) 113

శాంతిపర్వమునందు:—

చ. వినుము నరేంద్ర విప్రుఁ డలివెన్ జమదగ్నిసుతుండు శాప మి
చ్చె నమరభర్త వంచనము చేసె వరం బని కోరి గొంతి మా
న్చె నలుక భీష్ముఁ డర్ధరథుఁ జేసి యలంచెఁ గలంచె మద్రరా
జనుచిత మాడి శౌరి విధి యయ్యె [1]నరుం డనిఁ జంపెఁ గర్ణునిన్.(ఆ.1.35)114

మార్కండేయపురాణమునందు:—

చ. ఘననిబిడాంధకారరిపు[2]ఖండనచండమయూఖరాజిచే
ననుదినముం బ్రభాతములయం దమృతాంశుమరీచు లేఁగఁగా
వనజము లుల్లసిల్లఁగఁ [3]దొవ ల్మడుఁగం బ్రథమాద్రిఁ బొల్చు న
ద్దినమణికి న్నభోమణికి దేవశిరోమణి కేను మ్రొక్కెదన్. (ఆ. 7. 123) 115

తే. ఆఁగె లోఁగెను వీఁగెను డాఁగె నేఁగె, వాఁగె నునివి మొదలగు వాక్యములను
బొదలునక్షరములు [3]చిన్నబొట్లపై గ,కారములు గాని యనునాసికములు గావు.

చవర్గాక్షరభేదంబులు

మూ. సూ:—అ ద్దంత్యా స్తాలవ్యశ్చ ర్యః క్రః స్యాన్మిథస్సవర్ణాశ్చ. 6

ఆ. ధరణి దంత్యములును దాలవ్యములు నన, వికృతిచజలు రెండు విధము లయ్యె
వీనిఁ దెలియకున్న విశ్రమభంగంబు, దొడరి కావ్యములను దోష మొదవు. 117

---

1. నరుం డటు సంపె. 2. ఖండపిచండ. 3. దొవల్మొగుడం; దొవల్మునుఁగం. 4. ఈపాఠము పొరపాటు; చిన్నబొట్లపై గ,కారములు గాని యంతస్థములుగావు అని సవరింప నగు (రా). అంతస్థములనుట సరిగాతోఁచదు. గ,కారము వకారమెప్పుడు కాదుకాదు-అని యుండనగు.

ఆ. దంతజంబు లెల్లఁ దలకట్టులుగు వాని, యందు దీర్ఘములును బొంది యుండుఁ
తాలుజాక్షరములు దనరారు హ్రస్వాది, వక్రయుతము లగుచు వనజనాభ. 118

ఆ. చేలము మాని కుడువు చేట్టకేశవ ప్రొద్దు, చాల నయ్యెఁ [1]బసిప్రజంబు వెడలె
జేతలు గూడి వచ్చి సఖులు చీరెద రేల, జా గనంగ దంతజంబు లయ్యె. 119

ఆ. చెప్పరాని క్రొవ్వుచేఁ గంసుపంపునఁ, జెలఁగికొనుచుఁ దన్నుఁ జేరి పెనఁగ
జెట్టి మట్టుఁబెట్టెఁ జిఱుతయే నందుని, పట్టి యనఁగఁ దాలుభవము లయ్యె. 120

ఆ. చేతఁ జీర లైదు చేఁరెడు వరహాలు, జేనెఁ డంత జిత్తు చేక టొకటి
చేఁదుకొనియెఁ గృష్ణుఁ జేర్చుక యన నిట్లు, వఱలుఁ గొన్ని దీర్ఘవక్రలిపులు. 121

తే. దంత్యముల నరవంకలు దైవభాషఁ, గనము తాలవ్యములఁ దలకట్లు లేవు
ప్రాకృతమునందుఁ దద్భవపదమునందు,దంత్యములె కాని తాలుజాతములు లేవు. 122

వ. వక్రములకుఁ దద్భవము వంకలు, అరవంక లనఁగాను గుఱుచ యెత్వములు అనుట,
దీర్ఘములకుఁ దద్భవములు తీఁగలు. 123

ఆ. చేందమామ గాయఁ జెక్కెరవిలుకాఁడు, జాజిపువ్వుటంపజెల్లు గురియఁ
జామ కాక కోర్వఁజాలక హరి వచ్చు, దనుక బడలె ననఁగ దంత్యచజలు. 124

తే. చంద్రమశ్శబ్దమునకుఁ దజ్జంబు చేంద,మామ జాతికి జాజి శ్యామకును జామ
శర్కరకుఁ జెక్కెరయు నగు జలము జెల్లు,(జమ్మికడఁ గామెపలి నున్న చక్రపాణి.)

వ. చంద్రమశ్శబ్దతద్భవంబు చేందమామ, జాజికి జాజి, శ్యామకు చామ, శర్కరకు
చేక్కెర, జలమునకు "లళయో రభేదః" అను సూత్రముచేత జళము, దానికి
"లడయో రభేదః" అనుదానిచేత జడ మాయెను. అది ప్రాకృతముచేసిన నాది
వర్ణము దంత్యమాయెను. అది తద్భవముచేసి బహువచనముచేసిన జల్లు. 126

క. తోడరు జటాశబ్దమునకు, జెడ యనునది తద్భవంబు చేదలును జానుం
గడు నచ్చతెనుఁగు లివి పద, పడి మూఁడును దంత్యములుగఁ బలుకఁదగు హరీ.

వ. జటాశబ్దతద్భవము జెడ. 127

ఆ. జెడలు మెఱయ వచ్చి సంయమిశ్రేష్ఠుఁడు, చేదలు మ్రానిపువ్వు శౌరి కిచ్చె
సరస నున్న దనుచు జా నొప్ప భీష్మక, తనయ కిచ్చె నతఁడు దగ వెఱింగి. 128

పారిజాతాపహరణమునందు:—

సీ. గీ. దేవకాంతు[2]లు బాలచంద్రికల నీన, జెడలు మోతుద్రుపల్లవశంకఁ జేయ.
(1-44)

---

1. ఈపాదము ప్రాచీనముద్రణములోఁ గానరాదు (రా). 2. లకాలచంద్రికల (అచ్చు పారిజాత.)

నైషధమునందు:—

సీ. పా. చేదలేటిబంగారుజలరుహంబుల[1]తూండ్లు, భోజనంబులు మాకుఁ [2]బువ్వుఁబోఁడి.
(ఆ. 1. 49)

అనంతుని ఛందమునందు:—

ఉపజాతి. పినాకికోదండము బిట్టు ద్రుంచెన్, [3]తా నొప్ప గెల్చె న్జమదగ్నిసూనున్
ఘనుం డితం డుర్వి ననంగ రెంటన్, జానైనవృత్తం బుపజాతి యయ్యెన్.(2-35)

క. ఘూమినిఘంటునఁ 'జంచః పామరజాతీయ' యనుట పరికించి బుధ
గ్రామణులు చంచు లని వెసఁ, దా మేత్వం బిడరు వడికి తలకట్టగుటన్. 132

తే. ప్రాసముల రెండు నొకటిగాఁ బలుకవచ్చు
వడికి స్వరమైత్రి లేకున్న నుడుగ రాదు
ఖాట్టియెత్వములకు దంత్యములకుఁ దక్క-
భేదములు లేవు చజలకు వేదవేద్య. 133

ఆ. రాచనెలఁతలందు [4]నేచెలియకు భోజ,రాజతనయవంటియోజ గలదె
చేక్కఁదనము గాక సద్గుణంబుచు గాంచెఁ, జెఱకుఁగోల ఫలముఁ జెందినట్లు. 134

తే. దంత్యతాలవ్యచజలకు ధరణి వ్రాయు, తఱిని శుద్ధాంధ్రలిపిని భేదంబుకలిమి
[5]ద్వ్యర్థకృతులను దలకట్టు లనుచునొకట, నిదియునొకదాన నదియును నిడఁగరాదు.

రాఘవపాండవీయమునందు:—

ఆ. ఎందు వేఁట రారె యితరు లేమన సుతో
దారసంగసుఖము తప్పఁ ద్రోచి
తకట పాండురాజయశ మెన్నవై తతి
క్రూరదశరథేశకులము రోయ. (ఆ. 1. 29) 136

ప. ఈ పద్యములోను రామాయణార్థమునందు 'అజయశ' మని సమాసము చేసి పలుక జకారము తాలవ్య మాయెను. భారతార్థమునందు 'పాండురాజ' యని సంబుద్ధిగాను బలికితేను ఆ వర్ణమే మరల దంత్యమున్ను ఆయెను. ఇటువలెనే యాదిమహాకవి ప్రయోగంబులు చూడగాను, దాలవ్యము అర్థాంతరమందు దంత్యముగా చెప్ప రా దని యెట్లాగంటివోయి అంటేను ఆద్యప్రకృతియందు దంత్యచజలు లేవు గనక శుద్ధసంస్కృతమైన పాండురాజశబ్దమునందుఁ గల జకారము తాలవ్యమే కాని దంత్యము కానేరదు. ఇది తెలియక కేవలాంధ్రులు దంత్యాక్షరముగా నుచ్చరింతు రది లాక్షణికమతము కాదు. అట్లు గనకనే సకల కవితాప్రవర్తకులైన సూరప రాజుగారు ఇంతవట్టును విచారించే ప్రయోగించినారు.

---

1. తూళ్లు (ప). 2. పువ్వుబోఁడి (సూ.) 3. జానొప్ప (ఛా. ము. యతి భంగము.) 4. నీచెలియకు (సూ.) 5. ద్వ్యర్థికృతులను (రా.)

పాణినీయసూత్రము

సూ:—ఛే చ.

వృ. హ్రస్వస్య, ఛే పరే తుగాగమ స్స్యా త్సంహితాయాం విషయే. 'హలంత్య' మితి సూత్రేణ కకారస్య ఇత్సంజ్ఞా. "తస్య లోప" ఇతి లోపః తు, "ఉపదేశేఽజనునాసిక ఇ" దితి (ఉకారస్యేత్సంజ్ఞాయాం తస్య లోప ఇతి) ఉల్లోపః.

సూ:—స్తో శ్చునా శ్చుః.

వృ. స్తోః=సకారతవర్గయోః (శ్చునా=) శకారచవర్గాభ్యాం యోగే (శ్చుః=) శకారచవర్గా స్తః. [1]శివచ్ఛాయా.

సూ:—ఆఙ్మాఙో శ్చ.

వృ. ఏతయో శ్ఛే పరే తుగాగమ స్స్యాత్. ఆచ్ఛాదయతి. మాచ్ఛినత్. 'పదాంతా' ద్వేతి వికల్పాపవాదః.

సూ:—దీర్ఘాత్.

వృ. దీర్ఘా చ్ఛే పరే తు క్స్యాత్. హ్రీచ్ఛతి, మ్లేచ్ఛతి.

సూ:—పదాన్తాద్వా.

వృ. దీర్ఘాత్పదాన్తాచ్ఛే పరే తు గ్వా స్యాత్, లక్ష్మీచ్ఛాయా. లక్ష్మీఛాయా.

సీ. ఛాగపుచ్ఛచ్ఛటాచ్ఛందోయదృచ్ఛాసితచ్ఛత్రపద్మచ్ఛదచ్ఛలాచ్ఛ
విచ్ఛిత్తికచ్ఛాపకచ్ఛపరిచ్ఛేదపృచ్ఛాచ్ఛవిచ్ఛిరతుచ్ఛగుచ్ఛ
పదములు మొదలైన త్రిదశభాషాశబ్దముల నాదిమధ్యాంతములను గలుగు
సప్తమవ్యంజనాక్షరము హ్రస్వముమీఁదఁ దన క్రిందఁ దాన ద్విత్వ మగుచుండు
తే. నిడుదలగు నక్కరంబుల కుడిని నిలుచు, నప్పుడ వికల్పకంబున నట్లన యగు
బంధురవిలాస చంద్రికాభదరహాస, ధర్మమయవాస శ్రీకామెపలినివాస. 138

టవర్గాక్షరభేదంబులు

ఆ. ఠవర ఠీవి ఠేవ ఠావును ఢాకయు, మొదలుగా ద్వితీయములు చతుర్థ
వర్ణములును గలుగు వాక్యంబులును స్వదేశ్యములు గాని వైకృతములు గావు. 139

విజయవిలాసమునందు:—

క. కొమ్మపయి నీవు పక్షము, లిమ్మెయి నెరపుదు వి దేల యేచెద వకటా
కమ్మఁగ నవాతుచక్కెర, క్రమ్మఁగ మాటాడు ఠవర కలకంఠవరా. (ఆ.3.56) 140

1. శివ+ఛాయా (శివ+తుక్=శివ+తు=శివ+త్+ఛాయా - శివ+చ్+ఛాయా-శివచ్ఛాయా).

మనుచరిత్రమునందు:—

క. దివి బిసరుహబాంధవసైం, ధవసంఘం బెంత దవ్వు దగ లే కరుగున్
భువి నంత దవ్వు మేమును, రవరవ లే కరుగుదుము హుటాహుటినడలన్. 141
(ఆ. 1. 76)

పాండురంగమాహాత్మ్యమునందు:—

సీ. గీ. సఖులు పరిహాసకులు వెంటఁ జనఁగ యువతి, భుక్తనిర్ముక్తపరిధానయుక్తుఁడగుచు
నగరఘంటాపథంబున నగుచుఁ దిరుగు, నొఱపుగల లీవి జాతిమాత్రోపజీవి. 142
(ఆ. 3. 10)

రామాభ్యుదయమునందు:—

సి. పా. [1]తేవ మీఱఁ దటిన్నటీపంక్తిఁ బ్రేరించి కోపుగా మెఱుములు గొనఁగఁజేసి.
(ఆ. 6. 18)

[2]సుభద్రాపరిణయమునందు:—

శా. దేవబ్రాహ్మణభక్తిప్రౌఢి ప్రియవక్తృత్వంబుకాణాచి వి
ద్యావైదుష్యము దిక్కు ధర్మమునకుం దార్కాణ మర్యాదకున్
తా వౌచిత్యము జీవగఱ్ఱ హితశిష్టవ్రాతసంతోషణ
శ్రీవజ్రాంగి యజాతశత్రుఁడు మహీభృన్మాత్రుఁడే చూడఁగన్. (ఆ. 1. 85)

శశిబిందుచరిత్రమునందు:—

క. నాకౌకసు లైనను నీ, ఢాకకు నిల్చెదరె కటకటా మముబోట్లం
జేకొని సంరక్షింపక, నీ కిటు లుచితంబె యురవణింప నరేంద్రా. 145

సీ. క్ష్వేళంబు క్ష్వేడంబు చోళుఁడు చోడుఁడు తాళంబు తాడంబు దళము దడము
క్రోళంబు క్రోడంబు నాళంబు నాడంబు నీళంబు నీడంబు గాళి గాడి
వ్యాళంబు వ్యాడంబు చూళిక చూడిక వళి వడి హేళి సర్వజ్ఞహేడి
జలకేళి జడకేడి వెలలఁడు వెడలఁడు కేళంబు కేడంబు పాళి పాడి
తే. వేవళము వేవడం బిట్లు నిర్జరాంధ్ర
భాషలను రెండు కొన్నిశబ్దంబులందు
నరయ "లడయో రభేద" యటన్నసూత్ర
మున ళకారంబునకు డత్వములు ఘటించు. 146

1. తేవ మీరంగఁ దటిన్నటి ప్రేరేచి క్రొవ్వుగా మెఱుపులు గొనఁగఁజేసి (సూ.) 2. విజయవిలాసమున కిది నామాంతరము. (రా.)

సీ. డిండీరదీప్తిపోఁడిమి మీఱు నీకీర్తి దిండీరపాండిమఁ దెగడు నవ్వ
డంభ మిచ్చటను గూడదు కృష్ణ నీ వేఁగి దంభంబు మిత్రవిందకడఁ జేయు
డాడిమీఫల మియ్యెడకు నేల కొనిపొమ్ము దాడిమీఫలము [1]సుదంత కిమ్ము
డోలిక నూఁగువేడుక నీకుఁ గల్గిన దోళిక లక్షణతోడ నెక్కు
తే. మఱచు నీ పద్యమునఁ జరణాదులందు, నిలుపు పదముల మొదటను గలుగువ్రాలు
డత్వదత్వంబులందు రెంటను బొసంగు, శాబ్దికమతంబునను వనజాతనయన. 147
తే. డంభడిండిరడోలికాడాడిమాది, శబ్దముల కాదివర్ణంబు సంస్కృతమున
నుపరివర్గతృతీయమై యొప్పునట్లు, తెనుఁగున డకారము [2]దవర్ణ మొనరుచుండు.
తే. దాక దగ్గఱ దిగ్గియ దాయ దోయ, దాపలను దిగ్గు మను వైకృతముల మొదల
డాక డగ్గఱ డిగ్గియ డాయ డోయ, డాపలను డిగ్గు మని డా కడంగి నిలుచు.

రాజశేఖరచరిత్రమునందు:—

శా. డాకేల న్నిజకన్యకామణులు కంఠశ్రేణి గీలించి వీ
ణాకంజాతము లాత్మ పాదనఖరేఖం దార్చి సంగీతవి
ద్యాకౌశల్యము గానరా మదికి నాహ్లాదంబు సంధిల్ల గౌ
[3]రీకల్యాణముఁ బాడి రప్పుడు పురంధ్రీరత్నముల్ వేడుకన్.(ఆ.3.167) 150

ద్రోణపర్వమునందు:—

చ. డిగకుఁడు వాహనంబులు గడిందిమగంటిమి గోలుపోవ మీ
రు గడఁక [4]దక్కి పెట్టకుఁడు రూపఱ నాయుధము ల్మహాస్త్రశ
క్తి గెలుతు [5]నేన మత్కులిశతీవ్రశరంబులవైభవంబు [6]భూ
రిగదవిహారభంగియు నరిప్రకరంబులు పిచ్చలింపఁగన్. (ఆ. 5. 381) 151

ఉద్యోగపర్వమునందు:—

ఉ. డక్కెను రాజ్య మంచు నకటా యిటు తమ్మునిభాగ మీక నీ
వెక్కటి మ్రింగఁ జూచెద వ దెట్లరుగున్ విను మీను లోలతన్
గ్రక్కున నామిషంబుచవి గాలము మ్రింగినమాడ్కి సువ్వె యి
ట్లుక్కివుఁడైన నీకొడుకునుల్లము ని న్నిటు లాడఁ[7]గూడు నే. (ఆ.2.52.) 152

1. సుదంతి (సూ) 2. దవర్ణమునకు వచ్చు (ప); దవర్ణము నగుచుండు (వా)
3. కల్యాణము వాడి (పూ. ము.) 4. దక్కిటిల్లనుఁడు (వా); దక్కిడిల్లనుఁడు (ప).
5. జంపఁ దత్కులిశ (వా); ఁజావ దత్కులిశ (ప); గోత్రభి త్కులిశ (అచ్చు);
6. భూరిగను విహారభంగుల (వా). 7. గూఁబునే (వా).

వైజయంతీవిలాసము:—

తే. డొంగవలె వచ్చి యిక్కడ [1]డొంగినావ, దేమయా బావగారు పెద్దామె కోప
గించినందులకా బళా మంచివాఁడ, వేమనందును ముసలావెయే వివేకి. 153
(ఆ. 4. 36)

వ. డంభడిండీరాదిశబ్దములవలెనే యన్నందుచేతను రెండును గలవు గనుక దకారమునకు.

ఆరణ్యపర్వమునందు:—

క. జగముల నెల్లను నిండిన, [2]పొగడ్తకును వెలితి చేసి పొల్లయొదలికై
తగునే జన్మవ్రతములు, దిగ విడువఁగ నిపుడు నాకుఁ ద్రిభువనదీపా. (ఆ. 7. 290)

ఉద్యోగపర్వమునందు:—

క. తగ నీలో నూహింపుము, దిగ విడువక ధర్మతనయుఁ దృఢమతి వై పొం
దగు చందము కొడుకులకును, బ్రెగడలకును జెప్పి[3] తేర్పు పెంపేర్పడఁగన్. (ఆ. 2. 9

పారిజాతాపహరణమునందు:—

ఉ. తామర[4]డోయలోఁ దవిలి దాఁటిడు తేఁటులువోలెఁ బెన్నెఱుల్
వేమఱుఁ జేతులం బిడిచి విప్పి విదిర్చి నఖాంకురంబులన్
గోమలలీల దువ్వి తెలిగొజ్జఁగినీరటు చల్లి చల్లి గం
ధామలకంబు వెట్టె నొక యంగన కాళియనాగభేదికిన్. (ఆ. 2. 10) 157

తే. పడఁతుక పడంకుగుబ్బలిపడుకచెంతఁ, [5]గడము మ్రాఁకులకడ నుండుఁ గడఁకతోడ
వేఁడుకొనఁ దగు నాపువ్వుఁబోఁడి ననఁగఁ, గదలిపులు గావు సరళము ల్గాని కృష్ణ.

నృసింహపురాణమునందు:—

సీ. పా. వడిగాలి సుడిసిన మిడుఁగురులందందఁ బొదవినఁ దాలిమి[6]వదలనీక. (ఆ. 2. 14)

చ. కడిఁదివరంబు వారిరుహగర్భునిచేఁ గొనినాఁడు వాఁడు మీ
యెడ ననిశంబు [7]పెన్పగయుఁ నీసును రోషము నెమ్మనంబులో
జడిగొని యుండుఁ గావున నసాధ్యుఁ డవధ్యుఁడు దైత్యనాథుఁ డే
వడువునఁ బౌరుషంబు గొని వాని జయించుట ప్రేఁగు చూడఁగన్. (ఆ. 2. 135)

రాఘవపాండవీయమునందు:—

సీ. పా. పుడమిఱేఁ డీరీతిఁగడఁగి డెందము మృగవ్యాపారఖేలనమభిలషింప. (ఆ. 1. 19)

---

1. డొంకి (ప. వా). 2. అచ్చుప్రతిలో పాఠాంతరము లున్నవి. 3. తీర్పు. 4. దోయలో (ప). 5. గడిమిమ్రాఁకుల (సూ). 6. ప్రిదుల (అచ్చు). 7. పెన్పగ (పూ. ము.) పెను+పగ - 'పెన్పగ' అని కాని 'పెంబగ' (ప్రాఁతాదిసంధి) అని కాని యుండును. 'పెన్పగ' అను రూపము పొరపాటు. (రా).

తే. పోఁడిమియు నురవడియును నాఁడెమునను, బలుకులఁ దృతీయసరళముల్ వలసినపుడు
భువి స్వకీయానునాసికంబులును గాఁగఁ, బలుకఁబడు నాదికవుల కబ్బములకలిమి.

రంగనాథుని రామాయణమునందు ద్విపదము:—

రాణివాసద్రోహి రావణుఁ బట్టి, పోణిమి చెఱుపవా బుధులు నుతింప. 162

రాఘవపాండవీయమునందు ద్విరదగతి రగడము:—

పోణిమిగ వకుళకుజపూగములఁ బూగముల, రాణఁ దనరారిన పరాగముల రాగముల.
(ఆ. 2. 6)

కర్ణపర్వమునందు:—

తే. సారవంతమై కర్ణునిసైన్య మురవణించుఁగా కేమిటికి నిల్చు నృపవరేణ్య
పూని చేయంగ[1]ఁ దగినదిగాన కార్య, మతని సమయించుటయె నాకు నది భరంబె.
(ఆ. 2. 148)

శాంతిపర్వమునందు:—

[2]చ. యజనము దానకర్మములు నధ్యయనంబు తప స్సహింసయుం
బ్రజ కనురాగమైన పరిపాలన శాంతియు సంగరంబున
న్విజితవిభీతమై యురవణించుటయు న్నృపధర్మముల్ కురు
ప్రజతిలకాయమాన సమరంబు సుధర్మము వీనిలోపలన్. (ఆ. 2. 224) 165

చంద్రికాపరిణయమునందు:—

ఉ. నాణెము [3]సూడ నున్న దితినందను లందఱు నొక్కరాశి దు
ష్ప్రాణుఁడు వీఁ డొకండు నొక[4]రాశియుఁ బొందు జగంబు గాల్పఁ గ
ల్యాణవిదూరులౌ కడమ యందఱు పుణ్యజనాఖ్యులు న్జగ
త్ప్రాణసమాఖ్యుఁ డీ ఖలుఁడు నైరి సుఁడీ [5]విపరీతలక్షణుల్. 166

తవర్గాక్షరభేదంబులు

ఆ. వెతకి వాని కతికె జతికిలఁ బడి యావుఁ, బితుక చీర లుతికెఁ గొతికె ననుచుఁ
బలుకుచోఁ దకారముల దకారములును, వలసెనేని నిలుప వచ్చుఁ గృతుల. 167

కవిగజాంకుశమునందు:—

క. ఒదుగుచు లక్షణ మెఱుఁగక, కొదుకుచుఁ బ్రాసంబు వడియుఁ గూడక మీఁదుల్
వెదకుచుఁ బదసంధులు చెడ, నదుకుచు వెడకవిత చెప్పునతఁడుం గవియే. 168

---

1. వలయుఁ బ్రధానకార్య, మతని సమయించుటయ (అచ్చు). 2. అచ్చుప్రతిలో పాఠభేదము లున్నవి. 3. సూదగొన్న (ప). 4. రాశి యజుండు (పూ. ము.) 5. విపరీతలక్షణక్ (వా).

ఆముక్తమాల్యదయందు:—

చ. కదళిగభీరపుష్పపుటికాచ్ఛటఁ జేతుల నిప్పపిండి పైఁ
గుదురుగ నిల్పి యోపుగతి గూనల నూనియ నించి త్రాట ము
న్నుదికినకాటి ప్రేల నది నొక్కటఁ గ్రుంకిడి వత్తు రెంద జే
వదలక యాతనింట శనివారమునం [1]బరదేశవైష్ణవుల్. (ఆ. 1. 83) 169

చిత్రభారతమునందు:—

చ. చదివినవారికి న్వినినసభ్యుల కున్నతి వాంఛ సేయు బ
ల్లిదులకుఁ గల్గు విప్రులకు లేఁగలతోఁ గనుపట్టు లక్ష పె
న్మొదవుల నిచ్చునట్టి ఫలము న్హయమేధముసేయు పుణ్యముల్
గొదకక ధాత్రి యంతయు నకుంఠితదాన మొనర్చు శ్రేయమున్.(1-12)170

కళాపూర్ణోదయమునందు:—

చ. అది శతతాళదఘ్న మను సార్థకనామముతోడ నుత్తమ
హ్రదములలోఁ బొగడ్తఁ గనినట్టిది యందునఁ బడ్డవానికిన్
బ్రదుకులె యంచు...(ఆ. 4. 56) 171

వసిష్ఠరామాయణమునందు:—

చ. కదిసిన[2]నోరువోయి మఱి కబ్బపుదొంతుల సత్పదార్థముల్
గదుకుచు నెట్టివారిఁ బొడగన్నను గుఱ్ఱని స్నేహసౌఖ్యముల్
మదికి[3]నసహ్యమౌ శునకమార్గమునం [4]జరియించుచున్న త
త్పదకవు లెల్ల మత్కృతిత తప్పులు పట్టక యూరకుండుఁ డీ. (ఆ. 1. 7) 172

అంతస్థభేదంబులు:—

శబ్దానుశాసన మూలసూత్రము

మూ. సూ:—లఘువోఽలఘువ శ్చేతి ద్వేధా న్తస్థా న్వద న్తి శాస్త్రారః,
అన్యేఽన్యవ్యాకరణస్పష్టా ర స్త్వత్ర గృహ్యతే ద్వివిధః.

క. అలఘులఘునామకంబుల, నలరు నిరుదెఱంగు లగుచు నంతస్థము లీ
తెలుఁగున నయ్యెను రేఫము, యలవలు సెప్పఁబడి యుండు వ్యాకరణములన్.

క. ఆద్యంతాంతస్థంబులు, చోద్యంబగు పాణినీయసూత్రమువలనన్
హృద్యములై యాగమసం, [5]వేద్యా లఘ్వలఘువు లన ద్వివిధము లయ్యెన్. 174

---

1. బరదేశి (అచ్చు). 2. నోరువోవుదురు; నోరువోయియెుధు. 3. నసహ్యమై. 4. జరియింపకున్న సత్పద; జరియింపుచున్న సత్పద; దుష్పథకవు లెల్ల (సూ). 5. వేద్యా లఘులఘువులనఁగ (సూ).

వ. యవలు రెండు విధము లయినందు(న)కు.

పాణినీయసూత్రము

సూ. హలి సర్వేషామ్.

వృ. భో భగో అఘో అపూర్వస్య లఘ్వలఘూచ్చారణస్య యకారస్య లోపస్స్యాద్ధలి సర్వేషాం మతేన; భో దేవాః, భో లక్ష్మీః, భో విద్వద్బృంద, భగో నమస్తే, అఘో యాహి, దేవా నమ్యాః.

క. పలుకులఁ బ్రాకృతసూత్రము, వలనను ద్వివిధంబు లగుచు వసుమతిలోన
స్వలయుఁ దృతీయాంతస్థము, వలమును గొంచెంబు ననఁగ వనజదళాక్షా. 175

వల మనఁగా దొడ్డు అనుట; కొంచె మనఁగా సన్న మనుట.

లకారము రెండువిధము లైనందునకు వాల్మీకిసూత్రము:—

సూ. లో ళః పైశాచ్యామ్.

వృ. లకారస్య ళ స్స్యాత్, ముకులస్య-ముకుళః. గలస్య-గళః. ప్రలయస్య - ప్రళయః.

క. అంతస్థంబులలోపల, వంతున కనఁగా ద్వితీయవర్ణం బీ గ్రం
థాంతరమున నిరుదెఱఁగగుఁ, గంతుజనక రేఫ మన ఱకారం బనఁగాన్. 176

రేఫము ద్వివిధ మైనందుకు.

మూ. సూ:—రస్త్వత్ర గృహ్యతే ద్వివిధః.

టీ. రస్తు = రేఫ మయితేను, అత్ర = ఈ [1]యాంధ్రశబ్దచింతామణియందు, ద్వివిధః = రెండు విధములుగా, గృహ్యతే = గ్రహింపఁబడును.

యకారభేదంబులకు

మూ. సూ:—అద్యః క్రియాసుభూతాద్యర్థ[2]సముద్యోతితం వినా సర్వః.

సీ. ఆంధ్రోక్తిమొదల నాద్యంతస్థ ముండదు ప్రాణమై యది గనుపట్టుఁగాని
నడుగుల నడుమను గడను యా కెందును దలకట్టు దక్క నెత్వంబు లేదు
యాకు భూతాదిక్రియాద్యోతితములఁ జూపట్టు నెత్వము తలకట్టు గాదు
తలకట్టు వక్రము ల్దాల్చునీరెండును నలఘుయకారంబు లనఁగఁ బరఁగు

తే. నిప్పు డీవంకఁ గనుఁగొంటి నింతలోన, నెచ్చటికి నేఁగె ననఁగ నాద్యచ్చులయ్యెఁ
గయ్య మైనను గానిమ్ము గాయకమునఁ, గాయ వలె శౌరి ననఁ దలకట్టు లయ్యె.

సీ. ఎక్కడఁ గనఁబడియెడుఁ జక్రి చెలులార యింక నెవ్వరు చనియెదరు వెదుక
నీవేళ నెటకుఁ బోయెద వన్న మిన్నక యేఁగె న న్నేమనియెదరు మీరు
హేమాంగదము లిడియెదఁ జెప్పరే వాని నేరీతిఁ బొడఁగనియెదము మనము
హితము దలంపఁ డాయెను నన్నుఁ గని నగియెడు పవతుల కిది హేతువయ్యె

1. ఆంధ్రభాషయందు (మూ). 2. సముద్యోతిన మాద్యగం వినా (మూ.)

తే. అనుచు నిట్లు భూతాదిక్రియాపదాంత,ముల విశేషణభావిక్రియలను దక్క
మొదలియంతస్థమున కత్వములు త్రిలింగ, దేశభాషను బుట్టవు దితిజభేది. 178

ఆదియకారంబునకు నుద్యోగపర్వమునందు:—

తే. కొంచెమైనను దగఁ బంచి కుడువ మేలు, పనులయెడ దుఃఖ మోర్చి యల్పంబుసుఖము
ననుభవించుట హితము శత్రునకునైన, నిచ్చుటయె లెస్స యడిగినయెడ నృపాల.
(ఆ. 2. 47)

మధ్యయకారమునకు రుక్మాంగదచరిత్రమునందు:—

మ. ధననాథప్రియకంఠకాళిమము మోదం బొప్ప వీక్షించి చ
య్యన జంబూఫల మంచు డాసి నిజహస్తాగ్రంబు వే సాఁచి యే
పున బల్మాఖును బట్టి రాఁ దిగుచు వేల్పుం బ్రోడ విఘ్నేశ్వరుం
డనుమోదంబునఁ జేయు మత్కృతికి నత్యంతంబు నిర్విఘ్నమున్ (ఆ. 1. 8)

విజయవిలాసమునందు:—

మ. అనిన స్త్రీ మదిలోఁ దలంచునది మే లౌ సిద్ధసంకల్పు లీ
రని యావేళనె చిత్రవాహనుఁడు కొల్వై యుండఁగాఁ బోయి యా
యన రా ర మ్మని గారవించి సుముఖుండై రాజుగా రిప్పుడే
మనినా రెయ్యది వార్త లంచుఁ బయిపై నాసక్తితోఁ బల్కఁగన్. (ఆ. 2. 4)

వ. భూతాదిక్రియార్థంబులు దెలుపని కడపటి యకారమునకు. 182

విరాటపర్వమునందు:—

ఉ. స్వాంతము బాహుగర్వఘనసంతమసాంధము గాఁగ శంక యా
వంతయు లేక కీచకుఁ డహంకృతి ముంగలి నాగమంటపా
భ్యంతరసీమఁ జొచ్చి [1]దరియం జని యారసి సెజ్జఁ గాంచి య
త్యంతముదావహం బగుడు నందు రయంబునఁ గేలు సాఁపఁగాన్. (ఆ. 2. 331)

చమత్కారమంజరియందు:—

మ. ధరలోనన్ ద్విజరాజనామమున సత్సంగంబున న్సత్కళా
నిరతి న్మించియు నుత్పలప్రియుఁ డన న్నిత్యంబు రాజీవసం
హరణం బే కరజాలముల్ సొనిపి [2]చేయంబూను నీచంద్రుఁ డో
తరుణీ వీనికి నెంత చేసిన దయాదాక్షిణ్యముల్ గల్గునే. 184

క్రియాపదాంతయకారమునకు శృంగారనైషధమున:—

చ. అడిగితి నొక్కనాఁడు కమలాసను తేరికి వారువంబనై
నడచుచు నుర్విలో నిషధనాథున కెవ్వతె యొక్క భార్య య

1. కదియన్ (ప.) 2. సేయం (భూ. ము.); సేయుం (ప).

య్యెడు [1]నని చక్రఘోషమున నించుక యించుక గాని యంత యే
ర్పడ విన నైతి నీ వనుచుఁ బల్కినచందము దోఁచె మానినీ. (అ. 2. 58) 185

తే. ధరణి నుయ్యేల పయ్యెద తాయెతులను, గల యకారంబులకు వక్రములు నిజంబు
ముద్దరాజురామన వానిమూఁటిని బద, మధ్యయా లని చెప్పె నిమ్మాట మిథ్య. 186

తే. ఊఁచు నెలకాకగుటచేత నుయ్యెలయ్యెఁ, బయినియెద కునికివక్రోక్తిఁబయ్యెదయ్యెఁ
దల్లి కాపునకై కట్టఁ [2]దగినయెత్తు, తేలఁ బల్కఁగఁ దాయెతు శ్లేశ్యమునను. 187

వ. హేలాశబ్దమునకు దద్భవము ఏల. అది కుఱుచ కాకు చేస్తేను హ్రస్వముగాను బలికితేను ఎల అయినది. ఊఁచేటి ఎల కనక ఉయ్యేల. హృదయశబ్దమునకు తద్భవము ఎద ఆయెను. [3]దానికి పై నుండేది గనక వక్రసమాసముచేస్తే పయ్యెద యాయెను. ఎత్తు లనగా దక్షిణదేశీయమున దండలకుపేరు. దానిజడ్డను తేలను బలికిన ఎతులాయెను. తాయి యనఁగా తల్లి, ఆ తాయి శిశువులకు శరీరరక్షగాను కట్టునది యెతులు గనుక తాయెతులు. అటుగనక శబ్దాదినున్న అచ్చులుగాని హల్లులు గావు. సంధిచేతను లఘు యకారము లైనవి. ఇవి మూఁడును ప్రత్యేక పదములు గాని యేకపదములు గావు. వీనిని తెలియక ముద్దరాజు రామన కవిలోక సంజీవనిలోను చెప్పికొనిన పద్యము. 188

తే. "తాయెతులు నుయ్యేలయుఁ బయ్యెదయును దక్కఁ
గలుగ దెత్వంబు మధ్యయకారమునకుఁ
దుదిని గ్రియఁ దక్క నెత్వంబు గదియ దాది
నత్వ మొందదు దెలుఁగున నబ్జనాభ. 189

*ఉయ్యేలకు నరణ్యపర్వమునందు:—

చ. కలి దమయంతిఁ బావ సమకట్టె పొరింబొరిఁ బాయ నోపఁ డా
లలనను దీర్ఘసౌహృదబలంబున నిట్టులు రెంటియందు న
న్నలుఁడు విమోహరజ్జులు పెనంగ గతాగత[4]కారియైన యు
య్యేలయునుబోలె నూఁగడక యెంతయు బ్రొద్దు వినిశ్చితాత్ముఁడై. (అ. 2. 78)

*పయ్యెదకు యయాతిచరిత్రమునందు:—

సీ. పా. వలఁ బడ్డజక్కవల్ వలె నున్న జిలుఁగుపయ్యెదలోనిగుబ్బ పాలిండ్లు మెఱయ.

*తాయెతునకుఁ జంద్రభానుచరిత్రమునందు:—

సీ. పా. ఒకయింతి యొరఁగినసికమీఁదముడిపువ్వు టెత్తులు[5]దోరయుఁ తాయెతులు చుట్టి."

---

1. యయ్యెడుమని (పూ. ము)-ఇందు మకారాగమము ప్రమాదపతితము. (రా.) 2. దగినసరులు (గి). దగినయెత్తు (ప). 3. దానికి చేసినను......సము పయ్యెద (పాఠాంతరము). *ఈ మూఁడు పద్యములు కవిలోకసంజీవనియం దున్నవి. 'కలి దమయంతి' అను పద్యము భారతముద్రితప్రతిలోఁ బాఠభేదము గలదై యున్నది. 4. కాయుఁడయ్యెను (పూ. ము). 5. చోరయు (ప).

## లఘుయకారమునకు

**మూ. సూ:**—య శ్శ్రుతి మార్యా లఘుయం ప్రవద న్తి ప్రాణతః పరం ప్రాణమ్.

**తే.** తొలిపదము తుదివర్ణంబుతోడఁ దనరు, సంధి లేని పదాదిగస్వరము లెల్ల
లఘుయకారంబులై భూతలమున వెలయు, దేవకీపుత్ర జాంబవతీకళత్ర. 193

క. సురనది యాత్మజ కాళో, దరపతి యాసనము మరుఁడు తనయుఁడు రతిసుం
దరి యన్న ననుఁగుఁగోడలు, సిరి [1]యంగన యబ్ధి యిరవు శ్రీహరి కెపుడున్. 194

## రేఫభేదంబులు

**తే.** రేఫము ఱకారమును నన రెండు దెఱఁగు, లగుచు వికృతిపదంబుల నమరియుండు
వాని సంస్కారపూర్వకావ్యప్రయోగ, సరణుల నెఱుంగవలయు సజ్జనవిధేయ.

వ. సంస్కార మనఁగా లక్షణవంత మనుట. ఇందులోపలనే భాషాపరిచ్ఛేదమునందుఁ
జెప్పఁబడియున్నది. 196

**తే.** ప్రకృతి శబ్దానుశాసనోభయకవిసఖు, శంభుసేవకసోమభాస్కరులచేత
భారతాదుల విభజింపఁబడియెఁ దొల్లి, కరివరద రేఫములును ఱకారములును. 197

## రేఫాక్షరసీసమాలిక

శ్రీకామెపల్లిపురీగోపికాజార యసురసంహార నీ కంకితముగ
నాదికవీంద్రకావ్యము లెల్ల శోధించి క్రమత హ్రస్వములు దీర్ఘములు నైన
యచ్చులమీఁదను హల్లులమీఁదను గలుగు రేఫఱకారములు వచింతుఁ
[2]దాళ్ల పాకాన్వయోదధిపూర్ణ ధవళదీధితి [3]పెద్దతిరుమలదేశికుండు
మొదలైనవారలు మునుపు రచించినయవి యెల్లఁ జాలవా యనఁగ వలదు
వెండియు నొకకొన్ని వెదకి కూర్చితిఁ గవిరాజులు మే లని ప్రస్తుతింప
నిట్టి వెట్టియు నని యిట్లు క్రిందను జడ్డ లుండెడు లిపు లెల్ల బండితాలు
వీని ద్విత్వము లొకవేళఁ బోయినఁ బోవు జెఱిపోఁతు కఱిమేఁక గొఱియ యనఁగఁ
జనిరి కాంచితిరి చేకొనియెద రనియెదునవి మొదలైన క్రియాపదముల
తుదలను సంస్కృతపదములందును దద్భవములయందును ఱకారములు లేవు
క్రచ్చఱ బ్రతుకుట గ్రాలుట మొదలగు క్రారము ప్రేఫవర్ణము లె యగును
జేకూఱె ననుటకుఁ జేకుఱె నని యిట్లు పొడుగు లెల్లను హ్రస్వములుగఁ జేసి

---

1. యబ్ధియు నాలుఁ బంపు (పూ. ము). 2. తాళ్లపాక పెదతిరుమలా
చార్యులు రేఫ ఱకారనిర్ణయ మను గ్రంథము రచించె (రా). 3. పేటి (పు);
పెద (పూ. ము.)

పలికెడువేళ రేఫములును డాలును మునుపటి[1]యట్లనే తనరుచుండు
రా దక్క సకలాక్షరములమీఁదను [2]గార కవియ నకారక్షకారము లన
నట రవర్ణమున కొక్కటికిని బై నిఫ యని నిల్పుటను రేఫ మనఁగఁబరఁగె
నరదంబు సేనాంగ మరుగుట పోవుట యరి కప్పు మర సగ మరుదు వింత
యరయుట వెదకుట యిరవొందు టమరుట యిరుపదంబు యుగార్థ మిరవు సెళవు
కలనఁ బెట్టురుముట గద్దిక సేయుట యురణించు టురు [3]లొద్దు టురులఁ ద్రోయు
టురువడించుట [4]వీఁక నొత్తుట యురువడి యురియాడుటయు డెంద మురియఁజేయు
టెరగలి చిచ్చు మేఁకెరు వెరమానుట యెర నాఁగ భోజనం బిడి యెరియుట
యొరు లొండొరులసొమ్ము లొరయుట [5]యొరిమె కేకరివాఁడిదూఁపులు కరిసెముకృషి
కరువలి పుత్తడి కరఁగి యీ కరణిని గరుగునఁ బోసి యొక్కరుఁడు చేసెఁ
గరవాలు ముక్కర కరకరల్ కరకరి కరిగొరుటలు కనికరము వాన
గురియుట తొలకరి కొరఁ బ్రాణములు కరకరఁ గ్రాలి కరమొప్పఁ గెరలి పడుట
గరిత బంగరు మేను గరుదాల్చెఁ గరిచేడి గరిగె చేఁబట్టుట గరువతనము
గిరగిర వ్రాయ వేగిరపడి జేగురుకొండపై గురుపోతు గురుసు పట్టి
గురువులు వాఱుచు గురువుగా గురుగాకు గురుగులఁ బెట్టి ముగ్గురును పండి
[6]చెరుచుటయును మరి చెచ్చెర చేటను జెరుగుట చెరువులోఁ జొరువఁ జేసి
చొరక యచ్చెరువుగా చిరుఁగనికొకల చెరఁగులు చించుట చెరగు మనుట
తరచి యాడుటయుఁ జిత్తరుబొమ్మ తరఁగలు తరిచినమజ్జిగ తరము బడిత
తరము శక్యము మూఁడుతరములచుట్టంబు తరలఁబారుట తరతర దిరుగుట
తిరిసిన కూడు మార్తురమేనినెత్తురు తెరలఁ గాఁగిననెయ్యి తెరువు [7]తోడు
తెరతెర వచ్చుట తెరలు గట్టుట రెండు[8]తెరఁగులవారిలో దొరలుకొనుట
తొరితొరి చెమ్మట దొరగుట బెదరుట దరి ద్రొక్కి జూదరి దరికొలుపుట
దురము సేయుట దురదురఁ బోయి కుదుపట దొరయుట సరియాట దొరకొనుటయు
దొర రాజు దొరకోలు దొరసుట పొసఁగుట నర[9]వెంద్రుకలు పెద్దనరము నురుగు
నెరయఁగాఁ జల్లుట నెరసులు పరుసంబు పరువులు వెట్టుట పరపు నిడుపు
పరిచను డెంచుట పరిగొని నరిపరి పరపుట నించుట పరువడి యనఁ
బరిమారుచుట పెనుపరి నేరుపరి దొడ్డపరి చప్పరంబు దెప్పరము పరగఁ
బరికింప పరసు పొఁచిరి వోవఁ బిరిగొని పురపురఁ బొక్కుట పురిఁటితగవు.

---

1. యట్లన (సూ). 2. గ్రారఁ పూ. ము). 3. లొగ్గ (ప). 4. వీఁగ (ప). 5. యొరిమి (వా). 6. చెరుచుట, చెరువు - శకటరేఫఘటితము గా నే ప్రయోగములు గలవు. అప్పకవి మతమున నుభయరేఫలు గలవు (చూ. అకారాదిసమాలిక పుట 84.) (రా). 7. దారి (సూ). 8. శ. ర. లో, తెఱఁగు అనేకాని తెరగు అనిలేదు. (అప్పకవి దీనిని ఉభయరేఫ ఘటితముగా నిచ్చియున్నాఁడు. (రా). 9. వెంట్రుకలు (ప. వా.)

పురుడీడు పురికొలుపుట తుట్టెపురుగులు పెరుగుట నిక్కుట పెరుగు పెరడు
పెర తేనె పొరిపొరి పొరుగునఁ బొరిగొని పొరిగడుగుట పొరపొచ్చెము పొర
పొరలుట చీపురు పొరకలు బరికట్టె బరుజులు గజ్జెలు బరవసంబు
బరు లుబ్బఁగా నాసవాలు ద్రావుట బరిమేను గంధపుచెక్కమీఁదిబరడు
బిరుదు లబ్బురము గొబ్బెరకాయ పెరయుట బురబురఁ బొంగుట [1]బురదనేల
మరులు మోహము బుద్ధి మరుపుట తామర మరియాద [2]క్రమ్మర మరలి చనుట
మిరియంబు మురిపెంబు మురియలు తునియలు మురమురలాడుట మెరమెరయును
మొరపనేలయుఁ దేంట్లుమొరయుట మొరడును రమ్మని పిలుచుట రచ్చ రంగు
రంకెలు రజ్జులు రమణ రక్కసి రహి రిచ్చలు రిత్తయు రెట్ట రెండు
దేవర వివరంబు తెరువరి తలవరి యెవ్వరు నివ్వరు నవ్వ రనఁగ
వరిచేను వరుజులు వరు(ర)సయు [3]వరపును నోవరి విరవిరఁ బోవు టనఁగ
విరిసినవిరు లెల్ల విరియఁ జల్లుట కొలువురు పలువురు నలువురు పదువురు
వెరువరి [4]వెరువాక వెరుసు దూసరివడ్లు సరకు లమ్ముట సరి సరకు కొనమి
సిరికి నై సురియల సురుగుట సిరిబడి [5]సొరిది మోహరములు హరువు గనుట
మొదలుగా నొకకొన్ని పదముల హ్రస్వాక్షరములపై రేఫంబు లమరియుండు
[6]నారెకు ల్తలవరు లారాట మారటం బారఁ గూరినశోక మారఁ గాఁగి
నట్టిపా లారనియనల మారఁగ ధర్మ మారసెఁ దన కన్నులారఁ జూచె
శ్రమ మారెఁ బొంగారెఁ జల్లారెఁ దనరారె సిరికె లెత్తుట యిగురువెట్టు
టీరేడు జగము లీరెలుఁగు హీనస్వర మీ రన నిమ్ము పేరూరు పల్లె
యూరార్చు టూరట యూర కుండుట దొంప లేరీ యనుట యిది యేరి కనుట
యోరోరి యనుమాట కోరుచుకొనుటయు నోర వోయినగొనె లోరసిలుట
[7]కారులు కల్లలు కారుమెఱుంగులు పటుకారు ముక్కారుపంట రిపులు
కారు కారించుట కడు నొప్పి పెట్టుట కారాకు కారాట కారియంబు
కూరుట పొరలుట కూరుకు నిద్ర చేకూరుట కూరిమి కూర దినుట
యెమ్ములు గూరగా నేయుట గాతంబు గూరుట దానికిఁ గూరుతు ననఁ
గోరికె గోరుట కోరప్పనము పంది కోరాడి కోరడె కోర గిన్నె

---

1. శ. ర. లో, బురద అనేకాని బురుద అనిలేదు. 2. క్రమ్మఱ=శకటరేఫఘటితముగ సూ. ని. లో నొసఁగఁబడినది. అప్పకవి యుభయరేఫఘటితముగాఁ జూపెను. 3. వఱపు-శ. ర. రేఫ అకార నిర్ణయ గ్రంథములలో వరపు అను రూపమే గ్రహింపఁబడినది (రా). 4. వెరువార (ప. వా.) 5. సొరది (ప. వా.) కాని శ. ర. లో సొరిచి అనే కాని సొరిది అని లేదు. 6. ఆరెకు. 7. శ. ర. లో శకటరేఫమే కాని లఘు రేఫము లేదు. లఘురేఫమనుటకుఁ బ్రయోగము మృగ్యము. శకటరేఫమనుటకు భారత ప్రయోగముగలదు (రా).

గాఱెలు భక్ష్యముల్ గాఱాము బంగారు గోఱు గాఱాబంబు గారవంబు
చీఱికిఁ గొన క్రైదుచీఱలు చేఱుట చేఱువ చెంతలఁ జేఱఁ డనఁగఁ
జేఱుట పిలుచుట చూఱనఁగాఁ బొడి చేఱు ద్రావుట చూఱి చిన్నికత్తి
తాఱెల్ల నేగిరి తీఱనికినుకతోఁ దూఱపునాటికిఁ దేఱు లెక్క
తేఱెద మఱచు వేతేఱ తెఱకు తేఱ తేఱోఱి సొమ్ములు తోఱముగను
దూఱులువలుకుట నాఱచీఱలు వింటినాఱి విన్నాఱు కన్నాఱ మనఁగ
నీఱు ద్రావుట పోఱ నీఱయి పోవుట నేఱుపు నేఱేడు నోఱువడుట
పూఱేడు జగడంబు పేఱుట పే ఱాఖ్య పేఱిననేతులు పేఱురంబు
పోఱామి పోఱచి పోఱోఱి యనుటయు పోఱుట పోఱాట పోఱితంబు
బాఱుగట్టుట దైత్యుబాఱికిఁ దప్పుట బాఱెఁడు బీఱండు బూఱటిలుట
బూఱుగుచెట్లలో బూఱగ యూఁదుట బూఱెలు బేఱంబు బేఱజంబు
బోఱనిమ్రోయుట బోఱఁగొండ లనంగ బోఱలు క్రిందుగా బోఱగిలుట
[1]మాఱటమూర్తియై మాఱిమసఁగుట మాఱేడు వేమాఱు [2]మాఱుతు ఱన
మీఱలు మేఱలు మోఱతోపు లనంగ ఱాయంచ ఱాచూలి [3]ఱాయడి పడి
ఱాణ ఱాణించుట ఱాయలు ఱాణువ ఱాపాడి ఱాముల్కి [4]ఱాసు ఱావి
ఱాచుట ఱాఁజుట ఱాయుట ఱాలుట ఱాగిల్లుటయును ఱాఱా యనుటయు
ఱాము పొమ్మనుటయు ఱారాపు వలదు పోఱా వినుఱా యేలఱా చలంబు
ఱీతి గా దనక నీఱీతి ఱూపించుట ఱూపుట ఱూపఱి ఱూపు ఱూక
ఱేయి గేదంగిపూఱేకులు ఱేయెండ ఱోఁజు ఱోఁకలి ఱోలు ఱోవెలంది
ఘనులార బాలురు కాలారి జాలారి లేఱు కోలారి తలారి [5]కాంద్రు
వాఱువ మశ్వంబు వాఱనికోపంబు వాఱించుకొనుటయు వాఱకులును
వాఱక వాఱ లెవ్వాఱును దెలియనివాఱు గా ఱిది యెల్ల వాఱకంబు
వీఱలసాటి లే ఱీఱాజ్యమున నన సాఱెల జూదంబు సాఱెసాఱె
సైఱణ లేక వేసాఱుట సూఱెలు సోఱణగండ్లును సేఱుపసపు

తే. సౌఱు సౌఱంబు నోడబేహాఱి వింత, హోఱ యను నిట నాదిగా నొక్కకొన్ని
తెలుఁగుపలుకులలోపల దీర్ఘలిపుల, పైనిఁ దనరారుచుండు రేఫములు కృతుల.

---

1. మాఱట-శకటరేఫముగా నిఘంటువులు గ్రహించెను; ప్రయోగములును గలవు.
2. మాఱుతుఁడు-అని నిఘంటువులలో శకటరేఫఘటితముగాఁ జూపఁబడినది. 3. ఱాయిడి (పా). 4. ఱాసు (సూ.) ఈశబ్దము నిఘంటువులలో లేదు (రా). 5. కాండ్లు (పూ. ము); కాళ్లు (ప).

## హ్రస్వాక్షరములమీఁది రేఫములకు రూపములు

అరదము=సేనాంగము
అరుగుట=పోవుట
అరియనఁగాఁ దనకంటె దొడ్డ రాజునకుఁ బెట్టెడుపన్ను.
అర=అనఁగా సగము
దీనికి లక్ష్యములు.—
అరగంటఁజూచుట = సగము కంటఁజూచుట, అరవాయి=సగమునోరు, అరగొఱఁత=సగముతక్కువ- ఇవి మొదలైనవి.
అరుదు=వింత
ఆరయుట=వెదకుట
ఇరవొందుట=అమరుట
ఇరు=అనఁగా రెండు. దీనికి లక్ష్యములు.—
ఇరువాగు=ఇరువంక
ఇరువురు=ఇద్దఱు
ఇరువాయి=రెండునోరులు
ఇరుగేలు=రెండు చేతులు
ఇరుమేను, ఇవి మొదలయినవి
ఇరవు=నెళవు
[1]ఉరుముట=జగడమునగద్దించుట
ఉరణించుట
ఉరులొడ్డుట = వేఁటకాని పని
ఉరులఁద్రోయుట = కోటలు మొదలయినవిపడఁగొట్టుట
ఉరవడించుట = పీఁకనొత్తుట
ఉరువడి=బిగ్గర
ఉరియాడుః = డెంద మురియఁజేయుట
ఎరగలి=చిచ్చు
మేఁకెరువు = మేఁకపెంట్రి కలు
ఎరమానుట = [2]ఎరపరికరము విడుచుట, ఎరగా నాహారముఁబెట్టుట
ఎరియుట
ఒరులు=అన్యులు
ఒండొరులు=ఒకరొకరు
సొమ్ములొరయుట = ఒరగంటను వ్రాయుట
ఒకరిమె = కలిపికోలుతనము, ఒరిమి యనియుం గలదు
కేకరి=వాఁడితూఁపులు
కరిసెము=కృషి
కరువలి=గాలి
పుత్తడి కరఁగుట = కంసాల వానిపని
ఈ కరణిని=ఈ రీతిని
కరుఁగునఁ బోయుట=పోఁతఁ బోయుట
ఒక్కరుఁడు
కరవాలు=ఖడ్గము
ముక్కెర=ముత్తెము
కరకరలు
కరకరి
కరిగొరుట
కనికరము=పాడి
వాన గురియుట
తొలకరివానలు
కొరఁబ్రాణము
కరకరఁగ్రాలుట
కరమొప్పుట = మిక్కిలి యొప్పుట
కెరలుట
గరిత=పతివ్రత
బంగరు=పైఁడి
మేను గరుదాల్చుట = గగురుపొడుచుట
గరిచేడిగరిగె = పెండ్లి వేళ చేతఁ బట్టుకొని యుండెడి ముంత
గరువతనము = సరకుసేయక పోవుట
గిరగిర వ్రాయుట
వేగిరపడుట
జేగురుకొండ
గురుపోతు
గురుసుపట్టి
గురువులు వాఱుట = గమన విశేషము
గురువుగాను=దొడ్డగాననుట
గురుగాకు=గురుగుకూర
గురుగులు=పిడతలు
ముగ్గురు
[3]చెరుచుట
చెచ్చెర
చేటను చెఱఁగుట
చెరువు=తటాకము
చొర(రు)వఁ జేసికొనుట
చొరక=చొరకపోవుట

1. 'ఉఱుము' అని శకటరేఫముగా సూ. ని. లోఁ జూపఁబడినది (రా). 2. విపరికము విడుచుట (వా). 3. చెరుచుట-చెఱుచుట-అను ద్వైరూప్యము అప్పకవిసమ్మతము చూ. పుట. 88 (రా).

అచ్చెరువు
చిరుఁగని కోక
చెరఁగులు=అంచులు
చెరగుమనుట
తరచియాడుట
చిత్తరువు=బొమ్మ
తరఁగలు=కరళ్లు
తరచిన మజ్జిగ
తరము=బడిత
తరము గాదు=అనఁగా శక్య
ము గాదను
మూఁడుతరముల చుట్టము
దేహము తరలఁబారుట
తరతర
తిరుగుట=సంచరించుట
తిరిసిన కూడు
మార్తురు=పగవారు
మేనినెత్తురు
తెరలఁగాఁగిన నేయి
తెరువు తోడు
తెరతెర వచ్చుట
తెరలు గట్టుట [తెగలు
రెండుతెరఁగులు = రెండు
తొరలుట=కలయుట
తొరితొరి
చెమట దొరఁగుట
బెదరుట
తరి ద్రొక్కుట
జూదరి
దరికొలుపుట [సేయుట
దురముసేయుట = జగడము
దురదురఁ బోవుట
కుదురుట
దొరయుట = సరివచ్చుట

దొరకొనుట
దొర=రాజు
దొరకోలు
దొరసుట=పొసఁగుట
నర వెండ్రుకలు
పెద్దనరము=జీవనరము
నీటినురుగులు
నెరయఁ జల్లుట
నెరసులు
పరుసము
పరువులు వెట్టుట
పరపు నిడుపు
పరిచను దెంచుట
పరిగొనుట
పరిపరి
పరపుట=నించుట
పరువడి
పరిమారుచుట
పెనుపరి
నేరుపరి
దొడ్డపరి
చప్పరము
దెప్పరము
పరగ
పరికింపుట
పరసు
పొంపిరివోవుట
పిరిగొనుట
పురపురఁ బొక్కుట
పురిటితగవు
పురుడు=ఈడు
పురికొల్పుట
తుట్టెపురుగులు
పెరుగుట=నిక్కుట

పెరుగు
పెరడు=ఇంటివెనుక
పెర=తేనెతెట్టె
పొరిపొరి
పొరుగు
పొరిగొనుట
పొరిగడుగుట
పొరపొచ్చెము
పొర
పొరలుట
చీపురు
పొరకలు
బరిగట్టె
బరుజులు=గజ్జెలు
బరవసము
బరులు=ప్రక్కలు
బరిమేను = గంధపు చెక్క
మీఁది బరడు
బిరుదులు
అబ్బురము
కొబ్బరకాయ
బెరయుట
బురబురఁ బొంగుట
బురదనేల
మరులు=మోహము
బుద్ధిమరుపుట
తామర=ఒక పువ్వు
మరియాద
క్రమ్మర
మరలి చనుట
మిరియము
మురిపెము
మురియలు=తునియలు
మురములాడుట=కోపము

మదిలో మెరమెర
మెరపనేల [యంట
(తేంట్లు) మెరయుట=కూ
మెరడు=మోటు
రమ్మని పిలుచుట
రచ్చ
రంగు
రంకెలు వైచుట
రజ్జులాడి
రమణ
రక్కసి
రహి
రిచ్చపడుట
రిక్తకు రిత్త
రెట్టపడుట
రెండుచేతులు
దేవర
వివరము
తెరువరి
తలవరి=తలారి
ఎవ్వరు
దానమివ్వరు
నవ్వరు
పరిచేను
పరుజులుగట్టుట
వరుస
వరుపు(వరపు)=వానలేకుంట
ఓవరి
విరవిరఁబోవుట
విరియుట=విప్పుట
విరులు=పువ్వులు
విరియఁజల్లుట
కాలువురు=కాల్బలము
పలువురు

నలువురు
పదువురు
వెరవరి
వెరవాక
వెరుసులు వేయుట
దూసరివడ్లు=ధాన్యవిశేషము
కేసరులు, దినసరులు మొదలయినవన్నియు
సరకు అమ్ముట
సరి [బోవుట
సరకుగొనమి = సరకుసేయక
సిరి=లక్ష్మి
సురియలు=చూరకత్తులు
సురుఁగుట=చచ్చుట
సిరిబడి
సొరిది=చాలు [ద్దమైన
మోహరము=దండునకుఁబె
హరువు=ఉపాయము
ఇవి హ్రస్వాక్షరముల మీఁది రేఫములు.

దీర్ఘాక్షరములమీఁది రేఫములకురూపములు
ఆరెకులు = తలవరులు
ఆరాటము
ఆరటము [నాడినదుఃఖము
ఆరఁగూరినశోకము = తీర
ఆరఁగాఁగినపాలు [యగ్ని
ఆరనియనలము = శమింపని
ఆరగధర్మము
ఆరయుట=పరామర్శించుట
తనకన్నులారఁజూచుట = కన్నులనిండుగఁజూచుట

శ్రమమారుట = బడలిక దీరుట
పొంగారుట = పొంగుదీరుట
చల్లారుట=చల్లఁదనము నిం
తనరారుట [డుట
ఈరికలెత్తుట=ఇగురు వెట్టుట
ఈరేడుజగములు
ఈరెలుఁగు=హీనస్వరము
ఈరు=ఇయ్యరు
ఊరు=గ్రామము [ఫుట
ఊరార్చుట = దుఃఖముడు
ఊరకుండుట=చాలించుట
దొంగ లే రని యడుగుట
ఇది యేరికి=ఎవ్వరి కనుట
ఓరి యని పిలుచుట
ఓరుచుకొనుట
ఓర వోయినగోళ్లు
ఓరసిలిపోవుట
కారులు=కల్లలు
కారుమెఱుంగులు
పటుకారు
ముకారుపంట
రిపులుకారు
కారించుట=నొప్పిచేయుట
కారాకులు
కారాటము=వ్యాపనము
కారియము=కర్జము
కూరుట = పొరలుట
కూరుకు=నిద్ర
చేకూరుట
కూరిమి
కూరదినుట
ఎమ్ములు గూరఁగాసేయుట = ఎముకలునాటసేయుట

గాతము కూరుట = నాటుట
దానికిఁ గూరుతు ననుట
కోరికె
కోరుట
కోరు=అప్పనము
పంది కోరాడుట
కోరడి = ఆవరణముగా వేసిన
పాడిమట్టిగోడ
కోర=గిన్నె
గారెలు=భక్ష్యములు
గారాము
బంగారు
గోరు=నఖము
గారాబము
గారవము
చీరికిఁ గొనక
చీరలు=కోకలు
చేరుట
చేరువ=సమీపము
చేరఁడు
చీరుట=పిలుచుట
చూరు=పొడి
చేరు ద్రావుట
చూరి=కొంచెపాటికత్తి
తారెల్లరు=తమ రందఱు
తీరనికినుక=శమింపని కోపము
తూరుపునాఁడు
తేరులు=రథములు
తేరెదము అనుట
ఏ తేరిన=వచ్చితేని అనుట
తేరకు తేర, తేతేర యని
యుం గలదు [యనుట
తేరోరి = సొమ్ములు తేరోరి

తోరము
దూరులువలుకుట
నారచీరలు
వింటినారి
విన్నారు
కన్నారము
నీరు ద్రావుట [ట
పోర నీరయిపోవుట=చచ్చు
నేరుపు
నేరేడు-ఒకచెట్టు
నోరుపడుట
పూరేడు పిట్ట
జగడము పేరుట
పేరు=నామము
పేరిన నేతులు
పేరురము = పెద్ద ఱొమ్ము,
పేరాముదపు గింజలు
మొదలయినవి
పోరామి
పోరచి=కూర [యనుట
పోరోరి = పోరా యోరి
పోరు
పోరాటము
పోరితము
బారు కట్టుట
దైత్యుబారికిఁ దప్పుట
బారెఁడు
బీరము
బూరటిలుట
బూరుగుచెట్టు
పెద్దబూరుగ యూఁదుట
బూరెలు=పిండివంటలు
ఓడబేరము

బేరజము
బోరని మ్రోయుట
బోరుగొండలు [గిలుట
బోరలు=క్రిందుగాను బోర
మారటమూర్తి
మారి మసంగుట
మారేడు
వేమారు
మారుతురు=పగవారు
మీరలు=మీరును
మేరలు
మోరత్రోపు
రాయంచ
రాచూలి
రాయడిపడి
రాణ
రాణించుట
రాయలు
రాణువ
రాపాడి=రాచినపొడి
రాముల్కపండు
[1]రాను=యథార్థము
రావిచెట్టు
రాచుట
రాఁజుట
రాయుట
రాలుట
రాగిల్లుట
రారా యని పిలుచుట
రాము పొమ్మనుట
రారాపు
వలదు పోరా
వినురా

1. రాను; రాసు (నూ) - ఈశబ్దము నిఘంటువులలో నెందును గానరాదు.

| | | |
|---|---|---|
| ఏలరా చలము | ఘనులార-సంబోధనము | ఎవ్వారు |
| రీతి గాదు=నడితి గాదు | బాలురు-ప్రథమాబహువచ | తెలియనివారు గాను |
| ఈ రీతి | నము | వారకము |
| రూపించుట | కాలారి | వీరలసాటిలేరు |
| రూపుట=ఒకరిని తెలుపుట | జాలారి | సారెల జూదము |
| రూపరి | లేరు | సారె సారె |
| రూపు చెడుట | కోలారివాఁడు | సైరణ లేక |
| బంగారురూక | తలారికాఁడు | వేసారుట |
| రేయి=రాత్రి | వారువము=గుఱ్ఱము | సూరెలు |
| గేదంగిపూరేకులు | వారనికోపము=శమింపని | సోరణగండ్లు |
| రేయెండ=వెన్నెల | కోపము | సేరుపసుపు |
| రోఁజు పుట్టుట | వారించుకొనుట | సౌరు |
| రోఁకలి | వారకలు | సౌరంబు |
| రోలు | వారక | ఓడబేహారి |
| రోవెలఁది=లంజ | వారలు | వింతవారోరలు |

ఇవి దీర్ఘాక్షరములమీఁది రేఫములు

అకార సీసమాలిక:—

ఆఱవఱ లనఁ దునియలు నోట నఱచుట యఱిముఱి యఱగోఱ లఱము టబ్బ్ర
[1]టఱకటఁ బెట్టుట యఱచేత నఱకాల నఱవలు ద్రావిడు లఱువు దఱిసె
లఱిగిపోవుట కొంచె మగు టఱమఱ సేయు టఱ లేక చను టఱు గఱపుకొనుట
అఱువది కో ట్లఱపోఱఁడు గు జ్జుక్కుఱి రూపఱి పోలుపఱి యేపఱచుట
పెంపఱి సిగ్గఱి బిట్టఱి పెల్లఱి యఱయిల్లు క్రచ్చఱ యక్కుఱపడి
[2]యఱకమ్మట మఱంటు లఱ టఱకం బిఱియుట కదియుట యిఱియుటయును నన
[3]లిఱులు చీఁకటి బండియిఱుసు క్రిక్కిఱియుట యిఱుకటం బిఱుకన్న మిఱిసిచెడుట
యుఱఁడు గైకొనఁ డేరి నుఱుకుట వే చను టుఱపదం బెల్లెడ నురుతరార్థ
ముఱు వన్నలా వను టఱిది బెట్టిద మయ్యె నుఱక మానక మొగు లొడ్డి యుఱిమె
నుఱుకట్టి బలముఱి యుఱియ ని ల్లుఱియుట యుఱనిరోషంబున నుఱుతపట్టి
[4]యెఱబఱికంబున సెఱఁగుట మ్రొక్కుట యెఱుపు కెం పెఱుకువాఁ [5]డెఱుకఁజెప్ప
టెఱకలు నా ఱెక్క లెఱుఁగుట తెలియుట [6]యెఱవుసొమ్మొకరిది యెఱచి మాంస

---

1. టఱకట పొదుగుట (ప); టఱకడఁ బెట్టుట (వా). శ. ర. లో. అఱకడ అనియేకాని అఱకట యని లేదు (గి). 2. అఱకమ్ము టమఱటులఱకువ యిఱియుట కది యుట యిఱియ్యుట కలనుటయును (ప). 3. ఇరులు-ఇందు లఘురేఫమే కాని శకట రేఫ మున్నట్లు దోఁపదు. చూ. సూ. ని. (రా). 4. ఎఱపఱికము. (శ్రీ. ము.) 5. ఎఱికె. 6. ఎరవు - నిఘంటువులలో లఘురేఫముగాఁ జూపఁబడినది. ఇందులకు భారత ప్రయోగమును గలదు (రా).

మొఱలుట విలపించు టొఱవ దేహం బొఱగాల నుండుట యొఱ కత్తిమూఁత
యొఱకటంబునఁ బోవు టొఱపులు నాఁ డెక్కు[1]లొఱగుబిళ్ల తలాడ యొఱగువంక
కఱపుట నేర్పుట కఱతలు సోకిళ్లు కఱదలు బుద్ధులు కఱటి మంకు
కఱకు కాఠిన్యంబు కఱవు దుర్భిక్షంబు కఱ కప్పు మెకములఁ గఱచుఁ గుక్క
కిఱపుట కెఱయును క్కెఱయుబ క్కెఱయును గుఱుమాపుకుఱుగంద్లకుఱుచ[2]కుఱులు
కుఱువలిగొనుటయుఁ గుఱుకుఱ కుఱుకలు నుఱుగొని కుఱుఁగడ కుఱుపు వ్రణము
కొఱకొఱలాడుట కొఱఁత తక్కువ పండ్లు గొఱకుట కోపంబు కొఱడు వడుట
కొఱ యనఁగాఁ బని కొఱ్ఱ ట నిండుట కొఱవిఁ జూఁడుట సొమ్ముకొఱకు ననుట
గఱికె నట్టులు గఱగఱికలు గుఱుగులు గఱిసె డగ్గఱ నంపగఱి పగఱలు
గిఱిగొనుటయు మోటగిఱుకయు గిఱుమెట్లు గిఱులు వ్రాయుటయును గీఱుటయును
గుఱుక వెట్టుట గుఱుగుఱ గుఱ వెట్టుట గుఱికొని గుఱి గుఱుకొండి గుఱుతు
గుఱుములు గింజలు గొఱుగుట వపనంబు [3]గొఱవంక పిట్టలు గొఱక కట్టె
పా చఱచుట గోడపలి కాఁచి చఱచుట కరమునఁ జఱచుట గట్టుచఱులు
చిచ్చఱపిడుగులు చిఱుతయుఁ జిఱునవ్వు చిఱికొట్టి చిఱిమి ముచ్చిఱితనమునఁ
జుఱుకు పుట్టఁగ మేను చుఱచుఱఁ గాల్చుట చెఱుపున భుజియించి చెఱకఁబట్టు
చెఱలాట చెఱుచుట చెఱుముట చెఱుగుట చెఱసాల చెఱుకులు చెఱిసగంబు
జఱిజఱి [4]పూజఱి జాజఱి జఱిగొని [5]జఱపుట జఱజఱ జఱిగె ననుట
చేతులు వెజఱుట జిఱజిఱఁ ద్రిప్పుట జుంజుఱు[6]వెండ్రుకల్ బొఱబొఱ యనఁ
దఱుగుట వెలితియుఁ దక్కువయును గోసివైచుటయును నగు వలసినపుడు
తఱుగఱి బేహారి తఱుగని సంపద తఱిగొలుపుటలు ముత్తఱులు తఱుచు
తఱి వేళ పయనంబు దఱలుట పుచ్చినతఱకలు శత్రులఁ దఱియఁ జొచ్చెఁ
దఱుముక వచ్చుట తఱిగొని నడచుట [7]తిఱుగ రెండవసారి తిఱివెనుచుట
తుఱఁగలి తుఱుము వాతెఱ మోవి యేడ్తెఱ తెఱలినవాసన తెఱకొలుపుట
దెఱపి సేయుట కన్ను దెఱచుట సాపుట తెఱవలు తెఱువ తెఱఁగు విధము
తొఱలుట కలయుట తొఱఁగుట ముందఱ నందఱు నెందఱు కొంద ఱింద
ఱిద్దఱు పదఱుచుఁ బెద్దఱికంబున గద్దఱి [8]యద్దిఱా [9]కట్టెదుఱను
నఱజు కొంచెము మ్రాను నఱుకుట నిఱుపేద నుఱుముగా నుఱుపుట నెఱవు పొడవు
నెఱి యనఁగా బాగు నెఱ దొడ్డు గొప్పయు నగు నెఱి యనఁగను మిగుల ననుట
[10]నిటుల నెఱపుట నెఱి లేనిమిత్రుఁడు నెఱసుట నిండుట నెఱిక కాసె
నెఱకు లాయంబులు నెఱులు కేశంబులు పఱపఱఁ జించుట [11]పఱుసఁదనము

---

1. శ. ర. ఒరగుబిల్ల-రూ. (గి) 2. కురులు-లఘు రేఫఘటితముగా నిఘంటువులోఁ జూపఁబడినది(రా). 3. గొరవంక-సూ.ని. ఇందు శకట రేఫము లేదు(రా). 4. పూజరి-శ.ర. (రా). 5. శ.ర. జరపుట (గి). 6. వెంట్రుకల్ (పూ.ము.) 7. తిరుగ-సూ.ని. (రా). 8. అద్దిర-లఘు రేఫముగా నిఘంటువులు చూపుచున్నవి (రా). 9. కట్టెదురను-ఇందలి రేఫము అలఘువుగాదు(రా). 10. నిటులని. 11. పరుసఁదనము-ఇందు లఘు రేఫముండవలెను(రా)

పఱచుట సేయుట ప్రవహించుటయు వేగ నుఱుకుటయును నగు నుచితభంగిఁ
బఱికెలు పఱియలు పఱివోవు టంపఱ పఱతెంచి పఱిగొని పఱిపఱియలు
పఱు పైన పువ్వు చూపఱఁ బఱిమార్చుట తెంపఱ పెంపఱఁ దెప్పిఱిలుట
పిఱుఁదను వెనుకను బిఱుఁదు నితంబంబు పిఱుసనుటయుఁ దొడ్డపిఱికితనము
పుఱియ కపాలంబు పెఱికెలు గోనెలు పెఱిగినమీసముల్ పెఱుకుకొనుట
పెఱ యితరార్థంబు పెఱుసనిపోవుట బఱబఱ నీడ్చి దబ్బఱ పలుకుట
బిఱబిఱఁ ద్రిప్పుట బిఱుసులు బుఱుజులు మఱువ మృద్భాండంబు మఱుఁగు చాటు
మఱచుట మఱునాఁడు మఱఁదలు మఱఁదియు మఱియు నేమఱుటపల్లుఉమఱుగుట
మఱుపడి క్రమ్మఱ మఱు లేక క్రమ్మఱి [1]పడమఱ మఱఁగాలు పెడమఱలుట
మిఱిచూపు [2]మిఱిమిట్లు ముఱిముఱిచీఁకటి ముఱిమొండె మఱియఱి మొఱములిడుట
[3]మెఱుపులు మెఱుసుట మెఱుఁగు లీనుట కనుమొఱఁగుట దాఁగుట మొఱక వెలితి
మొఱలు పెట్టుట మొఱ మొఱలుగా మొఱయుట మొఱగుడుకుక్కలు మొఱకుతనము
ఱట్టు ఱంపిల్లుట ఱవ ఱంకు ఱవికెలు ఱవఱవల్ ఱంపము ఱంతు [4]ఱవళి
ఱిక్కలు వైచుట ఱివ్వన ఱువ్వుట ఱెక్క ఱెప్పలు ఱెల్లు [5]ఱెమ్మ ఱొమ్ము
వఱతయు వఱదయు వఱడు గూఁయుట వంగవఱుగులు వఱలుట విఱిగిచనుట
విఱివోవు విఱిగాలి విఱివిడి కంబము విఱుగుట వెఱబొమ్మ వెఱచఱుచుట
వెఱచుట వెఱఁగు నివ్వెఱ సుఱ స్రుక్కుట యసు ఱుసు ఱను టివి యాఱె గాఁగఁ
గొన్ని తెనుంగుఁబల్కుల హ్రస్వములమీఁదఁ దప్పక బండిఱా లొప్పుచుండు
వెల్లంకితాతన బొల్లను బండిఱా నిడుదపైఁ గలుగదు నిక్క మనుచుఁ
గావున నేను దీర్ఘములపైఁ గలపెద్దఱా లొకకొన్ని యేర్పఱతు నింక
నాఱు సంఖ్యాపద మాఱడి యాఱికెపంట చిచ్చాఱెఁ బాపంబు లాఱె
నాఱని తేజ మూటాఱినముత్తెంబు తడియాఱె శ్రమమాఱెఁ దాప మాఱె
నాఱపు లాడె నూటాఱె దేహం బెల్ల నూఱడి చాలించు [6]టూఱుగాయ
లుదకంబు లూఱుట యోఁక పం డ్లేఱుట యేఱువసీమలో నేఱు దాఁటి
కాఱుపోతులు [7]హారాంతకాఱి కాఱడవులు కాఱియఁ బెట్టుట గాసిలుటయుఁ
గాఱుట జాఱుట కోఱలు పండ్లు గీఱుట నాఱుటయును దీఱుటయు నయ్యెఁ
[8]జేఱెడు మాడలు చీఱుట రెండుగాఁ జేయుట యుయ్యేల చేఱు లనఁగఁ
జూఱ యెల్లరిని దోఁచుట చోఱమీనులు చాఱలబెబ్బులి చాఱపప్పు
జాఱుపయ్యెదలు బజాఱికన్నియలు హజాఱంబులోనఁ [9]దుజాఱు లనఁగఁ

1. పడమర-శ-ర (రా). 2. మిఱుమిట్లు-శ-ర. 3. శ-ర. మెఱపులు. 4. రవళి-నిఘంటువులు లఘురేఫముగాఁ జూపుచున్నవి; ఇందు అకారము చింత్యమని కూచిమంచి తిమ్మకవి చెప్పెను.(రా). 5. శ-ర.లో రెమ్మ అనియే కాని ఱెమ్మ లేదు. శ-ర-లో వఱద అనియే కాని వఱత లేదు. 6. ఊరుఁగాయ - ఇందు శకటరేఫము చింత్యము. (రా). 7. హారాంతకారి-శ-ర (రా). 8. చేరెడు (రా). 9. తుజాఱీశబ్దము నిఘంటువులలోఁ గానరాదు. (రా).

డాఱు మెకంబు లీ తీఱున దీఱుట దీఱుమ పొదలలో దూఱి చనుట
దేఱి చూచుట గడిదేఱుట ధర్మంబుదేఱుట యింతకుఁ దేఱుదు రన
సొన్నాఱి నాఱు వైచుట నాటువిడుచుట నీఱు నిప్పులమీఁదినిండుబూఁది
పసపు నూఱుట నూఱుపదులు నన్నూఱు మున్నూఱనవెసఁ దొమ్మనూఱును ననఁ
బాఱుఁడు బ్రాహ్మణుఁ దేఱుపాఱుట యింకఁ బాఱుట వెన్నిచ్చి పాఱుటయును
బడఁతిదేహము గఱుపాఱుట నీఱుట పీఱుట పోఱఁడు చిన్నవాఁడు
బీఱువోవక యినుమాఱు మాఱడుగుట మాఱి మసంగుట మాఱుపడుట
మాఱుమాటాడుట మాఱుమొగంబు వేమాఱు పెద్దలమాట మీఱి చనుట
ఱాచు నీలపుఱాయి ఱాఁగ వెన్నెలఱేఁడు ఱేసి ఱేసున గంగ ఱేవు తెప్ప
ఱేఁచుకుక్కలు ఱేల ఱేఁగు ప్రేఱేఁచుట [1]ఱోయుట వెఱచుట ఱోఁతపడుట

తే. వేఱుపడుటయు వీఱిఁడి వే ఱొకటియు
నాదిగాఁ గొన్ని యాంధ్రవాక్యములయందుఁ
బాదుకొను దీర్ఘములమీఁద బండిఱాలు
వీని నెఱుఁగక కృతి సేయువెఱ్ఱి గలఁడె. 197

## కుఱుచలమీఁది ఱకారములకు రూపములు

| | | |
|---|---|---|
| అఱవఱలు=తునుకలు | అఱలేక చనుట=అపోహము లేకపోవుట | క్రచ్చఱ |
| నోట నఱచుట=కూయుట | | అక్కఱపడి |
| అఱిముఱి=బడిబడిననుట | [2]పెండ్లియఱుగు [కొనుట | అఱకమ్మట [లు |
| అఱగొఱలు | అఱపుకొనుట = దక్కించు | అఱంటులు=అఱఁటికంబము |
| అఱుముట=అఱ్చుట | అఱువదికోట్లు | అఱటులు = స్త్రీలు మెడను గట్టుకొనెడుపూసలు |
| అఱకటఁ బెట్టుకొనుట = పొదిగిటఁ బెట్టుకొనుట | అఱపొఱఁడు=పొట్టివాఁడు | అఱకము = అన్న మఱుగ కుండుట |
| అఱచేయి | ఉక్కఱి | ఇఱియుట=కదియుట. దీనికి లక్ష్యములు:— |
| అఱకాలు | రూపఱి | ఇఱిచను=చిన్నచనుగవ |
| అఱవలు=ద్రావిడులు | పొలుపఱి | ఇఱికికొనిపోవుట = కదియించుకొనిపోవుట ఇవి మొదలైనవి |
| అఱవుడు=కుప్పసము | ఏపఱచుట | ఇఱియుట=నలిగిపోవుట |
| అఱిసెలు=అప్పములు | పెంపఱి | ఇఱులు=చీఁకటులు |
| అఱిగిపోవుట = తక్కువయి పోవుట | సిగ్గఱి | |
| అఱమఱ సేయుట | బిట్టఱి | |
| | పెల్లఱి | |
| | (అఱమూఁత)యిల్లు | |
| | అఱ | |

1. రోయు-రోఁత-శ-ర. (రా). 2. అరుఁగు-అని లఘురేఫముగా నిఘంటువులలోఁ జూపఁబడినది. (రా)

బండియిఱుసు [కడియుంట
క్రిక్కిఱియుంట = మిక్కిలి
ఇఱుకటము=కుసిలి
ఇఱుకు=కొంచెము
అన్నమిఱిసిపోవుట=కడియఁ
బడి ముద్ద కట్టుట
ఉఱఁదుసురేంద్రుఁ డైనను=
కైకొనఁడు
ఉఱుకుట=వేగముగఁబోవుట
ఉఱు అనఁగా మిక్కిలి
యనుట. దీనికి లక్ష్య
ములు:- ఉఱునట్టివరము,
ఉఱు తనదు శక్తివాల
యఁగ-ఇవి మొదలైనవి.
ఉఱువు=లావు
ఉఱుది=బెట్టిదము
ఉఱక=మానక
మేఘముఱుముట
ఉఱుకఱి
బలముఱి
ఉఱియ=దిట్ట
ఉఱియుంట
ఉఱని తెగువ
ఉఱుతపట్టి
ఎఱబఱకము [క్కుట
అడుగుల కెఱఁగుట = మ్రొ
ఎఱుపవన్నె
ఎఱుకువాఁడు
ఎఱుకచెప్పుట
ఎఱకలు=ఱెక్కలు
ఎఱుఁగు=తెలిసికొనుట [మ్ము
ఎఱువుసొమ్ము=మఱియొకరిసొ
ఎఱచి=మాంసము
ఒఱలుట=శోకించుట
ఒఱవ=దేహము

ఒఱగాల నిలుచుట
ఒఱ=కత్తిమీఁదిమూఁత
ఒఱకటపుఁద్రోవనుబోవుట
ఒఱపులు=ఎమ్మెలు
ఒఱగుబిళ్ల
ఒఱగు పంక
కఱపుట=నేర్పుట
కఱతలు=పోకిళ్లు
కఱదలు=బుద్ధులు
కఱటి=మంకువాఁడు
కఱకు = కాఠిన్యము. దీనికి
లక్ష్యములు:— కఱ
కెక్కుట కఱకులాడుట
ఇవి మొదలైనవి.
కఱవు=దుర్భిక్షము
కఱ=కప్పు. దీనికి లక్ష్య
ములు:—కఱకంఠుఁడు,
పోఁకకఱ, తమ్మకఱ, నీల
కఱ-ఇవి మొదలైనవి.
కఱచుట దీనికి లక్ష్యములు:-
పండ్లఁ గఱచుట, వేళ్లు
గఱచుట, ఫూరి గఱ
చుట, పింజపింజ గఱ
చుట-ఇవి మొదలైనవి.
కిఱపుట
కెఱయుంట
ఉక్కెఱ=పిండివంట
పక్కెఱ [ము మాసినచీర
కుఱుమాపుచీర=కొంతమాత్ర
కుఱు=కంటు
కుఱుచ=కొంచెము
కుఱులు=వెండ్రుకలు
కుఱువలిగొనుట
కుఱుకుఱ
కుఱుకులు

కుఱుగొని
కుఱుగడ
కుఱుపు=వ్రణము
కొఱకొఱలాడుట
కొఱఁత=తక్కువ
పండ్లు గొఱకుట
గుఱ్ఱపుకొఱడ [చునది
కొఱడు=ఆకాశమునఁ బొడు
కొఱ = పని. దీనికి లక్ష్య
ములు:-కొఱగామి, కొఱ
గాదు,కొఱమాలుట,కొఱ
అవుట, కొఱగలవాఁడు-
ఇవి మొదలైనవి.
కొఱలుట=పూర్ణమవుట
కొఱవిని గాల్చుట
వానికొఱకు=చతుర్థి
గఱికెనట్టులు
గఱగఱికలు
గఱుగుకాయలు
గఱిసె
డగ్గఱ=సమీపము
అంపగఱి
పగఱ=పగవాఁడు
గిఱికొనుట = కుప్ప పడుట
మోటగిఱక
గిఱుమెట్లు=గిఱుకచెప్పులు
గిఱులు వ్రాయుట
గీఱుట [రము
గుఱుకపెట్టుట = నిద్రావికా
గుఱగుఱ
గుఱబెట్టుట
గుఱుగొని
గుఱికడచుట=మేరదప్పుట
గుఱుగొండి
గుఱుతు

గుఱుములు=గింజలు
తలగోఱుగుట
గోఱవంకపిట్టలు
గోఱక=కట్టె
వా చఱచుట=కొడవలికాఁచిచఱచుట, అడఁచుట దీనికి లక్ష్యములు:— చేతఁజఱచుట, వీఁపుఁజఱచుట, నేలఁ జఱచుట, గోడ సున్నము చఱచుట-యివి మొదలైనవి.
గట్టుచఱులు = కొండచరులు
చిచ్చఱ = ఇంగలము. దీనికి లక్ష్యములు:—చిచ్చఱపిడుగు, చిచ్చఱకన్ను, చిచ్చఱకోల=ఆగ్నేయాస్త్రము-ఇవి మొదలైనవి.
చిఱుత = కొంచెము. దీనికి లక్ష్యములు:— చిఱుతప్రాయము,చిఱుతనడుము, చిఱుతగండు-ఇవి మొదలైనవి.
చిఱు=పిన్న-ఇందుకు లక్ష్యములు:-చిఱునవ్వు చిఱుచెమట చిఱుదోడ మొదలయినవి.
చిఱికొట్టి
చిఱిమి
ముచ్చిఱితనము
చుఱుకుపుట్టుట
మేను చుఱచుఱఁ గాల్చుట
చెఱుపు
చెఱకఁబట్టుట
చెఱలాడుట
చెఱుచుట
చెఱుముట=రాచుట
చెఱుగుట
చెఱసాల
చెఱుకులు
చెఱిసగము
జఱిజఱి
ధూజఱి
జాజఱి
జఱిగోని
జఱపుట=ఆలస్యము చేయుట
జఱజఱ
జఱుగుట = పోవుట
వెజఱుట
జిఱజిఱఁ ద్రిప్పుట
ఝంఝూఱువెండ్రుకలు
జోఱజోఱ
తఱుగుట=వెలితి అవుట దీనికి లక్ష్యములు:— నెయ్యి తఱుగుట, మఱియు తఱగుట అనఁగా తక్కువగుట దీనికిలక్ష్యములు:—ధారణ తఱగుట,కొంత తఱచుట ఇవి మొదలయినవి. కొన్నిచోట్ల తఱగుట, అనఁగా కోసివైచుట, దీనికి లక్ష్యములు:—తల తఱగుట కూర తఱగుట - ఇవి మొదలయినవి.
తఱుగఱి = బేహారి
తఱుగని సంపద
తఱిగొలుపుట
ముత్తఱులు=వళులు
తఱుచు=దట్టము
తఱి=వేళ
తఱలుట=పయనము
పుచ్చినతఱకలు
శత్రువులను దఱియఁ జొచ్చుట
తఱుముక వచ్చుట
తఱిగొని నడచుట
తిఱుగ=రెండవసారి
తిఱి=పెనచుట
తుఱఁగలి=కాంతి
తుఱుము
వా తెఱ=మోవి
పిత్తెఱ
తెఱలినవాసన
తెఱకొలుపుట
తెఱపిసేయుట
కన్ను తెఱచుట = చాపుట దీనికి లక్ష్యములు:— నోరు తెఱచుట, తలుపు తెఱచుట = ఇవి మొదలైనవి.
తెఱవలు=స్త్రీలు
తెఱకువ
తెఱఁగు=విధము దీనికి లక్ష్యములు:-తెఱఁగెట్టిదొకో, తెఱఁగొప్ప, తెఱగులేమి, ఇత్తెఱంగున-ఇవి మొదలయినవి.
తోఱలుట=కలయుట
తోఱగుట
ముందఱను
అందఱు
ఎందఱు
కొందఱు
ఇందఱు
ఇద్దఱు
పఱఱుట

పెద్దఱికము
గద్దఱికాఁడు
అద్దిఱ
కట్టెదుఱు
నఱుజు = కొంచెము. దీనికి లక్ష్యములు:—నఱుజు పేలు నఱుజుముత్తెములు మొదలగునవి.
మ్రాను నఱుకుట
నిఱుపేద
నుఱుము=నుగ్గు
ధాన్యము నుఱుపుట
కోకనెఱవు=పొడవు
నెఱి=బాగు. దీనికి లక్ష్యములు:—నెఱిదప్పి వడుట నెఱిచెడుట నెఱిఁబడుట నెఱిమొగము నెఱికుఱులు నెఱినొచ్చుట చెఱిద్రోవ నెఱిచక్కఁద్రోచుట ఇవి మొదలైనవి.
నెఱ యనఁగా దొడ్డ. దీనికి లక్ష్యములు.— నెఱతనము నెఱగూఱుట = దొడ్డనాటుట నెఱనారసము నెఱసఱి నెఱవాదులు నెఱదాతలు నెఱబిరుదులు నెఱపంటలు నెఱచందురుఁడు ఇవి మొదలైనవి.
నెఱ యనఁగా గొప్ప. దీనికి లక్ష్యములు:-నెఱమంట నెఱదెవ్వులు చెఱవెంట్రుకలు మొదలైనవి.
నెఱయను=మిగులను
సీటులు నెఱపుట
నెఱిలేని మిత్త్రుఁడు
నెఱసుట = అంతట విస్తరించుట
నెఱిక=కాసె
నెఱకులు=ఆయములు
నెఱులు=తలవెంట్రుకలు
కోక పఱపఱ చించుట
పఱసఁదనము
పఱచుట = చేయుట. దీనికి లక్ష్యములు:—పఱచిన పాట్లు, చిక్కుపఱచుట, సిగ్గుపఱచుట, భంగపఱచుట-ఇవి మొదలైనవి.
కొన్నిచోట్ల పఱచుట యనఁగా ప్రవహించుట. దీనికి లక్ష్యము:-నెత్తురు కాలువలై పఱచుట.
ఒకచోట పఱచుట యన వేగ నుఱకుట- దీనికి లక్ష్యములు:—వెనుకొని పఱచుట, గుఱ్ఱము పఱచుట, శత్రువులఁబఱపుట, అమ్ములఁ బఱపుట - ఇవి మొదలైనవి
పఱికేలు
పఱియలు సేయుట
పఱివోవుట=ముంచుకొనుట
అంపఱ
పఱతెంచుట=వచ్చుట
పఱిగొనుట=నిండికొనుట
పఱిపఱియలు సేయుట
పఱుపైన పువ్వు
చూపఱ పొడగను
పఱిమార్చుట
తెంపఱ
పెంపఱ
తెప్పఱిలుట
పిఱుఁదను = వెనుకను. దీనికి లక్ష్యములు:-వాని పిఱుఁదనె చొచ్చుట, విఱిగి పిఱిఁదికిఁ బాఱుట ఇవి మొదలైనవి
పిఱుఁదు=కటిస్థలము
పిఱుసనుట = పిఱివోవుట వెనుకదీసుట
దొడ్డపిఱికితనము
తలపుఱియ = కపాలము
పెఱికెలు=గోనెలు
పొడవు పెఱుగుట
అమ్ములు పెఱుకుట=పీకుట.
పెఱ = మఱియొకటి. దీనికి లక్ష్యములు:- పెఱమూఁకలు పెఱచేతలు పెఱవారు పెఱచోట - ఇవి మొదలైనవి.
పెఱుసనిపోవుట
బఱబఱ సీద్చుట
దబ్బఱమాటలు
బిఱబిఱఁ ద్రిప్పుట
బిఱుసు గాల్చుట
కోటబుఱుజులు
మఱువ=మంటికుండ
మఱుఁగు = చాటు. దీనికి లక్ష్యములు.— మాటమఱుఁగుపెట్టుట, కనుమఱుఁగుచోటు, బలవంతునిమఱుఁగుచొచ్చుట, మైమఱుఁగు =కవచము, కొందఱు మఱు అని యనిరి. ఇవి మొదలైనవి.

మఱచిపోవుట
మఱునాఁడు
మఱఁదలు
మఱఁది
మఱియు
ఏమఱిపాటు
పలుమఱు
మఱుగుట=మచ్చికయవుట
మఱుపడి
క్రమ్మఱ=తిరుగ
మఱులేక=మఱుఁగులేక
క్రమ్మఱుట = తిరుగుట
పడమఱ=దిక్కు
మఱఁగాలు
పెడమఱలుట
మిఱిచూపుట
మిఱిమిట్లుగొనుట
ముఱిముఱి చీఁకటి
ముఱి=మొండెము
ముఱియఱి=బడిబడిని
పిల్లమెఱుములు వైచుట
మెఱుపులు మెఱయుట
మెఱుఁగు లీనుట
కనుమొఱఁగుట=దాఁగుట
మొఱక=వెలితి
మొఱపెట్టుట
మొఱమొఱలాడుట
మొఱయుట=కోపవికారము
కుక్కలు మొఱగుట
మొఱకుతనము
ఱట్టువొందుట
ఱంపిల్లుట
వజ్రపుఱవలు
ఱంపవోవుట

పట్టుఱవికె
ఱవఱవలు=కోపము
ఱంపము
ఱంతు
ఱవళి
ఱెక్కలువైచుట
ఱెప్పన నెగయుట
ఱాళ్లను ఱువ్వుట
చిలుక ఱెక్కలు
కనుఱెప్పలు
ఱెల్లుగడ్డి
భూఱెమ్మలు
బలుఱొమ్ము
వఱత=వెల్లి
ఏఱివఱద
వఱడు గూయుట
వంగవఱుగు
వఱలుట
దండు విఱిగి చనుట
విఱివోవుట
విఱిగాలి
విఱివిడి
కంబము విఱుగుట
వెఱరొమ్ములు
వెఱచఱచుట
వెఱచుట
వెఱగొందుట
నివ్వెఱపడుట
సుఱసుఱ స్రుక్కుట
ఱుసుఱుసుఱనుట

ఇవి కుఱుచులమీఁది
ఱకారములు

---

నిడుదలమీఁది ఱకార
ములకు రూపములు

ఱు=లెక్క దీనికి లక్ష్య
ములు:-ఆఱుచవులు ఆఱు
మ్ములు ఆఱుమాట లివి
మొదలైనవి.
ఆఱడిపోవుట
ఆఱికెపంట
చిచ్చాఱుట
పాపము లాఱుట
ఆఱని తేజము
ఊటాఱిన ముత్యములు
కోక తడియాఱుట
శ్రమ మాఱుట
ఆఱపులు
దేహమంతయు నూటాఱుట
ఊఱడి=విశ్రమించుట
ఊఱుగాయలు
నోరూఱుట
ఓఁకపండ్లేఱుట
ఏఱువసీమ
ఏఱునాఁటుట
కాఱుపోతులు
హోరాంతకాఱి
కాఱడవులు [ట్టుట
కాఱియఁబెట్టుట = గాసిపె
కాఱుట
జాఱుట
కోఱలు=నోటిపండ్లు
గీఱుట=నాఱుటఁ తీఱుట
పండ్లను గీఱుట=తీఫుట
చేఱెడుమాటలు [జేయుట
చీఱుట=నడిమికి రెండుగాఁ
ఉయ్యాలచేఱులు [కొనుట
చూఱ = అందఱిని దోఁచు
చోఱమీను=చేఁప
చాఱలదెబ్బలు

చాఱపప్పు
పయ్యెద జాఱుట
బజాఱి(వాండ్లు)కన్నియలు
హజాఱము = పెద్దకొలువు
సావడి
తుజాఱి=ధనముగలవాఁడు
తాఱుట=పఱువెత్తుట
ఈతీఱిన తీఱుట = సేయ
వలసిన పని తీఱుట
తీఱిన మిట్టగుడ్లు
పొదలలో దూఱుట
తేఱిచూచుట = తేఱి కొనఁ
గడిదేఱుట [జూచుట
ధర్మముదేఱుట
ఇంతకుం దేఱుదురు
సొన్నాఱి=అగసాలవాఁడు
వంగనాఱువైచుట = నాఱు
వైచుట
నీఱు=అనఁగా నిప్పుపైఁ గప్పి
యుండెడు బూడిద
పసపు నూఱుట
నూఱుపదులు [మ్మనూ్నఱు
నన్నూఱు, మున్నూఱు, తొ
పాఱుఁడు=బ్రాహ్మణుఁడు
ఏఱు పాఱుట
ఇంకఁబాఱుట
వెన్నిచ్చి పాఱుట
దేహము గఱుపాఱుట

పీఱుట=చినుఁగుట
పోఱఁడు=చిన్నవాఁడు
బీఱువోవుట
ఇనుమాఱు
మాఱడుగుట [పట్టుట
మాఱి మసంగుట = గావు
మాఱుపడుట
మాఱుమాట
మాఱుమొగము
వేమాఱు
పెద్దలమాట మీఱుట
ఱాచుట
నీఁ పుఱాయి
ఱాఁగ
వెన్నెలఱేఁడు=చంద్రుఁడు
ఱేసి
ఱేసున
గంగఱేవు
ఱేఁచుకుక్కలు
ఱేల
ఱేఁగు
ప్రేఱేచుట
ఱోయుట=వెదకుట
ఱోఁతపడుట
వేఱుపడుట
పీఱిడి
వేఱొకటి

ఇవి నిడుదలమీఁది
బండిఱాలు
ఉభయరేఫలు
అరుగుట=పోవుట
చెఱుచుట
తెఱఁగులు
తొఱలుట
తొఱఁగుట
నెరయుట=విస్తరించుట
పరిగొనుట
పరిచనుదెంచుట
పరిమెయి=పరయొకటి
పరిమార్చుట
పెరుగుట
క్రమ్మర
మరలుట
ఇవి కుఱుచల మీఁది
రేఫ ఱకారములు
రెండు నగును.
ఆరుట=శమించుట
తీరనికినుక
తీరుట
పార నీరయి పోవుట
మారిమసంగుట
వేమారు
ఇవి దీర్ఘముల మీఁది
రేఫ ఱకారములు

కుఱుచలమీఁది రేఫఱకారములు రెండును అయిన వానికి లక్ష్యములు.
అఱుగుట = పోవుటకు మౌసలపర్వమునందు:—

క. మఱునాఁడ యఱుగుట లెస్సగ
[1]నఱిగె నిమం డపుడు వేఁడి యడరినదీప్తుల్

1. కెఱఁగె......యొదలిన దీప్తుల్ (ముద్రిత భారతప్రతి).

తుఱఁగలి గొని పశ్చిమగిరి
చఱికి ననతిదూరుఁడై విశదుఁడై తోఁచెన్. (ఆ. 1. 169) 198

చెఱుచుటకు సభాపర్వమునందు:—

క. వెఱచఱువ నింతకంటెను, దఱుచుగ బాణంబు లేసి తడయక పగఱం
జెఱుతు నని యిసుముఁ జల్లుచు, నుఱక ధనంజయుఁడు రణజయోన్నతి నరిగెన్.
(ఆ. 2. 305)

తెఱఁగునకుం గవిజనాశ్రయమునందు:—

క. నెఱయంగా నీఛందము, తెఱఁ గెఱుఁగక కవితఁ జెప్పఁ దివురునతఁడు ద
బ్బఱచీఁకు చీఁకుగుఱ్ఱముఁ, బఱపినగతి నిఖిలహాస్యపదనిరతుఁ డగున్. (ఆ. 1. 4)

తొరఁగుటకు నృసింహపురాణమునందు:—

సీ. పా. పరమాత్మపదములఁ దొరఁగి పాఱెడు నేటి, తరఁగలపై లీల దాఁటి దాఁటి.

అందే:— (ఆ. 1. 54.)

తే. పొగడ మ్రాఁకుల మొదలను బుష్పరసము
[1]తొఱఁగి నెత్తావి యందున నెఱయ నొప్పెఁ
బూచుకొఱకుకు ముఖ్న నింపులు దలిర్పఁ
గడఁగి వనలక్ష్మి యుమిసిన కళ్ల యనఁగ. (ఆ. 2. 69) 202

పరిగొనుటకు*

... ... ... ... ... ... ...

పరిచనుదెంచుటకు విరాటపర్వమునందు:—

చ. పరిచనుదెంచె గోగణముఁ బట్టె నన న్విని పిన్న గాన మీఁ
దరయక రాజనందనుఁ డహంకృతితోఁ బఱతెంచి సైన్యవి
స్ఫురణముఁ జూచి భీతిఁ చనబుద్ధి గలంగినఁ బాఱఁ జొచ్చె నీ
పురుషుని శౌర్యసంపదయుఁ భూరిబలంబు నెఱుంగఁ డేమియున్. (ఆ. 4. 78) 203

పరిమెయి యన్నందునకు శాంతిపర్వమునందు:—

చ. పరిమెయిఁ బాఱి పాఱఁ గని పట్టి వెసం బెడకేలు గట్టి తె
చ్చి రసురభర్త సూచి యిటు సేరఁగఁదే వల దీకృతఘ్నునిం
బొరిగొని వే తినుం డనినఁ బోకడ మాలినవార మయ్యు యి
ద్దురితశరీరముం దినఁగ [2]దోసము మా కని వార లొల్లమిన్.(ఆ. 3. 505) 204

---

1. అచ్చుపడ్డ నృసింహపురాణమందు 'తొరఁగి' 'నెరయ' రెంటను లఘురేఫ మున్నది. *దీనికి లక్ష్యము ప్రాచీనప్రతులలో లేదు. లేఖకులు చోటు విడిచినారు. 2. సూడునె (ప. వా). ఈపాఠమున యతిభంగము. హరివంశము పూ. భా. ఆ. 6 లోను వసుచరిత్ర ఆ. 5 లోను కలవు. చూ. శ. ర. భారతములో పరిగొనుశబ్దమునకుఁ బ్రాసనిబద్ధప్రయోగములు పెక్కులు గలవు. చూ. సూ. ని. (రా).

[1]పరిమార్చుటకు

..........................................

పెరుఁగుటకు స్త్రీపర్వమునందు:—

క. పెరుఁగుట స్రగ్గుట చపలం, బొరయుట యరుచంబు గాఁగఁ బుట్టుట సావం
బెరయుట పాయఁ బదార్థో,త్కరములు[2]నైజంబు లెట్లు దప్పింప నగున్.(ఆ.1.24)

క్రమ్మఱుటకు ఆరణ్యపర్వమునందు:—

మ. పఱచుం దవ్వుగఁ జేయలంతి నిలుచుం బ ట్టీక యాసాసలం
బిఱువోవుం బొదలందు డించుఁ బొడముం బి ట్టుల్కి వే దాఁటుఁ గ్ర
మ్మఱి చూచుం జెవి దార్చి నిల్చు మలయు న్మట్టాడుఁ [3]గ్రోడాడు నే
మఱిన ట్లుండుఁ దృణంబు లాను నలయుఁ మాయామృగం బిమ్ములన్. (ఆ.6.327)

మఱఁద లనుటకు భాస్కరరామాయణమునందు:—

చ. ఎఱిఁగి యెఱింగి మున్నతఁడె యొగ్గొనరింపఁడె దానికై కదా
చెఱఁ గొని వచ్చితిం బిదప సీత వృథాకథ వింక నేల పెం
పఱ బ్రతు కింత తీయనె ఖరాదులచావున కేమి చింత నీ
మఱఁదలిబన్నమే పగిది మానిని యోఁగుదు సంధి చేసినన్. (యుద్ధ. 784.) 207

నెరసె ననుటకు నృసింహపురాణమునందు:—

మ. ధరణీమండలి దిర్దిరం దిరిగెఁ బాతాళంబు ఘూర్ణిల్లె ని
ర్జరనాథప్రముఖాఖిలామరనివాసశ్రేణులం దోలిమై
నెరయం బంకజసంభవాలయమున న్నిండారె నవ్వేళ శ్రీ
కరదైతేయతనూభవోద్భవకథాకల్యాణ ముద్ఘోషమై. (ఆ. 3. 141) 208

నిడుదలమీఁది రేఫఱకారములు రెంటను అయినవానికి లక్ష్యములు.

ఆఱుటకు శాంతిపర్వమునందు:—

క. కౌరవులు సేయు నపమతి, కారణముగఁ గోప [4]మెత్తుఁ గర్ణునివదనాం
భోరుహము గనుఁగొనఁగ [5]శ్రమ, మారు న్నావశము గాక [6]యంతన బుద్ధిన్.
(ఆ. 1. 13)

ఆదిపర్వమునందు:—

క. కాఱడవిఁ బఱచు మృగముల, [7]నూఱడకం దిగిచి డస్సి యున్నతని శ్రమం
బాఱంగా నెదఁ దాపము, దీఱఁగఁ బైవీచె నన్నదీపవనంబుల్. (ఆ.4.18) 210

---

1. ప్రాచీనప్రతులలో దీనికి లక్ష్యము వ్రాసియుండలేదు. లేఖకులు చోటు విడిచినారు. భారతము విరాటపర్వములో లక్ష్య మున్నది. చూ. శ. ర. (రి.) 2. నైజమదియెట్లు (సూ.) 3. గోరాడు (సూ). 4. మెత్తెఁ. 5. శమ. 6. యాంతనిబుద్ధిన్. 7. నూఱకడం (వా.)

కాఱులకు నుద్యోగపర్వమునందు:—

ఉ. ఆఱడిపోకయు న్ఫలము నందుటయుం గని పల్కనేరమి
న్నాఱటనోటిదాన నయి మాటలు చిత్తమునందు నిల్ప కేఁ
గాఱులు [1]ప్రేలెద న్వినుఁడు కర్జము నెగ్గును గాన నల్కమై
[2]వీఱిఁడి యైన మానిసికి వెండి వివేకము గల్గ నేర్చునే. (ఆ. 3. 107) 211

తీఱుటకు రామాయణమునందు:—

ఉ. మీఱినకోఱలు న్నిగిలి మింటికిఁ బర్వినపల్ల [3]వెండ్రుకల్
తీఱినమిట్టగ్రుడ్లు నతితిగ్మతరం బగునట్టిసాహసం
బాఱని తేజము న్దిశల నంటినచేతులు లోకరాజిలో
నేఱినమేటిరూపముల నెంతయు నేర్చిరి రాక్షసు ల్వడిన్. (యుద్ధ. 2032) 212

*తేఱుటకు యుద్ధకాండమునందు:—

క. తేఱుదురు రిపుల నక్కఱ, మీఱుదురును నిపుడు మూర్ఛ మెయి ని ట్లున్నా
రాఱని తేజంబులతో, నీఱు పయిం గవిసి యున్న నిప్పులవోలెన్. 213

*నీఱనుటకు త్రిపురాంతకదేవుని యుదాహరణమునందు:—

ఉ. ఆఱడియాస నీరసధనాధిపలోకమునిండ్లవాకిటల్
దూఱుట మాని శ్రీనగముతూరుపువాకిట దూఱి పాపముల్
నీఱుగఁ జేసి గంధవతి నీళ్లను గ్రుంకి మనంబులోనిచి
చ్చాఱఁగఁ జేయు టొప్పుఁ ద్రిపురాంతకదేవునకై నమస్కృతుల్. 214

*మాఱి యనుటకుఁ గర్ణపర్వమునందు:—

ఉ. పాఱినఁ జూచి కౌరవనృపాలుఁడు సూతతనూజుతోడ నీ
కాఱియ మద్బలంబునకుఁ గాఁ దగునే వివిధాస్త్రసంపద
న్మీఱిన నీవు గల్గఁగ నమేయపరాక్రమ నీకుఁ బాండవు
[4]ల్మాఱి తలంప నీదగు బలంబును జేవయుఁ జూపు మిత్తఱిన్. (ఆ. 3. 10) 215

---

1. చీరెద. (ప. వా.) 2. పిఱఁడి (ప. వా.) 3. వెంట్రుకల్ (ప. వా.) 4. ల్మాఱె (వా.)

*దీర్ఘములమీఁది రేఫఱకారములు రెండును గల మాటలపట్టిలో 'తేఱుట' లేదు; దానిలోనున్న పోరనీరయి పోవుటకు ఉ. ఆఱడి...ఉదాహరణమా? 'మారిమసంగుట'కు ప్రయోగమీయవలసియుండెను. శ. ర. లో ఈమాట లేదు. మార్కండేయపురాణములో (ఆ.6.103) 'సీ.గీ. మారిమసఁగి దైతేయులబారిసమరె' అని లఘురేఫముతో ప్రయోగమున్నది. కాఱులు-లఘురేఫముగా అప్పకవి యిచ్చియున్నాఁడు (పుట. 81). ఇందు శకటరేఫ కెట్లుదాహరింపఁగలిగెనో దురూహము. ఈ ప్రయోగమునుబట్టి యిది శకటరేఫఘటితమని గ్రహింపఁదగును. ఇందే మాఱట శబ్దముకూడ శకటరేఫముగాఁ బ్రయుక్తమై యున్నది. లఘురేఫముగా అప్పకవి గ్రహించినాఁడు; చింత్యము. (రా.)

వేమా అనుటకు నృసింహాపురాణమునందు:—

క. మీఱిన మానుల కిటకకు, మా అటుగక యున్న మీ సమగ్రక్షమ వే
మాఱు గొనియాడఁగాఁ దగు, గీఱునె సాత్త్వికులబుద్ధిఁ గిల్బిషచయముల్. (ఆ.1.95)

క. తెలిపితి నన్నయభట్టా, దుల కావ్యములందు నాకు దొరకిన రేఫం
బులు తాలు మఱియు నెందులఁ, గలిగినఁ దగ వసక యవియుఁ గైకొనుటొప్పున్.

క. తొలుతటివారలు వాడని, తెలుఁగులపలుకులను గల ద్వితీయాంతస్థం
బులు గూర్పరు తద్భేదం, బులు దెలియమి బుధులు ప్రాసములకు యతులకున్.

లకారభేదంబులు:—

తే. దురితసంహార నిర్జరోక్తులనె కాదు, వెలయు దొడ్డళకారంబు వికృతియందు
నెళవు దళవాయి మేళంబు నీ ళ్లనంగఁ, బల్లెరం బనఁ గక్కుల కల్లె మనఁగ. 219

ఆ. ప్రథమమీఁద నుండు పంచమవర్గాది, వర్ణమునకు బదులు వచ్చి నిలుచు
లాఁతి యగు వకార మూఁతనై తెలుఁగునఁ, బరువువెట్టి చిక్కువడియెననఁగ.

మూ. సూ.—క్వచి దపి న స్త ఉదోతో దంతోష్ఠభవస్య వికృతిశబ్దాదౌ.

సీ. జాతివా గల వోఢృశబ్ద మొక్కటి దక్క సంస్కృతాంధ్రముల ముజ్జగములందు
శబ్దంబుమొదల నిశ్చయముగాఁ గొమ్ములు నోత్వంబులును గల్గ వొకటి కైన
వాకు శృంగములకై పడి నోత్వముల భంగి శబ్దాదిఁ గలయవి స్వరములగును
రెండును లాఁతుల నుండుఁ గృష్ణుఁడు గిన్కు వుట్ట మోఁదినఁ జెట్టు వొలిసె ననఁగ

తే. నడుమఁగొమ్ములు సంస్కృతాంధ్రములరెంట, బలసి జాత్యక్షరములకే గలిగియుండు
భావుకము నీవు భవుకంబు భవుఁ డనంగఁ, బొడవుదీవులు నవురంబు వువ్వులనఁగ.

లఘ్వలఘుభేదంబులకు:—

మూ. సూ.—నాన్యేషాం వైధర్మ్యం లఘ్వలఘూనాం రయోస్తు నిత్యం
స్యాత్ —

క. వైకృతకావ్యంబులలోఁ, గాకోదరశయన లఘుయకారము హల్లై
కైకొనఁదగుఁ బ్రాసములకు, జోకయె స్వరహాయలు వడికిఁ జొప్పడు టరుదే. 222

తే. ప్రియుఁడు రాఁడాయె సత్యభామ యెడఁ గాఁగ
నెన్ని మాయలు పన్నెనో యెఱుఁగరాదు
గాయఁగాఁ జొచ్చె శశి మింట నా యనంగుఁ
డేయఁగాఁ జొచ్చె సఖ చక్రి యేఁడి యనఁగ. 223

క. రెండర్థంబుల పద్యము, లుండెడిచో నొకటి యచ్చు నొక యర్థమునన్
నిండారుహల్లు నగు మర, ఖండన వలసినను లఘుయకారము కృతులన్. 224

రాఘవపాండవీయమునందు:—

క. విని యతనిం దలపై నిడు, కొని యేఁగి నియమికిఁ దగనిఘోరార్తి యొన
ర్చినవాఁడ మీకు దండ్యుఁడ, నని తనుఁ దెలుపుచును వారి కప్పనఁ జేసెన్. 225
(ఆ. 1. 25)

సీ. త్రైయక్ష పానీయ పీయూష వైయాత్య హైయంగవీన వైయాసిక త్వ
దీయ స్వకీయా స్మదీయ మదీయ ప్రభృతులను [1]గియ్యలు పెట్టరాదు
షయ్యజయ్యవాయ్యసాహాయ్యపాన్నాయ్యధాయ్యహేయ్యములనికాయ్యములను
గ్రయ్యశబ్దమునను గియ్యలు గల వని తెలిసి ప్రాసములకు నిలుపవలయు

తే. పైయెద సయాటయు నొయారి బలుగయాళి, యను పదంబులఁ గొన్నిటి నరసి చూడఁ
దొలఁగు నిలుచును గియ్యలు దెలుఁగులందు, సత్యభామాముఖాంభోజచంచరీక. 226

శశిబిందుచరిత్రమునందు:—

ఉ. పయ్యెదఁ బాపి గుబ్బలను బాహులఁ బట్టఁగ నిచ్చి మోవిపైఁ
బియ్యని మోవితేనె మనసు దీరఁగఁ గ్రోలఁగ నిచ్చి యిప్పు డో
తొయ్యలి నీవి ముట్టినను ద్రోచెద వేఁగు నిచ్చి యంకుశం
బియ్యక కయ్య మాడఁ దగునే నను నీగతి నేఁచఁ బాడియే. 227

చిత్రభారతమునందు:—

ఉ. ఆ యమరాచలంబు ధనువై విలసిల్లఁగ విష్ణుఁ డమ్ముగా
వేయువిధంబులం బరిఢవిల్లెడు శింజినిఁ గూర్చినట్టి శూ
లాయుధు [2]నొక్కమాత్రమున నంగము వ్రయ్యఁగ మోఁది మించి తోఁ
దీయరివింటనే వెనుక దీయని బీరమున న్మనోభవా. (2-80) 228

రేఫమునకు:—

తే. జ్ఞాతి వైరంబు నొంది ప్రాసంబులందు, విశ్రమములందుఁ దమలోన వేఱు గలిగి
దేవదానవు లట్లన తెనుఁగులందు, మించి రేఫఱకారముల్ మెలఁగుఁ గృష్ణ. 229

క. [3]భ్రమయక రేఫములకు రే, ఫములను ఱాలకును ఱాలుఁ బ్రాసములను వి
శ్రమములను జెప్పఁ దగు నీ, క్రమ మెఱుఁగక రెండునుం గుకవి గూర్చుఁ గృతిన్.

ఆ. [4]సొరిది భోజకన్య సరదంబుపై నిడి, రేయిఁ దెచ్చె ననఁగ రేఫ మయ్యె
మఱది యనక సిగ్గుపఱిచి రుక్మిని జాల, అట్టు చేసె ననఁగ ఱా ముకుంద. 231

తే. చెల్లు నని ముందు భీమన చెప్పె ననుచు, గలుపుదురు రేఫములును ఱకారములును
దుష్టకవు లవి యొకటైనఁ దొంటిపెద్ద, లందఱును నేల విభజింతురని తెలియరు.

1. గీయలు. 2. మాట (వా). 3. బ్రమయక (రా). 4. సొరది (ప. వా.)
శ. ర. లో సొరిది అనియే కాని సొరది లేదు. (గి).

క. వలసిన రేఫఅకారము, లలవడుఁ దా నొకటి కొక్కటని భీమనయే
పలుకుట గలిగిన నాతఁడు, గలిపిన లక్ష్య మొక టైనఁ గనఁబడకున్నె. 233

ఉ. బమ్మెరపోతరాజకృతభాగవతంబు సలక్షణంబుగా
కిమ్మహి నేమిటం గొదువ యెంతయు నారసి చూడఁగాను రే
ఫమ్ములు డాలునుం గలసి ప్రాసము లైన కతంబునం గదా
యిమ్ముల నాదిలాక్షణికు లెల్లను మాని రుదాహరింపఁగన్. 234

శారదాదర్పణమునందు:—

తే. చఛజఝులకు మొదలియూష్మములు మూఁడు, సరసవడి నిల్పఁగా నేకజాతి యైన
బండిఱాకు రేఫము వడి కుండరాదె, ప్రాసవర్ణంబులకుఁ గూర్పరాదు [1]గాని. 235

ఈ పద్యంబు లక్షణవేద్యంబును సుకవి[2]హృద్యంబును గాదది యె ట్లనిన:—

కవిజనాశ్రయమునందు:—

క. [3]ధర జఝలను నీ రెండ,క్షరములు విన్న యది లేదు శబ్దము మొదలన్
[4]మరయలవములను నేన,క్షరములు తమతమకె వళ్లు కమలాధీశా. (1-72) 236

అనంతుని ఛందమునందు:—

క. ధర నెక్కటివళు లై తగు, లరమఱవలు దానితోఁ దొలంగక లాకు
న్సరి శా యని విశ్రమవేళ రమాధవ రెండునుం గలసి వర్తించున్. (1-118)

ఆ. మరునితండ్రి లోకమహితుండు యాదవ, రాజసింహమూర్తి రక్షకుండు
ఱాఁగ వేలు పనఁగ అంపిలు నెక్కటి, వళ్లు నాఁగ నిట్లు వనజనాథ. (1-119)

కావ్యాలంకారచూడామణియందు:—

క. లరమఱవ లేకతరవళు, లరయఁగఁ దమకమకె కవులయనుమతి వళు లై
పరఁగుఁ బదాంతముకారము, పొరి నూఁదినఁ దూలి చనినఁ బుధుబు[5]ధులకగున్.

లక్ష్యము (ఆ. 7. 44)

ఆ. అజ్జు లాడి యాగి ఱాపడి సభలోన, ఱేనిపోరిలోన ఱిచ్చఁ బొరసి
ఱెన్న ముడుగు పుడమిఱేండ్ల నేల నుతింప, మనకు విశ్వనాథుఁ డొనరి యుండ.

[6]సర్వలక్షణసారసంగ్రహమునందు:—

తే. మహిమ నెక్కటివళు లన మరవఱలలు, రహిని [7]దమతమకే యగు రమ్యచరిత

1. గాక. (శివ). 2. జనహృద్య (శివ). 3. ఈ పద్యము లేఖకులు వ్రాసి యుండలేదు. వ్రాయుటకు చోటుమాత్రము వదలియున్నారు. ఇది (వా) లోనే కనఁబడును. సూర్య-ప్రతిలోను లేదు. శివ-ప్రతిలో కవిజనాశ్రయమునందు అనిమాత్రము కలదు; పద్యము వ్రాయఁబడలేదు (రా). 4. "మరవఱలలు నానేనక్షరములు" అని వావిళ్లవారిముద్రిత కవిజనాశ్రయము. 5. ధుల కగున్. 6. ఈగ్రంథకర్త చిత్రకవి పెద్దన (రా). 7. తమతమకయ యగు (పూ. ము.) ఈ రెండు పాఠములు సరిగా లేవు గాన సవరింపఁబడినది (రా).

వనధిగంభీర సద్గుణవాస యనఁగ, భంజితాసురసముదాయ యాంజనేయ. 241

రేఫలోపము

క. నేరు చ(ప)నునట్టి లపితము,లో రేఫం బచ్చుతోడ లోపం బగు రా
ధారమణ వలసినప్పుడు, భారతమున సోమయాజి పలుకుటవలనన్. 242

విరాటపర్వమునందు:—

క. ద్యూతక్రీడకుఁ గొండొక, నేతుం గపటమున నొప్పునిజనంబులు నా
చేతిధన మెల్లఁగొని పరి, భూతి యొనర్చిన విరక్తి [1]పొడమి వెడలితిన్. (ఆ.1.196)

మౌసలపర్వమునందు:—

క. కాచికొని వచ్చి తగ నా, నేచినయ ట్లచట నిచట నిలిపితి మునినా
థా చేటును భంగంబును, నై చిత్తము శోకమునకు నగ్గం బయ్యె.న్ (ఆ.1.215)

లోపము రామికి రాజశేఖరచరిత్రమునందు:—

క. ఏరికి బుద్ధిబలంబులు, కారణములు గావు సుర్వె కలరె ధరిత్రిన్
నేరిచి బ్రతికినవారలు, నేరక చెడ్డట్టివారు నీరజనేత్రా. (3. 25) 245

క్రారవడులకు

తే. క్రిందు గ్రద్దయుఁ ద్రోవయుఁ ద్రిమ్మటయుఁ
బ్రోచుటయు బ్రతికించుట మ్రొక్కుటయును
వ్రేలుటయు స్రుక్కుటయు నన వీనిమొదలి
వ్రాలిటులఁ గొన్నిటను గ్రారవడులు చెందు. 246

లకారములకు

క. విరమణములకును బ్రాసా, క్షరములకును ళలలు దొడ్డసన్నములును మ
చ్చరము లెఱుంగక చెల్లును, హరనుత "లళయో రభేద" యను సూత్రమునన్. 247

ఆ. గంగకొడుకుమాట గా దని సభను బెల్లపడ నెల్లనృపులలోన హరిని
గొల్లఁ డనుచుఁ జాలఁ దుల్లి చేదివిభుండు, వాలినెఁ బఱచి బలము నెళవుఁ జేరె.

వకారమునకు

తే. పాలుపడి నిల్చు లాఁతివా ప్రాసమునకు, జాతివాను సవర్ణమై శంక లేక
యతికిఁ బంచమవర్గాద్య మగుటఁ జేసి, చెల్లదు వకారమునకు రక్ష్మీభుజంగ. 249

తే. అవనితనయుని చేతఁ బట్టు వడి యున్న, పడుచుకొమ్మల హరి చెట్ట పట్టి యేలెఁ
దవిలి పదియాఱువేవురు దమకుఁ దాము,మేలువాఁ డని తను నిచ్చ మెచ్చుకొనఁగ.

తే. లాఁతి జాతికి వడిని నిల్పఁ దగ దనుచు, సూత్రమునఁ జెప్పలే దని చూడవలదు
నన్నయార్యుఁడు పంచమామ్నాయమునను,నిలుపులక్ష్యంబులకుమాఱు వలుకవళమె.

---

1. పుట్టివెడలితిన్. (ఓ).

ఆదిపర్వమునందు:—

ఉ. భూనుతకీర్తి బ్రాహ్మణుఁడు [1]పుట్టఁగఁ దోడన పుట్టు నుత్తమ
జ్ఞానము సర్వభూతహితసమ్మతబుద్ధియుఁ జిత్తశాంతియు
న్మానమదప్రహాణము సమత్వము సంతతవేదవిద్యయు
ష్ఠానము సత్యవాక్యము దృఢవ్రతముం గరుణాపరత్వమున్. (ఆ. 1.157) 252

క. నువు నువ్వు నూవు నూఁబు, [2]వ్వేవఁ డేవాఁ డెవ్వఁ [3]డేవఁ డీతఁ డనంగాఁ
బువు పువ్వు పూవు పూమొ,గ్గవురా వికసించె ననఁగ నగు వలయు నెడన్. 253

నూ వన్నందుకు శశిబిందుచరిత్రమునందు:—

క. నూవుంబువ్వును సంపెఁగ, పూవు గెలిచి బిరుదుముత్తెపుజల్లి దగ
న్దా వైచె ననఁగ ముంగర,తో వనరుహ [4]నేత్ర వాస తుల లే కొప్పున్. 254

ఏవాఁ డన్నందుకు విరాటపర్వమునందు:—

క. నీ వొకతె యేల యిలఁ బవి, వేపురు వే వలచి పట్టి వెదకిన నడ్డం
బై వచ్చు వలదు నా నిం, దేవాఁడు మగండు లేమి నెఱుఁగవు కంటే. (ఆ.2.255)

శాంతిపర్వమునందు:—

క. ఏవానిబంధుమిత్రులు, జీవధనంబులును [5]నొప్పిఁ జెందుదురు కృశుం
గా వాని నెన్నఁగాఁ దగుఁ, గేవలతను కార్శ్యయుతుఁడు కృశుఁడె నరేంద్రా.
(ఆ. 1. 52)

పూ వన్నందుకు ఆముక్తమాల్యదయందు:—

ఉ. వేవిన మేడపైవలభి వేణికఁ జంట వహించి విప్పఁగాఁ
బూవులు గోళ్ళ మీటుతఱిఁ బోయెడు తేఁటుల మ్రోఁత కామి శం
కావహ మౌఁ గృతాభ్యసన లౌటను దంతపుమెట్లవెంబడిం
జేవడి వీణ మీటుటలుఁ జిక్కుడలించుటలున్ [6]సమంబుగన్. (ఆ. 1. 62) 257

వ. కడమవి ప్రసిద్ధములు గనుక లక్ష్యములు వ్రాయలేదు.

సకారభేదంబులు

క. శస లెఱుఁగక చదువంగాఁ, బొసఁగ ద దె ట్లనిన శకలము సకృత్తనుచో
వసుధ సకలము శకృత్తన, రసికులు నవ్వుదురు గాన రాక్షసవైరీ. 258

సీ. వికృతిపదాదిని వెలయు నాఱవహల్లు మొదలివిభక్తిపైఁ గదిసె నేని
యరయఁ దృతీయోష్మ మగు శౌరి సీరలు దాఁచి గోపస్త్రీల నేఁచె ననఁగ

1. పుట్టఁగ (సూ; శివ). 2. వ్వేవఁ డెవ్వాఁ డెవ్వఁ. 3. ఏవఁడు–ఈరూపము నకుఁ బ్రయోగము మృగ్యము (రా). 4. నేత్రి. 5. దప్పిఁ జెందును కృశునింగా (సూ.) 6. సరింబడన్ (అచ్చుప్రతి).

ప్రథమోష్మవర్ణంబుఁ బరికింపఁ దద్భవాద్యంధ్రదేశోక్తులయందు లేదు
సింగంబు [1]సింగిణి సెవమును సెలగోల పీసెఁడు పసి గొనఁ జేసి రనఁగ

తే. భీష్మసన్నుత యివి తృతీయోష్మలిపులు, గాని ప్రథమోష్మవర్ణము ల్గావు వీనిఁ
దెలియక రచించు కృతులు ధాత్రీతలమునఁ, బ్రాసభంగంబులై నగుఁబాటుఁ జెందు.

క. తెలుఁగుపదంబుల నెత్తము, గల మూఁడవయూష్మమను శకారముఁ గాఁగం
బలుకుదు రజ్ఞజనంబులు, సెలగోలలు సెనఁగ లాఱుసేరులు ననుచోన్. 260

### హకారవివేకము

సీ. బహ్వర్థ విహ్వల జిహ్వ హ్వ లాహ్వాన గహ్వరోపహ్వర ప్రహ్వ కహ్వ
శబ్దంబులు వకారసహితంబు లగుఁ గాని బిందుపూర్వములు దా మెందుఁ గావు
సంహతి సంహూతి సంహితా సంహార సంహాననాంహో నృసింహ రంహ
బృంహణ పదములు బిందుపూర్వకములు గాని వకారయుక్తములు గావు

తే. మాముదులు నిల్చు బ్రహ్మజిహ్మగపదములఁ
జిహ్న మనుచోట నాముడిఁ జెందియుండుఁ
గియ్య లగు లేహ్యగృహ్య ప్రగృహ్యములను
బ్రాసముల వీని నెఱిఁగి చెప్పంగ వలయుఁ. 261

### కావ్యాదిగ్రాహ్యవర్ణంబులు

మూ. సూ. శుభవర్ణా శ్శుభశబ్దా యే చ శుభగణా స్తథైవ కావ్యాదౌ
గ్రాహ్యాః. 18

తె. లిపుల కధిదైవతంబులు లింగములును, బ్రాణగతి ఫలబీజంబు లాననములు
నమృతములు విషములును దగ్ధాదిభములు, దెలిసి కావ్యముఖంబున నిలుప వలయు.

క. జడ్డలు గల మాతృక [2]తొలి, నిడ్డ నధోర్ణములకెల్ల నేఁటికి మీఁదన్
దొడ్డదొరబిడ్డకైవడి, నొడ్డై కనుపడ్డ వ్రాల కూహింపఁ దగున్. 263

### వర్ణాధిదైవతంబులు

తే. హరిధరలు కంతురమ లంబికామరాంబ, లలకుమారవరాహాశక్తులు వసుత్రి
దివభిషక్కులు మధుచిత్రభవులు కాళి, కార్యలు హరాభవులు పతు లచ్చులకును.

సీ. స్పర్శవర్గములకుఁ జతురాస్యపవమానకరిముఖగణపతినరమృగేంద్రు
లింద్రావరజగుహాద్రీంద్రజా భైరవజిను లంతకాస్త్రపశివమహేశ

1. సిరిదరిసెనమును (ప. వా). 2. తో, నిడ్డ (ప).

వాణులు ఫణినాథవాసుకినందికేశ్వరపద్మమిత్రశంకరులు వీర
భద్రకేశవదస్రభద్రకాళీశూలధారులు నింక నంతస్థములకు
ఆ. మారుతాగ్నిపూర్వమాతంగవరుణులు, శాదివర్ణములకు శ్రీదినేశ
వాక్పినాకధరులు [1]వల మాటెళాకు భూ,తములు నాగమోక్తదైవతములు. 265
తే. కృతిముఖాక్షర [2]దేవత పతికి సుకవి, వరునకును లేఖకునకును వాచకునకు
శ్రోతృజనములకును శుభాశుభఫలంబు, లెలమిఁ గల్పించుచుండు మహీస్థలమున.

వర్ణలింగంబులు

క. పుల్లింగంబులు ప్రాణము, లెల్లను స్త్రీలింగములు మహిని స్వరములతో
హల్లులు నపుంసకంబులు, హొల్ల లగుఁ గకారముఖ్యములు నలినాక్షా. 267
తే. చిరవిభూతి పతికి స్త్రీలింగలిపు లిచ్చు, భంగపఱుచు షండలింగలిపులు
భూరివైభవంబుఁ బొందించుఁ బుల్లింగ, లిపులు తొలుత నిలిచి లేఖవినుత. 268

వర్ణంబుల నల్పప్రాణమహాప్రాణంబులు

ఆ. స్పర్శవర్గ జాతసమలిపు ల్హాఁడవ, వర్గమునను విషమవర్ణములును
నాలు గూష్మములును నలి మహాప్రాణంబు, లల్పసంజ్ఞకంబు లన్యలిపులు. 269
క. తొలుత మహాప్రాణంబులు, నిలిచినఁ గృతినాయకుండు నీల్గును నెలలో
పల నల్పప్రాణాక్షర,ములు గూర్చినఁ బెక్కువర్షములు జీవించున్. 270

వర్ణంబులకు దేవమనుష్యతిర్యగ్గౌరవగతులు

సీ. [3]ప్రాణార్ణములఁ బదియాఱును బంచమాక్షరములఁ బాసిన స్పర్శములును
హ్రస్వంబు లగుతఱి నాదిత్యగతు లగుఁ జాఁపు లైనపుడు భూజనగతు లగు
జింతింప ననునాసికాంతస్థవర్ణంబు లరయ నెప్పుడును దిర్యగ్గతు లగు
శషసహాక్షరచతుష్టయమును ధొడ్డక్కరంబును గూడ గౌరవగతు లగుఁ
తే. గృతిమొదల నిల్పి సురగతు లీర్తిఁ జేయు, మనుజగతులు విరోధినాశనముఁ జేయుఁ
గినిసి తిర్యగ్గతులు చాలఁ గీడుఁ జేయుఁ, బతికి గౌరవగతులు పాపంబుఁ జేయు.

వర్ణంబులకుఁ బ్రత్యేకఫలంబులు

ఆ. శుభకరంబు లాఱు విభవనాశదములు, నాల్గు కీర్తిదములు నాల్గు హాని
దములు రెండు వరుస దప్పక కావ్యంబు, మొదల నిలుపఁ బ్రాణములు ముకుంద.
సీ. ధనధాన్యసుతరాజ్యకనకంబులును యశోనాశనారోగ్యదైన్యప్రతాప
మరణంబులును దుఃఖమానభంగద్రవ్యరోగభద్రములును భోగయుద్ధ

1. వలమైన (సూ). 2. దైవత (వా). 3. ప్రాణావర్ణములును బదియాఱు(సూ)

ధైర్యతేజఃపరితాపంబులును శౌర్యభీతినీరోగసంప్రీతివంశ
నాశనంబులును మానక కాదివర్గంబు లైదు నొసంగు కల్యాణదాహ
తే. ఖేదదీర్ఘాయువులు యకారాదు లిచ్చు,జయభయ శ్రీసుఖంబు లూష్మము [1]లొసర్చు
నాయు వల్పంబుగా దొడ్డళా [2]యొసంగుఁ, గవికిఁ బతికిని బద్యాదిఁ గదియునపుడు.

## వర్ణంబులకు బీజచక్రము

సీ. నిలువుగీటులు పది నిలిపి రేఖాషట్క మడ్డంబుగా గీఁచి యాదిలిపులు
తొలిదొంతి క్రిందు క్రిందుల రెండురెం డిడి రెండవదాన నొండొండు గూర్చి
కడపలిప్రాణంబు కడగ మున్న లిఖించి హెచ్చుళా దానిపైయింట నిలిపి
తరువాతిదొంతులధామంబులను గాదు లొక్కటొక్కటి క్రమ మొప్ప వ్రాసి
తే. యడ్డముగఁ జూడ నయ్యె వాతాగ్నిభూమి, జలఖబీజంబు లివి కావ్యములకు మొదల
నిలుప ఖేదార్తిధనహర్ష నిర్ధనంబు, లొసఁగుఁ గర్తకు భర్తకు నుదధిశయన. 274

## బీజాక్షరచక్రోద్ధారణము

| | | | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|---|
| అఆ | ఏ | క | చ | ట | త | ప | య | ష | ఇవి ౧౦యును | వాయుబీజాక్షరములు పద్యాదిని నిలిపిన ఖేదమును జేయును. |
| ఇఈ | ఐ | ఖ | ఛ | ఠ | థ | ఫ | ర | స | ఇవి ౧౦యును | అగ్నిబీజాక్షరములు పద్యాదిని నిలిపిన ఆర్తిని జేయును. |
| ఉఊ | ఓ | గ | జ | డ | ద | బ | ల | హ | ఇవి ౧౦యును | భూమిబీజాక్షరములు పద్యాదిని నిలిపిన ధనమును జేయును. |
| ఋౠ | ఔ | ఘ | ఝ | ఢ | ధ | భ | వ | ళ | ఇవి ౧౦యును | జలబీజాక్షరములు పద్యాదిని నిలిపిన హర్షముఁ జేయును. |
| ఌౡ | అం | ఙ | ఞ | ణ | న | మ | శ | అః | ఇవి ౧౦యును | గగనబీజాక్షరములు పద్యాదిని నిలిపిన నిర్ధనమును జేయును. |

## ఊర్ధ్వముఖాధోముఖపార్శ్వముఖంబులు

తే. [3]వట్రసుడు లూర్ధ్వముఖములు వక్రములును
గుడుసులు నధోముఖంబులు గడమపదియుఁ

1. లొసంగు (పూ). 2. యొసర్చు (పూ). 3. వట్రుసుడులు (పూ).

బార్శ్వముఖములు వరుసతోఁ బ్రాణహాని
ఖేదసంపద లొసఁగుఁ గావ్యాది నిలిచి.

## వర్ణంబులకు నమృతవిషంబులు

క. పరువడి హ్రస్వము లమృతా, క్షరములు కృతిమొదలఁ గూర్ప గదము లడంచున్
[1]ధర నిడుపులు విషలిపు లవి, గరళముగతి మ్రింగుఁ బతిని గావ్యాది నిడన్. 276

## వర్ణంబులకు దుష్టనక్షత్రంబులు

క. పలికెడు కబ్బమునకు మొన, దల నెలకొనునక్రూరంబు తారకదగ్ధా
దుల నైదింటను దొరలక, వెలసిన నాయకున కింద్రవిభవం బబ్బున్. 277

## దగ్ధజ్వలితధూమితతారలు

తే. క్రూరఖేటము విడిచిన తార దగ్ధ, యపుడు వసియించునది జ్వలితాఖ్య దాని
ముంగలివిధూమితం బివిమూఁడుఁగృతికి, మొదలఁ[2]గదిసినమృతిదుఃఖగదము[3]లొదవు.

## మృతజీవరోగభంబులు

తే. సైంహికేయగ్రహస్థితర్క్షంబుమీఁది, తార మొదలుగఁ బదుమూఁటిదనుక జీవ
యుతము లవతలి వన్నియు మృతము లిట్లు, త్రివిధముగఁ జెప్పఁబడియె విరించిజనక.

ఆ. తమ్మిచుట్టమున్నతారక మొదలుగ, మృతము లేడు ప్రాణయుతము లర్క
పరిమితములు రోగభంబులు గూడంగ, నిది వసిష్ఠమతము యదుకులేశ. 280

క. కృతిమొదల నిలిచి చంపును, మృతనక్షత్రంబు చాల మే లొనరించున్
సతతంబు జీవతారక, పతికిఁ దెవులు సేయు రోగభము నెలలోనన్. 281

## అవకాద్యర్ణస్వరనిర్ణయము

### వరరుచిసంహితోక్తవచనంబులు

శ్లో. స్వరాః పంచవిధాః ప్రోక్తా అ, ఇ, ఉ, ఏ ఒతి క్రమాత్,
తై ర్యుక్తా అవకాద్యర్ణా ఏకైకం పంచధా భవేత్.
అవకహడా మటపరతా నయబజఖా శ్చాథ గసదచలాః,
వర్ణా ఏతే భానా మేకైకం పంచధా క్రమశః.
ఐత్వ మౌత్వ మనుస్వారో విసర్గో వా [4]భవే ద్యథా,
సర్వస్వరాణాం మాత్రత్వా దేతేషా మస్వరో భవేత్.

1. ధర నిడుపు విషము లిపు లవి (వా). 2. గదసిన (ప. వా.) 3. లొసఁగు (ప.)
4. భవే ద్యది (క.)

[1]ఋత్వేత్వయో ర్మిథో హ్రస్వదీర్ఘయో రైక్య ముచ్యతే,
యామళోక్త మిదం జ్ఞాత్వా వదే త్సర్వ బలాబలమ్.

క. తలకట్టులు గుడుసులు కొ,మ్ములు వెస నేత్వములు నోత్వములు ననఁ బ్రాణం
ఖులు పంచవిధములై హ,ల్లుల నెల్లను గూడుకొని నిలుచుఁ దారలకున్. 282

తే. అవకహడలును మటపరతాక్షరములు, [2]నయబజగసదలచవర్ణములు పరుస
నిరువదియు స్వరపంచకాన్వితము లగుచుఁ, గృత్తికాదుల నాల్గేసి హత్తియుండు.

తే. ప్రాణషోడశమునకు నాద్యస్వరంబు, జనని యగుటను బిందువిసర్గవక్ర
తమములకుఁ దాన యగునిడుదలకు నెల్ల, గుఱుచలగు వక్రసుడులకు గుడుసు లగును.

నక్షత్రాధిపతులు

సీ. అశ్వినీప్రభృతుల కైదింటికిని దస్ర యమకీలిధాతృనీహారకిరణు
లార్ద్రాదులకు శంకరాదితిచిత్రశిఖండిసంభవభుజంగమ[3]పితలును
నిజము పూర్వాఫల్గునీముఖ్యములకు భగార్యమార్కత్వష్ట్రహారిణహయులు
మఱి విశాఖకు శతమఖవహ్ను లిద్దఱు పిదప ననూరాధ మొదలుగాఁగ

తే. నాలుగింటికి మిత్రేంద్రనైరృతాంబు, లుత్తరాషాఢనుండి యష్టోడువులకు
విశ్వవిధివిష్ణువసుతోయ విభువిరించి, పాదహిర్బుధ్న్యపూషులు పతులు కృష్ణ. 285

క. ఏతారకు నెవ్వఁడు విభుఁ, డాతనినామంబు లెల్ల నాతారకుఁ బ్ర
ఖ్యాతముగాఁ జెప్పంబడు, జ్యోతిశ్శాస్త్రంబునందు సుమనస్తుత్యా. 286

వర్ణంబులకు నక్షత్రంబులును రాసులును నెఱుంగ దెలియంగ వివరించెద.

కాలజ్ఞకల్పోక్తశ్లోకంబులు.

శ్లో. అకారః కృత్తికా మేష ఈ, ఊ, ఏ కృత్తికా వృషః,
ఓ, వా, వీ, వూ, ధాతృవృషౌ వే, వో, మృగవృష స్తథా.
కా, కీ, మృగశిరాయుగ్మం కూ, ఘం, జం, ఛ, శివాయుగం,
కే, కో, హా, అదితిద్వంద్వం హీ, సురాంబా[4]కులీరకాః.
హూ, హే, హో, డా, పుష్యకర్కిడీ, డూ, డే, డో, హి కర్కటః,
మా, మీ, మూ, మే, మఘాసింహో మో, టా, టీ, టూ, భగేభభుక్.
టే, ఉత్తరాభహర్యక్షో, టో, పా, పీ, ఉత్తరావధూః,
పూ, ష, ణా, ఢా, హస్తకన్యా పే, పో, చిత్రాకుమారికా.

1. ఋత్వేత్వయో (వా). 2. నయబజఘధగస ఛఛల (పూ). 3. పితరులు (ప. వా.) 4. కుళీరగః (ప. వా.)

రా, రీ, చిత్రా తులారాశీ రూ, రే, రో, తా, మరుత్తులా,
తీ, తూ, తే, వైశాఖతాలీ తో, విశాఖా సరీసృపః,
నా, నీ, నూ, నే, మైత్రి కీటో నూ, యా, యీ, యూ, స్వరా డవిః,
యే, యో, బా, బీ, దైత్యచాపో బూ, ధా, ఫా, డా, జలం ధనుః.
జే, విశ్వేదేవకోదండో బో, జా, జీ, విశ్వవాశ్చరః,
జూ, జే, జో, ఖాభిజి న్నక్రో ఖీ, ఖూ, ఖే, ఖో, హరిగ్రహః.
గా, గీ, ధనిష్ఠామకరో గూ, గే వసుపయోధరః,
గో, సా, సీ, సూ, శతభిష గ్ఘటరాశి రుదాహృతః.
సే, సో, దా, [1]అజరాట్కుంభో ధిఅజైకపదో ఝషః,
దూ, శా, ఝా, దా అహిర్బుధ్న్యతారా క్షేత్రం తిమింగిలః.
దే, దో, చా, చీ, పౌష్ణతారా రాశిః పాఠీనసంజ్ఞికః,
చూ, చే, చో, లా అశ్వినీభా లీ, లూ, లే, లో భరణ్యజః. 288

వ. వెండియు వీనికి నాదేశంబు లగునక్షరంబులు గల వవియును జెప్పెద.

శ్లో. [2]ఘూరార్ద్రిర్క్ష ద్వితీయేంఘూర్వహిర్బుధ్న్యతృతీయకే,
డకారో జలభ స్యాంతే తద్ద్వితీయేఽథ కారకః.
భవర్ణక స్తత్తృతీయే ఏతే వర్గ చతుర్థకాః,
ద్వితీయేఽహిర్బుధ్న్యభస్య ప్రథమోష్టాక్షరం విదుః.
రాత్రాహిర్బుధ్న్యతో యార్క నక్షత్రాణాం మనీషిభిః,
ద్వితీయాది త్రిపాదేషు యే వర్ణాః కీర్తితాః పురా.
తేషా మేకైకవర్ణ స్స్యా త్సర్వస్వరసమన్వితః,
మాతృత్వా దస్వర స్తేషా మేక ఏవప్రకీర్తితః.
ఆద్యద్వితీయవర్గానునాసికాక్షరయో ర్మిథః,
భేధో నాస్తి మిథ స్తద్వ దంత్యవర్గసమార్ణయోః.
యత్ర తిష్ఠంతి నామాదౌ సంయోగవ్యంజనాక్షరాః,
త త్రాదివ్యంజనం గ్రాహ్య మి త్యుక్తం బ్రహ్మయామళే.

1. అభపాట్కుంభో (ఫ. వా.) అజపాత్కుంభో (ఛ). 2. ఘూరార్ద్రిక ద్వితీయర్క్షఘూర్హిర్బుధ్న్య (ప. వా).

రేఫాన్వితాక్షరో యత్ర నామాదౌ నృపభృత్యయోః,
ధనధాన్యాయ దంపత్యో ర్గ్రాహ్యో రేఫస్తు నేతరః.

తే. హారునిరిక్క రెండవకాల నవలిభాద్ర, మూఁడవపదంబునను సలిలోడువునకు
నబ్ధినేత్రకృశానుసంఖ్యాంఘ్రులందుఁ, గ్రమత వర్గచతుర్థాక్షరంబు లమరు. 289

క. జలరవిశివోత్తరాభాద్రల తొలిపాదములఁ దక్కఁ దక్కినమూఁటన్
గల లిపుల కే స్వరంబులు, తల నిలచిన నొకటి గాఁగఁ దలఁపఁగ వలయున్. 290

క. మించి ప్రథమానునాసిక, మెంచఁ జవర్గాంత్యమునకు నెల్లెడఁ జెల్లున్
బంచమవర్గచతుర్థము, వంచింపక స్వద్వితీయవర్ణమున కగున్. 291

క. పతినామాద్యర్ణమునకుఁ, గృతిముఖమున నుండువ్రాయికిని గీర్వాణ
స్తుత ద్విత్వము లున్న నఘో,గతము లుడిగి మీఁదిమాతృకయ కొను టొప్పున్. 292

క. నామాది నుండు వర్ణము, దామోదర రేఫసంయుతంబై యున్నన్
యామళమునందు రేఫం, బే మిక్కిలి గ్రాహ్య మనుచు నెన్నంబడియెన్. 293

నాయకాక్షరకూటంబులు

తే. నేతృనామాది నుండెడి మాతృకకును, గావ్యముఖవర్ణమునకును గాంతిజాతి
చక్రగణయోనిలింగ[1]నక్షత్రయోగ, రాశిఖగమైత్రు లెఱిఁగి కూర్పంగ వలయు,

క. కుతలమున వధూవరులకుఁ, జతురత దైవజ్ఞమణి విచారించుగతిన్
గృతికన్యానాయకులకు, హితమతిఁ దెలియఁ దగు సుకవు లివి తొమ్మిదియున్.

1. అక్షరకాంతికూటములు

తే. ప్రథమదశమచతుర్థస్వరంబు లెఱుపు, లసితరుచులు తృతీయషష్ఠాష్టమములు
పంచమైకాదశంబులు పచ్చవన్నె, లిందునిభములు తక్కినయెనిమిదియును. 296

సీ. శ్యామలశుభ్రశోణార్జునకృష్ణంబు లసితవినీలారుణాంజనాభ
కాళిమ లరుణశుక్లచ్ఛవిపీతసితేతరరక్తంబు లిందుకాంతి
హారిణమేచకహరిద్రాభపాండురములు సితకృష్ణధవళలోహితసుపర్వ
పతిశిలాభంబులు స్పర్శవర్గములకుఁ గృష్ణారుణాసితక్షీరరుచులు

తే. నాల్గునంతస్థములకుఁ గుందనపుఁదేట, కెంపుటాచాయయును బవడంపుజిగియు
మొల్లవిరిమిసిమియు నూష్మములకుఁ దెలుపు, నెఱ ళకారంబునకును వన్నియలువరుస.

ఆ. విభుశరీరకాంతి వీక్షించి తత్కాంతి, గలుగునక్షరములు కావ్యములను
మొదల నిలుపఁ దేజ మొదవు వేఱొకచాయ, వర్ణ మిడినఁ దెవులు వచ్చు నిజము.

---

1. నక్షత్రదూర (పూ. ము. అని. గి. ప్రతి).

క. శ్వేతము నీలము నేకము, భూతలమునఁ బీతరక్తములకు నభేదం
బై తనరుఁ గృతులయందును, నీతెఱఁగునఁ దెలియవలయు నిభపతివరదా. 299

## 2. అక్షరకులకూటము

సీ. ఆదిషోడశమును గాదిపంచాదశవర్ణంబులును ద్విజాన్వయభవములు
తపవర్గ మాతృకాదశకసమాంతస్థములు రాజగోత్రసముద్భవములు
తలపోయ నంతస్థములలోన దేసులు నూష్మంబులును విట్కులోద్భవములు
రదనజాతచేజోక్షరములును గురుఱళల్ జగతి నంఘ్రిజవంశసంభవములు
ఆ. వీనిఁ దెలిసి కావ్యవిభుని దేజాతి తజ్జాతియక్షరంబు సత్కవీంద్రు
లరసి కృతిముఖంబునందుఁ బొందించిన, నెసఁగు సకలశుభము లిరువురకును. 300

### స్నిగ్ధరూక్షాక్షరంబులు

ఆ. అధిపుకులమువ్రాయి యల్పాసు వైనను, స్నిగ్ధ మయ్యె[1]నాది సిరు లొసంగు
నన్యజాతిలిపి మహాప్రాణమై రూక్ష, మనఁగ మొదల నిలిచి యునికిఁ బాపు. 301

## 3. అక్షరచక్రకూటము

సీ. అయి దూర్ధ్వరేఖలయందుఁ దిర్యగ్రేఖ లై దిడి యిండ్లు పదాఱుఁ జేసి
యధిపనామాద్యక్షరాదిగా నచ్చులు హల్లులు గురుళకారాంతములుగ
నాద్యగ్నిహరనిధిహస్తవేదాదిత్యదిగ్రసకరినృపతిమనుబాణ
శైలవాసరవిశ్వసంఖ్యాలయంబుల లిఖియించి యామీఁదిలిపులు మరల
తే. వెనుకట్టుల నిలిపి తక్కినవి రెండు, పదియు మూఁడవతావునఁ గుదురుపఱిచి
జగతి నరివర్ణశోధనచక్ర మిట్లు, వ్రాయఁగాఁ దగు నేఁబదివర్ణములను. 302

## 4. స్నిగ్ధాదిచక్రకూటము

సీ. [2]నాల్గిండ్లు పైని గ్రిందను బ్రదక్షిణముగా జత గూడి యొక్కొక్కచవుకమయ్యె
నట్టిచౌకములు నాల్గవి క్రమంబున సిద్ధసాధ్యసుసిద్ధారిసంజ్ఞము లగు
నవి గాక యొక్కొక్కచవుకంబునను గల్గునిరవులు నాల్గును వరుసతోడ
క్షితి సిద్ధసాధ్యసుసిద్ధారు లన నొప్పుఁ గావునఁ గడచవుకంబునందుఁ
తే. గలగృహంబులు నాల్గింటఁ గడమ మూఁడు, చవుకములయందుఁ గడపలిసదనములను
బద్యముఖవర్ణములు గనుపట్టెనేని, పతికి నెటువంటిహితుఁడైనఁ [3]బగఱ యగును. - -

1. నేని (పూ. ము. ఆని. గి. ప్రతి). 2. నాల్గింట్లు (ప). 3. బగర. (పూ.ము.)

## అరివర్ణచక్రోద్ధారణము

| | | | |
|---|---|---|---|
| ౧<br>ఎటర | ౨<br>అంణష | ౩<br>ఐఠల | ౪<br>ఔఞతస |
| ౫<br>ఛబఊ | ౬<br>గధఅ | ౭<br>జభఓ | ౮<br>ఘనఆ |
| ౯<br>ఔఢశ | ౧౦<br>ఖదళ | ౧౧<br>ఓడవ | ౧౨<br>కథహ |
| ౧౩<br>ఈయఋౠ<br>ఌౡ | ౧౪<br>చఫఈ | ౧౫<br>ఝమఋ | ౧౬<br>ఙపఇ |

ఎఱ్ఱాప్రగడ తనకున్న ఆరణ్యపర్వశేషము మొదలిపద్యమునకున్ను అక్షర చక్రము చూచుకొన్నందునకు తెలివిడి.

తెనుఁగున శబ్దాదిని యకారము లేదు గనుక నెఱ్ఱాప్రగడనామాద్యక్షర మచ్చుగనక, ఎకారము అది మొదలుకొనిన్ని వ్రాసితేను పద్యాదివర్ణము, 'స్ఫుర దరుణాంశు' అన్నాఁడు గనుక ద్విత్వాక్షరమునందు మీఁదటి యక్షరమే కార ణము గనక సకారము సాధ్యపుచొకమునందు సాధ్యపుఇంట నిలిచెను గనక సాధ్యసాధ్యము మంచిది, యెవరికి జూచినా యిటువలెనే. 304

[1]శ్లో. అద్వ్యగ్నిరుద్రగ్రహనేత్రవేద రవిర్దిశర్తూ వసుషోడశశ్చ,
మన్వంతరే బాణతురంగవాసర స్త్రయోదశాశ్స్యుః పదవర్ణమాహ.

ఉ. చేరక యిట్లువ్రాసి తగ సిద్ధము సాధ్యము నా సుసిద్ధముక్
వైరియుఁ గావ్యనాయకుని వర్ణగృహాదిఁ బ్రదక్షిణంబుగా
నారసి చూచి శత్రులిపు లన్నియు వీడ్కొని భద్రమధ్యమా
దార శివప్రదంబు లని తక్కినమూటి నెఱుంగఁగా నగున్. 305

### 5. అక్షరదేవారిగణకూటము

క. ఆరయ [2]నామాద్యక్షర, తారాగణమును దదీశతారాగణముక్
వైరము నొందిన భర్తకు, ఘోరార్తి ఘటించు మైత్రిఁ గూడిన నొప్పున్. 306

1. (వ్రా) లో ఉన్నది. ఈశ్లోకము తరువాతి పద్యము సూ. శివప్రతులలోను గానరాదు. (రా). 2. కావ్యాద్యక్షర (ఓ, శివ).

తే. అధిపతికి నేండ్లు ముప్పది యైనదనుక, నతఁడు పుట్టినరిక్కయు నంతనుండి
నామధేయంబుమొదలివర్ణమున [1]కైన, చుక్కయును జేకొని బలంబుఁజూడవలయు.

క. జనియించిన తార యెఱుం, గనిజనులకు నామతారకయ చేకొనఁగాఁ
జను నని సంహితలోపల, ననియె [2]వసిష్ఠుండు గోచరాధ్యాయమునన్. 308

## గణనిర్ణయము

సీ. నవతార లొక్కగణం బగు నట్టిగణంబులు మూఁడువిధంబు లయ్యె
హయమృగాదితిపుష్యహస్తమారుతమైత్ర రేవతీశ్రవణముల్ దేవగణము
లగ్నీంద్రవరుణచిత్రాహిమూలలు విశాఖావసుమఖలు రాక్షసగణములు
పూర్వత్రయవిరించిశరోత్తరత్రయయామ్యముల్ నృగణంబు లనఁగఁ జెలఁగు

తే. నుత్తమము రెండుగణములు నొకటియైన, [3]మధ్యమము సురనరగణాహ్వయములైన
నధమమాదిత్యగణము దైత్యంబునైన, నాశనము దానవంబు మానవమునైన. 309

## యోనినిర్ణయము

ఆ. మురవిభేది కావ్యముఖవర్ణతారకా, యోని నాయకర్త్రు యోనితోడఁ
బొందు గూడెనేని పూర్ణాయు వగు వైర, మొందెనేని హాని చెందుఁ బతికి. 310

సీ. వాజిశతోడు లశ్వములు యామ్యాంత్యభంబులు కరు లగ్నిజ్యములు గొఱియలు
బ్రహ్మేందు లహులు సర్పపునర్వసులు పిల్లు లిల మఖాఫల్గును [4]లెలికెకూన
లుత్తరాహిర్బుధ్న్య లూహింప గోవులు వాయుహస్తంబులు వాహరిపులు
దలఁప నింద్రాగ్నిచిత్రలు పులు లింద్రానురాధ లేణంబులు రాక్షసార్ద్ర

తే. లడవికుక్కలు జలభంబు హరియుఁ గపులు, విశ్వతారాభిజిత్తులు వేఁటముంగు
లజపదంబు ధనిష్ఠయు నరసి చూడ, బాలకంఠీరవంబులు పద్మనాభ. 311

ఆ. ఏకయోను లైన నెంతయు మంచిది, కొంతమేలు భిన్నజంతు లైన
వైరజాతు లైన వర్జనీయము వాని, తెఱఁగు గౌతమోక్తిఁ దెలియ వలయు. 312

సీ. అశ్వంబునకు హరివ్యాఘ్రసైరిభములు కరటికి శార్దూలతురగహరులు
మేఁకకుఁ గపిపుండరీకహర్యక్షంబు లురగంబునకుఁ బిల్లియును నకులము
మార్జారమునకు సింహవ్యాఘ్రశునకంబు లాఖువునకు బిడాలాహిబభ్రు
లర్వగోకాసరైణాలికిఁ గేసరిద్వీపులు పులికి హస్తిద్వీపంబు

తే. కుక్క లేడికి సింగంబు గోల్పులియును, బభ్రుకపులకు శునకడింభంబు నరులు
గట్టితనమున మృగరాజుఁ బట్టునట్టి, జంతువులు లేవు దానిచే సమయుఁ గాని. 313

---

1. నైన (పూ. ము.) కైన (సూ). 2. వశిష్ఠుండు (సూ). 3. ఇందు యతిభంగము గలదు. 'మధ్యమము దేవగణమును మనుజగణము' అని సవరించు టుచితము (రా.) సురనరగణమయములైన (శివ). 4. లెలుకకూన (రా).

క. ఇభరాజభయనివారణ, ప్రభుతారాలింగముఁ బ్రబంధాదిమవ
ర్ణభలింగంబును [1]గలుసుక, శుభదంబులు గాఁగ సుకవి చూడఁగ వలయున్. 314

లింగనిర్ణయము

ఆ. ప్రథమయోని [2]పురుషభం బొక్కటైనను, యువతిభంబు మిథునయోగ మైన
నుత్తమంబు స్త్రీభయుగ మైనమధ్యంబు, పురుషభద్వయమునఁ బోరు పుట్టు. 315

క. నెలఁతలకుఁ బురుషతారలు, తలఁపఁగఁ బురుషులకు యువతితారలు నై సం
ధిలునపుడు లింగదోషంబులు పని లేదనిరి కశ్యపుండును భృగువున్. 316

అక్షరనక్షత్రదూరము

ఆ. కృతిముఖంబువ్రాయిరిక్కకు విభుతార, పదియుం మూఁటిమీఁదఁ బొదలునేని
భర్తవర్షశతము బ్రతుకు లోపల నున్న,నల్పకాలమునఁ గృతాంతుఁ గాంచు. 317

అక్షరరాశికూటము

క. అక్కజ మగుకబ్బముతొలి, యక్కరపుంజుక్కరాశి యారభ్యముగా
లెక్కింప నధిపురాశికి, నిక్కశుభాశుభము తెలిసి నిలుపఁగ వలయున్. 318

రాశినిర్ణయము

తే. క్రమతఁ గావ్యాది నుండునక్షత్రరాశి, [3]నుండి లెక్కింప భూరామయుగశరాద్రి
శరితపనసంఖ్యలకు గృతీశ్వరునినామ, రాశి దనరిన నతులసామ్రాజ్య మొదవు.

తే. మేషమునకు వృశ్చికము మిథునమునకు, నక్రమును సింహమునకు మీనంబు నహితు
లెనిమిదవయని శుభదంబు లనుచు వీనిఁ, గైకొనుటగూడదని చెప్పెఁ గశ్యపుండు.

తే. విదితముగ రెండు నాఱు తొమ్మిదియుఁ బదియుఁ
బదునొకొండు నై పదిరాశి పరఁగునేని
నిర్ధనంబుఁ గళత్రహానియు నపత్య
నాశనంబు దుఃఖంబు దైన్యంబు గలుగు. 321

ఆ. కన్యకాకుళీరకౌర్పిజలగ్రహ, వృషతిమింగిలాంబు లెంచునపుడు
షష్ఠరాసు లైనజాయకు దీర్ఘాయు, వనుచు నక్షపాదుఁ డానతిచ్చె. 322

తే. రాశియొక్కటి రెండుతారకలు నైన, రాముగతిఁ గృతిపతి శత్రురాజి నడఁచు
రిక్క యొకటియు రాసులు రెండు నైన, రిపులచేఁ గృతిపతి సంహరింపఁబడును.

---

1. గలసియు (సూ). 2. పురుషభంబు బిందుకమది (ప. వా). 3. నుంచి (పూ. ము).

క. మును దూషించినరాసులు, గనుఁగొన నేకాధిపత్యఖగమైత్రము లొం
దినఁ దద్దోషము లెల్లను, జను నని నారదుఁడు చెప్పె సంహితలోనన్. 324

## అక్షరగ్రహకూటము

ఆ. కర్తృరాశి పతికిఁ గావ్యాదివర్ణము, రాశి కీశుఁ డైన గ్రహమునకును
నూఁడు గలుగఁ జెప్పువాఁడు కాలయముండు, గాని కవివరుండు గాఁడు పలికి.

## రాశ్యధిపతులు

క. ధరణీసుతభృగుబుధశశి, సరసిజహితసౌమ్యకవిరసాభవసుమనో
గురుమందపంగుజీవులు, తిరముగ మేషాదిరాశ్యధిపతులు వరుసన్. 326

వ. మఱియు నొక్కవిధంబు. 327

చ. హరిపతి హేళి, కర్కివరుఁ డంబుజశత్రుఁ, డజాళి[1]భర్త గ
హ్వారితనయుండు, యుగ్మవనితాధిపుఁ డిందుసుతుండు, చాపమ
త్స్యరమణుఁ డింద్రమంత్రి వృషతౌలవిభుం డుశనుండు, నక్ర పు
ష్కరధరరాశివల్లభుఁడు సారసబంధుకుమారుఁ డచ్యుతా. 328

క. జ్యోతిశ్శాస్త్రము గాదని, మాతృకలకు భైరవుండు మఱియొకచందం
బైతనరఁ జెప్పె గ్రహసం,ఘాతము రాశిపతి దక్క గ్రహ మొరుఁ డగునే. 329

తే. అధిపతులకంటె గణముల కర్ణములకు, గ్రహములే బలవంతు లామహిమఁ గాదె
యడుగుదాఁకినఁగవిభానుఁ డలిగి మూఁడు, గడియలకుఁ దొల్లి శిల పొడిగాఁగఁదిట్టె.

## గ్రహమైత్రీనిర్ణయము

సీ. భానున కాప్తులు భౌమేజ్యసోములు శత్రులు భృగుపుత్రశనులు, శశికి
సఖులు బుధార్కులు శతుఁ డొక్కఁడును లేఁడు, కుజునకుఁ జుట్టలు గురురవీందు
లరి రౌహిణేయుఁడు, హరిణాంకసుతునకు హితులు భార్గవమందు లీసు తండ్రి
గురునకుఁ జెలులు భాస్కరచంద్రకుజులు వైరులు కావ్యసౌములు, బలిగురునకు
తే. బంధు లినతనయజ్ఞులు పరులు మిహిర, తుహినకిరణులు శనికి విందులు కవిజ్ఞు
లహితు లారార్కితారేశు లందఱకును, సములు [2]తక్కినహరిపదచారు లెల్ల. 331

క. సమమిత్రము లైనను భద్రము సేకుఱుఁ బతికి సుహృదరాతి గ్రహముల్
సమకూడిన భయ మొదవును, సమశాత్రవు లైనఁ గీడు చాల ఘటించున్. 332

---

1. కర్త (సూ). 2. చిక్కిన (పూ. ము.)

తే. ఈశుఁ డొకఁ డైన [1]నిద్దళి క్లిష్ట మైన, మంచిది సమత్వ మైనను మధ్యమంబు
వైర మైనను వర్జింప వలయుఁ గాని, తగదు సేయఁగ ననియెఁ బితామహుండు.
తే. రవియుతుఁడు నీచగతుఁడు పరాజితుండు, నహితరాశిస్థితుండు నై యప్పు డుండు
గ్రహము వర్ణంబు గణమును గావ్యమునకు, నాది నుండిన లేవు శుభాశుభములు.
తే. శారదాదర్పణంబున జ్యోతిషంబుఁ, బట్టి గ్రహమైత్రిమాత్రంబు పలుకఁబడియె
దానిఁ గని విస్తరించిరి తద్విధంబ, భైరవాదులు తెనుఁగునఁ బనికిమాలి. 335

## కృత్యాదివర్ణద్వయ యోగ[2]లక్షణములు

ఆ. గరిమ యోనిలింగగణతారకాదూర, రాశిఖేటతత్ప్రకాశబీజ
చక్రకూటములు విచారించి కావ్యాది, వర్ణయుగము నిలుపవలయు సుకవి. 336
తే. ఆదిలిపి కన్యయును ద్వితీయాక్షరంబు, పతియుఁ గాఁ జేసి యీరెండువర్ణములకు
నిపుడు చెప్పినకూటంబు లెల్ల నరసి, కూర్చినప్రబంధము నిలింప[3]కుజము పతికి.
క. మొదలను సంయుక్తార్ణము, గదిసిన నీరెంటికిని సకలకూటంబుల్
పదిలముగఁ జూడ వలయును, బదరక యామీఁదిలిపికిఁ బని లేదు హరీ. 338
క. క్రిందను జడ్డక్కరములు, సెందనిలిపు లాది నున్న సిద్ధముగాఁ జూ
డం దగుఁ గూటము లెల్లను, బొందుగఁ బ్రథమద్వితీయములకు ముకుందా. 339
తే. త్రిదశనుత యోని లింగంబు మొదలు గాఁగ
నాఱు మును చెప్పఁబడి యుండు నవలిఖేట
కాంతికూటము మొదలుగాఁ గ్రమత మూఁడు
దెలియఁ బలికెద నీకుఁ దేటతెల్లగాఁగ. 340

## గ్రహకాంతికూటము

క. మొన నున్న మాతృకాద్వయ,మునకు న్గణయుగ్మమునకు మును చెప్పినచో
ప్పున నైన ఖేచరంబుల, తనుకాంతులవలనఁ దెలియఁ దగుఁ దత్ఫలముల్. 341

## గ్రహవర్ణంబులు

క. రవిభౌములు రక్తాంగులు, కవిజైవాతృకులు ధవళకాయులు సోమో
ద్భవగురులు పీతగాత్రులు, దివాకరసుతుండు నీలదేహుం డరయన్. 342
తే. పాండుపీతాంగు లెల్ల శుభగ్రహములు, రక్త మేచకతనులు క్రూరగ్రహములు
పద్మహితుఁగూడి శశియును బాపి యగును, క్రూరసంగతి బుధుఁడును గ్రూరుఁ డగును.
తే. రెండును ఖలగ్రహములైన మృత్యువగును, సౌమ్యుఁ డొకండునైనను శర్మ మగును
బాపశుభఖేచరములైన బవర మగును, శోభనక్రూరు లైనను శోక మగును. 344

1. నిద్దళి (నూ). 2. ఫలంబు (నూ). 3. కుటము (నూ).

ఆ. [1]హేనినామమునకుఁ గ్రిందివంకను మీఁది, వంకయందు నుండు వర్ణములకు
గణములకును బాపఖచరంబు లైయున్నఁ, జేడక యుండువాఁడు శివుఁడో హరియొ.

బీజాక్షరకూటము

క. కమలాప్రమదాప్రియ కా, వ్యముఖంబున నుండురెండు వ్రాలకు నగు బీ
జము లుత్తక్రమమున మి, త్రము లైనను బతికి శుభము దాక్కొను టరుదే. 346

బీజమైత్రీనిర్ణయము

తే. చదలు గాడ్పుల ముంగల జగతి పుడమి, సరసనేలయు నీరును జలముమీఁద
క్షితియు నప్పును నిప్పును జిచ్చుచెంత, నుదకమును గృతిముఖమున నున్న మైత్రి.

ఆ. కీలిమీఁదిగాలి కృతిముఖంబున నిల్చి, యేటిలోనఁ బొత్త మెల్లఁ గాల్చు
గాలిమీఁదికీలి కర్తమందిర మెల్ల, నిర్దహించు నాఱునెలలలోన. 348

అరివర్ణశోధనచక్రకూటము

క. నిక్కము మొనలిపి రెండవ, యక్కరమున కరిగృహంబునం దుండిన యా
వెక్కురుకబ్బం బొడయనిఁ, జిక్కు వడఁగఁజేయుఁ బగఱచే రణభూమిన్. 349

ప్రశస్తకూటంబులు

తే. క్షితిసురుల కాఱు ధారుణీపతుల కైదు, వైశ్యులకు నాల్గు శూద్రాంత్యవర్ణజులకు
మూఁడు రెండును శుభకరంబులయియున్నఁ, జాలు ననియె సంహితలోన శౌనకుండు.

తే. విప్రులకు గ్రహమైత్ర్య మూర్వీపతులకు, గణవిధము వైశ్యులకు రాశిగణన శూద్ర
నీచులకు యోనితార లిన్నింటిలోనఁ, గడుఁ బ్రశస్తంబు లివి వృద్ధగర్గమతము.

క. కూటము లెఱుఁగవు మాతో, సాటికిఁ బద్యములు చెప్పి చదివెద విది బల్
చేటు సుమీ యని పెద్దలు, [2]నేటించినఁ గుకవి కడుఁ గినిసి జగడించున్. 352

సంయుతాక్షరవిశేషము

సీ. క్షారహారిద్రారజంబులు గూడఁగఁ దమశుభ్రపీతవర్ణములు విడిచి
రక్తవర్ణంబులై రాణించు చాడ్పున నశుభప్రదంబు లైనట్టి వ్రాలు
జగతిపై సంయుతాక్షరములై కనుపట్టి నిజదుష్టఫలము లిన్నియును బూని
సకలసంపత్ప్రదాయకములై తనరారు పంచదారయు నానవాలు గలసి

తే. తొంటికంటెను మిగుల మాధుర్యరుచుల, నొప్పుగతి శుద్ధలిపులుసంయుతము లగుచు
నధికమంగళకరములై యమరు ననుచుఁ, బ్రమథపతి మాతృకానిధానమునఁ జెప్పె.

---

1. నృపుని (పూర్వముద్రణ మని గిడుగుప్రతి.) హేని - అని సూర్యప్రతిలో గ్రంథములో ముద్రితమైనది; శుద్ధ పత్రికలో 'నృపుని' అని సవరింపఁబడినది. శివ ప్రతిలో 'రేని' అని యున్నది (రా.) 2. మాటికిఁ బల్కినను వినఁడు మఱి జగడించున్ (వా.)

## శ్రీకారప్రభావము

తే. వేదముల కెల్ల నోంకార మాది యైన, కరణిఁ గృతులకు నెల్ల శ్రీకారమాది
గానఁ గవివరు లెల్లను దానిఁ దక్క, నితరవర్ణంబు లిడరు సత్కృతుల మొదల.

క. ఎంతయు శ్రీకారము లా, ద్యంతంబుల నుంచి లేఖ లంపిన నగు న
శ్రాంతంబు గార్యసిద్ధి ము, రాంతక కావ్యాదిఁ గూర్చ నరుదె శుభంబుల్. 355

క. పదపడి శ్రీకారము కృతి, మొదల నిలిచి దోషపుంజము నడంచి శుభం
బొదవించుఁ బరుస మినుమును, [1]గదిసి సువర్ణంబు సేయుకరణిఁ ధరణిన్. 356

క. శుభదేవతాత్రయంబును, శుభఖచరత్రయము గలిగి శుభవాచకమై
యభినుతి గాంచిన కతమున, శుభములు శ్రీకారమునను జొప్పడు టరుదే. 357

వ. దీని తాత్పర్యము—శకారమున్ను రేఫమున్ను ఈస్వరమున్నూ ఈ మూఁడున్నూ గూడఁగా శ్రీకారమాయెను. అందులోను శకారమునకున్నూ ఈకారంబునకున్నూ అధిదేవత లక్ష్మీదేవి గనుక రేఫమున కగ్ని దేవుఁడు. అయితేనేమి. "శ్రియ మిచ్ఛే ద్ధుతాశనాత్" అని పురాణవచనము గలుగుటంజేసి అతఁడున్నూ లక్ష్మీప్రదుండే. అటు గనుక మూఁడువర్ణములకున్ను శుభదేవతలే అయిరి. మొదలి శవర్ణమునకు గ్రహము గురుఁడు. రేఫమునకున్నూ ఈ యను స్వరమునకున్నూ శుక్రుఁ డొక్కఁడే. అటు గనుక మూఁటికిన్ని శుభగ్రహములే అయిరి. "కమలా శ్రీ ర్హరిప్రియా" అని లక్ష్మీనామ మగుటంజేసి శుభవాచకమును ఆయెను. అటుగనుక గృతిముఖము నందుఁ బ్రయోగించిన శ్రీకారమువలన శుభము గలుగుట యాశ్చర్యము గాదు. నిశ్చయమే యనుట. 358

సీ. మొదలితాలుభవోష్మములకు నభోబీజరౌరవగతి మహాప్రాణములును
దిగుపరేఫమునకుఁ దిర్యగ్గమనదాహఫలవీతిహోత్రాధిపత్యములును
గనుఁగొన నా రెంటికిని మర్త్యదానవగణబృహస్పతిశుక్రఖచరములును
బ్రథమాక్షరమునకుఁ బలికిని వైశ్యబాహుజకులగోవ్యాఘ్రయోనిభములు

తే. నగుకతంబున శ్రీయను నక్షరమున, నిండి యుండు దోషంబు లన్నియు నెఱింగి
సంయుతం బనియును శుభశబ్ద మనియు, నదియ నిలిపె నన్నయ భారతాదియందు.

## కృతిముఖప్రశస్తంబులు

మూ. సూ:—శుభవర్ణాశ్శుభశబ్దా యే చ శుభగణా స్తథైవ కావ్యాదౌ
గ్రాహ్యాః. 19

1. కదసి (ప. వా.)

తే. అమరవాచకములు మంగళార్థవాచకములు నైనశబ్దములు కావ్యములమొదల
నిలిచి దుర్వర్ణదోషము ద్రోలఁగఁద్రోచి, కర్తకును భర్తకును భావుకంబుఁ జేయు.

క. శ్రీవాణీకీర్తిసతీ, జైవాతృకహర్ష మేఘసాగరధరణీ
భావుకనీరోగాయు, ర్గాత్రవాఖ్యానములు శుభకరము లాది నిడన్. 361

క. మోదంబున సత్కవి ప్రతీ,పాదింపఁగవలయు శుభముఁ బడయుటకై కా
వ్యాదిని వరునకు నాశీ,ర్వాద మయిన దేవతాభివాదన మైనన్. 362

క. గాయకపుకవులు కొందఱు, నాయకకల్యాణగుణగణము లొండె నభీ
ష్టాయతవస్తువు లొండెను, బాయక కీర్తింపుదురు ప్రబంధము మొదలన్. 363

వ. అమరవాచకంబులకు నేకావళియందు "ప్రాలేయాచలకన్యకా" యనియును, కల్పితకల్పవల్లియందు "హేరంబ మవలంబే" అనియును, రామాయణమునందు "రాముని శుభచరితమ్ములు" అనియును, మంగళార్థవాచకంబులకు శ్యామలాదండకంబునందు "జయ మాతంగతనయే" యనియును, త్రిస్థలీదండకమునందు "విజయనగరహేమకూటంబున న్నిల్చి" యనియును, ఆశీర్వాదంబునకుఁ గృష్ణవిజయంబునందు "పాయా దపాయా" త్తనియును, సాహసాంకంబునందు "అవ్యాత్స వో" యనియును, దేవతాభివాదంబునకు ఛప్పన్నంబునందు "ప్రణమ్య లోకకర్తార" మనియును, నాయకగుణంబులకు నైషధమునందు "సువర్ణదణ్డైకసితాతపత్రితజ్వలత్ప్రతాపావళికీర్తిమండల" యనియును అభీష్టవస్తువులకు వృత్తరత్నాకరమునందు "సుఖసంతానసిద్ధ్యర్థ" మనియును లక్ష్యంబులు గలిగియుండును. 364

తే. క్లీబలింగశబ్దంబులు కృతికి మొదలఁ, గూర్ప నాయకుధన మెల్లఁ గొల్లవోవు
నరవి స్త్రీలింగపుల్లింగశబ్దము లిడ, సంపదలు వైభవంబులు చాలఁ గలుగు. 365

క. అతిశుభదపదయుగాంత,ర్గతమై పతిపేరు కృతిని గనుపట్టిన నీ
క్షితి వజ్రపంజరాంత,ర్గతుమాడ్కి నభేద్యుఁ డగు నరాతుల కెల్లన్. 366

## తత్తత్స్థానప్రయోగనిషిద్ధాక్షరంబులు

మూ. సూ:—పురాస్త్రరసగిరిరుద్రే ష్వకచటహమాతృకా నింద్యాః.

క. ఆదిస్వరమును బ్రథమై, కాదశషష్ఠార్ణములు కకారాదులలో
నాదట [1]నంతోష్మము లిడ, రాదు పురశరర్తుగిరిహరస్థానములన్. 367

క. మూఁడవతావున మొదలిటి, మూఁడు సరళవర్ణములును మూఁడవ స్వరముల్
మూఁడవయూష్మాక్షరమును, గూడదు కదియింప నెట్టికూళకు నైనన్. 368

1. దంతోష్మము (పూ. ము.) ఇది పొరపాటు. అంతోష్మము=హకారము.

తే. వ్యంజనాహ్వయమున నొప్పు వ్రాలలోన, షోడశాక్షర మాఱవచోట నిలిపి
మచ్చరంబునఁ దనుఁ జంప వచ్చినట్టి, చెడుగునకు నైనఁ బద్యంబు నుడుగవలదు.

సీ. గడియలోపల మూఁడు[1]కంద్రిక లై తాఁడి ధరఁ గూలఁ దిట్టె మేధావిభట్టు
కినిసి యొక్కముహూర్తమున బ్రహ్మదండిముం డ్లెల్ల దుల్లఁగఁ దిట్టె మల్లఘనుఁడు
మూఁడు నాడికలకు ముట్టడి పైచినమారని భీమన మడియఁ దిట్టె
నరజాముసకుఁ జెఱ వంతయు నింకంగఁ దిట్టెను బడబాగ్నిభట్టసుకవి

తే. వాసరత్రయమునకుఁ జావంగఁ దిట్టె, శ్రీనగము దోఁచు తుక్కని శేషమంత్రి
తురగచోరకుఁ బడఁ దిట్టె, దిరుమలయ్య,పద్యగతదుష్టవర్ణప్రభావములను. 370

వీరలు చెప్పిన లక్ష్యంబు లెవ్వి యనిన మేధావిభట్టు ఆఱవచోట తకారము నిలిపి గడియకుఁ దాఁటిచెట్టు విఱుగఁ దిట్టిన చాటుధార:—

క. సాళువపెదతిమ్మమహీ, పాలవరుఁడు వీఁడె వచ్చెఁ బద్యము వ్రాయక్
గేలను లే దా కొకటియుఁ, దాళమ ముత్తునియ లగుచు ధరపైఁ బడుమా. 371

ప్రౌఢకవిమల్లన మూఁడవచోట అకారమును నిలిపి రెండు గడియలకు బ్రహ్మదండిచెట్లుముండ్లు రాలఁ దిట్టిన చాటుధార:—

క. గుడియన్ననృపతిఁ బొడఁగన, నడవంగాఁ గొండపల్లినగరిపడమటం
గుడియడుగుమడమ గాఁడిన, చెడుముండులు బ్రహ్మదండిచెట్టున దుల్లున్. 372

వేములవాఁడ భీమకవి పదునొకండవచోట హాకారంబు నిలిపి మూఁడు గడియలకు రామగిరిదుర్గమున [2]ముత్తిక దిగిన మారని జావఁ దిట్టిన చాటుధార:—

ఉ. చక్కఁ దనంబుదీవి యగు సాహిణిమారఁడు మారుకైవడిక్
బొక్కి పడం గలండు చలము న్బలముం గల యీ చళుక్యపుం
జొక్కనృపాలుఁ డుగ్రుఁ డయి చూడ్కుల మంటలు రాలఁ జూచినక్
మిక్కిలి రాజశేఖరునిమీఁదికి వచ్చిన రిత్త వోవునే. 373

బడబానలభట్టు ఏడవచోటను టకారంబు నిల్పి త్రిపురాంతకము [3]నుండి శ్రీశైలమునకుం బో[4]వునప్పుడు దెలుఁగురాయఁడు గట్టించిన చెఱువు నీళ్లన్నియు నాలుగు గడియలకు నింకిపోను దిట్టిన చాటుధార:-

---

1. గంద్రగ. (ప). 2. శ. ర. లో 'ముత్తిక' అను మాట లేదు. 3. నుంచి (సూ.) 4. బొయ్యెడు తెరువునం (సూ.)

క. బడబానలభట్టారకు, కుడిచేయుంగరము రవికి గొబ్బున నర్ఘ్యం
బిడువేళ నూడి నీలోఁ, బడియెఁ దటాకంబ [1]నీటఁ బాయుము వేగన్. 374

ఏలూరిశేషమంత్రి యైదవచోట కకారము నిలిపి శ్రీశైలముం దోఁచిన తుక్కరుసును మూఁడు దినములకుం జావం దిట్టిన చాటుధార:--

చ. మును పాకకేల రావణుఁడు మోదమున న్రజతాద్రి యెత్తినం
తనె వారుఁ దప్పడే తనపదంబునఁ ద్రొక్కి మదం బడంచెఁ గా
వనమయ[2]గోరితుక్కసచివా యలశ్రీగిరి గడ్డపాఱిలన్
గనలుచుఁ ద్రవ్వి సర్వమును గైకొన నీ కిపు డాతఁ [3]డోపునే. 375

వెల్లూరి తిరుమలయ్య ఆఱవచోటను తకారంబు నిలిపి తన గుఱ్ఱమును దొంగిలించిన శ్రీపతిరాజు పోతరాజును నేడు దినములకుం జావఁ దిట్టిన చాటుధార:—

చ. హయ మది సీత పోఁతసుధాధిపుఁ డారయ రావణుండు ని
శ్చయముగ నేను రాఘవుఁడ జాహ్నవి వారిధి మారుఁ డంజనా
ప్రియతనయుండు లచ్చన విభీషణుఁ డా గుడిమెట్ట లంక నా
జయముకు బోతరక్కసునిచావును నేడవనాఁడు సూడుఁడీ. 376

వ. మఱియును గొన్నియుదాహరణంబు [4]లెడవల్లి పర్వతన్న పంచమ స్థానంబునను హకారము గూర్చి చెప్పిన పద్యము:—

క. అంగజసంహారుం డగు, సంగరభీముండు ప్రళయసమయోగ్రుండై
యింగలపుఁగంటఁ జూచిన, బంగరుకామయ్య మేను భస్మం బయ్యెన్. 377

పింగళి రామరాజు పంచమస్థానంబున కకారంబును షష్ఠస్థానమున చకారంబును గూర్చి చెప్పిన పద్యము:—

ఉ. పింగళి యేకచక్రపురి పెంపుగ నందు వసించి యున్న యా
తం గెడకొండఁడే బకుఁడు తథ్యము మానవులార వానిబా
ధం గడముట్టఁజేసె మును ధర్మజుతమ్ముఁడు భీముఁ డిప్పు డీ
యెంగిలిముచ్చుఁ జంపుటకు నీశ్వరు వేడుఁడు భీముఁ డయ్యెడిన్. 378

తెనాలిరామకృష్ణయ్య పంచమస్థానంబున కకారంబును సప్తమంబున టకారంబును గూర్చి చెప్పిన పద్యము:—

1. నీరి (మూ). 2. గారి (మూ). 3. డోపఁడే (మూ). 4. ఎడపల్లి (మూ).

[1]క. బసవనకుఁ బుట్టినప్పుడె, పసరము గోవిందరాజు పసరం బైతే
గస పేటికిఁ దినఁ డంటేఁ, గసవుం దిను శత్రు లాజిఁ గవిసినవేళన్. 379

రంగరాజు-లింగయ తృతీయస్థానమునందు కకారముఁ గూర్చి గూఢముగాఁ దిట్టిన చాటుధారపద్యము:—

క. రవికోటిధామమయమై, నవకాంచనయుతము నగుచు నానాఁటి కొగిన్
భువిని శివాన్విత మగు నీ, భవనము జూపల్లిలింగ భవగుణసంగా. 380

[2]తే. ఆదిపర్వంబు మొదలిపద్యంబునందు, సప్తమస్థానమున శబ్దశాసనుండు
జమిలియక్కరమును విశేషము దలంచి, పాదుకొలిపెఁ జవర్ణంబు భయము దక్క.

## దోషప్రభావము

క. ఇప్పటినియమము లన్నియు, నొప్పఁగఁ గావ్యంబుమొదల నొకపద్యము దాఁ
జెప్పినను జాలు నవతలఁ, దప్పిన దోషంబు లేదు దర్పకజనకా. 382

క. గట్టిగ దోషము తెఱుఁగక, తిట్టిన నది దీవన యగు దీవించినచోఁ
దిట్టగు నది [3]తెలుసుక మఱి, తిట్టిన దీవించినను బతికి నిక్క మగున్. 383

క. గ్రుడ్డి యగునెద్దు జొన్నను, బడ్డపగిది లక్షణంబుపథ మెఱుఁగని యా
యెడ్డె కవిత్వముఁ జెప్పిన, నడ్డంబై బుధు లదల్ప [4]నది యే మగునో. 384

## గుణావగుణబాహుళ్యవిశేషంబులు

తే. ఇపుడు చెప్పినదోషం బెల్ల మాని, గుణము లన్నియుఁ గలుగంగఁ గూర్ప నగునె
ప్రస్తకైనను స్వల్పదోషంబు నధిక, గుణములగునెద్ది దానిఁ జేకొనఁగవలయు.

క. ఇల సద్గుణనికరములో,పల నొకదోషం బడంగుఁ బడియా అమృతాం
శులలోన నొకకళంకము, జలజారికి నెన్నఁబడని చందమున హరీ. 386

తే. విఫలము సకంటకంబును విషధరాశ్ర
యంబు వక్రంబు పంకభవంబు నైన
మొగలి పరిమళమున యోగ్య మగు తెఱఁగున
సద్గుణం బొక్కటియ దోషసమితిఁ జెఱుచు. 387

---

1. పూ. ము. లో 'పసరంబైనన్'...'దనఁగా' అని ఉండెను. గాని వ్రాత ప్రతులలో మాత్రము 'పసరంబైతే' 'అంటే' అను ప్రయోగములే కనఁబడును (గి). 2. ఆదిపర్వము మొదలి పద్యము-శ్రీ వాణీగిరిజాశ్చిరాయ...ఇందు సప్తమస్థానమున చకారము శవర్ణముతో సంయుక్తమై యున్నది. (రా). 3. దెలిసియు (సూ). 4. నపుడే మగునో (వా); నపు డేమియగున్ (ప).

క. తెలియఁగ నీ శుభలక్షణ,ములు [1]కురుకురుకవుల కావ్యముల లేవు సుమీ
తొలుత మహాకవివర్యులు, పలికినసత్కృతులఁ దక్కఁ బన్నగశయనా. 388

మాతృకార్చనావిధానము

చమత్కారచంద్రికాయామ్:—

శ్లో. అకారాదిక్షకారాంతవర్ణాః స్యు ర్మాతృకాహ్వయాః,

సాహిత్యరత్నాకరే:—

శ్లో. ప్రభూ నుద్దిశ్య పద్యం వా ప్రబంధం వా కథాంచన,
న వక్తవ్యం న వక్తవ్యం మాతృకాపూజనం వినా.

[2]లక్షణదీపికాయామ్:—

శ్లో. నాయకేన ప్రయుక్త స్సన్ దంతధావనపూర్వకమ్,
పుణ్యానిర్మలతోయేన మంగళస్నాన మాచరేత్.
శుచి ర్ధౌతాంబరధరో గంధమాల్యై రలంకృతః,
పూజాగృహం ప్రవిశే న్మానీగీతవాద్యాదినిస్వనైః.
శుభాసనే సుఖాసీనః ప్రాఙ్ముఖో న్యాసపూర్వకమ్,
విప్రాదిమాతృకా స్తత్తద్వర్ణద్రవ్యైః ప్రపూజయేత్.

ఆ. కవులు మొదల మాతృకాపూజ సలుపక, కావ్యమొండెఁ జాటుకావ్యమొండెఁ
జెప్పిరేని తమకుఁ దప్పుగుఁ బతికిని, హాని వచ్చుఁ గృతియు నడఁగిపోవు. 389

సీ. ప్లక్షకాష్ఠంబునఁ బలుదోమి మంగళస్నాతుఁడై శుభ్రవస్త్రములు కట్టి
మలయజకర్దమం బలఁది భూషణములు మై దాల్చి కుసుమదామములు చుట్టి
కవిలాక్షణికలేఖకగ్రంథవాచకశాబ్దికతార్కికసహితముగను
గానతతానద్ధఘనసుషిరస్వనంబులు సర్వదిక్కుల [3]ఘోరుకలుగ

తే. వచ్చి దక్షిణపాదపూర్వకముగాఁగ, మాని యై మాతృకార్చనమందిరంబుఁ
జొచ్చి పూర్వాభిముఖముగా సుకవివరుఁడు, చిత్రకంబళమున సుఖాసీనుఁడగుచు.

శ్లో. విఘ్నరాజ నమ స్తుభ్యం లమ్బోదర గజానన,
నిర్విఘ్నం కురు మే దేవ సర్వకార్యేషు సర్వదా.

క. ఈ మంత్రంబున మున్నుగ, సామజముఖు నేకదంతుఁ జామరకర్ణున్
ధూమధ్వజుఁ బ్రమథగణ, స్వామిని బూజించి సుకవి సమధికభక్తిన్. 391

సీ. జ్యోతిర్విదుక్తముహూర్తకాలంబునఁ బ్రస్థపంచకమాత్ర పాండుశాలి
తండులంబులను హస్తద్వయవిస్తారసమచతురశ్రికస్థండిలంబు

---

1. కురుకురు అను శబ్దము. శ-ర. లో లేదు (గ). చిన్నచిన్న-అని యర్థమై యుండునేమో.—2. ఇది గౌరనకృతము (రా). 3. ఘోరు కలఁగ (రా.)

గావించి నాల్గుచౌకపుటిండ్లు రచియించి వామదేవునిమూలగీమునందు
విప్రమాతృకలను వీతిహోత్రునితావుమందిరంబున రాజమాతృకలను
ఆ. దనుజుచాయభవనమున వైశ్యమాతృకలను సమీరభాగమునను గలుగు
సదనమునను శూద్రజాతిమాతృకలను, వరుస తప్పకుండ వ్రాయవలయు. 392

## మాతృకానిర్ణయము

శారదాదర్పణే:—

శ్లో. స్వరాః కచటవర్గా శ్చ ధరణీసురమాతృకాః,
తపవర్గా సమాంతస్థా బాహుసంభవమాతృకాః.
యలౌ శాదిహకారాంతవర్ణా శ్చోరవ్యమాతృకాః,
దంత్యౌ చజౌ గురు రలౌ జఘన్యభవమాతృకాః.

అ ఆ, ఇ ఈ, ఉ ఊ, ఋ ౠ, ఌ ౡ, ఏ ఐ, ఓ ఔ, అం అః, ఈ స్వరములు పదహారున్నూ క ఖ గ ఘ ఙ, చ ఛ జ ఝ ఞ, ట ఠ డ ఢ ణ, ఈ కచటవర్గాక్షరములు పదిహేనున్నూ కూడాను ముప్పదియొకటిన్నీ విప్రమాతృకలు; ఇవి యీశాన్యమూల యింట వ్రాసేది. త థ ద ధ న, ప ఫ బ భ మ, యీ తపవర్గాక్షరములు పదిన్నీ అంతస్థములలోన సరియక్షరములైన రేఫవకారములు రెండున్నూ కూడాను పండ్రెండున్ను రాజమాతృకలు; ఇవి యాగ్నేయదిక్కున నుంచేది. యవర్ణలవర్ణములు రెండు శ ష స హ లు నాల్గును కూడా నాఱున్ను వైశ్య మాతృకలు; ఇవి నిరృతిభాగమున నిలిపేది. దంత్య చజలు రెండున్ను ఱకారళకారములు రెండున్ను కూడా నాలుగున్ను శూద్రమాతృకలు; ఇవి వాయవ్యకోణమున లిఖించునది.

సీ. అస్వర మపుదల యా ఫాల మిద్వయి శ్రవణయుగ్మం ఋకారములు రెండు
గన్నులు ఋత్వయుగంబు చెక్కులు ఌవర్ణ ద్వంద్వ ముభయదంతచ్ఛదములు
వక్త్రముల్ భుజములు వక్త్రతమాక్షరంబులు కక్షములు సున్న లలితగళము
పటువిసర్గము లురోభవసూచకంబులు కచవర్గములు పాణికరరుహములు
తే. టాదు లైదును గూడఁ బృష్ఠము చతుర్థ,వర్గముదరంబు పంచమవర్గజములు
జఘన మంతస్థలిపులు సూక్ష్మములు నంఘ్రి, లే పధూమణి కట్టి వాగ్దేవిఁ గొలుతు.
క. అని వారిజాతసంభవు, వనితకుఁ బ్రణమిల్లి సుకవివరుఁ డీ పద్యం
బునఁ జెప్పినట్లు న్యాసము, తనకుడికడ మొదలుగాఁ బిదపఁ జేయ నగున్. 394

## న్యాసప్రకారము

అం శిరసి, ఆం లలాటే, ఇం దక్షిణకర్ణే, ఈం వామకర్ణే, ఉం దక్షిణనేత్రే, ఊం వామనేత్రే, ఋం దక్షిణకపోలే, ౠం వామకపోలే, ఌం ఊర్ధ్వోష్ఠే, ౡం

అధరోష్ఠే, ఏం దక్షిణభుజే, ఓం వామభుజే, ఐం దక్షిణకక్షే, ఔం వామకక్షే, అం గళే, అః దక్షిణోత్తరస్తనాగ్రయోః, కం ఖం గం ఘం ఙం దక్షిణహస్తాంగుళిషు, చం ఛం జం ఝం ఞం వామహస్తాంగుళిషు, టం ఠం డం ఢం పృష్ఠే, తం థం దం ధం నం ఉదరే, పం ఫం బం భం మం జఘనే, యం రం లం వం దక్షిణపాదే, శం షం సం హం వామపాదే విన్యసేత్.

## విప్రమాతృకాపూజామంత్రః

విధిప్రదీపికాయామ్:—

శ్లో. శ్వేతమాల్యాంబరధరాం శ్వేతరత్నవిభూషితామ్,
శ్వేతాబ్జవాసినీం విప్రమాతృకాం పూజయా మ్యహమ్.

అనేన వాగీశ్వరీధ్యాన ముక్తమ్, తల్లక్షణం మంత్రరహస్యే ద్రష్టవ్యమ్.

వ. అకారము మొదలు ముప్పదియొక్క మాతృకలనున్నూ ఈ మంత్రముచేత వేఱేవేఱే
పూజించేది. 395

సీ. వెలిపట్టుపుట్టంబు మలయజగంధంబు మౌక్తికామలవజ్రమయములైన
భూషణంబులు తెల్లపువ్వులు కర్పూరధూళిధూపంబు మధూకతైల
నీరాజనంబు ఖర్జూరపాత్రంబు సమన్వితశర్కరామసృణధేను
దుగ్ధాన్నమును భక్తితో సమర్పణ చేసి శ్వేతాబ్జకర్ణికా విష్టరస్థ
తే. దారకాకుందమందారధవళదేహఁ, బుస్తకసువర్ణవల్లకీహస్త విప్ర
మాతృకను గవి శాస్త్రోక్తమార్గమునను, గొలువఁ జతురవచోలబ్ధి గలుగు టరుదె.

## రాజమాతృకార్చనమంత్రః

శ్లో. రక్తమాల్యాంబరధరాం రక్తరత్నవిభూషితామ్,
రక్తాబ్జవాసినీం రాజమాతృకాం పూజయా మ్యహమ్.

అనేన వశ్యముఖీధ్యాన ముక్తమ్. తల్లక్షణం ప్రపంచసారే ద్రష్టవ్యమ్.

వ. ఈమంత్రముచేతను బండ్రెండు మాతృకలను పూజచేసేది. 397

కవిగజాంకుశే:—

సీ. జిలుఁగుచందురుకావిచీరయుఁ గుంకుమగంధంబు పద్మరాగప్రవాళ
ఖచితంబు లగు పరిష్కారంబులును గెంపువన్నియ గల పరువంపువిరులు
ప్రస్తుతాలక్తధూపంబులు తిలబీజతైలదీపికయును దామ్ర చషక
పూరితగోఘృతాహారంబు భక్తితో నర్పించి రక్తతోయజనివిష్టఁ

తే. గోకనదనిభలోహితఁ గోమలాంగిఁ, బ్రసవబాణేక్షుకోదండపాణి రాజ
మాతృకను గని శాస్త్రోక్తమార్గమునను, గొలువఁ జతురవచోలబ్ధి గలుగు టరుదె.

వైశ్యజాతిమాతృకారాధనమంత్రః

శ్లో. పీతమాల్యాంబరధరాం పీతరత్నవిభూషితామ్,
పీతాబ్జవాసినీం వైశ్యమాతృకాం పూజయా మ్యహమ్.
అనేన సిద్ధలక్ష్మీధ్యాన ముక్తమ్. తల్లక్షణం మంత్రార్ణవే ద్రష్టవ్యమ్.

వ. ప్రతిమాతృకారాధనమున్ను నీమంత్రము చదువుచున్నే చేసేది. 399

సీ. ఆతతబహు[1]రత్నపీతకౌశేయంబు నవహరిద్రాలేపనంబు పుష్య
రాగగారుత్మత రత్నకీలితమండనంబులు పచ్చక్రొన్ననల సరులు
సాంద్రసౌరభహరిచందనధూపంబు బస్తాజ్యసహితదీపంబు రీతి
ఘటపరిపూరితక్షౌద్రోపహారంబు గడు భక్తి నర్పించి కనకనలిన

తే. కర్ణికాపీఠికాసీన గౌరగాత్రి, వనజకుట్మలాన్వితకరద్వంద్వ వైశ్య
మాతృకను గని శాస్త్రోక్తమార్గమునను, గొలువఁ జతురవచోలబ్ధి గలుగు టరుదె.

శూద్రమాతృకారాధనమంత్రః

శ్లో. నీలమాల్యాంబరధరాం నీలరత్నవిభూషితామ్,
నీలాబ్జవాసినీం శూద్రమాతృకాం పూజయా మ్యహమ్.
అనేన త్వరితాధ్యాన ముక్తమ్. తల్లక్షణం మంత్రదర్పణే ద్రష్టవ్యమ్.

వ. శూద్రమాతృకల నన్నిటిని బూజచేసేటప్పుడు ఈ మంత్రమే చెప్పేది. 401

సీ. నీలవర్ణదుకూలచేలంబును లవంగమృగమదగంధంబు నగవిరోధి
రత్నవిభూషణరాజియుఁ గృష్ణపుష్పములు కాలాగురుసాలమూల
రచితధూపంబు నేరండబీజస్నేహనీరాజనంబును జారుకాంస్య
మయచషకాన్వితమద్యనైవేద్యంబు నొసఁగి సద్భక్తి నెం పొంది మదిని

తే. శ్యామపద్మనివిష్ట మేచకశరీర, శరధనుఃకాండధృతపంచశాఖ శూద్ర
మాతృకను గని శాస్త్రోక్తమార్గమునను, గొలువఁ జతురవచోలబ్ధి గలుగు టరుదె.

వ. ఇది ప్రబంధోపక్రమం బింక నాశుధారాకవిత్వమున కెట్లనిన. 403

తే. సభలను సమస్య లొసఁగిన సమయమునను, మాతృకాపూజ కవుల కేరీతి నబ్బు
నపుడు వాగ్దేవతాధ్యాన మాత్రఁ జేసి, యాశువుగఁ జెప్ప నొప్పుఁ బద్యంబు లెల్ల.

1. మాల్య (మూ).

## వాగ్దేవతాధ్యాన ముక్తమ్

సీ. [1]త్రయివేణి మీమాంస తల వైద్యశాస్త్రంబు నుదు రాగమంబు కన్బొమల నడుము
కడపలిప్రాఁబల్కు కణతలు శ్రౌతంబు తళుకుఁజెక్కులు నిరుక్తంబు శ్రుతులు
న్యాయంబు [2]చుబుకంబు జ్యోతిషం బక్షులు శిక్ష గంధవహంబు స్మృతి రదములు
కావ్యంబు జిహ్వ వ్యాకరణంబు పెదవులు గీతంబు గళ మలంకృతి కుచంబు
తే. లల పురాణంబు నడు మితిహాస మక్కు, కల్పము కరద్వయము రతికళ జఘనము
ఛంద మూరులు నాట్యలక్షణము పదము, లే వధూమణి కట్టివాగ్దేవిఁ గొలుతు.
ఆ. అనుచు శారదాంబ నధరనిర్జితబింబ, భ్రమరవేణిఁ బద్మభవునిరాణి
సుకవిరాజకీరసురమహీరుహలతఁ, గొలిచి యాశుకవితఁ గూర్పవలయు. 406

## ప్రబంధోపక్రమశుభకాలంబులు

క. వెస నయనమాసపక్షతి, వసవారభయోగకరణవర్జ్యవిలగ్నా
భ్రసరేక్షణము లరసి సద, వసరమునను మొదలు సేయవలయుం గృతికిన్. 407
తే. సింహమున గురుఁడున్న రాజీవబంధుఁ
డార్ద్రమొదలుగఁ బది తారలందు నడువ
జీవకవు లస్తమయమును జెంది యున్నఁ
గావ్యసముపక్రమము సేయఁగాదు పలికి. 408
సీ. అబ్దంబు మొదలిదినాష్టకం బయనర్తుమాసాదులను బంచవాసరములు
కవిబృహస్పతులు గ్రుంకకముందుఁ బొడిచినవెనుకను [3]మును ప్రొద్దుమనుయుగాదు
లగుదినములు సంక్రమాది రెండుపగళ్లు గ్రహణంబుతోలునాఁడు కామదహన
మునకు మీఁదను మూఁడు దినములు తిథ్యాదిఘటికాత్రయంబు ఋక్షంబు మొదల
తే. నాడికాయుగ్మమును విలగ్నమున కాది, వెలసిన నవాంశ మొకటియు విడిచిపెట్టి
చిక్కినప్పుడు శుభములు చేయవలయు, ననుచు చ్యవనుఁడు సంహితయందుఁ జెప్పె.
సీ. షష్ఠ్యంతమున నొక్కసంవత్సరము హాయనాంతంబునను బక్ష మయనమునకుఁ
గడపల దివసాష్టకము ఋతుమాసావసానంబునను దివసంబు లైదు
రవిశశిగ్రహణాదివివిధమహోత్పాతముల కెల్లఁ దరువాత మూఁడునాళ్లు
సంక్రమాంతమున వాసరము తిథ్యంతంబునందు నాడీత్రితయంబు రిక్క
తే. కొనను బదిగడియలు లగ్నమునకుఁ దుదిని, గదియుసార్ధనవాంశంబు వదల కావ్య
మునకుఁ దొలుతటి పద్యంబు మొగి రచింప, వలయు సత్కవి తక్కినవానియందు.
క. ఉదగయనంబునఁ జెప్పిన, సదమలకావ్యంబు పతికి సంపద లిచ్చుం
బదపడి యామ్యాయనమున, మొదలుకొనినఁ బ్రాణమునకు మోసముఁ దెచ్చున్.

---

1. తర్కమీమాంసలు (ప). 2. చిబుకంబు (ఓ. వా.) 3. ము ప్రొద్దు (సూ).

తే. శ్రావణ[1]జ్యేష్ఠకార్తికచైత్రమాఘ, మార్గశీర్షకఫాల్గునమాధవముల
సకలశుభకర్మములు సల్పఁ జను నటంచుఁ, జెప్పిరి పరాశరాత్రివసిష్ఠమునులు. 412

తే. నింద్యములు భాద్రపదమను నెలయు శుచియు, సరవి ఝుషచైత్రకర్కటశ్రావణములు
నధికమాసంబుఁ బుష్యంబు నాశ్వయుజముఁ, గార్తికాది నేకాదశఘస్రములును.

క. కావ్యమునకు నారంభము, [2]కావ్యుఁడు సితపక్షమునను గావించిన నా
థివ్యాధు లడఁగు విభునకు, ద్రవ్యక్షయ మగుసితేతరంబున నైనన్. 414

క. దశమీద్వాదశ్యేకా, దశులను బంచమిని విదియతదియల హిమధా
మశశాంకసుతబృహస్పతి, త్యుశనోవారములఁ గావ్య మొనరింపఁ దగున్. 415

తే. ఉభయపక్షములందుఁ ద్రయోదశియును, సప్తమియు దిననాథవాసరము నంత
రాయ మొనరించుఁ గృతిసమారంభమునకు, నితరతిథివారములు గూడ నెంచిచూడ.

క. [3]లిపులను బూర్వాహ్ణంబున, నుపక్రమించిన శుభంబు లొసఁగును గావ్యం
బపరాహ్ణంబున సంధ్యల, క్షపలను దొరఁకొనిన సాధ్వసం బొనరించున్. 417

సీ. నందయు భద్రదినంబును జయయు రిక్తయును బూర్ణయు ననఁ గ్రమత నైదు
భంగుల దివసముల్ పదియేను నొప్పారు భూమిబీజాక్షరంబులకు నంద
వనబీజలిపుల కెల్లను భద్ర శిఖిబీజరాజికి జయ వాయుబీజములకు
రిక్త నభోబీజరేఖకుం బూర్ణయు నాదిగాఁ బంచసంఖ్యాస్వరములు

తే. రెండు దిన మొక్కటొక్కటి శిశుకుమార, రాజ్యవృద్ధమృతాఖ్యలఁ బ్రమదవిత్త
విజయభయలయదంబులై పీని నెఱుఁగ, వలయుఁ గృతిపతినామాదివర్ణమునను.

క. బాలాదిస్వరములకును, గాలము నాటేసినాడికలు చేసి కృతుల్
వాలాయము నందాదుల, మే లగువేళల నుపక్రమింపఁదగుఁ గృతుల్. 419

సీ. వరుస భూజలవహ్నివాయునభస్తత్త్వములు దంతిగతశాస్త్రభూతశైల
పరిమితఘటికలఁ బగలును రేయును దినమున కినుమాఱు దిరుగుచుండు
సూరేందుభౌమజ్ఞవారంబులను ధరాంభోఽగ్నివాతము లాది యగుఁగ్రమమున
గురుశుక్రమందవాసరముల నాకాశతత్త్వంబు మొదలుగాఁ దనరు నైదు

తే. కావ్యములఁ దత్త్వమున నుపక్రమముసేయ, ధన ముదకతత్త్వమున సుఖ మనలతత్త్వ
మున భయంబు మరుత్తత్త్వమున గదార్తి, గగనతత్త్వంబున మృతంబు గలుగుఁబతికి.

1. జ్యేష్ఠ (సూ). 2. కావ్యుఁడు=కవి (రా). 3. 'లిఫి' అని పూర్వముద్రణ ప్రతులందు సర్వత్ర కూర్పఁబడినది. 'లిపి' అను రూపమే సాధువు. అంధులకుఁ బ్రాసస్థాననిబద్ధమైన యీ ప్రయోగము ప్రమాణము. (రా).

సీ. నాడికాత్రయము వినాడికావింశతిమాత్రకాలముల గ్రమంబుతోడ
సత్త్వరజస్తమస్సంజ్ఞల వేళలు త్రివిధంబులై పద్మరిపుసురేజ్య
దినముల సత్త్వాఖ్యయును భౌమభృగువారముల రజోవేళయు జలజమిత్ర
బుధమందవాసరంబుల దమోవేళయు నాదిగా సూర్యోదయముననుండి

తే. పదియు నెనిమిదిమాఱులు ప్రతిదినంబు, దిరుగు గావున నివి యెల్ల దెలిసి కవులు
భర్తరాశికి మైత్రి చొప్పడనివేళ, జెప్పుదురు కబ్బములు వాని జెలుచుకొఱకు.

తే. సత్త్వపరిపంథులు కుళీరచాపమీన, కన్యలు రజోభియాతులు [1]కౌర్పివృషభ
మేషతులలు తమోరులు మిథునసింహ, ఘటమృగంబులు చుట్టలు కడమలెల్ల. 422

తే. వైష్ణవత్రయమునను బూర్వత్రయమున, మిత్రభూషాశ్వినుల భాస్కరత్రయమున
ధాతృషట్కనిశాచరతారకలను, గావ్యసముపక్రమము జేయ గలుగు శుభము.

తే. వజ్రశూలవ్యతీపాతవైధృతులను, గండపరిఘాతిగండవిష్కంభములను
బదియు మూడవదానను బ్రతుకునాస, సేయువారు శుభంబులు సేయబోరు. 424

క. బవ మొదలగు నాఱింటను, గవి కబ్బ ముపక్రమింప ఘనతరవిభవం
బవు భద్రాదుల నేనిట, దివిరి మొదలుసేయ దొడ్డ తెవులు జనించున్. 425

తే. వ్యగ్రలత్తలు క్రాంతయోగాపయోగ, దుర్ముహూర్తములును ద్యాజ్య దోషములును
దుష్టచంద్రోడుబలములు దొరలునపుడు, కృతికి దొరకొనునట్టి దుర్మతియు గలడె.

తే. తనకు భర్తకు నష్టమద్వాదశారి, జన్మములు గాని శుభఖేటసదనములను
మొదలు సేయగ దగు గబ్బమునకు గ్రహము,లష్టమంబున లేకుండ నరసి సుకవి.

తే. పాపు లాఱింట మూటను బదునొకొంట, సౌమ్యులు ధరాగ్నిగతిదిశాజలజగర్భ
మునిగృహంబుల నుండంగ మొదలుకొనిన, గబ్బములు గడతేఱు విఘ్నములు లేక.

క. బుధు డినుఁ గూడనివేళను, బుధదినమున బుధవిలగ్నమున బుధదృష్టిన్
బుధహోరను గావ్యములకు, బుధవర్యు లుపక్రమింప బూనుదు రెపుడున్. 429

సారస్వతౌషధంబులు

తే. బ్రాహ్మి బోడతరంబు పిప్పలియు వసయు, శుంఠియు సమంబులుగ దూచి చూర్ణ జేసి
ప్రతిదినము రేపకడ సగపాలు తేనె, గలిపి రూకెత్తు దినిన సూక్తులు ఘటించు.

వ. బ్రాహ్మి యన మండూకబ్రహ్మికి పేరు.

---

1. లింగాభట్టీయమందుగాని శబ్దకల్పద్రుమమందుకాని 'కౌర్పి' లేదు. శబ్దకల్పద్రుమమందు 'కౌర్ప్యః' ఉన్నది. ఈమాట గ్రీకుభాష (Scorpion) నుండి వచ్చినది. (౧) కౌర్ప్యము—వృశ్చికలగ్నము. సూ. ని. (రా).

సీ. కరకకాయలమీఁద గలుగుబబ్బురయును బిప్పలిమూలంబు తిప్పతీఁగ
బ్రాహ్మియు శుంఠియు బావంచివిత్తనమ్ములు నపామార్గమ్ము మొదలివేళ్లు
వాయువిళంగంబు లాయష్టిమధుకంబు సన్నపిప్పలియు నచ్చపుసముద్ర
పాడవిత్తనంబులు బోడతరంబును వలమూటితుంగముస్తలును వసయు
తే. సమములుగఁ దూఁచి పొడి చేసి సంతతంబు, బ్రొద్దునను లేచి నేతితో ముద్దఁజేసి
కర్షమాత్రంబు భక్షింపఁ గలిగెనేని, గడియ కొక పద్యశతకంబు నుడువుటరుదె.
సీ. చెంగల్వకోష్టును జిఱుతపిప్పలియును మంచియోమపుఁబొట్టు మ్రానిపసపు
మైపూఁతపసపును మధుకంబు సైంధవలవణంబు చిత్రమూలంబుబరడు
జీలకఱ్ఱయు శుద్ధి చేసిన శుంఠియు సమభాగములుగాఁగ సంతరించి
చూర్ణంబు గావించి శుభ్రపటంబుపై రాచి యాక్రిందను రాలినట్టి
తే. పొడుము నూతనఘటములో నిడి ప్రభాత
సమయమునఁ బ్రత్యహంబు నాజ్యమున మెదపి
వేసరక చిన్నమెత్తు సేవించు నరుని
నాలుకను గాపురం బుండు నలువచెలువ. 432

కందద్వయరుగ్మవతీకమలవిలసితగర్భక్రౌంచపదవృత్తము

ద్వారవతీనాథా సదుదారా, తరుణధవళకరధరనుతనామా
మారమణీధామా సుకుమారా, మరుదధిపతిరిపుమదగిరిశంబా
సారసనేత్రా సత్యవిచారా, శరరుహభవముఖసకలసురేశా
శూరకులా తేజోజితసూరా, సురవరమణినిభసురుచిరదేహా. 433

గర్భప్రథమకందము

ద్వారవతీనాథా సదు,దారా తరుణధవళకరధరనుతనామా
మారమణీధామా సుకు,మారా మరుదధిపతిరిపుమదగిరిశంబా. 434

ద్వితీయకందము

సారసనేత్రా సత్యవి,చారా శరరుహభవముఖసకలసురేశా
శూరకులా తేజోజిత, సూరా సురవరమణినిభసురుచిరదేహా. 435

గర్భరుగ్మవతీవృత్తము

ద్వారవతీనాథా సదుదారా, మారమణీధామా సుకుమారా
సారసనేత్రా సత్యవిచారా, శూరకులా తేజోజితసూరా. 436

## గర్భకమలవిలసితవృత్తము

తరుణధవళకరధరనుతనామా, మరుదధిపతిరిపుమదగిరిశంబా
శరరుహభవముఖసకలసురేశా, సురవరమణినిభసురుచిరదేహా. 437

గద్యము. ఇది శ్రీమదాపస్తంబసూత్ర భారద్వాజగోత్ర కామెపల్లిపురమందిరనంద నందనచరణారవిందవందనాభిలాషమనీషాప్రభవ వెంగనార్యతనూభవ విద్యావిశేష సురాచార్య కాకునూర్యప్పకవివిరచితంబైన యంధ్రశబ్దచింతామణి యను వ్యాకరణశాస్త్రంబునందు మూలసూత్రంబులును వర్ణసంజ్ఞలును వర్ణోత్పత్తిస్థానంబులును శుద్ధాంధ్రలిపివిలేఖనక్రమంబులును బంచాశద్వర్ణనిర్ణయంబును బ్రాకృతోనాక్షర పరిగణనయు నంధ్రభాషావర్ణసంఖ్యయుఁ దత్తద్వర్ణభేదంబులును గావ్యాదిగ్రాహ్య వర్ణంబులును నాయకాక్షరకూటంబులును గృత్యాదివర్ణద్వయయోగఫలంబులును సంయుతాక్షరవిశేషంబును శ్రీకారప్రభావంబును గృతిముఖప్రశస్తంబులును దత్తత్ స్థానప్రయోగనిషిద్ధాక్షరంబులును దోషప్రభావంబును గుణావగుణబాహుళ్యబలంబును మాతృకార్చనవిధానంబును బ్రబంధోపక్రమ శుభకాలంబులును సారస్వతౌషధంబులును గల వర్ణపరిచ్ఛేదం బను ద్వితీయాశ్వాసము.

# వళిప్రాసపరిచ్ఛేదము

## తృతీయాశ్వాసము



శైలభ్రమరాంబా
ధీశ్వరైశానీవిదిజస్మితలవిలస
త్కాశీసమతంగేడనగ
[1]రీశమనాశానివేశ రిపుజననాశా. 1

క. అవధారు శబ్దశాసనుఁ, డవనిఁ గలియుఁగమున కాఁది నా రాజమహేం
ద్రవరంబునఁ జెప్పిన యాం, ధ్రవచోవ్యాకరణసూత్రతతిఁ దెనిఁగింతున్. 2

క. ఇమ్ముగ వర్ణపరిచ్ఛే, దమ్మునఁ జెప్పంగఁబడియెఁ దగ నేకశ్లో
కమ్మున ముఖ్యవళిప్రా, సమ్ములు సంక్షేపములుగ సామజవరదా. 3

మూ. సూ:—ఆద్యో వళి ర్ద్వితీయో వర్ణః ప్రాసోఽత్ర పాదపాదేషు,
స్వస్వచరణేషు పూర్వః ప్రాస స్సర్వేషు చైక ఏవ స్యాత్. 21

వ. ఈశ్లోకం బొక్కటి యొక సూత్రం బయ్యె నది యెల్ల నిందు వివరించెదను. 4

క. చరణచరణమున కాద్యా, క్షరములు వళు లయ్యె నవియె క్రమ్మఱఁ దత్త
చ్చరణములలోనఁ జెప్పిన, యిరవులఁ బొందింప వలయు నెల్లకృతులలోన్. 5

తే. విరతి, విశ్రాంతి, విశ్రామ, విశ్రమములు, శ్రాంతి, విరమణ, విరమ, విరామ, యతులు
ననఁగ నివి తొమ్మిదియును వళి కాఖ్య లయ్యె, భవ్యసత్తుఫలాయామ్యభాగగేహ. 6

క .భీమన పది చెప్పె ననం, తామాత్యుడు చేసె వెనుక యతు లిరువది నా
ల్గామీఁదఁ గొందఱు కవి, గ్రామణు లిరువదియు నేడు గావించి రొగిన్. 7

ఆ. పూర్వకవుల లక్ష్యములు గూర్చి సత్కవి, జనము లవు నటంచు సమ్మతింపఁ
విశ్రమంబు లేను విరచింతు నాలుగు, పదులమీఁద నొకటి విదితముగను. 8

### యతిభేదములు

క. స్వరయతులు వ్యంజనాక్షర, విరతు లుభయవళులు ప్రాసవిశ్రాంతులు నాఁ
బరికింప నాల్గుదెఱఁగుల, విరమణములు వఱలుచుండు విహగతురంగా. 9

---

1. "రీశమదాశా" (పాఠాంతరము).

అందు స్వరవళు లెట్టి వనిన:—

స్వరవళులు

తే. రసను స్వరమైత్రివళులు స్వరప్రధాన
వళులు లుప్తవిసర్గకస్వరవళులును
ఋవళి ఋత్వసంబంధంబు ఋత్వసామ్య
వృద్ధు లన స్వరవళు లేడువిధము లయ్యె. 10

1. స్వరమైత్రివళులు

తే. అద్వయమునకు వక్రతమద్వయంబు, నిద్వయమునకు ఋయుగంబు నెద్వయంబు
నుద్వయమునకు నంత్యవక్రద్వయంబుఁ, జెల్లు స్వరమైత్రి వళు లన శేషశయన.

అకారయతులు

ఆ. *అబ్జపత్రనేత్ర ఆర్తావనచరిత్ర, ఆతతాయిజైత్ర ఐంద్రమిత్ర
ఐందవప్రగోత్ర ఔర్వశేయస్తోత్ర, యనుచుఁ జెప్ప నొప్పు యతులు కృష్ణ. 12

ఇత్వవళులు

ఆ. ఇందువంశసోమ ఈశ్వరీనుతనామ, ఈడితాంగధామ ఋషభభీమ
ఋక్షజాభిరామ ఎటు లైన మాభామ, ఎడఁ గటాక్ష ముంచి యేలు మనఁగ. 13

ఉద్విరామము

ఆ. ఉరగరాజశాయి ఊర్ధ్వవిష్టపదాయి, ఊర్జితోరుకీర్తి ఒడలి కార్తి
ఒదవ కుండఁ బ్రోచి ఓలి దాసునిఁ గాచి, చేరి కనకకశిపుఁ జీరి తనఁగ. 14

2. స్వరప్రధానవళులు

క. తెలిసి పదాంతగతాక్షర, ములతోఁ బైశబ్దములకు మొదలఁ గలుగున
చ్చులు గూర్చినసంధుల క,వ్వల స్వరము తె నిలుచు నుభయవళులను దక్కన్. 15

తే. అతులగుణధామ భానువంశాబ్ధిసోమ, ఇనతనూభవమిత్ర లంకేశజైత్ర
ఉరుగుణకలాప శకలీకృతోగ్రచాప, నాఁగ నిట్లు స్వరప్రధానవళు లొప్పు. 16

3. లుప్తవిసర్గస్వరవళులు

తే. దైవభాష నదంతసాంతములమీఁద, నత్తు మొదలను గలశబ్ద మతుకువేళ
నమరు నోత్వంబునకుఁ జెల్లు న (అ) యహలిపులు, జగతి లుప్తవిసర్గక స్వరవళు లన.

తే. అంబుదశ్యామ తవ కింకరోఽహ మనఁగ, యామినీచరగర్వతమోఽర్క యనఁగ
హరిసుతుండును నీవు నన్యోన్యమిత్రు, లయి ప్రవర్తింతు రనఁగ లక్ష్యంబు లయ్యె.

---

* 12, 13, 14 పద్యములందు స్వర యతిమైత్రి స్పష్టముగాఁ దెలియుటకై విసంధిగాఁ జూపఁబడినది. (రా)

మరున్నందనశతకమునందు:—

శా. కోపాటోపము దప్పి గంతులు నిజాకుంఠీభవచ్ఛౌర్యరే
ఖాపాండిత్య మయారె నీకును నమస్కారంబు లంకాపురీ
పాపగ్రంథికులాంగనాకుచతటీ[1]పైతాపటగ్రాహబా
హాపాటచ్చర రామదాస తవ దాసోఽహ మ్మరున్నందనా. 19

సుభద్రాపరిణయమునందు:—

శా. తా సైరింప కపర్ణ యుండఁగ భవద్గర్భంబునం దాల్చి తే
జోఽసహ్యాక్ష శరజన్ముఁ గాంచి యల నీహారక్షమాభృత్కుమా
రీసాపత్న్యము గన్న మోహపుఁబురంధ్రీ[2]రత్నము న్నీవ కా
దే సర్వజ్ఞున కేల నిన్నుఁ దలపై నెక్కించుకో జాహ్నవీ. (1-114) 20

ఉద్యోగపర్వమునందు:—

ఉ. సైన్యము దక్కి దూత యుచితంబుగఁ బాండునృపాలుపాలు రా
జన్యవరుండు ధర్మజుఁడు సమ్మతి వేఁడెడు నన్న లోక సా
మాన్యవిధిం దగంగ గరిమంబున నిచ్చినఁ బుచ్చికొంద మ
న్యోన్యవిరుద్ధభాషణములాడినఁ దత్ఫల మాతఁ డందెడిన్. (1-32) 21

4. ఋవళి

క. ఇత్త్వైత్త్వంబులఁ[3]దొలఁగక, ఋత్వంబును ఋవళి యనఁగ రేఫముతో మి
త్రత్వంబు నెఱపు నెట్టి మ, హాత్త్వమొ యట్లనగుఁ గాదులం దున్నపుడున్. 22

క. రతివల్లభజనక వినిర్జితకనకవిలోచనాఖ్య [4]ఋగ్యజుషాది
శ్రుతిచయగోచర వాహీకృతఖేచరకులలలామ రిపుజనభీమా. 23

సభాపర్వమునందు:—

సీ. పా. ఋత్విజుం డని విచారించి పూజించితే, ద్వైపాయనుం డుండ ధర్మయుక్తి.
(2-11) 24

విజయవిలాసమునందు:—

ఉ. ఆణిమెఱుంగుముత్తెపుటొయారపుముగ్గులు రత్నదీపికా
శ్రేణులు ధూపవాసనలు హృద్యనిరంతరవాద్యఘోషము
ల్రాణఁ బొసంగఁ బ్రోలు మిగులం గనువిం దొనరించు నిత్యక
ల్యాణముఁ బచ్చతోరణమునై జను లంపఱు నుల్లసిల్లఁగాన్. (1-35) 25

---

1. పైతాపతద్గ్రాహ (గి). 2. రత్నమాదీవ (వా). 3. గలయక (పూ. ము;) (సూ). బెరయక (వా). 4. ఋగ్యజురాది (పూ. ము.) పైసవరణ (రా). ఋక్చ యజుశ్చ ఋగ్యజుషమ్, అచతురాదినిపాతరూపములలో నిది గ్రహింపఁబడినది.

## 5. ఋత్వసంబంధవళులు

తే. సౌరిదిఁ గాదులఁ గల[1]వత్సరుదుల కెల్ల, ఋత్వమిత్రంబు లగునచ్చు లెనయనైదుఁ
జెల్లు హాయలును స్వరమైత్రిఁ జెందునపుడు, వెలయునివి ఋత్వసంబంధవళులనంగ.
ఆ. ధనతనూభవుండు పృషదశ్వసుతు నేసె, ఋభునదీసుతుండు కృష్ణు నేసె
నేమి చెప్ప నపుడు దృఢశక్తి శల్యుండు, హీనబలునిఁ జేసె వృష్ణికులుని. 27

జైమినీభారతమునందు:—

సీ. గీ. తండ్రితరమునఁ బెనిమిటితరమునందు, వీసమంతయుఁ బుణ్యంబుఁ జేసి యెఱుఁగ
వార్ధకంబున నిం కేల పట్టితొడుసు, కృష్ణు దర్శింప కున్న నాకేమి చిక్కు. 28

మనుచరిత్రమునందు:— (2-109)

సీ. తీర్థసంవాసు లేతెంచినా రని విన్న నెదురుగా నేఁగు దవ్వంత యైన
నేఁగి తత్పదముల [2]కెఱఁగి యింటికిఁ దెచ్చుఁ దెచ్చి సద్భక్తి నాతిథ్య మిచ్చు
నిచ్చి యిష్టాన్నసంతృప్తులఁగాఁ జేయుఁ జేసి కూర్చున్నచోఁ జేర వచ్చు
వచ్చి యిద్ధరఁ గల్గు వనధిపర్వతసరిత్తీర్థమాహాత్మ్యము దెలియ నడుగు.(1-57)29

నరసింహపురాణమున:—

సీ. పా. ఏదేవులీల లై యొసఁగు జగంబులు సృష్టిరక్షాసమాప్తులఁ బరఁగు.(2-30) 30

ఆముక్తమాల్యదయందు:—

చ. హితులు భిషగ్గ్రహజ్ఞబుధబృందకవీంద్రపురోహితుల్ హితా
హితులు ధనార్జనాదిన్నపకృత్యనియుక్తులు వెండి కేవలా
హితులు దశాదశార్పితసమృద్ధరమాచర [3]ణోప్సు లౌట నా
హితమును నట్ల కాఁ జతురవృత్తిఁ జరించుట నీతి ఱేనికిన్. (4-273) 31

సుభద్రాపరిణయమునందు:—

తే. చెఱకువిలుకానిబారికి వెఱచి నీదు, మఱుఁగుఁ జొచ్చితిఁ జేపట్టి మనుపు నన్నుఁ
బ్రాణదానంబుకన్నను వ్రతము గలదె, యెఱుఁగవే ధర్మపరుఁడవు నృపకుమార.
(1-158)

ఎడవల్లి పర్వతన్న చాటుధార:—

మ. రణరంగంబున నీ శితాసి యరినోరం బూరి గైకొన్నఁ దా
నణుమాత్రంబును వానిపైని దెగ దాహా చిత్ర మూహింపఁగాఁ
దృణమే కావలె దారికట్టు మొనక ట్టిద్ధారుణీమండలీ
ప్రణుతప్రాభవ కందనోలిపురగోపాలా క్షమావల్లభా. 33

---

1. వత్సరుదులు (పూ. ము.) 2. కెరఁగి (పూ. ము.) అప్పకవిమతమున నిందు శకటరేఫముండవలెను. (రా) 3. ణేచ్ఛ. (పాఠాంతరము.)

## 6. ఋత్వసామ్యవళులు

తే. వట్రువలు చెంది తమలోని వ్యంజనంబు, లన్నియునుగూడు ఋత్వసామ్యవళులనఁగ
వృష్ణివంశాబ్ధిసోముఁడై పృథివిఁ బుట్టి,మృతునిఁ గావించెఁ గంసునిఁ గృష్ణుఁ డనఁగ.

విష్ణుచిత్తీయమునందు:—

సీ. గీ. *తిరుగుదు రయారె సురపురి సురల మఱఁగి, బహుళహాలహాలభరితకల్బరిగనగర
సగరపురవరపరివృఢజవనయవన, పృతన భవపసి ననిఁ దెగి కృష్ణరాయ.(1-41)

అందే:—

మ. గృహసమ్మార్జనమో జలాహరణమో శృంగార [1]పల్యంకికా
వహనంబో వనమాలికాకరణమో వాల్లభ్య[2]లభ్యధ్వజ
గ్రహణంబో వ్యజనాతపత్రధృతియో ద్రాగ్దీపికారోపమో
నృహరీ వాదము లేల లేరె యితరుల్ నీలీలకుం బాత్రముల్. (2-91) 36

## 7. వృద్ధివళులు

క. తలకట్టులపై సంస్కృత,ములఁ గదియుపదాదివక్రములకు వరుసతో
నెలకొనువక్రతమంబుల, కిల నుభయముఁ జెల్లుచుండు వృద్ధివళు లనన్. 37

తే. ఇభభయవిదార సర్వలోకైకవీర, అఖిలభువనప్రశస్త జితైణహస్త
ఔదధిజాశ్రితవక్ష భక్తౌఘరక్ష, హతపరానీక నందవ్రజౌక యనఁగ. 38

ఏత్వమునకు విష్ణుచిత్తీయమునందు:—

మ. గురుగుం జెంచలి తుమ్మి లేఁదగిరిసాకుం దింత్రిణీపల్లవో
త్కరముం గూడఁ బొరంటి నూనియలతోఁ గట్టావికుట్టారికో
గిరము [3]లైక్కి తమిం [4]బసు ల్పొలము వోగ్రేపుల్ మెయి న్నాక మేఁ
కైరువుంగుంపటిమంచ మెక్కిరి ప్రభుత్త్వైకాప్తి రేడ్లజ్జడిన్. (4-134) 39

ఐత్వమునకు విరాటపర్వమునందు:—

ఉ. ఆ కమలాక్షిరూపమహిమాతిశయంబు మనోహరంబు భో
గైకపరాయణు ల్పురుషు లంగజుఁ డప్రతిమానచేష్టిత
స్వీకృతలోకుఁ డట్లగుటఁ జేటు పురంబునవారి కెమ్మెయిన్
గా కెటు లుండు నిట్టియవగాఢపుఁ బొత్తు మనంగ వచ్చునే. (3-32) 40

* తిరుగు హరిపుర సురతరు సురల మరగి (అచ్చు)

1. పర్యంకికా (ప.) 2. తార్క్ష్యధ్వజ (ప.) 3. మేసి (వా.) 4. కొమ (వా.).

ఓకారమునకు భాస్కరరామాయణమునందు:—

శా. నీ కంఠార్పితకాలపాశము శిరోనిర్ఘాతపాతంబు లం
క్రౌకస్సంచయకాళరాత్రి గళబద్ధోదగ్రకాలాహి క
న్యాకారాగతమృత్యు వీ జనకకన్య న్వేగ నొప్పించి యో
[1]కైకత్రాణుని రామునిం గనుము నీ కీబుద్ధి గా కుండినన్. (సుం. ప. 448) 41

ఔకారమున కయ్యల[2]రాజు రామభద్రుని చాటుధార:—

క. రాజమనోజా విద్యా, భోజా దీనార్థికల్పభూజా రిపుసం
క్షాజా వైభవవిజితబి,డౌజా రవితేజ గుత్తియప్పలరాజా. 42

ఇవి యేడును స్వరయతిభేదంబులు.

## వ్యంజనాక్షరవిరతులు

సీ. క్రమమునఁ బ్రాణి వర్గజ బిందు తద్భవవ్యాజ విశేషసమాహ్వయములు
మహి ననుస్వారసంబంధానునాసికాక్షర మువిభక్తి ముకారయతులు
మొగి మవర్ణవిరామములు ఋజు ప్రత్యేక భిన్నైకతరము లభేదవిరతు
లోలి నభేదవర్గోష్మవిశ్రాంతులు సరస సంయుక్తవిశ్రామములును
తే. గరిమ నంత్యోష్మసంధి వికల్పసంధి, విరమములు నాఁగ వ్యంజనాక్షరవిరతులు
నిఖిలసుకవిప్రయోగము లెన్నమకి చూడ, నేకవింశతిభేదంబు లెఱుఁగ వలయు. 43

## 8. ప్రాణివిరామములు

తే. ప్రాణములు నాఁగ స్వరసమాహ్వయము లయ్యె
నవి కలిమిఁజేసి హల్లులు ప్రాణులయ్యెఁ
బొల్లుహల్లుల నచ్చులు పొందకునికిఁ
బ్రాణు లని పల్కఁగూడదు వాని నెందు. 44

తే. వ్యంజనంబులు స్వరమైత్రి వలనఁ దమకుఁ, దామ ప్రాణివిరామాభిధానములను
జెంది మూఁడు తెఱంగులై చెల్లుచుండు, వాని నెఱుఁగక కృతి నేయ వలను గాదు.

క. చెలులు తలకట్లు నా చాఁ, పులు నైత్వోత్వములు మిత్రములు గుడిగవయుఁ
[3]సుడిగవయు నేత్వయుగమును, జెలువగు చుట్టములు ద్వివిధశృంగాత్వమ్ముల్. 46

---

1. ఈపద్యము ఓకారమునకు లక్ష్యముగా నొసఁగఁబడినది. ఇందు నాలవపాదమున ఐకారమునకును లక్ష్యము గలదు (రా). 2. విటరాజు రామభద్రుని. (వా); బలరామభద్రుని (ప). 3. సుడి (వ); సుళి (వా). (సూ) లడలప్రాసము అప్పకవికి సమ్మతమే. (ఆ. 3-366.) (రా).

సీ. కలశాబ్ధిగంభీర కాంచనాచలధీర కాళియోరగవైరి కైటభారి
కైలాసపతిమిత్ర కౌశికస్తుతిపాత్ర కిల్బిషాద్రిసురేంద్ర కీర్తిసాంద్ర
కీలాలరుహనాభ కృష్ణజీమూతాభ కృతవర్మతో నేఁగి కెలఁకు లాఁగి
కెరలి చైద్యుఁడు సూడఁ గేకయు ల్గానియాడఁ గుండిసేశునిపట్టిఁ గూడ ముట్టి
తే. కూర్మి వలకేల సింగంపుఁగొదమలీలఁ, గొని శతాంగంబుపై నుంచి కోర్కె మించి
ద్వారకకు వచ్చు నీవైభవంబుఁ బొగడ, శక్యమే యనఁ గాకు లక్ష్యంబు లయ్యె.

9. వర్గజయతులు

ఆ. శబ్దసూత్రములను జగతి నేకస్థాన, సంభవంబు లగుచు సంధివేళఁ
గల సవర్ణసంజ్ఞఁ దలపోసి యతులకుఁ, గూర్పవచ్చు మఱియుఁ గొన్నికృతుల. 48
క. తమకమ యనునాసికవర్ణములు విడిచి వెనుకలిపులు నాల్గును దమలో
దమకు [1]నర లేక నిలిచిన, నమరాహితదమన వర్గయతు లనఁ బరఁగున్. 49
ఆ. కంధిమధ్యగేహ ఖండితారిసమూహ, ఖంజనాభదేహ గానమోహ
గరుడపక్షివాహ ఘనవాహజస్నేహ, ఖర్గవినుత యనిన వర్గయతులు, 50
వ. తక్కిన నాలుగు వర్గములకున్ను ఈలాగుననే తెలుసుకొనేది. 51

10. బిందుయతులు

క. పనిఁ బూని నిలుచుఁ దమతమ,యనునాసికములకు బిందుయతులను వెనుకన్
గనుపట్టు నాల్గులిపులును, బెనుసున్నలు డాసి తమకుఁ బిఱుఁదఁ గదియుచోన్. 52
తే. జ్ఞానవేద్యాయ తప్తకాంచనవిభూష, ణాయ మేచకవర్ణకంఠప్రియాయ
నగధరాయ నమోస్తు సౌందర్యవిజిత, మనసిజాతాయ గోపడింభాయ యనఁగ.

11. తద్భవవ్యాజవిశ్రమములు

సీ. విజ్ఞానమునకు భావింప విన్నాణంబు విజ్ఞాపనమునకు విన్నపంబు
సంజ్ఞకు సన్న యజ్ఞమునకు జన్నంబు నాజ్ఞప్తి కానతి యాజ్ఞ కాన
యని యిట్లు సంస్కృత[2]వ్యాహారమధ్యావసానంబుల ద్వితీయసరళమునకు
నడుమునఁ గల తాలుజానునాసికములు తద్భవంబున ద్రుతత్వంబు గాంచి
తే. వెలయుటను దద్భవవ్యాజవిశ్రమమున్న, జరిగి నణలకు రెంటికి జ్ఞా తనర్చు
జ్ఞానచేతోంబుజాతశోణకర యనఁగ, జ్ఞాతివిద్వేషినృపనాశనకర యనఁగ. 54

గణితమునందుఁ బావులూరి మల్లన్న:—

ఉ. శ్రీనిధి యైన శివ్వనను జిమ్మననున్ మఱి సూర్యదేవునిన్
ధీనిధిఁ బోలనార్యులను దేజమునన్ రవితుల్యులైన యా

---

1. నెర (వా). 2. వ్యవహార (పూ. ము; సూ.)

సూనుల నల్వురం బడసె సూరిజనస్తుతసత్యభారతీ
జ్ఞానులఁ బద్మగర్భవదనంబులు నాలుగుఁ బోలె వారిలోన్. 55

## 12. విశేషవళులు

తే. ప్రౌఢకవులు కొందఱు ఙ్కారంబునకును, బ్రథమవర్గంబుతోఁ గలియక్కరములు నాల్గు
నిడుదురు ప్రబంధముల నొక్కయెడ విశేష,వళులనుచు సోమయాజులువాడుకతన.

శాంతిపర్వమునందు:—

క. జ్ఞానము కేవలకృప న,జ్ఞానికి నుపదేశవిధిఁ [1]బ్రకాశము సేయం
గా నది సకలధరిత్రీ, దానంబునకంటె నధికతరఫలద మగున్. (4-255) 57

## 13. అనుస్వారసంబంధయతులు

ఆ. ఆదిపూర్ణయుతము లై టతవర్గాక్ష,రములు తుదను గలుగు వ్రాలు దక్కఁ
బొసఁగు నొకటి కొకటి భువి ననుస్వారసం,బంధయతులు నాఁ బ్రబంధములను 58

మనుచరిత్రమునందు:—

శా. శీలంబుం గులము న్శమంబు దమముం జెల్వంబు లేఁబ్రాయముం
బోలం జూచి యితండు పాత్రుఁ డని యే భూపాలుఁ డీవచ్చినన్
సాలగ్రామము మున్నుగాఁ గొనఁడు మాన్యక్షేత్రము ల్వెక్కుచం
ద్రాలం బండు నొకప్పుడుం దఱుఁగఁ దింట్రం బొడియుం బంటయున్.(1-55) 59

రావిపాటి తిప్పరాజు చాటుధార:—

మ. సరిబేసై రిపు డేల భాస్కరులు భాషానాథ!, పుత్రా! వసుం
ధర నం దొక్కఁడు మంత్రియయ్యె, [2]వినుకొండ న్రామయామాత్యభా
స్కరుఁడో?, యా, నయితే సహస్రకరశాఖ ల్లే, వదే యున్న వే
తిరమై దానము సేయుచో రిపుల హేతి న్వ్రేయుచో వ్రాయుచో. 60

ఆముక్తమాల్యదయందు:—

మ. దవ[3]ధూమంపుఁదమంబులోఁ దమరసద్రవ్యంబు పంకేజబాం
ధవభానుప్రతతుల్ హరింపఁ [4]గుయి వెంట న్వెళ్లుశానొవ్వరుకూ
పవితానం[5]బులఁ జూడఁజూడఁ బుడమిం బాటిల్లి పై విప్పు లై
యవసం బంచుల నాడఁగా నెగసె వాత్యాళి న్రజశ్చక్రముల్. (2-49) 61

---

1. ప్రజనితము (ముద్రితభారతపాఠము). 2. వినికొండ (వా). 3. ధూమంబు తమంబు (వా). 4. కుయివెట్టన్ (సూ). 5. బనఁ జూడఁజూడ - శ్రీ వావిళ్ల రామస్వామిశాస్త్రిగారి వ్యాఖ్య.

## 14. అనునాసికాక్షరయతులు

తే. అలద్రుతంబునకును మధ్యమానునాసి, కమునకును జెల్లు ననునాసికయతు లనఁగ
డావలను బూర్ణములు గల్గుటతదధలును, తథదధలును గ్రమంబున దానవారి. 62

క. మనుసంతతిమండన భం,ద్రనసిర్జితకార్తవీర్యపరనాయకఖం
డన పజ్క్తిస్యందననం,దన చందన[1]శక్ర వారణలసత్కీర్తీ. 63

కిష్కింధాకాండమునందు:—

క. బలవంతుఁడైన వాలికిఁ, దలఁకుచుఁ గిష్కింధ వెడలి త్వరలో నలుది
క్కులకుం బొఱి మహీమం,డలమెల్లను జూచినాఁడ నాఁడు నరేంద్రా. (ప-614)

రాజశేఖరచరిత్రమునందు:—

మ. కలమాన్నంబు ఘృతంబుఁ బాయసము శాకవ్రాతముల్ పిండివం
టలు బాత్తేనియ జున్ను వెన్న యిడి యోగ్నా లుక్కెర ల్చక్కెరల్
ఫలము ల్పానకము ల్రసాయనము లంబ ల్లారుఁబిం డ్లూరుగా
యలు బజ్జు ల్దధిపిండఖండములు నం దావిర్భవించె న్వెసన్. (2-27) 65

పరమయోగివిలాసమునందు:—

సీ. పా. నిగమచోరకుని ఖండించినయలఁతయో యబ్ధిలో గిరి మోచినట్టియలఁతో.
(2-104)

చిత్రభారతమునందు:—

తే. నకులసహదేవులార! ఖండనపటిష్ఠులార! సౌందర్యలక్ష్మీకుమారులార!
పోయితిరె మీరు నేఁడు నాపొందు విడిచి,యనుచు విలపించు నలుదిక్కులాలకించు.
(8-94)

హరిశ్చంద్రోపాఖ్యానమునందు:—

సీ. పా. పల్లవారుణజటాపటలభారముతోడ నవ్యపలాశదండంబుతోడ. (1-8) 68

## 15. ముఖభక్తియతులు

తే. పున్నపుంసకతత్సమంబులకడపలఁ, దత్సమాంధ్రదేశ్యశబ్దములతుదలఁ
గదిసినమకారశృంగముల్ కావ్యములను, బొసఁగుము విభక్తియతులనఁబుధులభులకు.

తే. పుష్కరము సూక్ష్మమధ్యమమ్ముగ నొనర్చె, ఫుల్లపంకేరుహము వక్త్రమ్ముగ నొనర్చె
బొండుమల్లెలు దరహాసమ్ముగ నొనర్చె, భోజన్నృపనందనకు నిక్కముగ నజుండు. 70

ఆదిపర్వమునందు:—

క. ఎట్టిభిశేషకులంబునఁ, బుట్టిన సదసద్వివేకమ్ములు గలిగినఁ దాఁ
గట్టిన కర్మఫలంబులు, నెట్టన భోగింపకుండ నేర్తురె మనుజుల్. (5-58) 71

---

1. చక్ర (పూ. ము.) సవరణ (రా).

## 16. ముకారయతులు

క. హెచ్చరికను బుభుబుభులకు, నచ్చుపుమాకొమ్ములే మహాకవు లాదిన్
మెచ్చులుగ నిలిపి రచ్చట, నచ్చటను ముకారయతు లటంచును గృతులన్. 72

[1]వసంతవిలాసమునందు:—

క. అత్తఱి విట[2]నాగరకులు, చిత్తమున వసంతకేళి చిగురొత్తంగా
మొత్తములు గట్టి తెచ్చిరి, ముత్తెపుఝల్లరులతో డిబ్బుఱ్ఱటకొమ్ముల్. 73

శ్రీరంగమాహాత్మ్యమునందు:—

చ. పరిచరుఁ గాఁగ నేలె నిరపాయచరిత్రునిఁ బాపకానన
స్ఫురదురువీతిహోత్రుని సముజ్జ్వలమేరుసమానగాత్రునిన్
బరమపవిత్రునిన్ మునిసుపర్వపరస్తుతిపాత్రుని న్మనో
హరఫలశేముషీకబళితాంబుజమిత్రుని వాయుపుత్రునిన్. 74

హరిశ్చంద్రకథయందు:—

ద్విపద. ముందు మీ రెఱిఁగిన భూతలాధీశు,లందు రాజ్యంబుఁ బోనాడి క్రమ్మఱను.

## 17. మవర్ణవిరామములు

సీ. మర్దితదైత్యసంయమిమనోబ్జాదిత్య, మహితమేఘాభ సంరక్షితేభ
మాయాప్రవర్తి సంలబ్ధనిర్మలకీర్తి,మణిహార సురవశంవదవిహార
మందరధైర్య వంశనినాదచాతుర్య, మాభూప యువతిపుంషండరూప
మంజులస్వాంత కంసధరాపరకృతాంత, స్మరహరారాధ్య సింహనిభమధ్య

తే. యనుచుఁ జరమానునాసికంబునకు నిట్లు, గ్రాలుఁ గృతుల మవర్ణవిరామము లన
దండిసున్నలు దాపల నుండెనేని, వెలుచ నంతస్థములు నూష్మములును గృష్ణ. 76

భీమనచాటుధార:—

చ. గరళపుముద్ద లోహ మవగాఢమహాశనికోట్లు సమ్మెటల్
హరునయనాగ్ని కొల్మి యురగాధిపుకోరలు పట్టుకార్లు ది
క్కరటిశిరంబు దాయి లయకాలుఁడు కమ్మరి వైరివీరసం
హరణ[3]గుణాభిరాముఁ డగు[4]మైలమభీమనఖడ్గసృష్టికిన్. 77

అనంతునిఛందమునందు:—

తే. యరలవలు శషసహలును నాదిబిందు, యుతములై మకారవిరామయుక్తిఁ దనరు
మారుతాత్మజుఁ డరిదిసంయమి యనంగ, మదనజనకుఁడు దనుజసంహారుఁ డనఁగ.
(1-117)

---

1. ఈగ్రంథము నాచనసోమనకృతము. నేఁ డలభ్యము (రా). 2. నాగరికులు (సూ). 3. రణాభిరాముఁడగు (వా). 4. మైలమభీముని (పాఠాంతరము.)

## 18. ఋజుయతులు

తే. మొదలియంతస్థవర్ణంబు తుదిని బొదలు, నూష్మము ఋజుసంజ్ఞచే నొకటొకటి
యతు లగు నపారశూరసంహార యనఁగ, ఘోరముఖార్చితపాదతోయజ యనంగ.

## 19. ప్రత్యేకయతులు

తే. ఉత్తరపదాద్యలిపి లోప [1]మొదవుచుండు, తఱిని బ్రత్యేకయతినాఁగఁ దనరుచుండు
నరయ శార్ఙ్గంబు హరిచేతియదియు [2]నాక, దివ్యచాపంబు శూలిచేతిదియనంగ. 80

## 20. భిన్నయతులు

తే. గుడుసుపైఁ గ్రియనడుమ నాగుడును వచ్చి
భిన్నయతి యగు రానిచోఁ బెఱయతి యగు
నైదను లచ్చిని హరి ధరియించె ననఁగ
రిపుల నెల్లను బోర హరించె ననఁగ. 81

విజయవిలాసమునందు:—

ఉ. చిత్తజుఁ డల్లి తూపు మొనఁ జేసినఁ జేయఁగ నిమ్ము పై ధ్వజం
బెత్తిన నెత్తనిమ్ము వచియించెదఁ గల్గినమాట !గట్టిగా
నత్తరళాయతేక్షణకటాక్షవిలాసరసప్రవాహముల్
కుత్తుకబంటి తామరలకుం దలమున్కలు గండుమీలకున్. (3-15) 82

అందే:—

*ఉ. చెట్టతనంబునన్ జనకుజీవన మంతయు వెల్లి వుచ్చి తోఁ
బుట్టినయా పెయి[3]ల్వెఱచి పుట్టినబిడ్డనికిం బగైన నీ
యిట్టినిశాటకృత్యమున కెవ్వఁడు రోయక సమ్మతించు నీ
వెట్టిప్రదోషవేళ జనియించినవాఁడవొ గాక చంద్రమా. 83

పెఱయతి

ఆగమము రానందులకు శ్రీరంగమాహాత్మ్యమునందు:—

ఉ. గంధపుఁగొండనెత్తములఁ గందువమేలిమితీవయిండ్లలోఁ
గ్రందలిరాకుపాన్పున సుఖించి నితాంతరతిశ్రమంబునుం
జెందిన[4]చెంచుగుబ్బెతలచెక్కులఁ జిమ్ము జవాదివాసనల్
విందులు సేయుచు న్మెలఁగు వేఁకువఁ గోమలగంధవాహముల్. 84

---

1. మొదవకుండు (క). 2. నాఁగ (క). 3. చెఱచి (వా). 4. చంచు (ప).

* ఈ పద్యము విజయవిలాసములోఁ గానరాదు; ఎందలిదో? (రా).

## 21. ఏకతరయతులు

తే. మహిని రేఫాక్షరంబును మఱి శతాంగ
నామక ఋకారమును సవర్ణంబు లయ్యెఁ
గావ్యములయందు నొకటి కొక్కటి గలయక
దమకుఁ [1]దామయె యగు నేకతరయతు లన. 85

ఆ. ఱార బాలకృష్ణ ఱచ్చలగమిఁ గూడి, ఱాఁగ యనుచు నిన్ను ఱవ్వఁబెట్టు
వాండ్రయిండ్ల కేఁగి వా దేల దెచ్చెద, వనిన నేకతరము లై పొసంగు. 86

## 22. అభేదవిరతులు

తే. వేదముఖమున 'వలయో రభేద' యనుట,వలన వబ లొక్కటొక్కటి నిలుచు విరతి
కవని లడలకు ళళలకు నట్ల కలిమిఁ, జేసి తమలోన నివియును జెల్లుచుండు. 87

ఆ. వసుమతీకళత్ర బకజైత్ర గానక, లాలసత్కలాప[2]డంభ గోప
లలితదేహ పింగళపురదక్షిణ గేహ, యన నభేదవిరతు లప్రమేయ. 88

ఆదిపర్వమునందు:—

చ. నుతజలపూరితంబులగు నూతులు నూఱిటికంటె సూనృత
వ్రత యొక బావి మేలు మఱి బావులు నూఱిటికంటె నొక్కస
త్క్రతు వది మేలు తత్క్రతుశతంబునకంటె సుతుండు మేలు త
త్సుతశతకంబుకంటె నొక సూనృతవాక్యము మేలు చూడఁగన్. (4-94) 89

ఆరణ్యపర్వమునందు:—

చ. ప్రతిబలదర్పభంజనుఁడు పార్థుఁడు దారుణబాణవర్షము
న్నతి నతిధీరుఁ డై కురిసినం బరముండు మహాంబువృష్టి ప
ర్వతము [3]గ్రహించునట్లు తనబాహుల వాని గ్రహించి పోర న
క్షతతనుఁ డయ్యె వాని నతిగర్వితుఁ బార్థుఁడు చూచి యాత్మలోన్. (1-311)

భీమనచాటుధార:—

చ. *బిసరుహగర్భు[4]వ్రాఁతయును విష్ణునిచక్రము వజ్రివజ్రముం
దెసలను రామబాణము యుధిష్ఠిరుకోపముఁ గాలుదండముం

---

1. తామే యను నర్థమున 'తామయగు' అనవలె-'తామయెయగు' అనుట సరి గాదు. 'తామయైతగు' అని సవరింపనగునేమో (రా). 2. డంబ (పూ.ము). 3. గ్రసించు (పూ. ము). 'బలవంతుఁడు దాని' ముద్రితభార. 4. శాపమును (వా); పాశమును (వ).

*పాఠాంతరము

చ. బిసరుహగర్భువ్రాఁతయును విష్ణునిచక్రము వజ్రివజ్రముం
దశరథసూనుబాణమును ధర్మజుకోపము మౌనిశాపముం

మసకపుఁబామునాఁటును గుమారునిశక్తియు మానిరోషముల్
లసవనిరౌతుశూలమును బండితవాక్యము రిత్త వోవునే. 91

[1]చమత్కారమంజరియందు:—

ఉ. బంగరుదుప్పటంబు వలెవాటుగ నొప్పు హసన్ముఖాబ్జుఁడై
రింగున నారిఁ గోల నమరించి తటాలునఁ ద్రుంచె నా ధను
శ్శృంగుఁడు గోపయావతభుజంగుఁడు మోచితసంగుఁడుం గృపా
పాంగుఁడు దృప్తదర్పబలభంజనయంత్రము మత్స్యయంత్రమున్. 92

తే. పెద్దలాకును దనకు నభేద మగుట, ళళలకు నభేద మట్లన కలుగుకతన
క్షితిని మూఁడవ నరళంబు యతులఁ బ్రాస,ములను లఘ్వలఘులకారములకు నిలుచు.

అనంతుని ఛందమునందు డళలకు:—

క. కాకుస్వరయతి యగు నిడఁ, డ్రై కదలక జలధిఁ బవ్వళించె ననఁగఁ బ్ర
శ్నాకలితదీర్ఘమున నిడఁ,డే కవ్వడిరథము గడిపె నిమ్ముల ననఁగన్. (1-95) 94

లళలకు నాదిపర్వమునందు:—

చ. అలసత నోరఁగాఁ దరుణి యమ్మునిపుంగవు మ్రోల నున్న యా
మిళితసుగంధబంధురసమీరవశంబునఁ దూలి చాలపై
వలు వెడల న్బయల్పడియె వల్గుకుచంబులుఁ గక్షయుగ్మముల్
లలితకృశోదరంబుఁ దరళత్రివళీయుతరోమరాజియున్. (4-12) 95

నిర్వచనోత్తరరామాయణమునందు:—

శా. చేసేతం బృథివీశు లందుకొనఁ గాశీపుణ్యతోయంబునన్
జేసె న్మజ్జనముం గుటంబున హరించెన్ బల్లవోర్వీశును
ల్లాసం బైతగ ఫాలలోచనములీలం గట్టెఁ గావేరి వే
లాసాధ్యాఖిలదిఙ్ముఖుండు కరికాళక్ష్మావిభుం డల్పుఁడే. (1-26) 96

పారిజాతాపహరణమునందు:—

మ. అలినీలాలక నీవు నీపతి రహస్యక్రీడ వర్తించువే
శ లతాంతాయుధసంగరంబునకు నుల్లాసంబు గల్పించు ను
జ్జ్వలదీపాంకురమై రతిశ్రమతనూసంజాతధారాళఘ
ర్మలవంబుల్ దొలఁగింపఁగా సురటియై రంజిల్లు నిచ్ఛారతిన్. (1-60) 97

---

మసకపుఁబాముకాటును గుమారునిశక్తియుఁ గాలదండముల్
బశుపతికంటిమంటయును బండితవాక్యము రిత్త వోవునే.

1. ఈగ్రంథకర్త సింహాద్రి వేంకటాచార్యులు.

## 23. అభేదవర్గయతులు

క. తన కరలేని బకారం, బునకు స్వవర్గజము లైన మొదలిలిపులకెం
టను బైలిపి నొకటను వా, యనువ్రాయి యభేదవర్గయతి నా నెనయున్. 98

ఆదిపర్వమునందు:—

ఉ. ప్రల్లదుఁ డైనయొక్కకులపాంసను చేసినదానఁ దక్కులం
బెల్లను దూషితం బగుట యేమి యపూర్వము కావున న్మహీ
వల్లభ తక్షకాధము నెపంబున సర్పము లెల్ల నగ్నిలోఁ
ద్రెళ్లఁగ సర్పయాగ మతిధీయుత సేయుము విప్రసమ్మతిన్. (1-126) 99

అందే:—

క. ఉరగకళేబర మంసాం, తరమునఁ బడి వ్రేలుచునికిఁ దలఁపక యచల
స్థిరుఁ డై పరమధ్యానో, పరతేంద్రియవృత్తి నున్నవాని శమీకున్. (2-172) 100

ఆరణ్యపర్వమునందు:—

క. కోరి యనేకయుగంబు ల, పారతపోయుక్తు లైనవారికిఁ బడయన్
దూరము నీసభ [1]మఱి నీ, కారుణ్యము నంతకంటెఁ గడుదవ్వొందున్. (1-371)

షకారమునకు [2]సాంబోపాఖ్యానమునందు:—

క. మురసంహరునాటోప, స్ఫురణమ్మునకున్ సదాశివుం డైన రణ
స్థిర నిలువఁ గలఁడె బాణా, సురునకుఁ దోడుపడ వచ్చి సొలయుట వినరే. 102

ఆదిపర్వమునందు:—

మత్తకోకిల. ధీరు లీ ధృతరాష్ట్రపాండు లతిప్రశస్తగుణు ల్ప్రసి
ద్ధోరుకీర్తులు నాకు నిద్దఱు నొక్కరూప తలంపఁగా
వీరు వా రనునట్టిబుద్ధివిభేద మెన్నఁడు లేదు గాం
ధారపుత్రశతంబునందుఁ బృథాతనూజులయందునున్. (8-29) 103

## 24. ఊష్మవిశ్రాంతులు

తే. అంత్యవర్ణంబుఁ బాసి యూష్మాక్షరంబు, లూష్మవిశ్రాంతు లనఁ జెల్లు నొకటి కొకటి
శతమఘోపలభూషానుషంగ యనఁగ, షడ్జయుతవేణునాదప్రసంగ యనఁగ. 104

## 25. సరసవళులు

క. హయ లత్వమునకు శషసలు, నయవర్తన చఛజఝులకు నలి మధ్యమవ
ర్గయుతానునాసికము ని, శ్చయముగ ద్రుతమునకుఁ జెల్లు సరసవళు లనన్. 105

---

1. మేదిని (సూ). 2. దీనికర్త మోచర్ల నన్నయకవి - చూ. కవితరంగిణి. రామరాజు రంగప్ప రచించిన సాంబోపాఖ్యానము మఱొకటి గలదు (రా.)

తే. హరిహయాదిసురాధ్యక్ష యంబుజాక్ష, యతిజనమనోంబుజవిహార యఘవిదూర
నరకదైత్యవిరోధి ఘృణాపయోధి, యనఁగ సరసాఖ్యవళ్యుదాహరణము లగు.

తే. శకటదానవసంహారి చక్రధారి, షట్పదశ్యామమూర్తి స్వేచ్ఛాప్రవర్తి
స్వర్ణపటపరిధాయి భుజంగశాయి, కరుణ ననుఁ బ్రోవు మన నరస్యు సరసవళులు.

## 26. సంయుక్తవిశ్రామములు

ఆ. ఒకటి రెండు జడ్డ లుండెడువర్ణంబు, విశ్రమస్థలమున వెలసెనేని
యవల దాని కెద్ది యైన సంయుక్తవి, శ్రామసంజ్ఞ చేఁ బొసంగుచుండు. 108

తే. క్ష్మాధరం బాతపత్రంబుగా ధరించె, క్ష్మాకుమారుని బోరను సంహరించె
క్ష్మారుహాంబునకై నిలింపపతి నొంచెఁ, జక్రి యనిన సంయుక్తవిశ్రామము లగు.

## యతినియతి

క. ఏకపదంబున విరతు ల, నేకంబులు గలిగి యుండునేని పదాదిం
జేకొన్నలిపియె యన్నిటఁ, బ్రాకటముగ నిలుచు నీసపదములఁ దక్కన్. 110

ఆ. ఒక్కపదములోనఁ బెక్కువిశ్రమములు, జరుగుచోట మొదల జడ్డ లున్న
నడుగు వెడలుదనుక నం దొక్కటియెకాని, యుండ దొకటనదియు నొకటనిదియు.

[1]జయభద్రరగడ:—

క్ష్మాపుత్రి కాలోల కమనీయగుణజాల ఘననీల యని చెప్పఁగా బహువిరతు లొప్పు
క్ష్మాపాలకలలామ కంధిగర్వవిరామ సంగ్రామభీమ యన మహిని రెంటికిఁదప్పు. 112

తే. ఒంటియడుగున బహుయతు లుండునపుడు, నడుమ నొకదాన జమిలివర్ణంబు గదియ
నందుఁ జరణాదికి సవర్ణమయ్యె నెద్ది, [2]దానికయ నిల్చు విరతి ముందరను గృతుల.

విజయమంగళరగడ:—

వైరిమదతమఃపతంగ స్వజనపోషితాంతరంగ
వ్రజవధూభుజంగ యనఁగ వలయుఁ బెక్కువడులయెడల
ద్వారితక్షమాకుమార ద్వారకాపురీవిహార
వ్యాససన్నుతప్రచార యనఁగఁ దప్పఁ గడకు వెడల. 114

## 27. అంత్యోష్మసంధివడులు

పాణినీయసూత్రము:—

సూ. ఝయో హోఽన్యతరస్యామ్.

వృ. ఝయః పరస్య హస్య పూర్వసవర్ణో వా స్యాత్. వాక్ + హరిః, ఘోషవత్త్వాది
గుణవతో హస్య వర్గ చతుర్థః పూర్వ సవర్ణ స్స్యాత్. వాగ్ఘరిః.

---

1. ఇదియే విజయభద్రరగడ. చూ. పుట. 268. (రా) 2. దానికయ - దానికి+అ. దానిక అగును, కాన 'దానికే నిల్చు' నని సవరించుట యుచితము. (రా)

సీ. కైరవకామధుగ్ఘరవాహకవికుంద,హైరణ్యగర్భ[1]వాగ్ఘంసబృంద
డిండీరభోగిరాడ్డిమశైలకైలాస,హారిధవళాంబురుడ్ఢరినివాస
దేవాశ్వసురసరిద్ధీరముక్తాకాశ,హరిచందనైణభృద్ధ్రాదినీశ
పారదప్రాక్కకుబ్భస్తికంబుక్షీర,హాలధరశారదాబ్భ్రయపటీర
తే. పాండుసత్కీర్తి యని యిట్లు వర్గహల్లు, పొల్లులకుఁ బైహకారంబు పొందునపుడు
కంధిబంధన యంత్యోష్మసంధివిరమ, ణాఖ్యచే దాని కెయ్యది యైనఁజెల్లు. 115

## 28. వికల్పవిరమణములు

పాణినీయసూత్రము:—

మూ. యరోఽనునాసికేఽనునాసికో వా.

వృ. యరః పదాన్తస్యానునాసికే పరే అనునాసికో వా స్యాత్. ఏతన్మురారిః, ఏతద్మురారిః, మయటి నిత్యమ్ వాచ్యమ్, చిన్మయః.

తే. వ్యాకరణసూత్రముల సంధు లతుకునపుడు, రెండు విధముల రూపంబు లుండెనేని
వసుధ నయ్యక్కరముల కవ్వల వికల్ప, సంధివిరమణ మన రెండు సాగుచుండు.
తే. నందసుకుమార గూఢపాన్మదవిహార, దళితశిశుపాల గోత్రభిన్మణివినీల
నాగపర్యంకశాయి సన్మార్గయాయి, ధాతృనుతనామ యోగిహృన్మధ్యధామ. 117

[2]ఆదిపురాణమునందు:—

మ. ఒకనాఁ డిందుధరుండుఁ బార్వతియు లీలోద్యానకేళీసరి
న్నికటానేకవనప్రదేశముల దైతేయేంద్ర కన్యాప్సరో
నికురుంబంబులు పారిజాతకుసుమానీకంబు పైఁ జల్ల ద
ర్పకబాణంబుల కెల్ల నెల్ల యగుసౌభాగ్యంబు శోభిల్లఁగాన్. 118

మనుచరిత్రమునందు:—

మ. అకలంకౌషధసత్త్వముం దెలియ మాయాద్వారకావంతికా
శికురుక్షేత్రగయాప్రయాగముల నే సేవింప కుద్దండగం
డకవేదండవరాహవాహరిపుఖడ్గవ్యాఘ్ర మిమ్మంచుకొం
డకు రాఁ జెల్లునె బుద్ధిజాడ్యజనితోన్మాదు ల్గదా శ్రోత్రియుల్. (2-16) 119
తే. హాలధరానుజ మయటి నిత్య మ్మటంచుఁ, బలుకువాక్యంబుచే మయపదము గూడు
నప్పు డనునాసికంబె నిత్యమయి నిల్చు, నలినలోచనుమేను చిన్మయ మనంగ. 120

ఇవి వ్యంజనాక్షరవిరతిభేదంబులు.

---

1. వాగ్ఘరిసబృంద (పూ. ము; సూ.) 2. ఆదిత్యపురాణము (ప) ఇది సోముని ఉత్తరహరివంశములో ఉన్నది. ఇందుధరోపాఖ్యానమందు మొదటి పద్యము.

ఇఁక నుభయవళు లెట్టివనిన వివరించెద

సీ. సర్వేశ యుష్మదస్మచ్ఛబ్దయతులును బరరూపవిరతులు ప్రాదియతులు
వెండి నిత్యసమాసవిశ్రాంతిదేశ్యనిత్యసమాసనిత్యాభిధానములును
రాగమసంధివిభాగసామాఖండపంచమీవికృతివిభక్తియతులు
కాకుస్వరప్లుతాక్షరయుగవిశ్రామములు నన నుభయాఖ్య వెలయు వళులు
తే. క్రమత శబ్దానుశాసనప్రభృతిపూర్వ, కవిజనంబుల కృతుల లక్ష్యములకలిమిఁ
బరియు రెండువిధమ్ములై పరఁగుచుండు, దద్విధంబులు దెలియంగఁ దగు ముకుంద.

1. యుష్మదస్మచ్ఛబ్దయతులు

క. క్షితి నస్మద్యుష్మత్పద, యతు లనఁ గావ్యముల యుష్మదస్మచ్ఛబ్ద
ద్వితయమునకుఁ బైఁ బ్రాణము, లలికిన నుభయంబుఁ జెల్లు నభయవిహారా. 122

సాంబోపాఖ్యానమునందు:—

క. చతురాననసనందన ది, వ్యతపోధనవర్య యుష్మ దాగమనమునన్
గృతకృత్యుఁడ నైతిని నే, నతి పావన మయ్యె నస్మదన్వయ మెల్లన్. 123

అథర్వణాచార్యుల విరాటపర్వమునందు:—

ఆ. ధర్మతనయ యుష్మదాజ్ఞానిగళవిని,బద్ధ మగుచుఁ జిక్కువడియెఁగాక
విజయమత్తగజము విడివడ్డచో నడ్డ, పాటు గలదె విష్టపత్రయమున. 123

ఆదిపర్వమునందు:—

క. ప్రస్తుతఫణిసత్రభయ, త్రస్తాత్ముల మైన యస్మదాదుల కెల్లన్
స్వస్తి యని పలుక నవసర,మస్తికున కయ్యె నిప్పు డంబుజనేత్రా.(2-219)125

2. పరరూపవిరతులు

వ్యాకరణసూత్రము:—

సూ. అచోఽన్త్యాది టి.

వృ. అన్త్యాచ్ ప్రభృతిశబ్ద ష్టిసంజ్ఞ స్స్యాత్. శకంధ్వాదిషు (టేః) పరరూపం వాచ్యమ్. (వా)

శ్లో. శకంధు రథ కర్కంధూః కుద్దాలోఽలక్తపర్కటీ,
లాంగలీషా హలీషా చ మనీషా చ పతంజలిః.
కుత్కోలోక్షిషమంజీరమస్తిష్కకులటాదయః,
తథా వృకంధుసీమన్తౌ శకంధ్వాదిగణే స్మృతాః.

శకానాం దేశానా మంధుః కూపః శకంధుః, శకంధు వనం గాను, శక దేశమందలి బావి పేరు. కర్కన్స్యాంధూః, కర్కంధూః. 'కర్కంధూర్బదరీకోలీ'త్యమరః. కర్కంధు వనంగాను రేఁగుచెట్టు. కం శిరః, ఉష్ణవీర్యత్వా దుద్దాలయతీతి కుద్దాలః; కుం భూమిము ద్దాలయతీతి వా. దళ విశరణే. ఉ దిత్యుపసర్గః. 'కుద్దాలో బహువారక' ఇత్యమరః. కుద్దాల మనంగాను విరిగిచెట్టు. పాద మలతీ త్యలక్తః. అల భూషణే-'యావో లక్తోద్రుమా మయ'ఇత్యమరః. అలక్త మనగా లత్తుక పేరు. పర్చ్యతే పరస్పరం స్పృశ్యత ఇతి పర్కటీ. పృచిసంపర్కే. 'ప్లక్షో జటీ పర్కటీ స్యా'దిత్యమరః. పర్కటి యనంగాను జువ్వి చెట్టు. లాంగలస్యేషా లాంగలీషా, 'ఈషా లాంగలదండస్స్యా' దిత్యమరః. హలస్యేషా హలీషా. ఈరెండున్ను ఏడికోలపేళ్లు. మనస ఈషా లాంగలదండవ త్సంబద్ధా మనీషా. 'బుద్ధిర్మనీషా ధిషణే'త్యమరః. మనీష యనంగాను బుద్ధి పేరు. పతత్ అంజలిః పతంజలిః. పతంజలి యనంగాను వ్యాకరణమునకు మహాభాష్యము చేసిన నాగము పేరు. కోర్భూమే రుత్కలః కుత్కలః. 'అగ కుత్కలజీమూత సానుమన్నగపర్వతా' ఇత్యమరః. కుత్కల మనఁగాను గట్టుపేరు. ఉష్ణస్యఈషః ఉష్ణీషః 'ఉష్ణీష శ్శిరో వేష్టకిరీటయోరితి నానార్థే, ఉష్ణీష మనంగాఁ దలపాగ పేరు. [1]మంజు రుచ్య మీరయతీతి మంజీరః ఈర స్వనే. 'మంజీరో నూపురోఽస్త్రియా' మిత్యమరః. మంజీర మనఁగాఁ గాలిగజ్జె. మస్తం శిర ఇష్యతి ప్రాప్నోతీతి మస్తిష్కం, ఇష గతౌ. 'తిలకం క్లోమమస్తిష్క' మిత్యమరః. మస్తిష్క మనఁగాఁ దలమెదడుపేరు. కులం విటకుల మటతీతి కులటా. అట గతౌ. 'అసతీ కులటేత్వరీ'త్యమరః. కులట యనఁగా లంజెపేరు. ఆదిశబ్దముచేత వేదండసారంగ ములు మొదలైనవి మఱి కొన్ని గలవు. వేదః సామవేదః అండః జననకారణం యస్య సః వేదండః, సామోద్భవ ఇతి ప్రసిద్ధిః. 'సామజ స్సింధురోఽపి స' ఇత్యమరః. వేదండ మనంగా నేనుఁగుపేరు. సారాణ్యంగాని యస్య సః సారంగః. 'సారంగ శ్చాతకే భృంగే కురంగే చ మతంగజ' ఇత్యమరః. సారంగ మనంగాను చాతకాదులపేరు. వృక స్య అంధుః వృకంధుః. వృకంధువనంగాను వృకదేశమందున్న బావిపేరు. [1]సీమ్నః అంతః సీమంతః. సీమంత మనఁగాఁ బాపటపేరు. ఇవి శకంధుశబ్దము మొదలుగాఁ గలవి గనుకను శంకధ్వాదిగణ మనఁబడును.

క. విరతికి వ్యాకరణమునను, వరరుచిచేఁ జెప్పఁబడినవాక్యమువలనన్
బరరూపము నిత్యంబై, పరగు శకంధ్వాదులకు నుభయముం జెల్లున్. 126

వేదండశబ్దమునకు నాదిపర్వమునందు:—

మత్తకోకిల. దండితాహితవీర సూరినిధాన దానవినోద కో
దండపార్థ పరాక్రమప్రియధామ దిక్పరిపూరితా

1. సీమస్య (ఓ; భూ. ము. సూ.)

ఖండపాండుయశోనిధీ పరగండభైరవ వైరి[1]వే
దండగండవిదారిఘోరతరాసిభాసిభుజార్గళా. (3-228) 127

భీష్మపర్వమునందు:—

ఉ. పాండునృపాలనందనులు పావని [2]ముందుగఁ దాఁకనట్లు భీ
ష్ముండు కడంకమై నడుచుచోటికిఁ జక్కటిగాఁగఁ ద్రోచి యొం
డొండ గడంగి సేన తమ యుబ్బున కుబ్బఁగ నన్యసైన్యవే
దండముఖాంగము ల్తృణవితానముఁగాఁ గొని నిర్వికారులై. (1-234) 128

సారంగశబ్దమునకుఁ జంద్రికాపరిణయమునందు:—

ఉ. జంగమరోహణాద్రిసదృశంబులు తత్పురిఁ గల్గు భద్రసా
రంగవరేణ్యము ల్వయికి హస్తము లించుక సాఁచి యవ్వియ
ద్గాంగఝురంబు పీల్చి మఱి తద్వమథుప్రకరంబు దప్పి వా
యంగ నొసంగు రంగుగ నిజాఖ్య వహించిన చాతకాళికిన్. 129

ద్రోణపర్వమునందు:—

ఉ. అంగదనాథు మ్రింగినవృకావలి దన్వెసఁ జుట్టుకొన్న స
ర్వాంగములుం జలింప బెగడందుచు దిక్కులు చూచుచున్న సా
రంగియ పోలె నుండెఁ గురురాజ భవత్సుతసేన భీష్మ నా
జిం గబళించి పాండవులు జృంభితవిక్రమలీలఁ బొల్చుటన్. (1-17) 130

### 3. ప్రాదియతులు: ఉపసర్గలు

శ్లో. ప్ర పరా ప్రతి ప ర్యత్య ధ్య భ్యవానూప సం స్వప (పాః),
ని వి ని ర్దు రుద ప్యాజిత్యుపసర్గా స్తు వింశతిః.

ప్ర, పరా, ప్రతి, పరి, అతి, అధి, అభి, అవ, అను, ఉప, సమ్, సు, అప, ని, వి, నిర్, దుర్, ఉత్, అపి, ఆజ్, ఇవి యిరువదియును నుపసర్గలు.

వ. ప్రకారోపసర్గం బాది యగుటం జేసి ప్రాదు లనం బడును. 131

తే. ఆంధ్రమునకుఁ జేరని[3]పరాజపులు మూఁడు, గాక తక్కినయుపసర్గకములతలల
స్వరము లతికిన వాని కవ్వలను నిలుచు,నచ్చయిన హల్లయినఁ బ్రాదియతి యనంగ.

తే. అబ్జయోని రజోగుణప్రాప్తిఁ దనరుఁ, బద్మనాభుఁడు సాత్త్వికప్రాప్తిఁ దనరు
రజతగిరిమందిరుఁడు తమఃప్రాప్తి దనరు, ననఁగ నిబ్భంగిఁ బ్రాదుల కమరుయతులు.

వ. కడమయుపసర్గములకు అన్నిటికిన్నీ ఇటువలెనే రెండున్నూ జెల్లు నని తెలుసుకొనేది.

1. వేదండమండల చండమండవిధారణాసి (సూ). 2. మున్నగనేచి. 3. పరా-ఆజ్-అపి-పరాజపులు. (రా).

## 4. నిత్యసమాసవిశ్రాంతులు

తే. ఒక్కసమసనమున శబ్దయుగము గూడి, పదము లేర్పాటుగాఁ గానఁబడని ప్రాణ
సంధులకు నిత్యసమసనశ్రాంతులును న,ఖండవిశ్రమములు నన రెండుఁ జెల్లు. 135

క. లోకంబునఁ గర్ణాటవ, నౌకోద్వీపాంతరీపనాస్తిపదార్థా
నేకానోక్యన్యజనార్దన, నాకాదులు నిత్యసమసనము లండ్రు బుధుల్. 136

వ. ఆదిశబ్దముచేత మందారనారికేళశబ్దాదులు మరిన్ని అనేకములు గలవు. 137

కర్ణాటకశబ్దమునకు రామాయణమునందు:—

శా. లాటీచందనచర్చ చోళ [1]మహిళాలావణ్యసామగ్రి క
ర్ణాటీగీతకళాసరస్వతి కళింగాంతఃపురీమల్లికా
వాటీమంజరి గౌళవామనయనాపక్ష్మీజహారాళియై
పాటింపం దగు నీదుకీర్తి రథినీపాలాగ్రణీ సాహిణీ. (కిష్కిం. 826) 138

శ్రీనాథుని[2]వీధినాటకమునందు:—

మ. కుసుమం బద్దినచీరకొంగు వొలయం గ్రొవ్వారు[3]పాలిండ్లపైఁ
ద్రిసరంబు ల్వొలుపార వేణి యవటూదేశంబుపై రాయఁగాఁ
బస నెవ్వాఁడో యొకండు రాత్రి రతులం బల్గాసి గావించిన
న్వసివాళ్వాడుచు వచ్చుచున్నయది కర్ణాటాంగనం గంటిరే. 139

వ. వనౌకశ్శబ్దమునకు;—వనే కాననే, ఓకః స్థాన మస్యేతి వనౌకాః. 140

అథర్వణాచార్యుల విరాటపర్వమునందు:—

క. శ్రీకంఠుఁ డెదురునపుడు వ,నౌకోధ్వజ మింద్రమకుట మర్జునతురగా
నీకము దివ్యశతాంగము, నా కవ్వడి కబ్బియున్న నతఁ డే మగునో. 141

వ. దానియందు.

క. ఆ కర్ణదురాలాపము, లాకర్ణింపఁగ నసహ్య మై ద్రోణునితో
నాకనదీసుతుఁ డనియె వ,నౌకోధ్వజ మెఱుఁగ వచ్చునదరుఁ జూపి తగన్. 142

ద్వీపశబ్దమునకుఁ గావ్యాలంకారచూడామణియందు:—

ఉ. ద్వీపులఁ ద్రుంచువిశ్వజగతీపతి యుత్తమశక్తిజాంబవ
ద్వీపమునందు గోవులకు నిమ్ముగఁ జేయుటయుం బ్రసన్నయై
గోపతిధేను నవ్విభునకుం దన వైభవ మిచ్చెఁ గాక యే
భూపతు లీ వదాన్యగుణబుద్ధిఁ బ్రసిద్ధి వహించి రుర్వరన్. (7-65) 143

1. వనితా. 2. చూ. క్రీడాభిరామము. 86 పద్యము. పాఠభేదము లున్నవి.
కుసుమంబెట్టిన ... రాత్రి సురత ప్రౌఢిం దనుం దేల్చినన్. (రా). 3. పాలిండ్ల.

నైషధమునందు:—

సీ. పా. వ్రితతతనవద్వయద్వీపనానాజయశ్రీవధూటీసమాశ్లిష్టభుజుఁడు.(1-44) 144

వ. అంతరీపప్రతీపశబ్దములకున్ను ఇటువలెనే. 145

నాస్తిపదమునకు శృంగారషష్ఠమునందు:—

సీ. గీ. తల్లియును దండ్రి దైవంబు తలఁప గురుఁడ
కాఁడె యితఁడేమి చేసినఁ గనలఁ దగునె
నాస్తికాధము యోరి యన్యాయవృత్తి
"నాస్తి తత్త్వం గురోః పర" మ్మనఁగ వినవె. 146

విష్ణుచిత్తీయమునందు:—

శా. ఆ నిష్ఠానిధి గేహసీమ నడురే యాలించిన న్స్త్రోత్రియు లెం
తే నాగేంద్రశయానుపుణ్యకథలుం దివ్యప్రబంధానుసం
ధానధ్వానము "నాస్తి శాకబహుతా, నాస్త్యుష్ణతా, నాస్త్యపూ
పో, నాస్త్యోదనసౌష్ఠవం చ, కృపయా భోక్తవ్య"[1]మన్పలుక్కులున్. (1-84)

పదార్థశబ్దమునకు [2]సాంబవిలాసమునందు:—

తే. హాలికి నెదు రేఁగి సకలపదార్థములు ను, పాయనము వెట్టి నీముద్దుపట్టితోడ
జాంబవంతుని దౌహిత్రు, శౌరిపుత్రు, సాంబు నొప్పించి బ్రతికించు సకలజనుల. 148

భాస్కరశతకమునందు:—

ఉ. దక్షత లేనియింటికిఁ బదార్థము వేల్లకచోటనుండి వే
లక్షలు వచ్చుచుండినఁ బలాయనమై చనుఁ గల్ల గాదు ప్ర
త్యక్షము వాగులు న్వఱద లన్నియు వచ్చిన నీరు నిల్చునే
యక్షయమైన గండి దెగినట్టి తటాకములోన భాస్కరా. 149

అనేకశబ్దమునకు విష్ణుచిత్తీయమునందు:—

క. తునియలు లొత్తిమి యఁట పదు, నైనమం డ్రఁట మోచువా రనేకపకిటికరా
ర్మనగాహు లేటి లావరు, లని తావక బాహు వొకటి యవని భరించెన్. (1-35

కాళహస్తిమాహాత్మ్యమునందు:—

ఉ. తాను గుమారజంగమసుధాకరమౌళియుఁ గూడి మాడి యిం
పైన రతిప్రసంగముల నర్ధనిమీలితనేత్రపద్మముల్
[3]మానని చుంబనం బలర [4]మాటలుసొక్కులు వీడి వీడిపో
నీనికపుంగిలింతలు ననేకవిలాసములుం జెలంగఁగాన్. (1-42) 151

1. మఱబల్కులున్ (ప). 2. దీనికర్త చిత్రకవి వేంకటరమణకవి (రా). 3. మానిత (వా). 4. మాటలసొమ్ములు (అచ్చు).

కర్ణపర్వమునందు:—

ఉ. మ్రొగ్గెడువాహనంబులును మోములు [1]ద్రెళ్ళఁగ జారు వాజులున్
డిగ్గి తొలంగు సైనికు లనేకులు [2]గష్టపుఁబాటు చొప్పడన్
[3]మ్రగ్గసిడంబులుం గులము మాటికి నేటి[4]యెదిర్చి యొంటిపై
మ్రగ్గెడువారునై కురుధరావరుసైన్యము రూపు మాయఁగాన్. (2-355) 152

ఆముక్తమాల్యదయందు:—

చ. మలిచి పయోజకోశములమాడ్కి నొనర్చిన పద్మరాగపుం
గలశపుటెఱ్ఱడాల్బొమిడికంబులతో నపరంజియోడుబి
ల్లల నలవైజయంతముఁ జలంబున గెల్వఁగ దంశితంబులై
నిలిచినభంగి మాడువు లనేకము లుల్లసిలుం బురంబునన్. (1-52) 153

వ. అనాది అనంత అనంగ అనూరుశబ్దములు మొదలైన నఞ్ సమాసముల కన్నిటికిన్ని
ఇటువలెనే రెండునుం జెప్పవచ్చును. 154

అన్యోన్యశబ్దమునకుఁ గావ్యాలంకారచూడామణియందు:—

ఉ. ధన్యుఁడు విశ్వభూవిభుఁడు ధారుణి నేలఁగ భూజనంబు ల
న్యోన్యహితత్వసంపదల నొందిరి దంపతు లింపు నింప న
న్యోన్యసుఖానుకూలతల నోమిరి విప్రులు వేల్పుపిండు న
న్యోన్యసుపుష్టితుష్టికుశలాదుల నొందిరి నాఁడునాఁటికిన్. (7-68) 155

జనార్దనశబ్దమునకు:—

వ. జనా నర్దయతి సుఖయతీతి జనార్దనః. అర్ద గతౌ యాచనే చ. 'విష్వక్సేనో జనా
ర్దన' ఇత్యమరః.

సాంభవిలాసమునందు:—

చ. శరధిసుతాకళత్ర నవసారసనేత్ర బలాంతకాదిని
ర్జరనుతనామ పాతకవిరామ విహంగమయాన చారుక
ర్బురపరిధాన పాండవవిరోధివిభంజన నిర్మలాత్మ కా
యరుచిజితాభ్ర[5]ఖంజన జనార్దన కైటభదైత్యమర్దనా. 156

ఆరణ్యపర్వమునందు:—

చ. నగినగియేనియు న్నీను జనార్దన యెన్నఁడు బొంకు వల్కమ
త్యగణితవిక్రమోరుబలధైర్యసమగ్రుల [6]మట్లుగాక కా
లగతిఁ దొలంగఁ ద్రోవఁగఁ దలం బగునే యగుఁ గాక నీకు మె
చ్చుగ నిదె ప్రాణ మిచ్చెదము స్రుక్కము చావున కాత్మ నేమియున్.(4-397)

1. వాడఁగ వాహనంబులన్ (సూ). 2. కష్టపుఁజొప్పు (సూ). 3. మ్రొగ్గ... మూఁటికి (ప); తగ్గు...తమ్ముఁదలంచియెదిర్చి (సూ). 4. యదిర్చి. 5. భంజన (పూ. ము. 1859, 1901). 6. మెల్లభంగి (సూ).

వ. నాకశబ్దమునకు, న విద్యతే అకం దుఃఖ మత్రేతి నాకః. 'స్వ రవ్యయం స్వర్గనాక త్రిదివత్రిదశాలయాః' ఇత్యమరః.

గౌరరాజుచాటుధారః:—

ఉ. [1]ప్రాకటదర్పులై సకలరాయని లక్కనృపాలు నాజిలోఁ
దాఁకువిరోధిసైన్యము ముదం బొదవ న్వరియింప వచ్చుచో
నాకస మెల్లఁ గ్రమ్ముకొను నంచితదివ్యవిమానసంచర
న్నాకవిలాసినీచరణహంసకభూరిఘుణఘుణధ్వనుల్. 158

విరాటపర్వమునందు:—

క. మును వెఱతు నేయ మీరలు, నను నేసినఁ గాని యనుడు నాకేశసుతుల్
ధనురాచార్యుఁడు డెబ్బది, సునిశితబాణముల నేసెఁ జూపఱు వొగడన్.(5-124)

కావ్యాలంకారచూడామణియందు:—

క. నీకరవాలము పాలై, నాకంబున కేఁగి [2]రాజ నారాయణ యా
భూకాంతు లెట్టిచనవో? నాకవిటోత్తములఁ దూల నడఁతురు కడిమిన్. (7-66)

వ. నఞ్ సమాసశబ్దము లెన్నియున్నా అన్నిటికిన్ని ఇటువలెనే అని తెలుసుకొనేది.

విశ్వామిత్రశబ్దమునకు రంగనాథుని రామాయణమునందు:—

ద్వి. ఎక్కడా గురుఁడని యెఱుఁగనినీకు,నక్కటా గురుఁడు†విశ్వామిత్రుఁ డయ్యె.

రామాయణమునందు:—

మ. హరకోదండవిఖండనుండు జనకక్ష్మాధీశుజామాత భా
స్కరవంశాగ్రణి జానకీప్రియుఁడు విశ్వామిత్రయాగాహితా
సురసంహారి విరాధకాలుఁడు ఖరాసుధ్వంసి మారీచసం
హరుఁ డన్యప్రమదాపరాఙ్ముఖుఁ డయోధ్యానాయకుం డాదటన్. (సుం. 263)

ఆపోశనశబ్దమునకుఁ జమత్కారరామాయణమునందు:—

క. ఓశశిముఖి లోపాముద్రేశుఁడు కలశభవుఁ డుండు నిట నతఁడు తపో
రాశి మహాత్ముఁడు మును పా,ప్రోశనముగఁ గొనియె సాగరాంబువు లెల్లన్. 163

శృంగారషష్ఠమునందు:—

సీ. గీ. తత్తరమున నాపోశన మెత్తఁ బోయి, భూసురుం డెత్తును త్తరాప్రోశనంబు. 164

స్వాంతశబ్దమునకు శృంగారనైషధమునందు:—

గీ. అధికరోషకషాయితస్వాంతుఁ డైన, నరపతికి విన్నవింపకు నాయవస్థ
పైత్యదోషోదయంబునఁ [3]బరుస నైన, [4]జిహ్వకును బంచదారయుఁ జేఁదుగాదె. (2-82)

---

1. ప్రాకటదర్పతల్ (మూ). 2. రాజనారాయణ. † పాణినీయము ననుసరించి విశ్వ+ అమిత్ర అని విడఁదీయరాదు. విశ్వశబ్దమునకు దీర్ఘ మగును. 3. పరుస. 4. జిహ్వకకు.

విరాటపర్వమునందు:—

ఉ. స్వాంతము బాహుగర్వఘనసంతమసాంధముగాఁగ శంకయా
వంతయు లేక కీచకుఁ డహంకృతి ముంగలినాగమంట పా
భ్యంతరసీమఁ జొచ్చి దరియంజని యారసి సెజ్జఁ గాంచి య
త్యంతముదావహం బగుడు నందు రయంబునఁ గేలు సాఁపఁగాన్.(2-331) 166

ఏకాంతశబ్దమునకుఁ బారిజాతాపహరణమునందు:—

ఉ. అంతట నొక్కనాఁడు ధవళాంబుజనేత్రుఁడు వచ్చి రుక్మిణీ
కాంతగృహంబులోన శశికాంతశిలామయవేదిమీఁద నే
కాంతమునందుఁ గొందఱు మృగాయతనేత్రలు గొల్వ జూద మ
త్యంతవినోదకేళిమెయి నాడుచు నుండఁగ నద్భుతంబుగాన్. (1-43) 167

ఆదిపర్వమునందు:—

సీ. గీ. [1]కామసుఖసంగములకు నేకాంతగృహముఁ, బోలిచిసొలిచియుధర్మార్థములకునిదియ
యాస్పదంబన వర్గత్రయానురమ్యులైనజనుల కెంతయు నొప్పు నప్పురంబు(8-74)

వ. సిద్ధాంతరాద్ధాంత లతాంత ప్రాంత నిశాంతాదిశబ్దముల కన్నిటికిన్ని ఇటువలెనే
రెండున్ను నడచును. 169

వ. నారాయణశబ్దమునకు, నారాః ఆపః అయనం స్థాన మస్య నారాయణః 'విష్ణు
ర్నారాయణః కృష్ణః' ఇత్యమరః.

ఆదిపర్వమునందు:—

ఉ. పాయక పాకశాసనికి భారతఘోరరణంబునందు నా
రాయణునట్లు [2]దానును ధరామరవంశవిభూషణుండు నా
రాయణభట్టు వాఙ్మయధురంధరుఁ డీ కృతి కిష్టుఁడు న్సహా
ధ్యాయుఁడు నైనవాఁ డభిమతంబుగఁ దోఁడయి నిర్వహింపఁగాన్. (1-25) 170

వాతాయనశబ్దమునకుఁ జారుదేష్ణచరిత్రమునందు:—

గీ. అచ్చరలు నందనంబునఁ దెచ్చుకొనుసు,రాగసుమములు హర్మ్యవాతాయనముల
చెంతఁ గా లూఁది తత్పురస్త్రీల కొసఁగి, వేఁడికొని పోవుదురు కప్రపీడియములు.

విరాటపర్వమునందు:—

సీ. పా. తరుణులుఁబతులువాతాయనమ్ములనల్లమలయు వేఁటోకలమలయపవను.(2-238)

ఉపాయనశబ్దమునకు సుదక్షిణాపరిణయమునందు:—

చ. వలఁ బడి యున్న జక్కవకవం బురుణించుచు సన్న పైఁటలో
పల బిగిగుబ్బదోయి కనుపండువు సేయఁగ మోడ్పుఁజేతు లొ

---

1. కామసంభోగసుఖపదేకాంతగృహముఁ, బోలి పొలిచియు......బంధు,లగు
జనుల కెంతయు నొప్పునప్పురంబు. (అచ్చుప్రతిలోఁ బాఠాంతరము). 2. వానస(సూ).

దలను ఘటించి మ్రొక్కిడి పదంపడి మెల్లన డాయఁబోయి తో
య్యాలి విరిబంతి దోయిట నుపాయన మాయన కిచ్చి యి ట్లనున్. 173

అష్టమహిషీకల్యాణమునందు:—

ద్వి. ఇంతులమేల్బంతియిడినసేవంతి, బంతిచేదోయి నుపాయన మిచ్చి. 174

రసాయనశబ్దమునకు ననంతుని ఛందమునందు:—

ఆ. నాస్తి యనక మహి ననంతసంపదలు నా,రాయణుం డొసంగు రమ్య మగుర
సాయనంబు బుధుల కతఁ డన నిత్యస,మాసయతులు రెండి నంటియుండు.(1-21)

జైమినిభారతమునందు:—

సీ. గీ. మట్టిమాత్రంబె పిల్లలమట్టిపేరు, పేరువలెఁ గాదు శారదాపీఠకంబు
వారిలోపలఁ బినపీరువాక్యసరణి, సరసులకు నెల్లఁ గర్ణరసాయనంబు. (1-22)

రామాయణశబ్దమునకు రాఘవపాండవీయమునందు:—

ఉ. ఏయెడ నర్థగౌరవసమృద్ధియు శబ్దవిశుద్ధియుం [1]దిరం
బై యనవద్యతం బరఁగ నంధ్రవచస్థ్సితి భారతంబు రా
మాయణముం రచించిన మహాత్ముల నాత్మఁ దలంచెద న్జగ
ద్గేయుల నన్నపార్యునిని [2]దిక్కన నెఱ్ఱన భాస్కరాఖ్యునిన్. (1-4) 177

జైమినిభారతమునందు:—

తే. మానిజల్పిత మైన రామాయణంబు, స్వరలయగ్రామమూర్ఛనాసరణు లెఱిఁగి
గానశక్తులు మెఱసి సాక్షాత్కరింపఁ, బాడిరాలాపములఁద్రిస ప్తములుమట్ట.(6-96)

వ. పరాయణ, పలాయన, బాదరాయణ, సాంఖ్యాయన, శాకటాయన, కాత్యా
యన, వాత్స్యాయన, బోధాయన, దక్షిణోత్తరాయణాదిశబ్దములకున్ను ఇటు
వలెనే రెండున్ను గలవు. 179

మార్తాండశబ్దమునకు శృంగారషష్ఠమునందు:—

సీ. గీ. వలవదు భయంబు వా రెంతవార లైన, నట్టివారలు మన కగ్గ మైనవారు
వారు నిరయంబునకుఁ గాఁపు వచ్చువార,లనుచు బుద్ధిగఁ జెప్పె మార్తాండసుతుఁడు.

ద్రోణపర్వమునందు:—

మ. ధరణీచక్రము దిర్దిరం దిరిగె మార్తాండుండు కుంభీభవ
త్కిరణుం డయ్యె దిశావితానము వడంకె [3]న్మి న్నదర్చెన్మహి

---

1. దృఢంబై (ప). 2. దిక్కనసుధీమణి నెఱ్ఱసత్కవిన్ (అచ్చుప్రతి).
3. న్మిన్నదిర్చెన్ (వా); న్మిన్నుమ్రోసెన్ (ప).

ధరసంతానము లోన గ్రక్కదలె [1]నుద్భ్రాంతంబులై యంబుధుల్
పొరలెన్గట్టులమీఁద బెట్టుపిడుగుల్ [2]మ్రోసెన్నితాంతధ్వనిన్.(5-377) 181

వ. బ్రహ్మాండాది శబ్దములకును ఇటువలెనే అచ్చును హల్లును జెప్పఁదగును. 182

ఉపసర్గసంధికిఁ జంద్రికాపరిణయమునందు:—

ఉ. అంతట రుక్మబాహువసుధాధిపనందన యొక్కనాఁడు శు
ద్ధాంతగృహంబు వెల్వడి విహారరతిం జనుదెంచె నెచ్చెలుల్
చెంతలఁ గొల్వ గుంజదళిశింజితరంజితకుంజమంజుల
ప్రాంతగళత్ఫలాసవరతాంగజఘోటికిఁ బుష్పవాటికిన్. 183

కవిజనాశ్రయమునందు:—

ఉ. మానుగ విశ్రమాక్షరసమంచితమై స్వర మూఁదినం దదీ
యానుగుణాక్షరంబ కొనిరైనను జెప్పఁగ నొప్పు నీక్రియన్
భానుసహస్రభాసి వృషభాధిపుఁ డన్నటు లర్థయుక్తమై
పూనినచో నఖండవడి పొల్పగు నాదికవిప్రణీతమై. (సం. 66) 184

వ. ద్వారశబ్దమునకు, ద్వే అరే పార్శ్వే యస్య తత్ ద్వారమ్. 'పృషోదరాదీని యథోపదిష్ట' మితి సూత్రేణ ద్విశబ్దాంతస్య ఇకారలోపః. అకారాదేశః.

ఉ. వారక వారకామినుల వర్తులచారుకుచోపగూహముల్
గోరక కోరకోల్లసితకుంజములం జిగురాకుపానుపుల్
చేరక చేరకేరళకళింగకుళింగనరేంద్రమందిర
ద్వారవిహారులై సిరుల నందక నందకపాణిఁ గొల్వరో. 185

హల్లులకు నిర్వచనోత్తరరామాయణమునందు:—

ఉ. వారలు వారి భూరిపరివారముతోన విమాన మెక్కి రాఁ
గా రఘునందనుం డరిగి కాంచనతోరణ[3]చిత్రమై నవ
ద్వారనికాయమైన నిజపట్టణ ముత్సుకవృత్తిఁ జొచ్చె నిం
డారు ముదంబున [4]న్భరతునాకృతి బాలిశవృత్తిఁ గ్రాలఁగాన్. (1-84) 186

## క్యజ్ప్రత్యయాంతములు

వ. కుమారవదాచరితా శక్తిః కుమారాయితశక్తిః. కుమారాయితయా శక్త్యా శాలత ఇతి కుమారాయితశక్తిశాలీ. కుమారసమాన[5]పరాక్రమద్యోతవా నిత్యర్థః.

---

1. నుత్క్రాంతంబులై (ముద్దరాజు రామన్నకవిసంజీవని.) 2. మ్రోసెన్నమో ఘోగ్రతన్; మఱికొన్ని పాఠభేదములును గలవు. 3. చిత్రమైన తద్ద్వార; చిత్రితోన్నతద్వార. 4. భరతుఁ డాదృతిఁ జేసి సలీలఁ గ్రాలఁగాన్. ముద్రితపాఠము. 5. పరాక్రమవానిత్యర్థః (సూ).

ఆదిపర్వమునందు:—

ఉ. ఆయము గర్వము న్విడిచి యన్యపతు ల్పనిసేయ నిట్లు గాం
గేయభుజాశ్రయంబున నిక్ర్పత్తవిరోధిసమాజుఁడై కుమా
రాయితశక్తిశాలి ధృతరాష్ట్రుఁడు రాజ్యము సేయుచుండె న
త్యాయతకీర్తితోఁ దనకు హస్తిపురంబని రాజధాని గాన్. (5-6) 187

వ. భద్రవదాచరితా మూర్తి ర్యస్య తత్ భద్రాయితమూర్తిః శోభనమూర్తిమదితి యావత్. ఆయ మపి క్యజ్ ప్రత్యయాన్తః.

విరాటపర్వమునందు:—

ఉ. శ్రీయన గౌరి నాఁ బరఁగు [1]చెల్వకుఁ జిత్తము పల్లవింప భ
ద్రాయితమూర్తియై హరిహరం బగురూపము దాల్చి "విష్ణురూ
పాయ నమశ్శివాయ" యని పల్కెడు భక్తజనంబు వైదిక
ధ్యాయిత [2]నిష్ఠఁ బొల్చుపరతత్త్వము గొల్చెద నిష్టసిద్ధికిన్. (1-1) 188

వ. ఈ రెండు పద్యములయందున్ను నన్నయ తిక్కనగార్లు కుమారభద్రశబ్దములు క్యజ్ ప్రత్యయాంతములు చేసి సంయుక్తవిశ్రామంబులుగాను బ్రయోగించిరి. అది గానక కొంద ఱా రెండు శబ్దములమీఁదనున్ను, ఆకారము లున్నవి నిత్యసమాసవిశ్రాంతు లని భ్రమయుదురు. శబ్దసూత్రమువలన వానికే దీర్ఘములు వచ్చినవి గాని అందులోపల అత్తులు లేవు. 189

## ౫. దేశ్యనిత్యసమాసవిశ్రాంతులు

తే. శబ్దశాసనముఖకవీశ్వరకృతప్ర, బంధముల లక్ష్యములఁ గనుపట్టుకతన
దేశ్యనిత్యసమాససంధికిఁ బొసంగు, వడి స్వరం బైన వ్యంజనవర్ణ మైన. 190

క. రూపఱ, బెంపఱఁ బెల్లఱ, సేపఱచుట గ్రిక్కిఱియుట నిలఁ గ్రచ్చఱయుం
జూపఱ యుక్కఱ మొదలుగ, క్ష్మాపతి [3]యివి దేశ్యనిత్యసమసనపదముల్. 191

వ. కొందఱు వీనిపేరే దేశ్యాఖండములున్ను అందురు. 192

అనంతునిఛందమునందు:—(1-101.)

తే. [4]అఱ ననంగను బోవుట కర్థ మైన, సంధి నిత్యసమాసోక్తి జరుగు రెంట
నసురవీరుల లెల్ల నుక్కఱ వధించె, భానుకులుఁడు రావణుని [5]సేపఱచె ననఁగ.

ఆరణ్యపర్వమునందు:—(6-345)

క. ఎఱకలు గల కులశైలము, [6]తెఱఁగు మెఱయ నంత నతఁడు దివికి నెగసి బి

---

1. చెల్వల చి. 2. కిచ్చమెచ్చు. 3. దేశీయనిత్య (సూ.) 4. అఱయనం గను (శి). 5. సేపఱిచె. (సూ). 6. తెఱఁగున మైరయము మెఱయ దివికి తెఱఁగు మెఱయ రయము నెఱయ. శ. ర. పాఠము.

ట్టుఱుము జలధరము క్రియ నుక్కఱఁ దద్వనమెల్ల నద్రువ న్నార్చుచుఁ గడిమిన్.

యుద్ధకాండమునందు:—

చ. ఎఱిఁగియెఱింగి ము న్నతఁడె యె గ్గొనరించినదానికై కదా
చెఱఁ గొని వచ్చితిం బిదప సీత వృథాకథ లింక నేల పెం
పఱ బ్రతు కింత లేయనె ఖరాదులచావున కేమి చింత నీ
మఱఁదలిబన్న మే పగిది మానిని యీఁగుదు సంధిఁ జేసినన్. (784) 195

వసిష్ఠరామాయణమునందు:—

ఉత్సాహ. మఱియుఁ బెక్కుయోనులందు మహితచిత్రగతులఁ బెం
పఱ జనించి దుఃఖభాజియై చరించి పెండియుఁన్
వఱలు విప్రవరునియింట వాసుదేవుఁ డనఁగఁ దా
నెఱుక గలిగి పుట్టె వేల్పుటేటితీరభూములన్. (3-24) 196

విరాటపర్వమునందు:—

చ. చిఱునగ వొప్ప గాండివము చెచ్చెర సజ్యముఁ జేసి సేన లు
క్కఱ రథసంబుపై నడరఁ గవ్వడి ద్రోణియు [1]సిడఁబోక య
త్తఱిఁ దఱుమంగ నస్త్రములు దందడిఁ దార్కొని మండుచుండెఁ జి
చ్చఱపిడుగు ల్వడిం దొరఁగుచాడ్పున నంబరవీథి నుగ్రమై. (5-143) 197

లక్షణసారసంగ్రహమునందు:—

తే. అచ్చుహల్లునుదేశీయ మనియెడి వడి, యెన్న నొక్కొక్కచోట గ్రిక్కిఱిసెఁగృతుల
సరసలక్షణకవులు గ్రచ్చఱనొనర్ప, భంజితాసురసముదాయ యాంజనేయ. 198

నిర్వచనోత్తరరామాయణమునందు:—

చ. ఎఱుఁగవుగాక భోగముల కెల్లను నెచ్చెలి [2]జవ్వనంబ య
త్తఱి నుడివోవకుండ నుచితంబుగ జక్కవదోయిఁ బోలి క్రి
క్కిఱిసినచిన్నిచన్నుఁగవ యిం పెసలారఁగ నాదు[3]వక్షమ
న్వఱలు సరోవరంబున నవారణకేళి యొనర్చు కోమలీ. (5-14) 199

ఆరణ్యపర్వమునందు:—

చ. ఎఱిఁగితి నిన్ను నేను విబుధేంద్రుఁడ వీవు జగత్త్రయంబు గ్ర
చ్చఱ భవదీయరక్షణము[4]నందఁ వెలుంగుచునుండు నట్టి ని
న్నుఱువుగ నేను వేఁడుకొన నుత్తుఁడఁ గాక మొఱంగి నన్ను న
క్కఱపడి నీవు వేఁడు టిది కర్జమె నిర్జితదైత్య చెప్పుమా. (7-367) 200

1. సిడు వోక. పూ. ము. 2. జవ్వనంబు నిత్తఱి. 3. చిత్త. 4. నంది.

ఉద్యోగపర్వమునందు:—

చ. తఱి యగునంతకు న్రిపునదగ్రత నైచుట నీతి నీవు నా
కఱపినయట్లు సేయుము తగం జని యాతనిఁ గాంచి [1]నన్ను నె
త్తెఱఁగుననైనఁ బొందఁగ మదిం గలదేనియుం నింత యేల క్ర
చ్చఱ మునివర్గవాహనుఁడవై చనుదె మ్మను మంతఁ దీఱెడున్. (1-176) 201

... ... ... ... ... ...

ఉ. నన్నయముఖ్యసత్కవిజనంబులకావ్యములందు లేఖకుల్
గొన్నియుఁ బాఠకాధములు గొన్నియుఁ బోకడఁ బెట్టఁ దక్కువై
యున్నెడఁ గాంచి జానపదు లోడక దిద్దిన తప్పుత్రోవ లె
ల్లన్నిజ మంచుఁ గైకొనిన లక్షణవేత్తలు సమ్మతింతురే. 202

వ. అది యె ట్లనిన సులక్షణసారంబునందు లింగముగుంట తిమ్మన వ్రాసిన యప్రశస్తంబు లగు లక్ష్యంబులకు నాశ్చర్యంబు నొంది బహుపుస్తకంబులు నిరీక్షించి వానినెల్లను బ్రక్షిప్తంబులుగా నెఱింగినవాఁడనై లక్షణవంతంబులగు పురాతనకవిప్రోక్తంబులు వివరించెద. 203

ఆదిపర్వమునందు:—

క. నా వచనమున నపత్యము, గావించును నీకు గొంతి కడు నెయ్యమునన్
నీవగచిన యాయర్థము, నూవె మనంబున [2]దలంతు సుందరి యెపుడున్.(5-135)

ఉద్యోగపర్వమునందు:—

క. తమతండ్రి భంగి నీకును, సముచితముగ భక్తిఁజేసి సజ్జనసుతమా
ర్గమునను [3]జరియింపంగా, నమలమతీ కన్నకొడుకుల ట్లరయఁ జనున్. (2-74)

ఆనుశాసనికపర్వమునందు:—

క. అతిథి నినుఁ గోరెనేనియుఁ, మతిఁ గింకిరిపడక యోల మూస పడక నీ
పతనికిఁ బ్రియంబు సలుపుము, సతికిం బతిపనుపు సేయఁ జను నెల్లవియున్.(1-68)

రామాయణమునందు:—

ఉ. అన్నవు తండ్రియట్ల విను మంతియ కా దటమీఁద రాజ వే
మన్నఁ గొఱంత లేదు [4]మణిహారము లాదిగఁ బెక్కుకానుక
ల్మున్నుగ సీత నిచ్చి జనలోకపతిం గని మమ్ముఁ బ్రోవు మీ
సన్నపుకార్యము ల్వలదు సంధియ మే లటు గాక తక్కినన్. (యు. 142)207

1. నన్ను (వా. ప.) 2. తలంచుచుండుదు నెపుడున్. 3. జరియింపఁగనమ, లమతీ నీకన్నకొడుకు. 4. మణిమండన ముఖ్యములైన కానుకల్... ఇవి యఖండ వడి గల ప్రాచీనపాఠములు (రా.)

మఱియు, దానియందే:—

ఉ. ఓకపివీరులార సుగుణోదధి నీ రఘురాము సర్వలో
కైకశరణ్యునిం [1]గొలువ నిప్పుడు వచ్చితి నొండు గాదు నా
రాక మహాపరాధి యగు రావణుతమ్ముఁడ నే విభీషణా
ఖ్యాకుఁడ మీరు నా సచివు లర్కకులాగ్రణితోడఁ జెప్పరే. (యు. 165) 208

దేవకీనందనశతకమునందు:—

మ. చతురంభోధిపరీతభూవలయ[2]రాజన్యాలికోటీరరం
జితమాణిక్యవిరాజితచ్చరణరాజీవుండు ధర్మాత్మజుం
డతికార్పణ్యముతోడ మత్స్యపతిఁ దా నాసింపఁడే [3]నీదుశా
శ్వతకారుణ్యము గల్గునంతకును గృష్ణా దేవకీనందనా. 209

ఆరణ్యపర్వమునందు:—

చ. ఉరమున రెండు గన్నులు పృథూదరదేశమునందు నోరు ప్ర
స్ఫురితభుజద్వయంబును [4]సముజ్జ్వలదున్నతభావముం గరం
బరుదుగ నుగ్రమైన వికృతాకృతితోడ నశేషసత్త్వ[5]సం
హరుఁ డగుచున్నవాని దివిజారిఁ గబంధుని గాంచి రచ్చటన్. (6-357) 210

ఉద్యోగపర్వమునందు:—

చ. అని మది నిశ్చయించి తగ నందఱఁ బిల్వఁగఁ బంచి వారితో
ననిచినమాటలాడి వినయంబునఁ బ్రార్థన చేసి మీరు మా
కొనరినసైన్యము ల్పదునొకొంటికిఁ బ్రాభవ మాచరింపఁజొ
చ్చిన సకలంబు నొప్ప నభిషేకముఁ గైకొనుఁ డుత్సవంబునన్. (4-140) 211

వ. దీని మూఁడవ పాదంబునందు "పదునొకొంటికి" నని యున్నచోట సంధిగూర్చి స్వరప్రధానవడిగాను సోమయాజులు ప్రయోగించినారు. ఇది తెలియక కొందఱు మూఢులు దేశ్యనిత్యసమాసవడి యని యనుకొందురు. 212

## 6. నిత్యయతులు

క. ఏని యనునాంధ్రశబ్దముతో నలికిన పూర్వపదముతుదివ్రాయికి న
చ్చైనను వ్యంజనవర్ణం, బైన రచింపుదురు నిత్యయతు లనుచుఁ గవుల్. 213

శేషధర్మములయందు:—

క. పెట్టఁడు నారకమార్గం, బెట్టి మహాక్రూరకర్ముఁ డేనియుఁ దుద ని
ట్టట్టనక నెమ్మనంబున, నెట్టన హరి దలఁపు గలిగెనేని మహాత్మా. 214

---

1. గొలువఁగా నిటవచ్చితి (రా). 2. రాజానీక (రా). 3. తావకాయత (ప). 4. (గులభూమిధరోన్నత (పాఠాంతరము). 5. ఘస్మరుఁడగు (రా).

## 7. రాగమసంధివళులు

తే. అలను పదంబుమొదలను రాగమంబు, వచ్చుసంధికి నుభయంబు వళికిఁ జెల్లు
నళివ జవరాలు [1]బాలెంతరాలు ముద్దరాలు ధర్మాత్మురా లన రాజసారి. 215

మనుచరిత్రమునందు:—

ఉ. ఇంతలు కన్నులుండఁ దెరు వెవ్వరి వేఁడెదు భూసురేంద్ర యే
కాంతమునందు నున్న జవరాండ్ర నెపం బిడి పల్కరించులా
గింతియె కాక నీ వెఱుఁగవే మును వచ్చినత్రోవ చొప్పు నీ
కింత భయంబు లే కడుగ నెల్లిద మైతిమె మాట లేటికిన్. (2-41) 216

చారుదేష్ణచరిత్రమునందు:—

క. ఈ లలన వేలుపుంజవరాలో యచ్చరయొ కిన్నరవధూమణియో
వ్యాళాంగనయో కాకీ, భూలోకస్త్రీల కిట్టి పొంకము గలదే. 217

## 8. విభాగవళులు

క. తులసీభూషణ సంఖ్యకుఁ, దెలుఁగునఁ బరిమాణసంజ్ఞ దేటపఱచుప
ట్టుల నేసి యను పదమునకు, నలరు విభాగవడి యనఁగ నచ్చును హల్లున్. 218

కాశీఖండమునందు:—(2-104)

తే. అప్పటికి నియ్యకొంటిఁ గా కంబుజాక్షి, ఋషులపాలిటివే యింతలేసిపనులు
కొతుక కాఁబోతు నాఁబోతుఁ గ్రమ్మలాడ, నడిమియాఁబెయ్య దెస వచ్చె నాకుఁజూడ.

కావ్యచింతామణియందు:—

ఆ. కృష్ణుఁ డిచ్చు నాలుగేసిచీరలు కూర్మి, నింతులకును నాలుగేసిమణులు
త్రీవితోడ దోసెఁ డేసిమాడలు కడు, నిం పెసంగ గంపెఁ డేసి సొమ్ము. 220

## 9. నామాఖండవిశ్రమములు

ఆ. అప్ప అయ్య అన్న [2]అరు సవ్వ అమ్మక్క, అయి యనుపదంబు లదుకుసంధు
లుభయమునకుఁ జెల్లుచుండు నామాఖండ, వళు లనంగ నూఁదఁబడక యైన. 221

అప్ప యనుటకు నందితిమ్మిన చాటుధార:—

క. ఇప్పటిదాతల సరిగాఁ, జెప్పకురా భట్ట కర్ణశిబిఖేచరులన్
జెప్పుము మూర్తిఘనుని వెంకప్పకు దానమున నిర్భయంబున సభలన్. 222

---

1. బాలింత (సూ). 2. అరుసు (వా) అరసన్-తమిళశబ్దము రాజని యర్థము(రా).

వాఁళక్కిభాస్కరునిచాటుధార:—

క. అప్పు లిడునతఁడు ఘనుఁ డా, యప్పు డొసఁగి మరలఁ జెందునాతఁడు రాజౌ
చెప్పఁగ వలె సాహిణిమా, రప్పను దానమున ఘనుఁడు ర్రాజు నటంచున్. 223

అన్న యనుటకు పొట్టూరిగోపన:—

క. అన్నలుఁడు రూపమున సిరి, యన్న కళాయుక్తి భరతునన్న కరుణచే
నన్నసముద్రపుపెదచి,న్నన్నకుమారుండు వెంగళామాత్యుఁ డిలన్. 224

తెనాలి రామలింగము:—

క. చిన్నన్న ద్విపద [1]కెఱుఁగును, బన్నగఁ బెదతిరుమలయ్య పదమున కెఱుఁగు
న్మి న్నంది మొరసె నరసిం,గన్నకవిత్వంబు పద్యగద్యశ్రేణిన్. 225

తేలఁబలుకుటకు [2]సింహాసనద్వాత్రింశికయందు:—

చ. అనఘుఁడు సింగనార్యునకు నబ్బయ గోపయమంత్రి చిక్కనా
ర్యనయును గల్గి రాత్మజులు రాములు ముప్వురు దోఁచినట్లు పెం
పున వెలయంగ నబ్బయకుఁ బుత్రులు పుట్టిరి రామరాజుఁ గే
సనయును బాచిరాజు గుణసంగుఁడు లింగనయుం గ్రమంబునన్. 226

అయ్య అనుటకు:—

... ... ... ... ...

కాశీఖండమునందు:—

సీ. గీ. నైషధాదిమహాప్రబంధములు పెక్కు, సెప్పినాఁడవు మాకు నాశ్రితుఁడ వనఘ
యిపుడు చెప్పఁదొడంగిన యీప్రబంధ, మంకితము సేయు వీరభద్రయ్యపేర. 227
(11-3)

ఊఁదఁబడక ఉన్నందునకు ననంతునిఛందమునందు:—

తే. ఒరుల నమ్మయ్య యనుచోట నూఁదఁబడక
ద్వివిధ మగుఁ బ్రభునామాంతవిరమణంబు
మహి నయోధ్యకు రాజు రామయ యనంగ
నతని[3]పట్టంపుదేవి సీతమ యనంగ. (1-120) 228

రుక్మాంగదచరిత్రమునందు:—

ద్వి. శ్రీకరగుణసాంద్ర చిరయశోరుంద్ర
ఆకారచంద్ర రామయభాస్కరేంద్ర. 229

---

1. కెరఁగును (సూ). 2. విక్రమార్కచరిత్రమునందు (సూ). 3. పట్నంపు (వా).

అరుసు అనుటకు ఆంధ్రకవిపితామహుఁడు:—

క. చేపట్టిన ధ్రువు లగుదురు, కోపించిన రంభఁ గూడుకొందురు జగతిన్
స్థాపింపఁ బోడువఁ జాలని, గ్రూపందలు సాల్వ కోన మరుసున కెనయే. 230

పలకలూరి గోపన:—

ఆ. గోలకొండమలక గోవుల భక్షించుఁ, గొండవీటివిప్రకులము నెల్ల
బాచమరుసు చేరి భక్షింపుచున్నాఁడు, మలక మేలో బాచమరుసు మేలో. 231

అవ్వ అనుటకు:—

... ... ... ... ...

అమ్మ యనుటకు ఈవని పెద్దిరాజు రామరాజు చాటుధార:—

క. ఇమ్మహిలో మహనీయగు,ణమ్ముల నీపాటి గలరె నానావిధదే
శమ్ముల శ్రీరామునిసీ,తమ్మా మాయమ్మ నిత్యహర్షము లిమ్మా. 232

క. ఇమ్మా మదభీష్టంబులు, కొమ్మా మామ్రొక్కు లెల్ల గురుమతితో మా
యమ్మా రఘునందనునీ,తమ్మా సౌభాగ్యసిద్ధిదాయిని వమ్మా. 233

అక్క యనుటకు వనకూరి గురువన్న చాటుధార:—

క. ఇక్కలియుగశక్తులలో, లెక్కింపకు భట్ట శంక లేక ధరిత్రిన్
మిక్కిలి మల్లేశునియం,బక్కకు సరివేల్పు గలదె యవనీస్థలిలోన్. 234

క. చొక్కపుశ్రీగిరినిలయుని, మక్కువ మదిలో నెఱింగి మనుజులఁ బ్రోవన్
దిక్కయి నిల్చిన మాయం బక్కకు సరిగలదె సకల భాగ్యస్ఫురణన్. 235

ఆయి యనుటకు రాచపూడి వెంకటయ్య చాటుధార:—

క. వ్యాయామజనితమాయో,పాయసమస్తాఘములు నివారణ మగు దు
ష్కాయంబు పూత మగు గం,గాయిని బొడగన్నఁ దాన మాడినమాత్రన్. 236

శమంతకమణి చరిత్రమునందు:—

ఉ. కాయవచోమనస్స్థలనకల్పితదోషము లెల్లఁ బాయఁగా
నా యెదలోన నిత్యము సనాతనధర్మముఁ బూని యర్మిలిన్
బాయక కొల్తు రామనరపాలనిరంతరసౌఖ్యదాయి సీ
తాయి సమస్తశోభనవిధాయి [1]మహత్ఫలసిద్ధిదాయిఁగన్. 237

1. 'మహాఫలసిద్ధి' అని యుండవలెను. లేకున్న 'మహతాం ఫలసిద్ధిః' అని షష్ఠీ సమాసము చేసికొనియైనఁ దృప్తిఁజెందనగును. (పూ. ము.) మహాఫల (సూ).

## 10. పంచమీవిభక్తివిరామము

ఆ. తత్సమంబుఁ జేయుతఱిని బంచమి [1]నన్న, నంటె ననువిభక్తు లదుకుసంధి
మెలఁగుఁ గృతులఁ బంచమీవిభక్తివిరామ, మనఁగ నచ్చునకును హల్లునకును. 238

చమత్కారరామాయణమునందు:—

క. నిన్నుఁ జెఱఁ గొన్న హైహయు, కన్నన్ దోర్వీర్య మెక్కుడగుభార్గవు లీ
ల న్నిర్జించినరాముని, కన్నను శూరుండు ముజ్జగంబులఁ గలఁడే. 239

ఆదిపర్వమునందు:—

చ. వితతమఖప్రయోగవిధివిత్తము లుత్తమధీయుతు ల్జగ
న్నుతసుమహాతపోధను లనుగ్రహనిగ్రహశక్తియుక్తు లీ
క్రతువున ఋత్విజు ల్కమలగర్భసమానులు పూర్వదిక్పతి
క్రతువున యాజకోత్తముల[2]కంటెఁ బ్రసిద్ధులు సర్వవిద్యులన్. (2-227) 240

## 11. కాకుస్వరవళులు

క. పలుకులతలఁ గలవ్రాలకు, వల నగుచోఁ బ్లుతము నిలిపి వానికి రెండున్
వళులుగఁ జెప్పినఁ గావ్యం,బుల నది కాకుస్వరంబుఁ బ్లుతవళియు నగున్. 241

ఆ. ఏకమాత్రహ్రస్వ మినుమడించిన దీర్ఘ, మయ్యె మూఁడుమాత్రలయినఁ బ్లుతము
భీతిశోకతర్కగీతదూరాహ్వాన, సంశయార్థములను జరుగుఁ బ్లుతము. 242

భీతిప్లుతమునకు భాస్కరునిరామాయణమునందు:—

ఉ. ఏ జనకాత్మజన్ దశరథేశ్వరుకోడల రాముభార్యఁ జుం
డో జనులార యడ్డపడరో సురలార సురారి కంచు నం
భోజదళాక్షి శైలవనభూములు దాఁటుచు భీతి నేఁగుచో
నీజలరాశిఁ జూచి మది నెంత దలంకెనొ యేమి సేయుచున్. (యు. 41) 243

మనుచరిత్రమునందు:—

ఉ. ఎవ్వతె వీవు భీతహరిణేక్షణ యొంటిఁ జరించె దోట లే
కివ్వనభూమి భూసురుఁడ నేఁ బ్రవరాఖ్యుఁడఁ ద్రోవ దప్పితిం
గ్రొవ్వున నిన్న గ్రామమునకుం జనుదెంచి పురంబుఁ జేర నిం
కెవ్విధిఁ గాంతుఁ జెప్పఁ గదవే తెరు వేది శుభంబు నీ కగున్. (అ.2-39) 244

శోకప్లుతమునకు రామాయణమునందు:—

శా. అన్నా లక్ష్మణ నిన్నుఁ బుణ్యనిధి నే నజ్ఞాననై పల్కితి
న్నన్నా పాపము వచ్చి ముట్టుకొనియె న్నాపాలిదైవంబవై

1. కన్న, కంటె (వా). 2. కన్న (సూ).

యిన్నిచుం బరిమార్చ వేగఁ బఱతేవే నన్ను రక్షింపు మీ
యన్నం గ్రక్కునఁ జీరవే యరుగవే యత్యుగ్రశీఘ్రంబునన్. (అర. 2-111)

తర్కఘ్నతమునకు హరిశ్చంద్రోపాఖ్యానమునందు:—

శా. ఓరీ రాజకులాధమా నృపులు లేరో వేఁట రారో మద
క్రూరాభీలమృగావళిం దునుమరో ఘోరాటవు ల్లేవో నా
యారామంబు గలంచి జంతుతతి మాయం జేసి యస్మత్కుమా
రీరత్నంబులు వేఁడ వచ్చినను వారి న్నొంచినా వేమిరా. (2-147) 246

శాంతిపర్వమునందు:—

మ. అనుమానింపక తోఁడఁబుట్టులనె కాద్రా తున్మి తూఁటాడె నెం
దునఁ గ్రొన్నెత్తురు లేఱులై పఱవ నింద్రుం డుగ్రతన్ దైత్యులన్
మును లవ్వీరు భజింపరో క్రతువు లామోదంబుతో నమ్మహా
త్ముని జేయింపరొ యూర్ధ్వలోక మది కాదో నాక మూహింపుమా. (1-287)

రంగనాథునిరామాయణమునందు:—

ద్వి. అట్టినామీఁద నీవా యలిగెదవు, పట్టి చెట్టలు వాపి పాఱవైచెదను. 248

ఆనుశాసనికపర్వమునందు:—

ఉ. ఆ నరనాయకుం డొకమహాధ్వర మెంతయు వేడ్కఁ జేయఁగాఁ
బూన మహీసురావలికిఁ బూజ యొనర్పఁగఁ దాను బ్రాహ్మణుం
డై నయ మారఁగా ననలుఁ డాతనిపాలికి వచ్చి నాకు నీ
వే నృప నీదుపుత్త్రిఁ గృప యేర్పడ దానముగాఁగ నావుడున్. (1-53) 249

దూరాహ్వానఘ్నతము:—

తే. ఆదితేయార్చితాంఘ్రిపద్మా యనంగ, ద్వారకాపురమధ్యసద్మా యనంగ
నసురకులవైరివీరులారా యనంగ, రసిక చిత్తాబ్జవాసులారా యనంగ. 250

కళాపూర్ణోదయమునందు:—

మ. అకటా యేమని దూరుదాన నిను నాథా వేఁగుజామయ్యెఁ బొం
దికగాఁ బాదము లొత్త ర మ్మనుట గానీ యొంటి యేమో కదా
నికటక్షోణికిఁ జేర ర మ్మనుట గానీ కొంత నెయ్యంపు పూ
నికతోఁ గన్నుల విచ్చి చూచుటయ కానీ లే దొకింతేనియున్.(4-112) 251

సంశయఘ్నతము:—

ఆ. హరి యనంగ నాతఁడా నిన్నఁ గంసు నడంచెఁ గృష్ణుఁ డీతఁడా యశోద
కెంతభాగ్య మబ్బెనేబోటి నాభోటి, నైలఁత కట్లు గలుగునే తలంప. 252

రామాభ్యుదయమునందు:—

సుగంధి. అంగనాలలామఁ గానవా లతాకుడుంగమా
తంగమా భుజంగమా పతంగమా కురంగమా
లుంగమా లవంగమాతులుంగమాధవీనట
ద్భృంగమా వనీరమా కరీరమా సమీరమా. (5-239) 253

విజయసేనమునందు:—

ఉ. వల్లభుఁ డేఁగు దుర్లభుఁడు వానిదెసం దగు లాఁది యిమ్మెయిన్
దల్లడ మంద దేల యుచితస్థితికి న్ననుఁ బాపఁ జూచినన్
దల్లియుఁ బంధులోకమును దండ్రియుఁ నే మనువా రెఱింగిరే
నల్లను యిట్లు నీకుఁ దగునో తగదో పరికించి చూడుమా. 254

రామాయణమునందు:—

క. జనకజకు సుమిత్రానం, దనునకుఁ బ్రణమిల్లి సముచితస్థితి దర్భా
సనముల నుండఁగ రఘుపతి, యనుజన్ముల జూచి సేమమా [1]జనపలికెన్. (ఆర. 258)

12. ప్లుతయుగవిశ్రామములు

క. తా మేవర్ణము లైనను, క్ష్మామండలమునను బ్రాణమైత్రి గలిగినన్
దామోదర ప్లుతయుగవి, శ్రామము లనఁగాఁ బ్లుతాక్షరద్వయ మమరున్. 256

వజ్రపంజరశతకమునందు:—

ఉ. శ్రీగజగామినీమణిని సీతనుగా నిరపాయిఁగాఁ ద్రిలో
కీగృహమేధిఁగా గరుడకేతనుఁగా భవరోగవైద్యుఁగా
నాగురువాన నిన్నె మది నమ్మితి వేయొకవేల్పుఁ గొల్వ నీ
వే గతి కావవే రఘుపతీ శరణాగతవజ్రపంజరా. 257

ఈ పద్యెండును నుభయవళిభేదంబులు.

ఇంకం బ్రాసయతు లెట్టి వనిన:—

ప్రాసయతులు

గీ. గీతముల సీసములను సంగీతములను, విరతి విడనాడి యొక్కొక్క చరణమునను
రెంటికిని బ్రాసవర్ణంబు నంటఁ బలుకఁ, బ్రాసవిశ్రాంతు లండ్రు కబ్బముల వాని.

ఆ. దేవకీకుమార గోవర్ధనోద్ధార, తోయజాక్ష పాండవేయపక్ష
ఘనవినీలగాత్ర మునిజనస్తుతిపాత్ర, యదుకులాబ్ధిసోమ కదనభీమ. 259

అగ్రామ్యవిరామంబులు:—

ఆ. వికటకవులు కొన్ని వింతలు కల్పించి, కవిజనాశ్రయమునఁ గలిపినారు

1. రాజునకున్.

వ. వానిఁ గైకొనంగ వల దప్రయుక్తంబు, లేల చెప్పు భీమఁడెఱిఁగి యెఱిఁగి. 260
అవి యెవ్వి యనిన. 261

## [1]అగ్రాహ్యవర్గవళులు

క. వెలయఁ గకారాదులు భూ, తలమున నైదైదువళులు దా మగు ననుచున్
లలనామదనుఁడు రేచన, నలినభవనిభుండు గుణవతంసుఁడు చెప్పెన్. 262

వ. ఈ పద్యములోఁ జెప్పిన యయిదువర్గములయందును మొదలివర్ణములు నాల్గింటికి వర్గవళ్లు గనుకఁ జెల్లుబడి; యవి యనిన్నీ దాపలఁ బూర్ణబిందువు లేకుంటేను ననునాసికములకు జెల్లవు; ఆ బిందువు లున్నట్లాయెనా బిందుయతులు గనుక అవిన్నీ చెల్లును. ఈ భేదము చెప్పనందుచేత నీ పద్య మగ్రాహ్యము. 263

## అగ్రాహ్యసంబంధవళులు

క. దడలకు భేదము లెంచక, వడియును బ్రాసంబు నిలుప వచ్చును గృతులం
దది యెట్లన్నను శ్రీహరి, దోడిబడి దానవులఁ జంప[2]డులి యాయె ననన్. 264

వ. ఈ చెప్పిన దడలకు పదాదినున్న చతుర్థవర్గసరళము ఆదేశమై వచ్చునప్పుడు ఆదేశయతిగాఁ జెప్పవచ్చును. అదిన్నీ గాక ఆరెంటికిన్నీ దాపలించి నెఱసున్న లున్నప్పుడనుస్వారసంబంధయతులు గనుక అటువలెను జెప్పవచ్చును. అవి గలుగఁజెప్పలేదు గనుక ఇదిన్నీ సమ్మతము గాదు. 265

## అగ్రాహ్యవర్ణచతుష్టయవళులు

క. యరలవ లను నీ నాల్గును, వరుసం దమలోన వళ్లు రయమునఁ జెల్లున్
ధర శషసహావర్ణంబులు, సరవి నొకటి కొకటి చెల్లు హరినిభ రేచా. 266

వ. ఈ మొదలను జెప్పిన యరలవలకు నాల్గింటికిన్నీ చెల్లుబడి గాదు. శషసహాలలోపలను తొలుతటివి మూఁడున్ను ఊష్మవిశ్రాంతులు గనుక చెల్లును. వానికి హకారము చెల్లదు. ఇవి తెలియకచెప్పినకతంబున ఇదిన్నీ అప్రయుక్తమే ఆయెను. 267

## అగ్రాహ్యభేదవర్గయతులు

క. ధరఁ బఫబభమాక్షరములు, పరువడి నీయేనుగూడ వాతోఁ జెల్లున్
సరి సంభావన వడి యన, మరుదీమము లేమ కీరవాణి యనంగన్. 268

వ. పంచమవర్గాక్షరము లైదింటిలో నున్న పబల కభేదయతి గనుకనున్ను ప్రథమద్వితీయ చతుర్థవర్ణములు వకారమునకు అభేదవర్గయతులు గనుకను అవిన్నీ నిలుచును. మకారము నడవదు. ఇది విచారించక చెప్పినాఁడు గనుక నిదిన్నీ అబద్ధమని తెలిసికొనేది. 269

---

1. ఈశీర్షిక పూ. ము లో లేదు; క్రొత్తగాఁ జేర్పఁబడ్డది (రా). 2. ధులి (పాఠాంతరము).

తే. భరితభువనార్ణవంబుతో బ్రంత సరియె, రమ్యమణిరాజరాజుతో లక్క సరియె
లలితవీణారవంబుతో ళక్క సరియె, యనఁగఁ జెల్లు నభేదాఖ్య నమరువళ్లు. 270
వ. ఈమూఁటిలోపలనున్న భకార వకారములకు నభేదవర్గవిరతి గనుక బ్రయోగింపవచ్చు
ను. లవర్ణ ళవర్ణములకు నభేదవర్గయతులున్ను గావు; గనుక బ్రయోగించరాదు.
[1]రేఫమునకున్ను లకారమునకున్ను గ్రాహ్యంబు గాదు. వానికిన్ని లక్షణ విలాసము
వారు తెలియక [2]కొన్ని యుదాహరణంబులు వ్రాసినారు. అవియును వివరించెద.
శృంగారనైషధమునందు:—
క. కైలాటరాయ యభినవ,లీలామకరాంక చంద్రరేఖాంకురచూ
డాలంకారపదాంబురు, హాలింగితసుకృతనిర్మలాంతఃకరణా. (1-110) 272
రామాయణమునందు:—
క. దానవసుందరు లత్తఱి, జానకి నందలముమీఁద సమ్మద మొదవం
గానిలుప శారదాభ్రవిలీనత నేపారుచంద్రరేఖయ పోలెన్. (యు.2323)273
వ. సంస్కృతమునందు రేఖాలేఖాశబ్దములు రెండున్ను గలవు గనుక ఈరెండుపద్య
ములయందున్ను చెప్పిన రేఖాశబ్దము మొదల [3]తృతీయాంతస్థ మని యెఱుఁగునది.
హరిశ్చంద్రునికథయందు:—
ద్వి. చీఁకటి విరియించుఁ జిఱునవ్వు పసిఁడి, రేకులతో నెదిరించు చెక్కులును. 275
వ. కొందఱు 'రేకులతో మురాళించుచెక్కులును' అని చదువుదురు. అది వ్రాఁతతప్పు
గాని కవిహృదయము గాదు. 276
వసుచరిత్రమునందు:—
శా. ఓలంబాలక యోల యోల యన నో లోలంచు మేలంబునన్
లోలంబాలక యొర్తు గ్రంకి బిసవల్లు ల్దున్మి తూఁటాడి కెం
గేలం బూని తటాలున న్నెగసె నక్షీణాంబునాథాంబుజా
క్షీలోకంబు జయించి వారలయశశ్శ్రీఁ దెచ్చుచందంబునన్. (3-162) 277
వ. ఈ పద్యము రెండవచరణము మొదలను లోలంబాలక గ్రంకి యని కవిహృదయము.
ఇది గానక కొందఱు "ఇందిందిర శ్చంచరీకో రోలంబో బంభరోఽపి చ" అని
నిఘంటువున నున్న దని రోలంబాలక యని చదువుదురు. ఇట్లని రామరాజభూష
ణము తలంపుగాదు. 278
క. నణ లను రెండక్కరములు, తను వడిఁ బ్రాసంబుఁ బెట్టుకొన వచ్చుఁ గృతిన్
విను అరల కిట్లు పెట్టం, జను లళల కభేద మరయ సర్వజ్ఞనిధీ. 279

1. రవర్ణమునకు (సూ). 2. (వా)ప్రతిలో 'సువూర్వానునిర్ణయము' అని ఈతావున 'తలసీల' కలదు. (గి) 3. ద్వితీయాంతస్థ (పూ. ము; సూ.) ద్వితీయాంతస్థము రేఫము; తృతీయాంతస్థము లకారము. అప్పకవి మతమున నిందు లకారము చెప్పవలెను (రా).

వ. ఈ చెప్పిన మూఁటిలోపలనున్ను మొదలఁ జెప్పిన నణలకును సరసవడిని కడను జెప్పిన ళళలకు అభేదవిరతియుఁ గనుక నీరెండున్ను గూర్పవచ్చును. నడుమను జెప్పిన రఱలకు "రయోస్తు నిత్యం స్యాత్" అని శబ్దశాసనసూత్రముకలిమిం జేసి యేకతరయతు లగుటను గూర్పరాదు. అటుగనుక ఈ పద్యమున్ను బ్రశస్తము గాదు. 280

ఇవి నలువదియొక్కటియు యతిభేదంబులు,

ఇంకఁ బ్రాసస్వభావం బెట్టి దనిన

మూ. సూ:—ద్వితీయో వర్ణః ప్రాసోఽత్ర పాదపాదేషు, కించ ప్రాసస్సర్వేషు చైక ఏవ స్యాత్. 22

తే. ప్రథమపాదద్వితీయాక్షరంబు ప్రాస, మయ్యెఁ బదపద్యముల నడుగడుగునందు
నదియు రెండవ వర్ణమై యమరు సీస, గీతదండకమంజరీకృతులఁ దక్క. 281

ప్రాసపూర్వాక్షరనిర్ణయము

క. గురులఘువులలో నెయ్యది, మురహర తొలిచరణమునకు మొదల నిలుచు ని
ద్ధర నాపై నిడు ప్రాసా, క్షరములఁ బూర్వమున నదియ కదియింప నగున్. 282

ఆ. దాసపారిజాత వాసవావరజాత, ఘనఘనాఘనాంగ దనుజగర్వ
భంగ యనుచు నిట్లు ప్రాసాదులను గూర్పఁ, వలయు నొక్కభంగి వ్రాలు కృతుల. 283

ఆ. క్రింద జడ్డలును బిఱుంద బిందువులును, నూఁది ప్రాసములకు నుండెనేని
హ్రస్వ మొకట నిడుదయక్కరం బొక్కట, వాని మొదల నిలుపవచ్చు నెందు.

ఆ. పక్షిరాజపత్ర రాక్షసతృణదాత్ర, దంతిభయవిరామ శాంతిధామ
యింద్రనీలమూర్తి సాంద్రపాండురకీర్తి, యనఁగఁ బ్రాసమాత్రకాదు లొప్పు. 285

ఆ. వేదవేద్య యసమవృత్తపాదములను, బ్రాసనియమరహితపాదములను
వలసినట్లు మొదలివ్రాలు సెప్పఁగ నొప్పు, నొక్కచోట గురువు నొకట లఘువు. 286

స్వస్థానార్ధసమవృత్తోపజాతివృత్తము:—

క్షమాకళత్రుఁ డ్వనజాతనేత్రుఁ, డ్గామేపలీశుం డ్రిజగత్ప్రకాశుఁ
దమాలనీలు స్సముదారశీలుఁ, డ్హేమాక్షవైరి స్భజియింతు శౌరిన్ 287

ఆ. వారిజాతగర్భవామదేవసహస్ర, నయనముఖ్యపుణ్యనామ యనుచుఁ
బ్రాసనియతి లేని సీసాదిపదముల, మొదల రెండు నిట్లుగదియుచుండు. 288

[1]ప్రాసాక్షరమైత్రి

తే. ప్రాసముల కెల్లఁ దుల్యాక్షరంబు లైనఁ, జాలు స్వరభేద మైన దోషంబు లేదు
చరణములకడఁ గూర్చుప్రాసముల కెల్ల, నన్నియు సమస్వరంబులై యమరవలయు.

ఆ. సరసిజాతనేత్ర దురితగుల్మలవిత్ర, హరితనూజమిత్ర గరుడపత్త్ర
ధారుణీకళత్ర నీరదాసితగాత్ర, యనుచుఁ గూర్పవచ్చు నచ్చు లెల్ల. 290

1. ప్రాసాక్షరస్వరమైత్రి (మూ).

క. దురితద్విపహర్యక్షా, నరకమురాసురవిపక్ష నాళీకాక్షా
శరధిసుతాలయవక్షా, కరినాయకరక్ష హరముఖసురాధ్యక్షా. 291
తే. వట్రువయు [1]నైత్వమును గల వ్యంజనంబు, ప్రాస నైయుండు నెడఁ బెఱప్రాసములకు
వ్యంజనంబు సమాక్షరం బైనఁ జాలు, వానిపై నేస్వరం బైనఁ బూన వచ్చు 292
ఆ. సకియ పూర్వజన్మ సుకృతఫలంబునఁ, గాక తనువిభాసిరాకృతాభ్రు
నిక్కృపాపయోధిఁ దక్కఁగఁ గొనుటకుఁ, దరమె భోజసుతకుఁ దక్క ననఁగ. 293

శల్యపర్వమునందు:—

క. చావరు నొవ్వరు పాండవు, లేవురు నని నీవు చెప్ప నిప్పలుకులు దుః
ఖావేశకరము లై చే,తోవృత్తిఁ గలంపఁ జొచ్చె దుర్భరభంగిన్. (1-14) 294

కవికర్ణరసాయనమునందు:—

మ. అమరీవిభ్రమరీతిలోలనయనాహస్తాబ్జ[2]దోధూయమా
నమణీదండకచామరాగ్ర[3]పవమానస్పందనాందోళన
క్రమశోభానృపకుంతలప్రకర ముత్కర్షాఖ్య మయ్యెం దదీ
యమృదుస్పర్శసుఖోన్నతిం బరవశం బై తూఁగుచందంబునన్. (1-64) 295
క. విరమము స్వరప్రధానము, ధరఁ బ్రాసము వ్యంజనప్రధానము నగుటన్
స్వరసంధిఁ జెందునపుడును, బ్రరుచిరముగ హల్లు దాన [4]ప్రాసము లయ్యెన్. 296
క. అనలు వెట్టిన నిలువక, తా నూరక యలిగి యా[5]సుదంతను జేరన్
దానవసంహరుఁ డేక్రియ, చే నీకఁ జనుదెంచు నాకుఁ జెప్పవె యనఁగన్. 297

## ప్రాసభేదంబులు

సీ. అర్ధబిందుసమాహ్వయముఁ బూర్ణబిందుఖండాఖండములు సంయుతాక్షరంబు
ధర సంయుతాసంయుతము రేఫయుతలఘుద్విత్వవికల్పముల్ వెస నుభయము
ననునాసికప్రాసమును బ్రాసమైత్రియుఁ బ్రాసవైరంబు స్వవర్గజంబు
ఋప్రాసలఘుయకారప్రాసములు నభేదంబును సంధిగతంబు ననఁగ
తే. బదియు నేడు దెఱంగులఁ బరిఢవిల్లుఁ, బ్రాసములు పూర్వసుకవిప్రబంధములను
గ్రమత లక్షణలక్ష్యయుక్తంబు గాఁగ, దేటపఱచెద వాని నిశాటదమన. 298

## సమప్రాసములు

తే. పూర్వమున నర్ధమైనను బూర్ణమైన, దిగువ జడ్డక్కరం బైనఁ దగిలి మొదలి
ప్రాస ముండినయెడ సమప్రాస మనఁగ, బిదప నన్నియు నట్లన కదియవలయు.

1. ద్విత్వము (పూ. ము; సూ). కాని పై పాఠమే యప్పకవి పరిగృహీతము చూ. 4 ఆ. 50 ప. 2. దోధూయ (సూ). 3. 'పవమానాస్పంద' (సూ) ఈ పాఠమున అఖండవడి సిద్ధించును గాన నియ్యది యప్పకవి మతమున నగ్రాహ్యమగును (రా). 4. ప్రాసంబయ్యెన్ — అను పాఠము సముచితము (రా). 5. సుదంతిని (పూ. ము) స్త్రీవాచ్యంబగుచో 'సుదతి' అనవలె. ఇందు 'సుదంత' సంజ్ఞావాచకము. (రా)

### 1. సమప్రాసములం దర్ధబిందుప్రాసము

ఆ. వీఁకఁ బక్షిముఖుని దాఁకి కోసలవల్లభుండు బలాసురాంతకుఁడు సెలంగ
నవనిఁ గూల్చె ననుట నర్ధబిందుప్రాస, మిట్లు కూర్ప వలయు నెల్లకడల. 300

### 2. పూర్ణబిందుప్రాసము

క. పొందింప వలయు నెల్లెడ, బృందావనచారి పూర్ణబిందుప్రాసం
బిందీవరాక్షి భీష్మక, నందనఁ జేకొనియె నందనందనుఁ డనఁగన్. 301

### 3. ఖండాఖండప్రాసములు

క. నిడుపులు నరసున్నలు దమ కెడమను గల కచటతపల కిలఁ బ్రాసములై
దొడరును నిర్బంధవు లొ, క్కొడ ఖండాఖండసంజ్ఞ నిసశశినయనా. 302

ఆదిపర్వమునందు:—

క. వీఁకఁ [1]బఱతెంచి నల్లడఁ, దాఁకినఁ గడు నలిగి ఘోరతరశరహతి న
మ్మూకలు విరియఁగ నర్జునుఁ, [2]డా కరమున నేసె నుగ్రుఁడై రణభూమిన్. (8-203)

విరాటపర్వమునందు:—

క. నాకొలఁత దీర్చి వచ్చితి, [3]నీకొలఁతయు యింక సూతుని న్డగఁ జూడ
న్లోకము వంచింపఁగ నగు, చీఁకటిరే యొదవె నేమి సేయుదు చెపుమా. (2-271)

ద్రోణపర్వమునందు:—

[4]సీ. పా. మూకలు విరియించి వీఁక నాచార్యాదియోధుల కెల్లను నొక్కొ డెసను. (2-136)

రుక్మాంగదచరిత్రమునందు:—

ఉ. ఓ కరుణాకలాప వికచోత్పలలోచన యిప్పు డియ్యెడన్
గాకులు చంపకుండ ననుఁ గైకొని కాచిన నీకృపాగుణం
బే [5]కలిగె న్వసింపఁ దగునే తొలిపుట్టువునందు భర్తపైఁ
గాకలు సేసినట్టి ఘనకల్మషము ల్విన నీకుఁ జెప్పెదన్. (4-99) 306

ఆదిపర్వమునందు:—

[6]మత్త. తీఁగయుయ్యెల నూఁగుఁ జల్లని తియ్యమామిడిమోకలం
దూఁగుఁ బువ్వులతేనెసోనలఁ దారుఁ గేతకిఁ జేరుఁ బు

---

1. బఱతెంచు నిరుడ (గి). 2. డాఁకతమున (ప-వా-పె) డాఁకరమున (భారతము అప్పుప్రతి) ఆకర మనఁగా ఆగ్రహము. అహంకారశబ్ద వైకృత మని కొందఱ తలంపు. ఇది యప్పకవిమతమున నిర్బంధవుగానోపు (రా). 3. నీ కొదవయ. (వా-ప) 4. మూకశబ్దము శ. ర. లో సార్థానుస్వారముగఁ జేర్చి యీసీసపాదమునే యుదాహరించినారు; కాని యప్పకవిమతమున సార్థానుస్వారముగాదు (గి). 5. కరణిన్వసింప (పా). 6. ఈపద్యము భారతమున నెందును గానరాదు. (రా)

స్వాగ్రభూగమహాగవీథుల నాట్యము లొచరించు నా
భోగ్యనాగలతాగృహంబుల భోగము ల్గనువేడుకన్. 307

రామాయణమునందు:—

ద్వి. మూఁగి చరించునమ్మొకరితుమ్మెదలు, బా గొప్పఁ గొప్పునఁ బరఁగినదాని. 308

వరాహపురాణమునందు:—

క. ఆ చింతామణి ముని తన, పీఁచ మడఁచుదాఁక వీఁక పృథులోభముచే
దాఁచుకొనుఁగాక నాచే, నీచే నీఁక మోసపోవునే నరనాథా. 309

ఉద్యోగపర్వమునందు:—

క. [1]మీటుగల రథికులను నొక, నాఁటికి వేవుర వధింతు నరుశరములు నో
నాటి పడవైచునంతకు, వేటాడెదఁ బ్రతిబలంబువీరుల నెల్లన్.(4-407) 310

[2]ఆ. బోఁటి యొకతె పెండ్లిపాట పాడఁగఁ జొచ్చె, నాఁపరాని విరహతాపమునను
జేరు గూర్చి తాను బెండ్లికూఁతురు గాఁగ, గోత్రధరుఁడు పెండ్లికొడుకు గాఁగ.

ఆదిపర్వమునందు:—

క. ఆ పన్నగముఖ్యులఁ దన, వీఁపునఁ బెట్టుకొని పఱచి విపినములు మహా
ద్వీపములు గిరులు సకలది,శాపాలపురములఁ జూపెఁ జని వారలకున్. (2-42)

## 4. సంయుతాక్షరప్రాసము

తే. సంయుతాక్షరప్రాసమై జగతి వెలయు, గర్గుఁ దర్పించు దైవంబు భర్గుఁ డనఁగఁ
బక్ష్మలేక్షణకౌ నతిసూక్ష్మ మనఁగఁ, జంద్రవంశ్యుఁడు భోగదేవేంద్రుఁ డనఁగ.

## 5. సంయుతాసంయుతప్రాసము

తే. రలలు తమక్రింద[3] జడ్డలై క్రాలువ్రాలు, ప్రాసవర్ణంబులై వానిఁ బాసియైనఁ
గూడియైనను బెఱఘుడుగులను నిలుచు, సంయుతాసంయుతప్రాససంజ్ఞఁ దనరి.

తే. పాఁడి ద్రచ్చఁగనిమ్ము నాతండ్రి కృష్ణ
వేఁడుకొనియెద నందాఁకఁ బండ్లు దినుము
దుండగపుఁ[4]జేష్టలును నోటిగాండ్రతనము
మెండు గాఁజొచ్చె నీకు నై [5]దేండ్ల [6]కనఁగ. 315

రేఫశ్లిష్టమునకు నాదిపర్వమునందు:—

ఉ. క్షత్రియవంశ్యులై ధరణిఁ గావఁగఁ బుట్టినవారు బ్రాహ్మణ
క్షత్రియవైశ్యశూద్రు లనఁగాఁ దగు నాలుగుజాతుల న్స్వచా

---

1. నీటుగల; మేటులగు (అచ్చు. భా). 2. బోటి-స్త్రీవాచకమైనచో నిర్బిందుకము-చూ. శ.ర., అప్పకవి మతమున నీ లక్ష్యపద్యమునుబట్టి సార్ధబిందుక మని యెంచవలెను. 3. నుండఁ బైఁ గ్రాలువ్రాలు (సూ). (రా). 4. ఁజైదములునోట. 5. దేండ్లు (భూ. ము). 6. గనుక (సూ).

రిత్రముఁ దప్పకుండఁగఁ బరిక్షితుకాచినయట్లు రామమాం

ధాతృరఘుక్షితీశులు ముదంబునఁ గాచిరె యే యుగంబునన్.(ఆ.2-173) 316

వ. మాంధాతృశబ్దము ఋకారాంతము గనుకఁ దకారముక్రింద నున్నది వట్రువ సుడి
గాని క్రారవడి కాదు. అందులకు— 317

కవికర్ణరసాయనమునందు:—

సీ. గీ. దానగుణశాలి భూసముద్ధరణదక్షుఁ
డనిశమఘదీక్షితుండు మత్తారిహరిణ
విహృతినిరతుఁడు యువనాశ్వవిభుసుతుండు
ఘనుఁడు మాంధాత నృపుఁడైన[1]కాలమునను. (2-58) 318

సోముని హరివంశమునందు:—

శా. నాతో మార్కొనలేరు నిర్జరపురీనాగేంద్రబృందారకా
రాతు ల్మున్నగ దేవసంఘములు పోర స్థిరసంగ్రామకుం
డీ త్రైలోక్యమునందుఁ గల్గఁడు రణం బెచ్చోట లేకుండఁగాఁ
జేతు ల్వేయు వృథాభరం బగుచు వచ్చె న్దేవ యీమేనికిన్. 319

దేవీవిజయమునందు:—

తే. వాక్త్రిణేత్రాంగనాశచీశక్తు లధిక
సంభ్రమంబునఁ గుంభనికుంభదైత్య
హంత్రిఁబూజింపుదురు త్రయీమంత్రములను
స్తోత్రములు చేసి మంగళారాత్రిక లిడి. 320

పద్మపురాణమునందు:—

క. శ్రీకరచక్రాంకితు లగు, లోకులు శుద్ధులును బుణ్యులును నగుదురు వా
రీ క్రియలు లేక యుండినఁ, బ్రాకృతు లనఁ బతితు లనఁగఁబడుదురు జగతిన్.

లకారశ్లిష్టమునకు రాఘవపాండవీయమున:—

శా. లోకత్రాణరతిం దదాదిమమహీలోకప్రవేశోత్కభా
షా[2]క్లప్తప్రథమద్వితీయపదగుంజన్మంజుమంజీరగ
ర్జాకల్పామలరామభారతకథాసర్గంబుల న్మించు వా
ల్మీకివ్యాసులఁ గొల్చెదం దదుభయశ్లేషార్థసంసిద్ధికిన్. (పీఠిక. 3) 322

6. రేఫయుతప్రాసము

ఆ. సుడులు తెలుఁగులందుఁ బొరమ వా క్కైవడి, వ్రాలు కొమ్ముక్రారవడులు గాన

1. కాలమందు (సూ). 2. 'క్లప్త' లో 'క్ల' లకారశ్లిష్టము గాదు. అప్పకవి యీ పద్యములను లకారశ్లిష్టమున కుదాహరణముగ నిచ్చుట ప్రమాదము.

రేఫయుతసమాఖ్యఁ గృతులఁ బ్రాసము లగు,సొరిదిఁ దమకుఁ దాము సుడులఁ బాసి.

క. సంగ్రామరంగమునఁ బెలు,చం గ్రమ్మరుచున్న సాల్వజగతీవరుమే
నం గ్రుచ్చిపార నాటెం,చెం గ్రూరాస్త్రములు నాల్గు శ్రీకృష్ణుఁ డొగిన్. 324

క. ఈక్రార పలుకునకు మొద,లై క్రాలుచుఁ దేలి ప్రాస మగుఁ దనతనకే
శ్రీక్రొమ్ముడిసౌందర్యము, వాక్రువ్వం దరమె యురగవరునకు నైనన్. 325

7. లఘుద్విత్వప్రాసము

తే. భువి లఘుద్విత్వసంజ్ఞికంబు లయి కొన్ని
యూఁదఁబడని క్రారలతోడ నొకటి కొకటి
ప్రాసముల కగుఁ దమలోనఁ బత్రయుగము
విద్రుచె వినతాత్మజుఁడు దిక్కు లద్రువ ననఁగ. 326

8. వికల్పప్రాసములు

తే. పంచవర్గంబులను గనుపట్టునట్టి
పొల్లు లనునాసికాక్షరంబులను గదిసి
తమదుపంచమములఁ దృతీయములు నగుచు
నమరుఁ బ్రాసంబులకు వికల్పాహ్వయములు. 327

తే. ప్రాజ్ఞనగసమానధృతి సుధారుఙ్నిభాస్య, ప్రజ్ఞచయసక్తకంఠ దావాగ్నిపాయి
[1]వాఙ్మనోహరనుత యసదృఙ్మహాత్మ, దిఙ్మహితకీర్తి యర్జునయుగ్మభేది. 328

9. ఉభయప్రాసము

ఆ. ధాత్రిఁ బాణినీయసూత్రములను దృతీయోష్మమును ద్రుతంబు నొక్కచోటఁ
గ్రమత షాక్షరము ణకారమునై ప్రాసములకు నుభయసంజ్ఞఁ బొసఁగు రెండు.

త్రైశంకవోపాఖ్యానమునందు:—

క. ఝషకేతుద్వేషునకుఁ గి,ల్బిషపర్వతవృషున కమృతవిషనిధిజామా
త్రిషునకు ఋషిపూజితునకు, విషమాక్షున కింద్రముఖదివిజపక్షునకున్. 330

సాంబవిలాసమునందు:—

క. వసుధాకళత్రునకు సా,రసదళనేత్రునకు మరుదరాతిమదతమో
విసరాంబుజమిత్రునకు, న్విషమశిలీముఖసహస్రనిభగాత్రునకున్. 331

తే. ప్రాణములఁ బాపె నాహవక్షోణియందుఁ, బ్రాణవల్లభఁ గొని చన్న దానవేంద్రుఁ
దమ్ముఁడును దాను గీశజాతమ్ముతోడ, శరధి బంధించి [2]దాఁటె దాశరథియనఁగ.

1. ఇందలి 3, 4 పాదములు సూర్య. ప్రతిలో 4, 3 పాదములుగా నున్నవి(రా).
2. దాఁటి.

ఉద్యోగపర్వమునందు:—

ఉ. ద్రోణుఁడు భీష్ముఁడుం గృపుఁడు ద్రోణసుతుండును గర్ణశల్యులున్
ప్రాణము లా సుయోధనునిపాలివ యండ్రు నిజానుజన్ము ల
క్షీణపరాక్రము ల్సుతు లజేయులు బాహ్లికసోమదత్తు లా
స్థాణున కైన నోడరు వశంబె జయింపఁగ వారి నేరికిన్. (1-299) 333

కాళహస్తిమాహాత్మ్యమునందు:—

మ. ప్రణుతు ల్సేయుచుఁ గాంచెఁ గుంభజుఁడు లోపాముద్రతోఁ గూడి ద
క్షిణకైలాసము నంబికాహరకృతశ్రీపాదుకాన్యాసమున్
మణిమంత్రౌషధవాసము న్నవమహామాయావిపర్యాసమున్
గణనాతీతనటీవిలాసము సమగ్రశ్రీసముల్లాసమున్. (1-109) 334

కాశీఖండమునందు:—

క. [1]త్రిణయనుని రాణివాసము, నణిమాద్యైశ్వర్యవితరణామరతరువున్
మణికర్ణిక ముక్తివధూ, మణికర్ణికఁ దలఁచె వాని మానసవీథిన్. (2-110) 335

రామాయణమునందు:—

చ. రణమున నుగ్రసాయకపరంపర భానుకులం బరామల
క్షణము జగం బవానరముగా విలు నేర్పును మద్భుజావిజృం
భణమును జూపి తండ్రిమదిఁ బట్టినచింత దొలంగఁ బెట్టి శూ
ర్పణఖకు నిట్లు వాటిలిన బన్నము నీఁగుదు నే నవశ్యమున్. (యు. 544) 336

మధుసేనమునందు:—

క. పో నుద్యోగముఁ జేసిన, ప్రాణంబా యింక నీకుఁ బాథేయం బీ
మానినిమందస్మితమధు, రాననచంద్రికలు గ్రోలి యరుగుము పిదపన్. 337

శృంగారషష్ఠమునందు:—

క. అనుటయుఁ గృష్ణద్వైపాయనతనయుం డిట్టు లనియె నవహితమతియై
విను మతి గుహ్యము నారాయణకవచము భక్తవాంఛితార్థప్రదమున్. 338

ఆరణ్యపర్వమునందు:—

చ. కనకగిరిం బ్రదక్షిణముగా శశిభాస్కరతారకాగణం
బనవరతంబు ద్రిమ్మరు మహామునిసప్తకమండలంబుతోఁ

---

1. ఇచ్చట ణత్వముకాదు; కాని శ్రీనాథుఁడు ప్రయోగించినందున సాధుత్వము కల్పనీయము. లేక సామాన్యముగ నణలకుఁ బ్రాసమైనను ఒప్పుకొనవలసి వచ్చును (వి). సాధారణ ణనప్రాసకును బూర్వకవి ప్రయోగములు గలవు (రా).

నన్నఘ తదీయశైలశిఖరాగ్రమునందుఁ బయోరుహాసన
[1]త్రిణయనవిష్ణు లుండుదురు దేవగణంబులు గొల్పుచుండఁగన్. (4-38) 339

## 10. అనునాసికప్రాసము

తే. తమకుఁ దాము ద్విత్వంబులై తనరునవియుఁ
బూర్ణబిందులు దాపలఁ బొరయునవియుఁ
గలసి యనునాసికప్రాసము లను పేర
నమ లమరుఁ గావ్యములయందుఁ దమకుఁ దాము. 340

క. మిన్నేఱు పాదమున [2]ధా, తన్నాభిని గుసుమశరు నెదం గాంచిన నీ
[3]సాంనిధ్యము దొరకుటకై, సంనుతి సేయుదురు నిన్ను సనకాదు లజా. 341

క. తమ్ములను మల్లికాకుసు,మమ్ముల మరువాదిపత్రమాలికలును భ
[4]క్తి మ్మురసంహరుపూజలు, [5]సంమదమున సలుపఁ గలుగు సకలార్థంబుల్. 342

## 11. ప్రాసమైత్రిప్రాసము

తే. గట్టిబిందువు మీఁదిబకారమునకు, జమిలిమా ప్రాసమైత్రి నా జరుగుచుండుఁ
గమ్మతావులు వెదచల్లు నంబుజములు, శంబరారాతిచేతివాలమ్ము లనఁగ. 343

## 12. ప్రాసవైరము

తే. కబ్బముల రేఫమునకు ఱకారమునకు, మైత్రి గలుగమిఁ గవిశిఖామణులు ప్రాస
వైర మనుచును గలపరు వాని నెందుఁ, గూర్తు రా రెండు నెఱుఁగక కుకవిజనులు.

## 13. స్వవర్గజప్రాసము

తే. గ్రంథమంథశబ్దంబులఁ గలద్వితీయ, వర్ణములు రెండును నఘోషవర్ణము లగు
నైన నిజవర్గభవచతుర్థాక్షరములఁ, గలియుఁ బ్రాసంబులను స్వవర్గజము లనఁగ.

వ. 'శ్రంథ గ్రంథసందర్భే' యను ధాతువువల్లనున్న 'శాస్త్రద్రవిణయోర్గ్రంథః' అని నామలింగానుశాసనమునందు నానార్థవర్గములోపలను తవర్గ ద్వితీయాంతముల యందే అమరసింహుఁడు చెప్పుటచేతనున్న గ్రంథిశబ్దము తనయందు రెండవవ్రాయి తవర్గమునందు ద్వితీయాక్షర మైనాగానీ ప్రాసములయందు చతుర్థాక్షరములకు మహాకవి ప్రయోగములు గలుగుటవల్లను చెల్లును. 346

ఆరణ్యపర్వమునందు:—

ఉ. అంధకవృష్ణిభోజకుకురాన్వయభూపతు లెల్ల నీదెసన్
బాంధవసౌహృదప్రణయభక్తివిశేషము లొప్ప నీమనో

---

1. వ్రాఁతప్రతులందు ణత్వమే కనఁబడుచున్నది. 2. ధాతంనాభిని. పూ. ము. సరికాదు. 3. సాన్నిధ్య...సన్నుతి. (పూ. ము.) 4. భక్తిలమరహర. (పూ. ము.) 5. సమ్మద. (పూ. ము.)

గ్రంథి యడంగఁ జేయు నెనకంబునఁ బూనినవారు లోభమో
హాంధులు ధార్తరాష్ట్రులు నయమ్మునెయి న్మన కుర్వి యిత్తురే. (అ. 4-160.)

విరాటపర్వమునందు:—

ఉ. బాంధవశాత్రవాకలితభావభవాభవపాశబంధసం
బంధవిరామకామపరిపక్వవివేకనిరూఢభక్తహృ
ద్గ్రంథివిభేదనా పరమకారుణికా పరిమాణదూర దుః
ఖేంధనపావకాయితసమీక్షణ[1]శైత్యమహోద్భుతాత్మకా. (1-333) 348

వ. మంథ విలోడనే యను ధాతువు కవికల్పద్రుమమునందుఁ దవర్గ ద్వితీయాంత ధాతువులలోను బరిగణిత మైనది గనుక మంథరశబ్దములోని రెండవవ్రాయి తవర్గమునందు ద్వితీయాక్షరమైనను బ్రాసములపట్లను బూర్వకవిప్రయోగములు గలుగుట చేతను జతుర్థవర్ణములకుఁ జెప్పవచ్చును. 349

ద్రోణపర్వమునందు:—

క. సింధురము మదోద్రేకమ,దాంధంబై వచ్చునోజ నాచార్యునిపై
గంధవహాసుతుఁడు [2]గవయఁగ, మంథరగతి నెవ్వఁ డాఁగు మనయోధులలోన్. (1-88)

ఆముక్తమాల్యదయందు:—

ఉ. కంథరనీలవర్ణ మధుకైటభనాగసుపర్ణ యోగిహృ
ద్గ్రంథిభిదోత్థభోగివనితాస్వనవచ్ఛ్వసనస్రవచ్ఛిర
స్సంధివసన్నిశాపతిరసస్రుతిదుగ్ధపయోధివీచికా
మంథరకేళికాధర సమాశ్రితపక్తి్రిశిరోధిసోదరా. (5-158) 351

వ. బుధ అవగమనే అను ధాతువువలనను బుధశబ్దములోని రెండవవ్రాయి తవర్గమునందు చతుర్థాక్షర మైనను బ్రాసములపట్లను బూర్వకవిప్రయోగములు కలుగుటచేతను దృతీయవర్ణమునకుఁ జెప్పవచ్చును. సుధాశబ్దము మొదలైనవానికిని ఇటువలెనే యని తెలిసికొనునది. 352

ఆదిపర్వమునందు:—

ఉ. కాదన కిట్టి పాటియపకారము తక్షకుఁ డేకవిప్రసం
బోధనఁ జేసి చేసె నృపపుంగవ నీవు ననేకభూసురా
పాదితసర్పయాగమున భస్మము సేయుము తక్షకాదికా
కోదరసంహతిన్ హుతవహోగ్రమహోగ్రశిఖాచయంబులన్. (2-200) 353

1. దైత్య (అచ్చు. భా.) చైత్య. (గి) 2. గవయన, మంథరగతి( వా. ప.)

[1]నరసింహపురాణమునందు:—

క. వేదము లాదిగఁ గల యష్టాదశవిద్యలకు నీవ స్రష్టవు తత్త
ద్భోధకులును భవదాజ్ఞా, పాదకులు సమస్తధర్మపాలనచతురా. 354

విరాటపర్వమునందు:—

క. ముద మొదవ రమ్యహర్మ్యము, తుది నిలుపున నిష్టసఖులతోడ విహారా
స్పదమగు[2]నెళవున మెలఁగెడు, సుధేష్ణ తజ్జాలకములఁ జూచెం బ్రీతిన్. (1-301)

ద్రోణపర్వమునందు:—

క. వింధ్యాద్రివోలె నా ప్రతి, వింధ్యుఁ డచలితోగ్రమూర్తి వెలయ నిలిచి గ
ర్వాంధ్య మలరఁగను దీప్తా,వంధ్యాస్త్రము లక్కుమారవరుపైఁ బఱపెన్.(1-135)

విరాటపర్వమునందు:—

ఉ. [3]ఎండకు వాన కోర్చి తనయిల్లు ప్రవాసపుఁజోటనాక యా
కొంటి నలంగితి న్నిదురకుం దఱి దప్పెను దప్పి పుట్టె నో
క్కండను నెట్లకో యనక కార్యము గల్గినవేళ నేలినా
తం డొకచాయఁ జూపినను దత్పరతం బని సేయు టొప్పగున్. (1-135) 357

## 14. ఋప్రాసము

తే. స్వరము లెల్లను బ్రకృతిభావంబులందు,రా వెనుక వ్రాయి యగు ఋస్వరంబొకండు
తగు యణాదేశమున రేఫ మగుటఁజేసి, ప్రాసముల కట్ల యగు వళిపట్లఁ గాదు.358

క. ధారుణి ఋప్రాస మనం, గా రేఫాక్షరమువకు ఋకారము చెల్లున్
నారికినై నాకకుజం, బాబ్రుభుపతి గెలిచి తెచ్చె నచ్యుతుఁ డనఁగన్. 359

ఆరణ్యపర్వమునందు:—

క. ఆఋషిపుత్త్రుఁడు గట్టిన, చీరలు మృదులములు నవ్యశిష్టములు మనో
[4]హారులు నాకనిపృథుకటి,భారంబున నొక్కకనకపట్టము వ్రేలున్. (3-104)

## 15. లఘుయకారప్రాసము

తే. ప్రకృతిభావంబుఁ జెందినప్రాణములకు, మొదలియంతస్థములు ప్రాసములకు నిలుచు
నఱమఱలు లేక లఘుయకారాహ్వయముల, నా యజునితండ్రి ఫణిరాజశాయియనఁగ.

కళాపూర్ణోదయమునందు:—

ఉ. ఏయెడ నెన్నడుం గనని యింపులు గుల్కెడు తద్గళస్వనం
బాయత మైన కౌతుకము నద్భుతము న్లొలపింప నెయ్య దె

1. నృసింహ (సూ.) 2. నెలవున (పూ. ము. అని గ.) 3. అప్పకవి చెప్పిన స్వవర్గజప్రాసమున కీ పద్యము లక్ష్యము గాఁజాలదు. ఆకొండు నలంగుదు (సూ.) ఈ పాఠమున సమప్రాసమగును; స్వవర్గజప్రాస కిది లక్ష్యము గాకపోవును. 'ఆకొండు' అను పాఠమును గలదు. అప్పట్టున దడప్రాస యగును. ఇది యప్పకవికి సమ్మతముగాదు కాన నీ లక్ష్యము చింత్యము (రా.) 4. హారిఘము లతని.

ద్దీ యిది చాలఁ గ్రొత్త బళి యింకొకమాటిఁక నొక్కమాటటం
చా యలినీలవేణి నలకాధిపసూనుఁడు వేఁడె వేఁడినన్. (1-92) 362

16. అభేదప్రాసము

తే. రేఫమునకుఁ బై నుండు మాతృకకుఁ బెద్ద, లా యభేదాహ్వయప్రాసమై యెసంగు
ఖలజనవిపక్ష జలరుహదళనిభాక్ష, కాళియోరగమదవనకేళి యనఁగ. 363

రాజశేఖరుని చరిత్రమునందు:—

శా. కేళీకాంచనసౌధవీథికలచక్కిం దొట్లలోఁ బెట్టి యో
ప్రాలేయాచలకన్యకాధవ కృపాపారంగతా నిద్రవో
వే లావణ్యపయోనిధీ యనుచు నావిర్భూత మోదంబుతో
జోలల్వాడుదు రక్కుమారకునకున్ శుద్ధాంతకాంతామణుల్. (2-4) 364

రామాభ్యుదయమునందు:—

ఉ. పాలును నీరు నేఱుపఱుపంగజ మావుల వేదవీథి వా
హ్యాళి యొనర్చు నే యలికులాలక తా సితవర్ణ యయ్యె నే
బాల సువర్ణదేహమున భాసిలు నా నలుమోము వేల్పుప్రో
యాలు ప్రవీణ మామకమహాకృతినాథుఁ గృతార్థుఁ జేయుతన్. (1-8) 365

తే. పెద్దలాకును దనకు నభేద మగుట, ళళలకు నభేద మట్లన గలుగుకతన
క్షితిని మూఁడవ సరళంబు యతులఁ బ్రాస, ములను లఘ్వలఘులకారములకు నిలుచు.

ప్రభావతీప్రద్యుమ్నమునందు:—

క. జలనిధి యను తెర మఱుఁగటు, వెడలి నిలిచినట్టి యాటవెలఁదియపోలెన్
గడు నింపులు గులుకుచుఁ దన, కెడు నీ పురలక్ష్మి యవధరించితె యధిపా. (1-57)

ఉద్యోగపర్వమునందు:—(1-220)

క. కొడుకులు దానును గుఱ్ఱపు, [1]దళములు కరిఘటలు భటరథవ్రాతములుం
బుడమి చలింపఁగ ద్రుపదుఁడు, గడు వేడుకఁ దోడుసూపెఁ గౌంతేయులకున్.

భీష్మపర్వమునందు:—

క. [2]కొడుకులు దమ్ములు గుఱ్ఱపు, దళములు పెక్కైనబలవితానము తగుమై
నడపింపుచు మెలపున సుం, గడములతో నడుచు శకుని కడు నొప్పారెన్. (1-93)

శృంగారనైషధమునందు:—

చ. చిలుకలు గూయునో చెవులు సిల్లులు వోవఁగ నంచు నెన్నఁడు
న్వెడలఁడు నందనోపవనవీథులకై యట మాళిభాగని

1. దళములఁ గరిఘటల... వ్రాతములం (భారతముఅచ్చుప్ర.తి) 2. ఈపద్యము సూర్యప్రతిలో లేదు.

ర్మలశశిరేఖ చేయు నపరాధమునన్ గజదైత్యశాసనుం
గొలువఁడు పాకశాసనుఁడు కోమలి నీ దెసఁ గూర్మి యెట్టిదో. (4-24) 370

కూర్మపురాణమునందు:—

తోటకము. తొలిమి దూలిన తాపసపత్నుల్, వ్రీడ మనంబున వీడ్కొని జాఱన్
లోలమదాలసలోచనపఙ్క్తిన్, జాలఁ దలిర్చిరి శంకరులీలన్. 371

## 17. సంధిగతప్రాసము

తే. సంధిఁ గూడిన వ్రాలు ప్రాసంబు లైన, నవియె సంధిగతాఖ్యల నమరుచుండు
దివిజు లాశ్చర్య మొంద శౌరి పడవైచెఁ, జెంగి పోనీక మధురలోన్నం గరి నన.

శల్యపర్వమునందు:—

క. కవదొనలును గాండీవము, నవల నిడం బనుపు ముంద అరదము డిగు మే
ను విదప డిగియెద శుభకర, మవు నివ్విధ మిట్లు సేయు మనుడు నతండున్. 373

*కళాపూర్ణోదయమునందు:—

శా. ఆ వాలుంగనుదోయి యానగు మొగం బాగుబ్బపాలిండ్లపెం
పావేణీభర మా తనూవిలసనం బా యొప్పు లేఁ జెప్పినం
గైవారం బగుఁ గాదె కేవలశిరఃకంపంబు గల్పించి యా
హా పుట్టింపదె యిక్షుధన్వునకు నయ్యబ్జాక్షి నీక్షించినన్. 374

విరాటపర్వమునందు:—

శా. సింగం బాఁకటితో గుహాంతరమునన్ జేడ్పాటుమై నుండి మా
తంగస్ఫూర్జితయూథదర్శనసముద్యత్క్రోధ మైవచ్చునో
జం గ్రాంతారనివాసఖిన్నమతి నస్మత్సేనపై వీఁడె వ
చ్చెం గుంతీసుతమధ్యముండు సమరస్థేమాభిరామాకృతిన్. (4-95) 375

లకారప్రాసము, కాకుత్స్థవిజయమునందు:—

శా. మారుం డద్భుతశంఖ మొక్కటిని సంపాదించి దోర్మధ్యక
స్తూరీచర్చ నెపంబునం దనదుకే ల్దోపన్ సువర్ణత్వరే
ఖాలిప్తన్ శశి కత్తిఁ జూప నతఁ డుత్కంఠోత్థుఁడై చేర నిం
పారన్ బట్టుట దోఁచెఁ దద్గళము కేశౌఘంబు మోముం గనన్. 376

---

*ఈ పద్యము కళాపూర్ణోదయమందు గనఁబడదు. శృంగారశాకుంతలమునందు ద్వి. ఆ. 187 వ పద్యముగా నున్నది.

వ. ఈ పద్యములోను 'రేఖాలిప్సక్' అన్నచోటను రభరాభస్యే యను ధాతువువలనఁ
బుట్టినది లిప్సాశబ్దము గనుక సంధిగతప్రాస మాయెను. 377

## అప్రశస్తప్రాసము

ఆ. అప్రశస్తములగు ప్రాసజాలము లలం,కార[1]విస్ఫురములు గావు గానఁ
దివిరి ధూర్తులైన కవులు కల్పనఁజేసి, యొప్పిదంబు లనుచుఁ జెప్పరాదు. 378

వీథినాటకమునందు:—

ఉ. [2]కందుకకేళి సల్పెడు ప్రకారమునం బురుషాయితక్రియా
తాండవకేళి సల్పెడువిధంబునఁ బామరభామ లేఁతనీ
రెండఁ బ్రభాతవేళ రచియించెను గుబ్బలమీఁదిహారముల్
కుండలము ల్కురు ల్గదల గోమయపిండము లింటిముందటన్. 379

రామాయణమునందు:—

చ. [3]కద్దుకొని వేఁడిబాష్పములు గ్రమ్మి పయిం బడి పర్వ భీతిమై
నడ్డరుచు విన్ననైన హృదయంబునఁ బొల్పగుహారయష్టి[4]ప
య్యెద్ద దడియంగఁ గానఁబడి యంచిత నిర్మల రత్నభూషలన్
[5]దదుదితదృశ్యమానమణిధామసముజ్జ్వలభాతి దోఁపఁగన్. (యు-2356) 380

ఇవి పదియేడును ప్రధానప్రాసంబులు

ఇంక శబ్దాలంకారంబు లగు విశేషప్రాసంబు లెఱింగించెద:—

సీ. ప్రాసంబు సులభాక్షరం బైన సుకరంబు దుర్లభం బైనను దుష్కరంబు
తగ రెండుమూఁడునాలుగువర్ణములపదంబుల నెల్ల నొకభంగిఁ బొసఁగెనేని
వరుసఁ గావ్యముల ద్వంద్వప్రాసమును ద్ర్యక్షరప్రాసమును జతుఃప్రాసము నగుఁ
బదములఁ దుది నొక్కపగిదియక్షరములు దనరు నంత్యప్రాసమునకు నెందు
తే. బడిబడినివర్ణ మొక్కఁడు కడకు వెడలఁ, బలుకఁబడు నేని యది యనుప్రాసమయ్యెఁ
గంజలోచన యవి యలంకారశాస్త్ర, కథితములు వీని నేడింటిఁ గానవలయు. 381

---

1. విస్మిత (సూ). 2. కందుకకేళి ........... ఈపాఠమే క్రీడాభిరామములో ముద్రితమైయున్నది (రా). 3. కదుకొని...నదరుచు - ముద్రితరామాయణపాఠము (రా). 4. పయ్యెద దడియంగఁ గానఁబడియొక్ జితనిర్మల (పాఠాంతరము). 5. తదుచిత (సూ).

### సుకరప్రాసము

క. కమలదళనయన సకలా, గమవేద్య పురాణపురుష కరుణాకర మ
ద్రమహీశప్రియతనయా, రమణ యనుచుఁ బలుక సుఖకరప్రాస మగున్. 382

### దుష్కరప్రాసము

క. దుష్కృతగిరివజ్రాయుధ, పుష్కరసదనాధినాథ బుధనుత దవశో
చిష్కాశాహార యనక్, దుష్కర మని దీనిఁ బలుకుదురు ప్రాసజ్ఞుల్. 383

### ద్వంద్వప్రాసము

క. వ్యాసమునివినుత గోప, స్త్రీసముదయమానహరణ శృంగారరసా
వాసముగ నిట్లు ద్వంద్వ, ప్రాసము కావ్యములఁ జెప్పఁబడు నెల్లెడలన్. 384

### త్ర్యక్షరప్రాసము

క. తిర మగుఁ ద్రిప్రాసము సుం,దర మగుమురవైరిరూపు తరుణులకు మనో
హర మగు దానవులకు భీ,కర మగుఁ దపసులకు ముక్తికర మగు ననినన్. 385

### చతుష్ప్రాసము

క. ధీరుఁడు కమనీయశుభా, కారుఁడు కమలావధూటికామృదుహృదయా
ధారుఁడు కుమతిజనాధిక, దూరుఁడు కమలాక్షుఁ డనఁ జతుష్ప్రాస మగా. 386

### అంత్యప్రాసము

క. తొలుతను గురులఘువులలో,పల నెయ్యది పదముతుదిని బ్రాసమునకుఁ దా
పల నిల్చు నదియె నాల్గడు,గులకడఁ బ్రాసముల మొదలఁ గూర్పఁగవలయున్.

తే. అంఘ్రితుదిప్రాయి డాపలియక్షరంబు
గురువయినఁ బ్రాస మొక్కయక్కరమ యగును
గాక లఘువైన వర్ణయుగ్మంబు నడుచు
స్వరవిభేదంబు గాక కావ్యంబులందు. 388

క. నందాంగనాకుమారా, మందగిరిధీర దనుజమదసంహారా
బృందాగహనవిహారా, కందర్పాకార రాధికాస్త్రీజారా. 389

క. గోపవధూజనమదనా, గోపాలనచతుర కుందకుట్మలరదనా
గోపారివిజితకదనా, గోపతివాహప్తుధవళగోసమువదనా. 390

### అనుప్రాసము

క. నందసుత పురందరముఖ, బృందారకవంద్య దాసబృందావన గో
వింద యన ననుప్రాసం, బందం బగు నెందుఁ గృతులయందు ముకుందా. 391

క. పదులకుఁ బ్రాసంబులకును, విడువక చెల్లుంబడు లెల్ల వివరించితిఁ బా
ల్పడి వీనిలోనఁ సత్కృవు, లొడఁబడి కావలసినవి ప్రయోగింపఁ దగున్. 392

మత్తేభవృత్తకందగీతగర్భసీసము

సీ. వినయసంపన్నరవిప్రభూతరమణీనాథా పయోజేక్షణా నరాష్ట
విభయదాకారహావిర్భుగాయతరిపుప్రాణానిలాహీశ్వరా రమేశ
విలయకాలానలవిక్రమప్రథితసాల్వగ్రావవృద్ధశ్రవా వరేణ్య
విజయశీలా యదువీర కౌస్తుభధరా చక్రీ యశోదాత్మజా ముకుంద
తే. కరివరద పూతనాంతక గరుడగమన, సత్త్వసహిత కామజనక శంకరసఖ
కనకవసనసుందరదేహ వనధిశయన, సనకమునివినుతచరణసరసిజయుగ. 393

గర్భమత్తేభము

నయసంపన్నరవిప్రభూతరమణీనాథా పయోజేక్షణా
భయదాకారహావిర్భుగాయతరిపుప్రాణానిలాహీశ్వరా
లయకాలానలవిక్రమప్రథితసాల్వగ్రావవృద్ధశ్రవా
జయశీలా యదువీర కౌస్తుభధరా చక్రీ యశోదాత్మజా. 394

గర్భకందము

కరివరద పూతనాంతక, గరుడగమన సత్త్వసహిత కామజనక శం
కరసఖ కనకవసనసుం,దరదేహ వనధిశయనసనకమునివినుతా. 395

గద్యము. ఇది శ్రీమదాపస్తంబసూత్ర భారద్వాజగోత్ర కామెపల్లిపురమందిరనంద నందనచరణారవిందవందనాభిలాషమనీషాప్రాభవ వేంగనార్యతనూభవ విద్యావిశేష సురాచార్య కాకునూర్యప్పకవివిరచితంబైన యాంధ్రశబ్దచింతామణి యను వ్యాకరణ శాస్త్రంబునందు వళిస్వరూపంబును, నేకచత్వారింశత్సంఖ్యావిశ్రామంబులును, నగ్రాహ్యావిరామంబులును, ప్రాసలక్షణంబులును, సప్తదశప్రధాననిర్ణయమును, అప్రశస్త ప్రాసంబులును, శబ్దాలంకారప్రాసనిరూపణంబును గల వళిప్రాసపరిచ్ఛేదంబను తృతీయాశ్వాసము సంపూర్ణము.

# పద్యపరిచ్ఛేదము

## చతుర్థాశ్వాసము



సహ్యప్రత్యంతో

ర్వీసంభృత్ప్రభవకృష్ణవేణీతటభూ

[1]వాస్తైలేశ్వరపూర్వా

శా[2]సప్తసుయోజనప్రసన్న నమస్తే. 1

క. అవధారు శబ్దశాసనుఁ, డవనిఁ గలియుగమున కాది నా రాజమహేం
ద్రవరంబునఁ జెప్పిన యం,ధ్రవచోవ్యాకరణసూత్రతతిఁ దెనిఁగింతున్. 2

తే. ఘనుఁడు వాగనుశాసనకవివరుండు, ముందు వర్ణపరిచ్ఛేదమునకుఁ దుదిని
బద్యలక్షణ మెల్ల నేర్పడఁగఁ బల్కె, సొరిది సంక్షేపముగ నైదు శ్లోకములను. 3

పద్యపరిచ్ఛేదమూలసూత్రంబులు:—

### ఆర్యావృత్తశ్లోకంబులు

వృత్తం జాతి శ్చేతి ద్వివిధం పద్యం గణై ర్నిసర్గాఖ్యైః,
సంబద్ధం వృత్తం స్యా దుపగణమాత్రాభిరన్వితా జాతిః. 1
శాస్త్రార ఏకమాత్రాం లఘో ర్ద్విమాత్రే గురో రితి వదన్తి,
గౌలౌ గగలలసంజ్ఞౌ గ్లౌహగణో లఘుగురూ లగో వగణః. 2
గత్రితయం లత్రితయం మనసంజ్ఞా వాద్యమధ్యమాన్త్యార్ణాః,
గురవ శ్చే ద్భజసగణా లఘవో యది యరతసంజ్ఞికాః క్రమశః. 3
మిత్రౌ నగలా వింద్రా నలనగసలభరతా శ్చంద్రా మలఘుః,
రలరగతలతగనవనహాభలభగసలలనలలనగగసవసహాః. 4

దీర్ఘ స్సంయుక్తాద్యః ప్లూర్ణానుస్వారపూర్వవర్ణశ్చ,
ఏతే గురవ శ్శేషా స్సర్వే లఘ్వక్షరా ఇతి జ్ఞేయాః. 5

వ. ఈశ్లోకంబు[3]లైదును డొమ్మిదిసూత్రంబు లయ్యె నవియెల్ల నిందు వివరించెద. 4

---

1. వాస్తైవేశ్వర (ఫూ. ము. 1859). ఘాస్తైకేశ్వర (1922). 2. సప్తమ (ఫూ. ము.) సప్తమయోజనాంత సదన (పాఠాంతరము.) 3. లేసును (పె).

ఆ. [1]సకలభాషలందు ఛందంబు దెలియక, పద్యములు రచింపఁ [2]బాటి గామిఁ
దద్విధం బెఱుంగఁదగుఁ గావ్యములు సేయు, తలఁపు గలిగినట్టి[3]ధన్యులకును. 5

మ. హరభక్తుండగు భీమసత్కవి ననంతామాత్యునిం బెద్దన
ద్వరునిం దాతనఁ గాచిరాజు బసవప్ప న్భైరవు న్శ్రీధరుం
బరమోత్సాహమునం దగం దలఁచి చెప్పం బూనితి న్వారిచే
త రచింపంబడినట్టి ఛందములచందం బెల్ల నందంబుగాన్. 6

క. భువి నీ ఛందముఁ దెలియక, [4]కవితను రచియింతు ననుచుఁ గడఁగుట లెల్లన్
వివరింప నీఁత [5]నెఱుఁగక, తవిలి యమున దాఁటి పోవఁ దలఁచుట గాదే. 7

## ఛందఃప్రభావము

తే. ఆదిమూలస్వరూపుఁడై నట్టివేద, పురుషుఁ డాఱుప్రధానాంగముల వెలుంగు
వాని నెఱిఁగింతుఁ జేదిభూవరకృతాంత, తంగడాహ్వయదేశమధ్యమనిశాంత. 8

తే. శిక్ష నాస నిరుక్తంబు చెవులు ఛంద, మంఘ్రియుగ్మంబు కల్పంబు హస్తయుగము
జ్యోతిషము నేత్రయుగళంబు శబ్దవిద్య, సురుచిరానన మామ్నాయపురుషునకును.

తే. [6]వేదమునకుఁ బాదంబులై వెలయుకతన
ఛంద మన్నిటిలో [7]నవశ్యంబు గాదె
పురుషుఁ డఖిలాంగయుతుఁడయ్యుఁ జరణయుగము
లేక నడవ సమర్థుఁడే లోకమునను. 10

క. ఛందస్సూత్రంబులచే, తం దగఁ గూర్పంగఁబడి కదా వాక్యమణుల్
చెందుఁ జతుర్దశవిద్యా, సుందరహారంబులై యజునిసతిగళమున్. 11

## ఛందోవ్యాపకసంప్రదాయము

తే. అట్టి ఛందంబు నంది దా నందె ముందు, శివునిచే నంత నొక్కనిచేత నొకరు
వడసిరి సనత్కుమారకుంభజబృహస్ప, తీంద్రవాసుకిపింగళాహిప్రముఖులు. 12

క. [8]గురుఁడయి పింగళకాశో, దరపతి వెసఁ జెప్పె మానిదానవవిద్యా
ధరనిర్జరగంధర్వా, ప్సరోభుజగయక్షసిద్ధసాధ్యుల కెల్లన్. 13

వ. తత్స్వరూపం బెట్టి దనిన. 14

క. ప్రేమమున [9]బ్రహ్మ గాయత్రీమహిమగ్రంథకథితదివ్యచ్ఛందో
నామము లింకను దెలిపెదఁ, గామెపలీపురనివేశ కంసవినాశా. 15

---

1. ఈ పద్యము (పె)లో లేదు. 2. బాటు (ఓ). 3. ధన్యమతులు (సూ). 4. కవిత్వము రచింతు (ఓ; పూ. ము.) 5. నేరక (ఓ; పూ. ము.) 6. వేదములకు (సూ.) 7. ప్రశస్తంబు (సూ.) 8. కరుణను (సూ). 9. ధర్మ (వ. పె.)

అనుష్టుప్శ్లోకత్రయము

ఉక్తాత్యుక్తా తథా మధ్యా ప్రతిష్ఠా న్యా సుపూర్వికా,
గాయత్ర్యుష్ణిగనుష్టు ప్పు బృహతీ పఙ్క్తి రేవ చ. 1
త్రిష్టు ప్పు జగతీ చైవ తథాతిజగతీ మతా,
శక్వరీ చాతిపూర్వా స్యా దష్టి రత్యష్టి రేవ చ. 2
ధృతి శ్చాతిధృతి శ్చైవ కృతిః ప్రకృతి రాకృతిః,
వికృతి స్సంకృతి శ్చైవ తథాభికృతి రుత్కృతిః. 3

పదవిభాగ గద్యము

ఉక్తా, అత్యుక్తా, మధ్యా, ప్రతిష్ఠా, సుప్రతిష్ఠా, గాయత్రీ, ఉష్ణిక్, అనుష్టుప్, బృహతీ, పఙ్క్తిః, త్రిష్టుప్, జగతీ, అతిజగతీ, శక్వరీ, అతిశక్వరీ, అష్టిః, అత్యష్టిః, ధృతిః, అతిధృతిః, కృతిః, ప్రకృతిః, ఆకృతిః, వికృతిః, సంకృతిః, అభికృతిః, ఉత్కృతిః, ఏతాని షడ్వింశతి శ్ఛందో నామాని.

క. [1]యదుతిలక కామెపలిపుర, సదనా యివి యిరువదాఱు ఛందంబులకున్
మొదలుకొని వరుస వెంబడి, సదమలనామములు వీనిఁ జనుఁ దెలియంగాన్. 16

ఇతిహాసాదిస్వరూపము

ఆ. కవిత యనుచు నొకటి కల్పించి వాల్మీకి, చెలఁగి రామకథ రచించె మొదల
నతనిఁ జూచి చెప్పి రామీఁది కవు లెల్లఁ, గామెపల్లిగోపకామినీశ. 17

వ. అది యె ట్లంటేని. 18

తే. ఎఱుకు మును క్రౌంచమిథునంబు నేయఁ గాంచి
వగచి వాల్మీకి దాఁ బల్కు-వాక్యములును
బద్య మైనను నేర్చి చెప్పంగఁ దొడఁగెఁ
బూర్వరామాయణము నాఁడు పుట్టెఁ గవిత. 19

క. విను మితిహాసము కావ్యము, నన ద్వివిధం బయ్యెఁ గవిత యం దితిహాసం
బనుపమచాతుర్యపురా, తనవృత్తం బయ్యె భారతం బదియ కదా. 20

క. పుడమిని గవిచేఁ జెప్పం, బడునది కావ్యం బటంచుఁ బలుకుదు రార్యుల్
తొడిబడ నదియె కదా యిప్పుడు రామాయణ మనంగ భూనుతచరితా. 21

ఆ. ద్వివిధ మయ్యెఁ గావ్య మవని సంగీతసాహిత్యసంజ్ఞలను మహేంద్రవంద్య

1. యదుపతి కామెపలీపుర (పె).

సప్తతాళభవము సంగీత మాజయ, దేవకావ్య మదియె పోవచింప. 22

మ. ధర సాహిత్యము గద్యపద్యము లనందా రెండు భేదంబులై
పరగు న్గద్యమునందుఁ బాదనియతు ల్భావింపఁగా లేవు వా
క్స్ఫురణంబై విలసిల్లఁగా నుడువ నొప్పుం [1]గావ్య మెంతేనియుక్
మరుతం డ్రీ మఱి దీనికే వచననామం బయ్యె నాంధ్రంబునన్. 23

గద్యము. శ్రీవిలాసినీవక్షోరుహద్వయగిరిదుర్గసర్వాధ్యక్ష, పద్మజాండానేకభరణదక్ష, దక్ష జామాతృప్రథమవిశాలనేత్రప్రముఖనిఖిలబర్హిర్ముఖప్రస్తూయమాన శుభశీల, ధరణీతనూజాది దైత్యకాలయవనజరాసుతప్రభృతి దుష్టక్షితిపతినిగ్రహోపాయ పారీణ, సౌందర్యవిజితారవిందబాణ, బాణాభిధానపూర్వగీర్వాణేంద్రసహస్ర బాహురంభాస్తంభసునిశితకుఠార, ద్వారకాపట్టణవిహార, హారాంగదవలయమకర కుండలకిరీటాద్యశేషవిశేషభూషణభూషితగాత్ర, భూమిధరారాతిపుత్రమిత్ర, మిత్రకుమారికాంతిక కాంతారాంతరలతానిశాంతసంచరణచరణసముల్లాస, యోగీంద్రహృదయపయోజవాస, వాసవరత్నాభ, వారిజనాభ, నాగారిస్యందన, నందగోపనందన, కరుణాలవాల, కాంచనచేల, భుజగేంద్రశయన, పుండరీకనయన, ఆర్తరక్షణపరాయణ, గోవింద, ముకుంద నమస్తే నమస్తే పునస్తే పునస్తే. 24

వ. అని యివ్విధంబున గద్యరూపంబుగా నాదిమధ్యాంతశూన్యుండును, జతుర్దశభువనమాన్యుండును, సకలసద్గుణసంపన్నుండును, సజ్జనాసన్నుండును, భవబంధమోచనుండును, బంకజలోచనుండును, గందర్పకోటివిలాసుండును, గామెపల్లినివాసుండును నగు [2]గోపాలుని వినుతించు జనంబులకు ధర్మంబు కరతలామలకం, బర్థంబు ముంగొంగుబంగారంబు, కామంబు తంగెటిచెట్టునంబెట్టిన జుంటితేనియ[3]పెర, మోక్షం బంగణంబునం గల వెల్పుటా వివి నిశ్చయం బని విపశ్చిద్వచనంబులు ప్రచురంబులై వెలయుచుండు. 25

తే. కొంగను నిషాదుఁ డేయఁ గన్గొనిన వామ,లూరుభవునిశోకంబు లకారసహిత
మై కదా శ్లోక మయ్యెఁ బద్యంబు నండ్రు, దానిఁ గొందఱునాల్గుపాదములకలిమి.

మూ. సూ:—వృత్తం జాతి శ్చేతి ద్వివిధం పద్యం గణై ర్నిసర్గాఖ్యైః, సంబద్ధం వృత్తం స్యా దుపగణమాత్రాభి రన్వితా జాతిః. 1

తే. పాదనియమంబు గలయట్టి పద్యసమితి, వృత్తములు జాతులును నన ద్వివిధ మయ్యె
[4]నిల నిసర్గగణంబుల వృత్తము లగు, జాతు లుపగణమాత్రల జరుగుచుండు. 27

1. గావ్యఁడెం (వె. ము; సూ.) 2. గోపాలుబాలు (సూ). 3. పెరయ.(వె).
4. నిట (సూ.)

## ప్రథమప్రత్యయోద్ధారణ[1]క్రమము

క. అత్యాశ్చర్యము లగు షట్ప్రత్యయములు దాన నైన ప్రస్తారాఖ్య
ప్రత్యయమువలన గణములు, దైత్యాంతక తెలియఁజెప్పెద న దెట్లన్నన్. 28

మూ. సూ:—ప్రస్తార ఏకమాత్రాం లఘో ర్ద్విమాత్రే గురో
రితి వదన్తి. 2

క. భరితేందిర కామెపలీ,పురమందిర యొక్క మాత్ర భువి లఘువునకున్
గురువు ద్విమాత్రాయుత మీ,[2]యురవువలన రెండు లఘువు లొక గురువునకున్. 29

తే. మహిని లఘువులు నిడుపుగా మరుశరముల, వైఖరిని వ్రాయ నగు గురుల్ వానికట్టి
యగుట రెండేసి రేఖలు దిగువకోనలు, గలయఁగాఁ గ్రొన్నెలలభంగి నిలుపఁదగును

క. సమవృత్తప్రస్తార,క్రమ మిదివో యుక్త మొదలుగా నెన్నవ ఛం
దము వలయు నన్నిగురువులు, కమలాప్రియ యడ్డచాలుగా నిడి పిదపన్. 31

ఆ. బంతిబంతిమొదల భాసిల్లు గురు వెందు, దానిక్రింద లఘువు దానికుడిని
బైకి సమము వామభాగోర్వి గురువులు, నయ్యె సర్వలఘువు లైనదనుక. 32

తే. ఇటుల వ్రాయంగ నే ఛంద మెన్నిబంతు
లన్నిసమవృత్తములు దానియందుఁ బుట్టె
బంతి యొక్కొక్కసమవృత్తపాదగణము
లయ్యె నాలుగు పదముల నవియె నిలుచు. 33

ఇందునకు టీక. ప్రస్తార ప్రత్యయ మనంగా నిన్నవఛందంబున నెన్ని సమవృత్తంబులు పుట్టెను ? వానిలోపల నిన్నవసమవృత్తంబునకు నేయే గణంబు లని యడిగితేను సరి చెప్పేటి విధము:--వా రెన్నవ ఛందమున నడిగితేను అన్నిగురువులు అడ్డపఙ్క్తిగాను వ్రాసి ప్రస్తరించేది. అది యె ట్లంటేను—ఆబంతి మొదల ఎక్కడ గురు వుంటేను దానిక్రిందను లఘువుగా వ్రాసేది. ఆ లఘువునకు వలపలను మీఁదను గురు వుంటేను గురువున్ను లఘువుంటేను లఘువున్ను నివి పేది. ఏమిన్ని లేకుంటేను నేమిన్ని వ్రాయక ఊరకుండేది. ఈబంతిని ముందుగా వ్రాసిన లఘువునకు ఎడమదిక్కునను మీఁదను గురులఘువులలోపలను ఏది ఉన్నను దానిక్రింద గురువే నిలుపుచున్నా వచ్చేది. మీఁదను ఏదిన్ని లేకుంటేను గ్రిందనున్నా వ్రాయఁబనిలేదు. ఇప్పుడు వ్రాసేక్రమముననే క్రిందిబంతి చూచి యాక్రిందట దిరుగా దిరుగా బంతిని

1. చక్రము (పె. ప). 2. యొరవు (పూ. ము.)

అన్నిన్నీ లఘువులు వచ్చినదనుకాను ప్రస్తరించి అన్నిబంతులనున్ను లెక్కబెట్టఁగాను ఎన్నిఅయితేను యా ఛందమున అన్నిసమవృత్తములు పుట్టిన వనేది. ఎన్నవ వృత్తమడిగితేను అన్నవబంతిని ఉన్న గురువులు లఘువులు గణములు చేసి ఆ వృత్తమునకు ఏకపాదమునకు అవి గణము లని చెప్పేది. నాలుగుచరణములకున్ను ఆ గణములే నిలుచు నని తెలిసికోనేది. ఇరువైఆఱుఛందములకున్ను ప్రస్తరించేటిక్రమము ఈలాగుననే యని తెలుసుకోనేది. 34

క. భూమి నిసర్గోపగణ,స్తోమము వివరింతు వినుము సురరిపుభీమా
కామెపలీపుటభేదన,ధామా సుగుణాభిరామ దైవలలామా. 35

క. ఉక్తాత్యుక్తామధ్యల, వ్యక్తం బగు నాప్రతిష్ఠయందును గణముల్
సూక్తిమయములై పుట్టెను, భక్తపరాధీన కామెపలిపురవాసా. 36

నైసర్గికగణములు

ప్రథమచ్ఛందోజాతగణములు

క. గా యనఁగ నొక్కగురు వగు, లా యనఁగా ధాత్రి నొక్కలఘునామం బౌ
నీ యక్షరములు గణముల,పై యోగం బైనఁ గలయఁ బలుకఁగవలయున్. 37

ద్వితీయచ్ఛందోజాతగణంబులు

మూ. సూ:—గౌ లౌ గగలలసంజ్ఞౌ గ్లౌ హాగణో లఘుగురూ లగో వగణః.

క. గగ మాయె రెండు గురువులు, లగమును వగణంబు నయ్యె లఘువును గురువున్
జగతిని లఘుయుగ్మము లల, మగు గురువును లఘువు గలము హాగణంబు నగున్.

తృతీయచ్ఛందోజాతగణంబులు

మూ. సూ:—గత్రితయం లత్రితయం మనసంజ్ఞా వాద్యమధ్యమాన్త్యార్ణాః, గురవ శ్చే ద్భజసగణా లఘవో యది యరతసంజ్ఞికాః క్రమశః.

తే. మూఁడు గురువులు లఘువులు గూడిన మన, లాదిమధ్యాంతముల గురులైన భజస
లవియె లఘ్వక్షరములైన యరత లయ్యెఁ, గ్రమము దప్పక నెనిమిది గణములకును.

ఉపగణోత్పత్తిప్రకారము

మూ. సూ:—మిత్రౌ నగలా వింద్రా నలనగసలభరతా శ్చంద్రా మలఘుః । రలరగతలతగనవనహాభలభగసలలనలలనగగసవసహాః. 5

క. ద్వివిధం బయ్యెను గణచయ, మవని నిసర్గములు నుపగణాలియు ననఁగా
నివి నైసర్గగణంబులు, రవిశక్రశశాంకు లివి ధరణి నుపగణముల్. 40

తే. గరిమ నత్యుక్త మొదలుగాఁ గలుగునట్టి, మూఁట రెండేసి పంక్తులు మొదల విడిచి
మొదల లఘువున్న పంక్తుల మొదల లఘువు, వెండియును నిల్పు రవిశక్రవిధుగణములు.

వ. దీనికి తెలివిడి: అత్యుక్త యను రెండవ ఛందము ప్రస్తరించితేను నాలుగుపంక్తులు పుట్టెను. మధ్యయను మూఁడవది లిఖించితేను ఎనిమిది చాళ్లవును. ప్రతిష్ఠయను నాలవది వ్రాసితేను పదహారు వీథు లవును. ఈ మూఁడు ఛందములయందున్ను మొదలివి రెండేసిపంక్తులు విడిచి మిగిలిన వీథులలోను ఏవీథి మొదలను లఘువుంటేను ఆవీథిని ఆలఘువునకు మొదలను, మఱిన్ని ఒక్కొక్క లఘువు నిలిపేది. ఇటువలెనే ప్రస్తరించి ఒక్కొక్క చాలున గల గురులఘువులు గణములు చేసితేను అత్యుక్తయందలి రెంకుబంతులవిన్నీ సూర్యగణము లవును. మధ్యయందలి ఆఱుచాళ్లవిన్నీ ఇంద్రగణము లవును. ప్రతిష్ఠయందలి పదునాలుగువీథులవిన్నీ చంద్రగణము లవును. 42

క. నగణమును గురువు నగ మగు, నగణముతుది లఘువు గదియ నల మనఁ బరఁగున్
నగణముపై గగ ముండిన, నగగం బగు మఱియు నుపగణము లిట్లొప్పున్. 43

క. హాన లర్కగణము లనఁగాఁ, జను నింద్రగణములు భరత సలనలనగముల్
పనిఁబడి జాతులయం దివి, కనఁబడు నక్కరలు మొదలుగా శశి [1]కొప్పున్. 44

క. భలభగురుతలతగములును, మలఘురలరగములు నేడు మఱి నవనహలున్
నలలనగగములు నాల్గును, సలలసవసహములు మూఁడు చంద్రగణంబుల్. 45

స్వభావగణప్రస్తారము

| ఉక్తాఛందోజాతగణంబులు | మధ్యచ్ఛందోజాతగణంబులు |
|---|---|
| ∪ గగణము. | ∪∪∪ మగణము. |
| । లగణము. | ।∪∪ యగణము. |
| వెరసి ౨ ఉభయమున్ను. | ∪।∪ రగణము. |
| **అత్యుక్తాఛందోజాతగణంబులు** | ।।∪ సగణము. |
| ∪∪గగ గణము. | ∪∪। తగణము. |
| ।∪లగ గణము. (ఇదే వగణము). | ।∪। జగణము. |
| ∪। గల గణము. (ఇదే హగణము). | ∪।। భగణము. |
| ।। లల గణము. | ।।। నగణము. |
| వెరసి ౪ గణములు. | వెరసి ౮ గణములు. |

1. సొచ్చున్ (మూ).

## సూర్యేంద్రచంద్రగణప్రస్తారము

### సూర్యగణములు

{ ∪∪ / |∪ }

∪ | గలగణము.

| | | నగణము.

వెరసి ౨ ఉభయమున్ను.

### ఇంద్రగణములు

{ ∪∪∪ / |∪∪ }

∪ | ∪ రగణము.

| | | ∪ నగము.

∪∪ | తగణము.

| | ∪ | సలము.

∪ | | భగణము.

| | | | నలము.

వెరసి ౬ గణములు.

### చంద్రగణములు

{ ∪∪∪∪ / |∪∪∪ }

∪ | ∪∪ రగగణము.

| | | ∪∪ నగగగణము.

∪∪ | ∪ తగగణము.

| | ∪ | ∪ సవగణము.

∪ | | ∪ భగురుగణము.

| | | | ∪ నవగణము.

∪∪∪ | మలఘుగణము.

| | ∪∪ | సహాగణము.

∪ | ∪ | రలగణము.

| | | ∪ | నహాగణము.

∪∪ | | తలగణము.

| | ∪ | | సలలగణము.

∪ | | | భలగణము.

| | | | | నలలగణము.

వెరసి ౧౪ గణములు.

## గురులఘువర్ణనియమము

క. గురువు పరమేశ్వరాకృతి, యరయ లఘువు గిరికుమారికాకృతి గణముల్
పరికింపఁగఁ దత్ప్రకృతులు, మురహర గణములకు లక్ష్యములు వర్ణంబుల్. 46

మూ. సూ:—దీర్ఘస్సంయుక్తాద్యః పూర్ణానుస్వారపూర్వవర్ణశ్చ,
ఏతే గురవ శ్శేషా స్సర్వే లఘ్వక్షరా ఇతి జ్ఞేయాః. 6

క. ఇల జమిలియక్కరములకు, బలుసున్నకు నెడమ నూఁది పల్కెడువర్ణం
బులుఁ జూఁపి పలుకునవియును, లలి గురువులు కడమలిపులు లఘువు లఘారీ. 47

క. విను తన్వంగీ యని పల్కిన మూఁడును గురువు లయ్యె గిరిజ యనుచుఁ బ
ల్కిన మూఁడు లఘువు లయ్యెను, దనరు లిపుల కెల్ల నిట్లు దనుజవిభేదీ. 48

తే. కొమ్ముక్రారలు [1]ద్విత్వ[2]వర్ణమ్ము లగుట, వానియెడమవి గురువులు [3]పట్రసుడులు
ప్రాణములు గాన వానిడాపలను గల్గు, నక్కరము లెల్ల లఘువులు నిక్కముగను.

1. మఱి ద్వివర్ణమ్ము (సూ). 2. వర్ణంబు (పూ. ము). 3. వట్రుసుడులు (పూ.ము).

ఆ. వ్యంజనాక్షరంబులందుఁ గ్రిందటివ్రాఁత, లైనవట్రసుడులు నైత్వములును
వానిఁ గూడి యున్నస్వరములు కాని జ, డ్డక్కరములు గావు యజ్ఞరూప. 50

ఆ. అనృతసదృశ మగు మహావృజినంబును, బిత్రుసమర్చఁ బోలు నతిసుకృతము
నమృతసింధుశాయి[1]సమమగుదైవంబు, గలుగ దనఁగ లక్ష్యములు ముకుంద. 51

ఆ. ఆంధ్రకృతులమాట కాదివర్ణముక్రింద, నూఁదఁబడనిజడ్డ లుండెనేని
వానియెడమ నున్న[2]వ్రాలునందును గూడి, గురువు లనుచు గణము గూర్పవలదు.

తే. భవవినుతనామ వ్రజధామ ప్రథనభీమ, కంజదళనేత్ర స్తుతిపాత్ర క్ష్మాకళత్ర
శౌరి ప్రధ్వస్తవైరి భ్రాజత్కిరీట, హారకేయూర యనఁగ లక్ష్యంబు లయ్యె. 53

సర్వగణలక్ష్యంబులు

క. ఇలఁ బద్మా యన గగ మై, పొలుచు రమా యనిన వగణమును లగమునునై
వెలయు గిరి యనఁగ లల మగు, లలి లక్ష్మి యనంగ నగు గలము హగణంబున్.

క. మయరసతజభన[3]గణముల, భయమునఁ బింగళుఁడు దొల్లి పక్షీంద్రునితో
రయమునఁ బల్కినమాటల, [4]పయిపొల్ల లటంచుఁ జెప్పఁబడు నెనిమిదియున్. 55

వ. అవి యెయ్యవి యనిన: [5]ధీశ్రీస్త్రీమ్, వరాహాయ్, కాగుహార్, వసుదాన్, సాతే
క్వల్, [6]కథాసజ్, కింపిదభ్, నసహన్-అనియెడు నీ యెనిమిది వాక్యంబులయందు
నొక్కొకదానికి మొదల నుండెడు మూఁడక్షరంబులకు నైన గురులఘువులకు
నాలవది యగు పొల్లు గణసంజ్ఞాక్షరం బని వియద్గంగాతరంగిణీరంగదుత్తుంగభంగ
శృంగారసంగతోత్తుంగదయాపాంగసుధారసైకపావనాంగుం డగు పింగళభుజంగమ
పుంగవుండు వేదాంగంబునందు ముంగల నెఱింగించె నట్లు గావున. 56

క. శ్రీరామా యన మగణం, బౌరయ ఘనుఁ డనఁగ నగణ మగు మధ్యా ప్ర
స్తారాద్యవసానంబుల, నీరెండును వెలయుఁ గ్రమత నెఱుఁగఁగ వలయున్. 57

క. ధీరుఁ డన భగణ మొప్పు ము, రారియనం జగణ మయ్యె సనఘా యనఁ జె
న్నారు సగణంబు వీనికి, నారయ గురు లాదిమధ్యమాంతగతంబుల్. 58

క. సౌరిది నుపేంద్రా యనినను, బరువడి యగణంబు వల్లభా యన రగణం
బరుదుగ గోవింద యనన్, ధరఁ దగణము క్రమత లఘుయుతము లీ మూఁడున్.

తే. నరమృగా యన నగమగు నరసఖ యనఁ, దలఁకొను నలంబు నరకజైత్రా యనంగ
నగగ మై తగు నీగతి జగతి నింద్ర, చంద్రగణములు మఱియును జను నుపేంద్ర.

గణాధిదేవతాఫలంబులు

తే. కంసమర్దన కృతిముఖగ్రాహ్యవర్ణ, సూత్రమున శబ్దశాసనసూరివరుని

---

1. సముఁడగు (సూ). 2. వ్రాలనందునఁగూర్చి (సూ). 3. గణములు (సూ).
4. పయిపొల్లులటంచ (సూ). 5. మాగూకామ్ (సూ). 6. కదాసజ్ (సూ).

చేత సంక్షేపముగ మును చెప్పఁబడిన, శుభగణము లిచ్చుట వచింతు సుకవు లలర.

మూ. సూ:—యే చ శుభగణా స్త ఏవ కావ్యాదౌ గ్రాహ్యాః. 7

క. తలఁపఁగ శుభఫలదాయక, ములు మంగళదేవతాకములు నగు గణముల్
నిలుపఁదగుఁ గృతిముఖంబునఁ, దెలిసి కవీశ్వరుఁడు పతి కతిశ్రేయముగాన్. 62

ఆ. బాలచంద్రనిభము పార్వతీవల్లభు, దాని యుచ్చరించుతఱి ద్విమాత్ర
హరలఁదక్క గణములం దెల్ల మొదలను, భూతిదాయి గురువుఁ బొగడ వశమె.

క. శరసన్నిభము లలసజే, తరగణములమొదల భద్రదాయి పలుకుచో
ధర నేకమాత్ర హిమభూ, ధరనందన దాసి లఘువుఁ దరమే పొగడన్. 64

ఆ. గగము భూమిగణము లగ మంబుగణమును, లలము వాయుగణము గలము పావ
కమును మధ్యసైన కతమునఁ దత్సమా, నంబులై శుభాశుభంబు లొసఁగు. 65

క. మయరసతజభనలకు [1]భూ, పయోగ్ని పవనగగనరవిపద్మారివృషా
హ్వయము లీశులు శివజయలయ, భయ[2]శుభరుగ్ధనముదములు ఫలములు వరుసన్. 66

వ. అది యెట్లనిన నథర్వణవేదముఖంబున మగణంబు వసుమతీదేవతాకంబు గావున శివప్రదం బని మహానాటకంబునందు "విఘ్నేశో నస్స పాయా" త్తని హనుమంతుండును, సూర్యశతకంబునందు "జంభారాతీభకుంభోద్భవ" మని మయూరుండును, మేఘసందేశంబునందు "కశ్చిత్కాంతావిరహగురుణా" యని కాళిదాసుండును, కాలామృతమునందు "శ్రీమద్వేంకటనాయక" మ్మని మదీయాన్వయప్రభవుం డగు తిరుమలభట్టారకుండును, భారతంబునందు "శ్రీవాణీగిరిజా" యవి వాగనుశాసనుండును, కవిజనాశ్రయమునందు "శ్రీకాంతా" యని వేములవాడ భీమకవియును, ఛందంబునందు "శ్రీరామా స్తనమండలీమిళితకాశ్మీరార్ద్రవక్షంబుతో" నని యనంతుండును మొదలం గదియించిరి. యాజుషామ్నాయాద్యం బగు యగణంబు జీవనదేవతాకంబు గాన జయప్రదం బని యాదికావ్యంబునందు "తపస్స్వాధ్యాయనిరత" మ్మని వాల్మీకియు, ప్రథమశైవస్తవంబునందు "మహిమ్నః పారం తే" యని పుష్పదంతుండును, సౌందర్యలహరియందు "శివ శ్శక్త్యా యుక్తో" యని శంకరాచార్యభారతులును తొలుత నిలిపిరి. ఋక్సామంబులకుం బ్రథమంబగు రగణ మాశ్రయాశదేవతాకంబు గాన లయప్రదం బని యెల్లవారు నాది నిడ నోడిరి. కవికంఠపాశంబునందు "వ్యోమసూర్యం వితను తే" యని పల్కినకతంబునఁ బంచత్వంబునొందె. సగణంబు దహనసఖదేవతాకంబు గాన భయప్రదం బని కవివరులు మొదలంగూర్ప వెఱచిరి. వెఱవక 'శాలినీసహకారంబు'నందు "అవలంబ్యస్వహేరంబ" మని సార్వభౌముండును, వృత్తరత్నాకరమునందు "సుఖసంతానసిద్ధ్యర్థ" మని కేదారకవియును రచియించి పంచత్వంబు నొందిరి. 67

---

1. భూపయోగ్న్యనిలగగనభాను (సూ). 2. బల (సూ).

తే. గగన మేలిక గావునఁ దగణమునకు; ఫలము శూన్యం బటందు రా పలుకు మిథ్య
యఖిలభూతంబులందు నిత్యమయి నిల్చు, వ్యోమము శుభప్రదంబు గాకుండుటెట్లు.

ఆకాశము నిత్యమైనందుకు భాగవతము ద్వితీయస్కంధమునందు:—

ఉ. సర్వఫలప్రదాతయును సర్వశరణ్యుఁడు సర్వ[1]శక్తియుక్
సర్వజగత్ప్రసిద్ధుఁడును సర్వ[2]గుణుండును నైన చక్రియా
సర్వశరీరులు [3]న్విగతసంగతిఁ జెంది [4]విశీర్యమాణులై
పర్వినచో [5]నభంబుగతి బ్రహ్మము దాఁ జెడకుండు నెప్పుడున్. (2-210) 69

తే. ఎల్లరును శుభదము లని యెన్నినట్టి, గణములకు వ్రాయు టేపాటి? కాని వనిన
తజలు మంచివిగా వ్రాయఁ దగు మహాక,విప్రయోగలక్ష్యంబులు వెదకి పెక్కు. 70

వ. అవి యెయ్యవి యనినఁ బ్రక్రియాకౌముదియందు "యేనాక్షరసమామ్నాయ"మని ధర్మకీర్తియు, తర్కభాషయందు "బాలోపి యో న్యాయనయే" యని కేశవ మిశ్రుండును, మంత్రదర్పణమునందు "ఆధారపద్మవనఖేలనరాజహంసీ"మని పృథివీధరాచార్యుండును, కృష్ణవిజయంబునందు "పాయాదపాయా" త్తని కుసుమాయుధుడును, సాహసాంకంబునందు "అవ్యాత్సవో" యని పరిమళుండును కావ్యాదిని బ్రతిపాదించిరి. మఱియు "ఆరోగ్యం భాస్కరా [6]దుపైతి" అని మనువచనంబు గలుగుటం జేసి. 71

తే. అరయ నారోగ్యకరుఁడైన యరుణుఁ డేలు
జగణమున నెట్లు రోగంబు సంభవించుఁ?
గాంతి యగుఁ గాని రోగంబు గాదు రుక్ప
దార్థ మనుచు వెల్లంకితాతప్ప చెప్పె. 72

వ. కావున శిశుపాలవధంబునఁ "శ్రియఃపతి శ్రీమతి" యని మాఘుండును, కిరాతార్జునీయంబునందు "శ్రియః కురూణా" మని భారవియును, మణిదర్పణమునందు "దివాకరం నమస్కృత్య" యనియును [7]శాకునవామగ్రంథంబునందు "విరించినారాయణశంకరేభ్య" యనియును, ఛప్పన్నంబునందుఁ "ప్రణమ్య లోకకర్తార"

---

1. శక్తుఁడుక్ (అచ్చు. భా). 2. గతుం డగు చక్రపాణి యా. 3. విగమ. 4. నిశీర్య. 5. అచ్చు భాగవతములోని పాఠము అప్పకవి మతమున కేమాత్రమును ఆధారము కాదు. నాలవపాదములో 'నభంబుగతి బ్రహ్మము' అని లేదు; 'అభంగగతి బ్రహ్మము' అని ఉన్నది. ఏపాఠము సాధువో? అయితే, భాగవతము పూర్వముద్రణములలోను వ్రాతప్రతులలోను నభంబు' అనే ఉన్నది. ఈపాఠము చూచి అప్పకవి వ్రాసి ఉండును. (గి) నభంబుగతి యన్ననే యాకాశమునకు బ్రహ్మమునకు సమానధర్మమగు నిత్యత్వమేర్పడును (పూ. ము). అకాడెమీ భాగవతప్రతిలో 'నభంబు' అను నొక్క పాఠమే గ్రహింపఁబడినది; పాఠాంతరములు చూపఁబడలేదు(రా). 6. దిచ్ఛేత్ (ప). 7. లాకునలనామ శాకునగ్రంథంబునందు (పె); లూకుండును శాకునవామ (ప).

మనియును, భోజరాజీయంబునందు "సునీతిశాస్త్రసద్విద్యా" యనియును ముందరం బొందించిరి. భగణంబు సుధాకరదేవతాకంబు గాన ధనప్రదం బని శుభ మపేక్షించి భారతశేషమగు విరాటపర్వము ప్రారంభించునప్పుడు "శ్రీ యన గౌరి నాఁబరఁగు" నని తిక్కనయును, శ్రీమద్రామాయణమునందు "రామునిశుభచరితములను" అని భాస్కరుండును, యుద్ధకాండమునందు లంకాదహనము పట్టుకథ ఉపక్రమించుచును "శ్రీయుతమూర్తియైన" యని యయ్యలభట్టారకుండును, నృసింహపురాణము నందు "శ్రీకి నిరంతరం" బని ప్రబంధపరమేశ్వరుండును, రుక్మాంగదచరిత్రము నందు "శ్రీమయపత్రముల్ జడలు" అని ప్రౌఢకవి మల్లనయుం బ్రయోగించిరి. నగణం బమృతాంధోనాథదేవతాకంబు గాన సకల భోగప్రదం బని నలోదయము నందు "హృదయసదా" యని కాళిదాసుండును, శివభద్రంబునందు "ప్రణమిత శిరసి" యని కవివరుండును, ఆరణ్యపర్వావశిష్టంబునందు భీమకవి శాపభయంబున జయమగోరి "స్ఫురదరుణాంశురాగరుచి" అని శంభుదాసుండును, త్రిస్థలీదండకమునందు "విజయనగర హేమకూటంబున న్నిల్చి" యని నంది తిమ్మనయుం జెప్పిరదియుం గాక. 73

సీ. గ్రహములలోన భాస్కరునిచందంబునఁ దరులలోఁ బారిజాతంబుకరణి
క్ష్మాధరంబులలోనఁ గనకాద్రికైవడి నదులలో జహ్నుకన్యకవిధమున
దైవతంబులలోన దైత్యారిచాడ్పునఁ బ్రమథులలో శూలపాణిపగిది
[1]మృగములలోన గరిద్వేషిభాతిని విద్యలలోన వేదముక్రియ
తే. క్షేత్రములలోన వారణాసీస్థలంబు, శివి నిభములలోన నైరావణంబు
రీతి గణములలోనఁ జర్చించి చూడ, నగణ మొప్పారు శుభనిధానంబు గాన. 74

క. కృతిమొదల నిలిచినప్పుడు, మతిఁ దలఁపఁగ నుపగణములు మగణాదులతో
జత గూడి యా ఫలంబులె, పతి కిచ్చు రవీంద్రశీతభానుల మహిమన్. 75

## అష్టగణ [2]లక్షణంబులు

సీ. చంద్రసూర్యాగ్నిలోచనుఁ డగుముక్కంటిమూఁడునేత్రములను మూఁడుగురువు
లావిర్భవించి మధ్యాఛందమున కాదియై మగణం బయ్యె నందువలన
జనియించెఁ బ్రస్తరించినక్రమమున యరసతజభన లనంగ సప్తగణము
లివి మగణముఁ గూడ నెనిమిదిగణములై తనరు [3]పీటికి రూపదైవవర్ణ
తే. కులరసస్వరదిగ్యామగోత్రయోని, గణభరాశిగ్రహాతదీయకాంతిజనక

---

1. 'మృగములలోఁ గరిద్వేషిభాతినిజూడ' అని పూర్వముద్రణములం దన్నిటఁ గలదుగాని యతిభంగము. 2. పూ. ము. అన్నిటను 'లక్ష్యంబు' లని యున్నది; గాని తప్పు. 3. 'పీనికి' అనుటకుబదులు 'పీటికి' అనియే అన్నితాటాకుపుస్తకములందును ఉన్నది. (శ)

తనయఫలములు నాఁబదునెనిమిదియును, దెలిసి కృతిముఖమునఁగూర్పవలయుఁగృష్ణ.

### మగణలక్షణము

సీ. అలఘుత్రయంబు కాశ్యపము గోత్రము వన్నె పచ్చన సంతతి పాదజంబు
ధరణి దైవంబు రౌద్రము రసంబు శుభంబు ఫల మాదియామ ముత్పత్తివేళ
స్వరము మధ్యమము శంబరయోనియును దైత్యగణమును నగువృషర్క్షంబు తార
వృశ్చికాఖ్యము రాశి విపులాకుమారుండు గ్రహము వానిశరీరకాంతి యెఱుపు
తే. ప్రమథనాథునిలోచనత్రయము జన్మ,భూమి గారాబుపట్టి యంభోగణంబు
మందిరము శంభుకోణంబు మగణమునకు, దానవవినాశ కామెపల్లినివేశ. 77

### యగణలక్షణము

సీ. ఆదిలఘువు ద్వితీయప్రహరము జన్మవేళ బ్రాహ్మ్యంబు భావింపఁ గులము
గౌతమగోత్రంబు కారుణ్యము రసంబు జలము దైవమ్ము పంచమము స్వరము
కపియోని మర్త్యంబు గణము పూర్వాషాఢ నక్షత్ర మిష్వాసనంబు రాశి
గ్రహము గురుండు తత్కాంతి పీతాభంబు వరుణునిదిక్కు నివాసభూమి
తే. తండ్రి ధరణి గణంబు సంతాన మగ్ని, దేవతాకంబు ఫల మతిభావుకంబు
హరిణవర్ణంబు తనుకాంతి యగణమునకు, దానవవినాశ కామెపల్లినివేశ. 78

### రగణలక్షణము

సీ. మధ్యమలఘువు యామంబు మూఁడవయది క్షాత్రంబు కులము రక్తంబు చాయ
దైవతంబు స్వరంబు దైత్యంబు గణము దస్రము యోని శతతార జన్మభంబు
రాశి కుంభము వికర్తనసుతుండు గ్రహంబు ఖంజనాథంబు తత్కాయకాంతి
శృంగారము రసంబు కృష్ణవర్ణ్మ యధీశుఁ డాంగిరసము గోత్ర మంబుగణము
తే. గణుతి సేయంగఁ గడుపారఁ గన్నతండ్రి, యనుఁగుఁబట్టి సకారంబు వ్యథఫలంబు
రచ్చపట్టు హుతాశాశ రగణమునకు, దానవవినాశ కామెపల్లినివేశ. 79

### సగణలక్షణము

సీ. గురు వంత్యవర్ణంబు ఘోరంబు రసము వంశంబు పంచమము తేజంబు నలుపు
ధవుఁడు మారుతము గోత్రంబు కౌశిక ముని కిపట్టు వాయవ్యంబు ఫలము లయము
నాకేశము గణంబు హస్త తారక యోని మహిష మంగన రాశి గ్రహము బుధుఁడు
వానిదేహము పీతవర్ణంబు స్వరము గాంధారంబు యామంబు నాలవయది
తే. యేడుచేతులు గలదయ్య మేలునట్టి, వ్రాయి జనకుఁడు గగనదైవత్య మాత్మ
సంభవుం డెంచి చూడంగ సగణమునకు, దానవవినాశ కామెపల్లినివేశ. 80

తగణలక్షణము

సీ. అవసానమున లఘు వాకాశ మీశుఁడు రసము శాంతంబు భార్గవము గోత్ర
మనిలదైవత్యంబు జనకుఁడు వనజబాంధవదైవతాఖ్యుండు నందనుండు
జనన మగ్రజము పంచమము యామము వర్ణ మసితంబు ఫలము శుభాభివృద్ధి
సౌరంబు గణము పుష్యమి తార బస్తంబు యోని రాశి కుళీర ముడువిభుండు
తే. గ్రహము తద్విగ్రహచ్ఛవి తుహినశైల, సన్నిభంబు నిషాదసంజ్ఞంబు స్వరము
తావు దేవేంద్రభాగంబు తగణమునకు, దానవవినాశ కామెపల్లినివేశ. 81

జగణలక్షణము

సీ. నడుచక్కి నుండు వర్ణము గురు వాఱవయది యామ మన్వవాయంబు క్షత్రి
యము రుక్కు ఫలము శోణాభంబు రుచి నభోగణ మయ్యె శీతాంశుగణము కొడుకు
నరసంజ్ఞికంబు గణంబు యోని వృషంబు రెండవ ఫల్గుని రిక్క రసము
వీరంబు రాశి కంఠీరవం బాత్రేయగోత్ర మంబరచారి కువలయారి
తే. యతనిమైచాయ కెంపు పూర్వాశ యిరవు
ఋషభసంజ్ఞంబు స్వరము త్రయీతనుండు
జలజబంధుఁడు వేలుపు జగణమునకు
దానవవినాశ కామెపల్లినివేశ. 82

భగణలక్షణము

సీ. ప్రథమాక్షరము ద్విమాత్రము కాపిలము గోత్ర ముత్తరం బిరవు మహోరగంబు
యోని మృగోక్షంబు లుడురాసు లుశనుఁడు ఖచర మాతఁడు మల్లికానిభాంగుఁ
డూరుజంబు కులంబు సూరదైవత్యంబు జనకుఁ డైంద్రము చూలు స్వరము షడ్జ
మధిపతి జాబిల్లి యాంది తేయంబు గణంబు సప్తమము జన్మప్రహరము
తే. రసము హాస్యంబు వన్నియ రజతనిభము, ఫలము ధనహేమమణివస్త్రపశుతనూజ
పరిజనాశ్వాదిసంప్రాప్తి భగణమునకు, దానవవినాశ కామెపల్లినివేశ. 83

నగణలక్షణము

సీ. ఏకమాత్రలు మూఁడు నింద్రుఁడు పతి యద్భుతము రసంబు నిశీశదైవతాశ
మారయఁ దండ్రి బృందారకాధీశునిదంతావళం బుండుతావు నెలవు
దివ్యభోగం బిగి తెలుపు వర్ణము జాతి విప్ర ముద్భవవేళ వేఁగుజాము
రవము షడ్జము ప్రవరంబు వాశిష్ఠంబు చుక్క రేవతి గాము సురగురుండు
తే. వానితేజంబు పచ్చన యోని గజము, రాశి మీనంబు గణము సుధాశనంబు
నందనుఁడు లేఁడు మధ్యాను నగణమునకు, దానవవినాశ కామెపల్లినివేశ. 84

## దేవతాంకితనియమంబులు

క. స్వరమును జామును దిక్కును, బరికించి కవీశ్వరుండు పదపద్యంబుల్
సురనామాంకితములుగా, విరచించినఁ గలుగు సకలవిభవము లెపుడున్. 85

## స్వరకూటము

క. నిరతము నిషాదముఖ్య, స్వరములపదములు రచించుచక్కని దత్త
త్స్వరగణములె మొదలను గూర్తురు గానకళాయుగంధరులు భద్రేచ్ఛన్. 86

## యామకూటము

క. పనివడి పద్యం బే[1]జా,మునకు రచింపంగ వలయు మొనలను నాజా
మునఁ బుట్టినగణ మిడఁ దగు, ఘననీకాశప్రకాశ కామెపలీశా. 87

## దిక్కూటము

క. ఏదిక్కున నెలకొను గణ, మాదిని గూర్పంగఁబడియె నపుడు కృతికిఁ దా
నాదిక్కున కభిముఖమై, మోదంబునఁ జెప్పవలయు మురనరకహరా. 88

## నరాంకితనియమంబులు; దగ్ధాదితారలు

తే. దగ్ధమును జ్వలితము ధూమితంబు మృతము, గదయుతము నగుతారలగణము లాది
నిడఁగ నొల్లరు విభునకు నిష్టసిద్ధి, కలుగఁ గోరెడునట్టి సత్కవులు కృతుల. 89

వ. వీనిలక్షణం బంతయు ముందర రెండవపరిచ్ఛేదంబున వర్ణదుష్టతారానిర్ణయంబునందు
విస్తరింపఁబడియెఁ గావున నది చూచి తెలిసికొనేది. 90

## నాయకకూటంబులు

చ. [2]అలయక కబ్బపుందొరకు నాదిగణంబునకుం గ్రమంబునన్
గులములు యోని లింగములు గోత్రములు న్నతి కాంతులు న్గణం
బులు నుడురాశి ఖేటములుఁ బొందిక లై శుభదాయకంబు లై
వెలయ నరాంకితంబులు కవిప్రవరుల్ రచియింపఁగాఁ దగున్. 91

క. కుతలమున వధూవరులకుఁ జతురత దైవజ్ఞమణి విచారించుగతిన్
కృతికన్యానాయకులకు, హితమతిఁ దెలియఁ దగు సుకవి యివి తొమ్మిదియున్. 92

## గణకులకూటము

తే. నాథుకులమును మొదలిగణంబుకులము, నొకటి గాక విజాతులై యుండెనేని
భిన్నకులజాత యగు చంద్రబింబవదనఁ, గేలు పట్టినపగిది దుష్కీర్తిఁ జెందు. 93

## గణయోనికూటము

క. జా నగు నాయకతారా, యోనియుఁ గృత్యాదిగణభయోనియు వైరం
బూనక యుండ నహల్యా, జానివచనమున నెఱుంగఁజను సుకవులకున్. 94

---

1. జామునను (సూ). 2. అలరఁగ (సూ). 3. గవి ([illegible]).

తే. తత్తదాఖ్యముఖార్ణసంతతికి నైన, తారకలు గావు ఛందోమతంబునందు
జన్మతారక లని బహుజనము లాడు, కతన నవియె వచించితి గణములకును. 95

క. వర్ణపరిచ్ఛేదంబున, నర్ణములకుఁ గూటనిర్ణయం బంతయు వి
స్తీర్ణముగా మును చెప్పితిఁ, గర్ణాహితమిత్ర దానిఁ గని తెలియనగున్. 96

గణలింగకూటము

క. మొనగణమురిక్క లింగం,బును బతినక్షత్ర లింగమును వైరముఁ జెం
దిన నాయకు ధన మెల్లను, మనుజపతి హరించుఁ బంచమాసంబులకున్. 97

గణగోత్రకూటము

క. పతిగోత్ర ప్రకరములో, సతతంబును బలుకఁబడిన సన్మునిగోత్రాం
కితము లగు గణము లతినిం,దితములు కావ్యాది [1]నాదితేయసహాయా. 98

గణకాంతికూటము

తే. నాయకునికాయ మే చాయ నలుపు మీఱు, నరసి తద్వర్ణముఁ దనరారునట్టి
గణము పద్యాదిఁ గూర్చినఁగలుగు శుభము,వ్యత్యయంబయ్యెనేని దేహంబుచెడును.

క. శ్వేతము నీలము నేకము, భూతలమున రక్తపీతములకు నభేదం
బై తనరు నరతనుద్యుతు, లీతెఱఁగునఁ దెలియవలయు [2]నిభపతివరదా. 100

గణదేవాదికూటము

తే. గద్యపద్యాదిగణతారకాగణంబు, భర్తృనక్షత్రగణమును బంధులైన
వత్సరశతంబు బ్రతుకుఁ గావ్యప్రభుండు, మైత్రి లేకున్న నెలకు ధర్మపురిఁ జేరు.

గణనక్షత్రదూరము

ఆ. ఆదిగణమురిక్క కధిపతినక్షత్ర, మెన్నఁ బదియు మూఁటి కెక్కుడైన
బ్రతుకు నూఱు వత్సరంబులు కృతినేత, తక్కువైన వేగఁ దనువు విడుచు. 102

గణరాశికూటము

క. పదపద్యగద్యముఖమునఁ, [3]గదియ గణమురాశి[4]నుంచి గణుతించిన నా
రదనుత విభురాశి శుభప్రద మై యుండంగ సుకవి పరికింపఁ దగున్. 103

గణఖేటకూటము

క. మహి నధినాయకురాశి, గ్రహమును గృతిముఖగణోడురాశిగ్రహముల్
మిహిరేందులు తమ గతిలో, సుహృత్తులై యున్న సరియ చుట్టము గాదే. 104

---

1. నాడెనేనసహాయా (సూ). 2. నిభరాడ్వరదా (సూ). 3. గదయు (పె. ప. పూ. ము.) లోను. 4 అ. 126-వ పద్యములో నున్నది. 4. తాటాకుపుస్తకములలో 'నుంచి' అనియే ఉన్నది.

క. కొందఱు జ్యోతిశ్శాస్త్రము, పొందు వదలి భిన్నమార్గముల గణములకుం
బొందించుదురు గ్రహముల నా, చందమునకు గణము శాస్త్రసాధక మెందున్.105

## కృత్యాదిగణద్వయకూటములు

తే. మొదల నుండు గణద్వయంబునకు లెస్సఁ, జూడఁ దగు యోనిలింగగణోడురాశి
ఖచరతత్త్వాంత్యమైత్రీకరసనామ, కూటములు తొమ్మిదియు నిశాటదమన. 106
ఆ. ప్రథమగణము వధువు పైగణంబు వరుండు, నగుట నా గణద్వయంబునకును
పొత్తు గలిగినట్టి పొత్తంబు ముంగిటఁ, గలుగువేల్పుటావు గాదె పతికి. 107
ఆ. తొలుత నేడుకూటములు మాతృకాపరి, చ్ఛేదమునను దెలియఁ జెప్పఁబడియెఁ
గాన వాని మాని కడమవి రెండును, వివరపఱుతు నిచటఁ గవులు పొగడ. 108

## గణమైత్రిక కూటము

ఆ. తండ్రికొడుకు లగుచుఁ దనరారు గణములు, గలసి మెలసి కృతిముఖమున నిలుచు
రసలనడుమఁ బచ్చికసవు వైచిన మండు, నగ్నిపవనగణము లగుట నేమొ. 109
క. సుతజనకులు [1]గదిసిన ధన, యుతుఁ డగుఁ గృతిభర్త రెండు నొకగణ మైనన్
గుతలాధినాయకుం డగు, నితరగణద్వయము గూడ నిల్పఁ గూలున్. 110

## గణరసకూటము

క. మొగదలఁ గల గణయుగమున, కగపడురసములకు వైరమగు పొత్తము భ
ర్తగళంబునఁ జుట్టిన పా, ముగతిం దత్ప్రాణపవనములు భక్షించున్. 111
తే. తలఁప శృంగారబీభత్సములకుఁ బగలు
హాస్యకృపలకుఁ బోరు రౌద్రాద్భుతముల
కధికవైరంబు వీరభయానకముల
కీసు శాంతంబునకుఁ జెల్లు నెనిమిదియును. 112
క. రసములకు రెంటికిని సమ, రస మైన శుభంబు వైరరససంగతి సా
ధ్వస మొకరస మైనను సం, తస మన్యరసములు గూడినను ముద మొదవున్.113

## ప్రశస్తకూటంబులు

తే. [2]క్షితిసురుల కాఱు ధారుణీపతుల కైదు, వైశ్యులకు నాల్గు శూద్రాంత్యవర్ణములకు
మూఁడు రెండును శుభకరం[3]బులయియున్నఁ, జాలునని యె సంహితలోన శౌనకుండు.
తే. విప్రులకు గ్రహమైత్రి యుర్వీపతులకు, గణవిధము వైశ్యులకు రాశిగణన శూద్ర
నీచులకు యోనితార లిన్నింటిలోనఁ, గడుఁ బ్రశస్తము లిది వృద్ధగర్గమతము.115

## దోషాదోషబాహుళ్యఫలంబులు

ఆ. స్వల్పదోషములును సమధికగుణములు, నైన నుక్తఫలము లధిక మగును

1. గలిసిన (పె). గదసిన (ప). 2. క్షితిసురల (పూ. ము.) 3. బులుగ నెన్న (సూ).

సద్గుణంబు లిచ్చు సప్తాశ్వపవమాన, కీలిగుణము లిడవు కృతిముఖమున. 116

తే. గుణము లవగుణములకన్నఁ గొంచెమైన, నాథునకు మెండు దుష్టగణంబు లిచ్చు
సోఁకనీయ వాకింతయు శుభగణములు, నిజఫలములను బద్యాది నిలిచినపుడు. 117

మగణద్వయయోగమునకు:—

1. యోనికూటము, రెండున్ను హరిణయోనులేశాన ఏకయోనులేగనుక మంచిది. 2. లింగకూటము, జ్యేష్ఠప్రథమయోని గాన పుల్లింగనక్షత్రము రెండున్ను పుల్లింగతారలే ఆయెను. పోరుపుట్టినా గాని మొదలిగణము వధువున్ను రెండవగణము వరుఁడున్ను గనుక స్త్రీకి పుల్లింగతార అయినందుచేతను ఆ దోషము పనిలేదు. 3. గణకూటము, రెండున్ను రాక్షసగణములే గనుక ఉత్తమము. 4. ఉడుకూటము, మొదలిగణము తారనుండి రెండవగణము తారదనుకను లెక్కపెట్టవలెను గనుక రెంటికిన్ని జ్యేష్ఠ యొక్కటే ఆయెను గనుక లెఖకు మొదలిదే ఆయెను. పదమూఁటికి లోపలఉండుట చేతను కృతిపతి కల్పాయువు. 5. రాశికూటము, ప్రథమగణరాశినుండి రెండవ గణము రాశిదనుకాను ఎన్నవలెనుగనుక, రెండున్ను వృశ్చికరాసులే గనుక సంఖ్యకు లోలుతటిదే ఆయెను గనుక సామ్రాజ్యము. 6. ఖేటకూటము, రెంటికిన్ని కుజుఁడే కనుక మంచిది. 7. గ్రహకాంతికూటము, అంగారకుఁడు ఎఱుపు గనుక పాపిఆయెను; ఆ రెంటికిన్ని పాపగ్రహమైనాను నతఁ డొక్కఁడే కనుక సుఖము. 8. నైసర్గిక కూటము, రెండున్ను మగణాలే కనుక కుశలాధినాయకత్వము. 9. రసకూటము, రెండున్ను రౌద్రరసములే ఆయెను గనుక సంతసము. 10. వీనికి తేరుగడ వివరము: ఉడుకూటమొకటిన్ని చెడ్డది, కడమకూటము లెనిమిదిన్ని మంచివి గనుక దోషము కొంచెమున్ను గుణములు చాలానున్ను గాన ఆది నున్నమగణము తనమీాద మగణమునిల్చినప్పుడు తానిచ్చు శుభఫల మధికముగా [1] నిచ్చును.

మగణయగణయోగమునకు:—

1. యోనికూటము, హరిణకపులు భిన్నయోనులుగనుక కొంతమేలు. 2. లింగకూటము, రెంటికిన్ని పుల్లింగతారలే కనుక పోరు పుట్టును. అయితేనేమి? మొదలిగణము వధువు గనుక స్త్రీకి పుల్లింగతార అయినందుచేతను ఆదోషము పనిలేదు. 3. గణకూటము, రాక్షసమనుష్యగణములు గనుక నాశనము. 4. ఉడుకూటము, జ్యేష్ఠకు పూర్వాషాఢ మూడవ నక్షత్రముగనుక పదమూఁటికి లోపలనుండుటచేతను కృతిపతి కల్పాయువు. 5. రాశికూటము, వృశ్చికమున ధనుస్సు రెండవరాశి గనుక నిర్ధనము. అయితేనేమి? వృశ్చికాధిపతి యైనకుజుఁడున్ను ధనురధిపతి యైన గురుడున్ను అన్యోన్యమిత్రులుగనుక నారదమతమున ఆదోషము పనిలేదు. 6. ఖేట కూటము, కుజగురు లన్యోన్యమిత్రులు గనుక మంచిది. 7. గ్రహకాంతికూటము, కుజుఁ డెఱుపుగనుక పాపిన్ని, గురుడు [2]పచ్చనగనుక శుభుఁడున్నుగాన పాప

1. నుండును (సూ). 2. తాటాకు పుస్తకములలో 'పత్సన' అని ఉన్నది.

శుభయోగము గనుక జగడము వచ్చును. 8. నైసర్గికకూటము, ప్రస్తరించేటప్పుడు మగణమువలనను యగణము పుట్టుటచేతను మగణము తండ్రిన్నీ యగణము కొడుకున్ను గనుక సుతజనక [1]యోగమున నిధనము. 9. రసకూటము, రౌద్రకారుణ్యారసము లన్యములు గనుక సుఖము. 10. వీనికిఁ దేరుగడవివరము: గణోడుగ్రహకాంతి కూటములు మూఁడున్ను చెడ్డవిన్నీ కడమకూటము లాఱున్ను మంచివి గనుక దోషము కొంచెమున్ను గుణములు చాలానున్ను గనుక మగణము తనమీఁదను యగణము నిల్చినప్పుడు తా నిచ్చు శుభఫల మధికముగా నిచ్చును.

మగణరగణయోగమునకు:—

1. యోనికూటము, హరిణతురగములు భిన్నజంతువులు గనుక కొంతమేలు. 2. లింగకూటము, పుల్లింగ స్త్రీలింగతారలు గనుక ఉత్తమము. 3. గణకూటము, రెండున్ను రాక్షసగణములే కనుక మంచిది. 4. ఉడుకూటము, జ్యేష్ఠకు శతతార యెనిమిదవ నక్షత్రము గనుక పదుమూఁటికి లోపలనుండుటచేతను కృతిపతి కల్పాయువు. 5. రాశికూటము, వృశ్చికమునకు, కుంభము నాలుగవరాశి గనుక సామ్రాజ్యము. 6. ఖేటకూటము, కుజునకు శని సముఁడు. ఆ మందునకు భౌముఁడు శత్రుఁడు గనుక సమశాత్రవము గనుక కీడు. 7. గ్రహకాంతికూటము, కుజుఁడు ఎఱుపున్ను శని నలుపున్ను గనుక ఇద్దఱును పాపగ్రహములేకాన మృత్యువు. 8. నైసర్గికకూటము, మగణరగణము లితరగణములు గనుక మరణము. 9. రసకూటము, రౌద్ర శృంగారము లన్యరసములు గనుక మదము. 10. వీనికిఁ దేరుగడవివరము: ఉడుఖేటగ్రహకాంతి నైసర్గికకూటములు నాలుగున్ను చెడ్డవి, కడమకూటము లయిదున్ను మంచివి గనుక దోషములు కొంచెమున్ను గుణములు చాలాను గనుక ఆదినున్న మగణము తనమీఁద రగణము నిలిచినప్పుడు తా నిచ్చు శుభఫల మధికముగా నిచ్చును.

మగణసగణయోగమునకు:—

1. యోనికూటము, హరిణమహిషములు గనుక కొంత మేలు. 2. లింగకూటము, పుల్లింగ స్త్రీలింగతారలు గనుక ఉత్తమము. 3. గణకూటము, రాక్షసదేవగణములు గనుక అధమము. 4. ఉడుకూటము, జ్యేష్ఠకు హస్త యిరువదినాలుగవ నక్షత్రము గనుక పదుమూఁటికి పై నుండుటచేతను కృతిపతికి శతాయువు. 5. రాశికూటము, వృశ్చికమునకు కన్య పదునొకొండవరాశి గనుక దైన్యము. 6. ఖేటకూటము, కుజునికి బుధుఁడు శత్రుఁడు. ఆ సౌమ్యునకు భౌముఁడు సముఁడు కాఁగాను సమశాత్రవము గనుక కీడు. 7. గ్రహకాంతికూటము, కుజుఁ డెఱుపు గనుక పాపి, బుధుఁడు పచ్చన గనుక శుభుఁడు, అయినాగాని క్రూరగ్రహముతోఁ గూడినప్పుడు తానున్ను

1. యోగము నిధనము. (సూ). 110 వ పద్యములో 'సుతజనకులు గదిసిన ధన యుతుఁడగుఁ గృతిభర్త' యని యుండుటచేత 'యోగమున నిధనము' అనుట పొసఁగదు. (పూ. ము.)

క్రూరుఁడే కాఁగాను ఖలద్వయయోగము గనుక మృత్యువు. 8. నైసర్గికకూటము, మగణసగణము లితరగణములు గనుక మరణము. 9. రసకూటము, రౌద్రభయానకము లన్యరసములు గనుక ముదము. 10. వీనికిఁ దేరుగడవివరము: గణరాశి ఖేటగ్రహతత్కాంతికూటము లైదున్ను చెడ్డవిన్ని కడమకూటములు నాలుగున్ను మంచివి గనుక దోషములు చాలానున్ను గుణములు కొంచెమున్ను గనుక మగణము తనమీఁదను సగణము నిలిచినపుడు తా నిచ్చు శుభఫలము అధికముగా నియ్యదు.

మగణతగణయోగమునకు:—

1. యోనికూటము హరిణమేషములు భిన్నజంతువులు గనుక కొంత మేలు. 2. లింగకూటము, పుల్లింగ స్త్రీలింగతారలు గనుక ఉత్తమము. 3. గణకూటము, రాక్షసదేవగణములు గనుక అధమము. 4. ఉడుకూటము, జ్యేష్ఠకు పుష్యమీనక్షత్రము పందొమ్మిదోది గనుక పదుమూఁటికి పై నుండుటచేతను కృతిపతికి శతాయువు. 5. రాశికూటము, వృశ్చికమునకు కర్కాటము తొమ్మిదవరాశి గనుక నపత్యము. 6. ఖేటకూటము, కుజునకుఁ జంద్రుఁడు మిత్రుఁడు ఆశశికి మంగళుఁడు సముఁడునుగాఁగాను సమమిత్రము గనుక భద్రము. 7. గ్రహకాంతికూటము, కుజుఁ డెఱుపు గనుక పాపిన్ని చంద్రుఁడు తెలుపు గనుక శుభుఁడును గాఁగాను బాపశుభయోగము గనుక జగడము వచ్చును. 8. నైసర్గికకూటము, మగణతగణము లితరగణములు గనుక మరణము. 9. రసకూటము, రౌద్రశాంతములు మిత్రములు గనుక శుభము. 10. వీనికిఁ దేరుగడవివరము: రాశిగ్రహకాంతి నైసర్గికకూటములు నాలుగున్ను జెడ్డవిన్ని కడమకూటము లయిదున్ను మంచివిన్ని గనుక దోషములు కొంచెమున్ను గుణములు చాలాను గనుక ఆదినున్న మగణము తనమీఁద తగణము నిలిచినప్పుడు తా నిచ్చు శుభఫల మధికముగా నిచ్చును.

మగణజగణయోగమునకు:—

1. యోనికూటము, హరిణవృషభములు భిన్నజంతువులు గనుక కొంతమేలు. 2. లింగకూటము, రెంటికిన్ని పుల్లింగతారలే కనుక పోరుపుట్టును. అయితేనేమి వధూగణమునకు పుల్లింగతార అయినందున ఆదోషము పనిలేదు. 3. గణకూటము, రాక్షసమనుష్యగణములు గనుక నాశనము. 4. ఉడుకూటము, జ్యేష్ఠకు ఉత్తర యిరువైమూఁడవనక్షత్రము గనుక పదమూఁటికిపై నుండుటచేతను కృతిపతికి శతాయువు. 5. రాశికూటము, వృశ్చికమునకు సింహము పదవరాశి గనుక దుఃఖము. అయితేనేమి? వృశ్చికాధిపతియైన కుజుఁడున్ను సింహాధిపతియైన సూర్యుఁడున్ను అన్యోన్యమిత్రులు గనుక నారదమతమున ఆదోషము పనిలేదు. 6. ఖేటకూటము, కుజసూర్యు లన్యోన్యమిత్రులు గనుక మంచిది. 7. గ్రహకాంతికూటము, మంగళభాను లిద్దఱున్ను ఎఱుపే గనుక పాపగ్రహములే కాఁగాను ఖలద్వయయోగమున

మృత్యువు. 8. నైసర్గికకూటము, మగణజగణము లితరగణములు గనుక మరణము. 9. రస కూటము, రౌద్రవీరము లన్యరసములు గనుక ముదము. 10. వీనికి దేరుగడ వివరము : గణగ్రహకాంతి నైసర్గికకూటములు మూడున్ను జెడ్డవిన్ని కడమకూటము లాఱున్ను మంచివి గనుక దోషములు కొంచెమున్ను గుణములు చాలాను గనుక ఆదినున్న మగణము తన మీఁదను జగణము నిల్చినప్పుడు తా నిచ్చు శుభఫల మధికముగా నిచ్చును.

మగణభగణయోగమునకు:—

1. యోనికూటము, హరిణభుజగములు భిన్నజంతువులు గనుక కొంత మేలు. 2. లింగ కూటము, పుల్లింగ స్త్రీలింగతారలు గనుక ఉత్తమము. 3. గణకూటము, రాక్షసదేవ గణములు గనుక అధమము. 4. ఉడుకూటము, జ్యేష్ఠకు మృగశిర పదాఱవ నక్షత్రము గనుక పదుమూఁటికి పైనుండుటచేతను కృతిపతికి శతాయువు. 5. రాశి కూటము, వృశ్చికమునకు వృషభము ఏడవది గనుక సామ్రాజ్యము. 6. ఖేటకూటము, కుజ శుక్రు లన్యోన్యసములు గనుక మధ్యమము. 7. గ్రహకాంతికూటము, కుజుఁడెఱుపు గనుక పాపిన్ని, శుక్రుఁడు తెలుపు గనుక శుభుఁడున్ను గాన పాపిశుభ యోగము గనుక జగడము. 8. నైసర్గికకూటము, మగణభగణము లితరగణములు గనుక మరణము. 9. రసకూటము, రౌద్రహాస్యము లన్యరసములు గనుక ముదము. 10. వీనికి దేరుగడవివరము: గణఖేటగ్రహకాంతి నైసర్గికకూటములు నాలుగున్ను చెడ్డవిన్నీ కడమకూటము లయిదున్ను మంచివి గనుక దోషములు కొంచెమున్ను గుణములు చాలాను గనుక ఆదినున్న మగణము తనమీఁదను భగణము నిలిచినపుడు తా నిచ్చు శుభఫల మధికముగా నుండును.

మగణనగణయోగమునకు:—

1. యోనికూటము, హరిణగజములు భిన్నజంతువులు గనుక కొంత మేలు. 2. లింగ కూటము, పుల్లింగస్త్రీలింగతారలు గనుక నుత్తమము. 3. గణకూటము, రాక్షసదేవ గణములు గనుక నధమము. 4. ఉడుకూటము, జ్యేష్ఠకు రేవతి పదునొకండవ నక్షత్రము గనుక పదుమూఁటికి లోపలనుండుటచేతను కృతిపతి కల్పాయువు. 5. రాశి కూటము, వృశ్చికమునకు మీనము అయిదవ రాశి గనుక సామ్రాజ్యము. 6. ఖేట కూటవు, కుజబృహస్పతు లన్యోన్యమిత్రులు గనుక మంచివి. 7. గ్రహకాంతి కూటము, మంగళు డెఱుపు గనుక ఖలుడును గురుడు పచ్చన గనుక శుభగ్రహము. కాగాను బాపశుభయోగము గనుక జగడము వచ్చును 8. నైసర్గికకూటము, మగణ నగణము లితర గణములు గనుక మరణము. 9. రసకూటము, రౌద్రాద్భుతములు నిత్యవైరములు గనుక సాధ్వసము. 10. వీనికి దేరుగడ వివరము : గణోడుగ్రహ

కాంతి నైసర్గికరసకూటము లైదును చెడ్డవిన్ని కడమకూటములు నాలుగున్ను మంచివి గనుక దోషములు చాలాను, గుణములు కొంచెమున్ను గనుక ఆది నున్న మగణము తనమీఁద నగణము నిల్చినపుడు తా నిచ్చు శుభఫలము నియ్యదు.

తే. మగణమున కెల్ల వ్రాసితి మిగిలినట్టి, గణములకు నిట్లు వ్రాసిన గ్రంథ మధిక
విస్తరం బగు నని వ్రాయ వెఱచినాఁడఁ, దెలిసికొనఁదగుఁ గవులు యాదులకు నిట్లు.

వ. ఇవి కావ్యముఖంబున నుండు రెండు గణంబులకుం గవిరాక్షసమతానుసారంబు లగు యోన్యాదినవకూటఫలంబులు. ఇంక నఘోక్షజాచార్యమతానుసారంబులగు గణనాథ యోగఫలంబు లెఱింగించెద. 119

తే. అష్టగణములు శిపివిష్టునష్టమూర్తు, లయి వెలింగెడు తమతమ యధిపతులకుఁ
జెల్లుచుండెడు నామంబు లెల్లఁ దాముఁ, దాల్చి ఛందంబులం దెల్లఁ దనరుచుండు.

ఆ. ధరణిపై [1]స్థిరాంబుదహనమారుతవిష్ణు, పదరవీందుదేవపతులు గదియఁ
బ్రమదవిత్తతాపభద్రార్థజయసౌఖ్య, శత్రునాశనము లొసంగు వరుస. 121

క. తోయముపై భూజలశిఖి, వాయుగగనసూర్యచంద్రవాసపు లున్నన్
శ్రేయో వ్యాధిక్లేశా, ల్పాయుర్మరణసుఖభోగహర్షము లబ్బున్. 122

ఆ. వీతిహోత్రుమీఁద విశ్వంభరాంభోగ్ని, వాయుగగనసూర్యవారిజారి
వృషులు గదియఁ గుశలవిభవాగ్నిభయరాజ్య, శోకరోగయుద్ధశుభఫలములు. 123

చ. అవనిజలాగ్ని వాయుగగనార్కశశీంద్రులు డాయఁ గల్గు గం
ధవహుపయిన్ స్వరాజ్యగృహదాహమృతార్తిగదార్థభోగముల్
[2]దివిపయిఁ గీర్తిశర్మలయదీప్తిబలక్షయభద్రమోదముల్
రవిపయి ఖేదము ద్భయపరాభవభోగమృతిస్వరాజ్యముల్. 124

క. హిమకరుమీఁద నిలాంభో,గ్నిమరుద్వియదర్కసోమనిర్జరనాథుల్
క్రమమున నిత్తురు జ్వరభయ, సమరశుభాశుభగదార్థసౌఖ్యము లెపుడున్. 125

సీ. శర్కరతోఁ గూడి చవిగాని వస్తువు లెంతయు మధురమై యెనసినట్లు
గంగోదకంబులఁ గలసి పల్వలతోయమును బవిత్రంబునఁ బొందునట్లు
పరుసము సోఁకంగఁబడి యయఃపిండంబు బంగారమై కనుపట్టునట్లు
చందనవృక్షంబుసంగతి నిర్గంధతరువు నామోదియై పరఁగినట్లు

తే. నిర్జరేశ్వరగణముపై నిలిచి దష్ట, మగు గణంబును శుభకారియై మెలంగ
శోభనగణంబు గదిసినచోట నిత్తు, దండమునఁ బండు పండుచందంబు గాదె.

వ. మఱియుఁ గొందఱు కవిపురందరులు నిజకృతచ్ఛందంబులందుఁ గొన్నివిశేషంబులు చెప్పి రవియెల్ల వివరించెద. 127

---

1. ధరా. (సూ). 2. ఇందలి 3, 4 పాదములు సూ. ప్రతిలో 4, 3 పాదములుగా నున్నవి. 3. బయి తనరినట్లు (సూ).

తే. భువనముల కెల్ల నాధారభూత యైన, జగతి యధిదైవతంబుగాఁ జను మగణము
తమకుఁ గారణ మగుటచే దానిఁ గూడి, ధన మొసఁగు నేఁడు ననిపల్కెఁ దాతనొజ్జ.

తే. చందనోదకములను నిచ్చలును బెంపఁబడియు వెల్లుల్లి తనకంపుఁ బాయనిగతి
శుభగణము గూడియును నిజశూన్యఫలము, తగణము త్యజింప దనియె నథర్వణుండు.

ఆ. ఇది గణప్రపంచ మింక నీ గణముల, చేతఁ గూర్పఁబడుచుఁ జెల్వు మీఱు
వృత్తముల తెఱంగు విదితంబు గాఁగ ష,ట్ప్రత్యయములు తేటపఱుతు మొదల.

## షట్ప్రత్యయములు

తే. వృత్తసంఖ్యయుఁ బ్రస్తారవిధము నష్ట
లబ్ధియును వెస నుద్దిష్టలఘుగురుక్రి
యాధ్వభాగము లనఁగఁ బ్రత్యయము లాఱు
వెలయు వానిఁ గవీంద్రులు దెలియవలయు. 131

## 1. వృత్తసంఖ్యాప్రత్యయము

ఉ. ఇన్నవదాన నెన్ని జనియించెను వృత్తము లన్న ధాత్రిపై
నన్నిగరు ల్లిఖించి యొకఁ డాదిగ నిబ్బడి వానిక్రిందటన్
సన్నుతలీల వ్రాసి తుదిసంఖ్యలు రెట్టిగఁ జేయ నెన్ని యా
నన్నియె దానియం దుదయమౌ సమవృత్తము లన్నఁ జెన్నగున్. 132

తే. ప్రత్యయము లాఱు నీచెప్పుపద్యములను, దెలిసికొన నెంతవారికి నలవి గామి
వరుస నన్నిటికిం డీక వ్రాయవలసెఁ, దెనుఁగుమాటలఁ గడు తేటతెల్ల గాఁగ.

వ. వృత్తసంఖ్యాప్రత్యయ మనఁగాను ఇన్నవ ఛందమునందు ఎన్ని సమవృత్తములు పుట్టి
నవి అని యడిగితేను సరిచెప్పేటి విధము: వా రెన్నవఛందమున కడిగితేను అన్ని
గురువు లడ్డవరుసగాను వ్రాసి వాటిక్రిందను ఒకటి మొదలుగాను ఇనుమడించుచున్న
లెక్కలు వరుసవెంబడిని కడకు వెడలను వ్రాసి తుది లెక్క ఇనుమడించితేను ఎన్ని
అయెను. అన్ని సమవృత్తములు ఆ ఛందమునందు బుట్టినవి యని చెప్పెడిది. 134

తే. అక్షరం బొక్కటియె యుక్త కంతకంత, కవలి వానికి నేకోత్తరాధికంబు
లుక్తయం దెల్ల సమవృత్తయుగము పుట్టె, నదియె మొద లంతకంతకు నయ్యె రెట్టి.

## తత్తచ్ఛందోవృత్తసంఖ్యాసీసమాలిక

ఉక్తను గరము లత్యుక్తను వేదముల్ మధ్యను వసువులు మఱి ప్రతిష్ఠ
వలనను రాజులవ్వలిసుప్రతిష్ఠను నేత్రపావకులు గాయత్రియందు

విద్య లుష్ణిక్కున వేదండలోచనక్షమ లనుష్టుప్పున శాస్త్రబాణ
పాణులు బృహతిని [1]బాహుభూశరములు పఙ్క్తిని గతికరాంబరజగతులు
త్రిష్టుప్పునందు దంతియుగాభ్రనయనముల్ జగతి నంగవిరించిగగనయుగము
లతిజగతిని లోచనాజభూవసువులు శక్వరిని గతీభసలిలయోని
శాస్త్రకుంభిను లతిశక్వరిని గజర్తుమునిబాహురాము లష్టిని రసాగ్ని
సాయకభూతరసంబు లత్యష్టిని హస్తగోత్రనభోధరాగ్నిశశులు
ధృతియందు గతియుగక్షితిపక్షరసబాహు లతిధృతిని వసుద్విపాక్షినిగమ
శయబాణములు కృతిచ్ఛందంబున రసాద్రిపర్వేభవేదాభ్రపద్మరిపులు
ప్రకృతిని నేత్రనారాచసోమాహార్యగీర్వరాభ్రార్తు లాకృతిని ధాతృ
వదనాంతరిక్షపావకయుగబ్రహ్మచంద్రశ్రుతు ల్వికృతిని నాగశూన్య
తర్కసింధురవసుదహనకుంజరములు సంకృతిని రసాంబుజాతవైరి
హస్తాద్రి గిరిపర్వతాంగోడుపతు లభికృతిని బహుకృశానుగతియుగాస్త్ర

తే. రతిపశరశిఖివహ్ను లుత్కృతిని వేద,శాస్త్రసామజగజనభశ్చంద్రశైల
రసము లిట్లుద్భవం బయ్యెఁ [2]బ్రస్తరింప, సమపదము లగు వృత్తము ల్ఛందములను.

వ. ఇవి అన్నిన్ని ఉక్తాదిషడ్వింశతిచ్ఛందంబులకున్ను ద్వితీయాదిద్విగుణితంబులై యొక్కొక్క ఛందంబునం బుట్టిన సమవృత్తసంఖ్యలకు గణితశాస్త్రోక్తసంజ్ఞలు గావున జ్యోతిశ్శాస్త్రానుసారంబున కుడినుండి యెడమకు పద్యక్రమంబున ఆ యా సంజ్ఞలు లెక్కలువైచి యుగ్గడించి వామాదిగాను దెలిసికొనేది.

## ఉక్తాదిజవృత్తసంఖ్య

తే. ఛందమున నొక్కటను వృత్తసంఖ్య మడపి, రెండు [3]వెలియ నుక్తాదిజవృత్తసంఖ్య
యటుల నుత్కృతివృత్తసంఖ్యయును జేయ, సర్వసమవృత్తసంఖ్య భుజంగశయన.

వ. ఉక్తాదిజవృత్తసంఖ్య అనంగాను ప్రథమచ్ఛందంబగు నుక్త మొదలుకొని యిన్నవ ఛందమువద్దికి ఈ వెనుకటి ఛందము లన్నిటియందున్ను పుట్టిన వృత్తములు అన్నిన్ని ఎన్ని ఆయెనని అడిగితేను సరి చెప్పేటి విధము: వారు ఎన్నవ ఛందమువద్ది కడిగితేను ఆ ఛందమున బుట్టిన సమవృత్తసంఖ్య యినుమడించి ఆ లెక్కలోను రెండు దీసివేయఁగాను ఎంత లెక్క నిలిచితేను అన్ని సమవృత్తములు మొదలి ఛందమువద్దినుంచి వారడిగిన దానివద్దికి ఆయె నని చెప్పెడిది. ఉక్తాదిషడ్వింశతిచ్ఛందంబుల నన్నింటనున్ను పుట్టిన సమవృత్తములన్నిన్ని కలయఁగూడితేను ఎన్ని యయ్యె నని యడిగితేను సరిచెప్పేటి విధము: మునుపటివలెనే కడపటిఛందమగు నుత్కృతియందుఁబుట్టిన సమ

1. బాద (పూ. ము). 2. బ్రస్తుతింప (ప; సూ.) 3. దివియ (సూ.)

వృత్తసంఖ్య రెట్టించి అందులోను రెండు కడమ దీయగాను ఎన్ని నిలిచితేను అన్ని సమవృత్తములు ఇరువదాఱు ఛందములయందున్ను బుట్టిన వని చెప్పెడిది. 139

క. పదుమూఁడు కోటులును [1]నలు,బదిరెండును లక్ష లవలఁ [2]బదియేడ్వేలున్
దుది లేడునూటిపై నిరు,వదియాఱు సమాంఘ్రివృత్తపద్యములు హరీ. 140

తే. అందులో నొకకొన్ని వేదాంగమైన,ఛందమునఁ బల్కఁబడి యుండె నందులోనఁ
గొన్ని తెనుఁగుగఁ జేసె భీమన్న మొదల, నవియె వెసఁ జెప్పుకొని రనంతాదికవులు.

## 2. ప్రస్తారప్రత్యయము

సీ. పరఁగ నే ఛందంబు ప్రస్తరింపు మటన్న నా ఛందమునఁ బుట్టినట్టి సర్వ
సమవృత్తసంఖ్యకు సమ మగునందాఁక దొంతిగాఁ గ్రిందుక్రిందులను వ్రాయ
నగు మీఁదగురువును నాక్రింద లఘువును నొప్పారఁ దొలుబంతి నొక్కటొకటి
తరువాత నది మొద ల్దప్పక రెట్టించి ఛంద మెన్నవ దన్ని చాళ్లుగాఁగ
తే. బొడవునకు నడ్డవరుసలు పొసఁగ నిలుప, నందనందన వేఁడిన ఛంద మగును
ధారుణీమండలమునఁ బ్రస్తారమనుచు, దీనినామంబు కవులచేఁ దేటపడియె. 142

టీ. ప్రస్తారప్రత్యయ మనఁగాను ఇన్నవ ఛందంబునందు పుట్టిన సమవృత్తంబులకు ఏయే గణంబు లని యడిగితేను సరిచెప్పేటి విధము. వారు ప్రస్తరింపుమన్న ఛందమునందు ఎన్ని సమవృత్తములు పుట్టెను అన్ని గురులఘువులు దొంతరగాను ఒకదానిక్రింద నొకటి వ్రాసేది. అది ఎట్లంటేను తొలిదొంతరకు ఒకగురువున్ను ఒకలఘువున్ను రెండవ దానికి రెండు గురువులున్ను రెండు లఘువులున్ను మూఁడవదానికి నాలుగు గురువులున్ను నాలుగులఘువులున్ను ఇటువలెనే యినుమడించుచున్న ఎన్నవఛందమైతేను అన్ని నిడుదచాళ్లుగాను అడ్డవరుసలు సరిపొయ్యేటట్టుగాను పొడవునకున్ను వ్రాసి, వా రెన్నవ సమవృత్తమునకు అడిగితేను అన్నవ యడ్డవరుస నున్న గురులఘువులు గణములుచేసి ఆ వృత్తమునకు ఒక్కొక్కచరణమునకు ఆ గణంబు లని చెప్పెడిది.

### ప్రస్తారద్విగుణము

క. అందముగా నే ఛందము, క్రింద మఱియు నదియె నిలిపి రెండర్ధములం
బొందుగ గురులఘువులకుడి, బందునఁ జెఱిసగము వ్రాయఁ బై ఛంద మగున్. 144

టీ. ఎదయినానుగాని ఒకఛందము ప్రస్తరించి ఆఛందమే దాని తరువాతిదిగాను బ్రస్తరించు మంటేను బ్రస్తరించెడి విధము. ఆఛందము క్రిందను తిరిగీ ఆఛందమే ప్రస్తరించి కుడికడను మీఁదినుండి క్రిందుక్రిందులను నిడుపుగా సగముదనుకాను గురువులున్ను కడమ సగమున్ను లఘువులున్ను వ్రాసితేను ఆ మీఁదటిఛంద మవును.

1. నలువది (రా). 2. బదిహేడ్వేలున్ (ప. పె.)

## 3. నష్టలబ్ధిప్రత్యయము

సీ. జలజాక్షి యిన్నవఛందంబులోపల నిన్నవ సమవృత్త మెట్టి దనిన
నా వృత్తసంఖ్య దా నందంద యర్థించి వ్రాయంగ దిగుదానివైపు దెలిసి
సరిలెక్క లెడనెడ సగము గావించువేళల నెల్ల నొక్కొక్కలఘువు నిలిపి
విషమంబులను [1]బాలు వెలయ మఱొక్కటి గలిపి యర్ధము సేయు కాలములను
తే. గురుశుభాకార యొక్కొక్క గురువు నిడుచు, నడిగి రెన్నవ ఛందమునందు వారు
దన్ను గురువులు లఘువులు నన్నియైన, మానవగు నష్టలబ్ధి రమాసహాయ. 146

టీ. నష్టలబ్ధిప్రత్యయ మనంగాను ఇన్నవఛందంబున ఇన్నవసమవృత్తమునకు ఏ యే గణంబు లని అడిగితేను సరిచెప్పేటి విధము. వా రెన్నవ సమవృత్త మడిగితేను అన్నవ లెక్కనుండి తేపతేపకున్ను అర్థించుకొనుచున్న గురులఘువులు వ్రాసేది. అది యెట్లన్నను: సరిలెక్క అర్థించునప్పు డెల్లాను ఒక్కొక్క లఘువు పెట్టేది. బేసిలెక్క అయినప్పుడు అర్థించేటందుకు పాలుపోదు గనుక మఱియొక్కటి కలియఁగూడి సరిగాఁజేసి అర్థించేది. ఒకటి కూడి యర్థించునప్పుడెల్లను ఒక్కొక్కగురువు పెట్టేది. తన్ను నా రెన్నవఛందములోని సమవృత్త మడిగితేను అన్ని అయ్యేటట్టుగాను గురులఘువులు వ్రాసి అవి గణములు చేసి ఆఛందమున అన్నవసమవృత్తమునకు ఒక్కొక్క పాదమునకు అవి గణము బని చెప్పేడిది. 147

## 4. వృత్తోద్దిష్టప్రత్యయము

సీ. తనయిచ్చ వచ్చినట్టును గురులఘువులు జగతిపై నడ్డచాలుగ లిఖించి
యేఛందమునఁ బుట్టె నెన్నవ సమవృత్త మిది యన్న నొక్కఁడు మొదలుగాఁగ
రెట్టించుచును వాని క్రిందను లెక్కలు వరుస దప్పక యుండ వైచి యందు
లఘువుల క్రింది వెల్లను గూడి వెండియు నొక్కటి [2]గలుపుక యొగ్గడింప
ఆ. నైనవృత్తసంఖ్య మది గురులఘువుల, సంఖ్య ఛందమునకు సంఖ్య యిట్లు
దెలిసి చెప్పవలయు దీని వృత్తోద్దిష్ట, మండ్రు ప్రత్యయజ్ఞు లంబుజాక్షి. 148

టీ. ఉద్దిష్టప్రత్యయ మనఁగాను దన మనస్సుకు వచ్చినట్లు గురులఘువులు అడ్డచాలుగా వ్రాసి యిది యేఛందమునఁ బుట్టినది? ఆఛందమునం దిది యెన్నవ సమవృత్తము అని యడిగిన తేను సరి చెప్పేటి విధము. అతఁడు వ్రాసిన గురులఘువుల క్రిందను వరుసకున్ను ఒకటి మొదలుకొని లెక్క లినుమడించి వ్రాసి వాటిలోపలను గురువుల క్రిందివి అన్నిన్ని విడిచిపెట్టి లఘువుల క్రింది లెక్క లన్నిన్ని గలయఁ గూడి అందులోప

1. బోలి (బ్రా. ము). 2. గలుపుకో (పె).

లను మఱి యొకటి కలిపితేను ఎన్ని ఆయెను అన్నవి వృత్తమనేది. అతఁడు వ్రాసిన గురులఘువులు ఎన్ని అయితేను అన్నవఛందమునఁ బుట్టినది యనేది. ఇరువైయాఱింటిలోపలాను ఎన్ని గురులఘువులు వ్రాసినను ఇటువలెనే వ్రాసి సరిచెప్పేది.

## 5. లఘుగురుక్రియాప్రత్యయము

సీ. రెండిండ్లు వ్రాసి యాక్రింద వెంబడి [1]నిరుమేల నొక్కొకయిల్లు మించి యుండ
మొదలనుంచియుఁ నిరువదియునాఱడ్డవీథు లమర్చి రెండుకోపులను గల్గు
గీముల నన్నింట సోముల నిడి మధ్యగృహములయందుఁ బైయిండ్లరెంట
నిలుచు లెక్కలు గూడి విలిఖింప [2]నీమేరుచక్ర పార్శ్వద్వయాంతసదనములను

తే. వెలయునవి సర్వగురులఘువృత్తసంఖ్య
లగు ద్వితీయాదిగృహములయందుఁ దనరు
సంఖ్య లేకాదిలఘువృత్తసంఖ్య లయ్యె
నన్నియును వానివృత్తసంఖ్య లగుఁ గృష్ణ. 150

టీ మేరుచక్రమనఁగాను ఇన్నవఛందమునందు ఎన్నేసి లఘువులవృత్తములు ఎన్ని యని యడిగితేను సరిచెప్పేడివిధము. మొదల అడ్డవీథిగా రెండిండ్లు వ్రాసి యాక్రిందను వెంబడిగాను రెండుపార్శ్వములయందున్ను ఒక్కొక్కయిల్లు మించియుండేటట్టుగాను మొదటివీథితోఁగూడా ఇరువైయారు అడ్డవీథులుగాను గీటులు తివిచి ఉభయపార్శ్వములయందున్ను మించియున్నకడపటి[3]యిండ్లును మీఁదియిండ్లు మొదలుకొని అన్ని యిండ్లకు తప్పకుండాను ఒక్కట్లు పెట్టి మీఁదివీథి నున్న లెక్కలక్రిందను దిగువవీథియందు నిడుపుగాను ఒక్కొక్కయింటను ఆలెక్కలకు క్రింద ఉండేటట్టుగాను వ్రాసేది. ఇటువలెనే వ్రాస్తేను మీఁదివీథికంటె క్రిందివీథిని ఒక్కొక్కయిల్లు ఎక్కువ అవుచును వచ్చును. ఈక్రమమున వ్రాసితేను ఈమేరుచక్రమునందు పైవీథిమొదలుగాను అడ్డవీథులన్నిన్ని ఉక్తమొదలైన యిరువైయాఱు ఛందములున్ను క్రమముననే అవును. ఆవీథులయందు మొదలియిండ్లనున్న ఒక్కొటొక్కటిన్ని సర్వగురువృత్తములు. తుదియిండ్లనున్న ఒక్కొక్కటిన్ని సర్వలఘువృత్తములు; రెండవయిండ్ల ఎన్ని ఉంటేను, అన్నిన్ని ఒంటిలఘువృత్తములు; మూఁడవయిండ్లవి రెండేసిలఘువులవి; నాలవయిండ్లవి మూఁడేసిలఘువులవి; ఈప్రకారముననే ముందరనున్ను అన్నియిండ్లకున్ను అని తెలిసికోనేది. ఆవీథినిఉన్న లెక్కలన్నిన్నిఁ గలయఁ గూడితేను ఆఛందమునఁ బుట్టినసమవృత్తసంఖ్య యవును. వా రెన్నవఛంద

1. నిరుమైల (పె). 2. నిరుమైల (ప. పె.) 3. 'ఇండ్లు' అనుటకు బదులుగా (పె.) లో 'ఇంట్లు;' (ప.) లో 'ఇళ్లు.'

మున కడిగితేను అన్నవయడ్డవీథి చూచి యిప్పుడు చెప్పినచొప్పున సరి చెప్పేది. ఏఛందముదనుకాను వ్రాయ మంటే ఆఛందముదనుకాను వ్రాయను వచ్చును.

### లగనిర్ణయశకటచక్రము

సీ. ఒక మందిరంబులో నొకలెక్క వైచి యాదిగువ నడ్డంబిండ్లు దిద్దుకొనుచుఁ
గ్రమతఁ బైవీథిలెక్కలు [1]ద్విగుణింపుచుఁ దొలుసారి యవి యెల్లఁ [2]గలుపు వ్రాసి
వెండియుం రెట్టించువేళ నొక్కొక్కటి విడిచి వ్రాయుచు దాని వృత్తసంఖ్య
కెచ్చైన మానుచు నీరీతి నావృత్తసంఖ్యపఙ్క్తికిఁ దొలిసదనమునను
తే. నిలుచునందాఁక బంతు [3]లెన్నేని వ్రాయ
శకటచక్రంబు నాఁగఁ బ్రశస్తమయ్యె
వరుస నాద్యంతములు సర్వగురులఘువులు
కడమ వేకాదిలఘునియుక్తంబు లిందు. 152

టీ. శకటచక్ర మనఁగాను ఇన్నవఛందమునందు ఒక లఘు వాదిగాను ఎన్నేసిలఘువుల వృత్తములు, ఎన్నవ ఎన్నవయవి అని అడిగితేను సరి చెప్పేటివిధము. వారడిగిన ఛందము వృత్తసంఖ్య నిర్ణయించుకొని ముందుగాను ఒకయిల్లు వ్రాసి ఆయింటను లెక్క యొక్కటి వైచి దానిక్రిందనుండి యడ్డముగాను ఇండ్లు వ్రాసికొంచు ఆ యిండ్లలోను వానికి మీఁద నున్న అడ్డవీథియిండ్లను మొదలియిల్లు మొదలుకొని వరుస వెంబడిన్ని ఒక్కొక్కయింటనున్న లెక్క సారెసారెకున్ను ఇనుమడించుకొంచున్ను వ్రాయుచున్ను వచ్చేది. అది యెట్లంటే తొలిసారి ద్విగుణించునపు డెంత లెక్కయైతేను అంతాను వ్రాసేది. అంతటనుంచి అవి యెన్నిమాఱు లినుమడించిరా ఒక్కటొక్కటి కడకు బుచ్చి చిక్కినలెక్క వేసేది. ఇటువలెను వ్రాయగాను ఆ ఛందంబున బుట్టినవృత్తసంఖ్య యెప్పుడు మించితేను అప్పు డది విడిచి మీఁదివీథిని ఆతరువాతనున్ను ఇండ్లలెక్కలు ఒక్కటొక్కటి యిప్పుడు వ్రాసినట్లే రెట్టింపుచున్ను వ్రాసేది. ఏదియైనాను వృత్తసంఖ్యకు అధిక మైతేను అది విడిచిపెట్టేది. పైవీథిలెక్క లైతేను అంతటను ఆ వీథిని వ్రాయక చాలించేది. ఇప్పుడు వ్రాసిన బంతిలెక్కలు మునుపటివలెనే చేసేది. ఆక్రిందను తిరుగాను ఇండ్లు వ్రాసి ఆయిండ్లలోను ఇప్పటివలెనే లెక్కలు నిలిపేది. ఇటువలెనే ఒక్కొక్కబంతి వ్రాసి అది చూచి దానిదిగువను మఱొక్కబంతివ్రాయుచున్న రాఁగా బంతికి మొదలియింటను ఆఛందమునఁ బుట్టినవృత్తసంఖ్య యెక్కడ వస్తేను అక్కడనుంచి వ్రాయక మానేది. ఈతీరున వ్రాసితేను ఏయింటనున్ను వచ్చినలెక్క[4]రాశ వచ్చును. దీని

1. ద్విగుణింపుచో (పె). 2. గలుగ (మా.) 3. లెన్నెన్ని (ప); లెన్నన్ని (పూ. ము.) లెన్నేని (రా). 4. రావచ్చును (పె. ప.)

పేరు శకటచక్ర మనిపించుకొనును. ఈ చక్రమునందు మొదలిబంతిది సర్వగురు వృత్తము; కడపటిబంతి యెంతయుంటేను అన్నవయది సర్వలఘువృత్తము; రెండవ బంతియిండ్లు ఎన్నియుంటేను అన్నవయవి ఒంటి లఘువృత్తములు; మూఁడవ యడ్డ వీథిని ఎన్నియుంటేను అన్నవయవి రెండేసి లఘువుల వృత్తములు; నాల్గవచాలున ఎన్నియుంటేను అన్నవయవి మూఁడు మాత్రలు గల వృత్తములు; ఈ క్రమముననే ముందర ఎన్నిబంతు లున్నాను రెండవబంతి మొదలుగాను బంతిబంతికి ఒక్కొక్క లఘు వెక్కువ యని తెలిసికోనేది. ఇండ్లు అన్నిన్ని లెక్కపెట్టితేను ఎన్ని అయితేను అన్నివృత్తము లా ఛందమున బుట్టినవని యెరిగేది. ఈ రెండు చక్రంబులయందున్ను చెప్పిన లఘుసంఖ్య ఛందస్సంఖ్యలోను తివిసివేయగాను ఎన్ని మిగిలితేను నన్ని గురువులు ఆ యా వృత్తములకు గలవు గాన ఈ చక్రములు రెండున్ను లఘుగురు క్రియాచక్రములున్ను అనంబడును. కొందఱు లగనిర్ణయచక్ర మందురు. 153

## 6. అధ్వభాగప్రత్యయము

క. నందసుత యధ్వభాగము
ఛందస్సంఖ్యయును వృత్తసంఖ్యయు రెంటన్
బొందుగ గుణించి యొక్కటి
యందుఁ దిగియ నెన్ని యన్ని యంగుళము లగున్. 154

టీ. అధ్వభాగప్రత్యయ మనఁగాను ఇన్నవఛందము ప్రస్తరించేటందునకు ఎన్ని యంగుళముల పొడవు భూమి కావలె నని అడిగితేను సరిచెప్పేటి విధము. ఎన్నవఛందమున కడిగితేను అంతా లెక్కపెట్టి యందులో ఆఛందమునఁ బుట్టినవృత్తసంఖ్య గలియఁ గూడి యినుమడించి యందులో ఒకటి తివిసివేయఁగాను ఎంతయైతేను అన్ని యంగుళముల పొడవు భూమి ఆ ఛందమునకు ప్రస్తరించేటందుకుఁ గావలె నని చెప్పెడిది. 155

### సమవృత్తసంఖ్యాజ్ఞానము

అయిదవఛందమునందు ఎన్నిసమవృత్తములు
పుట్టిన వని అడిగితేను సరిచెప్పేటి విధము.

U U U U U
౧ ౨ ౪ ౮ ౧౬

ఈ కడపలిలెక్క 16 ను రెట్టించితేను 32 అయెను. అటుగనుక 5 వ ఛందమునందు 32 సమవృత్తములు పుట్టిన వని చెప్పెడిది. ఏఛందమున కడిగినా ఇటువలెనే వ్రాసేది. ప్రస్తరించి చూచితేను అన్నివృత్తములే పుట్టుచున్నవి. 156

పంచమచ్ఛందమునకుఁ బ్రస్తారము

| | | | |
|---|---|---|---|
| ∪∪∪∪∪ | ౧ | ∪∪∪∪। | ౧౭ |
| ।∪∪∪∪ | ౨ | ।∪∪∪। | ౧౮ |
| ∪।∪∪∪ | ౩ | ∪।∪∪। | ౧౯ |
| ।।∪∪∪ | ౪ | ।।∪∪। | ౨౦ |
| ∪∪।∪∪ | ౫ | ∪∪।∪। | ౨౧ |
| ।∪।∪∪ | ౬ | ।∪।∪। | ౨౨ |
| ∪।।∪∪ | ౭ | ∪।।∪। | ౨౩ |
| ।।।∪∪ | ౮ | ।।।∪। | ౨౪ |
| ∪∪∪।∪ | ౯ | ∪∪∪।। | ౨౫ |
| ।∪∪।∪ | ౧౦ | ।∪∪।। | ౨౬ |
| ∪।∪।∪ | ౧౧ | ∪।∪।। | ౨౭ |
| ।।∪।∪ | ౧౨ | ।।∪।। | ౨౮ |
| ∪∪।।∪ | ౧౩ | ∪∪।।। | ౨౯ |
| ।∪।।∪ | ౧౪ | ।∪।।। | ౩౦ |
| ∪।।।∪ | ౧౫ | ∪।।।। | ౩౧ |
| ।।।।∪ | ౧౬ | ।।।।। | ౩౨ |

పంచమచ్ఛందము ప్రస్తరించినాను. ౩౨ సమవృత్తములే పుట్టెను.

ప్రతిచ్ఛందోవృత్తసంఖ్యలు.

| ఛందస్సంఖ్య. | సమవృత్తసంఖ్య. | ఛందస్సంఖ్య. | సమవృత్తసంఖ్య. |
|---|---|---|---|
| ౧ ఉక్తయందు | ౨ | ౧౪ శక్వరియందు | ౧౬౩౮౪ |
| ౨ అత్యుక్త | ౪ | ౧౫ అతిశక్వరి | ౩౨౭౬౮ |
| ౩ మధ్య | ౮ | ౧౬ అష్టి | ౬౫౫౩౬ |
| ౪ ప్రతిష్ఠ | ౧౬ | ౧౭ అత్యష్టి | ౧౩౧౦౭౨ |
| ౫ సుప్రతిష్ఠ | ౩౨ | ౧౮ ధృతి | ౨౬౨౧౪౪ |
| ౬ గాయత్రి | ౬౪ | ౧౯ అతిధృతి | ౫౨౪౨౮౮ |
| ౭ ఉష్ణిక్కు | ౧౨౮ | ౨౦ కృతి | ౧౦౪౮౫౭౬ |
| ౮ అనుష్టుప్పు | ౨౫౬ | ౨౧ ప్రకృతి | ౨౦౯౭౧౫౨ |
| ౯ బృహతి | ౫౧౨ | ౨౨ ఆకృతి | ౪౧౯౪౩౦౪ |
| ౧౦ పఙ్క్తి | ౧౦౨౪ | ౨౩ వికృతి | ౮౩౮౮౬౦౮ |
| ౧౧ త్రిష్టుప్పు | ౨౦౪౮ | ౨౪ సంకృతి | ౧౬౭౭౭౨౧౬ |
| ౧౨ జగతి | ౪౦౯౬ | ౨౫ అభికృతి | ౩౩౫౫౪౪౩౨ |
| ౧౩ అతిజగతి | ౮౧౯౨ | ౨౬ ఉత్కృతి | ౬౭౧౦౮౮౬౪ |
| | | వెరసి | ౧౩౪౨౧౭౭౨౬ |

ఇవి అన్నిన్ని కలియఁగూడితేను సర్వసమవృత్తసంఖ్య యగును.

## ఉక్తాప్రభృతిచ్ఛందోజాత వృత్తసంఖ్యావివేకము

ప్రథమచ్ఛందం బగు నుక్త మొదలుకొని చతుర్థచ్ఛందమువద్దికి నీలాగుఛందముల యందున్ను బుట్టిన సమవృత్తము లన్నిన్ని ఎన్ని ఆయెనని యడిగితేను సరిచెప్పేటి విధము.

### నాల్గవఛందమువృత్తసంఖ్య

UUUU

౧ ౨ ౪ ౧౬

పదహారు సమవృత్తములు పుట్టెను

ఈ వృత్తసంఖ్య యినుమడించితేను ముప్పదిరెండాయెను. అందులోను రెండు పుచ్చితేను ముప్పది గనుక ఉక్తనుంచి ప్రతిష్ఠవద్దికి నాలుగుఛందములయందున్ను ౩౦ సమవృత్తములు పుట్టినవి అనేది. ఏఛందమువద్దికి అడిగినా ఇటువలెనే చూచేది. వెరసి వేసి కూడినా సరే. 158

### సర్వవృత్తసంఖ్య

ఇరువైయారు ఛందములయందున్ను ఎన్నిసమవృత్తములు పుట్టె నంటే సరి చెప్పేటి విధము. ఈ ఉత్కృతిచ్ఛందమువృత్తసలఖ్య మునుపటివలె ద్విగుణించి రెండు తివిచివైచితేను ౧౩౪౨౧౭౭౨౬ ఆయెను. కనుక ఇరువదాఱుఛందములయందున్ను ఇన్ని సమవృత్తములు పుట్టెనని చెప్పునది. [1]వెరసువేసి కూడినాను సరి. 159

### వృత్తప్రస్తారవిధము

నాల్గవ ఛందంబగు ప్రతిష్ఠయందుఁ బుట్టిన సమవృత్తంబుల కే యే గణంబు లని యడిగితే సరిచెప్పేటి విధము.

| | | | |
|---|---|---|---|
| UUUU | ౧ మగము | UUU \| | ౯ మలఘువు |
| \| UUU | ౨ యగము | \| UU \| | ౧౦ యలము |
| U \| UU | ౩ రగము | U \| U \| | ౧౧ రలము |
| \| \| UU | ౪ సగము | \| \| U \| | ౧౨ సలము |
| UU \| U | ౫ తగము | UU \| \| | ౧౩ తలము |
| \| U \| U | ౬ జగము | \| U \| \| | ౧౪ జలము |
| U \| \| U | ౭ భగము | U \| \| \| | ౧౫ భలము |
| \| \| \| U | ౮ నగము | \| \| \| \| | ౧౬ నలము |

ఇవి యన్నిన్ని అడ్డబంతులుగాఁజేసి ఆ యా బంతిసమవృత్తమునకు ఆ యా గణంబు లనేటిది. నాలుగుపాదములకున్ను ఆ గణములే అని చెప్పేది. ఏఛందమున కడిగినా ఇటువలెనే వ్రాసేది. 160

1. తాటాకుపుస్తకములో వెరసు వేసి ఉన్నది.

## ద్విగుణప్రస్తారలేఖనక్రమము

మూఁడవ ఛందమునకుఁ బ్రస్తారద్విగుణము.

| | | | | | |
|---|---|---|---|---|---|
| UUU | మగణము | ౧ | UUU | మగణము | ౧ |
| IUU | యగణము | ౨ | IUU | యగణము | ౨ |
| UIU | రగణము | ౩ | UIU | రగణము | ౩ |
| IIU | సగణము | ౪ | IIU | సగణము | ౪ |
| UUI | తగణము | ౫ | UUI | తగణము | ౫ |
| IUI | జగణము | ౬ | IUI | జగణము | ౬ |
| UII | భగణము | ౭ | UII | భగణము | ౭ |
| III | నగణము | ౮ | III | నగణము | ౮ |

ఈ మూఁడవ ఛందము నాల్గవయదిగాను బ్రస్తరించువిధము. ఒకప్రతికడ గురువున్ను లఘువున్ను వ్రాసేది. ఏఛందమున కడిగినాను ఇటువలెనే వ్రాసేది. 161




## నష్టవృత్తప్రస్తారము

ఆఱవఛందమున నలువదినాల్గవ సమవృత్తమునకు ఏయేగణము లని యడిగితేను చెప్పేటి విధము. వారు నలుబదినాల్గవది యడిగిరి గనుక సరిలెక్క గనక అవి అర్ధించి లఘువు పెట్టేది. నిలిచిన యిరువైరెండున్ను సరిగనక అవి అర్ధించి లఘువు పెట్టేది. చిక్కిన పదునొకొండున్ను బేసిగనుక మఱియొకటి కలియఁగూడి పండ్రెండుచేసి అర్ధించి గురువు పెట్టేది. మిగిలిన ఆఱున్ను సరిగనక అవి అర్ధించి లఘువు పెట్టేది. ఉన్న మూఁడున్ను బేసిగనుక మఱియొకటి గూర్చి నాల్గుచేసి అవి అర్ధించి గురువు పెట్టేది. కడమరెండున్ను సరిగనుక అవి అర్ధించి లఘువు పెట్టేది. వా రాఱవఛందమున కడిగిరి గనుక గురులఘువు లాఱయితేను చాలించేది. ఏవృత్త మడిగినా ఇటువలెనే సరిచెప్పేది.



## ఆఱవఛందమునకుఁ బ్రస్తారము.

| | | | |
|---|---|---|---|
| U U U U U U | ౧ | U I I U I U | ౨౩ |
| I U U U U U | ౨ | I I I U I U | ౨౪ |
| U I U U U U | ౩ | U U U I I I | ౨౫ |
| I I U U U U | ౪ | I U U I I U | ౨౬ |
| U U I U U U | ౫ | U I U I I U | ౨౭ |
| I U I U U U | ౬ | I I U I I U | ౨౮ |
| U I I U U U | ౭ | U U I I I U | ౨౯ |
| I I I U U U | ౮ | I U I I I U | ౩౦ |
| U U U I U U | ౯ | U I I I I U | ౩౧ |
| I U U I U U | ౧౦ | I I I I I U | ౩౨ |
| U I U I U U | ౧౧ | U U U U U I | ౩౩ |
| I I U I U U | ౧౨ | I U U U U I | ౩౪ |
| U U I I U U | ౧౩ | U I U U U I | ౩౫ |
| I U I I U U | ౧౪ | I I U U U I | ౩౬ |
| U I I I U U | ౧౫ | U U I U U I | ౩౭ |
| I I I I U U | ౧౬ | I U I U U I | ౩౮ |
| U U U U I U | ౧౭ | U I I U U I | ౩౯ |
| I U U U I U | ౧౮ | I I I U U I | ౪౦ |
| U I U U I U | ౧౯ | U U U I U I | ౪౧ |
| I I U U I U | ౨౦ | I U U I U I | ౪౨ |
| U U I U I U | ౨౧ | U I U I U I | ౪౩ |
| I U I U I U | ౨౨ | I I U I U I | ౪౪ |

ప్రస్తరించినను సగణజగణములే ఆయెను.

## ఉద్దిష్టవృత్తనిర్ణయము

| | |
|---|---|
| U U I U U I U | I I U I U I |
| ౧ ౨ ౪ ౮ ౧౬ ౩౨ ౬౪ | ౧ ౨ ౪ ౮ ౧౬ ౩౨ |
| ౪ | ౧ |
| ౩౨ | ౨ |
| ౩౬ | ౮ |
| | ౩౨ |
| | ౪౩ |
| ౧ | ౧ |
| ౩౭ | ౪౪ |

“ఇది యెన్నవ ఛందమునందుఁ బుట్టినది? ఆ ఛందమునం దెన్నవ సమవృత్తము?” అని యడిగితే సరిచెప్పేటి విధము. వారు వ్రాసిన గురులఘువుల క్రిందను వరుస వెంబడిని ఏకాది ద్విగుణితముగాను వ్రాసిన లెక్కలలోను లఘువుల క్రింది లెక్కలన్నిన్ని వెరసు వేసి వాని క్రింద మఱొకటి పెట్టి కలయఁగూడితేను ముప్పదియేడాయెను. కనుక అన్నవ సమవృత్త మనేది. వారు వైచిన గురులఘువులు లెక్కపెట్టితేను ఏడు ఆయెను. గనుక ఏడవ ఛందమునను బుట్టినది అనేది.

### సప్తమచ్ఛందః ప్రస్తారము

| | | | |
|---|---|---|---|
| U U U U U U U | ౧ | I I U U I U U | ౨౦ |
| I U U U U U U | ౨ | U U I U I U U | ౨౧ |
| U I U U U U U | ౩ | I U I U I U U | ౨౨ |
| I I U U U U U | ౪ | U I I U I U U | ౨౩ |
| U U I U U U U | ౫ | I I I U I U U | ౨౪ |
| I U I U U U U | ౬ | U U U I I U U | ౨౫ |
| U I I U U U U | ౭ | I U U I I U U | ౨౬ |
| I I I U U U U | ౮ | U I U I I U U | ౨౭ |
| U U U I U U U | ౯ | I I U I I U U | ౨౮ |
| I U U I U U U | ౧౦ | U U I I I U U | ౨౯ |
| U I U I U U U | ౧౧ | I U I I I U U | ౩౦ |
| I I U I U U U | ౧౨ | U I I I I U U | ౩౧ |
| U U I I U U U | ౧౩ | I I I I I U U | ౩౨ |
| I U I I U U U | ౧౪ | U U U U U I U | ౩౩ |
| U I I I U U U | ౧౫ | I U U U U I U | ౩౪ |
| I I I I U U U | ౧౬ | U I U U U I U | ౩౫ |
| U U U U I U U | ౧౭ | I I U U U I U | ౩౬ |
| I U U U I U U | ౧౮ | U U I U U I U | ౩౭ |
| U I U U I U U | ౧౯ | | |

ప్రస్తరించినాను. రెండు తగణములున్ను ఒక గురువున్ను వచ్చెను.

## మేరుచక్రోద్ధారము

నాల్గవ ఛందమునకు ఎన్నేసి లఘువుల వృత్తములు ఎన్నెన్ని పుట్టెనంటేను సరి చెప్పేటి విధము. వీథివీథి ఒక్కొక్క ఛందము కనుకను ఈచక్రమునకు నాలుగడ్డ చాళ్లు గాన నాలవఛందము పర్యంతము ఆయెను. దీని నాలుగవబంతి చూచి చెప్పేది.

| | | | | |
|---|---|---|---|---|
| ౧ | ౧ | | | |
| ౧ | ౨ | ౧ | | |
| ౧ | ౩ | ౩ | ౧ | |
| ౧ | ౪ | ౬ | ౪ | ౧ |

నాల్గవబంతి మొదలింటి దొకటిన్ని సర్వగురువృత్తము. రెండవయింటి నాలుగున్ను ఒంటి లఘువృత్తములు. మూఁడవయింటి యాఱున్ను రెండేసి లఘువులవృత్తములు. నాలవ యింటి నాలుగున్ను మూఁడేసి లఘువుల వృత్తములు. కడపలియింటి దొక్కటిన్ని నాలుగులఘువుల సర్వలఘువృత్తము. 165

## శకటచక్రోద్ధారము

ప్రతిష్ఠాఛందమునందు ఎన్నేసి లఘువుల వృత్తములు ఎన్నవ యెన్నవయవి యని యడిగితేను సరిచెప్పేటి విధము. 166

| | | | | | |
|---|---|---|---|---|---|
| ౧ | | | | | |
| ౨ | ౩ | ౫ | ౯ | | |
| ౪ | ౭ | ౧౩ | ౬ | ౧౧ | ౧౦ |
| ౮ | ౧౫ | ౧౪ | ౧౨ | | |
| ౧౬ | | | | | |

ఈ చక్రమునందు మీఁదియింటి దొకటిన్ని నాలుగు గురువుల సర్వగురువృత్తము. రెండవ యడ్డవీథినున్న ౨ వది, ౩ వది, ౫ వది, ౯ వ దిన్ని ఒంటిలఘువృత్తములు.

మూఁడవ చాలున ఉన్న ౪ వది, ౭ వది, ౧౩ వది, ౬ వది, ౧౧ వది, ౧౦ వదిన్ని రెండేసి లఘువులవి. నాలుగవ బంతినున్న ౮ వది, ౧౫ వది, ౧౪ వదిన్ని ౧౨ వదిన్ని, మూఁడేసి లఘువుల వృత్తములు. కడపటి ౧౬ వది యొక్కటిన్ని నాలుగు లఘువుల సర్వలఘువృత్తము. 167

## పద్యలక్ష్యోపయోగిసంజ్ఞలు.

ఉక్తాఛందం బొక్క యక్షరంబుననుండి యొండొంటికి వచ్చు నక్షరంబు షడ్వింశాక్షర పర్యంతంబుగాఁ బెరుగుచుండు నందు నుక్తకుఁ బ్రతిపాద మేకాక్షరం బౌను. 168

| ఛందస్సంఖ్యలు. | | వృత్తసంఖ్యలు. | ఛందస్సంఖ్యలు. | | వృత్తసంఖ్యలు. |
|---|---|---|---|---|---|
| ౧ | శ్రీవృత్తము | ౧ | ౭ | లోల | ౨౪ |
| ౨ | స్త్రీవృత్తము | ౨ | | హంసమాల | ౨౫ |
| ౩ | నారీవృత్తము | ౩ | | మదరేఖ | ౨౬ |
| | మృగి | ౪ | | కుమారలలిత | ౨౭ |
| | వినయ | ౫ | | సరసిజము | ౨౮ |
| ౪ | కన్య | ౬ | | విభూతి | ౨౯ |
| | వ్రీడ | ౭ | | మధుమతి | ౩౦ |
| | సుకాంతి | ౮ | | మదనవిలసిత | ౩౧ |
| | బింబము | ౯ | ౮ | విద్యున్మాల | ౩౨ |
| ౫ | ప్రీతి | ౧౦ | | వితానము | ౩౩ |
| | ప్రగుణ | ౧౧ | | విమానము | ౩౪ |
| | సతి | ౧౨ | | సింహరేఖ | ౩౫ |
| | పంక్తి (సుందరి) | ౧౩ | | చిత్రపదము | ౩౬ |
| | నంద | ౧౪ | | హంసరుతము | ౩౭ |
| | అంబుజ | ౧౫ | | నారాచము | ౩౮ |
| ౬ | సావిత్రి | ౧౬ | | ప్రమాణి | ౩౯ |
| | విచిత్ర | ౧౭ | | నాగరము | ౪౦ |
| | తనుమధ్య | ౧౮ | | మాణవకము | ౪౧ |
| | చంద్రవదన | ౧౯ | | సమాని | ౪౨ |
| | శశివదన | ౨౦ | ౯ | భుజంగశిశురుతము | ౪౩ |
| | సురలత | ౨౧ | | ఉత్సుకము | ౪౪ |
| | వసుధ | ౨౨ | | భద్రకము | ౪౫ |
| | వసుమతి | ౨౩ | | హాలముఖి | ౪౬ |
| | | | ౧౦ | పణవము | ౪౭ |

| | |
|---|---|
| మయూరసారి (మయూర భాషిణి) | ౪౮ |
| రసాలి | ౪౯ |
| రుగ్మవతి | ౫౦ |
| చంపకమాలి | ౫౧ |
| మణిరంగము | ౫౨ |
| మత్త (హంసశ్రేణి) | ౫౩ |
| కౌముది | ౫౪ |
| భోగివిలసితము (విలసితము) | ౫౫ |
| మనోరమ | ౫౬ |
| శుద్ధవిరాటి | ౫౭ |
| నందిని | ౫౮ |
| పఙ్క్తి | ౫౯ |
| ౧౧ ఇంద్రవజ్ర | ౬౦ |
| ఉపేంద్రవజ్ర | ౬౧ |
| ఉపస్థిత | ౬౨ |
| దోదకము | ౬౩ |
| రథోద్ధత (పరాంతిక) | ౬౪ |
| భద్రిక | ౬౫ |
| స్వాగతము | ౬౬ |
| శాంతి | ౬౭ |
| శ్యేని | ౬౮ |
| వాతోర్మి | ౬౯ |
| కలితాంతము (గీతాలంబనము) | ౭౦ |
| శాలిని | ౭౧ |
| సుముఖి | ౭౨ |
| భ్రమరవిలసితము | ౭౩ |
| వృత్త | ౭౪ |
| పృథ్వి | ౭౫ |
| వృంత | ౭౬ |
| మౌక్తికమాల | ౭౭ |
| ఉపస్థితము (శిఖండిరుతము) (స్త్రీ) | ౭౮ |
| ఏకరూప | ౭౯ |
| చంద్రిక | ౮౦ |
| ౧౨ స్రగ్విణి | ౮౧ |
| భుజంగప్రయాతము | ౮౨ |
| తోటకము | ౮౩ |
| జలధరమాల | ౮౪ |
| వంశస్థము | ౮౫ |
| ఇంద్రవంశము | ౮౬ |
| ద్రుతవిలంబితము | ౮౭ |
| తోదకము (తామరసము) | ౮౮ |
| ప్రియంవద | ౮౯ |
| ప్రమితాక్షర | ౯౦ |
| జలోద్ధతగతి | ౯౧ |
| విశ్వదేవి | ౯౨ |
| చంద్రవర్మ | ౯౩ |
| ప్రహేయము | ౯౪ |
| ప్రముదితవదన | ౯౫ |
| కుసుమవిచిత్రము | ౯౬ |
| మణిమాల | ౯౭ |
| మేఘవిలసితము | ౯౮ |
| ౧౩ మత్తమయూరము | ౯౯ |
| ప్రహర్షిణి | ౧౦౦ |
| ప్రభాతము | ౧౦౧ |
| జలదము | ౧౦౨ |
| మంజుభాషిణి | ౧౦౩ |
| రుచిరము | ౧౦౪ |
| క్షమ (క్షప) | ౧౦౫ |
| చంచరీకావళి | ౧౦౬ |
| మత్తహంసిని | ౧౦౭ |
| సుమంగలి | ౧౦౮ |

| | |
|---|---|
| ౧౪ వనమయూరము | ౧౦౯ |
| వసంతతిలక, సింహోన్నతి, ఉద్ధర్షిణి, శోభావతి, మధుమాధవి | ౧౧౦ |
| భూనుతము | ౧౧౧ |
| సుందరి | ౧౧౨ |
| ప్రహరణకలిత | ౧౧౩ |
| నవనందిని | ౧౧౪ |
| అపరాజితము | ౧౧౫ |
| అసంబాధ | ౧౧౬ |
| కమలవిలసితము | ౧౧౭ |
| ౧౫ మాలిని | ౧౧౮ |
| సుకేసరము (భద్రకము) | ౧౧౯ |
| మనోజ్ఞ | ౧౨౦ |
| మణిభూషణము | ౧౨౧ |
| సుగంధి (శాలిని) (చామరము) (ప్రశాంతి) | ౧౨౨ |
| ఇల | ౧౨౩ |
| చంద్రరేఖ | ౧౨౪ |
| నలిని | ౧౨౫ |
| అలసగతి | ౧౨౬ |
| మణిగణనికరము | ౧౨౭ |
| ౧౬ ప్రియకాంత | ౧౨౮ |
| పంచచామరము | ౧౨౯ |
| పద్మకము | ౧౩౦ |
| చంద్రశ్రీ | ౧౩౧ |
| మేదిని, వాణి | ౧౩౨ |
| ఫలసదనము | ౧౩౩ |
| అశ్వగతి | ౧౩౪ |
| మదనదర్పణము | ౧౩౫ |
| గజవిలసితము | ౧౩౬ |
| ౧౭ శిఖరిణి | ౧౩౭ |
| పృథ్వి | ౧౩౮ |
| హరిణి | ౧౩౯ |
| నర్కుటము (కోకిలకాకము) | ౧౪౦ |
| మందాక్రాంత | ౧౪౧ |
| పాలాశదళము (త్వరితగతి) | ౧౪౨ |
| వంశపత్రపతిత | ౧౪౩ |
| చంపకకేసరి | ౧౪౪ |
| ౧౮ మత్తకోకిల | ౧౪౫ |
| కుసుమితలతావేల్లిత | ౧౪౬ |
| నిశ | ౧౪౭ |
| హరనర్తన | ౧౪౮ |
| క్ష్రాహారము | ౧౪౯ |
| ౧౯ శార్దూలవిక్రీడిత | ౧౫౦ |
| తరళము | ౧౫౧ |
| మేఘవిస్ఫూర్జితము | ౧౫౨ |
| చంద్రకళ | ౧౫౩ |
| భూతిలకము | ౧౫౪ |
| కవికంఠభూషణము | ౧౫౫ |
| ౨౦ మత్తేభవిక్రీడితము | ౧౫౬ |
| ఉత్పలమాల | ౧౫౭ |
| అంబురుహము | ౧౫౮ |
| ఖచరప్లుతము | ౧౫౯ |
| ప్రభాకలితము | ౧౬౦ |
| ౨౧ చంపకమాల | ౧౬౧ |
| వనమంజరి | ౧౬౨ |
| లాటీవిటము | ౧౬౩ |
| మణిమాల | ౧౬౪ |
| కరిబృంహితము | ౧౬౫ |
| కనకలత | ౧౬౬ |

| | | | | | |
|---|---|---|---|---|---|
| ౨౨ | మహాస్రగ్ధర | ౧౬౭ | ౨౪ | సరసిజము | ౧౭౭ |
| | భద్రకము | ౧౬౮ | | క్రౌంచపదము | ౧౭౮ |
| | మానిని | ౧౬౯ | | తన్వి | ౧౭౯ |
| | విచికిలిత | ౧౭౦ | | అష్టమూర్తి | ౧౮౦ |
| | తురగము | ౧౭౧ | ౨౫ | బంధురము | ౧౮౧ |
| | మద్రకము | ౧౭౨ | | భాస్కరవిలసితము | ౧౮౨ |
| ౨౩ | కవిరాజవిరాజితము | ౧౭౩ | | ధరణిధరగతి | ౧౮౩ |
| | అశ్వలలిత | ౧౭౪ | ౨౬ | భుజంగవిజృంభిత | ౧౮౪ |
| | పద్మనాభము | ౧౭౫ | | వరాహ | ౧౮౫ |
| | మత్తాక్రీడ | ౧౭౬ | | మంగళమహాశ్రీ | ౧౮౬ |

క. యతిగణనామస్తోత్రము, వితతంబుగ సలిపి గురుల వినుతించి తగన్
యతిగణనామయుతంబుగఁ, బతగధ్వజ తేటపఱుతుఁ బద్యవిధంబుల్. 169

క. సమవిషమవృత్తమణులకు, సముద్రము లనంగఁ దనరి షడ్వింశతిభే
దములై వేదములకుఁ బాదములై ఛందంబు లొప్పిదము లగు వరుసన్. 170

తే. జగతి సమవృత్త మెన్నవఛందమునను
సంభవము నొందు నన్నియక్షరము లమరుఁ
బదపదమునకు హెచ్చును గొదువ లేక
గణములును నొక్కభంగిని గానఁబడును. 171

ఆ. ఒంటికాలఁ గొంద ఱుండఁ జేసిరి పాద, యుగముతోడఁ గొంద ఱుండఁ జేసి
రేను సకలవృత్తవృషముల నడపింతు, నాల్గుపాదముల జనంబు వొగడ. 172

క. ఒకకాలను రెండడుగులఁ, బ్రకటంబుగ గ్రంథవిస్తరభయంబునఁ బూ
ర్వకవులవలెఁ జెప్పిన లే,ఖకుఁ డొకలిపి విడువఁ దప్పు గనఁ దర మగునే. 173

క. నేను రచించినవృత్తవి,తానములో నొకటి రెంటఁ దప్పుండిన వి
ద్యానిధులు కడమపదముల,లో నారసి యతులు గణములును దెలియఁ దగున్. 174

తే. అడుగులకు వర్ణములు కొంచె మగుటఁ జేసి
యందు నుక్తాప్రభృతినవచ్ఛందములను
బొడము వృత్తములకు నెల్ల వడులు లేవు
నాల్గుపదములఁ బ్రాసము లున్న దచుఁ గాని. 175

క. గురులఘుగణసంజ్ఞల య,క్షరములు దీర్ఘంబులైనఁ జను నవి రెండై
పరువడి సంయుక్తములై, పరఁగిన నవి రెండు నెన్నఁబడు వెంబడిగాన్. 176

వ. ప్రథమచ్ఛందంబగు నుక్తయందుఁ బ్రతిపాదంబునకు నొక్కొక్క యక్షరంబై రెండు వృత్తంబులు పుట్టె నందు శ్రీయను వృత్తము.

శ్రీవృత్తము. ౧-౧

U గ.

శ్రీ
గో
పా
లా 177

ద్వితీయచ్ఛందంబగు నత్యుక్తయందుఁ బ్రతిపాదంబునకు రెండేసి యక్షరంబులై నాల్గు వృత్తంబులు పుట్టె నందు:—

స్త్రీవృత్తము. ౨-౧

UU గగము.

స్త్రీనా
గానీ
త్స్నానిం
పూనున్. 178

తృతీయచ్ఛందంబగు మధ్యయందుఁ బ్రతిపాదంబునకు మూఁడేసియక్షరంబులై యెనిమిది వృత్తంబులు పుట్టెనందు:—

నారీ. ౩-౧

UUU మగణము.

శ్రీనాథున్
నేనెంతున్
మా నొప్పం
గా నారిన్. 179

మృగీ. ౩-౩

U I U రగణము.

భూమిలో
రా మహో
ద్దామమూఁ
దా మృగిన్. 180

వినయవృత్తము. ౩-౪

I I U సగణము.

వినయం
బనఁగాఁ
జను సా
వనఘా. 181

చతుర్థచ్ఛందంబగు ప్రతిష్ఠయందుఁ బ్రతిపాదంబునకు నాలుగేసి యక్షరంబులై ౧౬ వృత్తంబులు పుట్టెనందు:—

కన్య. ౪-౧

UUUమUగ.

భావింప న్నా
గావాప్తి న్న
న్యావృత్తం బీ
తేవ న్బొల్చున్. 182

వ్రీడ. ౪-౨

I UU య U గ.

యగల్ చెప్పం
దగు న్వ్రీడన్
నగోద్ధర్తా
జగద్భర్తా. 183

సుకాంతి. ౪-౬

I U I జ U గ.

జకారమున్
గకారమున్
సుకాంతికిన్
శుక స్తుతా. 184

బింబ. ౪-౭

U I I భ U గ.

ఇమ్మహిలోఁ
గ్రమ్మ భగల్
బింబమునం
గంబుధరా. 185

పంచమచ్ఛందంబగు సుప్రతిష్ఠయందుఁ బ్రతి పాదంబునకు నైదేసి యక్షరంబుల ముప్పది రెండు వృత్తంబులు పుట్టె నందు:—

ప్రీతి. ౫-3

U I U ర UU గగ.

ప్రీతికి న్రేఫా
స్వీతగద్వంద్వం
బై తగుఁ దైత్యా
రాతి వర్ణింపఁ. 186

ప్రగుణ. ౫-౪

I I U స UU గగ.

ప్రగుణాఖ్యం బొ
ప్పగుఁ జెప్పంగా
సగగాసక్తిఁ
నిగమస్తుత్యా. 187

సతి. ౫-౬

I U I జ UU గగ.

క్షితిం జగాసం
గతిం దనర్చుఁ
సతీసువృత్తం
బతిప్రసిద్ధా. 188

పఙ్క్తి (సుందరి). ౫-౭

U I I భ UU గగ.

ఏకభకారం
బేకగగంబుఁ
గైకొనుఁ బఙ్క్తిఁ
శ్రీకమలాక్షా. 189

నంద. ౫-౧3

UU I త I U వ.

దేవస్తుత నం
దావృత్తమునఁ
దేవ న్నిలుపం
గా వచ్చుఁ దవల్. 190

అంబుజము. ౫-౧౫

U I I భ I U లగ.

ఇమ్ముల భకా
రమ్ము లగయు
క్తిం బరఁగుఁ దా
నంబుజ మనఁ. 191

షష్ఠచ్ఛందం బగు గాయత్రియందుఁ బ్రతి పాదంబునకు నాఱేసి యక్షరంబులై యఱువదినాల్గు వృత్తంబులుపుట్టెనందు.

సావిత్రి. ౬-౧

UUU మ UUU మ.

గోవిందస్తోత్రంబుల్
దైవారు న్మాయుక్తిఁ
సావిత్రీవృత్తంబున్
గావింపంగా నొప్పుఁ. 192

విచిత్ర. ౬-౧౧

I UU య I UU య.

తనర్చు న్విచిత్రం
బనంగా యయాప్తిఁ
ఘనశ్యామగాత్రా
మునిస్తోత్ర పాత్రా. 193

తనుమధ్య. ౬-౧3

UU I త I UU య.

కామేపలివాసుఁ
మే మెంతు మనంగఁ
స్వామీ తనుమధ్యఁ
భూమిఁ దయ లొప్పుఁ. 194

చంద్రవదన. ౬-౧౫

U I I భ I UU య.

చంద్రవదనా దే
వేంద్రవినుతా ని
స్తంద్రత భయంబుల్.
సాంద్రముగఁ జెప్పుఁ. 195

శశివదన. ౬-౧౬

।।। న । ⏑⏑ య.

శశివదనాఖ్యన్
విశదము లయ్యెన్
దిశల నయంబుల్
దశముఖవైరీ. 196

[1]సురలత. ౬-౧౬

।।। న । ⏑⏑ య.

మురహరుఁ దేవే
గురుకుచ నాఁగా
ధరణి నయంబుల్
సురలత కొప్పున్. 197

వసుధ. ౬-౨౫

।। ⏑ స ।। ⏑ స.

వసుదేవసుతున్
బొసఁగింపు మనన్
వసుధాహ్వయ మిం
పెసఁగున్ ససలన్. 198

వసుమతి. ౬-౨౯

⏑⏑ । త ।। ⏑ స.

బృందావనవిహా
రిం దార్తునెద నం
చందు న్వసుమతిం
బొందింతురు తసల్. 199

వ. సప్తమచ్ఛందంబగు నుష్ణిక్కునందుఁ బ్రతిపాదంబునకు నేడేసియక్షరంబులై నూట యిరువది యెనిమిది వృత్తములు పుట్టెను:—

లోల. ౭-౧౦

।⏑⏑య ।⏑⏑య ⏑గ.

ధరిత్రీ సుతారాతిన్
సరోజాతపత్రాక్షున్
హరిన్ యాగలన్ లోలన్
గరం బొప్ప వర్ణింతున్. 200

హంసమాల. ౭-౨౦

।। ⏑స ⏑ । ⏑ర ⏑గ.

సరగంబుల్ రచింపన్
బరఁగున్ హంసమాలన్
నరసింహావతారా
సురవిద్విడ్విదారా. 201

మదరేఖ ౭-౨౫

⏑⏑⏑మ ।। ⏑ స ⏑ గ.

గోపాలాఖ్యుఁడు నిచ్చల్, మాపాలం గలఁ డంచున్
రూపింప న్మసగంబుల్, దీపించు న్మదరేఖన్. 202

కుమారలలిత ౭-౩౦

। ⏑ । జ ।। ⏑ స ⏑ గ.

సుమాయుధనిభాంగా, రమాహృదయనాథా
కుమారలలితావృత్త మొప్పు జసగాప్తిన్. 203

---

1. 'సురలత' కును, 'శశివదన'కును భేదములేదు. కాఁబట్టి భిన్నవృత్తమయి నటుల చూపింపఁబని లేదు (శ)

సరసిజము ౭-౩౧

U I I భ I I U స U గ.

శ్రీ సరసిజం బిం, పారు భసగయుక్తిన్
నారదనుతిపాత్రా, నీరదనిభగాత్రా. 204

విభూతి ౭-౪౩

U I U ర I U I జ U గ.

ఇమ్మహి న్రజంబు లం, తమ్మునం గకారమున్
గ్రమ్మి యుండునట్టి వృ, త్తమ్ము దా విభూతి యౌ. 205

మధుమతి ౭-౫౬

I I I న U I I భ U గ.

కుధరవైరికడన్, విధుఁడు దా నమరున్,
మధుమతి న్నవము, న్మథశరీర హరీ. 206

మదనవిలసితము ౭-౬౪

I I I న I I I న U గ.

పదపడి ననగల్, గదిసి వెలసినన్
మదనవిలసితం, బది యదుతిలకా. 207

వ. అష్టమచ్ఛందంబగు ననుష్టుప్పునందుఁ బ్రతిపాదంబునకు నెనిమిదేసి యక్షరంబులై యిన్నూటయేఁబదాఱు వృత్తంబులు పుట్టె నందు:...

విద్యున్మాల ౮-౧

U U U మ U U U మ U U గగ.

శ్రీదేవీధాత్రీప్రాణేశా, యాదిత్యజ్యేష్ఠాదిస్తుత్యా
వేదోద్ధర్తా విద్యున్మాలం, బా దై మాగాప్రాప్తిం బొల్చున్. 208

వితాన ౮-౬

I U I జ U U U మ U U గగ.

క్షితిన్ జ్మగాయుక్తం బైనన్, వితానవృత్తంబై యొప్పున్
బితామహాద్యాదిత్యప్ర, స్తుతప్రభావా సర్వేశా. 209

విమానము ౮-౩౮

I U I జ U U I త U U గగ.

క్షమన్ జతాంతస్థగాయుఁ, క్తమై రచింపం బొసంగున్
విమాన మంభోరుహాక్షా, రమాంగనావాసవక్షా. 210

సింహరేఖ ర-౮౩

∪ । ∪ ర । ∪ । జ ∪ ∪ గగ.

ద్వారకాపురీవిహారా, మేరుధీర పంచబాణా
కార సింహరేఖకుం బెం, పారు రేఫజల్ గగంబున్. 211

చిత్రపదము ర-౯౯

∪ । । భ ∪ । । భ ∪ ∪ గగ.

చిత్రపదం బను వృత్తం, బత్రిమునిస్తుతు శౌరిన్
స్తోత్రము సేయఁగ నొప్పున్, ధాత్రిని భాగగయుక్తిన్. 212

హంసరుతము ర-౯౭

∪ ∪ ∪ మ । । । న ∪ ∪ గగ.

శ్రీవత్సాంకితసువక్షా, దేవా హంసరుత మెందున్
భావింప న్మనగ గాప్తిన్, గావింపం దగు ధరిత్రిన్. 213

నారాచము ర-ర౯

∪ ∪ । త ∪ । ∪ ర । ∪ వ.

క్షీరాబ్ధికన్యకాపతిన్, నారాయణుం ద్రవంబులన్
దోరంబుగా నుతించినన్, నారాచవృత్త మై చనున్. 214

[1] ప్రమాణి ర-ర౬

। ∪ । జ ∪ । ∪ ర । ∪ వ.

అమిత్రలోకసంహరా, సమగ్రకాంతిభాసురా
క్షమన్ జరేభవంబులన్, బ్రమాణివృత్త మొప్పగున్. 215

నాగరము ర-ర౭

∪ । । భ ∪ । ∪ ర । ∪ వ.

బా గమరన్ భరేఫసం, యోగలగంబుల న్మహా
యోగినుతా వినంబడున్, నాగరనామవృత్తమై. 216

మాణవకము ర-౧౦౩

∪ । । భ ∪ ∪ । త । ∪ వ.

శోణమయూఖప్రవిభా, బాణసుపర్వారిహరా
వేణుధరా భత్వములన్, మాణవకంబై తనరున్. 217

---

1. ఇది (ధ్రు. ము.) లో లేదు. దీనిపేరుమాత్రము సంజ్ఞలపట్టీలో నున్నది (చూ. ర. ౩౯.)

సమాని ౮-౧౦౭

∪ | ∪ ర | ∪ | జ | ∪ వ

నారదాదిమౌనివరుల్, చేరి శౌరిఁ గొల్తు రనఁగ
గౌరి రేఫముం జవముల్, ధారుణి స్సమాని కగున్. 218

వ. నవమచ్ఛందంబగు బృహతియందుఁ బ్రతిపాదంబునకుఁ దొమ్మిదేసి యక్షరంబులై యేనూటపండ్రెండు వృత్తంబులు పుట్టె నందు:—

భుజంగశిశురుతము ౯-౧౨౮

| | | న | | | న | ∪ ∪ య

నిజమున ననయ లొప్పఁగ, భుజగశిశురుత మయ్యెఁగ
సుజనవినుతచరిత్రా, వృజినతృణఘనదాత్రా. 219

ఉత్సుకము ౯-౧౮౩

∪ | | భ ∪ | | భ ∪ | ∪ ర

వాసవముఖ్యసురస్తుతా, దాసమనోంబుజషట్పదా
వాసిగ భారము లొందినఁ, భాసిలు నుత్సుకవృత్తముల్. 220

భద్రకము ౯-౧౮౭

∪ | ∪ ర | | | న ∪ | ∪ ర

కాద్రవేయశయనా సము, న్నిద్రదైత్యమదభంజనా
రుద్రమిత్ర రనరేఫముల్, భద్రకంబునకు భాసిలున్. 221

హాలముఖి ౯-౨౯౧

∪ | ∪ ర | | | న | | ∪ స

కింకరీకృతసురవరా, పంకజాతదళనయనా
పొంక మౌ రనసగణముల్, శంక లేక హాలముఖికిన్. 222

ఆ. పఙ్క్తినుంచి వృత్తపఙ్క్తి కిన్నవవ్రాయి, వడి యటంచుఁ జెప్పఁబడియె నిచట
సంస్కృతంబునందుఁ జనుఁ బదవిచ్ఛేద, మదుగు మొదలివర్ణ మగుఁ దెనుఁగున. 223

క. ధర గణితశాస్త్రసంజ్ఞల, శరరసగిరిదంతినిధిదిశాశంకరభా
స్కరవిశ్వమనువినోర్వి, శ్వరనామములు యతివర్ణసంఖ్యార్థంబుల్. 224

వ. దశమచ్ఛందంబగు పఙ్క్తియందుఁ బ్రతిపాదంబునకుఁ బదేసి యక్షరంబులై వేయు నిరువదినాల్గు వృత్తములు పుట్టె; అందు:—

పణవము ౧౦-౧౨౧

∪∪∪ మ ౹౹౹ న ౹∪∪ య ∪ x

ఉర్వి న్మన్యగ • యుతపాదంబుల్, పర్వ న్నద్యతిఁ • బణవం బయ్యెన్
గీర్వాణాహిత • గిరినాకేశా, సర్వేశా రవి • శతసంకాశా. 225

మయూరసారి (మయూరభాషిణి) ౧౦-౧౭౧

∪౹∪ ర ౹∪౹ జ ∪౹∪ ర ∪ x

వెక్కసించె శైల • విశ్రమంబు, లొప్పెక్కి రేఫజంబు•లు స్రగంబుల్
చక్కఁగా మయూర•సారి కొప్పున్, నిక్క మంబుజాత•నేత్ర శౌరీ. 226

రసాలి ౧౦-౧౮౭

∪౹∪ ర ౹౹౹ న ∪౹∪ ర ∪ x

గోత్రవిక్రమము • గూడి భక్తిన్, ధాత్రి రేఫనగ•ణంబు లొప్పెఁ
బోత్రిరూప! రగ•ము ల్రసాలిం, జిత్రభంగి నుతి•సేయు నిన్నున్. 227

రుగ్మవతి ౧౦-౧౯౯

∪౹౹ భ ∪∪∪ మ ౹౹∪ స ∪ x

అంగయతిం బొం•దై భమస ల్పూర్వం గురుయుక్తి • న్రుగ్మవతి నృ
త్యాంగనకై తేఁ•డా సురశాఖిం, బొంగుచు గోపీ•పుత్రుఁ డనంగన్. 228

[1]చంపకమాలి ౧౦-౧౯౯

∪౹౹ భ ∪∪∪ మ ౹౹∪ స ∪ x

భూమిధరశ్రాంతు • లొప్పలుపారన్, బ్రేమ భమంబు ల్గో•రిసగంబుల్
తామ నుతించు న్నం•దసుతు న్భా, మామకరాంకుం జం•పకమాలిన్. 229

మణిరంగము ౧౦-౨౧౯

∪౹∪ ర ౹౹∪ స ౹౹∪ స ∪ x

అంగనామణు • లంగయతుల్గా, సంగ మెచ్చ ర•సాగురుయుక్తిన్
బొంగుచు న్యదు•పుంగవు వేఁడన్, రం గగున్ మణి•రంగ మనంగాన్. 230

మత్త (హంసశ్రేణి) ౧౦-౨౪౧

∪∪∪ మ ∪౹౹ భ ౹౹∪ స ∪ x

శైలశ్రాంతి న్మభ•సగ లోలిం, గ్రాల న్మత్తాఖ్యను • గనుపట్టున్
బాలించె న్యాదవ•పతి యా పాంచాలిం గౌరవ్యుల•సభ నాఁగన్. 231

1. రుగ్మవతికిని, చంపకమాలికిని గణములలో భేదములేదు; యతిస్థానమున మాత్రము భేదముగలదు గాన వేఱుగఁ జెప్పఁబడినది (గ). దీనికి రుక్మవతి యను పేరు సంస్కృత వృత్త రత్నాకరాదులలో నొసఁగఁబడినది (రా).

కౌముది ౧౦-౨౯౬

। । । న ∪ ∪ । త ∪ ∪ । త ∪ X

మునినుతా కౌముదీవృత్తమొ, ప్పును నతాగంబులన్ దద్యతిన్
దునిమెఁ బౌలస్త్య భూపుత్త్రికై, కినుక రామక్షితీశుం డనన్. 232

భోగివిలసితము (విలసితము) ౧౦-౩౫౧

∪ । । భ । । ∪ స । ∪ । జ ∪ X

సాగ భసములున్ జగంబులున్, బాఁగగు నగవిశ్రమంబులన్
భోగివిలసితంబుఁ జెప్పఁగా, సాగరతనయా సమన్వితా. 233

మనోరమ ౧౦-౩౪౪

। । । న ∪ । ∪ ర । ∪ । జ ∪ X

నరజగంబుల న్మనోరమల్, సరవి శైలవిశ్రమంబులన్
దురితదూర సింధుజాపతిన్, సారిది సన్నుతించు సొంతయున్. 234

*శుద్ధవిరాటి ౧౦-౩౪౫

∪ ∪ ∪ మ । । ∪ స । ∪ । జ ∪ X

చాలొప్ప న్మసజల్గకారముల్, గ్రాలు న్శుద్ధవిరాటిన్ షడ్యతిన్
నీలాంగా రమణీమనోభవా, శాళీకాసననందనస్తుతా. 235

నందిని ౧౦-౩౫౯

∪ । । భ ∪ ∪ । త । ∪ । జ ∪ X

శ్రీరమణా నిర్జితదానవా, సారసపత్త్రేక్షణ షడ్యతిన్
సారె భతంబుల్ జగముల్ దగన్, ధీరులచే నందిని నాఁ జనున్. 236

పఙ్క్తి ౧౦-౪౩౯

∪ । । భ ∪ । । భ ∪ । । భ ∪ X

గ్రావవిరామముగా విబుధుల్, భావజుతండ్రిని భాభగురుల్
గా వినుతించినఁ గావ్యముల, న్వావిరిఁ బఙ్క్తియనం బరఁగున్. 237

వ. ఏకాదశచ్ఛందం బగు త్రిష్టుప్పునందుఁ బ్రతిపాదంబునకుం బదునొకండేసి యక్షరంబు లై ౨౦౪౮ వృత్తంబులు పుట్టెనందు:—

* (పూ. ము.) సంజ్ఞలపట్టీలో 'వరాటి' అని యున్నది; (పె) లో విరాటి; విరాట (బ).

ఇంద్రవజ్ర ౧౧-౩౫౭

UU I త UU I త I U I జ UU XX

ఇంతు ల్సదా పాదుదు । రింద్రవజ్రల్, స్వాంతంబున న్మోహము । సంధిలంగన్
దంతావళశ్రాంతిని । తాజకార, ప్రాంతంబునం గద్వయ । మంద మందన్. 238

ఉపేంద్రవజ్ర ౧౧-౩౫౮

I U I జ UU I త I U I జ UU XX

శ్వపాచరారు జ్జత।జ ల్గగంబుల్, బ్రపూర్ణమై దంతివి।రామ మొప్పన్
ద్విపాధిపత్రాత ను।తింపఁ జేరై, యుపేంద్రవజ్ర ల్వెల।యు న్ధరిత్రిన్. 239

ఉపస్థితము ౧౧-౩౬౫

UU I త I U I జ I U I జ UU XX

భక్తు ల్హరిమీఁద ను।పస్థితం బా, సక్తి న్విరతు ల్కరి । సంఖ్య సాగన్
సూక్తు ల్గాని చెప్పెదు।చోఁ దజాగా, యుక్తం బగుచుం జెలు।వొందుచుండున్.

దోదకము ౧౧-౪౩౯

U I I భ U I I భ U I I భ UU XX

తోరపువేడుక । [1]దోదక [2]మొప్పన్, భూరివిరామము । భూధరసంజ్ఞం
బారుచు భాభగ।గాన్వితమై ల,క్ష్మీరమణా విర।చింప నెసంగున్. 241

రథోద్ధతము (పరాంతిక) ౧౧-౬౯౯

U I U ర I I I న U I U ర I U వ

అంది రేఫనర।వా ప్తి నొప్ప గో,వింద భూమిధర।విశ్రమంబులన్
జెంది కబ్బములఁ । జిత్రభంగిఁ జే,న్నొందు నెంతయు ర।థోద్ధతం బిలన్. 242

[3]భద్రకము ౧౧-౭౦౪

I I I న I I I న U I U ర I U వ

నరకదమన । నారవంబులన్, సరగఁ గుధర । సమ్మితంబులై
విరతు లమర । వేడ్కఁ జెప్పినం, బరఁగుఁ గృతుల । భద్రకం బనన్. 243

స్వాగతము ౧౧-౪౪౩

U I U ర I I I న U I I భ UU XX

స్వాగతంబు దగు । శైలవిరామం, బై గజేంద్రవర।దా రనభంబుల్
పై గురుద్వయము । భాసిలఁ జెప్పన్, యోగిమానసప । యోజమిళిందా. 244

---

1. తోటక (పె. ప.) 2. మెందుర్ (సూ). దీనిపేరు దోధకమని సంస్కృత చ్ఛందములం దున్నది. (రా) 3. భద్రకమునకును జంద్రికకును గణములలో భేదము లేదు. యతిస్థానమున మాత్రము భేదము గలదు. చూ. చంద్రిక-పుట. 230 (రా)

కాంతి ౧౧-౮౭౭

∪∪ | త | ∪ | జ | ∪ | జ | ∪ లగ

క్రాంతు ల్కారిసంఖ్యను • రాజిలఁగా, సంతోషముతోడఁ ద•జాలగముల్
చింతింపఁ బదంబులఁ • జెంద రమా, కాంతాహృదయేశ్వర • కాంతి యగున్. 245

శ్యేని ౧౧-౬౮౩

∪ | ∪ ర | ∪ | జ ∪ | ∪ ర | ∪ వ

మానితాద్రివిశ్ర•మంబుఁ బూనఁగా, శ్యేనికి న్రజ ల్వ•యి న్రపంబులుక్
గాని యొండు గూర్పఁ • గాదు రుక్మిణీ•ప్రాణనాథ కామో•పల్లిమందిరా. 246

వాతోర్మి ౧౧-౮౧౭

∪∪∪ మ ∪ | | భ ∪∪ | త | ∪ వ

ఆమోదం బొప్పఁగ • వ్యాసాదికవుల్, భూమిధ్రక్రాంతులు • పొంగార మహీ
భామాప్రాణేశ మ•భంబుల్ తవలుక్, దా మీవాతోర్మిని • దాపింతు రొగిన్. 247

కలితాంతము (గీతాలంబనము) ౧౧-౮౭౭

∪ ∪ | త | ∪ | జ | ∪ | జ | ∪ లగ

సామోద్భవవిశ్రమ•సంయుతమై, వేమాఱు తజాలగ•విస్తృతమై
దామోదరదేవక•థ ల్పలుకక్, భూమిం గలితాంతము•పూర్ణ మగున్. 248

శాలిని ౧౧-౨౮౯

∪ ∪ ∪ మ ∪ ∪ | త ∪ ∪ | త ∪ ∪ గగ

ధీరశ్రేష్ఠు ల్సన్ను•తింపం గవీంద్రా, ధారంబై ధాత్రి న్మ•తాగాగణాప్తిక్
దోరంబై భూభృద్య•తుల్ సంఘటింపక్, నీరేజాక్షా శాలి•నీవృత్త మొప్పున్. 249

సుముఖి ౧౧-౮౮౦

| | | న | ∪ | జ | ∪ | జ | ∪ లగ

ఖగపతివాహా • కపర్దినుతా, మృగపతిమధ్య • హితార్తిహరా
నగవిరమం బె•నయంగ నజా, లగములచేఁ జె•లఁగు న్సుముఖుల్. 250

భ్రమరవిలసితము ౧౧-౧౦౦౯

∪ ∪ ∪ మ ∪ | | భ | | | న | ∪ వ

ఏయంఘ్రిం బార•యి మగణభన, ల్వాయొక్కొం దవ్వ•లను నెలకొనక్
మాయాతీతా భ్ర•మరవిలసితం, బై యొప్పుం దర్కా•యతుల నిలుచున్. 251

వృత్త ౧౧-౨౮౮

। । । న । । ∪ స ∪ ∪ । త ∪ ∪ గగ

అనయమును వే•దాంగంబు సెప్పఁగ, దనుజహర న•స్తంబు ల్గగంబుఁగ
బెనఁగొని ధరా•భృద్విశ్రమంబుల్, దనరునది వృ•త్తావృత్త మంచున్. 252

[1]పృథ్వి ౧౧-౮౯౬

। । । న । । । న । ∪ । జ । ∪ వగము

నలినభవనుత • నాజలగం, బులు గజయతులఁ • బొందుపడం
బెలుచఁ బలికినఁ•బృథ్వి యనఁగ, వెలయు నొక సమ•వృత్త మిలన్. 253

వృంత ౧౧-౨౫౬

। । । న । । । న । । ∪ స ∪ ∪ గగ

నగణయుగము సగ•ణం బొందుఁగ, గగ మొకటియు జత•గాఁ గూడఁగ
ఖగవిరమములను•గల్పింపఁగ, దగుఁ గవులకు వసు•ధ న్వృంతల్. 254

మౌక్తికమాల ౧౧-౪౮౭

∪ । । భ ∪ ∪ । త । । । న ∪ ∪ గగ

భక్తజనత్రాత • భతనగాసం, యుక్తములై మౌని•యుతయతుల్ సు
వ్యక్తములై సూక్తు•లమరఁ జెప్పఁగ, మౌక్తిక మాలాక్ర•మము లెసంగున్. 255

ఉపస్థితము (శిఖండివిరుతము); (స్త్రీ) ౧౧-౨౮౬

। ∪ । జ । । ∪ స ∪ ∪ । త ∪ ∪ గగ

ఉపస్థితమునం • దొప్పారుచుఁడుఁగ, దపస్వివిరతు • ల్దాకం జకారం
బుపై సతగణం•బు ల్గద్వయంబుఁగ, గపిధ్వజసఖా • కామేపలీశా. 256

ఏకరూప ౧౧-౩౯౬

∪ ∪ ∪ మ ∪ । । భ । ∪ । జ ∪ ∪ గగ

ఏపారుం గావ్యముల • నేకరూపల్, క్ష్మాపుత్రీశుఁగ మభజ•గాగణంబుల్
బ్రాపించుం గుంజరవి•రామ మొప్పఁగ,బాపంబుల్ వాయుఁటకుఁ•బ్రస్తుతింపన్. 257

[2]చంద్రిక ౧౧-౭౦౪

। । । న । । । న ∪ । ∪ ర । ∪ వ

అగవరధర సార•వాన్వితం,బుగఁ గృతులను జెప్పఁ • బొందికై
తగ నిధివిరమంబు • దాఁకఁగా, జగతిని నెగ డొందుఁ • జంద్రికల్. 258

---

1. పదునేడవఛందమున మఱియొక పృథ్విగలదు. అయ్యది ప్రసిద్ధము (రా).
2. చూ. భద్రకము-పుట. 228. (రా).

వ. ద్వాదశచ్ఛందం బగు జగతియందుఁ బ్రతిపాదంబునకుఁ బండ్రెండేసి యక్షరములై ౪౦౯౬ వృత్తంబులు పుట్టె నందు.

స్రగ్విణి ౧౨-౧౧౭౧

U I U ర U I U ర U I U ర U I U ర

కామెపల్లీ మహాగ్రామమధ్యంబునన్
భూమిదేవోత్తము ల్పూజ సేయంగ నా
స్వామి యున్నాఁ డనన్ స్రగ్విణిన్ శైలవి
శ్రామయుక్తిం జతుష్కం బగున్ రేఫముల్. 259

భుజంగప్రయాతము ౧౨-౫౮౬

I U U య I U U య I U U య I U U య

భజింతున్ సదా కామెపల్లీనివాసున్
ప్రజస్త్రీవిటున్ యాదవశ్రేష్ఠు నంచున్
భుజంగప్రయాతాఖ్యము ల్నాల్గు యాలన్
గజవ్రాతవిశ్రాంతిగాఁ జెప్ప నొప్పున్. 260

తోటకము ౧౨-౧౭౫౬

I I U స I I U స I I U స I I U స

తగుఁ దోటకవృత్తము ధాత్రియతిన్, సగణంబులు నాలుగు సొగినఁ బ
న్నగపుణ్యనదీసురనాథదిశా, జగతీద్విజపట్టణసంచరణా. 261

జలధరమాల ౧౨-౨౪౧

U U U మ U I I భ I I U స U U U మ

ధీరుల్ మెచ్చం గృతుల నతిశ్రీదంబై, మారాకారా జలధరమాలావృత్తం
బై రాజిల్లున్ భువిఁ జతురాస్యశ్రాంతుల్, సారెం జేరన్ మభసమసంయుక్తంబై.

వంశస్థము ౧౨-౧౩౮౨

I U I జ U U I త I U I జ U I U ర

జతల్ జరేఫంబులు సామజాతస, మ్మితాక్షరశ్రాంతుల మెప్పు పుట్టఁగాఁ
బతంగరాజధ్వజుఁ బద్మలోచనున్, నుతింప వంశస్థ మనూనమై చనున్. 263

ఇంద్రవంశము ౧౨-౧౩౮౧

U U I త U U I త I U I జ U I U ర

ఇందీవరాక్షుల్ తగ నింద్రవంశ మా, నందంబునం బాడిరి నందసూతిపై
డెందంబుల న్మోహముదేప మీఱఁగాఁ, బొందై గజశ్రాంతులు పూనఁ దా్రజలన్.

ద్రుతవిలంబితము ౧౨-౧౪౬౪

I I I న U I I భ U I I భ U I U ర

ద్రుతవిలంబిత•రూప మగుం గుభృ, ద్యుతి నభారయు•తంబుగఁ జెప్పినన్
నతజనార్తివ•నశ్వసనప్రియా, వితతభూసుర•వీరపురాలయా. 265

తోదకము (తామరసము) ౧౨-౮౮౦

I I I న I U I జ I U I జ I U U య

సలలితతోదక•సామజవిశ్రాం, తులను నజాయలఁ • దోదకవృత్తం
బలపడుఁ గేతవ•రాసురకాష్ఠ్యో, జ్జ్వలనపథోశర•సాష్ఠలవాసా. 266

ప్రియంవద ౧౨-౧౪౦౦

I I I న U I I భ I U I జ U I U ర

విభు శమీరపృథ•వీజరథ భా, గభవసాలయుని•గా మెపల్లికా
ప్రభు నభజ్రలను • బ్రస్తుతింప నౌ, నిభవిరామమున • నీప్రియంవదల్. 267

ప్రమితాక్షరము ౧౨-౧౭౭౨

I I U స I U I జ I I U స I I U స

ప్రమితాక్షరం బమరుఁ • బద్మజ వి, భ్రమ మొప్పమీఱ సజ•సాయుతమై
యమునానదీతటవి•హార పృథా, ప్రమదాకుమారసఖ • భద్రయశా. 268

జలోద్ధతగతి ౧౨-౧౮౮౬

I U I జ I I U స I U I జ I I U స

జలోద్ధతగతిం ది•శాగజయతిన్, మెలంగు నినుమాఱు • మెచ్చుగ జసల్
ఫలానుభవ కామె•పల్లినిలయా, ఖలాంబుదసమీర • కామజనకా. 269

విశ్వదేవి ౧౨-౫౭౭

U U U మ U U U మ I U U య I U U య

శ్రీవత్సాంకా పద్మాధ•రిత్రీ కళత్రా, దేవేంద్రస్తోత్రా విశ్వ•దేవీసమాఖ్యం [జెప్పన్.
బైవిభ్రాందు స్మాయాగ•ణావాప్తి దిక్సం, ఖ్యావిశ్రామంబుల్ చో•ద్యమై యుండఁ

చంద్రవర్త్మ ౧౨-౧౯౭౯

U I U ర I I I న U I I భ I I U స

ఇంద్రవంద్య జగ•దీశ ఘనయశ, స్సాంద్ర కామెపలి•సద్మ యదువరా
చంద్రవర్త్మ యగు • శైలవిరతి ని, స్తంద్రమై రనభ•సంబు లమరినన్. 271

ప్రహేయము ౧౨-౫౭౬

I I I న I I I న ∪ ∪ ∪ మ I ∪ ∪ య

కరివిరమణముల్ • గా నామయంబుల్, పరఁగ నిలుపఁ జా•పట్టుం బ్రహేయం
బురగశయ భో•జోర్వీశపుత్రీ, వర పరమకృపా•వారాశి కృష్ణా. 272

ప్రముదితవదన ౧౨-౧౨౧౬

I I I న I I I న ∪ I ∪ ర ∪ I ∪ ర

మమత నిభవిరా•మముల్ గూడఁగా, జమిలినరములన్ • సదా చెన్నగున్
బ్రముదితవదనల్ • రమానాయకా, సుమశరజనకా • సుపర్వస్తుతా. 273

కుసుమవిచిత్రము ౧౨-౯౭౬

I I I న I ∪ ∪ య I I I న I ∪ ∪ య

కుతలములోనం • గుసుమవిచిత్రం, బతిశుభదంబై • యగయతు లన్నం
దతనయ యొప్పున్ • నయ లిరుమారై, సతతము విద్వ•జ్జనులు నుతింపన్. 274

మణిమాల ౧౨-౧౮౦

∪ ∪ I త I ∪ ∪ య ∪ ∪ I త I ∪ ∪ య

కామేపలిసామ•గ్రామస్థలవాసా, స్వామీ తయుగారు•ద్వంద్వంబు పొసంగున్
వేమాఱు మహీభృ•ద్విశ్రాంతులతోడన్, భూమండలిఁగూర్పం•బోల్చున్మణిమాలల్.

మేఘవిలసితము ౭౨-౨౦౪౧

∪ ∪ ∪ మ I I I న I I I న I I ∪ స

కాళిందీముఖ•కమలమధుకరా, నాళీకాసన•నత రసవిరతు
ల్గాఁలె న్మేఘవి•లసితము తనరు, న్వాలాయంబు మ•నసగణములన్. 276

వ. త్రయోదశచ్ఛందంబగు నతిజగతియందుఁ బ్రతిపాదంబునకుఁ బదుమూఁడేసి యక్ష
రంబులై యెనిమిదివేల నూటతొంబదిరెండు వృత్తములు పుట్టె నందు:—

మత్తమయూరము ౧౩-౧౬౩౩

∪ ∪ ∪ మ ∪ ∪ I త I ∪ ∪ య I I ∪ స ∪ గ

శ్రీగోపాలా తంగెడ•సీమావనిగేహా
వాగీశాదిస్వర్గని•వాసస్తుతిపాత్రా
యోగిధ్యేయా మత్తమ•యూరంబున కొప్పున్
సాక్రాంతు ల్మత్యగ•ణంబు ల్సగ మొందన్. 277

ప్రహర్షిణి ౧౩-౧౪౦౧

∪ ∪ ∪ మ | | | న | ∪ | జ ∪ | ∪ ర ∪ గ

ధీరుల్ సింధురవిర•తిన్ మనజ్రగంబుల్, సారెం బాదములను•సంఘటించుచుండన్
గ్రూరారిప్రహరున•కుం బ్రహర్షణు ల్వెం, పారం జెప్పుదురు మ•హామోదంబుతోడన్.

ప్రభాతము ౧౩-౧౩౯౨

| | | న | ∪ | జ | ∪ | జ ∪ | ∪ ర ∪ గ

మొనసి నజారగ•ముల్ ప్రభాతవృత్తం, బునకు మదేభస•మూహవిశ్రమంబుల్
దనరఁగ నిల్చెఁ బృ•దాకురాజతల్పా, కనకమయాంశుక • కామెపల్లివాసా. 279

జలదము ౧౩-౩౫౪౩

∪ | | భ ∪ | ∪ ర | | | న ∪ | | భ ∪ గ

బంగరుచుంగుపచ్చడము • పైఁ గల యా, తంగెడదేశవాసు జల•దంబులచే
తం గడుసన్నుతింతు నవ• తారయతిన్, బొంగుచు సారె భర్గభగ•ముల్ గదియన్.

మంజుభాషిణి ౧౩-౨౭౯౬

| | ∪ స | ∪ | జ | | ∪ స | ∪ | జ ∪ గ

ఉరగాపగాదిహరి•దుర్వారాలయా, కరుణాసముద్ర ముర•గర్వభంజనా
యిర వొందుచుండు సజ•లిబ్బడింపఁ బల్మరు గాప్తి ధాతృయతి•మంజుభాషిణుల్.

రుచిరము ౧౩-౨౮౦౬

| ∪ | జ ∪ | | భ | | ∪ స | ∪ | జ ∪ గ

గదాధరున్ జభసజ•గంబులన్ గపుల్, సదా పితామహయతి•సొగుచుండఁగా
ముదంబుతోడ రుచిర•ము ల్రచింతు రి, ట్లుదారభక్తిఁ గృతుల • నుర్వరాస్థలిన్.

క్షమ (క్షప) ౧౩-౨౩౬౮

| | | న | | | న ∪ ∪ | త ∪ ∪ | త ∪ గ

క్రమమున నిభవి•శ్రాంతి నాతాగయు, క్తముగ సుకవి ప•ద్యంబు లూహించినన్
క్షమ లనఁ బరఁగుం • గంజపత్రేక్షణా, సుమశరజనకా • శూరవంశోత్తమా. 283

చంచరీకావళి ౧౩-౧౧౫౩

∪ ∪ ∪ మ ∪ ∪ ∪ మ ∪ | ∪ ర ∪ | ∪ ర ∪ గ

కంబుగ్రీవా సత్యా•కామినీప్రాణనాథా, బింబోష్ఠామారాగ•ల్పెర్చిభూభృద్యతుల్గాం
చం బాదంబై ధాత్రిం•జంచరీకావళీనా, మంబొందుం గావ్యశ్రీ•మానినీభూషణంబై

మత్తహంసిని ౧౩-౨౭౯౦

। ∪ । జ ∪ ∪ । త । । ∪ స । ∪ । జ ∪ ×

మనోహరాకార ♦ మధుదైత్యసంహరా, వినాయకారూఢ ♦ విబుధేంద్రవందితా
జనార్దనా జత్స♦జగురుల్ శుభ్రద్యతిన్, దనర్చు పద్యంబు♦దగు మత్తహంసినిన్.

సుమంగలి ౧౩-౧౭౭౨

। । ∪ స । ∪ । జ । । ∪ స । । ∪ స ∪ ×

సారిదిన్ ధరిత్రిని ♦ సుమంగలివృత్తం, బరయంగ సామజ ♦ యతిన్ సజసాగల్
తిర మొంద నొప్పు వి♦ధిపూజితపాదాం, బురువాద్వయా ఖర♦మురాసురవైరీ. 286

వ. చతుర్దశచ్ఛందంబగు శక్వరియందుఁ బ్రతిపాదంబునకుఁ బదునాలు గేసి యక్షరంబులై ౧౬౩౮౪ వృత్తములు పుట్టె నందు:—

వనమయూరము ౧౪-౩౮౨౩

∪ । । భ । ∪ । జ । । ∪ స । । । న ∪ ∪ ××

శ్రీకర ధరాధర♦జిష్ణునుత పుణ్యా, శ్లోక [1]భజసన్నగగ♦లున్ ద్రుహిణసంఖ్యన్
సోఁకుచు నవనమయూరా,ఖ్యాకమనువృత్తమిల♦[2]నత్తమిలుచుండున్.

వసంతతిలక (సింహోన్నతము, ఔద్ధర్షిణి, శోభావతి, మధుమాధవి) ౧౪-౨౯౩౩

∪ ∪ । త ∪ । । భ । ∪ । జ । ∪ । జ ∪ ∪ ××

శ్రీమేదినీరమణ♦సింధురతరంగరంగ, ద్రామాహితల్ప, విన♦తాసుతవాహ రాధా
కామా వసంతతిల♦కన్ దభజాగగంబుల్, సామప్రభూతయతి♦సాగి ధరం జెలంగున్.

భూనుతము ౧౪-౩౫౧౫

∪ । ∪ ర । । । న ∪ । । భ ∪ । । భ ∪ ∪ ××

మున్మురించి రనభాగగ♦ముల్ దశవిశ్రా, మంబుభూతలమునందున ♦ మానిత మయ్యెన్
జాంబవత్యధిప కేశవ♦సారసనేత్రా,కంబునందకగదాధర♦ఖండితసాళ్వా. 289

సుందరి ౧౫-౫౮౧౫

∪ । । భ ∪ । । భ ∪ । ∪ ర । । ∪ స । ∪ ఎవ

సూరిజనప్రకరంబు ♦ సుందరి యెన్నఁగా
భారసవంబులు రత్న ♦ భాసితవిశ్రమా
ధారముగాఁ దనరారుఁ ♦ దార్క్ష్యతురంగమా
శౌరి ముకుంద మునీంద్ర ♦ సన్నుత కేశవా. 290

---

1. భజసన్నగగలున్ (పూ. ము.) ఈగణములు పొరపాటు గాన సవరింపఁ బడినవి. (రా) 2. నందమగుచుండున్ (పూ.)

### ప్రహరణకలిత ౧౪-౮౧౨౮

I I I న I I I న U I I భ I I I న I U వ

పనిగొను నెపుడుం•బ్రహరణకలితన్, ననభనవలు మం • దగజవిరమమున్
ఘననిభఘనవి•గ్రహ బకమురమ, ర్దన మధునరక•ప్రహరణకలితా. 291

### నవనందిని ౧౪-౩౮౨౦

I I U స I U I జ I I U స I I I న U U గగ

నవనందినిన్ సజగ•ణస్నగగ లాయెన్, నవవిశ్రమంబును ద•నర్చి చెలువొప్పన్
నవనీతచోరకు జ•నార్దను నుపేంద్రున్, భవదూరు నెంతురు స•భాసదులు భక్తిన్.

### అపరాజితము ౧౪-౫౮౨౪

I I I న I I I న U I U ర I I U స I U వగ

ననరసలగ లొందిన న్నవవిశ్రమం, బును గలిగి కవీంద్ర•భూషితమై జనా
ర్దన నిగమసుగోచ•రా యపరాజితం, బనఁగఁ దనరు శ్రావ్య•మై వినువారికిన్. 293

### అసంబాధ ౧౪-౨౦౧౬

U U U మ U U I త I I I న I I U స U U గగ

వాలాయంబున్ సత్కవిజనములు • వాక్రువ్వన్
వాలారున్ గోవింద వరద ధ్రువ•వాత్సల్యా
కాళిందీప్రాణేశ మతనసగ•గప్రాప్తిన్
జ్వాలాభాస్వద్విశ్రమమునను స•సంబాధల్. 294

### కమలవిలసితము ౧౪-౪౦౯౬

I I I న I I I న I I I న I I I న U U గగ

క్రమమున నననన•గగములు గూడన్, గమలవిలసితము • కమలజవిశ్రా
మము జగతిని నగు•మహితచరిత్రా, కమలదళనయన • కడుఁ బొగడొందున్. 295

వ. పంచదశచ్ఛందంబగు నతిశక్వరియందుఁ బ్రతిపాదంబునకుఁ బదునైదేసి యక్షరంబులై ౩౨౭౬౮ వృత్తంబులు పుట్టె నందు.

### మాలిని ౧౫-౪౬౭౨

I I I న I I I న U U U మ I U U య I U U య

కనకకశిపుహర్తన్ • గానలోలున్ శుభాంగున్
దనుజహరణదక్షున్ • ధర్మమార్గానుసారిన్
మనసిజగురు నెంతున్ • మాలినీవృత్తమందున్
ననమయయగణంబుల్ • నందవిశ్రాంతి గూడన్. 296

సుకేసరము (భద్రకము) ౧౫-౧౧౧౮౪

I I I న I U I జ U I I భ I U I జ U I U ర

సురుచిరధర్మ మూల మయి•సొంపు మీఱు నా, గిరిధరనాభిశంకజసు•కేసరంబువై
ఖరి నజభ్రజ్రము ల్గదియఁ•గల్పనంబునన్, గిరిశవిరామసంగతి సు•కేసరంబునన్.

మనోజ్ఞ ౧౫-౧౧౬౩౨

I I I న I U I జ I U I జ U I I భ U I U ర

ఆజమృడవాసవసంత•తార్చితపాదపం
కజయుగళున్ హరి నిర్వి•కారు మనోజ్ఞు నా
బుజు వగువృత్తమునందుఁ • బ్రీతి నుతింపఁగా
నజజభరంబులు వొల్చు • నచ్చిన దిగ్యతిన్. 298

మణిభూషణము ౧౫-౧౧౭౦౨

U I U ర I I I న U I I భ U I I భ U I U ర

వింతయైన మణిభూషణ•వృత్తమునందు న
త్యంత మోదమున నెన్నను • నద్దశవిశ్రమా
క్రాంత [1]మైన రనభారలఁ • గంజదళాక్షుఁ గం
సాంతకు న్నరకసంహరు • నార్యసమూహముల్. 299

సుగంధి ([2]శాలినీ, చామర, ప్రశాంతి) ౧౫-౧౧౯౨౩

U I U ర I U I జ U I U ర I U I జ U I U ర

రంబు జంబు రంబు జంబు • రంబు చెన్ను మీఱఁగాఁ
దొమ్మిదింట విశ్రమంబు • తోరమై సుగంధికిన్
క్రమ్మఁగా నుతింప నొప్పు • గానలోలుఁ డచ్యుతుం
డంబుజాక్షుఁ డాదిదేవుఁ • డక్షరాఖ్యుఁ డెప్పుడున్. 300

ఇల ౧౫-౧౬౩౬౪

I I U స I U I జ I I I న I I I న I I U స

గజవిశ్రమంబునఁ • గనలు నిల యనఁగా, సజనాస లుండిన•సకలకవికృతమై
భుజగాశనధ్వజు•భుజగపతిశయనున్, వ్రజసుందరీముఖ•వనజహితుఁ బొగడన్.

---

1. మయ్య (సూ). 2. ౧౧-వ ఛందములో షుఱియొక శాలినీవృత్తము గలదు. (229 పుట.)

చంద్రరేఖ ౧౫-౮౬౨౫

UUU మ U I U ర UUU మ I UU య I UU య

మత్తేభక్రాంతిచే రమ్యంబౌ మహిం జంద్రరేఖా
వృత్తంబై మ్రమ్యయంబుల్ వేడ్కన్ హృషీకేశుఁ బార్థ
ప్రత్తన్నారాయణుం న్విశ్వామిత్రయాగారిదైత్య
చ్ఛేత్త స్సాక్షాద్విహా లక్ష్మీచిత్తాబ్జవాసు న్నుతింపన్. 302

నలిని ౧౫-౧౮౦౮౮

I I U స I I U స I I U స I I U స I I U స

ససనాసలచే దశవిశ్రమయుక్తతచేఁ, బొసఁగ న్నలినిన్ మణికంబుసుదర్శనహ
స్తసరోరుహు వామనుఁ గేశవుశౌరినజున్, వసుదేవన్మపాలతనూభవుఁ బాడుదురా.

అలసగతి ౧౫-౭౬౮౭

I I I న I I U స I I I న U I I భ I UU య

అలసగతి నాఁ జను సభాంతరమునందు, న్విలసదవతారయతి నిండి ససనభ్యల్
గలయ శకటాసురవిఘాతను విశిష్టున్, బలుమఱుఁ గవీశ్వరులు ప్రార్థనలుసేయన్.

మణిగణనికరము ౧౫-౧౬౩౭౮

I I I న I I I న I I I న I I I న I I U స

మణిగణనికరము మనులఘు(౧౪)గురువై, మణివిరమణమయి మధుదనుజహరున్
ఫణిపతిశయనునిఁ బ్రమథితనరకు, న్ఘృణిమదయుతనిభుని బొగడఁ దనరున్.

వ. షోడశచ్ఛందం బగు అష్టియందుఁ బ్రతిపాదంబునకుఁ బదునాఱేసియక్షరంబులై ౬౫౫౩౬ వృత్తములు పుట్టె నందు:—

ప్రియకాంత ౧౬-౧౩౨౬౮

I I I న I UU య I I I న I UU య I I U స U గ

అమరులు భృత్యుల్తనయ వి యద్గంగ ధరిత్రీ
కమలలు పెండ్లాములు రవి కంజారులు గన్నుల్
శమితతృణావర్తున కని చాటుం బ్రియకాంతా
ఖ్యము శివసంఖ్యావిరమణమై న్యన్యసగంబై. 306

పంచచామరము ౧౬-౨౧౭౮౬

I U I జ U I U ర I U I జ U I U ర I U I జ U గ

జరజ్రజంబులున్ గముం బొసంగి తొమ్మిదింటిపై
విరామ మొంది సత్కవు ల్సవిస్తరంబు సేయఁగాఁ
బరాత్పరుండు మాధవుండు పంచచామరంబునన్
బ్రరూఢగుంభనంబులందుఁ బాడ నొప్పు ధాత్రిలోన్. 307

పద్మకము ౧౬-౨౩౮౧౬

I I I న U I I భ I U I జ I U I జ I U I జ U గ

నభజజాగగణయుక్తిఁ బ్రనాశివిరామక
ప్రభవమై కృతుల నొప్పును బద్మక మందమై
ప్రభుఁడు నక్రమును ద్రుంచి సురక్షితుఁ జేయ సా
మభవపద్మకముచాడ్పున మానితమై ధరన్. 308

చంద్రశ్రీ ౧౬-౧౦౧౭౮

I U U య U U U మ I I I న I I U స U I U ర U గ

క్షమం జంద్రశ్రీతో యమనసరగ ల్పానువిశ్రా
మముల్ సంబంధించు న్నరహరి రమాచిత్తచోరా
శమీయామ్యాగారా శమనసహజానాథ కృష్ణా
ప్రమత్తక్రవ్యాదక్షణదళన రాధాభుజంగా. 309

మేదినీ (వాణి) ౧౬-౧౧౧౫౮

I I I న I U I జ U I I భ I U I జ U I U ర U గ

మృదయతి నజ్భజర్గములు మేదినీసమాఖ్యన్
దడబడుచుండఁగాఁ దనరు దంష్ట్రి పద్మనాభా
జడనిధితల్ప నందసుత సాళ్వరాట్కృతాంతా
కడు హితభక్తి నీకు నతి గావు మయ్య దేవా. 310

ఫలసదనము ౧౬-౧౬౩౫౮

I I I న I I I న I I I న I I I న I I U స U గ

ననననసగములు దనరఁగ దశవిశ్రాం
తిని ఫలసదనము లతిశయ మగుఁజెప్పన్
మునిజనహృదయములమును పొలుచువానిన్
గొనబుగ ముదమొదవఁ గొలిచెద మటంచున్. 311

అశ్వగతి ౧౬-౨౫౦౫౭

U I I భ U I I భ U I I భ U I I భ U I I భ U గ

అందములైన భకారము లైదును గాంతములై
పొందు పదింట విరామముఁ బూనిన యశ్వగతిం
గందసమానమహోన్నతగాత్రుని శౌరిని గో
విందునిఁ బ్రస్తుతి సేయఁగ వేడుక యయ్యెఁ జుమీ. 312

మదనదర్పణము ౧౬-౨౧౮౪౪

∪ I I భ I I ∪ స I ∪ I జ ∪ I ∪ ర I ∪ I జ ∪ గ

చారుమదనదర్పణంబు భస్సరజ్జము ల్దగన్
మారవిమతవిశ్రమంబున న్మహిం జెలంగు నా
భీరుల యమునాతటంబునం బ్రియంబుఁ జేసి యా
ధీరవరుఁడు గూడె నంచు భక్తి సన్నుతింపఁగా. 313

గజవిలసితము ౧౬-౩౨౭౨౭

∪ I I భ ∪ I ∪ ర I I I న I I I న I I I న ∪ గ

బాల సరోజనాభ, వరద తనుమిళితజం, బాల దిగంబరా సమస్పృణకబళకర లం
బాలక మంగళావహ గజవిలసితమున, న్గాలు [1]భరేఫనల్ సనగములిభ విరమమై.

వ. సప్తదశచ్ఛందంబగు అత్యష్టియందుఁ బ్రతిపాదంబునకుఁ బదియేడేసి యక్షరంబులై
౧౩౧౦౭౨ వృత్తంబులు పుట్టె నందు:—

శిఖరిణి ౧౭-౪౯౩౩౦

I ∪ ∪ య ∪ ∪ ∪ మ I I I న I I ∪ స ∪ I I భ I ∪ వ

భజింతు న్నిత్యంబు న్మునిజనసదాప్రార్థనపరున్
గజేంద్రార్తిధ్వంసిం గృతకలలనాగ్రావు నజరున్
ద్విజశ్రేష్ఠుల్ మెచ్చ న్యమనస భవల్ విశ్వవిరతిన్
బ్రజాతాహ్లాదంబై శిఖరిణియనా భాసుర మగున్. 315

పృథ్వి ౧౭-౩౮౭౪౦

I ∪ I జ I I ∪ స I ∪ I జ I I ∪ స I ∪ ∪ య I ∪ వ

జసల్ జసయవంబు లుష్ణకరసంఖ్యవిశ్రాంతులున్
బొసంగి కవిపుంగవుల్ పలుక భూమిలోఁ బృథ్వి నా
నసంశయ మగుం గళిందతనయామనోవల్లభా
ప్రసన్నవదనాంబుజా ధృతపరశ్వధా మాధవా. 316

హారిణి ౧౭-౮౬౧౧౨

I I I న I I ∪ స ∪ ∪ ∪ మ ∪ I ∪ ర I I ∪ స I ∪ వ

హారిణి యను వృత్తం బొప్పు న్నాస్వరా త్తవిరామమై
సరి నసమరేఫస్వంబై షోడశప్రమదా సహా

1. పూర్వముద్రణమునందు భరేఫనానసగము లనియున్నది. దీనింబట్టి మీఁదను భ, ర, న, న, న, న, గ లీ పద్యమున కుండునట్లు గుర్తింపఁబడినది. పద్యమున భ, ర, న, న, న, గ లు మాత్రమే కలవు.

ప్రమణుఁ దృణావర్తక వ్యాద•సంహరు మస్తకో
పరిరుచిరపింఛాచూడుం బీత•వస్త్రు నుతింపఁగా. 317

### [1]నర్కుటము (కోకిలకాకము) ౧౭-౫౬౨౪౦

I I I న I U I జ U I I భ I U I జ I U I జ I U వ.

కొలిచెద నాదిదేవుపద•కోకనదంబులు నేఁ
[2]దొలఁచెదఁ దొంటిబాముసఁ గు•దుర్వుడు పాపములం
దలఁచెద నామధేయ మతి•తత్పరత న్భజా
వలఁ దగు నర్కుటంబులను • భర్గవిరామములన్. 318

### మందాక్రాంత ౧౭-౧౮౯౨౯

U U U U మ U I I భ I I I న U U I త U U I త U U గగ.

మందాక్రాంత న్గిరిశవిరతు • ల్మభ్నతాగాగణంబుల్
పొందె న్సాందీపునివలన సం•పూర్ణవిద్యాచయంబుల్
మ్రందించె న్దారుణరణమునం • బౌండ్రసాళ్వాదులం జే
యందెం జేరెం దడుకులకు నం•దాత్మజుం డంచుఁ జెప్పన్. 319

### పాలాశదలము (త్వరితగతి) ౧౭-౩౨౭౬౮

I I I న I I I న I I I న I I I న I I I న U U గగ.

అదనదనున హరినుతు • లమర ధరఁ బాలా
శదళ మనఁ దనరుఁ గవి•జనులు వచియింపన్
బదునొకఁ డగునెడ యతి • పదిలమునఁ జేరన్
గదియు నగణము లయిదు • గగము తుద నొందన్. 320

### వంశపత్రపతితము ౧౭-౬౪౯౮౩

U I I భ U I U ర I I I న U I I భ I I I న I U వ.

బాగుగఁ జెప్ప నొప్పు వసుధన్ • భరనభనలగల్
సాగి పినాకివిశ్రమములన్ • సభలనుఁ గుదురై
రాగిలు వంశపత్రపతిత • ల్రణమున నరకు
న్రాగతనంబునం దునిమె నం•దతనయుఁ డనినన్. 321

---

1. సంస్కృతచ్ఛందమున "నర్దటక" మనిపేరు. (గి) 2. మలఁచెదఁ దొంటి బాముస కుమర్పుడు. (గి)

### చంపకకేసరి ౧౭-౪౬౮౨౮

I I U స I U I జ I I U స I I U స I I U స I U వ.

సనకాదియోగినుతు • జాంబవతీప్రియు నిర్వికా
ల్పు నమేయు నక్షరు వి•భు న్యమళార్జునభంజనుఁ
వనమాలిఁ గృష్ణు ముర•భంజను నెంతురు వారిజా
సనవిశ్రమంబు సజ•సాస్వలు చంపకకేసరిన్. 322

వ. అష్టాదశచ్ఛందం బగు ధృతియందుఁ బ్రతిపాదంబునకుఁ బదునెనిమిది యక్షరంబులై ౨౬౨౧౪౪ వృత్తములు పుట్టె నందు:—

### మత్తకోకిల ౧౮-౯౩౦౧౯

U I U ర I I U స I U I జ I U I జ U I I భ U I U ర.

అత్తమిల్లు మహేశవిశ్రమ • మార్యసమ్మతి నొప్పఁగా
సత్తులో రసజాభరేఫలు • చౌకళింపుచు నొందఁగా
మత్తకోకిలవృత్తపద్ధతి • మక్కువం బొనరింపఁగా
హత్తి పూజ యొనర్ప వచ్చు జ•నార్దనాహ్వయు నెప్పుడున్. 323

### కుసుమితలతావేల్లిత ౧౮-౩౭౮౫౭

U U U మ U U I త I I I న I U U య I U U య I U U య.

వేమా ఱెన్నంగాఁ గుసుమితలతా•వేల్లిత న్మత్నయాయల్
శ్రీమార్తాండశ్రాంతియుఁ గుదిరినం • జెన్నుమీఱు న్ధరిత్రిన్
గామేపల్లీశుం గనకవసనుం • గంజనేత్రుఁ శుభాంగుఁ
గోమద్భాలుం గాలయవనహరుం • గుంజరేంద్రార్తినాశున్. 324

### నిశ ౧౮-౭౪౯౪౪

I I I న I I I న U I U ర U I U ర U I U ర U I U ర.

ప్రబలు నిశను నార•రారంబులుఁ బ్రత్నవిశ్రాంతియుఁ
గబళితదవపావ•కా పూతనాజీవితాహారి కృ
ష్ణ బలసహజ పారి•జాతాపహారా యదుశ్రేష్ఠ దే
వ బలిదమన వంద్య • బంహిష్ఠ వార్ష్ణేయ శైనేయకా. 325

### [1]హరనర్తనము ౧౮-౯౦౯౭౧

U I U ర I I U స I U I జ I U U య U I I భ U I U ర.

దావపావకఖాది మా•ధవ దాశార్హా•దనుజాంతకా
దేవకీప్రియనందనా•దివిషద్వంద్యా•[2]ధ్రువసన్నుతా

1. దీనికిఁ దొమ్మిదింట నాఱింటయతులు (సూ.) 2. ఇట యతిభంగము. 'ధ్రువ' అనురూపము అసాధువు. చూ. అప్పకవీయము. 2-66 (రా.)

భావగోచర విశ్వరూ•ప దగు న్వాక్రు•వ్వ నవర్తుసం
ఖ్యావిరామము రేఫస•జ్యభరేఫంబుల్ • హరన ర్తసన్. 326

[1]ఉత్సాహారము ౧౮-౩౦౮౪౧

UUU మ III న IUU య UUI త III న UUU మ

బాహాబాహిని దమలో • భ్రాతల్ దొడ్డ•పగలఁ బోరాడం
నా హంవీరుఁడగు బుబు•తోసూనుఁ జ•గతిని గూలంగా
నాహా యేసిన నరపా•లా రత్నే షు•యతులు పొందంగా
త్సాహారంబు మనయత•న్మంబుల్ చెంది • [2]మరుచు నందంబై 327

వ. ఏకోనవింశతిచ్ఛందం బగు నతిధృతియందుఁ బ్రతిపాదంబునకుఁ బందొమ్మిదేసి యక్ష
రంబులై ౫౨౪౨౮౮ వృత్తములు పుట్టె నందు:—

[3]శార్దూలవిక్రీడితము ౧౯-౧౪౯౩౩౭

UUU మ IIU స IUI జ IIU స UUI త UUI త U గ.

నీరేజాంచితలోచనాయ హరయే • నీలాంబుదాంగాయ మా
యారాత్రించరఖండనాయ విభవే • హర్యక్షవక్త్రాయ తా
ర్క్ష్యారూఢాయ యటంచుఁ గూర్తురు నిరీ•హా విశ్వవిశ్రాంతి వి
స్తారింప న్మసజస్తతంబులు గమ • న్శార్దూలవిక్రీడితన్. 328

తరళ ౧౯-౧౮౬౦౪౦

III న UII భ UIU ర IIU స IUI జ IUI జ U గ.

జలజలోచనుఁ గైటభాంతకు • శంఖచక్రగదాధరుఁ
గలశజాదిమునీంద్రసేవితుఁ • గాళియాంతకు నచ్యుతుఁ
బలుకుచోఁ దరళంబులందుల • భానువిశ్రమపద్ధతిఁ
గలియ నభ్రసజాగముల్ సమ•కట్టి చెప్పుదు రుత్తముల్. 329

[4]మేఘవిస్ఫూర్జితము ౧౯-౭౫౭౧౪

IUU య UUU మ III న IIU స UIU ర UIU ర U గ.

క్షమాలక్ష్మీనాథుఁ విదురవరదుఁ • జాహ్నవీజాతపాదుఁ
సమామ్నాయస్తవ్యుఁ గరుడతురగుఁ • సామజప్రాణదాతఁ
మిముం దాఁ జేర్కొన్న న్సభలఁ దనరు - న్మేఘవిస్ఫూర్జితంబుల్
విమర్శం గూర్పఁ యమ్నసరరగము • ల్విశ్వవిశ్రాంతిచేతన్. 330

---

1. తొమ్మిదింట నైదింటయతులు (సూ). 2. కనలు (పాఠాంతరము.) ఇది బహుయతి నియతికి విరుద్ధము (రా). 3. దీనికిఁ బదుమూఁడింట యతి (సూ.) 4. పదుమూఁట యతి (సూ.)

[1]చంద్రకళ ౧౯-౧౮౬౫౮౭

∪|∪ ర ||∪ స ||∪ స ∪∪| త |∪| జ |∪| జ ∪ గ.

తానకంబుగఁ జంద్రకళావృ♦త్తంబు కవు ల్విరచించిరన్
వీనులార మనోజ్ఞపదంబుల్ ♦ పేర్చి కపర్దివిరామమై
కానవచ్చి రసస్తజజంబుల్ ♦ గంబు దనర్చి కళిందజా
మానినీరమణస్తవగాథా ♦ మానితరత్నములం దగున్. 331

భూతిలకము ౧౯-౧౮౬౦౩౯

∪|| భ ∪|| భ ∪|∪ ర ||∪ స |∪| జ |∪| జ ∪ గ.

భారసజాగగణంబులుం బఱ♦వంగ భానువిరామవి
స్ఫారత భూమితిలకంబు పాండవ♦పక్ష దైవతవృక్ష మిం
పార ధరిత్రికిఁ దెచ్చినట్టి మ♦హాత్మ యంచుఁ గవీశ్వరుల్
చారుపదంబులు గూర్చి చెప్పిన ♦ శ్రావ్యమా వినువారికిన్. 332

కవికంఠభూషణము ౧౯-౧౭౭౯౦౦

||∪ స |∪| జ ||∪ స ||∪ స ||∪ స |∪| జ ∪ గ.

నవరత్నవిశ్రమము♦నన్ సజసాసజగంబులన్ గవుల్
గవికంఠభూషణము♦గా రచియింతురు మాటిమాటికి
న్రవణిల్లుకబ్బమున ♦ నందకపాణి నుపేంద్రు రుక్మిణీ
ధవు సత్కథాసుధలఁ ♦ దత్పరులై[2]న మహాత్ములట్లుగాన్. 333

వ. వింశతిచ్ఛందం బగు కృతియందుఁ బ్రతిపాదంబునకు నిరువదేసి యక్షరంబులై ౧౦౪౮౫౭౬ వృత్తములు పుట్టె నందు:—

మత్తేభవిక్రీడితము ౨౦-౨౯౮౬౭౬[3]

||∪ స ∪|| భ ∪|∪ ర ||| న ∪∪ ∪మ |∪∪ య |∪ వ.

మనువిశ్రాంతిని సభ్రనమ్యవములన్ ♦ మత్తేభవిక్రీడితా
హ్వాను వృత్తంబు చెలంగె మానవతులా♦రా వీఁడె యే తెంచె భ
క్తిని గాత్యాయనిఁ గొల్చునాఁడు యమునా♦తీరంబునం బొంది వే
డ్కను మా చీరలు దోఁచుకొన్నవెడదొం♦గం జూచినారా యనన్. 334

1. దీనికిఁ బదునొకంట యతి (సూ). 2. తనరారునట్లుగాన్. 3. పదునాలవ ఘంట యతి (.సూ)

ఉత్పలమాల ౨౦-౩౫౫౭౯౯

∪ I I భ ∪ I ∪ ర I I I న ∪ I I భ ∪ I I భ ∪ I ∪ ర I ∪ వ.

పేరిననేయి దుగ్ధములు • పెర్గును మీఁగడయు న్సదా ప్రజా
గారము సొచ్చి త్రాగి వెస•గంతులు వైచు తురారి నెంచఁగా
ధారుణి రూఢి కెక్కినవ•తారవిరామముచే లసద్భరణా
న్భారలగంబులుం గలయఁ•బల్కిన నుత్పలమాల చెన్నగున్. 335

అంబురుహము ౨౦-౩౭౨౧౫౧

∪ I I భ ∪ I I భ ∪ I I భ ∪ I I భ ∪ I ∪ ర I I ∪ స I ∪ వ.[1]

చారుతమాలదళాసితవర్ణునిఁ • జక్రహస్తు సనాతను
న్దారితకంసముఖక్షితిపాలకు • నందనందను నవ్యయుణా
శారకులోద్భవుఁ గైటభభేదిని • జోలి చేసి నుతింప భా
భారసవంబులు విశ్వవిరామముఁ•బల్క నంబురుహం బగున్. 336

ఖచరప్లుతము ౨౦-౩౭౩౧౭౬

I I I న ∪ I I భ ∪ I I భ ∪ ∪ ∪ మ I I ∪ స I I ∪ స I ∪ వ.[2]

యమునలోఁ జీర నోడినవారా • [3]ప్రాకృతజంతువులం బ్రమో
దమునఁ బ్రోచుటకై కలఁచంగా • దర్పమునం జనుదెంచి ఘో
రముగఁ జుట్టినకాళియు సంహా•రం బొనరించిన కృష్ణ య
[4]ర్యమవిరామముతోడ నభామ్స•స్వల్ రాజిలనా ఖచరప్లుతన్. 337

ప్రభాకలిత ౨౦-౩౭౨౦౭౯

I I I న I ∪ I జ I ∪ I జ ∪ I I భ ∪ I ∪ ర I I ∪ స I ∪ వ.

వళి పదమూఁడవ యక్కరంబుగ•వాసి కెక్క నజాభరే
ఫలు సలగంబు లమర్చి సొం పొద•వం బ్రభాకలితాఖ్యమై
చెలు వగువృత్తమునందు సత్కవి•శేఖరు ల్వినులింతు రా
జలనిధిమీఁదను బవ్వళించిన•జాంబవత్యధిపాలునిన్. 338

వ. ఏకవింశతిచ్ఛందం బగు ప్రకృతియందుఁ బ్రతిపాదంబునకు నిరువదియొక్క యక్ష
రంబులై ౨౦౯౭౧౫౨ వృత్తంబులు పుట్టెనందు:—

1. 13 యతి (సూ). 2. 12 యతి (సూ). 3. యతి. 4. రమ్యవిరామముతోడ నభామ్స•స్వల్వలయుక్ (పూ. ము.) ఇందు యతి తప్పినది; ర్యమవిరామముతోడ నభామ్సస్వల్ • రాజిలనా (ప. ఓ. పె.) ఇందు గణము తప్పినది.)

చంపకమాల ౨౧-౭౧౧౬౦౦

I I I న I ∪ I జ ∪ I I భ I ∪ I జ I ∪ I జ I ∪ I జ ∪ I ∪ ర.[1]

చపలమనీషతోడ నొక ॥ సంయమి వే మొఱ వెట్టుచుండఁగాఁ
గృపను దదీయపుత్త్రు బ్రతి॥కించిన మేటివిభుండ వంచు నిన్
సపరిగణంబుతో నజభ॥జాజలు రేఫయుఁగూర్చి సత్కవుల్
త్రిపురవిభేదనాఖ్యవిర॥తిం దగఁ జంపకమాలఁ గొల్తు రా. 339

వనమంజరి ౨౧-౭౮౮౩౦౮

I I I న I ∪ I జ I ∪ I జ I ∪ I జ I ∪ I జ ∪ I I భ ∪ I ∪ ర.[2]

మనువిరతు ల్నజజాజభర ల్వన॥మంజరిం గవిశేఖరుల్
దనరఁగ నాజయుఁడు న్విజయుం డను ॥ ద్వారపాలకు లిర్వురు
న్ననకునిశాపము దాఁకి నిశాటు ల॥నంగఁ బుట్టి సుపర్వులన్
జెనకినవాండ్రను జంపినకోలన్పృ॥సింహుని న్వినుతింతు రా. 340

[3] స్రగ్ధర ౨౧-౩౦౨౯౯౩

∪ ∪ ∪ మ ∪ I ∪ ర ∪ I I భ I I I న I ∪ ∪ య I ∪ ∪ య I ∪ ∪ య.

మానొందున్ స్రగ్ధరాఖ్యన్ ॥ మరభనయయయల్ ॥ మత్తనాగాష్టవిశ్రా
మానూన ప్రాప్తి లైనన్ ॥ హరిముఖదివిజుల్ ॥ యాతుధానవ్రజంబుల్
సానందాసక్తితోఁ దో॥యధికడ నమృతం ॥ బారగింపంగ నచ్చో
మాని న్యాకారతన్ స॥మ్మదము వొదలు ప॥ద్మాధవా! నందపుత్త్రా! 341

లాటీవిటము ౨౧-౩౯౮౯౭౨

I I ∪ స I I ∪ స I I ∪ స I I ∪ స ∪ ∪ ∪ మ ∪ ∪ I త I ∪ ∪ య.[4]

సగణంబులు నాల్గిట మత్యల వి॥శ్వశ్రాంతి న్లాటీవిటవృత్తం
బగు నంచుఁ గవీంద్రులు గొల్తురు స॥మ్యక్ప్రీతి న్యాచించి యథేచ్ఛం
దగు నేర్పున మూఁడు పదంబులుగాఁ ॥ త్రైలోక్యంబు [5]ల్గాల్చి సురారుల్
వొగులం బలిదానవుఁ ద్రొక్కినయా॥పొట్టిం దిట్ట న్వామనుఁ గృష్ణున్. 342

మణిమాల ౨౧-౯౬౫౩౫౬

I I ∪ స I ∪ I జ I I ∪ స I ∪ I జ I I ∪ స I ∪ I జ I I ∪ స.[6]

అజహాత్పయోదధిఘృతంబు ॥ లమ్ముచు మురారిఁ [7]బాడి రెలమిన్
వ్రజుఁగాఁ దదీయచరణా త్త॥నవ్యహృదయారవిందు లగుచు

1. పదునొకంట యతి (సూ). 2. పదునాలుగింట యతి (సూ). 3. ఇది (పూ. ము.) ల లో లేదు. (వ) లో ఉన్నది. 4. పదుమూఁటయతి (సూ.) 5. (పూ. ము.) లలో - గొల్వఁగఁకూరుల్. 6. పద నొకఁటయతి (సూ). 7. బాడి రెలమిన్, వజుఁగా (గి).

న్వ్రజసుందరీజనము లోక్క । నాఁడు మణిమాలయందుఁ బొసఁగ
న్సజము త్రివారము సముం బి । శాకవిరమంబు పొందు దనరన్. 343

కరిబృంహితము ౨౧-౭౮౨౨౭౧

U I I భ I I I న U I I భ I I I న U I I భ I I I న U I U ర.

మూఁడు భనములు రేఫమును బదు । మూఁట విరతియు సొంపుగాఁ
గూడుకొనఁ గరిబృంహితము సమ । కూర్చి వసుమతి మండలా
పీడ మనుకరిబృంహితరవము । పెల్లుగఁ బలుకుచుండఁగాఁ
గోడిగపుఁ[1]జిననాఁడు శకటునిఁ । గూల్చినహరి నుతించెదన్. 344

కనకలత ౨౧-౧౦౪౮౫౭౬

I I I న I I I న I I I న I I I న I I I న I I I న I I U స.

జవమున భగభగ యనుచు వ్ర । జజనములఁ బొదవినం
దవశిఖి నుడిపినమధుముర । నరకదమన యని పే
లవముగఁ బలుమఱు నిరువది । లఘువులు గము పదుమూఁ
డవయెడ విరతిఁ బొసఁగిన బె । డఁగ డరుఁ గనకలతన్. 345

వ. ద్వావింశచ్ఛందం బగు నాకృతియందుఁ బ్రతిపాదంబున కిరువదిరెండేసి యక్షరం బులై ౪౧౯౪౩౦౪ వృత్తములు పుట్టె నందు:—

మహాస్రగ్ధర ౨౨-౬౦౫౯౮౮

I I U స U U I త U U I త I I I న I I U స U I U ర U I U ర U గ.[2]

స్తతనస్రాగ లిరించా । ష్టవిరతులు మహా । స్రగ్ధరం జెప్ప నొప్పున్
గ్రతువిఘ్నుం బాపహీల్లం । బ్రమదమున వ్రజ । వ్రాతదత్తాన్న మెల్లన్
క్షితిభృ ద్రూపంబున న్నై । క్కిన రుష నమరా । గ్రేసరుం డంప మ్రొబ్బల్
ధృతిమై దాల్వానఁ [3]గూల్పన్ । ఁవిరి కరుణతో । [4]ధేనువృద్ధ్యద్రి మోఁచెన్.

భద్రకము ౨౨-౧౯౩౦౭౧౧

U I I భ U I U ర I I I న U I U ర I I I న U I U ర I I I న U గ.[5]

భంబు రనత్రయంబు గము నొంది । భానుయతి భద్రకంబు దనరున్
బంబినపిల్లగోల కరయుగ్మ । పాదములఁ బట్టి యూఁది పశువ
ర్గంబు నరణ్యమధ్యమధరిత్రిఁ । గాచు సమయంబున న్యమున తీ
రంబున గొల్లలం గలసి యోగి । రంబు దినెఁ గృష్ణుఁ డంచుఁ బలుకన్. 347

---

1. చిననాడయసురుల (పై.) 2. తొమ్మిదింట నెనిమిదింట యతులు (సూ).
3. గూల్పన్ (ఓ); గూల్వన్ (ప) గుర్వన్ (సూ). 4. ధేనువర్ధాద్రి (పూ.ము.సూ.)
5. పండ్రెండింట యతి (సూ).

మానిని ౨౨-౧౭౯౭౫౭౯

U I I భ U I I భ U I I భ U I I భ U I I భ U I I భ U I I భ U గ.[1]

రాజిలు సప్తభము ల్గము విశ్వవిరామము మానినియందు భర
ద్వాజముఖప్రమునీశ్వరు లందఱు దైత్యగురుర్ భృగువాక్యమునన్
రా జలనాయకతల్పుని దైవతరాజు నజస్రము గొల్తురు వి
భ్రాజితమోక్షము చేకుఱఁ బుణ్యధరాస్థలి నంచు వచించుటచేన్. 348

విచికిలిత ౨౨-౨౦౯౭౧౫౨

I I I న I I I న I I I న I I I న I I I న I I I న I I I న U గ.

ప్రవిలయసమయమునను బదపడి జలనిధినడుమ స
ద్భవనములు కడుపున నిడుక భుజగపతిశయనముపై
నవిరళమతిఁ గురుకుపరదుఁ డని విచికిలితఁ బదుమూఁ
డవయెడ వడి యిరువదియొకలఘువు గముఁ బలుక నగున్. 349

తురగము ౨౨-౧౭౯౦౯౭౭

I I I న I I I న I I I న I I I న I I U స I U I జ I U I జ U గ.[2]

ననననసజజగలు తిథివిరమణంబగు స్తురగంబునన్
గనలుచు నగరముకుయి విడిసినఁ గాంచి తా నొకరుం డెడు
ర్కొని దవులకుఁ గొని చని గిరిగుహాఁగూర్కునాముచికుందుచే
తను యవనునిఁ బోరిగొని తని వసుధ స్గణింతురు భూసురుల్. 350

[3]మద్రకము ౨౨-౧౯౭౬౦౯౫

U I I భ U I U ర I I I న U I U ర I I U స I I U స I I I న U గ.[4]

అధ్వమునందు నడ్డ మయి హాహానాకృతి నున్న బకాసురు మహా
సాధ్వసదుర్ ప్రజార్భకవినాశనక్షము వక్త్రముఁ జొచ్చి సురలుర్
బ్రాధ్వగులై నుతింపఁగఁ దదీయదేహము వెల్లినకృష్ణుమతి న
క్రధ్వజమద్విరామము భరప్రసానగలుం దగు మద్రకమునన్. 351

వ. త్రయోవింశతిచ్ఛందం బగు వికృతియందుఁ బ్రతిపాదంబునకు నిరువదిమూఁడేసి యక్షరంబులై ౮౩౮౮౬౦౮ వృత్తంబులు పుట్టె నందు:—

1. పదుమూఁటయతి (సూ). 2. పదేనింటయతి (సూ). 3. ఇది (ప) లో మహాస్రగ్ధర తర్వాత ఉన్నది. 4. పదునొకంటయతి (సూ).

కవిరాజవిరాజితము ౨౩-౩౫౯౫౧౨౦

III న IU I జ IU I జ IU I జ IU I జ IU I జ IU I జ IU వ.[1]

కలయఁగ నొక్క నకారము నాఱుజకారములు న్వము గాటముగా
నలరినచో ద్విరదాచలశైలము లై త్రివిరామము లంది నిర
ర్గళకవిరాజవిరాజితవృత్తము రాఁ జనార్దనరమ్యకథా
వళులఁ గవీశులు వర్ణన సేయఁగ వ్రాలు నజస్రము వావిరిగన్. 352

అశ్వలలిత ౨౩-౩౮౬౧౪౨౪

III న IU I జ U II భ IU I జ U II భ IU I జ U II భ IU వ.[2]

సలలితవిశ్వవిశ్రమము నజ్భజ ల్భజభవంబు లశ్వలలితన్
జెలువుగఁ గూర్చి సత్కవులు తల్లి చిన్నిసమయంబునందున నులూ
ఖలమునఁ గట్టివైచినను నీడ్చు [3]క న్దరలి మద్దిచెట్లు ధరణిం
గలపిన కృష్ణుఁ గీర్తనము సేయఁ గాఁ దనరు సర్వకాలము ధరన్. 353

పద్మనాభము ౨౩-౧౪౯౭౯౭

UU I త UU I త UU I త UU I త UU I త UU I త UU గగ.[4]

వేమాఱు నప్పద్మనాభంబున న్విశ్వవిశ్రాంతియు న్సప్తతంబు ల్గగంబుల్
[5]గోమారఁగా దేవరాత్రించరుల్ క్షీరకూపారమధ్యంబున న్వీఁపుమీఁదన్
బ్రామంగ మంథాచలం బోపికం గచ్ఛపస్వామి యై మోచె నీ కృష్ణుఁ డంచున్
గామించి విద్వాంసు లెల్ల న్వచింపంగఁ గ్రాలు న్ధరిత్రి న్సదా మానితంబై. 354

మత్తాక్రీడ ౨౩-౪౧౯౪౦౮౧

UU U మ UU U మ UU I త III న III న III న III న IU వ.[6]

మత్తాక్రీడాఖ్యం బెంపారు న్మమతనననవ మహిత మగుచు ర
త్నాత్తబ్రహ్మాశ్రాంతు ల్గ్రంపై యమరఁగ రణమున నధికబలు మదో
న్మత్తుం జాణూరక్రవ్యాదు న్మథురనడుమఁ బెడ మరలి పిడికిటన్
సత్తామాత్రుం డుర్విం గూల్చె న్సకలదివిషదులు సమతను బొగడన్. 355

వ. చతుర్వింశతిచ్ఛందం బగు సంకృతియందుఁ బ్రతిపాదంబునకు నిరువదినాలుగేసియక్ష
రంబు లై ౧౬౭౭౭౨౧౬ వృత్తంబులు పుట్టె నందు:—

---

1. ఎనిమిదింట నేడింటనేడింటయతులు (సూ). 2. 13 యతి. 3. (క) లో పాఠము ఇందులకు భిన్నముగానున్నది కాని దానిపై గీతలు గీచియుండుటచే స్పష్టముగా లేదు. మఱికొన్ని తాటాకు పుస్తకములు చూడవలెను. 4. 13 యతి 5. గో మారుగా (పూ. ము.) 6. తొమ్మిదింట తొమ్మిదింటయతులు (సూ.)

సరసిజము ౨౪-౮౩౮౮౧౯౩

∪∪∪ మ ∪∪ | త | ∪∪ య ||| న ||| న ||| న ||| న || ∪ స.[1]

సంబంధించు న్మత్యులు నానా•సలు దశనిధియతి • సరసిజమునకుఙ్
గంబూర స్బృందాటవిలోనం • [2]గవిసికొనినసుర•కరువలిదనుజుఙ్
శంబాభీలంబై తగుముష్టిం • జదిపిన యదుపతి•స్తవముల ననురా
గం బూర న్శోభిల్లఁగఁ బ్రాంచ•త్కవివరు లభినుతిఁ గఱపుదు రవనిన్. 356

క్రౌంచపదము ౨౪-౪౧౯౩౪౭౯

∪ || భ ∪∪∪ మ || ∪ స ∪ || భ ||| న ||| న ||| న | ∪∪ య.[3]

పంచమకేశుం డిచ్చినభాస్వ•ద్వరమున మనమున • బవరము గోరఙ్
వంచనతో బాణాసురుహ స్త•వ్రజములు దరిగెను • వడి హరి యంచు
న్బాళించితలీల న్శంకరనంద•ప్రకటితవిరతులు • భమసభనాన్యల్
[4]క్రౌంచపదీవృత్తమ్మునఁ జె న్నా•రఁగఁ బలుకుదు రిలఁ • గవివరు లెల్లన్. 357

తన్వి ౨౪-౪౧౫౫౩౬౭

∪ || భ ∪∪ | త ||| న || ∪ స ∪ || భ ∪ || భ ||| న | ∪∪ య.[5]

దూడలతోఁ గాపరులను గుహలో • దొంగిలిదాచినవిధి నదలింపఙ్
గూడుక తద్రూపము లయి పసులుం • గోపవధూటులు మురిపము నొందఙ్
బాడి వినోదంబులు సలిపినగో•పాలుఁ డటంచును భతనసభాన్యల్
దాడి గొన న్విశ్వవిరమణముతోఁ•దన్విని జెప్పఁగఁ దనరుఁ గవీంద్రుల్. 358

అష్టమూర్తి ౨౪-౩౬౧౪౫౨౧

∪∪∪ మ ||| న ∪∪ | త || ∪ స ∪ | ∪ ర ∪ || భ | ∪ | జ | ∪∪ య.[6]

శ్రీకృష్ణుం గనకవస్త్రుం • జితతృణావర్తదైత్యు • న్సితకుశేశయనాభుఙ్
వైకుంఠు న్వరదు బృందా•వనచరు న్వాసుదేవు • న్వసుమయుం బరముం బ
ద్మాకాంతు న్నిధినిధానా•మలవిరామంబు లొప్ప • న్మనతసర్భజయంబుల్
సోఁకం జెప్పుదురు విద్వాం•సు లిలలో నష్టమూర్తి•న్సుప్రతిభు లకృతచర్యల్.

వ. పంచవింశతిచ్ఛందం బగు నతికృతియందుఁ బ్రతిపాదంబునకు నిరువదియైదేసి యక్షరంబులై ౩౩౫౫౪౪౩౨ వృత్తంబులు పుట్టె నందు:—

బంధురము ౨౫-౧౪౩౬౮౭౬౮

||| న ||| న ||| న ||| న || ∪ స ∪ || భ ∪ || భ ∪ || భ ∪ గ.

సొరిది ననననసభభభగములతో • షోడశసంఖ్యవిరామము తో
బరువడి దినదినమును బుధజను లీ•బంధురవృత్తమునందు నుతిం

1. 10-9 యతులు(సూ.)పూర్వులమతమున దీనికి నాల్గింటిపైఁ బ్రాసయతి గూర్పబడినది. ఇట్లే క్రింది క్రౌంచపదములోను అయిదింటిపైఁ బ్రాసయతి గానవచ్చెడు. అప్పకవి చెప్పలేదు (రా). 2. గసు (ష). 3. 11, 9 యతులు. (సూ). 4. ఈపాదమున ఒకయతి నియతి తప్పినది. 5. 13-యతి(సూ). 6. 9-9 యతులు (సూ.)

తురు హిమకరకుసుమము నొసటను గ్రన్ను నఫణిపాగయుఁ దాల్చిన యా
దొరజడలనడుమ నిలిచిన తెలుపుం, దూకొనువాఁగుకుఁ దండ్రి యనన్. 360

భాస్కరవిలసితము ౨౬-౮౩౮౧౩౧౧

U।।భ।।।న।U।జ।UUయU।।భ।।।న।।।న।।Uస U గ.

చెల్లెలి విజయున కిచ్చినవానిం, జేరఁడుపృథుకములు దినినవానిన్
గొల్లతలను వలపించినవానిం, గొల్లకుఁ గొడు కనఁ బరఁగినవానిన్
మల్లుర రణమునఁ జంపినవాని, న్భజ్ఞయభననసగలు పదుమూఁటన్
బల్లిద మగువిరమంబు దలిర్ప, న్భాస్కరవిలసితములు గొనియాడున్. 361

ధరణిధరగతి ౨౬-౧౬౭౭౭౨౧౬

।।।న।।।న।।।న।।।న।।।న।।।న।।।న।।।న U గ.[1]

వసునములు గము, వసువసుయతులు, వల నగు ధరణిధరగతిన్
గస రొదవి సుడి, కరువలిపగిది, గదిసి యదుశిశుచయముతో
మసలు నెడ మురమథన నినుఁ గొని, మదిని నలరుచు నెగసి యా
కసమున కెగయఁగ శకటదనుజుఁ, డమఁ గలిపితి వని పలుకన్. 362

వ. షడ్వింశత్యక్షరచ్ఛందం బగు నుత్కృతియందుఁ బ్రతిపాదంబునకు నిరువదాఱేసి యక్షరంబులై ౬౭౧౦౮౮౬౪ వృత్తంబులు పుట్టె నందు:—

భుజంగవిజృంభిత ౨౬-౨౩౮౯౮౮౮౬

UUUమUUUమUU।త।।।న।।।న।।।నU।Uర।।Uస।Uవ.[2]

వ్రాలు న్రత్నేశానశ్రాంతు, ల్వహి మమతననసరస, వల్ భుజంగవిజృంభితన్
గాళిందీయోషం బెండ్లాడ, న్గరదనుజుఁ దునిమెను శిఖావలాంచితపింఛముల్
వాళిం దాల్చె న్భండిం ద్రోచె, న్మఱఁదికి రగముఁ గడపె,[3]మద్దిచెట్లులు రెండు ని
ర్మూలించె న్దాలంబు ల్గూల్చెన్, ముగుదలుభ్రమయ మురళి, మ్రోయఁ జేసె విభుం డనన్.

వరాహము ౨౬-౩౮౮౮౬౦౧

UUUమ।।।న।।।న।।।న।।।న।।।న।।।న।।Uస UU గగ.[4]

రాజిల్లు న్దశకుధరవి, రతులు మగణ, రసనసగగలు వరాహాఖ్యన్
జేజే లందఱు పొగడ నుచితుఁ డని తలఁచి భృగువు పలుకఁగ నిత్యంబున్
దేజశ్శ్రీ పెరుగఁగ మది,[5]దృఢముగ నిడి, తిమురుచుఁ గొలిచిరి దాశార్హున్
రాజీవాక్షుని నరహరి, రవికులవరు, రఘుపతి బలసహజున్ గృష్ణున్. 364

1. 8-8యతులు (సూ.) 2. 9-11-యతులు (సూ). 3. మద్దిచెట్లులఁగూలిచెన్, దాలంబుల్గూల్చె న్వేగన్, ముగ్ధలు భ్రమయఁగను, మురళిదాలిచెన్ సువిభుండనన్. (పూ. ము.) 4. 10-7-యతులు (సూ.) 5. ధృవముగ (ప).

మంగళమహాశ్రీ ౨౬-౧౫౬౯౫౮౭౩౫

U I I భ I U I జ I I U స I I I న U I I భ I U I జ I I U స I I I న U U గగ.[1]

పొత్తు లెడఁబాయుటను బోరుసమయంబునను బొంగుచుఁ గురూద్వహుల నెల్లన్
దుత్తుమురు సేయఁగఁ గుదుర్చును మనీష నదిదుష్టసమరావనిఁ గిరీటి
తొత్తకు [2]భజస్నభజసన్గగలు మణ్యజుల శ్రాంతులును మంగళమహాశ్రీ
వృత్తములఁ జెన్నలర నిచ్చిరి సువాసినులు నిం పడర మంగళమహార్తుల్. 365

క. పొందుగ నిరువదియాఱగు, ఛందములం దుదయ మైనసమవృత్తము లా
నందమునఁ గవులు పొగడెడు, కందువల వచించినాఁడఁ గామెపలీశా. 366

వ. ఇవి సమవృత్తలక్షణంబు లింక ముఖ్యగౌణవృత్తలక్షణంబు లెఱింగించెద. 367

## ముఖ్యగౌణవృత్తలక్షణము

సీ. సమవృత్తపంక్తి స్వస్థానార్థసమములు స్వస్థానవిషమాఖ్యఁ జనునవియును
బృథివిపై సమవృత్తభేదంబు లీ మూఁటి కక్షరంబులు సమంబన్నికాళ్ల
నివి వృత్తముఖ్యంబు లికఁ బరస్థానార్థసమవృత్తములు పరస్థానవిషమ
సంజ్ఞలపద్యము ల్సర్వపరస్థానవిషమంబులును నివి విషమవృత్త

తే. భేదములు వీనినాలుగఁ బాదములను, సమముగాఁ జూపడవు వర్ణసంఖ్య లెచ్చు
కడమలై యుండు నీ మూఁటి గౌణవృత్త, పద్యము లటంద్రు శ్రీకామెపల్లినిలయ.

## సమవృత్తవివేకము

గీ. జగతి సమవృత్త మెన్నవఛందమునను, సంభవము నొందె నన్నియక్షరములమరఁ
బదపదంబున హెచ్చును గొదువ గాక, ప్రాసములు విరామంబులుఁ బరిఢవింప. 369

## స్వస్థానార్థసమవివేకము

ఆ. అక్షరములు సమములయ్యె స్వస్థానార్థ, సమములందు నాల్గుచరణములను
విషమపదము లొక్కవిధముగణంబులు, సమపదంబు లొక్కసరిగణములు. 370

క. సగ మొక్కవిధంబునఁ బెఱ, సగ మొక్క తెఱంగు గాఁగ సమకూర్పఁదగున్
జగతి నొకకా లొకకరణి, నొగి మూఁడుపదంబు లొక్కయోజం దనరున్. 371

తే. సాధుకవికృతగ్రంథసంజాత మెల్ల, వెదకి సకలోపజాతులవిచ్చలవిడిఁ
గాళిదాసుఁడు రఘువంశకావ్యమునను, జెలఁగి రెండవసర్గలోఁ జెప్పినాఁడు. 372

వ. అటు గాన స్వస్థానార్థసమవృత్తంబులం దుపజాతి యనువృత్తము. 373

## ఉపజాతివృత్తము

ఈపాటితో జేసుల నింద్రవజ్రం; బుపేంద్రవజ్రాహ్వయ ముర్వి సర్గం
దాపించినంతం గరుణాసముద్రా, జపిష్ఠలోలా యుపజాతి యయ్యెన్ 374

1. తొమ్మిదింట తొమ్మిదింట యతులు (సూ.) 2. భజస్నభజసానగలు—అని పూ. ము. ఇందుండవలసిన గణములు భ, జ, స, న, భ, జ, స, న, గ గ లగుటచేత నీలక్షణము దుష్టము. కాన నిట్లు సవరింపఁబడినది.

వ. ఇది పదునొకండవ త్రిష్టుప్ఛందంబునందలి యింద్రవజ్రాచ్ఛాయను జేసి పాదాలను
నుపేంద్రవజ్రాచ్ఛాయను సరిపాదాలను నడుచును. [1]దీని పేరే నిశి. 375

## మఱియు, వ్యత్యస్తోపజాతి

తలంబులై జేసి జగత్తజ్జగంబుల్, చాలొప్ప సర్గం దత జల్గంబున్
జలంబుతో [2]నిట్టులు సాగినంతన్, వాలారు వ్యత్యస్తము వాసుదేవా! 376

వ. ఇది ఉపేంద్రవజ్రచ్ఛాయను జేసిపాదములును, ఇంద్రవజ్రచ్ఛాయను సరిపాద
ములును నడుచును. మఱియు, 377

## సమోపజాతి

తాపింఛనీలాంగుఁ బృథాసుతల్పున్, గోపాలబాలుం బ్రవికోటితేజున్
గృపాసముద్రున్ నుతియించెద స్మ, క్ష్మాపాధిఁ గాంక్షించి సమోపజాతిన్. 378

వ. ఇంద్రవజ్రాచ్ఛాయను మొదలి రెండు పాదములును నుపేంద్రవజ్రాచ్ఛాయను గడప
రెండుపాదములును నడుచును. మఱియు, 379

## వ్యత్యస్తసమోపజాతి

తపంబుచేఁ గొల్తు విధాతృతాతన్, గపాలికోదండవిఖండనాఖ్యున్
గోపీభుజంగున్ ధృతగోత్రు సన్నో, క్షోపాయం వ్యత్యస్త సమోపజాతిన్. 380

వ. ఇది యుపేంద్రవజ్రాచ్ఛాయను మొదలిరెండు పాదములును నింద్రవజ్రాచ్ఛాయను
గడప రెండుపాదములును నడుచును. మఱియుం, 381

## వైపరీత్యోపజాతి

తాజల్గగం బొంట జతజ్జగంబుల్, గడిక్కున మూఁటను గంటు లేయన్
వ్రజాంగనావల్లభ వైపరీత్యో, పజాతివృత్తంబు సభం జెలంగున్. 382

వ. ఇది యింద్రవజ్రాచ్ఛాయను మొదలి చరణమును నుపేంద్రవజ్రాచ్ఛాయను గడప
మూఁడుచరణములును నడుచును. దీనిపేరే [3]వాతాంగియు, మఱియు నీవృత్తమునే
యింద్రవజ్రాచ్ఛాయను ఏదైన నొక చరణమును నుపేంద్రవజ్రాచ్ఛాయను శేషైన
మూఁడు చరణములును జెప్పినను తప్పు లేదు. మఱియును, 383

## ఉపచిత్ర

[4]ఛిదురించి సపాపలు జేసులన్, గాదిలి భాభగగంబులు సర్గన్
గుదురై రసికస్తుతిఁ గూడినన్, శ్రీదయితా యుపచిత్ర చెలంగున్. 384

వ. ఇది త్రిష్టుప్ఛందమునందలి వృత్తచ్ఛాయను జేసిపాదములును దోదకవృత్తచ్ఛాయను
సరిపాదములును నడచును. మఱియు, 385

1. ఈవాక్యము పూ. ము. లలో లేదు. 2. నిట్లు (గ) 3. వాతాంగి ని (పూ. ము); వారాంగి ముందు వచ్చును (చూ. ఆ. 4. 395). 4. ఛిదురంచి (పూ. ము).

### నారీనుతము

పేరెంబు ల్వారోరి♦జేసి న్మతాఁగా, సారంబు సర్లన్ దత♦జ ల్గగంబుల్
ధీరోదాత్తుల్ సన్ను♦తింపన్ ధరిత్రిన్, నారీనుతం బయ్యె జ♦నార్దనాఖ్యా. 386

వ. ఇది పదునొకంటఁ ద్రిష్టుప్ఛందస్సునంద శాలినీవృత్తచ్ఛాయను జేసిపాదములును నింద్రవజ్రాచ్ఛాయను సరిపాదములును నడుచును. మఱియుఁ, 387

### అజితప్రతాపము

జలజాక్ష! జేసుల స♦జల్ ససలున్, బలుమఱున్ సరి స♦భజ్ర లొందఁగా
[1]జలజోద్భవాబ్జవి♦శాలయతుల్, దళము లైన యజి♦తప్రతాపమా. 388

వ. ఇది పండ్రెండవ జగతీచ్ఛందస్సునందలి ప్రమితాక్షరవృత్తచ్ఛాయను[2] జేసిపాదములను బ్రియంవదావృత్తచ్ఛాయను [3]సరిపాదములును నడుచును. మఱియు, 389

### రతిప్రియము

జేసి న్మజ్జరగలు♦పేర్చి సర్లజంబుల్, భసజ్జగల్గదిసిన♦పాదబద్ధమై
యా సామోద్భవచతు♦రాస్యవిశ్రమఖ్యా,తి సన్నుతింపఁదగు ర♦తిప్రియం బనన్.

వ. ఇది పదుమూఁడవ అతిజగతీచ్ఛందస్సునందలి ప్రహర్షిణీవృత్తచ్ఛాయను జేసిపాదములును రుచిరవృత్తచ్ఛాయను సరిపాదములును నడుచును. 391

ఇవి స్వస్థానార్ధసమవృత్తలక్షణం బింక స్వస్థానవిషమవృత్తంబు లెట్టి వనిన:—

### స్వస్థానవిషమవృత్తవివేకము

ఆ. చరణములను వర్ణ♦సంఖ్యలు దప్పక, నాల్గుపాదములగ♦ణములు నాల్గు
విధములై చెలంగు♦వృత్తముల్ స్వస్థాన, విషమవృత్తసంజ్ఞ♦వెలయుచుండు. 392

### ధరణి

రసపై సచతుష్కము ♦ రారసలున్, నాససల్, మాససల్, ♦ నాటిన స్మణి తా
పస నగ రస♦పరిపక్వయతు, ల్రాసొం పారు న్వా♦లాయముగా ధరణుల్. 393

వ. ఇది జగతీచ్ఛందస్సునందలి తోటకవృత్తచ్ఛాయను మొదటిపాదమును గడమ మూఁడు చరణములును గవికల్పితములై నడుచును. మఱియు, 394

### వారాంగి

తాజ ల్గయుగ్మంబు జ♦తజ్గగంబుల్, తజాగగంబుల్ మభ♦శల్లగంబుల్
రాజిల్ల [4]నిభాద్రి వి♦రామయుక్తిన్, వాజిగ్రివా హరి♦వారాంగి దగున్. 395

---

1. జలజోద్భవాబ్జ-9, 9 యతులని యర్థము. జేసిపాదముల 2-వ అక్షరము యతియున్నది గాని సరులందు 8-వ యక్షరము యతి. 'జలజోద్భవ ద్వీపవిశాలయతుల్' అని సవరింపనగును (రా) 2. సరి (పూ. ము.) 3. జేసి (పూ. ము). 4. ఇభేంద్రవిరామయుక్తిన్-అని పూ-ము. వాత్మోర్మికేడవ యక్షరమున యతి. కనుక 'ఇభాద్రి విరామయుక్తిన్' అని యుండఁదగును.

వ. ఇది యింద్రవజ్రాచ్ఛాయను మొదటిచరణమునను నుపేంద్రవజ్రాచ్ఛాయను రెండవ చరణమునను గీతాలంబనవృత్తచ్ఛాయను మూఁడవచరణమునను వాతోర్మివృత్తచ్ఛాయను నాలవచరణమునను నడుచును. మఱియు, 396

### అంగజాస్త్రము

రంగుభమస్గల్ ♦ గ్రాలుమసజ్గల్, పొంగె మన్యగ♦ము ల్రజర్గలొ
ప్పంగా నార్త♦వగిరివ ళ్లైతే, నంగజాస్త్రవృత్త ♦ మందగించున్. 397

వ. ఇది రుగ్మవతీఛాయను మొదలిచరణమునను శుద్ధవిరాటిచ్ఛాయను రెండవచరణమునను పణవచ్ఛాయను మూఁడవచరణమునను మయూరసారిచ్ఛాయను నాల్గవచరణమునను నడుచును. మఱియుం, 398

### నదీప్రఘోషము

పోలిమై రారరం♦బుల్ జతప్రజంబులున్
[1]తలంచఁగా యాయయలున్ ♦ దతప్రజలున్
విలాసాచలాష్టేభ♦విశ్రాంతితోడన్
దేలింప నొప్పారు న♦దీప్రఘోషముల్. 399

వ. స్రగ్విణీవృత్తచ్ఛాయను మొదలిచరణమునను వంశస్థచ్ఛాయను రెండవచరణమునను భుజంగప్రయాతవృత్తచ్ఛాయను మూఁడవచరణమునను ఇంద్రవంశచ్ఛాయను నాలవచరణమునను నడుచును. 400

ఇది స్వస్థానవిషమవృత్తవివేకం బింకఁ బరస్థానార్ధసమవృత్తవివేకం బెఱిఁగించెద:—

### పరస్థానార్ధసమవృత్తవివేకము

క. మానుగ సమాంఘ్రు లొకగతిఁ, బూనిక విషమాంఘ్రు లొక్క♦పోలికలిపులై
హీనాధిక్యములు పర, స్థానార్ధసమంబులందు ♦ సమవిషమములన్. 401

### మనోహరవృత్తము

పేరైనతజజ్వలు ♦ బేసియెడన్, సరులన్ సచతుష్కము ♦ సాగిన గం
భీరేభపితామహ♦విక్రమముల్, పెరుగంగ మనోహర♦వృత్తము తా. 402

వ. ఇది కలితాంతవృత్తచ్ఛాయను బేసిచరణములును దోటకవృత్తచ్ఛాయను సరిచరణములును నడుచును. 403

---

1. ఇందు రెండవపాదమున వంశస్థవృత్తము నడచును వంశస్థమునకు యతిస్థానము 8; లక్షణమున 9 గ నున్నది; కాన యతి తప్పినది. 'తలంప యాయాయాలును+తాజరేఫబున్' అని సవరింపనగును (రా).

## కేతుమతి

[1]జతబేసుల స్సజనగముల్, భాతి సరిన్ భరేఫనిగగంబుల్
యతి శైలసంఖ్య నమరఁగా, సాతతకేతుమత్యభిధ మొప్పున్. 404

## వేగవతి

[2]సగణత్రయగల్పను బేసిన్, బాగుగ సర్గను భత్రిగగంబుల్
నగవిశ్రమ మందము నొందున్, వేగవతీసుతవృత్తమునందున్. 405

## వియోగిని

[3]ససజల్ గము సాగ బేసులన్, బస సభ్లగము [4]భాసిలన్ సరిన్
రసశైలవిరామసంగతిన్, బొసఁగు న్వియోగిని భూరమాధిపా. 406

## పరావతి

[5]ఓలి రజజాంతగంబులుంచి బేసులం,దులన్ జరజగంబులుం [6]గుదుర్పరింపన్
గ్రాలుచు న్నిధానదిగ్విరామ మొప్పఁగా, నిలం బరావతీసువృత్తమింపుగాంచున్.

## ధృతమధ్య

బారిగ బేసుల భాభగగంబుల్, సరుల నజాయలు సాగఁగ మేల
య్యారె శిలోచ్ఛయ హస్తివిరామో,[7]దారత నొప్పును దాధృతమధ్యన్. 408

వ. ఇవి దోదకవృత్తచ్ఛాయను బేసిచరణములును తోదకవృత్తచ్ఛాయను సరిచరణము
లును నడుచును. 409

ఇది పరస్థానార్థసమవృత్తవివేకం బింకఁ బరస్థానవిషమవృత్తవివేకం బెఱింగించెద:—

---

1. ఇందు బేసిచరణములు పఙ్క్తిఛందమున 492 వ వృత్తచ్ఛాయను సరిచరణములు త్రిష్టుప్ఛందమున 471-వ వృత్తచ్ఛాయను నడుచును. ఈవృత్తముల నప్పకవి యుదహరించలేదు.

2. ఇందు బేసిచరణము పఙ్క్తిచ్ఛందస్సునందలి 220 వ వృత్తచ్ఛాయను సరిపాదములు త్రిష్టుప్ఛందస్సునందలి దోదకవృత్తచ్ఛాయను నడచును. బేసిచరణములందలివృత్తము నప్పకవి పేర్కొనలేదు.

3. ఇందు బేసిచరణములు పఙ్క్తి చ్ఛందమునందలి 348 వ వృత్తచ్ఛాయను సరిచరణములు త్రిష్టుప్ఛందమునందలి 692 వ వృత్తచ్ఛాయను నడచును. ఈవృత్తము నప్పకవి పేర్కొనలేదు.

4. భాసిలన్ (సూర్య.)

5. ఇది పరస్థానార్థ సమవృత్తము కాఁజాలదు. స్వస్థానార్థసమవృత్తములలోఁ జేర్పదగినదిగాఁ గనబడుచున్నది. సరి బేసి, చరణములేకచ్ఛందము లోనివిగా నున్నవి.

6. గుదిరింపఁగా (పూ. ము.) ఛందోభంగము. 7. ఈచరణము రెండవచరణము వలె లేదు. అన్ని ప్రతులందును ఇది ఇట్లే ఉన్నది. కాని 'విరామాదరమున' నని సవరించిన సంగతము.

## పరస్థానవిషమవృత్తవివేకము

క. దానవహర యొకచరణం, బైనను రెండడుగు లైన • నక్షరగణసం
ధానములను వేఱువేఱ వగు, వీనికిఁ బేరు పరదేశ•విషమము లయ్యెన్. 410

## శరభక్రీడ

ఘనాదిత్యక్రాంతి న్యమనసర•గల్మాఁడుకాళ్లన్
గనద్ధాతృక్రాంతి న్మభసయజ•గద్వంద్వ మొందన్
దనర్పంగాఁ బౌరాణికకథల•బాశార్హ్వా వాక్రు
వ్వనర్హ్వంబై చెన్నా రవని శర•భక్రీడసంజ్ఞన్.[1] 411

వ. ఇది చంద్రశ్రీఛాయను ప్రథమచరణమునను విశాలచ్ఛాయను మూఁడుచరణము
లను నడుచును. 412

## శ్రీరమణము

ఆది భమస్గ•ల్హ్వాత్రిన నాపై, గాదిలి భాభగ•గంబులు మూఁటన్
బాదుకొనం గవి•పల్కినచో లక్ష్మీదయితా ధర•శ్రీరమణం బౌ. 413

వ. ఇది రుగ్మవతీఛాయను దొలి చరణమును, దోదకచ్ఛాయను మూఁడుచరణములును
నడుచును. 414

## రథగమనమనోహరము

గ్రథితనయుగరజ్గ•గంబులుంబొసంగం, బ్రథమతృతీయచతుర్థ•పాదముల్వచింపన్
విధిదశయతు లొంది•వింతగానబార్యల్, రథగమనమనోహ•రం బగున్ ధరిత్రిన్.

ఇది పరస్థానవిషమవృత్తివివేకం బింక సర్వపరస్థానవిషమవృత్తవివేకం బెట్టి దనినః—

## సర్వపరస్థానవిషమవృత్తవివేకము

క, ఉర్విని నాలుగుపదములఁ, బర్విన గణములును వర్ణ • పఙ్క్తిగణనయున్
సర్వము విపరీతం బగు, సర్వపరస్థానవిషమ•సంజ్ఞలను హరీ. 416

## వీణారచనము

చారిం దయసాగ ల్మజ•త జ్నభగాలు, న్నారించి తజ న్భసలు భ•నాజనగంబుల్
జేర న్మణిదిగ్గశశి•శేఖరవళి వీ,ణారచన ధరఁ జెలఁగును • నారదవినుతా. 417

## ఉద్ధతము

అరుదార నుద్ధత మయ్యె, న్మరి సజయలున్ • నసజ్గలున్
జారుభనజగలు • సజ్సనల్, ధర షణ్మహీధ్రగజ • ధాతృయతిన్. 418

---

1. ఇందు నాలుగు చరణములను చంద్రశ్రీఛాయనే ఉన్నవి. రెండవచరణము
గనద్ధామక్రాంతిన్మభనయజ•గద్వంద్వ మొందన్ (పూ. ము.)

## మధుర

వెస మధురాఖ్యము । వినన్నజారగల్ నా
రసలగములు మీఁద । రాఁగ ననమ్యయల్
ననజజజగ లొందఁగ । దంతిరత్నాత్మభూది¹
కృసరవిరమంబుఁ జెందిరసం దనరా రజా! 419

వ. ఇది ప్రభాతచ్ఛాయను మొదటిచరణమునను, అపరాజితచ్ఛాయను రెండవచరణమునను, మాలినీఛాయను మూఁడవచరణమునను నడుచును. నాలవచరణము కవి కల్పితము. 420

## మణిదీపిక

గురుపితామహముఖ్యులఁ గినిసి । ఘోరరణములోఁ
దెరలిచె నరుఁ డని పలుక రత్నదీపిక ల్దనరును న
క్షరనభభ్నభన ల్నానసజకారభనలు నభర్ననసనసలు
న్నరసజాగలు భూపతు ల్వినభానువిశ్రమయు క్తితోన్.² 421

ఉ. ఈ సమవృత్తరాజి నుదయించు విరామములు న్గణంబులుం
బ్రాసము లెల్లఁ దప్పక నమర్చి వచించిన నైదుత్రోవలై
భాసిలు వృత్తపద్యము లపారములై విషమాహ్వయంబులై
వాసికి నెక్కు శిష్టజనపాలన దుష్టనిశాటచాలనా. 422

ఇది పంచవిధ విషమ వృత్తవివేకం బింక వైతాళీయజాతివృత్తంబు లెఱింగించెద:—

మ. ప్రకటింతు న్ధర దక్షిణాంతికయు నౌపచ్ఛాందసంబుం బ్రవ
ర్తక యాపాతలికాపరాంతికలు వైతాళీయము న్జారుహా
సిక ప్రాచ్యంబు నుదీచ్యవృత్తి యనఁగాఁ । జెన్నారు వృత్తంబు లిం
దుకులశ్రేష్ఠ యనేకము ల్గలుగు నందుం గొన్ని వాక్రుచ్చెదన్. 423

క. ఖ్యాతిగను రగడలందును, వైతాలీయాఖ్యవృత్తవారములందున్
బీతాంబర గురువునకు, న్రీతిగఁ గృతుల న్లఘువులు । రెండేసి యగున్. 424

## దక్షిణాంతిక

ఉరుసాజగ । లుండు దేసులన్, సరులం దూకొను । సభ్రమంబులున్
దొర లేడిటఁ । దొమ్మిదింట రా, ధరలోఁ జెన్నగు । దక్షిణాంతికల్. 425

---

1. రత్నాజది-అను పూ. ము. లో గణభంగ మగుటచే నిట్లు సవరింపఁబడినది

2. ఇందు పండ్రెండవ యక్షరము యతి యని చెప్పఁబడినది. తొలిపాదమునఁ బదమూఁడవయక్షరమును, రెండవపాదమునఁ బదునాల్గవయక్షరమును యతులుగా నున్నవి.

### ఔపచ్ఛందసము

ఇమిడి నలము♦లేదుతొమ్మిదింటన్, సమకూఱు న్యతి,షడ్ల రేఫయంబుల్
[1]సమత వసుల♦సాగి రేఫయంబుల్, క్షమలో నౌప♦చ్ఛాందసంబు మించున్. 426

### ప్రవర్తక (వర్తక)

స్థిర జేసి ను♦దీచ్యవృత్తియున్, బరఁగు న్సర్లను ♦ బ్రాచ్యవృత్తియున్
గిరిమణియతి♦కీలితంబుగన్, [2]బరముం గొల్వఁ బ్రవర్తకాఖ్య మా. 427

### ఆపాతలిక

[3]లము లాఱువ♦లన్భగగంబుల్, లము లెనిమిదిటికి♦దన్భగగంబుల్
క్షమ గిరినవ♦[4]శ్రాంతులు నొప్పన్, బ్రమథితముర యా♦పాతలికాఖ్యల్. 428

### పరాంతిక

ఇల వర్తక♦వృత్తరీతితోఁ, దుల రై పాదచ♦తుష్టయంబులన్
బలసినయది ♦ పద్మనాభ చె,న్నలరుం గృతులఁ బ♦రాంతికాఖ్యచే. 429

### వైతాళీయము

ఋతులఘువులు ♦ రేఫవంబులున్, ధృతవసులఘువులు ♦ రేఫవంబులున్
జత సమకొన ♦ సారసాక్ష పా, లితశుక వైతా♦లీయవృత్త మా. 430

### చారుహాసిని

[5]ప్రమదమునకు ♦ వర్తకాఖ్యవృ, త్తముచందంబున ♦ ధాత్రి సత్కవుల్
సమకూర్చిన♦శార్ఙ్గ కార్ముకా, సమత స్మీఱును ♦ జారుహాసినిన్. 431

### ప్రాచ్యవృత్తి

తొలి నేడిటఁ ♦ దొమ్మిదింట శ్రాం, తులు పదునాలుగు♦దూఱు జేసులం
దులఁ బదాఱు♦తొంగలించు స,ర్ల లలి న్మాధవ♦ప్రాచ్యవృత్తి యా. 432

### ఉదీచ్యవృత్తి

తమ కిర వగు♦దక్షిణాంతికా,ఖ్యము తేజంబున ♦ నందగించు మే
లిమికృతులఁ గ♦డింది వేలుపా, తిమురు న్ధాత్రి ను♦దీచ్యవృత్తికల్. 433

ఇది వైతాలీయజాతివృత్తవివేకం బింక మాలికావృత్తవివేకంబు లెఱింగించెద:—

---

1. సమతన్వసుల (గి;సూ). 2. బరముఁగొల్వ. (గి;సూ). 3. లములాఱునలున్ భగగంబుల్. (గి) యతిభంగము. 4. శ్రాంతులుందగున్ (గి;సూ). 5. ప్రవర్తక-పరాంతిక-చారుహాసినులకు నామభేదమే కాని రూపభేదము కానవచ్చుటలేదు.(వ్యా.ము.)

## మాలికావృత్తవివేకము

తే. మాలికావృత్తము లనంగ మఱియు నైదు
దనరు నిరువదియాఱు ఛందముల మించి
యల లయగ్రాహి లయవిభాతి లయహారి
గదసహజ! త్రిభంగియుఁ దండకంబు లనఁగ. 434

## లయగ్రాహి

క. ముప్పదితొమ్మిదిమాత్రల, ముప్పదియక్షరములపదము తదంఘ్రులు నా
ల్గొప్పయతి ప్రాసంబులు, గుప్ప లయగ్రాహి యనఁగఁ గొమరొందు హరీ.

ఇం బడరఁగా భజసనంబులతుద న్భజసనంబులు పడంపడి భయంబులు లయగ్రా
హింబరఁగుప్రాసవిరమంబు నలుమాఱు గుదురం బటుకవీశులు తిరంబుగ వచింపన్
[1]సంబరముగా వలసితొంబగలిదానవకదంబము సహాయముగఁ బంబి త్రిదశు ల్దు
గ్ధాంబునిధిద్రచ్చి యమృతంబుగొనఁ జాలుసమయంబు దొరకించితి ముదంబున
ముకుందా. 435

## లయవిభాతి

క. ముప్పదితొమ్మిదిమాత్రల, [2]ముప్పదినాల్గర్ణము పదము తదంఘ్రులు నా
ల్గొప్ప యతిప్రాసంబులు, గుప్ప లయవిభాతి యనఁగఁ గొమరొందు హరీ. 436

పెనిమిటులు భార్యలునుదనయులను గాంచిరటె మనమలర దొడ్డతపమునవలదశస్యం
దనుఁడు మఱికోసలియుఁదనకడుపులోపల భువనములఖిలంబు నిడుకొనిన కొడుకున్రా
మునని [3]నసనత్రయము వెనుకనసగంబులును జొనిపియతులుండు నెడలనలుమఱుప్రాసం
బునిలిపి కవీశ్వరులు మును లయవిభాతి నిటు నిను వినుతిసేయుదురు వనజదళనేత్రా. 437

## లయహారి

క. ముప్పదితొమ్మిదిమాత్రలు, [4]ముప్పదియేడర్ణము పదము తదంఘ్రులు నా
ల్గొప్ప యతిప్రాసంబులు, గుప్పిన లయహారి యనఁగఁ గొమరొందు హరీ. 438

నగణములుపదునొకఁడుసగణమునుగురువునిడి మిగులనలుమఱుయతులుదగులు లయ
హారిన్, బెగడి శతధృతిపరిపరిగతులమొఱయిడినమరిగిరుషతనువుఁ బొదివినిగిడి చని
యంతన్, నిగమములు గొనివెసజగము లద్రువఁబఱచి యొదిఁగికదపలిజడధిమునిఁ
గినభియాతిన్, బెగడుచునొడిసికరిచి తెగఁగొనినతురగగళుఁడగుహరివనఁగ సుకవు
లగణుతిచెలంగున్. 439

---

1. సంబళముగా. 2. ముప్పదినాల్గులిపులపదములయంఘ్రులు (సూ). 3. నసన ద్వయము (పూ. ము.) 4. ముప్పదియేడులిపులపదములయంఘ్రులు (సూ).

## త్రిభంగివృత్తము

క. ఇది నేత్రాంబుధిలము ము,వ్వదినాలుగువర్ణములను ♦ బాదం బగుఁ ద
త్పదచాతుర్థికములచే, నొదవుఁ ద్రిభంగి యను వృత్త ♦ ముర్వరలోనన్. 440

విసువక[1]సుకవులు♦రసఁ బ్రతిపదమున ♦ [2]హసగగమూఁడొకతీరై మఱివేఱైమూఁడొక తీరై, రసనగణములును♦[3]సభమసగలును ♦ బొసఁగినపద్యతిసంగి న్రణవింగింజెల్లుఁ ద్రిభంగిక్, మసలెదు వ్రజమున♦దుసికిలి మధురతఁ ♦ గసికిసమృద్ధశుభాంగిందగుభంగిం జేరి త్రిభంగిక్, వెసమనిచినవవ♦బిసరుహనయనయ♦ని సభలవేద్యగురింతుక్ విను తింతుక్ నిచ్చలుఁ గాంతున్. 441

## దండకము

క. ఇది నియమము లేని మహా,పథమునఁ గావలసినంత ♦ [4]వక్కాణింపక్
గొద లేక నమరు దండక, ముపథీంద్రశయాన తాన♦కోత్తమనుతులన్. 442

విద్వాంసు లెల్లక్ హకారంబె కానీ నకారంబె కానీ సకారంబె కానీ వచింపందగు న్మొందుగా నిందుఁ, గాదేని యాదిం దకారంబు గల్పించి [5]యామీఁది వెల్లం దకారంబులే మొందుగా నిచ్చతో న్వచ్చునందాఁక నిర్మించి గుర్వంతముం జేసిన న్దండకం బండ్రు భక్తానుయాయీ భుజంగేంద్రశాయీ పయస్తక్రదధ్యాదిక స్తేయి నైర్మల్యతాపింఛగుచ్ఛచ్ఛవిస్వచ్ఛ మాయూరపింఛావచూడాసదాపూతబృందాటవీ మధ్యరథ్యాసమారాధ్యతథ్యార్భకక్రీడహేమేక్షణాఖర్వదోర్గర్వసంభూతసర్వోర్వరాభారనిర్వాహకార్థాంగితక్రోడ చండప్రభామండితానేకమార్తాండకోటి ప్రతీకాశ నానావిధాస్తోకలోకేశ వైకుంఠసంవేశ ఘోషాంగనాలోల కాదంబినీనీల గోపాల బాలా నమస్తే పునస్తే నమః. 443

క. దండిగ నేకపదంబున, నుండెడివిక్ నాల్గడుగుల ♦ నుండెడివిక్ వే
దండావన దండకముల, పిండువు దనరారుఁ జండ♦వృష్ట్యాదికముల్. 444

దండకము. [6]ధూర్తు ల్నకారంబుల న్రెంటిపై సప్తరేఫంబులుం గూర్చినం జండవృష్ట్యాఖ్య మయ్యె, న్నకారంబులు న్రెంటిపై నష్టరేఫంబులుం గూర్ప నర్ణాఖ్య మయ్యె, న్నకారంబులు న్రెంటిపై రత్నసంఖ్యాకరేఫంబులుం గూర్చిన [7]న్నర్ణవం బయ్యె, నోలి న్నకారంబులు న్రెంటిమీఁదం దశఖ్యాతరేఫంబులుం జెప్పినక్ వ్యాళ మయ్యె,న్నకారంబులు న్రెంటిపై రుద్రసంఖ్యాకరేఫంబులు న్నిల్పజీమూత మయ్యె,

---

1. సుపలురసఁ (పూ. ము.) ఛందోభంగము. 2. హసగగ-అనుటలో నర్థము లేదు; 'ఎసఁగఁగ' అని సవరింపనగు (రా). 3. ససభసగములును. (గి) 4. వఖ్యాణింపక్ (ప); వక్కాణింపక్ (ఓ). 5. యామీఁదనెల్లం (సూ.) 6. ధూర్తుల్-అనుపాఠమే పూర్వముద్రణములలో నున్నది. ఇది యర్థవంతముగాదు. 'ధీరుల్' అని మార్చుకొనుట యుక్తము. (రా) 7. న్నర్హ్వవం (పూ. ము.)

న్నకారంబులు నైంటిపై నొప్పుపండ్రెండు రేఫంబులుం జెంది లీలాకరంబయ్యెఁ, జేర్చి న్నకారంబులు నైంటిపై మించు పద్మూఁడు రేఫంబులున్నంత నుద్దామమయ్యె, న్నకారంబులు నైంటిపై రూఢిఁ బద్నాల్గురేఫంబుల న్శంఖమన్దండకం బయ్యె, నీరీతితోఁడ న్నకారంబులు నైంటితర్వాత నేడాదిగాఁగా రకారంబు లొప్పారఁగా నంఘ్రినొక్కొక్కటెక్కించి కావించినం జండవృష్ట్యాది నానాలసద్దండకంబు ల్విసాళించుఁ గాకుండె నాల్గంఘ్రులుం జేయఁగా వచ్చు, [1]నీరీతి నేకోనసాహస్రపర్యంతముంగూర్చి యిచ్ఛావిధిం జెప్పఁగా వచ్చు గాంతంబుగా, రాధికాజార శ్రీరుక్మిణీమానచోరా సుదంతాసునాథా కళిందాత్మజానాథ వాఃకేళికాసక్త గోపీజనోత్సృష్టవస్త్రాపహారా శుకాస్యోక్తవాక్యామృతాంభోధిచంద్రోదయాసాంద్రదేవా నమస్తే పునస్తే నమః. 445

## జాత్యుపజాతినామములు

క. జాతులు నుపజాతులు నన, భూతలమున రెండు భేదములు జాతులలో
జాతులు కందాదిక ముప, జాతులు గీతాదికములు సరసిజనయనా. 446

సీ. కందభేదము లాఱు గాక[2]యుత్సాహంబు తరువోజ మధ్యమాక్కరలు నైదు
దీపించుమంజరీద్విపదత్రిపదచతుష్పదపంచపాదిషట్పదవిధములు
తొమ్మిదివిధములతో నొప్పురగడలు కళికలు నుత్కళికలును గూడ
జాతులు నవవిధగీతంబులును సీసపద్యకంబును నుపజాతు లయ్యె

తే. ననుచు నన్నయభట్టు భీమనయుఁ బెద్ద
సచివుఁడును మూర్తి తాత[3]నొజ్జలు ననంత
మంత్రియునుఁ దిమ్మరాజు నిమ్మాడ్కిఁ జెప్పి
రందముగఁ దాము చేసినఛందములను. 447

## జాత్యుపజాతినిరూపణము

క. గురులఘువులలో నెయ్యది
మురసంహార ప్రథమపాదముఖమున [4]నిలిచెన్
ధర నుపజాతులు దక్కఁగఁ
బరఁగ నిలుచు నదియె నాల్గుపదముల మొదలన్. 448

మ. ధరణిన్ జాతుల కాదివర్ణ మొకఁడే తప్పంగరా దల్లడన్
హరి తజ్జాతిగణంబులైన నరి యట్టట్లైనఁ గావచ్చు మం
దరధారీ యుపజాతులం బ్రథమవర్ణంబు న్యథేచ్ఛంబుగా
నొరిదిం జెప్పఁగ వచ్చుఁ బ్రాసము లనిల్పు స్వల్పకై యొక్కచోన్. 449

1. నీతీరు (ప.) 2. నుత్సాహంబు (పూ. ము.) 3. నొజ్ఝ (ప); నొజ్జయు (మూ.) 4. నిలుచున్ (మూ.)

క. తెలియఁగ వినుమీ కామే, పలినామగ్రామధామ ప్రస్తుతపద్యం
బులు గీతకందసీసా, దులు విరతిగణనియమములతో వివరింతున్. 450
క. గురులఘువుల పేరిటియు, క్షరములు నష్టగణనామకము లగులిపులున్
సురరిపుగర్వతమోభా, స్కర దీర్ఘము లైన రెండుగా చెన్నఁబడున్. 451

కందషట్కాభిధానంబులు

గీ. [1]పరఁగఁ గందము పథ్యయు [2]మరి విపులయుఁ
జపలయును ముఖచపలయు జఘనచపల
లనఁగ గందపద్యంబు లీయాఱువిధము
లఖిలసుకవికృతులలోన నలరుచుండు. 452
సీ. నలగగభజసగణంబు లేనునె కాని కందంబునకు నొండుగణము సొరదు
[3]పీటిలోపల నొకమూఁటిచే వడి లేని హీనపాదము ముందుఁ గానఁబడును
దరువాత దీర్ఘపాదము పంచగణములఁ దగు దానిమీఁదవతావునందు
నలజలు దక్కంగఁ గలయ వామీఁదనే యతి దాఁకు నిజపదాద్యక్షరంబు
తే. తుదిని గాసలు దక్కంగఁ గదియ దొకటి, కొంచెపడుగుల దేసుల గొప్పకాల
సరుల జగణంబు గూడదీ చరణయుగము, భువిని సగమయ్యె రెట్టింపఁ బూర్ణమయ్యె.
ఇది సమస్తప్రబంధములందుఁ జెప్పెడు సహజకందపద్యలక్షణము:—

పథ్య

ధరలోఁ బథ్యాకందము, [4]హరు వగు నాఱవయెడ నల మాఱిటిపై
విరతియుఁ గూడఁగ మూఁటను, నెసయఁ జతుర్గణములు గము నిలిచినచోన్.

విపుల

క్షమ దేసికాలు సమపా, దములోఁ జొర శబ్ద మొకటి తనరింపన్
సమధికపథ్యాకందము, గమనిక విపుల యన నలరు కంద మగున్. 455

చపల

[5]సమపదముల మొదలం జగ, ణముం గడయడుగునను ద్విగ ణలఘువుపై
[6]సమకొను విరతియుఁ బదిరేన్, లముల్ ముకుంద చప లకు నమరున్. 456

---

1. ఆ. పరగఁ గందముమఱి పథ్యయు, విపులయుఁ, జపలయు ముఖచపల జఘన చపల, యనఁగ నాఱువిధములై కందపద్యము, లఖిలసుకవికృతులనలరుచుండు (పాఠాంతరము). 2. అప్పకవిమతమున 'మఱి' లో నలఘు రేఫముండవలెను. చూ. పుట. 90. (రా) 3. వ్రాఁతప్రతులన్నిటిలో 'పీఁటి' అనియేయున్నది. పీటి (సూ.) ఇందరసున్న లేదు. 4. హరియగు (పూ. ము.) 5. సమపదముల మొదలం జగ, ణముగడ పాదమునకు ద్విగణలఘువుపై (ప. ఓ.) ఇందు రెండవపాదమున మొదటిగణము జగణము కాదు. సమపాదముల మొదల జగణము. (సూ.) 6. సమకొను యతి యాఱవయది, లమై ముకుందచపలకు నమరున్ (పూ. ము. సూ.)

ముఖచపల

స్థిరఁ జపలాకందమువై, ఖరిక్ మొదలియడుగు చెప్పఁగఁ గవులు పె
ట్టెరి ముఖచపల యనెడు పే, రరిదిగ వైకుంఠ వరద ♦ యఘజైత్రా. 457

జఘనచపలాకందము

క్షమఁ బథ్యారీతిఁ బూర్వా, ర్ధము చపలాకందము క్రియఁ ♦ దగు నపరా
ర్ధము జఘనచపలకు మునీంద్రమానసమరాళ ♦ ధాశార్హా. 458

క. గురువొకటి రెండులఘువులు, సరియైనకతమున వృత్త♦చయములఁ దక్కన్
[1]బెరజా త్యుపజాతులు నిబ్బరముగ నెవ్వైన నిలుప♦వచ్చున్ గృతులన్. 459

ఉత్సాహలక్షణము

[2]ఈహ మీఱ సూర్యగణము ♦ లేడు గాంత మైన ను
త్సాహవృత్త మనఁగఁ గృతులఁ ♦ జాగుచుండు సత్కవి
వ్యూహనుతులు గాంచి కృష్ణుఁ ♦ డొడిసి కాళ్లు వట్టి పెన్
ద్రోహి చావు మనుచు ఖరునిఁ ♦ ద్రోచెఁ గాళ్లు మీఁదుగాన్. 460

తరువోజ

శతమఖత్రితయంబు♦జలజాప్తుఁడొకఁడు♦[3]శతమఖత్రయిమీఁదఁ ♦ జను విశ్రమంబు
ప్రతిథ నీయడుగులొ♦ప్పఁగ రెండుగూర్పఁ♦బ్రతిమీఱనొక్కొక్క ♦ పాదమైతనరుఁ
జతురంఘ్రు లీరీతి♦జత గూర్చి సుకవి ♦ చతురవాచారూఢి♦జలజాక్షునుతులఁ
[4]గృతులందుఁ దరువోజ♦నియోజ నెసఁగఁ♦గృతకృత్యుఁ డై చెప్పు ♦ క్షితి నెల్లసభల.

పంచవిధాక్కరంబు లెట్టి వనిన:—

క. మధువమన పురందరధా, మధిచంద్రగణాలిచే క్ష♦మ మహామధ్యా
మధురాంతరాల్పపూర్వ, గ్రథితాక్కర లైదు దనరు ♦ గ్రంథములందున్. 462

మహాక్కర

సూరుఁ డొకఁడును మున్నుగాఁ దర్వాత ♦ సుత్రాము లేవురు పిఱుఁద నొక్క
తారకేశుండు జత యైన నిట్టి స♦ప్తగణంబు లొక్క పాదంబునకుఁ
జేరు రెండవచోట నాలవచోటఁ ♦ జిత్రభానుగణంబు గదియుచుండు
నోరసిలు నాలవ గణంబుపై శ్రాంతి ♦ యుత్పలాంగ మహాక్కరంబునకు. 463

మధ్యాక్కర

మునుపుగాఁ బ్రాసంబు గూర్చి ♦ మూఁటిపై విరమంబు నిల్పి
చన నింద్రయుగళంబుమీఁద ♦ జలజాప్తు నొక్కనిఁ జేర్చి

---

1. అప్పకవిమతమున ‘పెఱ’ లో నున్నది శకటరేఫము. ఇందు లఘురేఫముగా ముద్రితము చూ. పుట 89 (రా.) 2. ఈహాకారశక్ర (వ.ఓ.) 3. శతమఖత్రయిమీఁద యతిలేదు. శతమఖద్వయి అన సవరించిన రెం.డేసి యింద్రగణములపై యతులన్న యర్థము గ్రహింపవలెను. సరియైన పాఠాంతరము మృగ్యము. 4. బహుయతినియతిభంగము. (రా.)

యినుమడించిన నాఱు గణము • లెనసిన నొక్కపాదంబు
దనర వర్ణించినంతఁ • దగు నిట్టి మధ్యాక్కరంబు. 464

మధురాక్కర

మురనిశాటేంద్రసంహార • మూఁటిపై విరతు లుంచి
తరణిశక్రత్రయంబు సు•ధామయూఖునితోఁ గూర్చి
వరుసతో నేను గణముల • పాద మొక్కటి యొనర్చి
దొరలఁ జెప్పిన నొప్పుఁ గృ•తుల మధురాక్కరంబు. 465

అంతరాక్కర

[1]భానుఁ డిద్ద ఱాదిత్య • పతులు చంద్రుండు
పూని నాలుగుచరణ • ములఁ ద్రిగణాంత
[2]మైనవర్ణంబు విరతి • నంతరాక్కరంబు
భానుశీతాంశునేత్ర • పద్మాకళత్ర. 466

అల్పాక్కర

విరమంబు రెంటిపై • విస్తరిల్లి, సురపు లిద్దఱు నొక్క•సోముండు రాఁ
జరణ మీమూఁటిచే • సాగి యొప్పు, హరిపర్యంక య•ల్పాక్కరంబు. 467

మఱియు, మంజరి

తుదమొదళ్లను [3]నంటి•దూఁకు శబ్దంబు, వర్జించి యతిమాఱు•ప్రాసంబు లిడక
ప్రాసంబులేని ద్వి•పదయై చెలంగఁ, బ్రాసంబు తుదలందుఁ • బదిలంబు చేసి,
[4](సాగింపఁగాఁ జాలు•సత్కవీశ్వరులు, మోదంబు పెంపార • భూమిలోపలను
బద్మాక్షుఁ డెపుడు చే•పట్టుమంజరుల, చందాన నలరారు•జగతి మంజరులు.) 468

ద్విపద

సురపతిత్రితయంబు • సూర్యుఁ డొక్కండు
విరమంబు రెంటిపై • వెలయు నొక్కటికి

1. భానుఁ డిద్ద ఱాదిత్య • పతులు తమిస్రాపతియు, జానుమీర నీనాలుగు•చరణములకు త్రిగణాంత, మైనవర్ణంబువిరతి • నంతరాక్కరంబు, భానుశీతాంశునేత్ర • పద్మాకళత్ర (ప. ఓ.) 2. ఈ మూఁడవ పాదమున ఛందోభంగము గలదు. 'మైనవర్ణంబు విరతి • నంతాక్కరంబు' అని సవరించుట యుక్తమేమో అని పూ. ము. సవరణలో చేరె చూటిపోవును. 3. నంటితూఁకు (ప); నంటుతూఁకు (ఓ). 4. ఈ రెండుచరణములు వ్రాఁతపుస్తకములందు లేవు. పూ. ము. లలో 'బదిలంబుచేసి' తర్వాత కనఁబడుచున్నవి.

క్షితిఁ దగ నీరెంటి • చే నొప్పు ద్విపద
మితి లేక చెప్పిన • మే లండ్రు కవులు. 469

త్రిపద

తొలుతను నల్వు రిం • ద్రులు రెంట మూఁటను
బలభిద్ద్వయంబును రవియు
వళి [1]లేక నలరారుఁ ద్రిపద. 470

చతుష్పద (చౌపద)

జలజాసనవి • శ్రమసంయుతమై, లలి షోడశమిత • లఘువులతోడన్
గలసి చతుష్పద • గతులను ధరలోఁ, జెలు వగుఁ జౌపద • సేవకసులభా. 471

వితాళచతుష్పద

[2]భానుగణయుగము • పయి నవల లిం. పూన మణివిరతి • నొంది ధరలో
జా నలరుఁ జతు • ష్పదవితాళా, ఖ్యానమున వినా • యకతురంగా. 472

కర్ణాటచతుష్పద

మొగిఁ బంచలఘుగణం • బులు మూఁడు రవియుఁ
దగులఁదుదఁ బ్రాసంబు • దాఁక రెంటిపయి
[3]నగువి శ్రమమునఁ గ • ర్ణాటచౌపద యొ
సఁగుఁ గృతుల సత్కవుల • సమ్మతముతోడ. 473

పంచపద

క. ఆది సమవృత్తములలో, నైదంఘ్రుల నెద్దియైన • నార్యులు వలుకన్
బాదుకొని కృతులలోపల, నాదరమునఁ బంచపాది • యనఁగా నలరున్. 474

ఉ. ధన్య సుశీల యన్వనిత • తత్పరత న్నదియొడ్డునందు స
త్కన్యలు సేయు సువ్రతము • తానును వేడుక నాచరించి స
న్మాన్యతఁ గట్టినట్టినవ • [4]మండితదోర మసూయ చేసి పెన్
దైన్యము నొంది కానల వి • ధాతృకృతంబున సంచరించు కౌం
డిన్యమహామునీశ్వరుఁ గ • డిందిగఁ బ్రోచిన రుక్మిణీశ్వరా. 475

1. లేక యలరారు (రా). 2. భానుయుగముపై • పయి నవలనిం-అని పూర్వ ముద్రణము. రెండు సూర్యగణములపైఁ దొమ్మిది లఘువు లుండిన వితాళచతుష్పద. 3. నగును వళి గర్ణాటకాఖ్యచౌపద కెనఁగు(సూ). 4. మండితతోరము - అని పూ. ము. తోరము తద్భవము, దోరము - తత్సమము (రా.)

### షట్పద

ప్రాసము లుమ్మాఱు • వాసవు లాఱ్గురి•పై సుధాదీధితితో నిర్యతి
భాసిల్లఁగాఁ బాద • మీసూటితో నాల్గుఁ • జేసినకృతు లందు షట్పదాఖ్య. 476

### నవవిధరగడలు

వ. మఱియు వైతాళీయభేదంబులైన రగడ లనేకంబులు గల వందుఁ బ్రసిద్ధంబులైన హయప్రచారాదినవవిధంబులు ప్రబంధంబుల వర్తిల్లు నవి యెయ్యవి యంటేని.

క. నరసఖ హయప్రచారము, [1]సరగఁ దురగవల్గనము వి•జయమంగళముల్
ద్విరదగతివిజయభద్ర, మ,ధురహరి హరిణవృషగతులు • దొరలుం గృతులన్. 478

క. ఆద్యంతప్రాసంబు ల,భేద్యంబులు రెంటరెంట • బెనిఁచి పదంబుల్
[2]హృద్యంబులు గూర్చిన నన,వద్యంబులు రగడ లెల్ల • వాలుం గృతులన్. 479

క. కొద లేని నైపుణులఁ జొ,పదచే నుత్సాహవృత్త•పదయుగ్మముచేఁ
దుద నాదిని బ్రాసంబులు, వదలక విరచింప వలయుఁ • బ్రాజ్ఞులు రగడల్. 480

### హయప్రచారము

ఋతువిరామ • మిసులు నల్వ, రతుక నొక్క•యంఘ్రి) చెల్వ
దనర హయశిఁ • దార్క్ష్యుఁ డంచు, దనుజహరణ•దక్షుఁ డంచు
మును శుకాది•మునులు వొగడఁ, జను హయప్ర•చారరగడ. 481

### తురగవల్గనము

ఇరవుల న్హయప్రచార • మినుమడించి కృతులఁ జెప్ప
దురు విదూరితాగ్నివరణ • తురగవల్గనాఖ్య మొప్ప. 482

### విజయమంగళము

తురగవల్గనంబు రెంటి•తోడ విజయమంగళంబు
ధూర్తకంసతూలదహన • తుహినహీరసదృశకీర్తి
పరఁగ దుగ్ధసింధుమధ్య • భాసురాంతరీపవర్తి
వారివాహసదృశమూర్తి • భక్తజనహృదబ్జపూర్తి. 483

### ద్విరదగతి

కర మొప్పుఁ బంచలఘు • గణచతుష్టయముచే
విరమంబు రెంటికై • ద్విరదగతి పేరిచే. 484

1. వరుస (గి)-యతిభంగము. సరస (పాఠాంతరము.) 2. హృద్యంబుగ(మూ.)

## విజయభద్రము

ద్విరదగతి రెట్టింప • విజయభద్రము చెల్లు •
విదురపూజితపాద • వేదసన్నుతనామ
దరచక్రకార్ముకగ • దాఖడ్గధారణా •
తాపింఛసమగాత్ర • దళితదైత్యస్తోమ. 485

## మధురగతి

[1]నాలుగుమాత్రలు • నాటినగణములు, నాలుగు రెంటికి • నలి విరమణములు
గలసి మధురగతి • కనలును జగణము, తొలఁగిన ధృతకౌ•స్తుభ కవిరమణము. 486

## హరిగతి

నలసభగగములలోపల నేవైన నను నెనిమిది నాల్గిటిపై విరమము
గలసిన హరిగతి చెలు వగుఁ గృతులం • గవివరు లౌ నని చెప్పిననియమము. 487

## హరిణగతి

నరహరి పదియు • నాలుగులములు, కరియతి హరిణ•గతికి నెళవులు. 488

## వృషభగతి

ఇరువదియెనిమిది లఘువులు [2]పది • యేనిట విశ్రాంతియుఁ గూర్చిన
నిర వగు వృషగతి పద్మాధిప • యిది విను మాదరమున ముదమున. 489

## యక్షగానలక్షణము

సీ. తుద నేడు లఘువులు • తొలఁగించి చదివినఁ ద్రిపుటకు వృషభగ•తిపదయుగము
లలిఁ గడపల నొక్క•లఘువు మానిన జంపె మను ద్విరదగతిస•మపదయుగము
[3]గురుతగు రచ్చరే•కు దురగ వల్గనాభిధ మేకతాళియా•మధురగతికి
నంఘ్రికిర్వదినాలు • గటతాళమున మాత్ర లోలి విశ్రాంతి ప•ద్మాలుగింటఁ

తే. దెలియ నర్థంబు నర్థచం•ద్రికలు [4]వీన
యక్షగానప్రబంధంబు • లతుకవచ్చు
రగడభేదంబు లివి యంద్రు • రసఁ గవీంద్రు
లవితనిజసేవకస్తోమ • యబ్ధిధామ. 490

## ఉదాహరణలక్షణము

సీ. సప్తవిభక్తులు • సంబోధనంబును గూడ నెన్మిదివిభ•క్తులు క్రమమునఁ
బతిపేరు దొరలంగఁ•బద్య మొక్కటిఁ జెప్పి రగడభేదములు మా•ర్గములు గాఁగ

1. నాలుగు లఘువులు (ప). 2. పది•హేనిట (ప). 3. గురుతగురచ్చెర-కుఁదు రగవల్గనా, హ్వాయమేకతాళియా - మధురగతికి - పూ. ము. ఇం దుత్తరార్ధమున యతి భంగముంటచే సవరింపఁబడినది (రా). 4. వీటి (సూ).

గళికలు నెనిమిది • దళములు గావించి దానిలో సగము నుత్కళికఁ జేసి
యది యొక్కసమసనం • బయ్యేడు దళము లెన్మిదిఁ గూర్చి వానికేఁదుద విభక్తి
తే. బయలుపఱిచి కట్టకడను • బద్య మొకటి, పలుక వలయును సార్వవిభక్తికముగ
నిర్వదాఱుపద్యములందు • నిడిన ధాత్రి, నిది యుదాహరణ మటందు • రిద్ధచరిత.
సీ. సంబోధనమునకు • సరసాళి జయపతి ప్రథమకు వాణి వీరావళియును
క్షితి ద్వితీయకు ఝుట • గీర్తిమతియుఁ దృతీయకుఁ గీర్తి సుభగయు • నటఁ జతుర్థి
కిని దేవలాభిని • యును భోగమాలిని పంచమికి నెసఁగు • వాణియును గ
శావతి షష్ఠికి • లలిత కాంతిమతియు సప్తమికిని ఘోణి • సత్కమలయు
తే. నానిసూక్తుల నామధేయములు వెనుకఁ, బలికినది పేల్పు లష్టవిభక్తులకును
నాస తనుశక్తిగొలఁదిని • ప్రాయుఫలము, లిత్తు నా యకద్వయమున • కిందిరేశ.
సీ. [1]సంబుద్ధి యొడగూర్చి • సప్తవిభక్తులు పలికిన భక్తిసద్దలి యనంగ
సంబుద్ధితోఁ గూడ • సమవిభక్తులనిలఁబలుక నొప్పారుఁ బద్దలి యనంగ
సంబుద్ధితోడ విషమవిభక్తులతోడఁ బలికినకృతియు విద్ధళి యనంగఁ
గళిక లుత్కళికలు • గమకింపఁ బలికిన కావ్యంబు నుత్ఫుల్లకం బనంగ
తే. నవనిఁ జాటుప్రబంధంబులందు మిగుల, నాటుకొని యొప్పుచుండు నీనాల్గుతెగలఁ
గానఁబడు నుదాహరణము • ల్గానలోల, కామెపల్లిశ వల్లవీకామ కృష్ణ. 493

ప్రథమావిభక్తి

ఉ. శ్రీవనితాసనాథుఁడు వశీకృతభక్తమనోంబుజుండు వి
శ్వావనుఁ డుగ్రసేనుఁ డురు[2]వైద్యుఁ డజేయుఁ డగణ్యసద్గుణ
ప్రావృతభూమకోజ్జ్వలుఁ డహాళపతికోటిమరీచి భద్రదం
తావళనాయకావనుఁ డుదారుఁడు కృష్ణుఁడు మమ్ముఁ బ్రోవుతన్. 494

కళిక

మఱియు దేవకికొరసేనిదమారనిర్మలరత్నరాజము
కఱకుటసురుల నెల్ల దారుణ • కదనధారుణిఁ దునుము తేజము
బలిమి నందపవనములోపలి • పారిజాతము ధరకుఁ దెచ్చెను
గొలఁది మీఱిన సద్మదంబునఁ • గుండలంబులు తల్లి కిచ్చెను
జెలఁగి నరునకు సూతకృత్యము • చేసి కౌరవులఁ బరిమార్చెను
దలఁపు మఱువని దాసచయములఁ • దవిలి తిరుగనిముక్తిఁ జేర్చెను
వెలఁదికొఱకును బాణుచేతులు • వేయు నఱికిన విక్రమోగ్రుఁడు
జలదములజిగి దెగడు నొడలున • జానుమీఱెడు శుభసమగ్రుఁడు. 495

1. సంబుద్ధితోఁగూడ సప్తవిభక్తులు పలుకనొప్పారు బద్దలి(గి; సూ) ఈపాఠము పొరపాటు, కానఁ బైరీతి సవరింపఁబడినది (రా) 2. వైద్యుతచేలు. (పాఠాంతరము.)

### ఉత్కళిక

కమలనేత్రుని రాక రోయుచు, యమునయొడ్డునఁ దపము సేయుచు
నున్నకాంతను జూచి రయమున, నున్న సుద్ది వచించి ప్రియమున
నరుఁడు గూర్చిన మిత్రునానతి, కరము పట్టెడుదానిఁదా నతి
విదళితాసురసార్వభౌముఁడు, యదుకులాంబుధిపూర్ణసోముఁడు. 496

### ద్వితీయావిభక్తి

ఉ. మానవులార రోగములు • మానును లేములు లేవు సంపదల్
జానగు దుఃఖము ల్దొలఁగు • జాఱు నఘంబులు మందబుద్ధులై
దీనత నొందనేటికి న•తిస్థిరభక్తినిఁ గొల్వుఁడీ పరా
ధీనులు గాక మీరు వసు•దేవకుమారకు ముక్తికోసమై. 497

### కళిక

[1]మఱియు వ్రేతల నెల్ల • మరులుకొల్పినవాని
మెఱసి కానను బసుల • మేపి తిరిగెడువాని
భామతో దుర్వాసు • బండి యీడ్చినవాని
వేమరెదిరిన మగధు • [2]విఱుగఁ ద్రోసినవాని
బాలుఁడై ఱోలెక్కి • పాలు ద్రావినవాని
హేలతోఁ బదిరూపు • లెలమిఁ దాల్చినవానిఁ
దాళవృక్షము లెల్ల • ధరణిఁ గూల్చినవాని
గాలిరక్కసుఁ జావఁ • గాలఁ దన్నినవాని
లీలఁ గొల్లను గడిఁది • లేమిఁ బాపెడివాని. 498

### ఉత్కళిక

మందుపావకుఁ గొల్చి, [3]ఖాండవాహుతి వ్రేల్చి
పార్థివేశ్వరుఁ గాంచి, పార్థు నక్కడ నుంచి
[4]దారుకుం డమరించి, చేరఁ దెచ్చిన మంచి
యరద మెక్కక పూని, పురికి వచ్చినవాని. 499

---

1. ఇందు రెండవ చరణము మొదలుకొని అయిదు పాదములు పూ. ము. లలో లేవు. (ప. ఓ.) లలోఁ గలవు. (పూ. ము.) లలో ఇందలి 1-7-8 పాదములును (ప. ఓ.)లలో లేని 'లీలఁగొల్లను గడిఁది•లేమిఁబాపెడువాని' అను పాదమును గలిసి నాలుగు పదములు మాత్రమే కలవు. ఈ కళికలో 9 పాదము లున్నవి. ఒక పాద మధికము. (రా) 2. విరుగఁదోలిన (పాఠాంతరము) 3. కాండవాహుతి (గి). 4. దారకు (గి).

## తృతీయావిభక్తి

చ. [1]పులసిల నేల మానవుల•[2]పుట్టును బావన మయ్యె నెప్పుడున్
[3]గళవడ మేల రోగము ల•కాలగతిం గడవట్టు నీతిబా
ధలును దరిద్రతావ్యథలు • దవ్వులకేఁగును వాంఛితార్థముల్
గలుగు నమేయుచేతఁ గమ•లాధవుచే వటపత్రశాయిచేన్. 500

కళిక

మఱియు బ్రహ్మమాయఁ గెల్చి • మసలు మంత్రవాదిచేత
నెఱిఁగి సౌంభకునకు వరము • లిచ్చి మెఱయు మోదిచేత
మృతతనయుని మరల గురున • కిచ్చినట్టి యమృతుచేత
నతులరాసకేళి సలిపి•నట్టి యాదినటునిచేతఁ
బిండి రుబ్బునాతిమోము • పెరుఁగు దుడుచుకొంటిచేత
మండుచున్నకారుచిచ్చు • మరిగి త్రావు నమరుచేత
నెలుఁగుతోడఁ బోరి మణియుఁ • గింతిఁ గొనినయజరుచేతఁ
వెలయఁ దులసిపూసపేరు • వేసికొనిన జోగిచేత. 501

ఉత్కళిక

గట్టిగ శరపంజరంబు, గట్టఁ దలఁచి వేగిరంబు
చవుటికడలిచెంతఁ జేరి, పవనతనయుతోడఁ బోరి
తన్నుఁ జీరినంత వచ్చి, చెన్ను గెలుపు నరున కిచ్చి
మహిమ మెఱయుఁ గృష్ణుచేత, మిహిరకోటిదీప్తుచేత. 502

## చతుర్థీవిభక్తి

శా. ఓలం బాసకుఁ దేక మత్సరముతో • నుప్పొంగి [4]పెక్కేఁడు లా
భీలాకారమునం గొలంకునడుమన్ • బేటాడు నక్రంబుతోఁ
జాలం గయ్యము చేసి చిక్కిన మద • స్తంబేరమస్వామికై
కేలం బట్టి నిమిర్చినట్టిహరికై • కృష్ణాంబుభృన్మూర్తికై. 503

కళిక

మఱియునుఁ గౌమోదకియును ఖడ్గము • మణియును శంఖముఁ బట్టినహరికై
మెఱయఁగ విద్యుచ్చేలముఁ దాల్చుచు • మెలఁగెడు దధికణపరిదిగ్ధునకై
వెలుచం గదిసిన[5]మల్లుల నిరువురఁ • బిడికిటఁ బొడిచిన బలుమల్లునకై
[6]వెలయఁగ యమునానదిలోఁ గాళియ • విషధరుఁ దోలినయదుసింహునకై
విజయునిరథసారథియై గురునృప•భీష్మాదులఁ గెలిచిన భూపతికై

---

1. పులకిల (గి). 2. పుట్టువు. (ఓ. గి.) 3. గళవళమేల (పూ. ము.) 4. పెక్కేఁడులు, స్లీలాకారము...నడుమన్నిట్టాడు (సూ); నడుమన్•బేపాడు (ఓ.) 5. మల్లుర (పూ. ము.) 6. వెలలఁగ (పాఠాంతరము.)

గఱిగా యవనాభిధు ముచికుందునిఁ ♦ గనుదృష్టిని జంపిన శ్రీపతికై
బనువిడి దేవకిఁదండ్రిని మధురకుఁ ♦ బట్టము గట్టిన గోవిందునకై
గేల దాల్చినవైఖరి గోవర్ధన♦గిరి మోఁచిన మహదానందునకై. 504

ఉత్కళిక

తొలిపుట్టువునోము[1]ఫలంబున వే,బలువిడి నగుపేదఱికంబున వే
సరి కొందలమందుచుఁ బైనంబై, పురికిం బరమానందమునం బై
కొని యుబ్బుచు వచ్చి కలిమిపనికిం, గని యదుకు లొసంగినబాపనికిం
గలి మిచ్చినబాలస్నేహునకై, [2]కలుములచెలి నేలిన కృష్ణునకై. 505

పంచమీవిభక్తి

మ. పురిటింటం బసిబిడ్డచందమున పాలారగింపంగ నాఁడాత్మలో
మురు వొప్పు న్విషదుగ్ధయుగ్మకుచయై ♦ ముద్దాడురాకాసి *చ
*న్నిరుకేలంగొని బాలు డ్రావు మిషచే ♦ నిష్ఠైనకాలంబునన్
ధరణిం గూల్చిననందపుత్త్రువలనం ♦ దార్క్ష్యణ ధర్మస్థితుల్. 506

కళిక

మఱియు గీతామృతస♦మగ్రసింధునివలన, వఱలు భవపటుతిమిర♦వనజబంధునివలన
బొంకు టెయ్యెడ లేని♦భూరిసత్యునివలన, జంకు టెన్నఁడు లేని♦సమరనిత్యునివలన
ఖేదము ల్వెడఁబాపు♦కేశిమర్దనువలన, నాదికారణమూర్తి ♦ యగుజనార్దనువలనఁ
గాన రానిపదముల♦గాముపానుపువలనఁ,[3]బూని గొల్లడ్రాలికిం ♦ బుట్టికానుపువలన.

ఉత్కళిక

[4]తను బిల్వఁ దమిఁ గూర ♦ దిని పాక మింపారఁ
జేసి ద్రౌపదిచేత ♦ నాస దీరఁగ మేఁత
యడిగినమునీశులకు ♦ నిడఁ గల్గుదాసులకుఁ
గల్పించుహరివలనఁ ♦ [5]గల్పస్థాయివలన. 508

---

1. ఫలంబుననే (పూ. ము.) అంత్యప్రాసనియమభంగము. 2. కలుములచే (పూ. ము.) 3. పూనిగొల్లడ్రాలికిఁ బుట్టు కానుపువలన (పూ. ము.) ఛందోభంగము; బూని గొడ్డురాలికి (ఓ. ప.) 4. తనుఁ బిల్వమిగుల (పూ. ము.) 5. ఛందోభంగము
*గుర్తెఱిఁ గిష్టంబుగఁ......నిర్త్వైనకాలంబునన్ (పూ. ము.) ఇది "క్త్వార్థే కార సంధి" ఇది యప్పకవి యుపయోగించి యుండఁడు. కాఁబట్టి దీనిని సవరించుట న్యాయ్యము, మహాలాక్షణికుఁడైన యప్పకవియె యిట్టియశాస్త్రీయమైన సంధిని జేసి నచో నాంధ్రభాషకు ముప్పువచ్చునను యతిశయోక్తిగాదు. మఱియు "నిర్త్వైన" అను పదము మిక్కిలి కర్ణకఠోరముగ నున్నది. తక్కినపద్యశైలిని చూడగా పదముల మార్దవము స్పష్టముగదా. (గి); ఈపాఠమే సూర్యప్రతిలోను ముద్రితమై యున్నది.(రా).

షష్ఠీవిభక్తి

శా. [1]కారాగారమునందు వెల్వడి భుజం♦గస్వామి సుచ్ఛత్రమై
పై రాఁ దార్క్ష్యుఁడు వాకిళు [2]ద్దెఱువ న♦భ్రస్తోమముల్ మీఱి శ్రీ
సూరోద్భూతి పథం బొసంగఁ దనుఁ గొం♦చుం దండ్రి యేతెంచి [3]జా
ల్వారేపల్లెను నిల్పఁ బోల్చు[4]హరికి ♦ న్వాలార నే మ్రొక్కెదన్. 509

కళిక

మఱియుఁ బెఱయ నెఱయ నుఱియు♦మధునిఁ గూల్చినట్టిహరికి
నఱిమి తఱిమి చఱిమి నుఱుము♦నక్రు గెల్చినవితకరికిఁ
గఱచి చఱచి యఱచి పఱచు ♦ కపినిఁ జంపినచ్యుతునకు
మఱిగి తిరిగి విఱిగి [5]సొరగు♦మద్దులిడ్చినయమితునకు
[6]సరలి కెరలి వరలి మరలి ♦ సాళ్వుఁ జంపినశూరునకు
గరిమ మెరిమె యొరిమి నెరిమి ♦ కామెపల్లిమందిరునకు
నయముఁ బ్రియము రయము జయము ♦ నరున కిడిరి కిడినకేశవునకు
వ్యయము భయము లయము క్షయము ♦ వైరి కొసఁగు మాధవునకు. 510

ఉత్కళిక

[7]గొల్ల లెల్లఁ దల్లడిల్లఁ ♦ బెల్లుజల్లు లల్లి జాళ్ల
సోనవాన మాన ఘూని ♦ కాన రాని[8]కోనలోన
చుట్టి పట్టి గట్టి దిట్ట ♦ రొట్టు గట్టు మట్టు గుట్టు
నూఁచి లోఁచి నోచి మోఁచి [9]బ్రోచినట్టివామనునకు. 511

సప్తమీవిభక్తి

మ. పృథులావంతివరస్వయంవరమున ♦ న్విందానువిందాదులన్
బ్రధనక్షోణిని గెల్చి సద్గుణ సుభ♦ద్ర న్భద్రఁ దోకొంచు వ
చ్చి ధరాధీశునన్నచే ననలసా♦క్షికంబు గృహోక్త్యుక్తస
ద్విధిఁ బెండ్లాడినకృష్ణునందు నిలిచె ♦ [10]స్థిరప్రతాపోన్నతుల్. 512

కళిక

మఱియు సుగ్రసేనా♦మాత్యునందు, నెఱి మీఱ లయకాల♦నిత్యునందు
విదురార్చితపదార♦విందునందు, [11]విదళితఘోరారి♦బృందునందు

1. కారాగారమునుండి. (పూ. ము. అని-గి). 2. ద్దెలియ (ప). 3. చెల్వారం బల్లెను. (పూ. ము. అని-గి; సూ). 4. హరికీ♦వాలార (వ). 5. యొరగు (పూ. ము. అని-గి). 6. సరలిమరలి కెరలి వరలి-సాల్వుఁ జదిపినశూరునకు (ప. ఓ.). 7. ఇందు (పూ. ము.ల)లోను (ప.) లోను మూఁడు చరణములు మాత్రమే ఉన్నవి; (ఓ) లో నాల్గుచరణములున్నవి. (గి). 8. కాన (పూ. ము. అని-గి). కానలోన (సూ). 9. ద్రోచినట్టి వామనునకు (పూ. ము. అని-గి); బ్రోచినట్టి వామనునకు (ప). 10. దీర్ఘ (పూ.ము. అని-గి; సూ). 11. ఛందోభంగము.

సాభీరువస్త్రాపహారునందు, సాభీలకంససంహారునందు
బలిపట్టణద్వారపాలునందు, జలగాదివశతనూచ్ఛాదునందు. 513

ఉత్కళిక

సజ్జరాగంబు, రజ్జునాగంబు, కంధియోగంబు, మందరాగంబు
రాపుతో నూచి, వీఁపుతో మోఁచి, వెలయు హరియందు, జలజాక్షునందు. 514

## సంబోధన ప్రథమా విభక్తి

ఉ. [1]ధర్మజుఁ డంపిన న్నరిగి దంతిపురంబున నాంబికేయుతో
ధర్మముఁ జెప్పి దుష్కృతుల [2]దగ్గఱ శాంతనవాదిసజ్జనుల్
నిర్మలచిత్తు లెల్లఁ గను నేరుపున న్సభఁ దాల్చినట్టి ని
న్నర్మవహాకృతిం దలఁతు నాదుమనంబున నందనందనా. 515

కళిక

[3]మఱియు జగన్మోహనమాయఁదాల్చినజాల, జెఱుముతఱి ద్రౌపదికిఁజీరలిచ్చినకాల
సఖులతో నదిలోనఁజల్లి గుడిచినబాల, విఖనసుం డెదలోన వేఁ దలిర్చినలోల
నరుతేరినొగలపై నాట్యమాడినవీర, సరకుగొని భీష్మపైఁ జక్ర మెత్తినశూర
తరిని సద్గురుసుతులఁదాపరించినసదయ, పెరిమె నాగపురంబుఁ పెక్కలించినవిజయ.

ఉత్కళిక

గురుభీష్మరాధేయు, లురుజన్యమున నేయు
శరవహ్ని బయ లెక్క, యరద మెల్లను నెక్క
[4]తరి గొల్చునెడ పాండు,నరుల నేగురి మెండు
బ్రతుకఁజేసిన పుణ్య, వితత దీనశరణ్య. 517

## సార్వవిభక్తికము

శా. నీ వొక్కండవు నిన్ను నమ్మి కొలుతు న్నీచే సుఖం బబ్బె నీ
కై వే దండ మొనర్తు నీవలన నిష్టావాప్తి చేకూఱె నీ
కే విశ్వాసము [5]జేర్చి తింక మదిలో హెచ్చయ్యె నీయందు నా
కై వారంబులు శౌరసేనితనయా కామేపలీవల్లభా. 518

ఉ. నామన విచ్చగింపు మిట నన్నయభట్టకృతాంధ్రశబ్దచిం
తామణికల్పనోక్తికల నాచతురోపమ లుల్లసిల్ల ని

---

1. అంపినన్నరిగి-దుస్సంధి యని యప్పకవి-చూ. 5. ఆ-44, 45 ప. అంపఁగా నరిగి-అని సవరింప నొప్పు (రా.) డంపినంజరిగి (సూ). 2. దగ్గఱ (పూ. ము. అని-గి.) యతివిరోధము. 3. ఛందోభంగము. 4. తరుగాల్చునెడ పాండుతనయు లేగురి మెండు (పూ. ము. అని-గి.); తరిగొల్చు (ఓ.); తరుగొల్చు (ప.); తరుగాల్చు (సూ). మఱి కొన్ని తాటాకుపుస్తకములు చూచినగాని సరియైన పాఠము నిర్ణయించుటకు సాధ్యము గాదు. (గి). 5. జేర్తు నింక (పూ. ము. అని-గి.); సూ.

చ్ఛామతి నర్పణంబుగ నొ•సంగితిఁ గామెపలీశ నీకు సై
రామయమై తగ న్భవదు•దాహరణంబు జగత్ప్రసిద్ధిగాన్. 519

### సీసలక్షణము

వ. సీసంబు లనునవి సమవిషమంబుల రెండుదెఱంగు లయ్యె వానివిశేషంబు లెట్టి దనిన.

### సీసమాలిక

యతి నైనఁ బ్రాసంబు • నందైన [1]నొకటితోఁ జెప్పిరేనియు సమ•సీస మగును
నియమము ల్దీనిపై • నిలిపిన సీసంబు లాఱుదెఱంగు లై • యతిశయిల్లు
నెనిమిదంఘ్రులఁ బ్రాస • మెక్కింప వర్ణకై సర్వతఃప్రాససీ•సం బనంగఁ
బ్రాస మాఱంఘ్రులఁ • బదిలంబు గావింప నక్కలిప్రాససీ•సాఖ్య మనఁగ
నాది నేవడి నిల్పి • రావడే పద మెల్లఁ జేయ నయ్యది వడి•సీస మనఁగఁ
బదఖండములయందుఁ • బ్రత్యేకయతులుగా స్థిర నవకలివడి•సీస మనఁగఁ
గుదురుగా నుత్సాహ • తుదయందు గీతంబు చెప్పిన విషమాఖ్య•సీస మనఁగఁ
గడ వెల్ల లఘువులే • కల్పించి రెద్దాన సరవి సర్వలఘుసీ•సంబు ననఁగ
తే. సప్తవిధము లివియ శబ్ద•శాసనుండు, పంచమామ్నాయపక్కిలోఁ • బల్కెఁగాని
కడమకవు లాఱుసీసము • ల్విడిచిపెట్టి, చెలఁగి సమసీసపద్యమే•చెప్పినారు. 521

అందు సీసలక్షణ మెట్టిదనిన:—

క. సురపతు లాఱ్గురిపై భాస్కరు [2]లిరువురు గూడ నొక్క•చరణము పొల్పం
బరఁగు నవి నాలుగడుగుల, విరమముపై రెంట రెంట • వెలయఁగ వలయున్. 522
క. వాసిఁ జరణములు నాలుగు, చేసి తుదిని గీత మొకటి • చెప్పఁగ నయ్యెన్
సీసము తంగెడదేశవి, భాసురశుభశీల కామె•పలిగోపాలా. 523

### సమసీసము

ప్రతికించె నెవ్వాఁడు • మృతగురుతనయుని, మెలఁత వేఁడిన మెచ్చి • మేలుచేసెఁ
బోషించె నెవ్వాఁడు • పొదివినదారుణా,పద లెల్లఁ దొలఁగించి • పాండుసుతుల
వెడలించె నెవ్వాఁడు • వెడపాడుబావిలో, నూసరవెల్లి యై • యున్ననృగుని
మర్దించె నెవ్వాఁడు • మాసలంబున వృష్ణి, యదుభోజసైన్యాంధ•కాదినృపుల
తే. ప్రేల్చె నేవాఁడు ఖాండవ•విపిన మెల్ల, జాతవేదోత్థవిలసిత•జ్వాలమీఁద
నతనిఁ గీర్తింతు మదిలోన • ననుదినంబు, ననఁగ నలరారు సమసీస • మఖిలకృతుల.

### సర్వతఃప్రాససీసము

వేదండవరదుండు • వేధోండగాంగుండు, కాదేనశయనుండు • యాదవేంద్రుఁ
డాదిత్యవంద్యుండు • సాదాససులభుండు, వేదాంతవేద్యుండు • కాదనీలుఁ
డాదితేయుఁడు బిందు • నాదకళాతీతుఁ, డాదిత్యకులజుండు • బాధితారి
మేదినీశ్రీశుండు • [3]భూదారగాత్రుండు, శ్రీదమిత్రసఖుండు • ద్వాదశాత్ముఁ

---

1. రెంటితోఁ (పూ.ము.) 2. లిద్దఱు సీసదీర్ఘచరణమునకగున్, చరణాది పంచమాది యు•విరమములై రెంట,రెంట వెలయఁగవలయున్ (పాఠాంతరము.) 3. భూధర (పూ.ము.)

తే. డాదిదేవుఁ [1]డాశ్రితగంధమాదనుండు, చేదిసౌంభకవైదర్భసూదనుండు
మేదురమురళినాదవినోదుఁ డనుచుఁ, జెప్పినను సర్వతః ప్రాససీస మగును. 525

## [2]వృత్తప్రాససీసము

శిక్షించె నెవ్వాఁడు [3]చేటుకై సభలోనఁ, జెడుమాట లాడిన చేదివిభుని
రక్షించె నెవ్వాఁడు ద్రౌణిబాణముచేతఁ, [4]జిదియకుండఁగఁ బరిక్షిన్నృపాలు
భక్షించె నెవ్వాఁడు పర్వతాకృతిచేత, నాభీరు లర్పించు నారగింపు
వీక్షించె నెవ్వాఁడు వేడ్కతో సేవకుల్, బ్రతుకునట్లుగఁ గృపాపాంగదృష్టి
తే. దాక్షిణాత్యుని సౌంభకధారుణీశుఁ, జంపె నెవ్వాఁడు పోరిలో సాహసమునఁ
బక్షిరాజతురంగుఁ డేవ్వాఁ డనంగఁ, జెలఁగుచుండు వృత్తప్రాససీసము లిల. 526

## వడిసీసము

విజయసారథిఁ గానివినుతింపఁగా నొల్ల, గిరినాయకునిఁ గాని కీర్తిసేయ
యాదవేంద్రునిఁ గానియభినుతింపఁగ నొల్ల, మధుసూదనునిఁగాని మదిని నిల్పఁ
బద్మనాభునిఁ గాని ప్రణుతింపఁగా నొల్లఁ, బాశీనపతిఁ గాని ప్రస్తుతింప
బాణసంహరుఁ గాని భజియింపఁగా నొల్లఁ, బీతాంబరునిఁ గాని ప్రీతిఁ దలఁప
తే. నవితవేదండపతిఁగానియనుసరింప, ననుచు నినుఁ గూర్చి యనురక్తి నాత్మ నెపుడు
పొగడుసత్కవివిప్రజములఁ బ్రోచి తనఁగఁ, దనరు వడిసీసభేదంబు తాళభేది.

## అవకలివడిసీసము

సామాజికాహితస్తోమంబు సామంబుగా మించి మైత్రికి నామతింప
నభిమానధారుణీవిభులు దానంబుచే, నక్కఱ లన్నియుఁ జక్కఁజేయ
నతిరుక్మపక్షమావతులు భేదంబుచే, దినదినక్షీణత్వమునకుఁ జెడఁగఁ
బదిలింపుటుద్దండు లొదిగి దండంబుచేఁ దనయాజ్ఞ యొదల నునిచి [6]నడువ
తే. సంధియానాదిషాడ్గుణ్యబంధురముగ, [7]నోమి శక్తిత్రయోపేతుఁ డై మురారి
నేల ననురక్తి నీతితో నేలె ననుచుఁ, జేయ నవకలివడినామసీస మగును. 528

## విషమసీసము

అంచితముగ భీమునకు సహాయ మేఁగుదెంచి తా
నించు కెదిరి దురము సేయ నేయుసంకుశంబు తా
కించుకొనక కినుకవలనఁ గెరలి నరకపుత్త్రు మ
ర్దించినట్టిసవ్యసాచి తేరిఘోటకావలిం

---

1. డాదృత (పాఠాంతరము.) 2. దీనికే (పూ. ము. సూ.) లో అక్కిలిప్రాస సీసమని పేరు. సీసభేదములఁ దెల్పుసీసమాలికలో (521. ప.) దీని పేరు అక్కిలి ప్రాస సీసమనియున్నది. వృత్తప్రాస మను పేరు లేదు. 'చెలఁగుచుండు నక్కిలిప్రాససీసము లిల' అను పాఠము చేర్చుకోవచ్చును (రా.) 3. చేటుకయ్యె (ప). చెట్టవై (పాఠాంతరము.) 4. చిక్కకుండఁగఁ (పూ. ము. సూ.) 5. జనమ్ములఁ (ప). 6. నడప (సూ.) 7. నోర (పూ. ము. గి.)

ఆ. దోలుకృష్ణ యంచుఁ•దోరంపుటుత్సాహ,మీఁద గీత మొకఁడు • [1]మేలవింప
విషమసీస మనఁగ • వెలయుఁ గామెపలీశ, జమ్మిచెంత నున్న•చతురవచన. 529

[2]సర్వలఘుసీసము

క. క్షమ షట్త్రింశల్లఘువులు, త్రిమహాశవిరామము గల•దీర్ఘ పదచతు
ష్కముపై నొకగీతి మురహ, ప్రమథన సర్వలఘుసీస•పద్యమున కగున్. 530

సీ. చిఱుతయగు కొడుకున [3]కె•దరయు మృతికి మొదలగు
[4]టూరులవలన విని రుష•[5]వతుషుఁ డగుచు
చరమశరధిజలముల • తరణి మునుగక మునుపు
దురమున నురువడి బలు • దురుసుపరచి
కెరలి గొనయము దురిమి • మురిగుణము మొరయిడఁగ
నిరికిన శితశరములు • పరువ విడువ
జఱిగి నెళవెఱఁ గొదిగి •మఱుఁగున నిలిచిన కురు
[6]పతిమఱఁదిని నెరి నురు • మగను దఱచి

తే. చేసినట్టిప్రతిజ్ఞ శా•సింపగోరి, సవ్యసాచిశతాంగంబు • సైంధవములఁ
దోలుగోవిందునుతులచేఁ•దొడరుఁగృతుల, సర్వలఘుసీసపద్యంబు•సాగుచుండు. 531

క. బలసోదర! గీత్యుదితా,ర్యలు నా ల్గార్యాఖ్యగీతు • లాటవెలఁది తే
టులు రెండు సమము లెత్తుక, మలనాహ్వయ పవడలు విష•మంబులు మూఁడున్.

సమగీతి

క్షమఁ బథ్యాకందముచం,దమునన్ రెండరలు దెలియఁ • దనరింపన్
సమ మనుగీతి కృతులలోఁ, గమలాహృదయాబ్జ నిలయ • కమలాక్షా. 533

ఉద్గీతి

మొదలిసగము చపలగతిం, దుద నగము పథ్యగతిని • దొడరంగా
నిది యుద్గీతి యనం దగు, విదురాక్రూరాదివరద • వేణుధరా. 534

---

1. మేళగింప (సూ).

2. కరివరద పరమకృప • ధరణిధర సురవినుత కనకవసన నరహరి • గరుడగమన
నళినకరపదనయన•దళితఖరదనుజలయ నరసఖ పరగుణనిధి • శరధిశయన
పరమపదనిలయ హరి•పరమపురుష ప్రకృతికిఁ బరుఁడని నిను నిగమని•వహము పలుకు
నిరతమును హృదయమున•నినుఁ దలఁతు నను మనుపు మనియనఘచరిత జల•దనిభతనువ
తే. సర్వలఘుసీస మీరీతి•సకలసుకవి,వరులు చెప్పుదు రిలమీఁద•వరుస నెల్ల
వారు మెచ్చంగ సర్వేశ • వారిజాక్ష, కామెపల్లీశ యచ్యుత • కామజనక. 532
ఈపద్యము (పూ. ము.లో నున్నది. (గి). ఈపద్యము తమకు లభించిన ప్రతులలో లేమింజేసి నూతనముగ చేర్పఁబడియెనని సూర్యాలోకప్రతిలోఁ బరిష్కర్తలు పీఠికలోఁ దెలిపినారు (రా). 3. కెదురయి (ప). ౪. ఱ. ప్రాసయతి (రా). 4. ఉరుల (ప). 5. వరుషుఁడనుచు (ఓ). 6. ఈపాదమున యతిభంగమున్నది. (రా.)

### ఉపగీతి

ధరఁ జపలాకందము వై, ఖరి స్నగం బైనఁ • గావ్యములన్
బరఁగు నుపగీతి పూర్వా,మరవ్రజితమిత్ర • మార్తాండా. 535

### ఆర్యాగీతి

సముదీరితపథ్యాకం,దముకన్నను నొక్కగురువు • దాకించినచో
క్షమ నార్యాగీతి యగు, న్గమలాప్రాణేశ సహజ•కందం బదియే. 536

### సమగీతులందు నాటవెలఁది

మేలు మే లటంచు • మిత్రులు ముగ్గురు, వింత వింత యనుచు • విబుధు లిద్ద
అహహా యనుచు నూరు•లయిదుగురును మెచ్చ, నాటవెలఁది మూఁట•నలరు సగము.

### తేటగీతి

మిత్రుఁ డొక్కఁడు వీణియ•మీటుచుండ, విబుధవరు లిద్ద అర్థంబు•విప్పి చెప్ప
నినులు నిద్దఱు వినుచుండ•నేకగతిని, దేటగీతంబు మూటను • వాటమయ్యె. 538

### విషమగీతులందు నెత్తుగీతి

సురనాథుమీఁద•సూరు, లిరువురు రెంట•విరతి;
ధరణిఁ బ్రాసంబు • [1]దనరు, హరి యెత్తుగీతి•యందు. 539

### కమలనగీతి

హగణ మైనఁ జాలు నగణ•మైనఁ జాలు హగణ
నగణములును రెండు గలసి • నాటి యంఘ్రి కేడు
తగినవిరతి నాలుగింటఁ దనరఁ బ్రాస మొదవి
[2]మిగులఁ గమలనాఖ్యగీతి • మెఱయుచుండుఁ గృతుల. 540

### పవడగీతి

అవని ముగురుభాను • లాదిత్యపతు లిద్ద, అవల నేగు రర్క • లర్ధమునకుఁ
బవడగీతియందుఁ • బ్రాసముల్ సమకూఱ, నవియె యాటవెలఁది•యందు లేవు. 541

వ. ఇది నవగీతివివేకం బింత బిరుదావళిలక్షణం బెఱింగించెద. 542

తే. క్షితి మహారాష్ట్రభాషచేఁ•జెప్పఁబడెడు, భీకరోక్తులు బిరుదులై • పెక్కు దనరు
[3]వాటబిరుదావళియొనర్ప•పలయు నంధ్ర, బుధులు సంబుద్ధి పదములఁ•బొసఁగఁగూర్చి.

---

1. దనరు నెత్తుగీతియందు (పూ. ము.) ఛందోభంగము. 2. మిగుల మెఱయుచుండుఁ గృతులఁ గమలనాఖ్యగీతి (పూ. ము; సూ.) యతిభంగమున్నది గాన సవరింపఁబడినది (రా). 3. వాని (పూ. ము.) 'వాట' అని వ్రాఁతప్రతులలోని పాఠము తప్పని దిద్దినయెడల 'వాన' అనియుండవలెను (గి).

చ. అతిభుజవిక్రమోద్భవము • లై రిపుకర్ణకఠోరకంబులై
[1]యతులితవీరవాక్కు లయి • యాదిమపార్థివలాంఛనంబులై
ప్రతిపదనూతనంబు లయి • భాసిలుసూక్తులు గూర్చి స్వస్తివా
క్యతతులఁ జెప్ప నొప్పు బిరు•దావళి సార్వవిభక్తికంబుగాన్. 544

చ. సలలితవాక్యగుంభనల • సర్వవిభక్తుల [2]దీవనంబులన్
జెలువగు పద్య మొక్కటి ర•చించినపిమ్మట గాఢరీతి సం
కలితచతుష్కషట్కదళ•గద్యము లెన్మిదియుం బదాఱు నిం
పలరఁగఁ గూర్చి పేర్చి బిరు•దావళిఁ జెప్పఁగ నొప్పు నెంతయున్. 545

## చక్రవాళము

క. ఒకపద్యముపిదప దళా, ష్టకసందర్భాప్తగద్య • చతురం బగుఫ
క్కికిఁ బేరు చక్రవాళం, బకట చతుర్భద్ర మదియె•యచ్యుత మఱియున్. 546

క. తొలిసమసనాంత్యవర్ణ యుఁ, గళమే పునరుక్తిఁ గాఁగఁ • గైకొని సామీ
ప్యలసత్సమాసము మొదల, నలరించినఁ జక్రవాళ • మగు దాశార్హా. 547

తే. అవధరింపుము దేవ ది•వ్యప్రభావ, భావనాతీత నిస్తుల•[3]పరమపూత
పూతనాజైత్ర సుత్రామ•పుత్త్రమిత్ర, మిత్రశశినేత్ర నిర్జర•స్తోత్రపాత్ర. 548

## చిత్రకవిత్వము

సీ. అనులోమమును విలోమ•ము నిరోష్ఠ్యమును దల, కట్టును గుడులు శృంగములు నష్ట
రవిలోపమును బద•భ్రమకంబు పద్యభ్రమకమును నల్లెంట్లు • మఱియు నేక
పదియు ద్విపదియుఁ ద్రి•పదియును నేకవర్ణంబును ద్వ్యక్షరి • త్ర్యక్షరియును
సరవి నిచ్ఛావాక్య•సంఘట్టనంబును, నాదిగాఁ గొన్ని ప•ద్యంబు లెల్ల

తే. క్షితినిఁ జిత్రకవిత్వప్ర•సిద్ధనామ, ధేయములచేతఁ బెం పొంది • తెలివి మీఱు
[4]వానిఁ దెలియఁగ వచియింతు•వాసుదేవ, నందగోపాంగనాపుత్త్ర•నరకజైత్ర. 549

## అనులోమము

క. దామోదరసామతనధ, రామాసరసాకరదళ•రఘహారిరాధా
శామా సదయాతిపరమ, ధామా వరయాదవకుల•దారకరాసా. 550

## విలోమము

సారాకరదాలకువద, యారవమాధామరపతి•యాదసమాశా
ధారారిహాఘరళదకర, సారసమారాధనతమ•సారద మోదా. 551

---

1. యతులవిరుద్ధ (ప. ఓ.) 2. దీవనోక్తులన్ (ప. ఓ.) 3. పరమమూర్తి. (పూ. ము.) పునరుక్తి నియమభంగము. 4. వాఁటి యని తాటాకుపుస్తకములన్నిటను గలదు.

## నిరోష్ఠ్యము

క. పావన పాపాబాభా, మావా యనునాఱులిపులు ♦ మఱి పద్యములో
భావింప దొరలకుండిన, భూవలయమున న్నిరోష్ఠ్య♦ము పిసాళించున్. 552

క. నరహర్యక్ష దయాకర, కరిరక్షణ చక్రహస్త ♦ కాంచనచేలా
గరుడతురంగ జనార్దన, ఖరదైత్యనికృంతన హరి ♦ కంజదళాక్షా. 553

## తలకట్లు

క. హర కలశజ తపన పవన, శరభంగ మతంగ దక్ష ♦ సత్యావాసా
స్మరపదయుగ గరుడధ్వజ, [1]ధరధర మ్మరయు మనఁగఁ ♦ దలకట్టులగున్. 554

## గుడులు

క. విరివిని నిలిచిరి విని చిక్కిరి చివి నిశిఁ దిరిగిరి తిరి♦గి మిడికి భీతి
ల్లిరి చింతిల్లిరి తివిరిరి, సిరికొఱకు ధనాఢ్యు లనఁగ ♦ క్షితి గుడుసు లగున్. 555

## కొమ్ములు

క. గురుఁడును శుక్రుఁడు నుగ్రుఁడు
పురుహూతుండును శుకుండు ♦ బుధుఁడును గుహుఁడున్
బురుకుత్సుండును గుత్సుఁడు
గురునుతు లొనరించి రనఁగఁ ♦ గొమ్ములు కృష్ణా. 556

## అక్షరవిలోపము

క. రవికన్యాసుందరకర, మవలంబన మొర్చి యూఁచె ♦ నచ్యుతుఁ డనియే
నవవర్ణవిలోపముగా, నపనిం బఠియించు వలయు ♦ నార్యులు నలరన్. 557

## పదభ్రమకము

క. ధీరానానారాధీ, ధారాశరతా[2]తరరత ♦ తారకరాధా
ధారాసుతతసురాధా, ధారితతరిధావ నాఁ బదభ్రమక మగున్. 558

## పద్యభ్రమకము

క. రాధానాథా తరళిత, సాధకరథతాపరసుత♦నరసనిధానా
నాధానిసరసతసురవ, తాధరకధసాతళిరత♦ధానాధారా. 559

## నల్లెంట్లు

క. నారదమునిశార్దూలము, కూరిమి నజినంబు గప్పు♦కొని వేడుకతో
నారాయణవాసమున క్రనారత మేతెంచు ననఁగ ♦ నల్లెంటు లగున్. 560

---

1. దరధర (పాఠాంతరము). 2. తరళిత. (పూ. ము). పదభ్రమక నియతికి సరిపడమిచే సవరింపఁబడినవి (రా).

ఏకపాది

తే. మతివినాయకభరితస♦మ్మదుఁ డనంగ, మతివినాయకభరితస♦మ్మదుఁ డనంగ
మతివినాయకభరితస♦మ్మదుఁ డనంగ, మతివినాయకభరితస♦మ్మదుఁ డనంగ. 561

ద్విపద

తే. సౌమ్యగురుకవుల్ నినుఁ బ్రీతి ♦ సరసిజాక్ష
భోగిభోగాసనుం డని ♦ [1]పొలుచు టరుదె
సౌమ్యగురుకవుల్ నినుఁ బ్రీతి ♦ సరసిజాక్ష
భోగిభోగాసనుం డని ♦ పొగడ ద్విపద. 562

త్రిపద

తే. దేవమునివంద్య గోవింద ♦ దితిజహరణ
పుండరీకాక్ష యవ్యక్త ♦ పుణ్యపురుష
యమరసన్నుత గోపాల ♦ హరి ముకుంద
దేవ యవ్యక్త [2]హరియు నాఁ ♦ ద్రిపదయయ్యె. 563

ఏకాక్షరి

క. నానాననానున్నన, నూనను నిన్నెను నేను♦నున్ననినన్నై
నానీననునానానును, నానూన యనంగ నొంటి♦యక్షర మయ్యెన్. 564

ద్వ్యక్షరి

క. మునినామా మమ్మును మన,మున నూనిన నేమమునను ♦ మొనమానను న
న్మనుమని మననము మన్నన, ననుమానానామునిన య♦నంద్వ్యర్ణ మగున్. 565

త్ర్యక్షరి

క. మానితమతితో మమతను, నీనామము నేమమునను ♦ నేను మననమునన్
నూనమున మతము మానను, దానకముగఁ దలఁతు ననఁగఁ ♦ ద్ర్యక్షరి యయ్యెన్.

ఇచ్ఛావాక్యసంఘట్టనము

క. తోఁటలు తెన్నైన యున్నవి, తాఁటాదూటములు గావు ♦ తాపసు లుండన్
పేఁటలు దామోదరు,చెర్లాటలకు న్నెళవులు మధు♦రాపురిచెంతన్. 567

వ. ఈపద్యమునఁ దోఁట తాట పేఁట ఆట యనేమాట లర్థవంతముగాఁ గూర్చుటం
గనుక దీనిపేరు ఇచ్ఛావాక్యసంఘట్టనము. 568

---

1. పోల్చు (ధ్రా. ము. ఆని. 8; సూ.) పొగడున్ (Ed). 2. హరియనా (పాఠాంతరము).

## బంధకవిత్వము

సీ. గోమూత్రికాఛత్ర ♦ గుచ్ఛకుండలినాగ, కంకణమర్దల ♦ ఖడ్గచక్ర
పంకజసర్వతో ♦ భద్రమాలా[1]క్షురీ, ప్రముఖబంధంబు లే ♦ ర్పడఁగఁ జెప్పు
వృత్తము ల్బంధ కవిత్వవిశ్రుతము లై, కవులకుఁ జెవులపం ♦ డువులు సేయుఁ
బటుతరప్రౌఢిమఁ ♦ బండితపామర, సాధారణంబుగా ♦ జగతిలోన

తే. రాధికాకేళికాలోల ♦ రమ్యశీల, భూరిగుణసాంద్ర యదుకులాం ♦ భోధిచంద్ర
వల్లవీమానచోర దు ♦ ర్వారశూర, పరమవాచాల రాజగో ♦ పాలబాల. 569

తే. మొనసి యెద్దుచ్చ రేఖల ♦ మూలలందు
వలయు పద్యంబు నాలుగం ♦ ఘ్రులను వ్రాసి
చదివి రేనియు సుకవులు ♦ సమ్మదమున
ధాత్రి గోమూత్రికాఖ్యబం ♦ ధంబు దనరు. 570

### గోమూత్రికాబంధము




మాలిని. కనకనయనవైరీ ♦ కాదపాహారవాహా
వనజనయనశౌరీ ♦ వాదవాహారివాహా
వనధనదవిధిజ్ఞా ♦ పాదసంభూతగంగా
వినయనరవిధిజ్ఞా ♦ వేదసంభూతగంగా. 571




క. వితరణశూరదయార్ణవ, ధృతచక్రధరనరసింహ ♦ [2]ధృవశోధిమహా
వితరణధీరనయార్ణవ, జితనక్రపరతరగాహ ♦ జీవనధిగృహా. 572

1. క్షురీ (పూ. ము). 2. 'ధృవ' అను రూపము సాధువుగాదు. 'ధ్రువ' అని యుండవలెను, గాని యట్లైని యతిభంగ మేర్పడును. అప్పకవియే ధ్రువశబ్దములోనిది క్రారకొమ్మని స్పష్టపఱచియున్నాఁడు (చూ-2-66) 'ద్రుతచక్రధరనరసింహధ్రువ' అని సవరింపనగునని తోఁచెడి (రా.)



ఛత్రబంధము

క. పారదమదనకవసుధర
దారద సమసమసనానసధరమారీచా
చారీమారవరాకా
కారావరదారథసువకనదమదరపా. 573

గుచ్ఛబంధము



మాణవకవృత్తము:—

గాదిటితో మాలదిగా, గాదిలకించేట్ బదిగా
గాదిబకృష్ణం డదిగా, గాదిడవాచా లిదిగా. 574

## కుండలినాగబంధము

క. ఇలలో నెనుబదినాలుగు, నిలయంబు లగుం బయోద నిభనీలాంగా
మెలిగొన్న పామువలె వెలుపలగున్ దలతోఁక నాగబంధంబునకున్. 575



చ. ద్యుతిధర దేవకీతనయ తోయభవస్తుత భూరమేశ సం
మితగుణసారభూతిద యమేయబృహజ్జవపూరుషావనా
జితనరకా పురాతన యజేయసువిష్టరభారవాహ శా
శ్వతపురుహూత పీతదవపావక శస్త్రపురాణకోవిదా. 576

## కంకణబంధము



విద్యున్మాల:—

సేవేగోపాలం కేశిఘ్నం, గోవృద్ధ్యద్రిధృంకంశంభుం,
శ్రీదం భూనాథం పీనార్యం, కందాభాసం నీరాగారం. 577

## మర్దలబంధము



చిత్రపదము:—

రాజులు రాజశయానా, లాజలు చల్లినయానక్
భూజలు గావశవర్తిక్, రాజిలు రాజనవయ్యా. 578

## ఖడ్గబంధము

లక్షణము:—

క. చరణాంత్యవర్ణ మొక్కటి, చరణయుగాద్యంబుఁ జేసి • సరసులు ముష్టా
రిరుగడల మధ్య మొకటిగ, పరుజులఁ గదియింప ఖడ్గ•బంధం బొనరున్. 579



లక్ష్యములు:—

క. శమదమసమధిక-చిత్తా, విమలాంభోజారిహస్త•విష్టరకర్ణా
యమలార్జునతరుభంజన, కమలాధరణీసనాథ • కంధరవర్ణా. 580



క. ధనదసవీనకనత్కన, కనకాంబరవాసుదేవ • కరుణాపాంగా
శినివరద శుభకర దళత్కనకకశిపు పూర్వదేవ•కందనిభాంగా. 581



క. శూరవరద రఘువరముర, మారణ చాణూరకంస మధుపౌండ్రహరా
రారాజత్కనకాంబర, ఘోర గ్రాహారిరక్ష గోపీజారా. 582



క. శారదరసారమణదర, పారదరజనీశకీర్తి పావనచరితా
తారకరిపువినుతహరియ, పారదయార్ణవము కుంద భావజతాతా. 583



సుగంధి:—

కోరితీరి వారిజాక్షు • గోరఁజేరఁజేరవే
వేరుపడ్డదైత్యులోమ్ము • వేగిలించి లెస్సగా
గారవించి యతనిపుత్రుఁ • గాంచి వేడ్కఁ బ్రోవవే
వేరువేర నింగినిల్చి • వేల్పులెల్ల మ్రొక్కఁగా. 584

## చక్రబంధము

లక్షణము:—

సీ. వర్తులాకృతులుగా పదిగీటులు లిఖించి యాతలితరమధ్యమాలయమున
నంటంగఁ గడలెల్ల నాఱురేఖలు గీసి క్రిందిపందొమ్మిదో ఛందమునను
బ్రోదిపుట్టినవృత్త మేదైన మూఁడంఘ్రు లటువ్రాసి నడిమింటి నాదివర్ణ
మేది యయ్యెను నది యినుమారు రాఁజెప్పి మూట నాఱిట నామములరచించి
గీ. కడలు గలయంగ నాలవ • కాలువలికి, చక్రబంధస్వరూపంబు • సభ్యులెల్ల
వ్రాయఁదగుఁ గామెపల్లీశ • వారిజాక్ష, జమ్మికడనున్న గోపాల • చారుశీల. 585

## చక్రబంధము



లక్ష్యము:—

* శా. భద్రాకాముకసోమసూర్యనయనా । భ్రాజిష్ణుశౌర్యక్రమా
క్షుద్రాక్రుద్ధ విమర్శితాంగనతతా । స్తోకప్రసంపత్కరా
భద్రానూనజయావహావినయవా । గ్భావిష్కృతాయక్షమా
మాద్రీశా భవతక్షుకా శుభకరా । మాంగల్యరాసోద్యమా. 386

* ఇందు మూఁడవ వలయమున 'కాక్రుసూర్యపయ' అని ఆఱవ వలయమున 'సోమయాజికవి' అని కవిపేరు గూర్పఁబడినది. (రా)

అష్టదళపద్మబంధము



స్రగ్ధర. రాధాసక్తారసగ్రా•ప్రజకులతిలకా•త్రాతకృత్ప్రియధేరా
రాధేయత్ప్రికృతత్రా•ప్రవిమలసుగుణా•గ్రావవర్యాప్రధీరా
రాధీప్రర్యావవగ్రా•ప్రకటదనుజజై•త్రాపదప్రోత్థధూరా
రాధూత్థప్రోదపత్రా•ప్రరుచిరపృథుక•గ్రాసరక్తాసధారా. 587

## సర్వతోభద్రబంధము

| | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|
| వం | దే | స | దా | దా | స | దే | వం |
| దే | వ | రం | ప | ప | రం | వ | దే |
| స | రం | గ | కం | కం | గ | రం | స |
| దా | ప | కం | త | త | కం | ప | దా |
| దా | ప | కం | త | త | కం | ప | దా |
| స | రం | గ | కం | కం | గ | రం | స |
| దే | వ | రం | ప | ప | రం | వ | దే |
| వం | దే | స | దా | దా | స | దే | వం |

వందేసదా దాసదేవం, దేవరం పపరం వదే
సరంగకంకంగరంస, దాపకంతతకం పదా. 588

మాలికాబంధము 1



అనంత నందనందనా సనాతనా జనార్దనా
వనాటరత్నరక్షరమ్యనాగనాథనాశనా. 589

మాలికాబంధము 2



చ. ఖరహార ధీర దేవ కనక ప్రకటాంబర వీరసారదు
ర్ధరధరవార వేణురవరమ్య రమేశ మహామహామహీ
ధర గరహారసన్నుత కృతజ్ఞతశిష్టపరాపరాపరం
శరణ రజోరమావిశదశస్తశమాత్మక శ్రీకళాకరా. 590

క్షురికాబంధము




సర్వోజవృత్తము. చేసితౌసిరి సిల్లుచే
వాసివా దరిచేరిరా
రాసుతా దిని బోసిగా
గాసి బోనిదితాసురా. 591

షోడశదళచక్రము. *




సింహరేఖావృత్తము.
రామరాత్రీ రాగరాధా
రామరాణా రాకరానా
రామరాజీ రాచరాజా
రామరాజీరాపురాచఁ. 592

---

* ప్రతి చరణములో నాల్గవ అక్షరము దీర్ఘాంతముగానే ఉన్నదిగాని; అప్పకవిచెప్పిన లక్షణముప్రకారము హ్రస్వమై ఉండవలెను. (చూ. పుట. 224.)

వ. ఇది బంధకవిత్వం బిఁక గర్భకవిత్వంబు వివరించెద. 593

## గర్భకవిత్వము

సీ. గాంగేయకౌశేయ•ఘనకందగీతసద్గర్భచంపక మాలి•కయు వరిష్ఠ
కందపద్యద్వయ•కమలవిలసితరుగ్మవతికాగర్భిత•క్రౌంచపదము
గీతమత్తేభవి•క్రీడితాకందగర్భితసీసము నట మ•ద్వృత్తగర్భి
తోత్పలమాలిక•యును సుకల్పితకల్పవల్లియు సీసరూ•పద్విపదయు
స్రగ్విణీగర్భభు•జంగప్రయాతంబు కందగర్భితమణి•గణనికరము
[1]కలితచతుర్విధ•కందపద్యము నష్టవిధకందమును బంచ•విధసువృత్త
తే. మాదిగాఁ గలకొన్నిప•ద్యములు పెక్కు, సరవిఁ బద్యము లిమిడి దో•షములులేక
కాన వచ్చిన నవి యెల్ల • గర్భకవిత, ధరణి [2]నొప్పారు [3]సీరీతిఁ • దనరి కృష్ణ.

## కందగీతగర్భచంపకమాల

చ. నరహరి కేశవా వనజ•నాభ రమాధవ వంశహస్త బం
ధురసుగుణాకరా దురిత•దూర జనార్దన దోర్బలాఢ్య గీ
[4]ర్వరగిరిశస్తుతా మురహ•రా సురపూజితముఖ్యపాద సుం
దరపురుషాగ్రణీ భుజగ•తల్ప శచీపతిపుత్త్రరక్షణా. 595
వ. ఇది భాషాపరిచ్ఛేదములో తెలియవ్రాసినది. 596

## కందద్వయకమలవిలసితరుగ్మవతీగర్భక్రౌంచపదము

ద్వారవతీనా•థా సదుదారా • తరుణధవళకర • ధరనుతనామా
మారమణీధా•మా సుకుమారా • మరుదధిపతిరిపు•మదగిరిశంబా
సారసనేత్రా • సత్యవిచారా • శరరుహభవముఖ•సకలసురేశా
శూరకులా తే•జోజితసూరా • సురవరమణినిభ•సురుచిరదేహా. 597
వ. ఇది వర్ణపరిచ్ఛేదములో తెలియవ్రాసినాము. 598

## మత్తేభవిక్రీడితగీతకందగర్భసీసము

వినయసంపన్నర•విప్రభూతరమణీ, నాథా పయోజేక్ష•ణా నరాప్త
విభయదాకార హ•విర్భుగాయతరిపు, ప్రాణానిలాహీశ్వ•రా రమేశ
విలయకాలానల•విశ్రమప్రథిత సా,ల్వగ్రావవృద్ధశ్ర•వా వరేణ్య
విజయశీలా యదు•వీర కౌస్తుభధరా, చక్రీ యశోదాత్మజా ముకుంద
తే. కరివరద పూతనాంతక • గరుడగమన, సత్వసహిత కామజనక • శంకరసఖ
కనకవసన సుందరదేహ • వనధిశయన, సనకమునివినుత చరణ•సరసిజయుగ. 599
వ. ఇది వళిప్రాసపరిచ్ఛేదములో తెలియవ్రాసినాము. 600

---

1. కనలు (ఓ). 2. నొప్పారసీరీతిఁ దనరుఁగృష్ణ (సూ). 3. విఖ్యాతి (ఓ).
4. ర్ధర (ప).

వాణీపద్మాంబారతీదరధ్వనితాళమధుర గర్భోత్పలమాలికావృత్తము.

ఉ. శారదశాసితప్రసవ•చాపవిఖండన సామసన్నుతా
తారణదాసపోషధవ • తాపసమండన ధర్మతత్పరా
వారణభాసురప్రభవ•ప్రాపకఖండన వాసవానుజా
పారద వాసుదేవ భవ•పాపవిదండన భర్గపూజితా. 601

వ. ఇది యీ పద్యపరిచ్ఛేదముతుదను తెలియవ్రాయుచున్నాము. 602

కల్పితకల్పవల్లీప్రహారణకలిత

కరధృతకరుహం • కరిహితకరణం, కరుహాసఖరుచిం • గరుడఖగరథమ్
ఖరఘనకరవిం • ఖరతరకరగం, గరళముఖరిపుం • గరధరకరతమ్. 603

వ. ఇది సంధిపరిచ్ఛేదములో తెలియవ్రాయుచున్నాము. 604

మఱిన్ని కల్పితకల్పవల్లీ భాస్కరవిలసితము

అక్షరహారివిక•చాంబురుహాక్షా, యక్షపసఖనుత • యదుకులదక్షా
రక్షకసురవిదు•రద్విపరక్షా, రాక్షసవిదళన • ప్రరుచిరవక్షా
పక్షగపతిరథ • పౌండ్రవిపక్షా, భక్షితదవశిఖి • బహుసవదీక్షా
వృక్షగసహచర • ఋక్షసదృక్షా, ఋక్షపదుహితృప • ఋషిజనపక్షా. 605

గర్భప్రథమకందము

అక్షరహారివికచాంబురు,హాక్షా యక్షపసఖనుత • యదుకులదక్షా
రక్షకసురవిదురద్విప,రక్షా రాక్షసవిదళన • ప్రరుచిరవక్షా. 606

గర్భద్వితీయకందము

పక్షగపతిరథ పౌండ్రవి,పక్షా భక్షితదవశిఖి • బహుసవదీక్షా
వృక్షగసహచర ఋక్షస,దృక్షా ఋక్షపదుహితృప • ఋషిజనపక్షా. 607

గర్భద్విపద

అక్షరహారివిక • చాంబురుహాక్ష, యక్షపసఖనుత • యదుకులదక్ష
రక్షకసురవిదు•రద్విపరక్ష, రాక్షసవిదళన • ప్రరుచిరవక్ష
పక్షగపతిరథ•పౌండ్రవిపక్ష, భక్షితదవశిఖి • బహుసవదీక్ష
వృక్షగసహచర • ఋక్షసదృక్ష, ఋక్షపదుహితృప • ఋషిజనపక్ష. 608

లాలిపాట

అక్షరహారివిక•చాంబురుహాక్షా, యక్షపసఖనుత • యదుకులదక్షా
రక్షకసురవిదు•రద్విపరక్షా, రాక్షసవిదళన • ప్రరుచిరవక్షా. లాలి.

పక్షగపతిరథ ♦ పౌండ్రవిపక్షా, భక్షితదవశిఖి ♦ బహుసవదీక్షా
వృక్షగసహచర ♦ ఋక్షసదృక్షా, ఋక్షపదుహితృప ♦ ఋషిజనపక్షా. లాలి. 609

### పెండ్లిపాట

అక్షరహరివిక ♦ చాంబురుహాక్షా, యక్షపసఖునుత ♦ యదుకులదక్షా
రక్షకసురవిదు ♦ రద్విపరక్షా, రాక్షసవిదళన ♦ ప్రరుచిరవక్షా. [1]గౌరీకల్యాణవైభవమే.
పక్షగపతిరథ ♦ పౌండ్రవిపక్షా, భక్షితదవశిఖి ♦ బహుసవదీక్షా
వృక్షగసఋచర ♦ పాక్షసదృక్షా, ఋక్షపదుహితృప ♦ ఋషిజనపక్షా. గౌరీకల్యాణ
[వైభవమే. 610

### [2]ధవళము

అక్షరహరివికచాంబురు ♦ హాక్షా యక్షపసఖు
రక్షకసురవిదురద్విప ♦ రక్షా రాక్షసవిదళన
పక్షగపతిరథ పౌండ్రవి ♦ పక్షా భక్షితదవశిఖి
వృక్షగసహచర ఋక్షస ♦ దృక్షా ఋక్షపదుహితృప. 611

### [3]సువ్వాలే

అక్షరహరివిక ♦ చాంబురుహాక్షా, యక్షపసఖునుత ♦ యదుకులదక్షా
రక్షకసురవిదు ♦ రద్విపరక్షా, రాక్షసవిదళన, ప్రరుచిరవక్షా. సువ్వీ సువ్వాలలే. ౧
పక్షగపతిరథ ♦ పౌండ్రవిపక్షా, భక్షితదవశిఖి ♦ బహుసవదీక్షా
వృక్షగసహచర ♦ ఋక్షసదృక్షా, ఋక్షపదుహితృప ♦ ఋషిజనపక్షా. సువ్వీ సువ్వాలలే.

### అర్థచంద్రికలు

అక్షరహరివిక ♦ చాంబురుహాక్షున్. ౧
యక్షపసఖునుత ♦ యదుకులదక్షున్. ౨
రక్షకసురవిదు ♦ రద్విపరక్షున్. ౩
రాక్షసవిదళన ♦ ప్రరుచిరవక్షున్. ౪
పక్షగపతిరథ ♦ పౌండ్రవిపక్షున్. ౫
భక్షితదవశిఖి ♦ బహుసవదీక్షున్. ౬
వృక్షగసహచర ♦ ఋక్షసదృక్షున్. ౭
ఋక్షపదుహితృప ♦ ఋషిజనపక్షున్. ౮

---

1. 'గౌరీకల్యాణావైభవమే' అని (ఓ. ప.) లలో వ్రాసి ఉన్నది. లక్ష్మీకల్యాణ వైభవమే (సూ). 2. శ్రీధవళము (సూ). 3. సువాల (పూ. ము.)

## [1]కందగర్భసీసరూపద్విపద

మకరకుండలకర్ణ • మహితాభ్రవర్ణ శకటదానవవిపక్ష • కమలజాక్ష
శుభికాలసత్ఫాల • సుయశోవిశాల యభిరమతస్నిగ్ధయా•పీతదుగ్ధ
శ్రితదేవతరుమూల • చేదీశకాల ధృతమణిధరగదారి • తపతికథిత
నివసితవైకుంఠ • నియతాబ్జకంఠ రవికళాదశుభనేత్ర • విజయమిత్ర
తే. సతతసనకాదిసన్నుత • చతురచరిత, యాదవకుల సత్యనిరత • యచ్యుత మధు
విదళన హరిశాశ్వతకృష్ణ•విదురవరద, భవవిరించినుతా యంచుఁ • బ్రస్తుతింప. 614

## గర్భద్విపద

మకరకుండలకర్ణ • మహితాభ్రవర్ణ
శకటదానవవిప•క్షకమలజాక్ష
శుభికాలసత్ఫాల • సుయశోవిశాల
యభిరమతస్నిగ్ధ • యాపీతదుగ్ధ
శ్రితదేవతరుమూల • చేదీశకాల
ధృతమణిదరగదా•రితపతికథిత
నివసితవైకుంఠ • నియతాబ్జకంఠ
రవికళాదశుభనే•త్ర విజయమిత్ర. 615

## గర్భకందము

సతతసనకాదిసన్నుత, చతురచరిత యాదవకుల • సత్యనిరత య
చ్యుత మధుర దళన హరి శా•శ్వత కృష్ణ విదురవరద భ•వవిరించినుతా. 616

## *స్రగ్విణీగర్భభుజంగప్రయాతము

నమో దాశకా వేణు • నాదప్రవీణో, ద్యమా యాశుషేణా మ•హాయావనారీ
రమాధీశ దామోద•రా దేవదేవో, త్తమా భేశమిత్రాక్ష • [2]తార్క్ష్యానుయాయీ. 617

## గర్భస్రగ్విణీవృత్తము

దాశకా వేణునా•దప్రవీణోద్యమా, యాశుషేణామహా•యావనారీరమా
ధీశ దామోదరా • దేవదేవోత్తమా, భేశమిత్రాక్ష తా•ర్క్ష్యానుయాయీ. 618

---

1. కందగర్భద్విపదరూపసీసము (ఓ). కందద్విపదగర్భసీసము (సూ). *ఇందు నాలవపాదములోని 'తార్క్ష్యానుయాయీ' అను పాఠము భుజంగప్రయాతమునకు సరిపోవును గాని గర్భస్రగ్విణికి సరిపడదు. ఈపాఠమే సూ. ప్రతిలోఁ గలదు. 'ఇంద్రానుజాతే' అను పూ. ము. పాఠము స్రగ్విణీభుజంగప్రయాతములు రెంటికిని సరిపడదు. 'దైత్యేంద్రశిక్షా'-అని సవరించిన నుభయత్ర యతికి సరిపడును (రా). 2. యింద్రానుజాతే (పూ. ము.) ఇందును యతిభంగము. ఇది (ప. ఓ.) లలోని పాఠము.

కందగర్భమణిగణనికరము

కరధృతజలజునిఁ • గరిపతివరదుఁ, వరతనురుచిజిత • వనదునిఁ బరముఁ
బరివృఢుఁ గొలిచెదఁ • బరపదశరణుఁ, శరవణభవనుత చరితునిఁ గరుణన్. 619

*గర్భకందము

కరధృతజలజునిఁ గరిపతి, వరదుఁ వరతనురుచిజిత • వనదునిఁ బరముఁ
బరివృఢుఁ గొలిచెదఁ బరపద, శరణు న్శరవణభవనుత•చరితునిఁ గరుణన్. 620

చతుర్విధకందము

రెండవచరణంబునకు, న్రెండవగణ మాది గాఁగ • నిర్మించినచో
దండిఁ జతుర్విధకందము, పాండవపక్షా తెలుంగుఁ•బ్రాజ్ఞులసభలన్. 621

బలులేమిచేత వేసరు, చెలికిం జిపిటంబు లీయఁ • జేకొని కృపతోఁ
గలి మిచ్చినావు కేరుచు, నెలమిం గృప జేంగితజ్ఞ•హితవుగ విపులన్. 622

గర్భద్వితీయకందము

చిపిటంబు లీయఁ జేకొని, కృపతోఁ గలి మిచ్చినావు • కేరుచు నెలమిం
గృపజేంగితజ్ఞహితవుగ, విపులం బలులేమిచేత • వేసరుచెలికిన్. 623

గర్భతృతీయకందము

కలి మిచ్చినావు కేరుచు, నెలమిం గృప జేంగితజ్ఞ•హితవుగ విపులఁ
బలులేమిచేత వేసరు, చెలికిం జిపిటంబు లీయఁ • జేకొని కృపతోన్. 624

గర్భచతుర్థకందము

కృప జేంగితజ్ఞహితవుగ, విపులఁ బలులేమిచేత • వేసరుచెలికిం
జిపిటంబు లీయఁ జేకొని, కృపతోఁ గలి మిచ్చినావు • కేరుచు నెలమిన్. 625

మాలికాచతుర్విధకందము

తరతరము వర్ణ మాదిగ, దొరలించిన మాలికాచ•తుర్విధకందం
బరుదారును సత్కృతులం, దురగాధిపనవ్యతల్ప • యుదధిశయానా. 626

క. శ్రీభూమీన వరద హరి, గోభూమానవవినుత సు•గుణబుధ మధునా
శా భీమా నవకృష్ణను, నాభా మానసహరి దరి • యభవకమలనా. 627

---

*ఇందు మఱి మూఁడు కందములు గర్భితములు. పరివృఢుఁ గొలిచెద... వరతనురుచి...... శరవణభవనుత...అని మొదలిడి చదువవలెను. ఇది చతుర్విధ కందగర్భమగును (రా.)

## గర్భద్వితీయకందము

భూమీన వరదహరి గో, భూమానవవినుత సుగుణ ♦ బుధ మధునాశా
భీమా నవకృష్ణఘనా, భౌమానవహరి దరి యభ♦వకమలనాశ్రీ. 628

## గర్భతృతీయకందము

మీనవరద హరిగోభూ, మానవవినుత సుగుణబుధ ♦ మధునాశా భీ
మా నవకృష్ణఘనాభా, మానవహరిదరియభవక ♦ మలనాశ్రీభూ. 629

## గర్భచతుర్థకందము

నవరద హరిగోభూమా, నవవినుత సుగుణబుధమధు♦నాశా భీమా
నవకృష్ణఘనాభామా, నవహరిదరియభవకమల ♦ నాశ్రీభూమీ. 630

## అష్టవిధకందము

రెండేసి గణంబులపై, నుండినగణ మాది గాఁగ ♦ నొనరఁగఁ జదువన్
ఖండితసౌంభకఘోటకి, తాండజ యష్టవిధకంద ♦ మనఁగాఁ బరఁగున్. 631

## ప్రథమకందము

తన కిరుగెలనను కనలుచుఁ, గొనబయి గిలిపెడుకనుగొలు♦కులఁ దగుఁ బెలుచ
న్ఘనులను గలయం బెనఁకువఁ, గనుచుం గలుములఁ దనిపెను♦ఖలశృంఖల మై. 632

## ద్వితీయకందము

కనలుచుఁ గొనబయి గిలిపెడు, కనుగొలుకులఁ దగుఁ బెలుచను ♦ ఘనులను గలయం
బెనఁకువఁ గనుచుం గలుములఁ, దనిపెను ఖలశృంఖల మయి ♦ తన కిరుగెలనన్.

## తృతీయకందము

గిలిపెడుకనుగొలుకులఁ దగుఁ, బెలుచ న్ఘనులను గలయను ♦ బెనఁకువఁ గనుచున్
గలుములఁ దనిపెను ఖలశృం,ఖల మయి తన కిరుగెలనను ♦ గనలుచుఁ గొన బై.

## చతుర్థకందము

కులఁదగు బెలుచ న్ఘనులను, గలయం బెనఁకువఁ గనుచును ♦ గలుములఁ దనిపెన్
ఖలశృంఖలమయి తనకిరు, గెలనను కనలుచు గొనబయి ♦ గిలిపెడుకనుకొల్. 635

## పంచమకందము

ఘనులను గలయం బెనఁకువఁ, గనుచుం గలుములఁ దనిపెను ♦ ఖలశృంఖల మై
తన కిరుగెలనను గనలుచుఁ, గొన బయి గిలిపెడు కనుకొలఁ♦కులఁ దగుఁ బెలుచన్.

### షష్ఠకందము

పెనఁకువఁ గనుచుం గలుములఁ, దనిపెను ఖలశృంఖల మయి । తన కిరుగెలనన్
గనలుచుఁ గొనఁబయి గిలిపెడు, కనుగొలుకులఁ దగుఁ బెలుచను।ఘనులనుగలయన్.

### సప్తమకందము

కలుములఁ దనిపెను ఖలశృం, ఖలమయి తన కిరుగెలనను । గనలుచుఁ గొన బై
గిలిపెడుకనుకొలుకులఁ దగుఁ, బెలుచ న్ఘనులను గలయను । బెనఁకువఁ గనుచున్.

### అష్టమకందము

ఖలశృంఖల మయి తన కిరు, గెలనను గనలుచుఁ గొన బయి । గిలిపెడుకనుగొ
లుకులఁ దగుఁ బెలుచ న్ఘనులను, గలయం బెనఁకువఁగనుచును।గలుములఁదనిపెన్.

### కందద్వయనీలోత్పలమాలామణిగణనికరగర్భసరసిజవృత్తము

శ్రీవర్ధిష్ణుం బావనజీవు । న్జితభృగుతనయుని । సిరి గలుగుటకై
భావింతు న్సంభావితభావుం । బ్రతియుఁగ సముదిత।బహుతనుమహితున్
దేవేంద్రాదిప్రస్తుతదేవు । న్దితితనయతుహిన।దినకరకిరణున్
ధీవిద్యాద్యోతు న్వసుదేవు । న్ధృతిమదగుణయుతుఁ । దృణితవిదురదున్. 640

### గర్భప్రథమకందము

శ్రీవర్ధిష్ణుం బావన, జీవు న్జితభృగుతనయుని । సిరి గలుగుట కై
భావింతు న్సంభావిత, భావుం బ్రతియుఁగసముదిత।బహుతనుమహితున్. 641

### గర్భద్వితీయకందము

దేవేంద్రాదిప్రస్తుత, దేవు న్దితితనయతుహిన।దినకరకిరణున్
ధీవిద్యాద్యోతు న్వసు, దేవు న్ధృతిమదగుణయుతుఁ । దృణితవిదురదున్. 642

### గర్భనీలోత్పలమాల

శ్రీవర్ధిష్ణుం బావనజీవున్, భావింతు న్సంభావితభావున్
దేవేంద్రాదిప్రస్తుతదేవున్, ధీవిద్యాద్యోతు న్వసుదేవున్. 643

### గర్భమణిగణనికరము

జితభృగుతనయుని । సిరిగలుగుటకై, ప్రతియుఁగసముదిత।బహుతనుమహితున్
దితితనయతుహిన।దినకరకిరణున్, ధృతిమదగుణయుతుఁ। దృణితవిదురదున్. 644

వాణీపద్మాంబారతీదరధ్వనితాళమధురగతిగర్భోత్పలమాలికా వృత్తము

శారదశాసితప్రసవ • చాపవిఖండన సామసన్నుతా
తారణదాసపోషధవ • తాపసమండన ధర్మతత్పరా
వారణభాసురప్రభవ • ప్రాపకభండన వాసవానుజా
పారదవాసుదేవభవ • పాపవిదండన భర్గపూజితా. 645

గర్భవాణీవృత్తము

శాసితప్రసవ • చాపవిఖండన • సామసన్నుతా
దాసపోషధవ • తాపసమండన • ధర్మతత్పరా
భాసురప్రభవ • ప్రాపకభండన • వాసవానుజా
వాసుదేవభవ • పాపవిదండన • భర్గపూజితా. 646

గర్భపద్మావృత్తము

సవచాపవిఖండన • సామసన్నుతా, ధవతాపసమండన • ధర్మతత్పరా
భవప్రాపకభండన • వాసవానుజా, భవపాపవిదండన • భర్గపూజితా. 647

గర్భాంబావృత్తము

చాపవిఖండన • సామసన్నుతా, తాపసమండన • ధర్మతత్పరా
ప్రాపకభండన • వాసవానుజా, పాపవిదండన • భర్గపూజితా. 648

గర్భగతీవృత్తము

ఖండనసామసన్నుతా, మండనధర్మతత్పరా
భండనవాసవానుజా, దండన భర్గపూజితా. 649

గర్భదరధ్వనితాళము

శాసితప్రసవ • దాసపోషధవ
భాసురప్రభవ • వాసుదేవభవ. 650

గర్భమధురగతిరగడ

శాసితప్రసవ • చాపవిఖండన, దాసపోషధవ • తాపసమండన
భాసురప్రభవ • ప్రాపకభండన, వాసుదేవభవ • పాపవిదండన. 651

ఆశ్వాసాంతగద్యము

ఇది శ్రీమదాపస్తంభసూత్ర భారద్వాజగోత్ర కామెపల్లిపురమందిర నందనందనచరణారవిందవందనాభిలాష మనీషాప్రాభవ వేంగళార్యతనూభవ విద్యావిశేషసురాచార్య కాకునూర్యప్పకవివర్యవిరచితంబైన యాంధ్రశబ్దచింతామణియనువ్యాకరణశాస్త్రంబు

నందు మూలసూత్రంబులును, ఛందఃప్రభావంబును, ఛందోవ్యాపక[1]సంప్రదాయంబును, ఛందస్స్వరూపంబును, నితిహాసాదిస్వరూపంబును, గద్యవచనంబులును, ప్రస్తారప్రత్యయోద్ధారణక్రమంబును, గణజననచ్ఛందంబులును, గురులఘువర్ణనిర్ణయంబును, సర్వగణలక్ష్యంబులును, గణాధిదేవతాఫలంబులును, అష్టగణలక్షణంబులును, దేవతానరాంకితనియమంబులును, నాయకగణకూటంబులును, గృత్యాదిగణద్వయకూటంబులును, ప్రశస్తకూటంబులును, దోషాదోషబాహుళ్యఫలంబులును, గణద్వయయోగఫలంబులును, గణనాథయోగఫలంబులును, షట్ప్రత్యయంబులును, బద్యలక్ష్యోపయోగిసంజ్ఞలును, షడ్వింశతిచ్ఛందోజాతసమవృత్తంబులును, ముఖ్యగౌణవృత్తంబులును, మాలికావృత్తవివేకంబును, జాత్యుపజాతులును, జిత్రబంధగర్భకవిత్వంబును గల పద్యపరిచ్ఛేదంబను చతుర్థాశ్వాసము సంపూర్ణము.

---

1. సాంప్రదాయకంబును (ప).

# సంధిపరిచ్ఛేదము

## పంచమాశ్వాసము



కృష్ణాపూర్వతట
ప్రాకారప్రాంతకుతలపరిశోభితవ
జ్రాకరకేతవరనగర
నాకారివిదిక్త్రియోజనస్థితభవనా. 1

క. అవధారు శబ్దశాసనుఁ, డవనిఁ గలియుగమున కాది నా రాజమహేం
ద్రవరంబునఁ జెప్పిన యం, ధ్రవచోవ్యాకరణసూత్రతతిఁ దెనుఁగింతున్. 2

ఆ. ఆంధ్రసంధు లెల్ల నష్టాదశార్యల, సుకవు లా నటించుఁ జోద్య మంద
ఛత్రితాద్రినాథ శబ్దానుశాసనుఁ, డవనిఁ దేటపఱిచె నతిముదమున. 3

### సంధిపరిచ్ఛేదము

మూ. సూ. తిఙ్ధ్య శేషషష్ఠీ సుప్కర్మప్రవచనీయజవిభక్తిః,
కిఞ్చిత్ప్రశంసనాద్భుతసన్తాపయదాతదాకిమేవాంశ్చ. 1
క్త్వాకిలతూష్ణీమాద్యా నభిదధతి కలా ద్రుతో న యేషాం స్యాత్,
అన్యే ద్రుతప్రకృతయో యే స్యుర్హ్యనుజీవితద్రుతా నిత్యమ్. 2
సర్వత్రాజ్వ త్కార్యం జ్ఞేయం యస్య ద్రుతప్రకృతికేభ్యః,
లుక్సంశ్లేషా నాచి ద్రుతస్య సర్వత్ర లుక్సమాసేషు. 3
సన్ధి ర్నాచోఽచ్యనుచో వాఽచోఽనాదిషు విభక్తిషూతో వా,
నిత్య మనుత్తమపురుషక్రియా స్వితగ పరిమితా సమస్తానామ్. 4
న స్యాత్తద్ధర్మోత శ్చే ర్వాస్యా ద్వర్తమానవిహితస్య,
తద్వత్తదాదిజస్య ప్రాయ స్తు స్యాత్క్వమాదిక స్యైతః. 5
*అపిశబ్దేతో లుగ్వా స్యా దిచ్చ విభక్త్యన్తిమస్య జే రలిచ,
శబ్దాత్తచ్ఛబ్దాతో లు గ్ధార్థే త ఉదపి రేఫ స్స్యాత్. 6
సామానాధికరణ్యే షూదన్తానాం టుగాగమోఽచి స్యాత్,

* ఈ శ్లోకముల క్రమము బాలసరస్వతీయాహోబలపండితీయములలో మార్పు చెంది యున్నది. ఇట్టి వింకను గలవు (రా).

ధాతుపదసమ్భవానాం విశేషణానాముత స్తథా నుమచి. 7
షష్ఠ్యా ఉతోఽచి నుమ్నేచాద్య స్యామ్రేడితేఽన్త్యలోపశ్చ,
అహమాదీనాం ద్విత్వం లోపో నమ ఆదికే విసర్గస్య. 8
బో రద్భుతశబ్దార్థే షో శ్చ తదాద్యర్థవాచకే షూతః,
వికృతిపదే లౌటో రప్యుపధారే శ్చా విత శ్చ లు గ్వా స్యాత్. 9
పదమధ్యనరలడానా ముత శ్చ పూర్వప్రయోగసిద్ధానామ్,
లోపో వా స్యా త్తేషా మిత శ్చ తద్వ త్త్రివిక్రమమతేన. 10
కవిభల్లటైగ క్రియాణాం నామ్నాముల్లోప ఇష్యతే హ్యేషు,
ప్రథమైకవచనమాత్రే వికృతౌ నాన్తాదయోఽపి కథ్యన్తే. 11
ఔపవిభక్తికసంజ్ఞా వర్ణా ష్టింట్యాదయో భవ న్తీహ,
రల్యాదే ర్నామ్నాం స్యు స్తేహి విభక్తౌ సమాసే చ. 12
ప్రథమా వైభక్తికమో ర్లుక్ పూర్ణో వా పతిక్రియార్థేతు,
తస్య సమాసే పుంపూ ను మ్భాతో హల్యథర్వణార్యమతాత్. 13
శత్రర్థే తూత శ్చా నో స్తస్య స్యా చ్చ పూర్ణబిన్దు రపి,
వాత్త్వాస్తదో ర్ద్రుతస్య స్యాల్లు గ్వా క్వా న్తగతపదానాం చ. 14
పరుషా ద్ద్రుతప్రకృతికా త్సరళా స్స్యు స్తద్ద్రుతం చ బిన్దుస్స్యాత్,
అవికారగతే తస్మి న్నపి సరళా ఏవ స న్తి తే పరతః. 15
లుగ్వా న ప్రకృతిపదా త్పరత స్సరళే స్థిరే చ నస్య స్యాత్,
అలుకి చ సంశ్లేష స్స్యా ద్బిన్దుం ప్రవద న్తి తం క్వచి త్కేఽచిత్. 16
ప్రథమ లుగపి ద్వినులో ర్ద్రుతస్య సర్వత్ర లు క్సమాసేషు,
హేమో త్తేగ పరుషాణాం గసడదవా స్యుః పదాద్వన్ద్వే. 17
గసడదవా స్స్యుః ప్రథమామాత్రా దాత్త్వాస్తదో ర్వినా పరుషాః,
న వికృతిశబ్దా త్పరత స్సంస్కృతికానాం భవ న్తి గసడదవాః. 18

ఇతి సకలభాషావాగనుశాసన నన్నయభట్టవిరచితాన్ధ్రశబ్దచిన్తామణౌ
సన్ధిపరిచ్ఛేద స్తృతీయః.

వ. ఈ శ్లోకంబులు పదునెనిమిదియును నలువదియెనిమిది సూత్రము లయ్యె నవి యెల్ల నిందు వివరించెద.

తే. హేమచంద్ర త్రివిక్రమ♦నామ లాదిఁ
బ్రాకృతము త్రోవఁ జూపి రా♦ ప్రాకృతంబు
నందు భేదంబుగావున ♦ నాంధ్రమునకుఁ
గలుగు లక్షణ మెఱుఁగఁగ ♦ వలయుఁ గవులు. 5

ఆ. తెలుఁగుబాస యొంత ♦ దెలిసి యుండిన దీనిఁ, జదువకున్నఁ గవిత ♦ చక్కఁగాదు
ఇంటిలోన హేమ ♦ మెంత గల్గిన నేమి, తొడవు సేయకున్నఁ ♦ దొడుగ రాదు.

క. పదసంధులు చెడ నడికినఁ, బదపద్యము లార్యసభలఁ ♦ బరువడి హాస్యా
స్పదము లగుఁ గాన వైకృత, పదసంధివిధములు తేట♦పఱిచెద వరుసన్. 7

క. [1]వసుధ విసంధియును మహా, విసంధియుఁ గుసంధిదోష♦విధమును దుస్సం
ధిసమాఖ్యయు నను నాల్గును, బొసఁగింపరు సంధిదోష♦ము లటంచుఁ గవుల్. 8

తే. హరి ముసలికిని అనుజుండు ♦ అర్జునునకుఁ
జెలి యనుచు నిట్లు గుడుసుపై ♦ శృంగముపయి
స్వరములకు సంధి గలుగక ♦ సాగనేని
దానిని విసంధి యండ్రు స♦త్కవులు కృష్ణ. 9

తే. సాల్వభూమివరుఁ [2]అండ♦జధ్వజుండు
ధరణిఁ గూల్చె సురల్ [3]అద్భుత♦ంబు నొంద
ననుచుఁ బొల్లులవలపల ♦ నచ్చు లున్న
జరుగును మహావిసంధిదో♦షం బనంగ. 10

తే. మగు వొకతె సారెతెలనాకు ♦ మడుపు లీయఁ
బోలఁ తొకతె తెల్లసవరంబుఁ బూని విసరఁ
జే డొకతె చక్రితో నెత్త ♦ మాడె ననఁ గు
సంధి యగు నిట్లు కలయని♦సంధు లదుక. 11

క. ఎందును దుస్సంధిసమా,ఖ్యం దిర మగు నందు నిందు ♦ ననుచో నందు
న్నిందు న్నని పై నచ్చులు, పొంద సముచ్చయనకార♦ములు కృతి నూఁదన్. 12

తే. తొలుత నీ సంధిదోష చ♦తుష్టయంబు, చెంద కుండఁగఁ గావ్యము♦ల్చెప్పవలయుఁ
గానఁ దెలియంగ సంధిల♦క్షణము లెల్ల, విన్నవించెద గోపాల ♦ విమలశీల. 13

క. వుడుములు ప్రథమైకో♦క్తికిఁ, గడఁ గూర్చిన యది విభక్తి♦కం బనఁబడుఁ బా
ల్పడి యవి చెందని నుడు గెప్పుడు నవిభక్తికము నామ♦మును ననఁబరఁగున్. 14

---

1. ఎసఁగ (సూ). 2. "వరున్నండజ" (పాఠాంతరము.) వరుఁ యండ (పూ. ము.) ఇట్లు యడాగమముతో నిల్పుట సరికాదు. ఇదియు సరికాదు. (రా). 3. సురల్ యద్భుత (పూ. ము.)

క. తరు వన హరుఁ డనఁ బుర మనఁ, బరఁగ నివి విభక్తికములు • బరువు [1]పురుడు సుం
దరి దుర మనునివి యెల్లను, నరసఖ యవిభక్తికములు • నామములు నగున్. 15

ఆ. [2]వెనుక నున్న పదము • కొనయక్షరంబుతోఁ, బైపదంబు మొదలి • ప్రాణమునకు
సూత్రమునను సంధి • చొప్పడకున్న న, ప్పట్లు బుధులు ప్రకృతి • భావ మంద్రు. 16

క. తొలఁగి చనుఁ దొలఁగ కుండును, గలుగును లే కుండు నౌను • గా కుండును ని
చ్చలు వచ్చును రాకుండును, జెలువార వికల్ప మనుచుఁ • జెప్పెడుచోటన్. 17

క. మొదలను జెప్పిన విధమున, కొదవు వికల్పంబు లేక • యొక్క తెఱఁగునన్
బదపడి నిలిచినదానిని, యదుగోత్రపవిత్ర నిత్య • మందురు ధీరుల్. 18

తే. పుడమిఁ దొల్లింటిరాజుల • వెడల నొత్తి, వారి[3]నెలవులఁ దా ముండు • వైరినృపుల
పగిది మునుపున్న వ్రాలను • బాఱఁ దోలి, తా మచట నిల్చు నాదేశ • నామకములు.

తే. వెండికొండను నెలకొన్న • వేల్పుజేని, చెంత నత్యంతమైత్రిమైఁ • జేరి యుండు
యక్షుగతి శబ్దమునఁ గల్గు • నక్షరంబు, పొంత నుక్తాగమము పొందుఁ • బూని నిల్చు.

తే. పదములను మున్ను గల వ్రాల • తుదిని దాము, నతికికొని నిల్చు లిపులు ప్ర • త్యయములయ్యె
మున్ను పదములఁ గలవర్ణ • ములు నిలువక, తొలఁగి చనుట లోపం బని • పలుకఁబడును.

## ద్రుతప్రకృతికసంజ్ఞ

మూ. సూ. తిఙ్మధ్యశేషషష్ఠీసుప్కర్మప్రవచనీయజ[4]విభక్తిః,
కిఞ్చిత్ప్రశంసనాద్భుతసన్తాపయదాతదా[5]కిమేవాంశ్చ.
క్త్వాకిలతూష్ణీమాద్యా నభిదధతి కలా ద్రుతో న యేషాం స్యాత్,
అన్యే ద్రుతప్రకృతయో యే స్యుర్హ్యనుజీవితద్రుతా నిత్యమ్.

క. వలసినచోఁ దుది ద్రుతములు, తలచూపెడుశబ్దములు ద్రు • తప్రకృతు లనన్
వెలయు నవి వాడమ కుండెడు, తెలుఁగుపదంబులు కళా ప్ర • దేశము లయ్యెన్. 22

తే. ధాత ధాతను భూపతి • ధరణిపతిని
జనకు జనకుని గనియెఁ గ • న్గొనియె ననుచుఁ
గడ ద్రుతము లిట్లు లోపము • గ్రాంచి వలయు
పట్టఁ గనుపట్టునవి ద్రుత • ప్రకృతు లీశ. 23

క. వికృతిపదంబులలోపల, నకారములు వలయుచోఁ గొ • నలఁ బొడము ద్రుత
ప్రకృతు లసంఖ్యంబులు గొం, కక యవి యెన్నంగ నలవి • గా దహిపతికిన్. 24

1. పురుఁడు (ఓ). 2. వెనక (ప. ఓ). 3. నెళవుల (పూ. ము). 4. విభక్తిః (సూ). 5. కిమేవాశ్చ (పూ. ము.)

తే. గూను సొమ్మేను మెడ నాను♦మీను పేను, [1]మ్రానువరిచేను పులిబోను♦మఱియు నిట్లు
భువి నకారంబుతోఁగూడఁ ♦ బుట్టుశబ్దములు ద్రుతప్రకృతులు గావు ♦ మునిశరణ్య.

తే. అన్ను బంగరుపొన్ను చా♦య యగు తెన్ను
చెన్ను పులిజున్ను దొరపన్ను ♦ జొన్న యెన్ను
మొదలుగా జడ్డలు నకార♦ములకుఁ దుదిని
దనరు పదములు గావు ద్రు♦తప్రకృతులు. 26

ఆ. [2]తన్ను నిన్ను నన్ను ♦ విన్ను మున్నామిన్ను, చన్ను కన్ను వెన్ను♦శబ్దములకు
జడ్డ లుండుఁ బోవుఁ♦జర్చింప నివి ద్రుత,ప్రకృతు లెపుడుఁ గావు ♦ భక్తసులభ. 27

## కళాప్రదేశములు

సీ. ఇనుఁడు గోత్రము గోవు♦జను లని యిబ్భంగిఁ బలికెడు ప్రథమావి♦భక్తులందు
రాముఁగూర్చి రణోగ్ర♦భీముఁగూర్చి యటంచుఁ దెలిపెడు కర్మ ద్వి♦తీయలందుఁ
కృష్ణునకై సురో♦చిష్ణునకై యని తోడఁబడ నుడుగు చ♦తుర్థులందు
బలునిబట్టి మురారిఁ ♦ బట్టుండి యని పలికెడు పంచమీవిభ♦క్తితుదలందుఁ

తే. పద్మబాంధవసుతయొక్క♦భద్రయొక్క
జాంబవతియొక్క యను శేష♦షష్ఠులందు
క్షితి సముచ్చయములఁ దక్క ♦ ద్రుతము గానఁ
బడదు [3]గావున నవి పల్కఁ♦బడుఁ గళ లని. 28

సీ. సుగ్రీవుఁడే వాయు♦సూనుఁడే యనుచు నేవార్థము దెలుపు వ్యా♦హారములును
నటియించెనఁట పాడె♦నఁట కూడెనఁట యను లలితకిలార్థాను♦లాపములును
వింటిమి కంటిమి ♦ వేఁడి రటంచు నీమాడ్కిని బలుకుతి♦జ్మధ్యములును
గాంచి విచారించి ♦ కరుణించి యనియెడు క్త్వాప్రత్యయాంతార్థ♦వాచకములు

తే. నుఱక మిన్నక సేయక ♦ యొఱఁగక యను, నట్టి తూష్ణీంపదార్థవా♦క్యములు నాది
శబ్ద ముండుటచేతను ♦ [4]జనిరొ సుమ్ము, కనిరోఁ గద యనునవియును ♦ గళలు కృష్ణ.

తే. నవ్వుచున్నాఁడు వచ్చుచు♦న్నాఁడు వాఁడు
మనఁ గలఁడటన్న తిజ్మధ్య♦మంబు లెందుఁ
గాకయును బ్రథమలలోనఁ ♦ గలసి సరసి
జాతనేత్ర కళాప్రదే♦శంబు లగును. 30

సీ. కటకట యక్కట ♦ కట్ట యయ్యో యని పరితాపమునఁ బల్కు ♦ భాషణములు
ఔర బళీ [5]మజ్జ ♦ యయ్యారె యంచుఁ బ్రశంసించునంధ్రభా♦షాపదములు

---

1. మానుపఱిచెను (పూ. ము). 2. తన్ను నిన్ను నన్ను - అను నీమూఁడు కళ లని యిందుఁ జెప్పఁబడెను. ఇది పొరపాటు. (రా). 3. గావునఁ బల్కఁగా (ప); గావున నివి (ఓ). 4. జనిరోఁ జుమ్ము (రా). 5. ఝాఁశె (ప).

నిది క్రొత్త యిది వింత ♦ యిది లెస్స యద్దిరా యోహో యనుమహోద్భు ♦ తోదితములు
నించుక గోరంత ♦ యిసుమంత చీమంత యావంత యనుకించి ♦ దర్థములను

తే. హరిహయాత్మజసఖ యిప్పు ♦ డప్పు డెప్పు, డనియెడుయదాతదాద్య[1]శ ♦ బ్దాన్వయములు
నెద్ది యెయ్యది [2]యేటది ♦ యేమి యనుకి, మర్థములను గళాసంజ్ఞ ♦ లంగజపిత. 31

తే. ఇంతియే కావు తెలుఁగున ♦ నిట్టి కళలు, మధునిషూదన వెదకిన ♦ మఱియుఁ గలవు
వినికొనల ద్రుతంబులు ♦ గానఁబడవు, తాపసమనోనివేశ కా ♦ మేపలీశ. 32

## సంధివివేకము

క. [3]వెనుకటిశబ్దమునకుఁ దుదిఁ, దపరెడువర్ణమును బైప ♦ దమునకు మొదలం
గనుపట్టునక్షరంబును, సనకస్తుత కూర్చి పలుక ♦ సంధి యనఁ జనున్. 33

క. విను ప్రాణసంధులును వ్యం, జనసంధులు ననఁగ శబ్ద ♦ సంధులు కృతులన్
దనరారు నిరుతెఱంగులఁ, గొనకొని తద్విధము లెఱిఁగి ♦ కూర్పఁదగు హరీ. 34

ఆ. మీఁదిశబ్దములకు ♦ మాదివర్ణంబులు, స్వరము లైనఁ బ్రాణ ♦ సంధు లయ్యె
హల్లు లయ్యెనేని ♦ వ్యంజనాక్షరసంధు, లయ్యె వాని తెఱఁగు ♦ లరయవలయు. 35

తే. [4]ప్రాల్లు లై హల్లు లెల్లను ♦ బుట్టి పిదపఁ, బ్రాణములఁ గూడుకొని బహు ♦ భంగు లైన
కళల హల్లులఁ గల తల ♦ కట్టుగుడులు, మొదలుగా నిన్నియును స్వరం ♦ బులు నిజంబు.

ఆ. ఎచట సంధి గలుగు ♦ నచటఁ బూర్వపదాంత, హల్లుతోడఁ గూడి ♦ నట్టి స్వరము
లోపముగ నొనర్చి ♦ యా ప్రాల్లుతో మీఁది, యక్షరంబు గూర్ప ♦ నయ్యె సంధి. 37

## స్వరసంధిలక్షణము

క. అరయ 'శకంధ్వాదిషు టేః, పరరూపం వాచ్య' మనుచుఁ ♦ బ్రక్రియలోనన్
పరరుచివాక్యము కలిమిని, బరరూపమె వికృతిఁ గాన ♦ బడు స్వరసంధిన్. 38

తే. కృష్ణుఁ డవ్యయుఁ డాద్యుఁ డ ♦ ఖేంద్రవరదుఁ
డీశ్వరుం డుత్తముం డూర్జి ♦ తేష్టఫలదుఁ
డేకపదుఁ డైంద్రసఖుఁ డో ♦ ఘధీశుఁ డౌర్వ
శేయనుతుఁ డన సంధులు ♦ చెలఁగు నిట్లు. 39

## ఆంధ్రపదాదియకారమునకు

**మూ. సూ. సర్వత్రాజ్వ త్కార్యం జ్ఞేయం యస్య ద్రుతప్రకృతికేభ్యః.**

---

1. శబ్దార్థములను (మూ). 2. యెదియేది (పా). 3. వెనకటి (ప. ఓ.)
4. ప్రాల్ల (పా).

ఉ. ఆరయ వైకృతోక్తులఁ బ•వాదులయందు యకార ముండ దా
తీరునఁ బల్కువ్రాఁత గణు•తింపఁగ నచ్చగు దానిడాపలన్
నీరజనాభ నాంతములు • నిల్చిన నచ్చటఁ బ్రాణసంధి చె
న్నారు నితండు చైద్యవసు•ధాధిపుసేపడఁగించె నేఁ డనన్. 40

వాక్యము. నాంతము లనంగా ద్రుతప్రకృతులకు పేరు. 41

క. శృంగాంత్యవక్రయుగముల, సాంగత్యము నాకు నాంధ్ర•సంస్కృతముల నా
దిం గలుగ దట్టివ్రాఁత ధ,రం గలయు ద్రుతాంతములను • బ్రాణములట్లన్. 42

క. ముంగాముఱువులు నాలుగు, నుంగరములు మూఁడు నేఁడు • నొడ్డాణంబుల్
పొంగుచు నొసంగి హరి యొక, యంగనను రమించె నన ను•దాహరణంబుల్. 43

## ద్రుతప్రకృతిస్వరసంధిలక్షణము

మూ. సూ. లుక్సంశ్లేషౌ నాచి ద్రుతస్య సర్వత్ర లుక్సమాసేషు. 3

తే. అచ్చు పరమైన నాంతప•దాంతమునకు, సంయుతమును లోపంబును • జగతి లేవు
సంయుతం బయ్యె నేని దు•స్సంధి యగును, లోపమైన గ్రామ్యం బగు•లోకవినుత.

ఆ. చూచె నింతి ననెడు • చోటఁ జూచె న్నింతి
ననిన సంధిదోష • మయ్యెఁ గృతులఁ
బొడిచె నర్కుఁ డనెడు • నెడఁ [1]బొడిచెర్కుండు
ప్రాచి ననఁగ గ్రామ్య•భాష యయ్యె. 45

క. ధరణి ద్రుతప్రకృతులపై, స్వరపూర్వపదములు గదిసి • సంధి గలయుచో
నరకాసురదమన ద్రుతా, క్షరములు లోపములు గాక • కడపల [2]నిలచున్. 46

క. అవిభక్తికతత్సమములు, భువి నటువలె నుండు నాంధ్ర•ములు నచ్చులపైఁ
గవిసినను బ్రకృతిభావము, లవు శృంగాంతములు దక్క • నహిపతిశయనా. 47

ఆ. హరి యొసంగు మోక్ష • మా చక్రి యంగన
యందు భక్తి నిలుప • నబ్బు సిరులు
నిక్క మనుచు దీని • ముక్కంటి యెఱుఁగును
నలువ యెఱుఁగు గట్టు•తులువ యెఱుఁగు. 48

తే. కృత్స్నుత యవిభక్తిక•తత్సమాంధ్ర, శబ్దముల రెంటికొమ్ముల • స్వరము లదుకు
శీతరుక్కద్రిరా జింద్ర•జిత్తనంగఁ, బచ్చవిలుదాలు పెక్కుడు•బంట నంగ. 49

## వ్యంజనసంధి

క. పొల్లు లగు వ్రాల కవతలి, హల్లులు ద్విత్వంబు లగుచు • నసురాంతక సం
ధిల్లును వ్యంజనసంధులు, [3]తెల్లముగాఁ దద్విధంబు • తెలియఁగ వలయున్. 50

1. బొడిచర్కుండు (రా). 2. నిలుచున్ (సూ). 3. తెల్లమిగా (రి).

తే. ప్రాణపరుషాది సంజ్ఞలు । పలికి వాని, యం దొకక్కరమునకు లక్ష్యములు పలికి
దాని తెఱఁగున నా సంజ్ఞ । దనరునట్టి, ప్రాల కెల్లను బట్టింపవలయు నెందు. 51

అకారాదిసంధులు

మూ. సూ. సంధి ర్నాచోఽచ్యనుతః. 4

తే. పొల్ల యగు పూర్వశబ్దాంతహల్లుమీఁదఁ, బరపదాద్యచ్చు నిలిచెడుఁ । బ్రాణసంధి
కొమ్ముపైఁదక్క నితరస్వరమ్ముమీఁద, నచ్చు గదిసిన నచట లే । దాంధ్రమునకు.

సీ. కడు లెస్స యగుపట్టుకమ్మిపుట్టం బన జాళువాయొఱపు[1]చ్చడ మనంగ
సిరియన్నఁ బురణించు । చిన్ని నెమ్మో మన వలదు సుమీ యింతవైర మనఁగ
జన్నెయావులపాలచవి చెప్ప రా దన రేయెండ విరహంబు । రేఁపు ననఁగ
మైయొప్పు చూపట్టెఁ । బై యంట వెదకినఁ గలదొ యించుక లేదొ । కా ననంగ
తే. ధనమొకో యింతులకుఁ జక్కఁదన మనంగ
నలినము నివాసమా నెలనాగ హరికి
దేవి యన నీపదింటిపైఁ । దెలుఁగులందు
స్వరము లెదిరినఁ బ్రకృతిభావంబె నిలుచు. 53

క. ఒ ప్పగు పేరెద నొప్పుల, కుప్ప నసారతము నుంచుకొని గోవిందుం
డెప్పుడు భోగించు ననం, దప్పక కొమ్ముపయిసంధి । దనరు రమేశా. 54

అదంతసంధి

మూ. సూ. వాతః. 5

తే. నెట్టన వికల్పమునఁ దలకట్టునకును, స్వరముపై నిల్చునప్పుడు । సంధి కలుగు
హరికి బలదేవుతల్లి పెద్దమ్మ యనఁగ, నల్లపాండునిసతి మేనయత్త యనఁగ. 55

విభక్తిసంధి

మూ. సూ. అనాదిషు విభక్తి ష్వాతో వా. 6

తే. ప్రథమఁ దక్కంగ నితరవిభక్తులందు
దుదలఁ గొమ్ములు గలవిభక్తులకు షష్ఠిఁ
బలుకు కాగుడికిని వికల్పంబువలన
నిల ద్రుతప్రకృతిత్వంబు । గలుగుచుండు. 56

సీ. [2]నిన్ను నెఱుంగంగ । నే నెంతవాఁడను న న్నేలుకొనుము ఘృణాసముద్ర
సారె నీకొఱకు నంజలి మోడ్చి మ్రొక్కెద నిమ్ము నాకొఱ కైహికమ్ము లెల్ల

---

1. ఇట్టిమాటలలో 'చ' కు బదులుగా 'త్స' కొన్నియెడల వ్రాతప్రతులలో కనఁబడుచున్నది. (గి). 2. నిన్నుదే నెఱుఁగంగ నేనెంతవాఁడను (భూ.ము) ఈపాఠము పొరపాటు (రా).

సీస నాశ్రితులు వాణీనాథముఖ్యులు గణుతింప నా[1]కేడుగడయు నీవె
నిలువఁ జేయుము నాకు నీయందు నతిభక్తి స్వజనులం దర్శిలినిజము నీకు
తే. ద్రౌపదికి నక్షయాంబరదాన మిచ్చి, సవ్యసాచి కాయోధనజయ మొసంగి
ప్రోచుపగిదిని మమ్మునెప్పుడును గావు, మయ్య శ్రీకృష్ణ యనఁగ లక్ష్యంబులయ్యె.
తే. రాముఁ డధికుండు తారక బ్రహ్మ మాశ్రితౌఘసురధేను వామేటియనుజు లహిత
భంజను లటంచుఁ బ్రథమావిభక్తులందుఁ, గొమ్ములకు సంధి వచ్చు నిత్యమ్ముగాఁగ.
తే. కూర్చి విడిచి ద్వితీయఁ బల్కునవి మూఁడు
నవతలివిభక్తిఁ దెలుపువాక్యములు నాల్గు
వలనఁ గంటె లోపల నసువచనములును
బదివిభక్తుల లో ద్రుతప్రకృతు లయ్యె. 59
సీ. తాటక నొకకోల ధరణిపైఁ గూల్చెను మొక్కలపునుబాహునుక్కడంచె
మానుల నానందమగ్నులఁ గావించె వారిచే నందె దీవనలు పెక్కు
జనకునిచేత నర్చనములు గాంచెను ఘనతతో నధ్వరాగారమునను
వరశక్తితోడ నీశ్వరువిల్లువిఱిచెను నరులకంటె నమర్త్యవరులు పొగడ
తే. వెస విదేహునివలన నుర్వీతనూజ
మిథిలలోపల నుద్వాహవిధిని బొందె
ద్యుమణికులుఁ డన నివి విభక్తులు పదియును
ధరణి ద్రుతప్రకృతికలు నిత్యముగ నగును. 60

భూతార్థక్రియాసంధి

మూ. సూ. నిత్య మనుత్తమపురుష క్రియా స్వితః. 7

తే. వసుధ నుత్తమపురుషైకవచనమునను
దక్క భూతక్రియాపదాంతములఁ గల్గు
నిత్తులకు మీఁద నచ్చులు హత్తునపుడు
నిత్యముగ సంధులు ఘటించు దైత్యదమన. 61
తే. పుడమి సూత్రోక్త ముత్తమపురుష మనుచుఁ
దత్పురుష మెల్లఁ గొనరాదు తద్బహూక్తి
మున్ను లిజ్మధ్యముల[2]తోడ నెన్నకతన
నిత్యముగఁ బ్రాణసంధి దానికి ఘటించు. 62
తే. వనిని దీవించిరఁట మునీశ్వరులు నిన్ను, రవిజు నేలితివఁట నీవు రామచంద్ర
మీరు గట్టితిరఁట కపులార జలధి, వింటి మీ వార్త మేమన తెలయు నిట్లు. 63

1. కేడుగడయ (ప). 2. లోన (ప).

క. విరచించెను శ్రీనాథుఁడు, ధరణిని శృంగారనైషధంబునఁ "గూర్చుం
డిరి యొండొరు"నని కానక, పరపురుషక్రియలఁ బ్రకృతిభావముఁ గలదే. 64

వ. నైషధంబులో గుడిమీఁద విసంధిగా శ్రీనాథుఁడు చెప్పికొన్నపద్యము. 65

మ. బలభిద్వహ్నిపరేతరాజవరుణు • ల్పర్యుత్సుకత్వంబు సం
ధిలఁ గూర్చుండిరి యొండొరుం గదిసి య•ర్థిం దత్ప్రదేశంబున
న్నలనాళీకమృణాళనాళలతికా•నవ్యప్రణాళీమిళ
ల్లలనాలాపకథాసుధానుభవలీ•లాలోలచేతస్కులై. 66

క. గరుడధ్వజ ప్రథమోత్తమ,పురుషైకవచనము లెల్ల • భూతార్థమునన్
ధర నగును ద్రుతప్రకృతులు, ధరియించె నుపేంద్రుఁ డేను • బ్రతికితి ననఁగన్.

## వర్తమానక్రియాసంధి

తే. వర్తమానత్రిపూరుష•వచనములకు, జరుగు స్వరసంధు లని శబ్ద•శాసనుండు
చెప్పఁడయ్యెఁ గొమ్ముల సంధి•సిద్ధమగుటఁ, బ్రథమసూత్రంబునన కాన•బడుటఁ జేసి.

మ. చనుచున్నాఁ డదె సీరి గోపకులు[1] ప•ద్యం జీరుచున్నా రహో
యనుచున్నా నఘవైరి నీ వరుగు కా•ర్యం బే మన స్మీరును
న్నినుచున్నా రెఱుఁగింపుఁ డెద్దియును దా • నే చెప్పుచున్నా నిఁకన్ 69
జనులారా చోరనీయ మా వ్రజము ని•చ్చ ల్నిచ్చుచున్నా మనన్.

## భావిక్రియాసంధి

తే. భవిషదములలో ద్రుత•ప్రకృతి గాన, నొర్వఁ గల నను నుత్తమై•కోక్తి ధరకుఁ
దక్కినవి శృంగములు తుది•దాల్చుకతన,స్వరపరము లైన నిత్యమై•సంధిఁ జెందు.

తే. కావఁగలఁ డచ్యుతుఁడు మెచ్చఁ • గల రమరులు
తొడరఁగల వర్కనందను•తోడ నీవు
మెలఁగఁగల రా నరుపేఱుందు • మీరు భూమి 71
కాంతులార మేమును జూడఁ • గల మనంగ.

## పరిమాణసంధి 8

మూ. సూ. పరిమితౌ సమస్తానామ్.

సీ. [2]కనిపెడు ప్రేలెడు • [3]కమికెడు జేనెడు మూరెడు చేతెడు • బారె డనఁగఁ
జేటెడు పుడిసెడు • చేరెడు దోసెడు గంపెడు పుటికెడు • గాదె డనఁగఁ

---

1. పంచం. 2. 'ఏఁడు' ప్రత్యయము సార్థబిందుకము. పుడిసెండుజలంబిడి పెంపసేర్చునే. భాస్కరశతకము. 'పుడిసెఁడు-పుడిసెండు' అని సబిందుకరూపద్వయము కలదు. పూర్వముద్రణములలో నెల్లఁ బైనున్నట్లు నిర్బిందుకముగా నుంచియున్నారు. కారణము దురూహము. (శా) 3. కైకేఁడు.

కెంపెడు దుత్తెడు ♦ చెరపెడు బిందెడు పఱఁటెడు కుండెడు ♦ బానె డనఁగఁ
బారెడు చిట్టెడు ♦ పడెడు సోలెడు తవ్వె డా మానకుంచెడు ♦ తూమె డనఁగఁ
తే. దక్కెడన వీసె డన నొక్కచిక్కె డనఁగ
వాటె డన మోపె డనఁ బెద్దవామె డనఁగ
బరిమితార్థంబు తుది నిల్చునట్లు పట్లు
ప్రాణముల నెల్లఁ దళమి వక్రములు బలయు. 72

తద్ధర్మార్థక్రియాసంధి

మూ. సూ. న స్యా త్తద్ధర్మోతః. 9

తే. ఉర్విఁ దద్ధర్మమునఁ బ్రథమోత్తమాఖ్య, పురుషముల నేకవచనముల్ ♦ పోవవిడిచి
కడమ పదములు తిజ్మధ్యమములు గాఁగ, గొమ్ములను బ్రాణసంధులఁ గూర్చుటొప్పు.
క. కాంతు రజప్రభృతులు నిను, సంతతమును బ్రోతు వీవు సనకాదుల మ
ర్దింతు రభవుండు నీవును, బంతంబుల ఖలుల ననుచు ♦ భావింతు మెదన్. 47
క. వదలక తద్ధర్మములను, బొదలెడు ప్రథమోత్తమాఖ్యపురుషైకవచః
పదములు ద్రుతప్రకృతు లగుఁ, బదరును నతఁ డోర్తు నేను ♦ బలుమఱు ననఁగన్.

వర్తమానార్థద్రుతప్రకృతులు

మూ. సూ. చో ర్వా స్యా ద్వర్తమానవిహితస్య. 10

తే. పరపదార్థ మపేక్షింపఁబడినయట్టి, వర్తమానార్థమున షష్ఠవర్ణశృంగ
కంబుతుదిఁ గల్గుపదము వికల్పమున ద్రుతప్రకృతి యగుఁ గైటభదర్పదళన. 76
క. కేరుచు నొయ్యన దగ్గఱఁ, జేరుచు నురుముష్టిహతికిఁ ♦ జిక్కక వేగం
దారు చమత్కృతిఁ గ్రమ్మఱ, దూరు చధోక్షజుఁడు మల్లుఁ ♦ ద్రుంచె ననంగన్.

తదాదులు

మూ. సూ. తద్వత్తదాదిజస్య. 11

క. తుదిగుడుల నడుకు నది యిది, మొద లగు పదముల వికల్పమున స్వరసంధు
ల్పొదలె యడవ్వతె చెప్పమా, యది యిది యని నన్నుఁ బలుకనన లక్ష్యంబుల్.

కిమాదులు

మూ. సూ. ప్రాయ స్తు స్యా త్కిమాదిక స్యైతః. 12

క. కమలాక్ష యేమి యను వాక్యము మొద లగు వానితుదలఁ ♦ గల గుడులను బ్రా
ణము లదుకు వికల్పంబున, హిమగిరి యే మనియె నేమి ♦ యిచ్చె ననఁ గనన్. 29

అపిశబ్దసంధి

మూ. సూ. అపిశబ్దాత్తో లుగ్వా స్యాత్. 13

క. ఏని యను మాటకడపలఁ, గానంబడు నిత్తుమీఁదఁ గదిసినచోటన్
బ్రాణములు సంధి గాంచును, బూని వికల్పాంబువలనఁ బుణ్యచరిత్రా. 80

తే. పలుకుచెలియే సుమాప్రాణభర్తయేని, వనజభవుఁడేని యహిపులస్వామియేని
నీమహత్త్వంబు వర్ణింపఁ జేర్చు నెట్లు, నా నుదాహరణంబులు దానవారి. 81

క్త్వాప్రత్యయాంతార్థసంధి

ఆ. పారిజాతనేత్ర క్త్వాప్రత్యయాంతార్థములు వచింతుఁ దెలుఁగుపలుకులకును
ద్వైస్వరంబు లుండుపట్టులఁ బ్రకృతిభావంబు గాని సంధి వాటపడదు. 82

ఆ. కాంచి యాలకించి యెంచి యాలోకించి
యొరసి యాడి యోడి యొరగి యెఱఁగి
యఁటి యెచ్చి యిచ్చి యని యాడుకొని యెత్తి
యెనసి యేఁగి యాగి యనఁగవచ్చు. 83

ఇకారాదేశవిభక్తులు

మూ. సూ. ఇచ్చ విభక్త్యన్తిమస్య. 14

క. లలి నాదేశము లగు నిత్తులు సమసనములను జేత తోడ వలన లో
కల వను నివి మొదలగు పలుకులతుదిఁ దలకట్టులకు వికుంఠతనూజా. 84

ఆ. కృష్ణువలనిబలిమి కేశవుతోడిసఖ్యంబు శకటదానవారిచేతి
ప్రోపు భాగవతులలోపలిగణనయు, ధవళవాహనునకుఁ దక్కఁ గలదె. 85

అల్యాదేశము

మూ. సూ. ఙే రలిచ. 15

ఆ. కడవిభక్తులైన నుడుగుల కలి యను, నాగమంబు వచ్చు నంత్యములను
సమసనమున శేషశాయియందలిభక్తి, వొడమునతఁడె లోకపూజ్యుఁ డనఁగ. 86

ఆదిలోపము

మూ. సూ. శబ్దా త్తచ్ఛబ్దా ఽతో లుక్. 16

తే. శబ్దముతుదను సది యను శబ్దమదుకు, నప్పు డది యనుపదమున కాది నుండు
నత్వము వికల్పమున లోపమగునుగాన, నిది ప్రకృతిభావమున నుండునిందిరేశ.

తే. పొసఁగు లోపప్రకృతిభావములను వరుస
బాఁపనది కోమటిది మంచికాఁపుది[1] యన
మహిని బాపనయదియుఁ గోమటియదియును
గాఁపయదియును ననఁగ భక్తజనవరద. 88

ఉదాదేశరేఫాగమములు

మూ. సూ. దారార్థేఽత ఉ దపి రః. 17

తే. కొనలఁ దలకట్లు గల సురోక్తులకు మీఁదఁ
గర్మధారయసమసనకల్పనమున
నాలను త్రిలింగదేశవాక్యంబు గూర్ప
మహి నుదాదేశరేఫాగమములు వచ్చు. 89

ఆ. బుద్ధిమంతురాలు పుణ్యాత్మురాలు దయాసముగ్రురాలు దాసురాలు
విమతశీలురాలు ఘనురాలు గంభీరు, రాలు విష్ణు పెద్దరాణి యనఁగ. 90

టుగాగమము

మూ. సూ. సామానాధికరణ్యేషూదన్తానాం టుగాగమోఽచి స్యాత్. 18

క. శమితాఘ కర్మధారయ, సమసనమునఁ దుదిని గొమ్ము సంధిల్లెడు శ
బ్దములు వికృతిఁ బొల్లటకారము వెట్టుక సంధిఁ జెందుఁ బ్రాణముతోడన్. 91

ఆ. అక్కజంపుటడవి నల కూర్పుటకుముక్కు, మెఱుఁగుటంపమొనను దలిగిపైఁ జెఁ
జిగురుటాకు గోటజిదిమినచాడ్పునఁ, గఱకుటసుర లులుక గ్రాహకులుఁడు. 92

విశేషణాంతద్రుతాగమము

మూ. సూ. ధాతుపదసమ్భవానాం విశేషణానా ముత స్తథానుమచి. 19[1]

తే. క్షితిని బైపదములకు విశేషణంబు, లగు క్రియాపదములతుది నమరు శృంగ
మునకు వచ్చు నాగమ మయిపొల్లు ద్రుతము, ప్రాణపరమైనఁ గర్మధారయమునందు.

క. [2]అని సేయునతఁడు కవ్వడి, కనుఁగొనియెడునతఁడు మాద్రికడపటికొడుకా
[3]మొన నుండునతఁడు వడిముడి, వెనుకనునతఁ డర్కసుతుఁడు విరథుఁ డనంగన్.

షష్ఠీసమాసద్రుతాగమము

మూ. సూ. షష్ఠ్యా ఉతోఽచి నుమ్వే చ. 20

తే. కొమ్ముమీఁద షష్ఠీసమాసమ్మునందు, నచ్చెదురఁ బొల్లద్రుత మగు నాగమంబు
గొడుకులు నేనుఁగునొడలొడవునొప్పు, రాజునానతి ధేనువునోజ యనఁగ.

ఆమ్రేడితసంధి

మూ. సూ. ఆద్య స్యామ్రేడితేఽ న్త్యలోప శ్చ. 21

---

1. తథానగచి (సూ). 2. అనుటయు (పూ. ము.) 3. మొనసందునతఁడు (పూ. ము.)

తే. ఒక్కమాటయె రెండుమా ♦ ర్లుచ్చరింప, దానిపై రార్యు లామ్రేడి♦తంబటండ్రు
పృథివిఁ దత్పదములలోనఁ♦బ్రథమపదము, తుదిని సంధి ఘటించు న♦చ్చెదిరినపుడు.

తే. అచ్చటచ్చట [1]నాడాడి ♦ వచ్చు నొక్కఁ
డొక్కఁ డయ్యారయారె యో♦హోహొ నందు
పట్టి యనఁగ నామ్రేడిత♦పదములందు
మొదలిపదములతుద సంధి ♦ గదియుఁ గృష్ణ. 97

అనుకారసంధులు

మూ. సూ. అహామాదీనాం ద్విత్వం లోపో నమ ఆదికే విసర్గస్య.

సీ. అనుకరించెడుచోట ♦ నవ్యయాదులలోనఁ గల బొట్టుగవను దీ♦ర్ఘంబులకును
వచ్చు లోపము శేశ ♦ వాయ తుథ్యం నమ యనఁగ రామోఽఘసం♦హర్త యనఁగఁ
బూర్ణంబులకు నోష్ఠ ♦ భూతానునాసికశృంగంబు జడ్డను ♦ జెంది నిలుచు
నంబుజాక్ష తన దా♦సోహ మ్మనంగను బొల్లులకును ద్విత్వ♦ములు ఘటించుఁ

ఆ. బండితో త్తములు కృ♦పాసముద్రో మురజి త్తటంచుఁ జదివి ♦ చెప్ప వినుచు
నసురవైరి విడిచి ♦ యన్యదైవతములఁ, గొలుచు మూఢమతులఁ♦గలరె యనఁగ. 98

వ. ఇవ్వి స్వరసంధు లనంబరఁగు నింక వ్యంజనసంధు లెట్టి వనిన. 99

అద్భుతశబ్దసంధి

మూ. సూ. బో రద్భుతశబ్దార్థే. 23

ఆ. అద్భుతార్థవాచ♦కాంధ్రశబ్దంబున, నడిమిప్రాతకొమ్ము ♦ చెడును నిలుచు
హరి ధరించెఁ గేల ♦ నబ్రంపుగిరి యనఁ బ్రావె నబ్బురంపు♦దవ మనంగ. 100

పుకారసంధులు

మూ. సూ. పో శ్చ తదావ్యర్థవాచకే షూతః. 24

తే. అప్పుడెప్పుడు కప్పురఁ♦బిప్పు డనుచుఁ, బలుకుచో పీనినడిమిప్రాఁ♦తలకుఁ గలుగు
కొమ్ములుండును బోవును♦గొమ్మ కప్ర, మప్డు గా కెప్డు మేనఁ బూ♦యఁగల దనఁగ

[2]టుకారసంధులు

మూ. సూ. వికృతిపదే లా టో రపి. 25

ఆ. అవని శృంగసహిత ♦ మగు తృతీయాంతస్థ,మునకు డాపలించి ♦ తెనుఁగులందుఁ
గల టకారశృంగ♦ములు పోవు నందు ని, ట్లనియె నిట్టు లనియె ♦ ననఁగఁ గృష్ణ.

---

1. నాడాడ (పా). 2. లుకార (మూ).

## రేఫసంధి

మూ. సూ. ఉపధారే శ్చా విత శ్చ లు గ్వా స్యాత్. 26

క. కడవర్ణమునకు దాపలి, కడరేఫముగుదుసు లుక్క♦గాంచును దనకుఁ
గుడిని [1]చకారము లుండెడు. నెడల వికల్పమునఁ బన్న♦గేశ్వరతల్పా. 103

క. పేర్చిరి పేరిచి రరిఁ బరి,మార్చిరి పరిమారిచిరి క్రమంబున ధనముల్
గూర్చిరి గూరిచి రప్పులు, దీర్చిరి తీరిచిరి నాఁగఁ ♦ దెల్లం బయ్యెన్. 104

తే. మొదల రేఫాక్షరంబు నా♦పిదప దాని
జడ్డయును గూర్చి యొకటిగాఁ ♦ జదువుకొనుచు
ముందు జడ్డయు వెస రేఫ♦మునకు బదులు
గిలుక విధజించియు లిఖింతు ♦ రిలఁ గుమతులు. 105

క. అఱఁటులఁ బఱఁటులఁ బఱేఁటెల, గఱేఁటెల మొఱేఁటెలను గల ఱ♦కారము లెల్లన్
[2]దఱి నెఱసున్నలు నగు న,య్యఱఁటులఁ బఱఁటులను ద్రుతము♦లగువలసినచోన్.

## నరలడశృంగసంధులు

మూ. సూ. పరమధ్యనరలడానా ముత శ్చ, పూర్వప్రయోగసిద్ధానాం
లోపో వా స్యాత్. 27

క. ధరఁ బదమధ్యనరలడా, క్షరములకొమ్ములు వికల్ప♦కంబున విద్యా
ధరసన్నుత లోపము లగుఁ, బురాతనకవిప్రయోగ♦ములఁ గొన్నింటన్. 107

ఆ. కాన్పు తూర్పు తెల్పు♦గాడ్పు కానుపు తూరు, పచ్చ తెలుపు గాడు♦పనుచు నిట్లు
కొమ్ము లడఁగు నుండుఁ ♦ గొన్నింటఁ దొల్లింటి, వారు కావ్యములను♦వాడుకతన.

క. [3]పద మూనుదుఁ బదరుదుఁ బొ,దలుదుఁ బొడుదు ననుచు నిట్లు ♦ లోకంబున నొ
ప్పిదము లగు కొన్ని పదములఁ, గదలవు నడికొమ్ము లాది♦కవు లొడఁబడమిన్. 109

ఆ. వినఁడు చొరఁడు తలఁడు ♦ విడఁ డను పలుకులు
చిఱుఁతబొట్లమీఁదఁ ♦ జెందియునికి
సరసిజాతనేత్ర ♦ నరలడాక్షరముల
కొమ్ము లడఁచి సంధిఁ గూర్పరాదు. 110

## త్రివిక్రమమతసంధులు

మూ. సూ. తేషా మిత శ్చ తద్వ త్రివిక్రమమతేన. 28

---

1. చికారము (పూ. ము). 2. ధర (సూ). 3. ముద మూనుదు (ప).

ఆ. నడిమినరలడలకు గుదు లేఁగు చుండుచు, ధరఁ ద్రివిక్రముని మతమునఁ గొన్ని
పూన్కి గూర్మి కల్కి బుడ్పి పూనికి గూరి, మనరు కలికి బుడిపి యనుచు నిట్లు.

నరలడాకారలోపవర్జము

చ. కోలఁదిగ మున్ను చెప్పెఁ [1]జలికొండనృసింహుఁడు వెల్గ యంచు నీ
వల నగపాలరుద్రపను వాఁడును మొల్క లటంచుఁ గూరిచెం
దెలియక కొంద ఱిట్లు వికృతిం బదమధ్యమునన్ లకారరే
ఫలఁ దలపై నకారమును బాపుదు రార్యులు నవ్వునట్లుగన్. 112

వ. ఇందునకు వినుకొండలోను గుంటిపల్లిభాస్కరయగారిసముఖమందుఁ గందుకూరి
రుద్రయగారు చెప్పినపద్యము. 113

చ. వెలగకు వెల్గ యంచు సరవిం [2]జలికొండనృసింహుఁ డాడఁగా
మొలకకు మొల్క యంచుఁ గవిముఖ్యుఁడు రుద్రప పల్క దోసమే
భళిభళి మంచిమాటయె ప్రబంధము నా జలరాశి యందులో
పల నెరసు ల్గ్రహింతురె యపారముతో మణు లెల్ల నుండఁగన్. 114

కవిభల్లటమతసంధులు

మూ.సూ. కవిభల్లటైః క్రియాణాం నామ్నాం చోల్లోప ఇష్యతే హ్యేషు
ప్రథమైకవచనమాత్రే వికృతౌ నాన్తాదయో౽పి కథ్యన్తే. 29

తే. ధాతుపదములకడపటఁ దనరురేఫ, శృంగములకు లోపంబులు చెల్లుచుండు
హల్లు పైకొన్నచోఁ గవిభల్లటార్య, మతమున వికల్పనంబునఁ బరగగమన. 115

తే. సర్వగతుఁ డని హరి నెన్నుదు ర్విబుధులు
పరమపురుషుని గాఁ దలంతురు తపసులు
[3]శ్రుతిమయుం డని చెప్పుదు ర్భూమిసురులు
బ్రహ్మ మనుచు నెఱుంగ లే ర్దనుజవరులు. 116

సీ. భల్లటవిరచితఫక్కిలో సూత్రంబువలనను బైహల్లు నిలుచునపుడు
ప్రథమైకవచనము ల్వలికెడుచోటను సమసనములు గూర్చు సమయమునను
దెనుఁగునామంబుల కొనల నుండెడునరలడకొమ్ములు వికల్పంబువలనఁ
గాంచును లోపము ల్గన్మూనెఁ గనుమూసె గోర్నాటెఁ జెక్కిట గోరు నాటె

తే. మరుఁడు వి ల్పూనె విలు పూనె మధుఁడు జాజి
ననల వీడ్కొనియెను వీడుకొనియె ననఁగ
సాయపాన్వయవేంకటత్మాపదత్త
కామెపల్యగ్రహారనగర్యధీశ. 117

---

1. చరికొండ (పూ. ము.) 2. చరికొండ (పూ. ము.) చలికొండ (సూ.)
3. శ్రుతిమయుండని చెప్పుదు రూర్ధ్వసురులు నతని (పూ.ము. అని గి.)

తే. కాంతచన్గవ చనుగవ ♦ కార్శెఋపులు
కాఋమెఋపులు వాల్గంటి♦కలికి వాలు
[1]గంటి చెడ్పాటు చెడుపాటు ♦ గాంచె ననుచుఁ
దెలుఁగుసమసనముల నిట్లు ♦ పలుక పచ్చు. 118

తే. చట్టుఋాతికిఁ జట్రాయి♦గట్టుఋేని, పట్టి యనుచోట గట్రేని♦పట్టి యనుచు
సమసనములటకారశృం♦గములు నడఁగు, నాదిశబ్దంబు సూత్రంబు♦నందుఁ గలిమి.

ఔపవిభక్తికములు

మూ. సూ. ఔపవిభక్తికసంజ్ఞా వర్ణా ష్టింట్యాదయో భవన్తీహ,
రల్వాదే ర్నామ్నాం స్యు స్తే హి విభక్తౌ సమాసే చ.

సీ. అవిభక్తికము లగు♦నాంధ్రనామములందుఁ బ్రథమావిభక్త్యేక♦భాషణముల
కొన నుండు రల్వాదు♦లను బాఱఁదోలి విభక్తులందును సమా♦సోక్తులందు
నవని నాదేశంబు ♦ లగుచుఁ డింట్యాద్యక్షరంబులు నిలుచు ప♦దంబు లెల్ల
నౌపవిభక్తికా♦హ్వయములై కృతులను బహువిభక్తులను జా♦పట్టుచుండు
తే. నిపుడు చెప్పనరల్వాది♦లిపులు కొన్ని, యెందు నాదేశములు లే క♦యెప్పటట్లు
సమసనవిభక్తులను రెంట♦నమరెనేని, యవియు నౌపవిభక్తికా♦హ్వయము లయ్యె.

సీ. రలవర్ణములశృంగ♦ములకును గుడులకు డాలకొమ్ములకును ♦ టీలు వచ్చు
నీటికి [2]దాఁకపం♦దిటికిఁ దోఁడేటి కంబటికిఁ గూటికి గుడి♦పాటి కనఁగ
జడ్డలు గలనలా♦క్షరశృంగములకును గొన్ని మాటలకు లా♦గుడుసులకును
గట్టిబొట్టులకుడి♦కడ డుకారములకుఁ బూర్ణయుక్తంబులై ♦ పొందుఁ డీలు
తే. చంటి కింటికి గొంగ గు♦ద్దంటి కఱఁటి
పంటికిఁ దుపాకిగుంటికి ♦ రెంటి కనఁగ
*యిఱ్ఱులకుఁ దిట్టు లగునూతి ♦ కేటిమిత్తి
కనఁగ షష్ఠిని గొన్నింటి ♦ కమరు నిట్లు. 121

1. గఁటి చేడ్పాటు చేడుపాటు ♦ గాంచెననుచు (శ్రీ.ము.); రెండును ఛందోభంగము లని తెలియఁజేయు చిహ్నము కలదు. (గి). 2. డాక (ప. ఓ).

*నీటులకు (పూ. ము); 'నూయి' శబ్దము యొక్క 'యి' కారమునకు 'తి' రాగా 'నూతికి' అగును. 'మిఱ్ఱు' శబ్దముయొక్క 'ఱ్ఱు' కారమునకు 'త్తి' రాగా 'ఏటిమిత్తి' అగుచు. కాబట్టి 'యిఱ్ఱులకు' అని యుండవలయును గాని 'నీటులకు' అనుట తప్పు. (గి.)

సీ. పాలేటికాలువ కందిటిగుంజ తాఁటేటినో రంబటిపిండికుండ
కాటిపాఁపడు [1]జుంటిగడ్డ యింటిమగండు గొడ్డంటినరుకుడుగుంటికోవి
ముంజేతికంకణంబులు చేఁతిసొరకాయ [2]కొత్తిపీరుఁడు పెద్ద[3]గొత్తి చెక్క
నాఁపచొన్నలు కటి వేఁపపూవులదండ లలపాఁపమేతరి యంప[4]ములుకు
తే. [5]ఇనుపపెనమునఁ బోసిన మినుపదోసె
లనుపపప్పును జొక్కంపు టెనుపనేయి
యనుచు నిట్లు సమాసంబులందుఁ గొన్ని
పలుకులను నిల్చు నౌపవిభక్తికములు. 122

## అనౌపవిభక్తికములు

సీ. దూరు [6]పేరుబిడారు తోలకరి పుల్లరి చాలుపాలు రవాలు జగిలి మొగలి
యీడు జోడును గీడు వెన్ను పన్నును [7]చెన్ను కల్లు జల్లును పొల్లు గాలి జాలి
చెండు దిండును దండు చేదోయి ప్రాయి వేయి పాదు [8]వేదూదేదు గేదెముట్టు
గీము తోల్లిటిబాము మోము పున్నమనోము కొమ్మిమ్ము తలదిమ్ము బొమ్ము సొమ్ము
తే. మనుము మొదలగు వికృతినామంబు లొక్క
కొన్ని తునల దుల్వాదులఁ గూడుకొనియు
లలి విభక్తులను సమాసములను రెంట
భువి ననౌపవిభక్తికంబు లగుచుండు. 123

## ముపవిభక్తిలోపము

[9]మూ. సూ. ప్రథమావైభక్తికయోర్లుక్ పూర్ణో వాపతి క్రియార్థే తు.

తే. పడిరు నను క్రియ తుది నిల్పఁ బడియెడు నెడఁ
బ్రథమ యగు మూఁడు సమసనపదమునందుఁ
బెలుచ నాదేశ మగుఁ బూర్ణ బిందు వదియు
లోపమును జెందును వికల్పరూపములను. 124

క. పడఁతి ప్రియంపడియె భయం, పడియె సుఖంపడియె సంభ్రమంపడియెఁ బదం
పడియెఁ బ్రియపడియెఁ గడుభయ, పడియె రమించి సుఖపడియె భ్రమపడియెనన్.

---

1. బోటికాల్వ (పూ. ము; ప.) 2. కొత్తె. (గి) 3. గొజ్జె (గి) సంయుక్తమున శకటరేఫము వ్రాయరాదు. (రా) 4. ములుకు. (వె. ము.) 5. ఇనుప (పూ. ము.) 6. పేను (పూ. ము.) 7. వెన్ను (ఓ). 8. లేదూ (పూ. ము.) (గి) 9. ప్రథమా వైభక్తికయోర్బిందుశ్చ మహాన్వతి క్రియార్థేతు (పాఠాంతరము.)

తే. భ్రాంతిపడి చింతపడి యనుపట్లఁ బెద్ద
సున్న గలుగదు కొనను మూసున్న యగుట
బలము పడియె మదేభము పడియె ననినఁ
జెడి చనదు యా సమాసంబు నుడుగు గామి. 126

## పువర్ణాదేశము

మూ. సూ. తస్య సమాసే పుంపూ. 32

క. ఆదివిభక్తిము కారము, యాందపవర కర్మధారయసమాసమునన్
మేదినిపైఁ జెందుఁ బువ, ర్ణాదేశం బది సబిందు వగు వలసినచోన్. 127

తే. పడఁతి యబ్రపుటూరు లబ్రంపుటూరు, లతిపచోద్యపుటూరు చోద్యంపుటూరు
మగువసూక్ష్మపుఁగౌను సూక్ష్మంపుఁగౌను, కలికిచొక్కపుమేను చొక్కంపుమేను.

## అథర్వణమతసంధులు

మూ. సూ. ను మ్మోచ్చతో హాల్యథర్వణాచార్యమతాత్. 33

తే. సమసనమున నామాంతశృంగములకెల్ల, హల్లు గదియ స్వార్థంబునఁ బొల్లద్రుతము
వికృతి నాగమమై ద్రుతప్రకృతిపగిదిఁ,గాంచు సంధి నథర్వణకవిమతమున. 129

క. చనుగవకుఁ జనుంగవ యనఁ, దనరుఁ దలిరుజొంపమునకుఁ దలిరుంజొంపం
బన వచ్చు ననుఁగువెలఁదికి, ననుఁగున్వెలఁది యన శిష్ట మగు స్థిరపరతన్. 130

## పదమధ్యద్రుతలోపబింద్వాదేశములు

మూ. సూ. శత్రర్థేతూతశ్చో నో స్తస్యస్యాచ్చపూర్ణబిన్దురపి.

ఆ. తెలుఁగువర్తమానములషష్ఠవర్ణంబు, కొమ్ముపిఱుఁద ద్రుతముకొమ్మమరినఁ
గొమ్ము లోప మగు ద్రుతమ్ము పూర్ణం బగు, శమను గొన్నిటను వికల్పమునను.

క. చనుచును బూనుచు నెన్నుచు, నను కొన్నిటఁ దక్క నంచు ననుచును వించున్
వినుచును గనుఁగొంచును గన్గొనుచును దించుఁదిను చనఁగఁగూడును గృతులన్.

తే. ధాతుపదములనడుమను దటలపిఱుఁద
వెలయు ద్రుతములు స్వరసమన్వితము లగుచుఁ
దొలఁగి తమచోటఁ బూర్ణ బిందువులు [1]నిలుచుఁ
గొన్నిటను గనుఁగొందుఁ జేకొంటి ననఁగ. 133

1. నిలుపు. (పా).

